తే॥ నాల్గుపగల యాగదపల • నాడెముగను. పిలువఁ దలలెత్తినట్లున్న • యలల తోడి
నీరుగలిగి రాపణుసేస • తీరుదాల్చు. నగడిత నుతింప వాక్కున • కలవి యగునె.

తే॥ కరుల మదము హరుల నోటి • నురుగు వేల్పు. టెలుల రుంరుపంకంబు • పొలసుదిండ్ల
సకుల కస్తురి తేనెయుఁ • జందనంబు, గంధవాడిగల తావులు • కదల వీచు.

తే॥ చక్ర బక హంస టిట్టిభ • సారసములు, నీరుకోళ్ళు నుల్లంకులు • నారణములు
కలియఁబలికెడి పెలుచని • కలకలంబు. పీనులకు నత మచ్చట • వినఁగవచ్చు.

తే॥ కస్తురియు లత్తుకయుఁ దావి • గంధమగురు, చేడకతన మునింగెడి • వారణముల
తోడికలయిక తమిగొల్పు • తోయమొదవఁ. బిడుల కయ్యగడిత దూతి • విధముదోఁచు

ఉ॥ కమ్మని తావితేనియ సు • ఖమ్ముగ నిమ్ముగఁ గ్రమ్మ తమ్మి మొ
త్తమ్ములు నెమ్మిగమ్మల ము • దమ్ము తొలంగి మొగిడ్చె నెమ్మి సీ
తమ్మ ముఖమ్ము తీరున న • యమ్ము నమమ్ము గణించుచుండు చెం
దమ్ములు రామతీరుఁగని • తాము నమోముల మోడ్చుకుండునే?

తే॥ పటిక బండలు మలిచి సో • పానములుగఁ, దీర్పఁ దీరమ్ము నీరమ్ము • నేర్పరింప
రాకయుండెను; జడులు వి • వేకసభఁ, జేర నులభమ్ముగా వేఱు • సేయనగునె?

తే॥ మీఁదగ్రిందను చక్ర నీ • లాదికములు, వేఱు వేఱు కాంతుల నీన • క్షీరవారిఁ
దొట్టి పాథోనిధులు వాత • ధూతగతుల, నొక్కటై తోఁచుకైవడి • నుల్లసిల్లె.

తే॥ అంత హనుమంతుఁడెంతయు • సంతసమునఁ, దొలిసముద్రంబు దాఁటిన • తోయముననె
ప్రహరి వెనుకఁబడంగ నా • పరిఖ దాఁటి, యరివికాఁపగు నంతర్గృ • హమ్ము చేరె.

## నిద్రితులగు రక్కసుల హనుమ కాంచుట

క॥ యముఁడును దిగులుగఁ బాఱ భ, యముఁ గొల్పు సురారివరుల • కరయఁబడని తో
యమున నెన్నికకెను మారుతి, తమి ద్వాదశ యోజనములు • తనరిన వీథుల్.

క॥ అడఁగె మధుసేవనమ్ములు, మడఁగెఁ గడలి పగిది నదరు • మాటల రవముల్
ముడిఁగెను తూర్యత్రయరవ, ముడిగెను కార్మికుల చెయువు • లొనరె నిదురయున్

క॥ వారువములు గూరికెఁ ద్రా, కారమ్ములఁ గాచువారి • కటు ఘోషణముల్
మీఱెను కాంతలు కాంతులు, తోరపు బడలికను గూర్క • దొడఁగి రవశతన్.

క॥ పొలయలుక విడిన పొలఁతులఁ, గలిసి యువకు లనఁగి పెనఁగి • క్లమమగు నవలన్
గలయిక నలయిక వెలువడఁ, జెలువల వక్షముల వ్రాలి • చెందిరి నిదురన్.

ఉ॥ ఇంపగు హాలఁ ద్రావి కయి • పెక్కనవారును ధూప వాసనల్
నింపిన పూల సెజ్జలను • నీటుగ ముక్కడి కామ సౌఖ్యమున్
మంపు రసంబునాని తలి • మంబులఁ దృప్తిని పొందువారునై
పెంపులు దక్కి కూలఁబడి • పెచ్చగు నిద్దురఁ బూని రక్తుతీ.

మత్త॥ త్రాగి యాడెడి పెక్కు తీతుల • దైత్యవర్యుల యాటలున్
మూఁగి పాడెడి హెచ్చుతీరుల • ముద్దు గుల్కెడి పాటలున్
మ్రోఁగి కూడెడి వాద్యరావము • మ్రొగ్గి తగ్గెను దీటులన్
వీఁగి వేఁడెడి కోడెకాంద్రుర • వేడ్క గ్రుంగెను మాటలన్.

మృగమదంబు చందనమును • మేఁగియున్న, తొమ్మలందున మలయ మా • రుతముసోఁక
విరహిణుల ఖండితల కనుల్ • విడిచె జలము, మనసులెల్లఁ దాపంబుచే • మాఁడి మ్రందె

ఉత్సా. వైరి క్రుంగినపు డడంచు • వారిపోల్కి దివెల నా
ధారమైన నేయితగ్గు • తటిని తీర్చె వాయువుల్
వారిజాస్య లొదలికాంతి • వార్ధిఁ గొలువఁ దివురకే
కోరి దెసలఁ గొలువఁబోయి • కూల్చె విరుల గుంపులన్.

తే॥ నిత్యకర్మానుసారులై • నిర్మలులగు, జ్ఞానులును యోగులు సుషుప్తి • నూనినారు
మదగజములు నిద్రించె ను • న్మాదులెల్ల, గువికిరనఁ దక్కువారలఁ • గొసరనేల?

తే॥ ద్వంద్వములను నిర్జించిన • దండిమగఁడు, రాజవీథిని చని దైత్య • రాజ నగరి
చెంగలి యగడ్తతోఁ గోటఁ • జెంగలించి, దాఁటి లోనికిఁ జనియె ను • దాత్త దృష్టి.

## హనుమ రావణుని మేడఁ జేరుట

సీ॥ సమరశీలుండగు • నమరారి బంగారు, మేడ రాకాచంద్రు • జాడనొప్ప
రిక్కలగములనాఁ • గ్రిక్కిఱిసి వెలుంగు, నీరజాక్షులయిండ్లఁ • దారసించి
కందు నొందకయుండు • కలువరాబింబంబు, డీలుపడఁగఁజాలు • దాలునేలు
మోములతో యక్ష • రామా లలామలు, వసియించు నొకవాడ • వాంఛఁ జేరి

తే॥ కాంతు లీనెడు వజ్రాల • గడియలున్న, కడల నూలికంటెను గాలి • కంటె సూక్ష్మ
రూపముధరించి తూఱె మ • రుత్కుమారుఁ, డాసగొలుపు దుష్కర్మముల్ • గోసినతఁడు

క॥ కొందఱు దశకంధరుపై, దెంద మునిచి మోమువంచి • దిగులున నూర్పుల్
గ్రందుగఁ బుచ్చుచు తెప్పల, చిందార్పక యుండి రచటఁ • జిత్రములక్రియన్.

క॥ కొందఱు కలగనుకొఱకో, కందర్పున కడలియో యొ • కం డదియేమో
కందుమనరాదు కనులన్, చెందమ్ములు ముడ్చి యుఱక • చెలఁగిరి సెజ్జన్.

క॥ కొందఱు మరుశరముల పో, టొందిన కుచకుట్మలాంగు • లూఁగెడి శ్వాసం
బంది వగచి చేయునదే, మందురు చిత్తరువు వ్రాయ • నగునే యనుచున్.

క॥ కొందఱు కన్నీరొలుకుచు, మందరు రమ్మనవు పోవు • చొప్పరయవు నీ
కిందలి పని యేమని చెవి, విందుగఁ బలుకుదురు గోర • పిట్టల తోడన్.

క॥ కొందఱు మందానిలమునఁ, గంది వలుందైన చనులఁ • గని తమ పీడిం
పం దొడరు దనుజవరు భుజ, మందము నెదఁదలఁచి తలఁచి • యలయుదురు పగన్.

క॥ కొందఱు పెనుమానికములు, చిందిన నిప్పులపు దాలు • సెజ్జలఁ జొరఁ జా
లం దినములు నిర్విట్టత, పఱదురి కసఁబడిరి సంజ • పఱలఁ గళవలెన్.

క॥ కొందఱు తమ భుజములపలెఁ, బిండిలు మంచముల నిద్ర • సెందెడుచో భీ
తిందార్చు పీఁటపమసు, పెందే లటఁ జెపులఁ గుట్ట • బెగ్గిలు వారల్.

క॥ కొందఱు రసరాద్రి ధనువు, సందగ్ని శరంబు గూర్చు • నభపుని మల నె
త్తందనరు భుజము లలఁదిన, చందనము కుచంబులంటు • చాఱలవారల్.

క॥ కొందఱు జలధి యుబుక నా, నంద నటన సేయు భవు గు • ణంబులఁ గైనా
రిం దంతిగ బహురాగము, లొందఁ బొగడువాని వినుతి • యొనరుచు వారల్.

క॥ పలు తెఱఁగుల జక్కని లిటు, వెలయు వసతు లెల్లఁ గాంచి • వృషచర లస
త్తిలకము లంకానాథుని, కులపాలిక యున్న యిండ్లఁ • గోరికఁ జేరెన్.

చ॥ హరువుగఁ జీఁకటిన్ దఱిమి • యాటక వెల్గెడు కెంపు దీపముల్
మురువుగ నొప్పు నోవరుల • ముగ్ధలు సలెడ్పు నూఁదిగంబులన్
బరువుగ పీడఁగా నసుర • పాటలగంధులు కాంక్ష మున్న గాఁ
దరువుగ నేగఁ దల్పములఁ • దాఱి రెడంపలతోఁ బెనంగుచున్.

తే॥ అగ్నికీలపై మృగనాభి • యలఁదినట్టు, లలరు జడలలోఁ బొగవలె • సఖులు మసరఁ
గ్రొవ్విరుల పానుపులను వై • రులుగ నెంచి, పటిక బండల నారట • పడెడువారు.

తే॥ తనువు మిన్నగా ముత్యాల • దండ బుష, ములుగ జడలు మోదుగురంగు • మొగులుగాఁగ
నడుము మెఱుముగాఁ గన్నులు • జడిగ నొసలు, కొఱ్ఱివెన్నెలగ సంజవిన్ననఁ • గొఱలువారు.

తే॥ పొదవు మేడల వెన్నెల • ముంగిటలను, చేటికలఁ గూడి కన్నుల • నీటుగ్రాల
నెఱికురులు వ్రీల రిక్కల • నెఱిగఁ గొనుచు, హవణిలంగ నచ్చనగాయ • లాడువారు.

తే॥ దేవకాంతలు స్వర్ణదిం • దెచ్చినట్టి, జలము చల్లగాలేదని • యలిగి మేడ
లలఁత నెక్కి మొగుళ్లను • తొలిచి కాఱు, నంబువులయందు జలకంబు • లాడువారు.

ఉ॥ శేష ఫణామణుల్ బలిమి • జీవితనాథుఁడు తెచ్చియిచ్చె సం
తోషమెలర్ప మేమె తగు • తో యలులంచు వచించుకొంచు వి
ద్వేషుల గెల్చి కైకొనిన • దివ్య కిరీట లలంతికాది స
ద్భూషలఁ బన్నిదంబులిడి • వోఁడిమి జూదము లాడువారలున్.

చ॥ కుసుమ వనంబులం బసిఁడి • కూటములందున ముత్తెపందిరిన్
బసగను సిద్ధకన్యకలు • పాడ మృదంగము నాగకన్య లిం
పెసఁగ వహింప నప్పరస • లీద్యగతి న్నటియించుచుండ సం
తసమునఁ బూలపందిళులఁ • దార్కొని వేడుక గాంచువారలున్.

చ॥ ఇనుప సలాకవోలె నెద • కెక్కిన మోహ మలంగఁజేయఁ గ
న్గొన లల కొండవాఁగులను • కోఁదగి నిద్రనుపీడ నింద్ల ప్రాం
గణముల వీణియల్ గొనుచుఁ • గంఠముతోడ లయింపఁగా సుధా
కణములు చింద శ్రావ్యముగ • గానము సేయుచునుండువారలున్.

తే॥ ఇంచు నజచట్టవలుప చ • లించి తొలఁగఁ, గుండలమ్ములు గదలికఁ • గొరడు లీనఁ
గల్లు ద్రావంగ సుడివడు • కనులతోడ. మేనెఱుంగని నృత్యాల • మెలయువారు.

తే॥ విసమువంటి మద్యము రక్త • మెస గఁ ద్రావి, గుజరి పద్ధతిఁ గంఠంబు • గూర్చి వదరి
ఝర్ఝరీ వాద్యసరణి హ • స్తములు వట్టి, యందమే చెడ వెఱ్ఱిగా • నాడువారు.

తే॥ పెరుఁగు రంగైన కల్లు త • బ్బిబ్బుసేయ, బొబ్బలిడుచు నిట్టూర్పులు • పుచ్చి కురులు
విరియ నొడలెల్ల వడఁకించి • వేల్పునోకె, ననుచు నిచ్చవచ్చిన యట్టు • లఱచువారు.

తే॥ ఇట్టి పెక్కుతీరులనొప్పు • నిగురుఁబోండ్ల, యిండ్లు వీథులు గనిదాఁటి • యేగిసిద్ధ
సాధ్యవనిత లున్నట్టి వే • శ్మములఁ గడచి, చేరె విద్యాధరాంగనల్ • చెలఁగువాడ.

## హనుమంతుఁడు విద్యాధరాంగనలఁ గాంచుట

సీ॥ చొఱమీను రూపొంది • మెఱయు సీనకము ధ, రించిన సోఁకుల • ఱేఁడు రామి
కదిక మోహమున మ • ధ్యంబుకంటెను మనం, బులు చలింపఁగ జీవ • ములును వాడ
గాయనుల్ దగ జంత్ర • గాత్ర లయలుగల్పి, పాడిన గీతముల్ • పాములట్లు
చెవిఁజొరఁ గలఁగిన • చెలువలు కొందఱు; వాని కోపాగ్నికి • వడఁకి సురలు

తే॥ మునులు బుధులును దిక్కేది • మొనసి యోర్వఁ, బగవహించి చంద్రుఁడు దైత్య • వర్యునందు
ప్రేమగలవారనుచుఁ జాల • వేఁడి వెలుఁగు, లీన నెడఁదలఁ దపియించు • నిగురుఁబోండ్లు.

సీ॥ అల్పకాలము కల్ప • మట్లుగ మదిదోఁప, నుడుకుచు మరుబారి • కడలువారు
మును కౌఁగిలింగొన్న • చనుఁపైఁజందన, మంటిన యదిగని • యఱయువారు
చెక్కిళ్ళ వ్రాసిన • చిత్రముల్ ప్రాణంబు, లం జీల్చుచుండఁ గ • లంగువారు
కన్నులెఱ్ఱఁగఁ జేసి • కాంతు నింక నిటకు, రానిత్తుమే యని • రగులువారు

తే॥ నైన విద్యాధరాంగన • లలఁగుచున్న, వీథులంగని త్రిభువన • వీరు మేద
వ్రాలి చందురునోర్చిన • వదనమలరు, మయునికూఁతురు వసియించు • మాళిగఁగనె.

ఉ॥ కాంచి యెలర్చి కార్యమును • కాఁదగుఁబూరితియిందు చిత్రమొ
క్కించుక కద్దు మత్ప్రభున • కెక్కటి ప్రాణమయైన దేవి నిం
దుంచినవాఁడు రావణుఁడు • ప్రోన్నతజాతి మహాశ్మసంతతిన్
మించిన కౌస్తుభంబువలె • మేటి గృహంబిది యంచు నెంచుచున్

సీ॥ రంభాది జంభారి • బంభరవేణులు, మృదులపాదముల మె • ల్మెల్లనొత్త
మణిరాజ భూషలు • ఫణిరాజయోషలు, వింజామరములు ల్ల • విసరుచుండఁ

కెంజురనంబును • చేదనిపించి గం. ధర్వసుందరులు గీ • తములఁ బాడ
బంధముల్ సీఁగిన పాపసులయ్యు ద, క్కువ వారి కినుకదు • గుటియయ్యెనఁ
తే॥ బొందు చెగ్గొంగ్గో యని • పొదము శంక. మలయపవనుండు చేటులు • పిలువనేగి
యాజ్ఞగొని పచ్చుఁటోపు ను • య్యాలపగిది. చనవెయ్యెన సరుదు మీఱి • చనరు బుధులు.

హనుమంతుఁడు మందోదరింగని సీతయని భ్రమయుట

చ॥ వెలిఁగెడు రత్నదీపికల • వెల్గుచెదం దన మేని కాంతి ది
క్కులఁ జరియింప నిద్రిలుచ • కోరపయోధరఁగాంచి యా యన
ర్గళ చరుఁడు సీతయని • గట్టిగ శంక యొనర్చి పొంగు పే
రలర శరీర జీవ హృద • యంబుల మార్పఁగ నెంచె నీగతిన్.

చ॥ ఎముకపయిన్ రహించు నొడ • లెత్తు ఫలంబు వహింపనైతి నా
తమకటులుండనీ; స్వకుల • ధర్మము ప్రేమలతన్ విదిర్చి స
ద్విమల సతీత్వ మగ్గిపెగఁ • బ్రేల్చిన జానకి యీమె యన్నచో
నమరిన రామకీర్తి యమ • రారులు లంకయు నేనుఁ గూలమే ?

ఉ॥ ఆయమ సుందరాంగి మను • జాధిపకన్యక. చెప్పఁ బూనుచో
నీయలివేణి యక్షిణియొ? యాసురియో? యగు మీననేత్ర లా
నాయకు మేనియందము మ • నంబున నొక్కపరిన్ గణింపఁ బం
చాయుధునైన లెక్కిడుదు • రా? మతిమాలి యిటుల్తలంచితిన్

చ॥ అమల సతీత్వలక్షణము • లారయఁ గొండొక యున్న యీమె దే
హమె యొక యంగదం బొదువ • నందిక నున్నదియంచుఁ దెల్పెడిన్
సుమయుతవేణి వీడినది • చొప్పలు పల్కులఁ గల్వరించు ని
య్యమపతి వేగ తీఱు క్షయ • మందును లంకయు నిశ్చయంబుగన్

తే॥ అనుచు నూహించి నానంది • యంబు నింత. తోడశాంతిలుఁగాకని • తొలఁగిపోయి
మేరువను చిన్నదనదగు • మేడఁజొచ్చె. ననుర యెత్తనిగిరిఁబోలి • యలరు ఘనుఁడు.

చ॥ పుడమి చలించె శైలము • ద్రుంగె హుడుక్కనుపోలు కొను కై
వడి భుజముల్కనుల్బొమలు • పాటలగంధుల దక్షిణాంగముల్
వడఁకె దిశల్ బెదంకెఁ బొల • పంబుగ మించులులేక పల్వలన్
బిడుగులు రాలె నూరకయె • భేదిలె మంగళ పూర్ణకుంభముల్.

ఉ॥ మారుతి కన్నులారఁ గని • మానసమందు దలంచి యింతయుఁ
జేరికయయ్యె నీపురము • సేగికి; నేకులమందు పుట్టి యె
వ్వారయినన్ గడించిన య • ఘంబొ శుభంబొ ఫలింపకేగునే ?
కారదవిం జరించినను • కర్మముకంటె బలీయముండునే ?

## హనుమంతుఁడు రావణుని గాంచుట

చ॥ వినుతకలా విశారదుఁడు • విశ్రుత ధర్మ కుశాగ్రబుద్ధి పా
వని యట సైన్యసంతతులు • వాకిటఁ గావలిగాయ క్షీరవా
ర్ధిని పెరవార్ధి పైకొనిన • రీతిని తెల్లని తల్పమందు న
ల్లని జిగి నొప్పు రాక్షస ల • లాముని రావణుఁ గాంచె నయ్యెడన్.

సీ॥ బాలసూర్యులు పూర్వ • పర్వతాగ్రస్థులౌ, రాణఁ గిరీటముల్ • రాజిలంగ
నొడలిపై వెలలేని • తొడవులు లేయెండ, గాసి రేయిని పూర్తి • గాఁగ మ్రింగఁ
గనక కశిపుఁ జంపి • కనకాద్రి గుహలోన, నిద్రించు బహుశీర్ష • నృహరి యనఁగ
ధర్మమయ స్వర్గ • వాసులౌ వేల్పుల, పడఁతులు పెక్కండ్రు • బారుతీరి

తే॥ పొన్ను కాఁడల చామరాల్ • పొసఁగ వీవ, సుడియు లేగాలిచేఁ గల్వ • సుమములందు
మధుకణంబులు పడ మేను • మఱఁగి సీతఁ, దలఁచి నిట్టూర్చి కృశియించు • దైత్యనాదు

ఉ॥ కంతుని క్రూర బాణములు • కంతువిరోధి నగంబునెత్తు బా
హాంతర మందు గ్రుచ్చికొని • యవ్వల డుయ్యుటచేత మున్ను దీ
గ్దంతుల దంతముల్ సమర • ధారణి నాఁటఁగనైన యావ్రణా
క్రాంత తదంతరంబుల ని • రంతరమున్ రసి గాఱుచుండఁగన్.

చ॥ కలపపుఁ బూఁతపై మృదువు • గాఁ బడు చల్లని గాలి దర్పకా
నలమును భస్త్రివోలె జత • నమ్మన ఘుమ్మని రెచ్చగొట్ట మై
థిలపయి నంతరింద్రియ గ • తి ప్రతిపత్తులు పర్విపెట్టఁ బా
ములు విడిపోవు పట్ట యనఁ • బోలిన యుల్లము వట్టి పాడుగాన్.

తే॥ ఉత్సుకత మీఱి పైపయి నుల్లసిల్ల, నాఁడు చేసిన యుగ్ర ర • ణంబులందు
వారి వారి త్రావఁగ మితి • మీఱి కాఱు, సురల కీర్తినాఁ గోఱల • సొబగువాని.

తే॥ పూలపానుపు మాఁడి ని • ప్పుకలు రాల, మయిని బొబ్బలయట్లు చె • మ్మటలు గ్రమ్మఁ
దేనియలు గాఱు మాలలఁ • దివురు తేంట్లు, కలఁగ నూర్పులు పుచ్చుచు • మలయువాని

తే॥ చక్రివలెఁ దనయెద సీతఁ • జక్కనిలిపి, తలిమమునఁ గల్లకూరికి • దవులువాని
నెలఁతపైఁ గల వలపను • నీరుపోసి, యూరుపను సన్నఁ బ్రాణముల్ • నూఱువాని.

తే॥ కలఁత మీఱుటచే రూపు • గానరాఁగ, నవ్వ గంభీరముఖుని మ • నంబువొంగఁ
జెలువ ముదమునఁ దనసెజ్జఁ • జేరె ననుచుఁ, జెలఁగి యుబ్బి గగుర్పాటు • చెందువాని.

తే॥ బర్హిసంఘమ్ము లొక్క ప • ర్వతమునుండి, వేఱుకొండకు శ్రమ నేగు • విధముదోఁపఁ
బొలఁతులు బలిష్ఠజయశీల • భుజము నొత్తి, వేఱు భుజమున కేగు న • వ్వితమువాని.

తే॥ కడలిపైఁ దోఁచు రవినాఁగఁ • గాంతులొలుకు, మణిసరులు గ్రాల జగములు • తనియఁగాచు
హరిహరేంద్రుల చక్రశూ • లాశనులను, వ్యర్థపఱచిన గురుపక్ష • మమరువాని.

సీ॥ మాలికాదళముల • మలయు తుమ్మెదలు ది, క్కరుల మదంబుల • నెరయు తేంట్లు
వెల రేఁగి లేచి ప్ర • క్కలప్రక్కలం దాఁకి, రాజులఁబోలి మో • దముగఁబోరఁ
గలపంబు సిందూర • తిలకంబు లొంగొండఁ, గదిసి నిసుయుప్పృత్తి • గందరింప
నానా గజేంద్రదం • తావళి నాఁటిత్రి, వ్విన వ్రణంబుల వక్ష • మెనయువాని

తే॥ హస్తములఁగల ఖల్లముల్ • వ్యర్థములని, తలఁకి సదముల వ్రాలు శా • త్రవ కిరీట
ఘర్షణములచేఁ గాయలు • గాచియున్న, చరణయుగళంబు వెలయు రా • క్షసవరేణ్యు.

తే॥ వామనునికంటెఁ బిన్నయౌ • వాయుసుతుఁడు, తలలు పదిచేతు లిరుపది • కలయఁజూచి
తెలియునంత మనస్సున • తిరస్కరించి, వనులు లోకముల్ దహించు • కరణి మెఱసె.

## హనుమ రావణుని చంప నెంచుట

ఉ॥ వీని భుజాబలంబు బరు • వేయగు నైన నొసర్చునేమి? యి
వ్వాని యశం బదేమి ఫల • వంతమగున్? రఘురాము గేహినిన్
బూనికఁ దెచ్చు క్రొవ్వు తల • బొమ్మరముల్ పడఁద్రొక్కి నే
వీని వధింపనేని తగు • వీపు బంటగుటెట్లు స్వామికిన్?

ఉ॥ వేసము పైకిఁజూపి పని • వేఱుగ నెంచుట భృత్యధర్మమే?
మోసముచేసి దేవిఁ గొని • పోయిన చోరుఁడు నేను గాంచియున్
దోసముమీఱ జీవితము • తోడ వసించుటె? వీనిఁ జంపి నా
రోసము దీఱ మార్తు నగ • రున్ బయి మూఁడునదెల్ల మూఁడనీ.

చ॥ అని మది నుత్సహించి కన • లాఁగఁ బిడ్లను గిఁటి కేలు నె
ట్టన విదిలించికొంచు నక • టా! రఘునాయకు నాజ్ఞలేదు నా
పని యటు డించి వేతొకటి • పట్టుట జ్ఞానుల రీతికాదు యో
చన యొనరింపఁ బెక్కు కలు • షంబుల కియ్యది మూలమే యగున్.

చ॥ ఎఱిఁగి విసంబు ద్రావిన గి • రీశుని పోలిన శక్తిగల్గు ధీ
వరు లెద నాత్మశక్తిఁ గని • పర్వును గాచుకొనంగనెంచి యే
ర్పఱుపక పూనువారె? బల • వంతుఁడు నేర్పరి యయ్యు నాతఁడా
తెఱఁగున వేళవేచి వడిఁ • దేఱెఁ బయోధి యదంగు చాడ్పునన్.

శా॥ ఆలంబుం బెదరేఁచు నీయలుక నా • యందే యడంగాఱనీ
హా! లంకాధిపు నొక్కవానరము మా • యం జేసె నన్నన్ జయ
శ్రీ లక్ష్మీవరు రాముకార్ముక కలా • సీమాంత విద్వత్తకే
క్రాలు న్యూనత గ్రాన నాకు విది క • ర్తవ్యంబు గాదెట్టులన్.

క॥ చెలులెవ్వరు సీతవితోఁ, గలిసి నిదురసేయువారు • కారీతని మై
పొలము తపించెడి రాఘవు, కలికి సతీత్వదశ దీనఁ • గానఁగనయ్యెన్.

క॥ అని తలఁచి యింక నేఁ దడ, సిన ఫలితము లేదటంచుఁ • జింత నవలికిం
జని యకటా! యిందెందును, జనకజఁ గననైతి ననుచు • జాలిం బడియెన్.

## హనుమ సీతం గానమికిఁ జింతిలుట

తే॥ క్రొత్తడి మహాభిజాత నీ • క్రూర దైత్యుఁ, డొకటఁ ద్రుంచెనో భక్షించె • నో యెఱుంగ
నేవిధమున నెఱుఁగ లేని • యేను బోయి, యేమి పలుకుదు ? మడియుటే • యిందు తగవు

చ॥ కని యరుదెంచుఁ; గాదు మఱి • కాంతనె తోఁగొని తెచ్చునంచుఁ దాఁ
గను లఱచేత నుంచుకొని • కాచిన రాముని మోము నేవిధం
బునఁ గననేర్తుఁ ? గార్య మిటు • మూఁడెఁ గపీంద్రులు చావనున్న వే
ళనె మరణింప కిప్పుడిటు • లంకను వ్యర్థుఁడనై మరింతునే?

చ॥ గడువు దినాలు మున్నె కడ • గాంచెను జానకిఁ గాంచనైతి నే
మడిసియు నేమి ? యంగద కు • మారకుఁడాది కపీంద్రపాళి న
క్కడనె నిలుండటంచు బలు • కాఱులు పల్కితిఁ జేయనైతి నా
పొడుపుడివోయెఁ బూర్వమునఁ • బుణ్యమె చేయనొకో జగంబునన్ ?

తే॥ ఏడువందల యామడల్ • గోడ గలుగు, లంకలోన నేఁగాంచని • లవము లేదు
రామువేవి మాత్రము గాంచ • నోమనైతిఁ, గడలి దాఁటియు దాఁట నీ • యడలు కడలి.

తే॥ క్రూరుఁడగు రావణుని గట్టి • కొట్టి నోళ్ళ, నెత్తురులు గ్రక్క గ్రుద్ది కా • న్పింపుమనుచు
జానకిని గాంతునా ? లేక • వానితోడ, లంకఁ జిచ్చిడి కరఁతునా • లక్కపగిది.

చ॥ సురల వలంచి భూమిజను • చూపుఁడి యన్నను దుష్ట భీతిచే
సురుఁగుచు సాహసింప రటు • చూపరు తక్కిన వారలెట్లుఁ జె
ప్పరు మయిసోల నన్విడని • ప్రాణములన్ భరియించి యిందు దీ
విరహితుఁడైన యేను పృథి • వీవరనందన నెట్లు కాంతునో ?

ఉ॥ కంక కులాధినాథుఁడటఁ • గాంచుమనుంటిని రాముగేహినిన్
లంక నటంచుఁ బల్కె విఫ • లం బడియయ్యెను; లోనె దాఁచు నీ
లంకను వార్ధిఁగల్పి తగు • లన్ వడిఁగట్టెదఁ గానకున్న నే
వంకనొ వాఁగునో వెదకు • వాఁడ మెయిన్ భరియింప నేర్తునే ?

చ॥ ధరణిజ దొంగిలించి కొని • దైత్యుఁడు పోవుటఁగాంచి రిమ్మహిన్
నరులు సురల్ నిజంబిది చె • నంటిగఁ జావఁగనేల ? తొల్త నీ
పురి మొదలంటఁ ద్రివ్వి పరి • పూర్తిగ వారిధిఁ గల్పి రావణున్
గరములు మస్తకంబు లెడ • గా నుఱుమాడెద నంత మాఁడెదన్.

చ॥ సుప్రగిరాంతరమ్మె వెదకు • నూకక నిండి స్వచిత్త కంజముం
దవిలిన రాముఁబోలి నిర • త ప్రతిపత్తిని రోసినట్టి యా
పవనజుఁ డట్లు లోఁదలఁచి • పైకటుచూచి శిలీముఖంబు లా
రవ మొనరించు నొక్క వని • రాజిలఁ గాంచి రహింఁచెఁ గాంచఁగన్.

## 3. సీతా సందర్శన పటలము. (77)

### —: సీత స్థితి :—

ఉ॥ చూచితి నెల్లచోటులను • చూడఁగలేదిది యిందు నెమ్మదిం
జూచినఁ జింత దీఱునను • చొప్పు మనంబు వచించు నియ్యెడన్
జూచినమీఁదఁ జూడఁదగు • సూటియుఁ గర్జములేద యిప్పురిన్
మోచు త్రికూటముం బెటికి • మొత్తెద నంబుధి నేను సీల్గెదఁ౯.

క॥ అని రామదూత పంజుళ, వనిఁజేరెను సురలు విరుల • వాన కురిసి మో
దన మొందిరి; రక్కసుచే. వనిత యచట నున్న తెఱఁగు • పరికింత మిఁకన్.

తే॥ స్థూలమధ్యలు రాకాసి • జోట్లు ఖడ్గ, హస్తలై జడిపింపంగ • నశ్మమందు
తోఁచి యెండిన మందునాఁ • దోఁచి సౌరు, చెడి నడుమువలె వాడి కృ • శించి యుండె.

తే॥ నెమలి చాయయుఁ గలకంఠ • మమరు సీత, నిద్రయని తెప్పమూయుట • నీఁగి యెండ
మఱయు దీపమువలె జిగి • మాసి పులుల. మధ్యఁ దగులుకొన్న కురంగి • మాడ్కినుండె.

తే॥ పడుట యేడ్చుట వడఁకుట • యుడుకుటయును
మఱఁగుటయు లేచుటయు మది • కలఁగుటయును
కుంగుటయు సుక్కి సోలు టా • ర్చుటయు త్రోలు
టయును తక్క వేతొక్కండు • చెయిది లేదు.

తే॥ బిలమునుండి వెల్వడి కాలు • వలుగఁ బాఱి, కుచగిరుల దాఁటి నేలను • గుంటలు వడఁ
జాలుచాలుగాఁ గురియు భూ • జాతకనులు, వాన కనులంట సార్థక • పడియె నచట.

తే॥ పృథివియందు సమంజస • ప్రేమ గలుగు, దంపతీవియోగార్తి యే • తనువుదాల్చె
ననఁగ చొప్పిన సీత న • ల్లని మొగుళ్ళఁ, గాటుకనుగన్నఁ గనులబ్ధి • గాఁగ నేడ్చు

చ॥ పవడముఁ బోలు హస్తపద • పద్ధతినొప్పు పయోదవర్ణు రా
ఘవుని దలంచుచో వెడఁద • కన్నులు రాల్చిన నీటఁదోఁగి య
వ్యవహిత దుఃఖతాపమున • వచ్చిన యూర్పుల వేఁడి నెండు చ
వ్యవసిత రీతి నొప్పెఁ గమ • లాప్త కులేంద్ర కళత్ర మయ్యెడన్.

తే॥ చావ విధిదాఁటు టరిదని • జంకి వెగచి, కాంతుఁ డెప్లైనఁ దనకుల • గరిమనైనఁ
బబ్బునై నను గమనించి • వచ్చు వచ్చు. ననుచు దిక్కులఁ గనుచుండు • కనులలోడ.

తే॥ ఓర్వఁగలదియై చంద్రము • నొడిసి మ్రింగి. వెలివఱచు రాహువుంబోలి • పిడుచ గట్టి
యొక్కపైయున్న జడతోడఁ • జెక్కిలిపయిఁ, జేయిచేర్చి విసుగులేని • చింతతోడ.

ఉ॥ మిక్కిలి ధూమమంటి కడు • మేసిన పొల్పగు నొంటిచీరతో
తెక్కలువచ్చు హంసల పి • ఱింది మునుంగని సన్న మేనితోఁ
జక్కెర వింటివాఁడు సుధఁ • జక్కఁగజేసిన ముద్దుబొమ్మ న
ల్పెక్కఁగ ధూమమంటిన ర • హిం గనుపట్టెడి మేనిసొరుతో

## సీత రాముని దలంచి పరితపించుట

చ॥ మఱఁదియుఁ జూడఁడేమొ దశ • మస్తకుఁ డీడకు నన్ను దెచ్చుటల్
పఱపగు నబ్ధిమధ్యమున • భాసిలు లంక నెఱుంగరే మొకో?
యెఱిఁగియు వచ్చుటెట్లనుచు • నేడ్గడ సేయుట మానిరొక్కొ ? యం
చొఱలుచుఁ గ్రుంగి క్రుంగి యెద • నొందిన దుస్సహమైన బాధతో.

చ॥ జనకుని వంటి పక్షికుల • చంద్రుఁడు వారలు కాంచునంతలో
ననె మరణించెనొక్కొ ? విజ • న స్థలి నాగతి నెవ్వరెట్లు రా
మున కెఱిఁగించువార ? లిఁకఁ • బొందుగ నీ భవమందు రాఘవుల్
నను గనిపెట్టుటే యరిది • నాదురవస్థితి యిట్లుఁ జెల్లనే ?.

ఉ॥ దూషితి లక్ష్మణాఖ్యు నట దోసము నాక తదుక్తి వించు ని
వేఱడి శ్రాఁగయంచుఁ బతి • వీడునొ ? నావిధి యెట్టులుండునో ?
దూఱిన పాపకర్మ మిటు • దుర్దశకుం గొనితెచ్చె వట్టి యీ
కోరికలేల? యంచు నలఁ • గున్ నలఁగున్ మఱుఁగుం గఱంగుచున్

ఉ॥ వేళకు నెవ్వరాతపికిఁ • బ్రీతిగ లక్ష్మణుఁ డిచ్చు కందముల్
మూలములన్ ఫలంబులును • ముందట నుంచెడువారు ? విందుల
వ్వేళకు రాఁగ నెంత దుర • పిల్లునొ ? యంచుఁ దలంచి నేలపైఁ
గాలు కదల్పకుండిన సు • కాసి వహించు దురంత తాపమున్.

ఉ॥ వంచకులున్ దురాత్ములును • పాపులు దైత్యులు సీత నిన్నినా
ళ్ళుంచరు నాఁడె చంపి తిని • యుందురు కర్జ మిఁకేది ? కానరా
దంచు మదాశ వీడెనొకొ ? స్వాన్వయ ధర్మమదైన యొప్పుఁ దా
నంచిత మంచుఁ బూనెనొ? క • టా! యిఁక నేమని యందు దైవమా ?

తే॥ కన్న తల్లులు తమ్ములు • క్రమ్మఱిల్లి, వచ్చి తోడ్కొనిపోయిరో ? ప్రతిన గడువు
కడవకుండఁగ నగరి కే • గఁడు నిజంబు, వనమునందె యుండు నసుచు • వనటనొందు.

ఉ॥ వీరులు మున్ను పోరునకు • వీఁకను వచ్చినరీతిఁ బిమ్మటన్
దారుణచేత నందు బెడి • దంబగు సంగరమే ఘటించెనో ?

యేరహి నెందు నాకొలఁదు • నెంత తపించుచునుండు వాఁడొ? యిం
దారటఁ బొందు నాయెదఁద • వ్యాధికి మందెది? యంచుఁ జింతిలున్.

తే॥ నీకు లేదు రాజ్యము తమ్ము • నిజె యటంచుఁ. గైక పల్కు ముమ్మఁడుఁగు మొ • గంబు వెలయ
పురుషసింహుని యెప్పటి • పొలుపు దలఁచి దలఁచి మదిలోన మిక్కిలి • తాపమొందు.

తే॥ అవని పూర్తిగ నేలుమా • యన్నయపుడు. నడవులకునేగుమాయని • యన్న యపుడుఁ
జిత్రమున వికసించిన • చెందొవపలె. వెలయు నెమ్మొగంబును మదిఁ • దలఁచి తలరు.

తే॥ తాఁకియెత్తుటయే యొక • తడవుగాఁగ, స్వర్నదీ జటాధరుఁడు హ • స్తమున వంచు
మేటి మేర్వంశమగు విల్లు • మిడిసి రెండు, తుండ్లు గాఁజేయు భుజముల • దొడ్డఁదలఁచు.

తే॥ విబుధవైరులు పదునాల్గు • వేలమంది. కవియ మూఁడుగడెలలోనఁ • గలను ముగియ
రెండుకొనలును వంగు కో • దండ గరిమఁ. బొగడి పొగడి దూపిల్లును • వగలఁ బొగలు.

తే॥ లోఁతునీట మందాకిని • లోనఁ గలము. నడపు గోల యా గుహునకు • నాయనుజుఁడు
నీకు ననుజుఁ డీ జానకి • నీకు వదిన. యని వచించిన స్నేహకా • ర్యంబుఁ దలఁచు.

తే॥ తండ్రి ప్రేమతోఁ దన్నిచ్చు • తరుణమందు. తండ్రి చేనున్న తన కేల • తండు గొనుట
దర్పవలెఁ బవిత్రంబైన • దక్షిణ పద. మెత్తియుంచుట దలఁపోయుఁ • జిత్తమందు.

తే॥ విరులసరులు తాల్పఁగఁదగు • శిరమునందు, రత్నమకుటంబు గొనక వి • రాగియగుచు
జడలు దాల్చు తమ్ముని గని • జాలినొంది. పరితపించుట దలఁచి తాఁ • బరితపించు.

తే॥ రాజ్యసంపద నీఁగి య • రణ్యములకుఁ. దరలు నాఁడు యాచించిన • ధరణిసురున
కాలమందల నొసఁగి పే • రాసమేర, లేమిగని సుస్మితంబైన • మోముఁ దలఁచు.

తే॥ నరవరుల గండ్రగొడ్డట • నిరువదొక్క. తడవ తిరిగి వధించి ర • క్తమునఁ దండ్రి
తర్పణముసేయు భార్గవు • ధనువుతోడఁ, దపము బలమును గొను పేర్మిఁ • దలఁచి తలరు.

తే॥ కాకమగు జయంతున కొక • కన్ను పోవ. నలుఁగు నేయుట గాక కా • కులకు నెల్ల
నొంటికన్నె నరించిన • యుగ్ర జయము. శిరమునందాల్చి మించిన • చింత సేయు.

తే॥ దుష్టుఁడగు విరాధుని పెను • దోసములను. ద్రోచి ఘోరశాపమ్మును • పాచినట్టి
ప్రాణనాథుని శ్రీరామ • భద్రు భద్ర. గుణములఁ దలంచి యీరీతిఁ • గుములుచుండ.

## రాక్షసస్త్రీలు నిద్రింప సీత త్రిజటతో నిర్వేదము దెలుపుట

తే॥ శీలవతి ప్రియవాక్య సం • స్కృతియుఁ గలుగు. త్రిజట తక్కఁ దక్కిన దుష్ట • దితిజకాంత
లర్ధ రాత్రంబుగా నిద్ర • యనెడి చొక్కు. నీరు ద్రావి మత్తిల్లిరి • నేలఁ బడిరి.

తే॥ అంతఁ దల్లికంబెను ప్రియు • రాలిఁ ద్రిజటఁ, గాంచి నీవు పవిత్ర గు • ణాంచితవును
చెలివిఁ గావునఁ జెప్పంగఁ • దలఁతు నీకు. వినుమనుచు నిట్లుపలికె నా • విమల చరిత.

తే॥ చెలియ! నాకును మేలొండు • గలుగునేమి? నాదు పాపంబు లింకను • మోఁదుచున్నె?
కనులు బొమలు మున్నగు నంగ • కమ్ము లెడమ, ప్రక్క నదరె ఖసం బేది • వచ్చునాకు?

క॥ ప్రేమమయుఁడు కౌశికముని, తో మిథిలకు వచ్చునాఁడు • తోడ్తో నేమే
నేమమున నెవ్వి యదరెనొ, యామాడ్కిని నేఁడుగూడ • నదరెడిఁ గంటే!

క॥ తెలుపఁగ మఱచితి నిదియును, చెలి వినుమా ధర్మమూర్తి • జీవితనాథుం
డిలఁ దమ్ముఁ దొంపవిడిచి వ, నుల కరిగిననాడు, వలను • నొసలే యదరెన్

తే॥ గరళనిభుఁడు దశాస్యుండు • కైతవమున, వనమునందు నాకగపడు దినమునందు
వలకెడనె యదరెను వాని • ఫలము దెలిసె, నిప్పు డెడమవై పదరెడి • నేమి కలదొ?

## త్రిజట సీత కూఱట గఱపుట

క॥ అనుడుఁ ద్రిజట యిట్లను నొద, విన శకునము నీకు మేలె • వెలయించును నా
థుని చేరఁగలవు నిక్కము, వినుమా యని ప్రియముమీఱ • వినిచెఁ మఱియున్.

తే॥ పసిమి నీమేనువొంద జీ • వంబులిందఁ, బొన్నువన్నియ భ్రమర మిం • పునను వచ్చి
యించురంగుల తేనియ • నించుపాట, నీదు చెవినూఁదిపోయెఁ గాం • చితివె మగువ?

తే॥ కాన దీని యోచింప నీ • కాంతుఁ డంపు, దూతవచ్చుట నిక్కంబు • దుర్జనులకుఁ
జెడుగు తొడరుట తప్పదు • పుడమితనయ! మఱియు విను మొక్క కలగంటి • మంచిదద్ది.

తే॥ కలఁతచే నిద్రలేమిని • కలలురావు, నీకు; నేనొక కలగంటి • నీరజాక్షి!
దుస్స్వభావమౌ నీపురిఁ • దోఁచు కలలు, నిక్కలలు వినుమని పల్కె • నిక్కవముగ.

తే॥ రావణుఁడుతలలను నూనె • రాచికొనుచు, రాసభపిశాచములు లాగు • రథముమీఁద
రక్తమాల్యాంబరములు గా • త్రమున వెలుఁగ, జరిగె దక్షిణదిశకు ని • శ్చయముగాఁగ.

క॥ తనయులు బంధులు తక్కిన, యనుచరులును దైత్యువెంట • నరిగిరి మరలం
గనలేదు తిరిగివచ్చుట, జనకసుతా! భయము విడుము • జరగుట వింటే.

ఆ॥ అమిత శౌర్యవంతుఁ • డగు రావణుఁడు వేల్చు హోమకుండవహ్ని • లొకట నాఱె
రత్న దీప వితతి • రాజిల్లు ప్రామేడ, పిడుగు పడుటకతన • గ్రీలి కూలె.

ఆ॥ పిడులు మదముగార్చె • భేరి వాయింపకే, పిడుగు పగిది మ్రోఁగె • నుడువు లరలె
మెఱుపుతోడి మొగులు • మింటను లేకయే, పిడుగు లవనిఁబడియె • బెడిదముగను

తే॥ ఇరులు తొలఁగ నద్ధమరేయి • యినుని బింబ, మర్ధభాగంబు కాలిన • యట్లుదోఁచె
బలియురగు వీరులు ధరించు • ప్రసవమాలి, కలును మాంసంపుఁ గంపును • వెలువరించె

తే॥ మఱియు లంకయుఁ గోటలు • నెరిసె దిశలు, తెలియగంధర్వ నగరంబు • పొలిసెనిండ్లు
విఱిగె మంగళ కుంభముల్ • తఱిఁగెఁ గలిమి, మ్రింగెఁ జీఁకట్లు దివియలఁ • గ్రుంగెఁదెలివి

క॥ తోరణములు తుండ్లైపడె, వారణములు పండ్లురాల • వసుధం గదసెన్
వీరణములు వ్రీలెఁ గలి, ప్రేరణమున. గలశజలము • విరిసెను కల్లై.

తే॥ కలుపతేనిఁ దీర్చికొని రి • క్కలును మెఱసె, వాయరక్తముల్ గురిసెను • మొగులుగములు
అసి గదాది సాధనము ల • న్యోన్య వాద, నముల భేదిలఁ బోరె ఘో • రముగఁ దామె.

తే॥ ఐదుపల సూత్రములు సరు • లంటసందఁ, దమకుఁ దామె తెగుచుఁ బయో • ధర తటముల
బొరలె నిట్టిప్పు దేర్పడు • దుర్నిమిత్త, ములు మహోన్నతములు మఱి • కలవు వినుము

తే॥ రాజు పట్టపుదేవి శ్రీ • రోజ పాళి, మెడలిపడి కీలలంటిన • వడిని కమరెఁ
జేటు నిక్కపమంచు నేఁజెప్పినట్టి, కారణము లివి వింటివే ? నీరజాక్షి !

త్రిజట తన స్వప్నమును సీతకుఁ దెలుపుట

తే॥ నేఁడు గాంచితి నొకకల • నియతి వినుము, జంటవీడని బహుబలి • ష్ఠంబులైన
సింగముల జత యనుపమ • శిఖరిమీఁద, వ్యాఘ్రయూథంబుతోఁ గూడి • శీఘ్రగతిని.

తే॥ అలవిలేనట్టి పెను • మదా • వళము బందు, వనము వేష్టించి నిలిచి పీ • డనముచేసి
పీన్గుపెంటలు చేసె న • వ్వేళ నందు, గల మయూర మెగిరిపోయెఁ • గటకమునకు.

చ॥ వినుత సుభాషిణీ! వినుము • వేయి దివెల్ వెలిఁగించినట్టి స
న్మణి దివియన్ గరంబున న • మర్చి యొకానొక సుందరాంగి రా
వనగరునుండి వెల్వడుచుఁ • జక్క విభీషణుఁ మేడఁజేరె నే
మనఁగల దింతయున్ బహు శు • భావళి నీకగునంచుఁ జాటెడిన్.

తే॥ అమ్మహాత్మురాలట్లు హ • ర్మ్యమునఁ జొచ్చె, నపుడెనను నిద్ర లేపితి • వంతు గనదు
కలయనంగ జానకియును • కరము మోడ్చి, కాఁతయును గాన నిద్రింపు • కోమలి! యనె,

హనుమ సీతను గానవచ్చుట

తే॥ అట్టియెడ శ్రీరఘు ప్రభుఁ • డంపినట్టి, కోడెఁబోలిన మారుతి • కుసుమ వనముఁ
జూచు చరుదెంచు నాతఁడ • చ్చోటఁజేరి, ధారణీజాత యున్నట్టి • తీరుగనియె

తే॥ దనుజకాంత లప్పుడు మేలు • కనుచు నమ్మ! తృప్తిలేని యీనిద్ర బా • ధించె మనసు
ననుచు శూలదండాసి కుం • తాదులైన, కైదువుల దాల్చి గములయి • కదిసినారు.

సీ॥ కడుపున నోరులు • గలవారు నొసలిపైఁ, గన్నులు గలవారు • కఱకుచూపు
గలవారు పండ్లసం • దులఁ బిశాచములు నే, నికలు చౌఁగంటులు • నిద్రసేయఁ
దగు బిలంబులఁబోలు • తలనోళ్లు గలవారు, పదిచేతు లొకతల • పరఁగువారు
తల లిరువది హస్త • ములు రెండు గలవారు, వికృత వేషములును • భీకరాంగ
! లద్రులంబోలు దనుజు ల్రే • లాడువారు, శూల ఖడ్గ చక్రాంకుశ • చ్ఛురిక లొప్ప
విసమె రూపుగాఁ గొనియున్న • విధమువారు, భర్గుఁడును బెగ్గడిలఁదగు • బలమువారు.

తే॥ తురగ గజ సింహ భల్లూక • శరభ ఖడ్గ, మహిష శార్దూల శునక గో • మాయు కిటి పి
శాచ ముఖములవారు పృ • ష్ఠమున నోరు, గలుగువారలు పొగనోరు • గలుగువారు.

తే॥ డెందమున కందకుండు క॰ డిందిబలము, సరసి లెక్కఁదరాని దృ॰శ్యములు గలిగి
యింతులయ్యును మగఁటిమి ॰ నెనయువారు, తటుకునవ్వచ్చి మైథిలిఁ ॰ దఱిసినారు.

తే॥ అపుడు రామునిసతి పల్కఁ ॰ లడఁచి వారి, భీకరాస్యంబులం గని ॰ విహ్వలించె
రాముదూత యున్నత కుజా ॰ గ్రంబు సేరి, వారి కలకల మాలించి ॰ పలికెఁ గనుల.

క॥ రాకాసులు పలువురు ఘో, రాకారలు సాయుధలు మ ॰ హా రభసమునన్
మూకిగొని గుంపుగూను వా, రేకారణమో యనుచుఁ బ ॰ రీక్షించెఁ దగన్.

హనుమ సీతను గాంచి యుత్సాహవంతుఁ డగుట

ఉ॥ కారు మొగుళ్ళఁబోలు ఘన ॰ కాయుని యచ్యుతు పేరురంబునన్
జేరి మదీయభక్తకిని ॰ సేవధియై జగదేకమాతయై
శ్రీరమయైన జానకిని ॰ చిత్తము రంజిలఁ గాంచె రాక్షసీ
నీరదముం బెకల్చికొని ॰ నిక్కిన మైథిలియన్ శతహ్రదన్.

ఉ॥ తాఁకఁగరాని రక్కసులు ॰ తార్కొని కావలికాయ సూక్ష్మమున్
దాఁకిన వాడు పూలత వి ॰ ధంబగు నీమె సముద్రమంతలై
యాకులమందు కన్నుల బ ॰ యల్పడి నిండు తటాక మధ్యమం
దాఁక వహించు హంసిక్రియ ॰ నందుట మత్ప్రభుదేవియే యగున్.

ఉ॥ దమ్మము కూలలేదు వడిఁ ॰ దాఱి నశింపను నేను రోసి యి
య్యమ్మల దేవిఁగాంచితి వ ॰ హించితి గిరిముదంబు సర్వమున్
గ్రమ్మఱ నంచు వేడ్కఁయను ॰ కల్లు భజించి మదించి యాడి మో
దమ్మునఁ బాడి గంతులిడి ॰ దాఁటెను కొమ్మల నీవలావలన్

తే॥ లలి ననింద్యములగు రూప ॰ లక్షణములు, రాముఁడు వచించినట్టులీ ॰ రామ కమరె
నౌర! మాయావియైన ద ॰ శాననుండు, రాము జీవముల్ దాఁచిన ॰ రాణ యిదియొ ?

తే॥ మూఁడుజగముల ధర్మంబు ॰ మూలముట్టఁ, దొలఁచుపాపి రాఘవు జీవ ॰ ములనుదీయ
నెంచి చేసిన దుష్కృతి ॰ యిద్ది నిక్క, మీమెలక్ష్మియే రాముఁడు ॰ పేంద్రుఁడె యగు

చ॥ మసటు వహించు రత్నము క్ర ॰ మమ్మున నున్నది సూర్యకాంతులం
బసచెడు చంద్రుఁబోలినది ॰ మాసిన వేణియె దాల్చియున్న దీ
కుసుమ సుగంధి గౌరవము ॰ కోర్కియుఁ దత్కృతి రక్షణంబునం
దొసఁగొక యింతలేదు; భువిఁ ॰ దోరపు ధర్మము నాశమొందునే,

ఉ॥ శ్రీ రఘువర్యు దొడ్డవగు ॰ చేతులనో ? పొగడంగఁదగ్గ యీ
వారిజగంధి సద్గుణ వి ॰ పాకమునో ? ప్రభుయోగ్యసద్గుణో
దారు విదేహరాజు కుల ॰ ధన్యతనో ? మఱిదేనినో ? మనం
బార నుతించువాఁడ ? నివి ॰ యన్నియు రూపయి యొప్పె నీమెయై.

చ॥ అసురులు నొక్క కాపలము • సందరు జ్ఞానులు పాపయుక్తులై
యసురిరు ధర్మమున్ జగము • నందు సశింపదు మా ప్రభుండు లో
కమున నొసర్ప దగ్గ యొక • కార్యముగల్గునె? యన్నియున్ భువిన్
సహకులు సీతగల్గ మతి • నాదగు సేపయు ధన్యమేకదా?

తే॥ దీటులేని యాదేవి స • తీత్వమెంచు. కంత చెదరిన శ్రీరాము • సలుక యనెడు
కడలి పొంగి కల్పాంతంబు • గానొనర్చు. ననుచు జడిసితి నిం క లోక • మమరుశాంతి

చ॥ ఇలుపడి యొందిశీలము మ • హోద్యత, బొంది మనోదృఢత్వమున్
గలుగు తపంబు పేరిమి ని • కంబుగ సన్నుతి సేయశక్యమే?
యలవున నగ్నినిల్చి విష • యంబుల గెల్చి జలాదు లూర్చియున్
జలుపు తపస్వులేని కుల • సాధ్వుల ముందట నిల్చు వారలే?

చ॥ ఇలపయి నీశుభాంగి జని • యించుటచే దపమూనిపొందు స
త్కుల జనంబు స్త్రీపొడుపు • తోరపు ధన్యత గాంచినట్లె చె
ల్వల ధనమైన జ్ఞయు ద • పం బొనరించి పవిత్రమయ్యె నీ
లలి నిట నీమె సత్తప మె • లర్చుట రాముడు నోచ వారయన్.

తే॥ రాక్షసులు నీతిమాలిన • రాజసాత్మ, లీమె యొకతయే సాధ్వి మ • జేరు లేరు
స్త్రీత్వమును తపం బేకాకి • నీత్వ మిదియ; చెలువలకె ధర్మఫలమెల్ల • జెందుగాక!

ఉ॥ ధర్మమె కాచుచున్నదొ? య • ధార్మికుడైన దశాస్యుచేయు దు
ష్కర్మమె కాచుచున్నదియొ? • కాక మహత్త్వ సతీత్వమే తగన్
శర్మ మొసంగునో? అరుదు! శక్యమె యీగతి నోర్వ నేరికిన్?
నిర్మల నీతి నీస్థితి గ • ణింపగ? సాధ్యమె నన్నుబోటికిన్?

ఉ॥ నెట్టన దైత్యసంపద గ • ణింపగ? నిర్జర సేవితంబ యా
నట్టిది; వారి దుష్కృతము • లందమ? యిట్టివి! యిందు మానసం
బొట్టి వసించుటన్నగడు • దుర్భర; మిట్టుల నున్న యీమెకీ
పట్టున నేది కష్టమగు? పాపము పుణ్యమునే జయించునే?

తే॥ ఇట్లు పలుపలు విధముల • నెంచి వృక్ష, మధ్యమున గుబురగు చోట • మఱుగునుండి
హనుమ కాంచుచు నుండిన • యంత నటకు, దానవేంద్రుండు వచ్చుట • గాన నయ్యె.

## 4. నిందనపటలము. (82)

సీ॥ కూటయుతోన్నత • కుధరంబు లొకకొన్ని, వెలువార నొకచోట • జేరెననగ
వజ్రాల కుండలా • వళి చలించుచు నుండు, వింశతి భుజములు • విరిసి వెలుగ
సాగరోదయ భాను • చందాన నొక్కొక్క, మకుటంబు లేయెండ • మలసికాయ
గంధ మాల్యాదిక • క్రమఘుమం ఘుమల్, దిక్కరీంద్రంబుల • ముక్కునింప

తే॥ ఖడ్గ మూర్వశి మోచి ప • క్షమున రాఁగ, నడపముం గొని మేనక • యందియాయఁ
బాదుకలు తిలోత్తమ చేతఁ • బట్టి తేఁగఁ, జుట్టి క్రేపల రంభాది • సుదతు లరుగ

సీ॥ ఒడళులు వెలిఁజిమ్ము • తొడవుల కాంతులు, చీఁకట్ల గుంపులఁ • జేర్చి త్రుంగ
నూపురములు కింకి • ణులు మేఖలలు పెక్కు, పక్షుల కలకల • ధ్వనుల నెనయ
తావి నూనియ కర • దీవియల్ ధరియించి, వడి నసంఖ్యాకలౌ • వనిత లరుగ
విఘ్నంబు గలుగఁ గో • పించి నిద్రను మానె, నాకోపమెంత ద • వ్వరుగునొక్కొ

తే॥ ధరణిజాతి వనము దాఁక • జరుగునో • మఱి, యెవరి మీఁదికినేగునో • యేమిగతియొ?
యనుచు ననిమేషనయనము • లమరవరులు, పూనికొని చూచుచుండఁగ • ముదము తోడ

సీ॥ నీల భూధర గళ • న్నిర్ఝరంబునుబోలి, పట్టోత్తరీయంబు • పరిఢవిల్ల
జలధిపై బాలభా • స్కరకాంతి పరవిన, రహి హారరుచులు గా • త్రమున వెలయ
కారుమబ్బులను వి • దారించు కొనివచ్చు, నెఱిమించునాఁగ జ • న్నిదము వెలుఁగ
హీరమాణిక్యకే • యూర రోచులు గ్రహ, తారకౌఘంబులఁ • దాఁకి పోవ

తే॥ ఘర్మనూపురరుచులు భూ • భాగమందు, పరవి పణిహారులట్లు ముం • దరుగుచుండ
బంధు మందహాస జ్యోత్స్న • పరిధి గట్టి, రాత్రులందును ముఖపద్మ • రాజివిరియ.

సీ॥ ఒడలి వన్నెకు వేలు • పడి డాలు మీఱి మ, ధ్యమున నొప్పారు పీ • తాంబరంబు
నల్లని పెనుగొండ • నడుమఁబడిన ప్రొద్దు, పొడుపు నీరెండ నా నడరుచుండ
వేళ్ళులందలి మించుఁ • బోలు నుంగరముల, మణులపెల్లుబు పూచు • వనమునెనయ
కల్పాంతమున నిల్చు • కనకాద్రిపైఁ బొల్చు, గ్రహములు హార తా • రములు వోల

తే॥ మస్తకముల శీర్షకములు • మలసి యుదయ, గిరిని సన్నిద్ధఖనుల ని • ష్ఠులు తొలంగఁ
బదురు భానులొక్కటఁదోఁచు • పగిదివెలుఁగ, రావణుఁడువచ్చెలోక వి • ద్రావణుండు.

సీ॥ కోఱలు విఱిగి కే • కుల పాదములఁబోతె, జందంబు చెసిన ది • క్కాముజములు
భువన భీకరుఁడయి • పొలిచిన కనక క, శిపుని వరంబుల • చేవ చెఱుచు
నిశిత దంష్ట్రాభీల • నృహరి పాదాంకముల్, తడవిన గజముల • వడిసిపెగడ
జిక్కినుల్ సిద్ధుర • నమసిన రంభాది, గణికలును భుజంగ • కన్యకలును

తే॥ సిద్ధ విద్యాధరాసుర • స్త్రీలు వాలు, గంట్లు కువలయ నేత్రలు • కంజముఖులు
కుంకుమాంకితోరస్కలు • కోమలాంగు, లద్రిఁజుట్టిన సెలఁఖుల • యట్లు మలయ.

సీ॥ సుషిర వాద్యంబుల • సుస్వరంబుల తోడఁ, బొరలిక లేక సొం • పుగ లయించు
చామల గాత్రముల్ • శ్రావ్యంబు గాఁగఁ గి, న్నర గీతములు తాళ • నాదములను
ఝల్లరుల్ మద్దెలల్ • సౌరుగా వినిపింపఁ, బాములు సమ్మృతంబు • బయలుపఱుప
శృంగాటకములందు • హేమ రత్న విభూష, లందాల్చు హరిణుల • చందమందు

తే॥ హరిసుమధ్యలు చామర • లాలవట్ట, ములను దాలిచి జీమూత • ములనుగాంచి
ప్రీతి నటియించు నట్టువ • పిట్టల వలెఁ, దళుకు బెళుకులఁ జూపుచుఁ • దరలిరాఁగ.

ఉ॥ వీణలు మీఁటి వైణికులు • వీనుల విందొనరింపఁ బొందుగా
గాణలు శ్రావ్యరీతిఁ గల • కంఠములం బలెఁ బాడఁగా సుప
ర్వాణులు మర్దళాదిక ర • వమ్ములఁ గొల్వఁగ దేవతా వికీ
వాణులు శాస్త్రసమ్మతిని • భావములం బ్రకటించి సత్రిలన్.

ఉ॥ కాలిన పుంటిలో గొరక • కట్టియ చొన్పిన మాడ్కి దర్పకుం
దోలిని తమ్మిగుమ్మిలిక • నొమ్మిక బొమ్ముసఁ గ్రుమ్మఁ గౌముదీ
జాలము వేఁడిసేయ మన • చందనశైల సమీరణుండు కుం
దాల మరందమున్ గరఁచు • తామ్ర కణంబుల వోల్కి రాల్పగన్.

ఉ॥ తంతువుఁబోలు మధ్యములు • తిప్పిరి భేదిలునంచుఁ దోఁపఁగా
గంతులువైచి పైకుబుకు • గబ్బి చనుంగవ పైఁడి గిండ్లు నాఁ
జింతిన సేయఁగప్పి చెవిఁ • జేరిన కన్నులుగల్గు స్త్రీల శ్రీ
మంతములౌ కటాక్షములు • మాటికి బొమ్మున బాహులం బడన్.

సీ॥ కల్పకంబులు నిధుల్ • గంధ మాల్యాంబర, భూషణావళిఁగొని • మొనసిరాఁగ
కలశాబ్ధి వీచికల్ • కాటుక కొండపై, మలసిన పనఁగఁ జా • మరలు వెరయ
కందుగానని నిండు • చందురుఁ బోలిన, ధవళాత పత్త్రము • ధ్వజిని వెలయ
నడుగు లిడెడు వేళఁ • గదలి చుట్టిన త్రికూ, టస్థమౌ లంక గుం • ట వడి యందు

తే॥ వీచికలు పాఱిదిక్కుల • విరిసి పరవ, భుజగ రాజును భారంబు • మోపలేక
మెదను క్రుంచఁగ వారిధి • మేఖలయును, వెన్ను నెటుకున విఱిగి నో • ర్విడిచి యఱవ.

ఉ॥ తాటక కంటె నిమ్మడుఁగు • దార్ఢ్యముతోఁ గుధరంబునే నిరా
ఘాటముగా వహింపఁదగి • గాజులు పూనిన కాంతలెట్టి జం
జాటము లేనివారు మన • చక్రగదాసి శరాన సర్వలా
ఖేటక కుంతశూలములు • కేల ధరించి బిరాన వెంటరాఁ.

చ॥ విరియు చిపుఱ్ఱ పూవులును • వేళ్లను మొగ్గలు కాఁడ లాకులున్
హరువుగ నెల్ల యంగములు • హైమములై విలసిల్లు వృక్ష సం
భరిత వనంబు మాఁపునహా • శ్వాసము పుచ్చుచు సీతయున్న చో
టరసియు దోఁపు వోవు మణి • నారయు పన్నగమట్లు రోయుచున్.

ఉ॥ వచ్చెడు దైత్యరాజుఁగని • వాయుకుమారుఁడు చింత సేసి నేఁ
డిచ్చట వీనివంచనయు • నిచ్చయుఁ జేష్టితముల్ బయల్పడున్
జెచ్చెర మీఁదఁజేయఁవగు • చెయ్దియు నేర్పడు నంచు రామ నా
మోచ్చరణంబు తోడనట • నుండు ననోకహమందు డాఁకొనెఁ.

ఉ॥ అనురమృగాక్షిఁ బింత నెద • యం జన నన్నులలోన దీపమై
యొనఁగిన రాముదేవి గల • యిక్కకు నిర్జరవైరి చేరె వ

వ్వసుమతిపుత్త్రి బెగ్గడిలి • వన్నెల చాలల చేవ కిన్క దీ
మన మెసలారు వేఁగిఁగని • మ్రాలుమెకంబు వితాన బెగ్గిలెన్.

వరఁకి జీవముల్ చలియించు • వనజనయన. మోహమునఁ గ్రుంగి తపియించు • మూర్ఖ దైత్యు
ననుమ యొక సాక్షిగాఁ దన • కనులఁగాంచి. చిత్త మొక్కనిల్కడలేక • తత్తరించె.

ఉ॥ దేవికి భద్రముల్ సకల • దేవత లిత్తురుగాత ; వేదముల్
తావలమొంది వర్ధిలుత ; • ధర్మము నిశ్చల మందుఁగాత ; శ్రే
యోవిభవంబు రామునకు • నొందుతమంచనె నా దినేంద్ర దో
షావర నిత్యకీర్తి సువి • చార గుణుం డనుమంతుఁ డత్తఱిన్.

## రావణుఁడు సీతను బతిమాలుట

విసము నమృతంబుగఁ దలంచి • వేఁడువాఁడు, పంక్తికంఠుఁడు డాసి యో • పద్మగంధి ;
కోకిలా ; యెప్డు నాయెడ • గొప్పకరుణ, యమరుతువో వచింపుమ యని • యణఁగిపలికె

పురవిరోధిసన్నిధి నేని • పరువుక్రుంచి, యించు కేని తగ్గని దిట్ట • యెడఁద తలఁపు
బిడియమును తన్ను మిక్కిలి • జడను పఱుప, జంకిజంకి యిట్లనియె నా • జవ్వనికడ.

ఆకర్ణాయతలోచన ;, వే కడచనె నిన్నినాళ్లు • వెడలునొ మఱియున్
నీ కరుణ యిట్లున్నది, నాకడ నిఁకఁ గెడయు పిదప • నన్నెన సెదవే ?

వనితాతిలకమ ; జగముల, మునుకొని వహియించు నాయ • మోఘ శ్రీపా
లనమున నీకై కలిగిన, మనసిజు పోరొందు దక్క • మఱి కొఱ గంటే ;

॥ హేమ పల్లవమా ; కీర్తి • యెసఁగు కలిమి, కోరక యుపేక్షచేసితి • ఘోరవనుల
నీ మగండు చావకెడరు • నీఁగి యేగి, పడయునది యల్పమనుజ సం • పద యెకాదె ?

॥ పెరిమతోఁ దపస్విలు శాస్త్ర • విదులుపొందు, ఫలమునించుక నీమదిఁ • దెలియనరయు
దేని నాయాజ్ఞ శిరసావ • హించు సురలఁ • జేరి వసియించుపేకదా ; • చిగురుఁబోఁడి.

॥ వస్తువులలోన మేలుగా • వఱలు బిడ్డఁ, గోకిలరవంబు వీణను • గోరువంక
నరఁచు మృదుభాషిణీ ; నీకు • వెడఁగు బ్రహ్మ. కరుణనడుముతో సృష్టింప • మఱచెనెమో ?

చ॥ పరువము నాయువుఁ మరలి • వచ్చుట భిన్నఘటంబు నీరముల్
మరలి ఘటంబు నించునను • మాటకు దీటగుఁ ; గానఁగాచు చం
దిరిక వితంబునన్ వయసు • తేరకుఁబోయిన సౌఖ్యమందు పె
క్కరణిని ; దుఃఖమందె యిటు • కంది కృశింతువె యోవివేకినీ ;

॥ రుణిణ ; బతిమాల నీమది • కరఁగదేని, నిక్కువముగ నాజీవముల్ • నిల్వ
నీసహజ శీల సౌందర్య • నియతికిఁ దగు, సుందరుం డెవ్వఁడున్నాఁడు ' ఘోటు మబల ;

తే॥ కలికితనము సందంబుఁ బ్ర • గల్భగుణము, మొదలుగాఁ గలవన్నియుఁ • గుదిరియుండి
నెనరు నీవి దాక్షిణ్యంబు • యనవరతులము, నందు సతియింపు కారణ • మరయరాదు.

చ॥ పలుకు శుకంబు నీవిభుని • పట్టి పఠించిన యప్పు డార్తిమైఁ
బిలిచిన వానికాయువిని • బిమ్మిటితో విభుఁ జూచు కోరికన్
దలఁపున నుంచితే? పిలిచి • దాసముసేయుఁ గులంబు గోత్రముం
బలుకుము యన్న యట్లసుట • భావ్యమె యారయ నిన్ను బోఁటికిన్.

తే॥ నీవలస నాదు దీపముల్ • వోపునేసి, నానమస్త సంపదలప్పె • నా మొందు
పచ్చివర్ధిల్లె ననుకీర్తి • వదలి చెదిరె, ననెడి యపవాదు నొందెదే • యబ్జవదన!

తే॥ వేఁడవులు వేల్ప పడఁతులు • కేలుమోడ్చి, నీపదాబ్జముల్ భజియింప • నేపుమీఱు
త్రిభువన ప్రాజ్యరాజ్యసు • శ్రీ లభింపఁ, గాలఁద్రోచెదు నీవంటి • బేల గలదె?

తే॥ అపయశమునకు వెఱపని • యసురవిభుఁడు, సకల జగతీజనముల నా • జనులఁ గాఁగఁ
జేకొనిన నాదుసేవ నం • గీకరింపు, మనుచుఁ గేల్మోడ్చి వాఁగిలి • యవనిఁ బడియె.

చ॥ అనలమునందు వ్రాఁగిన శ • రాహతిఁ బోలు కటూక్తు లేగు ముం
దునె చెవిమాఁడె డెందమును • తోడనె మార్పవెఁ గన్ను దోయి న
ల్లను వెలిగ్రక్కె జీపముల • లక్ష్యమొనర్పక మానినీ గుణం
బును తలమీఱు కక్కసపుఁ • బోటగు మాటల సీత యిట్లనెన్.

సీత రావణుని కటూక్తులాడుట

మ॥ ప్రియమా! వింటివె నీకటూక్తులు కులస్త్రీ లెన్నఁడే నోర్పుమై
గుణమా! సాధ్విలసంబు కంటె మృదువుల్ • కొండల్ యథార్థంబు; దు
ర్గుణముల్ కీర్తిఁ వెచ్చునే? చదువుచేఁ • గొన్నట్టి తెల్వింతయే?
క్షణసౌఖ్యంబునకై యశోగరిమ గం • గం గల్పఁగా నెంతువే?

మ॥ ముఖమా! మేరువుఁ దొల్పఁగా గగనమున్ • భూమిన్ విదారింపఁగాఁ
జలమారన్ బదునాల్గు లోకముల వం • చాలించి కూల్పంగ న
జ్జలజాతాప్త కులేశు బాణములు పె • ల్పుంజాలు టూహించియున్
గల లోకుల్గమ్మడిఁ ద్రుంగఁ జూచికొనెదే • దర్పోద్ధతిన్ బాలిశా!

మ॥ అతి భీతింగద నాఁడు నీవు బలుమా • యన్ జింక నంపించి నా
పతి లేనప్పుడు మాయవేషివయి బ • ల్పచ్చెంబుతో దాఁగి వ
చ్చితి జీవింపఁ దలంచితేని విడుమా • శ్రీరామచంద్రుండు దృ
గ్గతుఁడై నిల్చినఁ దేఱి చూడఁగలవే • కష్టాత్మ! నీ చక్షువుల్.

ఉ॥ నాఁడు ఖగేంద్రు చేత నె ఘ • నంబగు మూర్ఛగడించినాఁడ వీ
నాఁడు మహాధనుర్ధరుఁ డ • నల్ప పరాక్రమ లీలలం దగం

బోఁడిమిఁజూప నీదు కర • మూర్ధము లొంపఁగఁ గట్టు చిత్ర చి
కోర్పడక లక్ష్యపాళులె య • గున్ నిజ మన్య విధంబుఁ బోలునే ?

ఉ॥ పందవు నాఁడె యోడితివి • పక్షికులేంద్రున కొల రుద్రుచే
నందిన చంద్రహాసమున • నాతనిఁ జంపితి కాక యున్నచో
మ్రందవొ? జీవితంబును వ • రంబులు కాలుని చేఁతకే చుమీ
కొందెడు రామబాణముల • కున్ గుఱిగాక మనంగఁ గూడనా?

తే॥ వరబలము సహాయ బలంబు • పరబలంబు, నలుపవార్తలు రాముఁడు • నారిగూర్చు
వఱకెకాని యావల ఫలిం • పంగఁ గలవె?, ఖానునెదుటఁ జీకట్లును • బ్రబలునేమి?

శా॥ కైలాసంబుఁ గదల్చునాఁడు మృదుప • త్కంజంబుచే నీ మిడిన్
వ్రీలం జేసిన శంకరుండు షరముల్ • వేకాల్చు నారాచమున్
లీలం గూర్చిన మేరు కార్ముకము వ్రీ • లెన్ రాఘవస్వామికిన్
గేలం బట్టఁగ నిల్వ కప్పటి ధ్వనిన్ • గించిజ్ఞ: యాలింపవో ?

శా॥ తారాద్రిం బెకలించి దిగ్గజములన్ • దాటించి జంకించు నా
కౌరా! యెవ్వరు సాటివారలని వ్య • ర్థాలాపముల్ సేయు నీ
వా రామానుజుఁడుండు వేళ నట దా • యం గొంకి దాఁకొంటి వి
స్కీ: రామాచరణంబులం బడెదవో • సిగ్గింత లేకియ్యెడన్.

ఉ॥ నీవు కలంగి దాఁగి మన • సెక్కొను చోటిది యంచెఱింగి మ
జ్జీవవిభుండు వచ్చునెడఁ • జెందిన కోపదవాగ్ని యిమ్మహా
రావముతోడి వారిధిఁ బు • రంబు దహించి యడంగునో? దశ
గ్రీవ; జగంబులెల్ల నుడి • కించిన జీవముతో నడంగునో ?

చ॥ చెడుగరులైన రక్కసుల • జీవములం గొనియే యడంగునో ?
దుడు కొకరుండు సేయ గుణ • దూర్వహు కోపముచే నజాండమే
చెడ నగు నేమొకోయనుచుఁ • జిత్తమునన్ భయమందుచుంటి నా
యెడఁదకు ధర్మమున్ శశి ది • నేశులు సాక్షులు సత్యమీ నుడుల్.

ఉ॥ అందముచెందు నీపుడమి • యందలి జీవులు వేలుపుల్ భయం
బందఁ జరించు బాలిశ ! దు • రాత్మ! సమంచిత చేష్టవీడి యీ
దుందుడు కేల గొంటి విఁక • పోరుట నిక్క మజేశ విష్ణు సం
క్రందన సన్నిభుం డనియొ • రాఘవునెంచెదు నీ మనంబునన్ ?

చ॥ ఇనకులు మానవుండనుచు • నెంచెద వేని మహాబలిష్ఠు న
ర్జును నొకమానవుండె కద • రూపడఁగించెను వానిచేవయున్
మనమున నెంతుకాదె? జన • మాన్య చరిత్రుని రాము సత్త్వమున్
ఘనమగు దూరదృష్టి నెఱుఁ • గందగు దీవును గర్వపర్వతా !

చ॥ పలువతనంబుచే ననుష • భాగ్యము గోల్పడనున్న మూఢ! వా
రలు నొకయిర్వురే యని వి • రాకృతి సేయుదు వేని సర్వలో
కలయము వేళ నొక్కరలు • కంటు(డ కా(దె సమాప్తి సేయు నా
పలుకులలో నిజమ్ము పిద • పన్ బపరాస నెఱుంగ గా నగున్.

తే॥ గుణకిణాంకిత భుజులు స • ఖంఠిత జయు, లగు హిరణ్యాక్ష(డును హిర • ణ్యకశిపు(డును
పూజ్య పద్ధతుల్ వీడిన • సప్పుడును పరుల, యాంధ్రయెద మేరదాటి కే • యరిగినారు.

చ॥ స్థిరులయి నిల్చువారలును • చెట్టఱ చేసి నశించు వారలన్
సురలొ? నిశాటులో? తెలియ( • జూడుము సర్వ జగంబు లో(గి నా
ఉరపడి సేవ సేయు మహి • మోన్నతి నందితి నందువేని య
ప్పురువు తపః ఫలంబొ మఱి • పాపఫలంబొ? తగన్ గ్రహింపుమా.

ఉ॥ భాగ్యము నీకొసంగిన క • పర్దియు సంతతమున్ భరించు స
ద్భాగ్యము సుస్థిరంబగు త • పః ఫలమందుట చేత(గాదె? త
ద్భాగ్యము నీ(గ(గా సుతులు • బంధుజనంబులతోడ(గూలు దౌ
ర్భాగ్యము( గోరి ధర్మమును • పాడొనరించితి వేల దుర్మతీ!

ఉ॥ వీర్యము సర్వదా జయము • వీకున( గలిన వారలేని దు
ష్కార్యము సేయువారలును • కారుణికత్వము వీడువార లై
శ్వర్యము వోవ నాశిలట • సత్యము; కామముఖారి వర్గ జి
ద్వీర్యులు గాక దుఃఖముల • వీడినవారు మఱేరు? దానవా!

సీ॥ రాముండు దండకా • రణ్యంబు చేరుచో, ద్రవిడభాషకు( బ్రోది • తనియ( జేయు
ముని మొదలగు మహా • త్ములు వచ్చి దుష్ట రా, క్షసులకృత్యములు దు • స్సహము లయ్యె(
దపములు సాగవా • దనుజుల( బరిమార్చి. పాలింపు మమ్ము నీ • వలన వారు
నీల్గుట నిక్క మ • నిరి నేను వింటిని, తగినట్లె నీ యన • త్కర్మ మహ రె

తే॥ నీబలము జీవితంబును • నియత బలము, నెఱిగ( దెలిపిన పిదపనే • నీ చెలియలి
ముక్కుకో(త నీతమ్ముల( • జక్క(డుచుట, రవ్వయేని యోచింపవో • రాముబలిమి.

చ॥ ఎఱుకువలేని మూర్ఖ! నిను • హేళన సేయుచు నీకరంబులన్
విఱిచి ముఖంబులన్ రుధిర • భీషణ ధారలు గ్రక్క గ్రుద్ది పై(
జెఱనిడ్చు కార్తవీర్యుని వి • శిష్ట భుజంబుల( ద్రుంచు భార్గవుం
డుఱుకుచు వచ్చి,రామునకు • నోడుట నీవు వినంగ లేదొకో?

సీ॥ కఱచి చంపెడు క్రూర • కాలాహియైనను, మంత్రంబునకు లొంగి • మడ(గియుండు
విదితగు విద్విషతగ • దిది వోలు విడికూడ, దని మందలించి న • జ్జన పథంబు
కఱపెడు వారు నీ • కడ నెవ్వరును లేర, యున్నట్టి వారౌ నీ • వన్నదెల్ల
సరియని మోమోట • సంస్తవనము సేయు, క్రించులై విన్ను ము • గించువారె

యింక నీకు ముగింపు గా • కెవ్విధమున. ముగియు నడియునుకలదె ధ • ర్మపు చెఱంగఁ
గర్కశాత్మ! చెట్టు చెడెడు • కాలమునకు. గుక్కమూతి పిందెలు పుట్టు • కోపునిదియ.

మ॥ ధరణీజాత వచించు పొడి విననం • త న్నేత్రముల్ గ్రక్కె నె
త్తురులన్ మించులపోల్కి వెగ్గె దశవ • క్త్రుండన్ని యాస్యంబులన్
గిరులుం జూర్ణముగాఁగ గర్జిల వడం • కెన్ భూమియుం గోపమూ
ర్చ్మర విక్రాంతిని మీఱిపోయే వివరిం • పన్ శక్యమే తత్ స్థితిన్ ?

చ॥ నెగసిన లజ్జయున్ దెసల • నెక్కొని కొల్చు భుజంబు లగ్నులన్
బొగలను గ్రక్కు కన్నులను • భూరిభయంకర రీతిఁగ్రాల నీ
మగువను జీల్చి మ్రింగెద న • మాంతముగా నని నీల్గి కోపమో
హగతులు పోరు సల్పఁ గది • యం జనఁ బోవును పోవఁ డొక్కటన్.

తే॥ హనుమయప్పుడు మాస్వామి • వినిదురాగ్ర. హమున నీచుండు తాఁకుట • కరుగుమున్నె
నలఁచి వీనిని చంపి య • వ్వలఁ జరింపఁ. దగిన చందము చూచుకొం • దమని తలఁచె.

ఉ॥ ఎక్కటియైన వీని తల • లెత్తైఱ గ్రక్కున నూడఁద్రుంచి వే
యిక్కడలిన్ మునుంగఁ బరి • నిట్టులె కాల నడంగఁ ద్రొక్కి యే
నొక్కఁడ పూతశీలను ర • ఘూత్తము దారను మోచికొంచుఁబే
రుక్కునఁ బోవుచే యుఱవు • నొప్పని చేతులు నల్చుచుండఁగన్.

క॥ అండమ్ముల నుద్దండతఁ, దుండములుగఁ జెండఁదగిన • ధూర్తుని కోపం
బండజయాన పయింగల, మెండు వలపుచేఱు పాఱ • మెల్లన నాఱెన్.

చ॥ నలఁచెద నంచు నల్గితివి • నల్పఁగఁజాలక యుంటిఁ దొయ్యలీ!
పలికితి కొన్ని యయ్యవి సు • బద్ధములే యగుఁగాక యిమ్మహిన్
చులుకనయుంచు నొక్కటియుఁ • జూడఁగ దెప్పర మంచు నొక్కఁడుం
గలదె? జయంబు నోటమియుఁ • గ్రాలె విహార విలీలలై తగన్.

చ॥ ఒక పలుకాలకింపు మిట • నుగ్మలి! రాముని చంపి నిన్ను నే
నకుటిల లీలఁ దెచ్చిన ర • యంబునఁ బ్రాణము వీడి కేని యే
నకట! మరింతు నిక్కముగ • నట్లగుటం గికురించి తెచ్చితిన్
వికచ సరోజలోచన! భు • విన్నను దాఁకెడు వాఁడుఁ గల్గునే ?

మ॥ హరిణంబంచుఁ దలంచి యేగిన మను • ష్య ప్రాకృతుల్ నన్ను తా
రరయం జొచ్చిరయేని యిప్పటికి రా • నంకించి యుంకింప రా
నరులం గూరిచి కుండికుంది యెదురన్ • లాభంబె ? నా చేఁతకున్
సురలైనం బయిలోటగాక తగదం • చున్ వైరముం గొందురే ?

చ॥ అగుదురుగాక నన్ను సమ • రాంగణమందు జయించునట్టి రే
యగుదురుగాక నాశమును • నందని వారలయై త్రిమూర్తులున్

జగముల నేలు నింద్రుఁ డని • శం బుడిగం బొనరింప నేనె ము
జ్జగములఁ గీర్తినించితి ని • జంబుగ నెవ్వరి కిట్టు లబ్బెడిన్ ?

సీ॥ అలికుల వేణిరో! యజహరి హరులయు, సురలయు బలములు • గ్రుక్కినట్లు
జగముల నిండిన • జయము వ్యర్థంబుగ, నీకొఱకై యొక • నింద నొంద
విష్ఫల వ్రతముల • నియతిఁ జేయుచునుండు. బలహీన నరులఁ జం • పంగఁజాల
వారి నిచ్చటికి నే • వారక రప్పించి, సేవలు గొందుఁ గాం • చెదవు గాక

తే॥ అల్పగుణ మల్పకార్యంబు • లల్పఫలము, గలుగు నల్పుల కద నీఁకు • గానఁబడిన
తెలివి బలము నాయెడఁజూడఁ • దెలియరాదొ?, వారినొక కేలఁగొని తెత్తుఁ • గోరిచూడు

చ॥ కనిసిన పక్వజన్మలగుఁ • గావుత నాకిటు నిన్నొసంగు మే
ల్పని దలఁపంగఁ జంపఁదగు • వారె? విలాసిని! వారి నాశమే
మనమున నెంతువేని యది • మానుగ నీకు శుభంబయేని నా
కనుమతి యిమ్ము చేసెద ర • యంబున నయ్యది యెంత కార్యమో

మ॥ అవురా! యింతగవేఁడ సమ్మతిల వ • ల్పాయుష్కురాలా! యయో
ధ్య విలాతిం భరతాదులం గెడపి క • ల్పాంతాగ్ని నాఁ బేర్చి కా
ల్చి విదేహంబొగి నశ్రమంబున మృగా • క్షీ! నీదుప్రాణంబులన్
జవులూరన్ వెడలించి మ్రింగఁదగు నా • సామర్థ్యముం గానవో ?

చ॥ అని విలయాంతకాలు క్రియ • నగ్గి కరాచరి వంకఁజూచి నా
తను వశమందవేని యటఁ • గొందును ప్రాణము రెండు నెల్లలో
నను వెదియో మనంబున న • యంబునఁ జూడుము బుద్ధిమంతులో
ప్పిన నెఱిఁగాంచుమంచు జడి • పించి తలంచిన యట్లదల్చుచున్.

తే॥ దీనిఁ దర్జించి భర్జించి • తెలియఁబలికి, వశపఱచి తేకయున్న మీ • పాలి విషమ
యగుదుసని గంటువడు మొగ • మసుర రక్కసి, యింద్ర కసురరాజు తెలియఁ • జెప్పమరలె.

తే॥ పంక్తి ముఖుఁడేగ రాహువు • పట్టి విడుచు, చందమామను వెన్వెంట నె • మబ్బుగములు
క్రమ్మక్రియ దైత్యకాంతలు • క్రమ్మికొఱు, లన్నివిధములఁ దలఁచి న • ట్లఱచినారు.

తే॥ ముందునిలిచి చక్షువుల ని • ప్పుకలురాలఁ, జూఱచుఱం జూచి కుంతముల్ • శూలములను
చూపి చంపుఁడు చంపి న • జ్జగను కొంది, యొల్చి తినుఁడని కొందఱు దల్చినారు.

సీ॥ నలువ మనుమఁడు లోక • నాయకుఁడు సహస్ర, శాఖాన్వితంబగు • సామవేద
పారగుఁడును మహా • ప్రాజ్ఞుండు పాపముల్, తుదముట్టఁ ద్రోచిన • దొడ్డవాఁడు
నీకేమి చెడుగు గా • న్పించెనే రావణుఁ, డంచిత ప్రేమ చూ • పించుచుండఁ
బోఁగాలమే యిట్లు • పుండునఁ గోలఁ జొ, న్పించి నట్టులు ప్రలా • పించి తీవు

తే॥ అతని కోపాన లోకంబు • లంతరించు, నీవు నీవార లెల్లరు • నీల్గునట్టి
చెడుగు తెచ్చుకొంటి విఁ కేమి • చెప్పఁగలదు? సుదతి! యని కొందఱాడిరి • మృదులఫణితి.

చ॥ మెలఁతరో: పుట్టినింటికివి • మెట్టిన యింటికి నింగలంబవై
వలువ తనంబు మై నిటులు • పాడొనరింపఁగఁ బూనితేల? వి
విలుగుట నిశ్చయంబు కల • దెల్లను తేటపడంగ నింతగాఁ
బలికితి మిందుపై మనసు • వచ్చిన రీతిఁ జరింపుమా యనన్.

మ॥ వధియింపం గమకించు క్రూర దనుజ • వ్యాపారముల్ దేవతా
మథనున్ దానవ చక్రవర్తి నెదిరెన్ • మర్దింపుఁడీ చంపుఁడీ
కథ లింకేలని దూఱు వాక్యములు ర • క్షస్త్రీల యాకారముల్
విధిపోల్ దానవు నానతిం దలఁచి న • వ్వెన్ సీత నిర్విణ్ణయై.

ఉ॥ అయ్యెడ డాయుచుం ద్రిజట • యమ్మరో! స్వప్నఫలంబు పూర్వమే
నెయ్యము మీఱఁ దెల్పితిని • నీవిటు లంగద నొంది కేని యో
తొయ్యలి! నీస్థిరత్వ మొక • దోసము నొందెడి నూఱడిల్లు మం
చొయ్యన బల్కినంతఁ దగ • నుమ్మలికించుట మానె సీతయున్.

చ॥ ప్రభునకు జంకి యప్పగిదిఁ • బల్కుచుఁ గ్రౌర్యమె రూపునొందె నా
రభసము సేయువారు విప • రంబుగ రాఘవపత్ని సీతకున్
శుభముల నొప్పుగాఁ ద్రిజట • జోస్యమువోలె వచింపఁగాఁ గరం
బు భయము గొల్పుటన్ వదలి • పూనిన కోపము మాని రంతటన్.

## స్వప్నాప సందర్శన పటలము. (117)

చ॥ అవనిజఁ గాంచదగ్గ సమ • యం బిదె తర్జన భర్జనంబులన్
దవిలిన దైత్య కాంతలును • దాయరు నిద్రకుఁ గోరినంతనే
యెవరును నిద్రవోవని క • పీంద్రుఁడు మాయ ఘటించె దాన మృ
త్యువు తలదాఁకినట్లు మయి • దుం గొని యెల్లరు వ్రాలి రయ్యెడన్.

చ॥ చిరము తపించుచున్ వనరు • సీత యొకప్పుడు నిద్రవోవి యా
సుర వనితాలి నిద్రిలుట • చూచి మనోవ్యథ నోర్వలేనిదై
విరియు నుపాయమున్ దలఁచి • వే కనఁ జాలనిదై భయంబుచే
విరవిరవోయి క్రుంగి రఘు • వీరునిపైఁ గల ప్రేమఁ జింతిలున్.

మ॥ మనమా! దుర్విధి రామచంద్రు నిటకున్ • మన్నించి తో తెచ్చునే?
ఘన కోదండ గుణారవంబు గురు ని • ర్ఘాతంబు నా వచ్చునే?
తన కైదేని విమోచనంబు గలదే? తథ్యంబు వాక్రుచ్చుమా
యనుమానింపక చూచు నావలని భా • గ్యాధిక్య మెట్లున్నదో?

సీ॥ పెరఁగు నిశాకరా! వెల్లని వెన్నెలా!, నన్నేల యుడికించి • వలఁచువారు
తఱఁగని రాతిరీ! తగ్గని చీఁకటీ!, నామీఁద వలుగుట • న్యాయ మగునె?

విరతివలార! చిచ్చులు పేచు పడగాలి, తోడుగా సీరితిఁ దొలుతురేల?
సీరదశ్యాముని తో రహి విహరించు, మీరు నాస్థితి దెల్ప మేరగాదొ?
తే॥ ఎంచి రాఁడని యతని వే ధించువారె?, ఆమహాత్ముఁడు రాకుండఁ దని యుదార
కరణఁగూర్చి యేఁ బెక్కు దుఃఖములఁ కోర్చి, ప్రాణముల పీడకుంటి నీ వఱకుఁదమిని.
సీ॥ వలదు వృషకీర్త నములకు రాఁ దలంప, పకు కొన్ని నాళ్ళలో మరలి వత్తు
నిలుమంటి నిండిన నెసరిదియేని ని, న్నెదఁబాసి దిక్కు లే కిట్టు లలయు
ప్రాణంబులను బాధ పఱచుచు నూరకు, పేక్షించి యుండుట యాద్యగుణమె?
యింతేల సీతంద్రి చింతించి చింతించి, నీకొఱకయి మర ణించునట్లు
తే॥ లోకమెల్లను దుఃఖంబు లోన మునిఁగి, తుది గననిత్రోవ విలపింపం ద్రోచి యేగి
కానఁ జేరు కట్టఁడివి నన్ గాతువనుచు, విశ్వసించెడు నాకంటె వెడఁగు లేవరు?

ఉత్సా. మను సపేక్షగొన్న జీవ మా! వివేకమా! వెతన్
నను భజించి లజ్జలేక నలఁగుచున్న వారు నా
థుని మొగంబు గాంచు దనుకఁ దొలఁగ రేమి? నేను నిం
దను భరించి బ్రదుకు మీకుఁ దగవుగానె దోఁచెనే?

తే॥ పలువిధంబులుగా నిట్లు పలవరించి, ప్రాణ మొక్కటి కలదేని బాము గలదు
దాని వీడిన నన్నియుఁ దలఁగఁగలవు, కీర్తియును నిల్పు ననుచుఁ బం కేజనయన.
తే॥ చూడఁగలమను నాసచే సురిఁగి యోర్చి, ప్రాణముల తీపియెంచి కా పాడుచుంటిఁ
బలుదినంబు లిప్పటఁ జెఱ వద్ద నన్ను, ప్రేమఁ బావనుఁ డంగీక రించునేమి?
తే॥ పరులు వలచిన పిమ్మట బ్రతికియుండి, పలువిధంబుల ప్రల్లద ములను వినియు
బ్రతుకు నింతకాలంబు భా రముగఁ గడపు, కఠిన రాక్షసుల్ నాకంటెఁ గలరెయొరులు?

చ॥ జనముల నోళ్ళనుండి పలు చంపన మొందిన నింద మోచి కుం
దొనరని యాభిజాత్య మొఁగి యోరిమి లజ్జయు నౌర! యెంత సం
తనగఁ బొసంగి యున్నయవి! తక్కటి క్రొత్తడులందు నావలెన్
బెనిమిటి వీడి ప్రాణములఁ బ్రీతిని దాల్చిన వార లుందురే?

మ॥ పరవేశ్మంబునఁ జేరువాని మరలం బాటించి కైకొంట స
త్పురుషశ్రేష్ఠుల కర్హమే యనుచుఁ జే తో నాయకుం డిట్టు లొ
ప్పరికించెం గద యాతఁ దాఱడి పడన్ బన్నంబులం బొంది దు
ర్భర జీవంబుల నేను నిల్పుకొను చే భాగ్యంబు గైకొంటకో?

తే॥ ఎపుడు నిందలపాలైతి నపుడె జీవ, ములను విడువంగఁదగు నేను భువి జనములు
ప్రువ్వఁదిట్ట గౌరవమును పొలిసి పోవ, బ్రదికియుండుట స్వర్గంబు పడయుకొఱకె?

ఉ॥ ప్రేమములేని వీరులఁ బ విత్రుల చరిత్రుల రాఘవేంద్రులన్
భూమిని గొప్ప అట్టు వడిఁ బొందినఁ బొందెడుఁగాక దుస్తర

స్తోమములైన దుఃఖములఁ • జూడవి యున్నత వంశ్యవై గుణ
స్తోమము నొందు నా వనట • దీర్చునదెవ్వరు నేనుగాకిలన్ ?

క॥ కపట మృగము వెంబడిఁ బ్రా. ణపతిఁ దఱిమి మఱఁదిఁ దిట్టి • నాన చెడఁగ దై
త్య పురము చేరిన మనుగడ. విపులకు బరువగుచు వెతల • విత గాకున్నే ?

ఉ॥ వీరలు రామలక్ష్మణులు • వీకున నింద తొలంపఁగోరి యా
ర్వేరము పూని గెల్చిన స • రే మరణించిరయన్ సరే భువిన్
వేరిమినొందఁ యిల్వడిని • హీసరచేసి మెలంగు నేను దు
ర్భారముగా వహించు నడి • వారల నొందునె యెన్నఁదేనియున్ ?

తే॥ మానహాని గల్గెడుచోఁ జ • మర మృగంబు. వంటి గుణమబ్బు సత్పతి • వ్రతల యెదుట
మగనిఁబాసి మాయావుల • నగరమందు. బ్రదికెనంచు జగము నవ్వ • బ్రదుకఁదగునె.

మ॥ తత కల్యాణ గుణాలయుండు ఘనకో • దండంబు చేనంది దై
త్యతతిన్ మూలము ముట్టఁ ద్రుంచియును కా • రాగారముక్తన్ గలం
కిత నంటం దగదన్నచో నతని సం • దేహంబు వాయంగ నే
గతి మద్భూషణమౌ సతీత్వమును తా • ర్కాణింతు నప్పట్టునన్ ?

ఉ॥ కావునఁ జచ్చుటే తగిన • కార్యము వేఱొక దారిలేదు నా
చావునకున్ నిరోధలగు • చానలు మత్సుకృతంబుచేత ని
ద్రావతులైరి మంచి తఱి • దక్కెన దంచును మాధవీ లతా
ప్రావరణ స్థలంబునకు • రామ కళత్రము పోయె మెల్లనన్.

చ॥ హనుమయుఁ జూచె నామె హృద • యంబు నెఱింగె భయంబు పైకొనన్
జెనకి నిరోధముం జలుపఁ • జెందెను జంకు; జగన్నియంత రా
ముని పరవుండ సాహసము • పూనకు మమ్మరొ యంచు సీత వె
న్కనె చని యడ్డుగా నిలిచి • కై ముకుళించి వచించె నివ్విధిన్.

శా॥ అమ్మా! రాముఁడు పంప వచ్చితి ననం • ఖ్యాకుల్ కపుల్ నావలెన్
నెమ్మి న్నిన్ను గనంగఁ బెక్కెడలకున్ • వే బోయి యున్నారు లో
కమ్ముల్ రోసెడు వారు పూర్వకృత భా • గ్యప్రోన్నతింజేసి లం
కమ్మీపాదసరోజ దర్శనమునన్ • గణ్యుండనైతిన్ ధరన్.

శా॥ తల్లీ! యిచ్చటి యిట్టి నీ యునికి చిం • తా వ్యాకులుండైన శ్రీ
పుల్లాబ్జాక్షుఁ దెలుంగఁదమ్మ! నిజ మీ • భూలోక దైత్యాన్వయం
బెల్లం గూఁకటివేళ్ళతోఁ దునిసి పో • కీమాడ్కి నిల్చుండుటే
తెల్లంబై తగుసాక్ష్యమౌ మఱి నిబ • ద్దింపంగ వేఱేలొకో?

శా॥ సందేహింపకుమా సతీతిలకమా! • సర్వేశ్వరుం డంపుచోఁ
జందంబారఁ నమ్మఁ బంపిన యభి • జ్ఞానంబు పార్థాళియుం

దెందం బుల్లసిలంగ సుస్వరయుటి పా • టింపంగ హస్తాప్సృతా
స్పంద ప్రక్రియఁ బెల్లుమీఁ గెలియు మెం • చం బోదు వేతొండుగన్.

తే॥ ఇట్లు పలుకుచు వినతుఁడై • మెలఁగ నిలువఁ, గనుఁ గాంచి యాతండు ర • క్కసుఁడు గాఁడు
విదిత విషయుండు శుద్ధుండు • వినయుఁడు, వాని సంస్కృతి మగు మహా • ప్రాజ్ఞ వరుఁడు.

చ॥ దనుజుఁడె యోనుగాని మఱి • దైవతమే యగుఁగాక కానిచో
వనచరుఁడౌనుగా రీతిని • వల్ల సహాయమె వచ్చెఁగాక మే
లౌనదుసుగాన నా పతి సు • హోన్నత నామము నుచ్చరించి నా
మనము గరంచి దీపములు • మన్నె శుభోదయ మున్నె యింతకున్?

చ॥ అని తలపోసి సీత మది • లోఁపఁగఁ గాంచి కృపాణ మనంబు పొం
దిన దితఁ డెన్న వంచకుల • తీరగు పల్కులవాఁడు గాఁడు భా
వనములతోడి వాక్యముల • బాష్పము లుర్లఁ దపించుచున్న వాఁ
డని తలపోసి సీతెవద • పయ్య యెఱుంగ వచింపుమా యనెన్.

శా॥ దేవీవాక్యములోది హస్తములు నె • త్తింబాల్చి శ్రీరామ భూ
దేవేంద్రుండు వనంబులో నిను మహా • రిన్ గోయుచున్ వచ్చి భా
యావామాపరిపటి వానిచెంతలా • ధ్వజుండు సీతోషితు
గ్రీవాఖ్యునితో నొసల్పె దృఢమై • త్రిన్ ఋశ్యమూకాద్రిపై.

ఉ॥ ఆతనియన్న వాలి యొక • యప్పుడు రావణు చేపట్టుంగ ని
ర్భీతిని తోఁకఁ జుట్టికొని • పేఁకను దిక్కులఁ జుట్టిపెట్టి వి
ఖ్యాత యశుండు వేలుపుల • ప్రార్థన మందర మంథ దండముగా
భ్రాంతిగఁ బాల్పత్రాడుఁగఁ • బట్టి మథించిన దోర్బలిష్ఠుఁడున్.

ఉ॥ అంత బలాఢ్యు వాలి నొక • యమ్మునఁ గూలఁగనేసి రామభూ
కాంతుఁడు కీశరాజ్యము వి • కర్తన సూనునకుం బ్రియంబునన్
సంతసగాఁగ నిచ్చె నట • శ్వాసముఁ బోలిన వాఁడను వానికిన్
మంత్రినైనొదు మారుతకు • మారుఁడఁ బేరున నాంజనేయుఁడన్.

సీ॥ దెబ్బది వెల్లువల్ • దీకొని జగములఁ, జేతుల నెత్తెదు • చేవగలిగి
జలనిధి నవలీలఁ • గడచు సామర్థ్యంబు, వినువాఁకఁ బెరిఁగెడి • వీకుగలిగి
శ్రీరామభద్రుండు • చేయఁదలంచిన, సంజ్ఞలఁ గని యట్లు • జరపువార
లేడు జలధులందు • నేడు దీవులయందు, నాకంబునందును • నాగమందు

ఆ॥ కలయవెదకి నిన్ను • గాననిచో నంద, గోళములను దాఁటి • లీలఁబోయి
వెదకి చూచి రాఁగ • నెల గడువుంగొని, పోయి యున్నవారు • పూతచరిత!

తే॥ తమ్మితో సర్వజగములు • తనరు హేతు, వైన నాభికి వలమురి • యైన గంగ
సుడులు పొగడలు సుంతయు • సూటిగావ, యుపమ యెందుండి తెత్తు నీ • యుర్వియందు.

క॥ అతిసుందర మరకత వ, ర్వితమును మెనుసీయు మెదఁద • వక్షమ్మున ను
న్నతినుండ ఘన తపము సం, గతిఁ జేసిన లక్ష్మికంటెఁ • గలరే పుణ్యుల్ ?

తే॥ బంధురములు చెందమ్ములన్ • భ్రమను మునప, వట్రువలయి పీనములయి • వఱలు దీర్ఘ
బాహువులకు వేలుపు గౌరు • బలుపుచేయి, బోలు నొకకొంత పేటొందు • పుడమిలేదు.

ఉ॥ పచ్చని క్రింది పత్రములు • భాసిల నెట్టని పంకజాతముల్
విచ్చనరీతి నొప్పు చెయి • వ్రేళుల యందలి గోళ్లు దుష్ట సం
పచ్చరితున్ † సురారివిభు • వజ్ర శరీరము నెట్లు తుండ్లుగా
వ్రచ్చెనొ యన్న సందియముఁ • బాపఁగఁజాలుఁ బతివ్రతామణీ !

ఉ॥ గట్టివికావు కాంతులును • గల్గవు సంగర జైత్రలక్ష్మిఁ జే
పట్టవు మేరుకార్ముకము • భగ్నముగా గొనయమ్ము నీద్వపున్
విట్ట యశంబు నొందవు జ • నింపవు చెందు సమానరీతులన్
గట్టల నెట్లు పోల్పఁదగుఁ • గాంతుని బాహు విలాస లీలకున్ ?

తే॥ శేష శయను నెడమచేతి • చింద మొందు, పొదలఁగదలి శంఖమ్ము లేఁ • బోఁకమ్రాఁకుఁ
గంఠమున కుపమించు వెం • గలుల పలుకు, లియ్యకొనఁగ మావలనఁ గా • దింత యేని.

క॥ శ్రీ రాము నెమ్మొగముతో, నీరజములఁ బోల్తమన్న • నేత్రంబులకున్
మేరుపమ దేనిఁ జూపుదు, నీరజుఁడును దఱుఁగుచుండు • నెటి నెలనెలకున్.

చ॥ ఇనకుల వార్ధి చంద్రముని • యెట్టని నోటికి నీరుద్రావి వి
చ్చిన యెఱదమ్మిఁ బోల్ప నది • సిగ్గిలు దేవ సుధాభమైన చ
ల్లని నుడిలేని దంత విక • శంబగు హాసములేగి విద్రుమం
బును గొని పల్కుచో జగము • మూర్ఛత నావయి మోపకుండునే ?

సీ॥ వెలయ మొలచు ధర్మ • బీజాంకురంబులా?, యమృతబిందు శ్రేణి • యా ? వచింప
సత్య భూమీజ ని • శ్చల కోరకంబులా?, యమృతాంశు శకల సం • ఘములు ? తలఁప
ముక్తైంబులా ? తక్క • మొల్ల మున్నగునవా?, ఎదియని తెలుపుదు • రదనపంక్తి
నుక్షేత్రమునఁ బుట్టు • సురరాజ మణికాంతి, మరకతమును పోలు • మావి చిగురు

తే॥ కొనరి కొనరి పేఁడఁగఁజాలు • కొమరుకాంతి, గలుగు రాము మైచాయకుఁ • గలదె సవతు
తొదరియింద్రగోపముఁ బట్టు • తొండమైన, నాసికకుఁ బోల్పఁ దలఁచుట • నయముకాదు.

ఉ॥ దండకలో ఖరాదు లెదఁ • దన్ వదఁకంగఁ బిశాచపంక్తి కో
దండము వేలుపుల్ మునులు • ధర్మము వేదము లెల్ల విద్విష

---

† హిరణ్య కశిపుని

త్తండము దుంపతోఁ జెగేఁ గ • దాయని మోదముతొ నటింపఁగాఁ
గొండొక వ్రాలు కన్బొమల • కున్ దగుపోలిక నీవుఁగాంతువే ?

తే॥ అష్టమీందుండు సహజ చి • హ్నంబు వృద్ధి, తఱుఁగుటలు పుట్టు క్రుంకుటల్ • తొఱఁగునేవి
చీకటన్ నిశ్చలుండయి • చెలఁగునేని. రాము వెన్నొసటికి సాటి • రాఁగలండు.

తే॥ పొదవులై నెఱులై నీల • ములయి విరిసి. కొనలు వంకరలై వ్రాలి • కుసుమములను
తావిపొగయుఁ గోరకపుట్టు • తావిపీచు. కురులు జడలయ్యె మొగుళుల • క్రొమ్మరుగలవె ?

ఉ॥ లచ్చియు భూమిదేవియుఁ ద • లంపునఁ బొందఁగఁ దగ్గయట్లుగా
నిచ్చ నిరేడు దీవుల • వహింపుమ యన్నపుడున్ విలాతి లే
దచ్చుగఁ గానకేగుమని • యన్నపుడున్ దడఁబాటులేని యా
క్రచ్ఛుఖ పోక గిబ్బయెడఁ • గద్దన వారణ మేద్వకుండునే ?

తే॥ ఇట్లు పలుకు పల్కులు విని • యింగలమున. మైన మట్టుల కరఁగుచు • మఱుఁగుచుండు
సీతఁగని తల్లి! నీపతి • చెప్పినట్టి. యానవాళ్లను వినుమని • యనియె నిట్లు.

చ॥ అడవుల త్రోవలందు నడ • యాడుట కష్టతమంబు పట్టుగాఁ
గడపు దినంబు లింద యెన • కంబుగఁ దల్లుల కెల్లసేవలన్
నడపుచునుండు మన్న తరు • ణంబున వాడిన మేనితో నాకే
యుడిచిన చేలతోఁ గినుక • యొప్పఁ గుజంగట నిల్చు టాడుమా.

చ॥ ధరణిపునాజ్ఞ నౌదలను • దాలిచి పేరిమి సమ్మతించి రా
జ్యరమను వీడి యేగు సమ • యంబున జానకి కోటవాకిటన్
దఱియఁ! మున్నె యింత కదు • దవ్వొకొ కాన! మఱెంత దూర మం
చరుదుగఁ బ్రశ్నసేయుటయు • నాడటఁ దెల్పుదుగాక మారుతీ!

ఉ॥ నావిభు నూఱడింపు వచ • నంబులఁ దేఱితి మానసంబు నం
దేవగయైన చింత వహి • యింపను చిల్కల గోరువంకలన్
నావలెఁ జూచు కొండనుచు • నాచెలియంద్రకుఁ బ్రేమతో సుమం
త్రా! వచియింపుమంచుఁ దగ • నాడిన పల్కులు జ్ఞప్తి సేయుమా.

చ॥ మఱిమఱి పల్కనేల ? హను • మా! యిది యిమ్మ మదీయనామ మ
చ్చెరువుగ హీరరత్నములఁ • జెక్కిన యుంగర మందు సద్గుణో
త్తరుఁడు ప్రియంబుతో నొసఁగెఁ • దల్లిరొ! కైకొను మంచుఁ జూపె వా
నరపరుఁ డంత మైథిలియు • నర్మిలిమైఁ గనె నంగుళీయమున్.

## సీత యుంగరముం గని యానందించుట

సీ॥ అర్ధేందుఫాల యా • యంగుళీయముఁ గాంచి. పొందిన స్థితి దేనఁ • బోల్పనగును ?
చచ్చిన వారలు • జన్మ సాఫల్యంబు. గాంచిన సంతృప్తిఁ • గాంచె ననియొ ?

మఱచిన వారలు • మఱచిన సంగతి, సభ జ్ఞప్తిగొని పొందు • చంద మనియొ ?
విడిచి యేగిన జీవ • వితతి మరలి వచ్చి, పొందిఁ జేరిన నొందు • నంద మనియొ ;

తే॥ పేదు మణిఁగన్న సర్వంబు • పేఁర సనియొ ?, తొలఁగు నిధి నొందు మానవు • తోయమనియొ ?
లేక లేక బిడ్డను గన్న • పిలయనియొ పోయి యేడ్చి కన్నులఁగన్న • పోల్కి యనియొ

తే॥ అందికొనియెను తొమ్మన • సలముకొనియె, నెత్తిని ధరించెఁ గన్నుల • నొత్తికొనియె
బాహు లబ్బెను రృశియించె • బాళి గొనియెఁ, గుండె నిట్టూర్చెఁ దెలిసి వా • క్రువ్వఁదరమె ?

తే॥ మూరుకొను నక్కసం జేర్చు • మొగిని తదపు, సశ్రువులఁ దుడ్చుకొని యట్టె • యదరిచూచుఁ
బలుక నుంకించు నేమియుఁ • బలుకకుండు, మేసు పొంగార దానిని • మ్రింగఁజూచు.

క॥ మించుం బోలిన మొదలుసఁ, గాంచన సంకాశ రుచులు • గాన్పించె నటన్
మించిన రాముని యుంగరం, మంచితమగు స్పర్శ వేది • యగునేమొ కదా ;

తే॥ క్షుధితునకు మించి భోజ్యంబు • చొప్పుదోఁచె, గేస్తునకు మంచి విందబ్బు • క్రియఁ దలిర్చె
మరలఁ బ్రాణంబు రప్పించు • మందుఁ బోలెఁ, బడఁతి కారామభద్రుని • భద్రముద్ర.

తే॥ జీవముల నెమ్మదింజెంది • చెలఁగుసుదతి, కన్నుల ముసశ్రువులు తొమ్మఁ • గడుగుచుండఁ
బ్రాణ మొసఁగితి పుత్త్ర ? యనుచు మరల, ననియె నిట్టులు మృదుమధు • రాక్షరముల

చ॥ జగముల సృష్టి సేయు నల • స్రష్టకుఁ గారకుఁడైన రాము దూ
తగఁ జనుదెంచి జీవములఁ • దద్దయు నిల్కడ సేయు నీకుఁ బొం
దుగ నొసరించు ప్రత్యుపకృ • తు ల్గలవే తలిసంద్రు లట్టి పు
ణ్యగుణ ! కృపానిధీ ! యిహప • రాదిక సౌఖ్యము లిచ్చి తయ్యెడన్.

ఉ॥ దిక్కొకయింత లేని బలు • దీనకు దిక్కయి దుఃఖ మూర్చి యి
క్కెక్కుడు మోదమిచ్చిన క • పీంద్ర ! చిరాయువు నొందుమయ్య ! యేఁ
జొక్కపు మానసంబు గల • జోటినయేని యజాండ గోళముల్
స్రుక్కెడు వేళ నేఁటివలె • శోభిలు చుండువు గాక మారుతీ !

ఉ॥ ఎచ్చటనున్న వాఁడినకు • లేశుఁడు తమ్మునితోడ నిన్ను దా
నెచ్చటఁ గన్నవాఁ డరిగ • జేంద్ర మృగేంద్రున కేరు దెల్పి రే
నిచ్చట నుక్కి నాకుఁ దెఱఁ • గేర్పడఁ బల్కఁగదయ్య పావనీ !
సచ్చరితాగ్రగణ్య ! యన • జానకికిం గపివర్యుఁ డిట్లనున్

శా॥ మారీచుండు దశాస్య ప్రేరణమునన్ • మాయామృగాకారుఁడై
శ్రీరాము న్వడిగొంచు దూర మరుగన్ • జింతించి రాముం దొకే

క్రూరాస్త్రంబున సేయ వాఁడు నిను సం • క్షోభింపఁ జేయంగ నా
ర్తారావంబు చెలఁగ మొఱ్ఱయిడె న • ట్లమ్మా! జగత్పావనీ!

శా॥ ఆకంఠధ్వని లక్ష్మణుండు విని స • త్యం బెంచి రాకుంటకై
కాకుత్స్థుండు శరాసనోగ్రరవముం • గావించె నట్లయ్యు న
స్తోకంబౌ విధియోగమే గెలిచె నెం • దుం గల్ల కంఠస్వరం
బేకాకొందదొ యేమొ? త్రోవ ననుజున్ • వీక్షించెఁ దా వచ్చుచున్.

సీ॥ కాంచి లక్ష్మణు ముఖా • కారచిహ్నంబుం, చే లోని తలఁ పవ • లీల నెఱిఁగి
జరిగిన వృత్తంబు • సౌమిత్రిచే నంత, నాలించి పడిఁ బర్ణ • శాలఁ జేరి
నీ సౌరు మేను గా • న్పింపమి జీవముల్, చెదరిన గతి సొమ్మ • సిల్లె విమల
కరుణామయుండు దుఃఖంబొంద • వేతొక్క, కథ మింతకంటెను • గలదెభువిని

తే॥ ఆవల నేనును వెదకి ప్ర • త్యక్షముగను, రమణిఁ గాంచితి నీకు భ • ద్రమగుఁగాక
ప్రభుఁడు రాముఁడు జీవముల్ • పాయలేఁడు, కారణంబును నీవును • గాంచలేవె?

ఉ॥ నిక్కపుఁ బ్రాణమై చెలఁగు • నీవు తొలంగ ససత్య జీవముల్
చెక్కినయట్లు నిల్చు రఘు • శేఖరు చిత్తమునంద యిప్పుడున్
జెక్కు చెమర్ప కుంటి వికఁ • జేటొనఁగూడుట యెట్లు? నీవు ని
ట్లిక్కడనుండ నాతఁ డట? • నేగతి నేయవి వీడు నమ్మరో!

తే॥ అట్టి రాముఁడు కొండలు • నడవు లెల్ల, వెదక యంత్రప్రతిమ పోలె • వెడలి చనుచు
జగము కీర్తింపఁ దనజీవ • సమితి వీడఁ, గాచియున్న జటాయువుఁ • గాంచెఁ ద్రోవ

సీ॥ అతని మేనిం గాంచి • యడలుచుఁ దండ్రి! నీ, కిట్టి దుస్థితి యెట్లు • లెనసె ననుడు
వినుము రావణుఁడు దొంగ • సిమతిఁ దెచ్చుట తెల్పి, చున్నంతలో నల్క • మిన్నుముట్ట
జగములనెల్ల ము • చ్చరహ్నికీలలఁ, బూది గావింతు నం • చూఁది నిలిచి
కోదండమును గాంచు • కొమరు జటాయువు, వీక్షించి యొక యుపా • వేకి చెడుగు

తే॥ సేయ జగముల నాశంబు • సేయఁదగునె?, శాంతి నొందుము తొందర • చనదు తండ్రి!
ధర్మచరితుఁడ వని సమా • ధాన పఱుప, రామచంద్రుండు కోపభా • రంబు వీడి.

ఉ॥ ఎచ్చట నుండువాఁడు? మఱి • యే భువనంబున నిల్చువాఁడు? వాఁ
డెచ్చటి కేగినాఁడు? దను • జేంద్రుఁడు పోయిన దారి యేది? నా
కచ్చు పడంగ దెల్పు జన • కా! యన నాతఁడు చెప్పబూని నో
ర్విచ్చుడుఁ బ్రాణముల్ నెగసె • వీరవరేణ్యుఁడు నంది కుందఁగన్.

తరల. తలరి మిక్కిలి రామచంద్రుఁడు • తండ్రికిం దగు సంత్యక
ర్మలు సురావళియున్ భ్రమింపఁ గ్ర • మంబుగా నెఱపేర్చి మా
ఖలుని రోయుచుఁ బర్వతంబులు • కానలున్ భ్రమియించుచున్
దెలివినొందక నిన్ను గానమి • దీనతన్ గడియించుచున్.

తే॥ పోవు క్రోవలు కన్నీట • బుడదగాఁగ, వహ్ని మైనంబు కరఁగిన • వహిని మనసు
కరఁగ రాముఁడు మఱిచెడి • కలవరించి, పలవరించుచు మిక్కిలి • పనవి పనవి.

తే॥ జనులలోఁ గన్నెముల దాఁటు • జాణలెవరు ? పీనలక్ష్మి వసించెడు • వినుతభుజుఁడు
మతి కలంగ సర్వంబు సు • మ్మోతను దాల్చ. చిత్తజాతవైరిపలె ను • న్మత్తుఁడయ్యె.

ఉ॥ నీ వనమందు మాపటను • నిక్కముగా మునిఁగెన్ మదీయ రా
జీవదళాక్షి కల్లయని • చెప్పెదవే ? మదిరాక్షి రోసి నా
కేవగనైన నీవలయు • నీయక తక్కితివేని నీవు గో
దావరి! నిప్పవై మఱిఁగి • తప్పక మాఁడెద వీక్షణంబునన్.

ఉ॥ పర్వతరాజమా! వదిసి • బాలకురంగమనేత్ర నేత్ర సం
పర్వముగాఁగఁ జూపు మటు • పాయక చూపవయేని నీవృథా
గర్వము సర్వముం జెడఁగఁ • గాలిచి బూదియొనర్ప మన్మథా
ఖర్వ శరంబొకండె యొకి • కంబుగఁ జాలుఁ జెడంగఁ జూతువే ?

ఉ॥ బంగరులేడి మాయలను • పన్నుటచే హరిణాక్షి నేఁడు నా
కుం గనరాక పోయినది • క్రూరకురంగములార! నాదు త
న్వంగిని చూపరేని కరి • నాత్ముఁడనై ఘుము దుంపతోడఁ గ్రుం
గం గసిదీఱఁ జంపెద సు • కర్మము గాకది ఘోరకర్మమే ?

తే॥ డెంద మగల సిరికిఁ దాఁ • గుందికుంది. రాఘవుఁడు వాడుచుండ ని • ర్మలమనస్కు
తమ్ము చల్లని వాక్సుధా • ధారచేతఁ, జిత్త మొక్కింత తేటయై • చింతవీడె.

తే॥ కీశకులశేఖరుండు సు • గ్రీవుఁ డుండు. ఋశ్యమూకంబు చేరిరి • నృపకుమారు
లచట నెల్లప్రాణుల మనో • వ్యథ తొలంగ, మిత్ర లకుమిత్ర పుత్రుల • మైత్రికుదిరె.

సీ॥ శ్రుతులచే జ్ఞానవి • శ్రుతులచే నిజరూప, మెఱుఁగరాకుండు లో • కేశ్వరుండు
తనకుఁ గల్గిన దుఃఖ • మునకు హేతువును మా, యెవలా పుండ్లుగఁ జెప్పి • యుడిలగొనఁగ
సీతొడవులఁ జూప • నాతండు మూర్ఛిల్లి, మూవచనంబుల • మరలఁ దెలిసి
యంసి సీతొడవుల • నప్పుతంబు చల్లిన, నాఁటి పెనునొవ్వి • నందినాఁడు

తే॥ అమనోవ్యథ మున్నె తా • నందియున్న, నపుడు మఱిమఱి క్రొత్తలై • యడరె మేము
మది సమాశ్వాస పడఁజూప • మఱియుఁ బెరిఁగె, నేమిచెప్పఁదు రాముని • యెడఁద వనట.

సీ॥ ఆపర్వతంబున • కావలిగిరి నున్న, వాఁడు శైలనిభుండు • వాలి యనెడు
కపిరాజు నీదుఃఖ • తతికిఁ గారకుడఁగు, పంక్తికంఠుని దన • వాలమందు
ప్రేలాడఁగాఁ జుట్టి • పృథివీధరంబుల, వననిధులం దాఁటి • వచ్చినతఁడు
వాని నొక్క శరాన • వడిఁ గూలఁగా నేసి, తన మిత్రుఁడగు మిత్ర • తనయునకును

తే॥ రాజ్య మొసఁగి సేనలఁ గూడి • రాఁగఁ బనిచి, వచ్చు దాఁక నాలుగు నెలల్ • వానలేగ
మాల్యవంతంబునందు ల • క్ష్మణునితోడ, జరిపె నాలుగు యుగములు • జరపులీల.

తే॥ కపిబలంబు చేరినది ది • క్తతులు వెనుకఁ, బడఁగ వెదకంగ వారలఁ • బంపి నన్ను
దక్షిణంబున కంపె నా • తరలి రాక, కిదియ హేతువు జనక రా • జేంద్రతనయ!

చ॥ చనవున నిట్లు రామ నృప • చంద్రుని తీరు మరుత్సుతుండు ప
ల్కఁగ విని భర్తృ దుఃఖ మగ • లింపఁగ డెందము నొచ్చియున్ ముదం
బును కుతుకంబు నొక్కెడనఁ • బొందుచు మూలగయుం గరంగ నా
హనుమని నీ యపారమగు • నంబుధి నెట్లు తరించి తీవనన్.

మ॥ జననీ! రామ పవిత్ర పాద సరసీ • జాతంబు లుల్లంబునం
దనిశంబున్ జపియించు ధీవరులు మా • యా సాగరంబుం దరిం
చిన చందంబున మీకృపా మహిమచేఁ • జేకూరు చేవన్ దరిం
చిన వాఁడీ కపియన్న శంకయె మదిం • జెందంగఁ జింతించుచున్.

ఉ॥ కదుకొను నాణిము త్తెముల • కంటెను వెన్నెలకంటె మిన్నయౌ
రదనరుచుల్ చెలంగిన ధ • రాసుత మారుతిఁ గాంచి నాయనా!
పొదఁడవు నీవు దొడ్డది స • ముద్రము దాఁటఁగ నెట్టులయ్యె నె
మ్మదిని తపోబలంబుననొ • మంత్రబలంబుననో వచింపుమా.

## హనుమ స్వస్వరూపముం జూపుట

తే॥ అనుడుఁ గేల్మోడ్చి హనుమంతుఁ • డంబరంబు దాఁకఁ బెరిఁగి మజీముఁ బోవఁ • దల దగుబునో
యను భయంబున వినతుఁడై • తనదు రూపు తోఁపఁ జూపె జానకి శంక • తొలఁగి పడవ.

తే॥ పొగడఁదగు గురుత్వము పంచ • భూతములకుఁ
గలదొ? కపి వరేణ్యునియందు • గలదొ? యెందు
గాదు? నిజము నూహింపంగఁ • గలమె? యనుచు
ద్రోపులాడంగఁ దగిన దా • రూప మహిమ.

క॥ పెరిఁగిన బంగరు గిరిఁ గల, తరువుల ఖద్యోత వితతి • తనరె నసఁగ వా
నరవరు రోమంబులలో, గురుతరగతి మెఱసె ఋక్ష • కూటము వరయన్.

క॥ కనులను జ్ఞానంబును కడ, చిన రూపము గొన్న హనుమ • చెవి కుండలముల్
ఘనముగ గ్రహముల వెలిఁగెడి, దినకర శశధరుల తోడ • దీకొని నిలిచెన్.

చ॥ జగములఁ గొల్చి నిల్చిన భు • జంగమ తల్పుఁడె యొప్పుతోడఁ గి
డగు నొక వానరంబని య • నాదరముం బొనరింపరాని య
క్షగ శిఖరాణిఁ బోలు కపి • చంద్రుని యున్నతిఁ గాంచెనేని లో
కగురుత యొక్కవానికె స్వ • కంబుగఁ గాదని యెంచి సిగ్గిలున్.

తే॥ అన్నిలోకజాలములందు • నన్నిదిశల, నన్ని ప్రాణులు గాంచె నా • హనుమ డపుడు
పొనఁగఁ బైలోకములనున్న • పుణ్యగుణుల, నందఱను దన కన్నుల • నతఁడు గాంచె.

తే॥ పరవి పెరిగిన మారుతి • పాదయుగళి, నణఁపఁగా లంక సంభ్రమంబు • నందు మునిగెఁ
గొరలి ప్రబ్బెఁ దెల్లని యంచల్ • భూమిమీఁద, మీఁద తిరలెఁ మెఱయుచు • మిట్టఁబడియె.

చ॥ గరితలమిన్నయైన యన • ని ప్రభుపుత్త్రి వాయుపుత్త్రుఁ డ
చ్చరణ సరోజ యుగ్మమును • సైతము గానఁగలేక సోఁడ లీ
లిఁ గియని యుత్సహించి సుబ • లీ! భవదీయ మహాస్వరూప బం
ధురతను చూడఁగా బడియు • దున్ వడిగా నుపసంహరింపుమా.

తే॥ అయ్య! నీయనంతాకృతి • నరయఁదగిన, సత్త్వమొందదు జగ మున • సంహరింపు
మనుచు జానకి విభు పరి • ష్వంగ సౌఖ్య, నమ ముదము గాంచి పరవశ • త్వము భజించె.

తే॥ అంతఁ జిత్తమనుచు సమీ • రాత్మజుండు, వెంటనే చూడదగు నొక • పిన్నరూపు
దాల్చి వినతుఁడై యాయమ • దాసి నిలువ, నిట్టులను మణి దీపంబు • నెనయు సీత.

సీ॥ పవన జవన వీర! భువిఁ గులాద్రులతోడఁ. బ్రిదులక తలను ధ • రించి తన్న
లీల స్వర్గముఁ బెర • లించి యెత్తితివన్న. లోకంబు లన్నింటి • జోక మోచు
శేషుని దాపలి • చేల నీడ్చితివన్న. పనధిని నదచియే • వచ్చితన్న
భవదీయ మహిమకు • ఫలవంతమగు గొప్ప, పనికాదు లజ్జనే • పాదుకొలుపు

తే॥ నీజలధి దాఁటి వచ్చుట • యేమిగొప్ప. విభుని కరుణయు యశమును • పెక్కు కల్ప
ములు తిరంబుగ నెలకొనఁ • బూనిసేయ. నీవ యొక్కండవై యుంటి • నియతచరిత.

సీ॥ ఈలంక నీపేర్మి • కేదు మున్నిశల. కవల నుండమియుఁ ద • క్కువయె గాదె
ఇట్టిదే విజ్ఞాన • మిట్టిదే నీమాన, మిట్టి దేశమము ని • ట్టిదియె వమము
కార్యంబు నిట్టిదే • వీర్యంబు నిట్టిదే, తెల్వి యిట్టిదె యిట్లె • తెల్వి ఫలము
తలఁపు నిట్టిదె నీతి • మెలపు నిట్టిదె మతి, గెలుపు నిట్టిదె యిట్లె • కీర్తిగరిమ

తే॥ ఎల్ల సుగుణముల్ నీకిట్టి • వే యటన్న. నింక లోకపాలకులయి • యెనఁగుచుండు
నజహరామరాదులు సద్గు • ణాళియందు. హీనులే యగుదురు కదా • మాననీయ!

సీ॥ మెఱుపుకోఁజూ మేర • మీఱిన బలమొంది, కర్బురావళి వృద్ధిఁ • గాంచినప్పు
డమ్మహాపీఠన • కనుజుఁడొక్కఁడు తక్కఁ. దోడు లేదను చింతఁ • దోఁగుచుండు
పీడిత నాశంక • పీచెఁ బ్రాణాపద, కొదువలేదని తృప్తి • పొదలె నిపుడు
నీయట్టిమహిమాఢ్యు • సాయమబ్బినమీఁద, నీరక్కసులు లంక • యేమియగునొ?

తే॥ ఇంక నేమరలించిన • నెగ్గులేదు, నన్ను నలఁచిన రాక్షసా • న్వయము తూలె
నేఁడె వెలసిపె సాధుని • నేఁడె గంటి, యశమె గాక నిందయు నాకు • నబ్బునేమి?

సీ॥ అనియిట్టు లామోద • మున నాడు జానకి. పాదంబులకు మ్రొక్కి • పావనియను
నమ్మ! రాముని దాసు • లగు కపివర్యులు. కడలి యిసుక కంటెఁ • గలరు హెచ్చు

వారలలో నొక్క • వనచరుండను భవ, దాజ్ఞలఁ దలమోచు • నడియఁదేను
ఏడుపదుల వెల్వ • లెట్టిపో గది సము, ద్రంబందు నీరు మొ • త్తమ్ము నొక్క

తే॥ చేతఁ ద్రావంగఁ జాలునే • సేనకెల్ల, రాక్షసుల లంక కానంగ • రాకపోవు
కతన నింతవఱకు నిల్వఁ • గలిగెఁగాక, తెలియు పిమ్మట నింకను • నిలుచు నేమి ?

సీ॥ కమలాప్త పుత్త్రుఁడం • గదుఁడు మైందుఁడు ద్వివి, దుఁడు నీలుఁడునుకుము • దుండు నలుఁడు
వృషభుండు శంఖుండు • వినతుండు గవయుండు, శరభుండు ధూమ్రుండు • జాంబవంతుఁ
డుగ్రుండు కుముదాక్షుఁ • డురుబలుఁడగు శత, బలి గవయాక్షుండు • పనస కాంబ
దధిముఖ గంధమా • దనులు దుర్మర్షణా, దులు సైన్యనాయకుల్ • దుర్జయులును

తే॥ రామ బాణము వలెనె కార్యంబు గొంద్రు, జగములెల్ల నొక్కటిచేయఁ • జాలువారు
వారి లెక్కింప దానవ • వర్గమెల్ల, సలుగకైనను జాలదు • జనని ! నిజము.

## 6. చూడామణీ పటలము. (89)

తే॥ దుఃఖితయు రాము ప్రాణముల్ • దొరయునదియు, శ్రీసమానయు నగుసీతఁ • జెఱ వెడల్చి
కొంచుఁబోవుటే తగుకజ్జ • మంచుఁ దలఁచె, నట్టి హనుమ కుపమ సెప్ప • నైతియగునె?

తే॥ బంటు వార్తను వినుము కో • పంబు వలదు, రావణుని గెల్చు టరిది కా • ర్యంబుగాదు
నిన్ను నీపతి కడఁజేర్చి • నెమ్మిమీఱ, మీపదంబుల భజియింతు • నేపు గనుము.

చ॥ అతి మృదురోమముల్ గల మ • దంసముపై వసియించి నెమ్మదిన్
వెతవిడి నిద్రపొ మ్మనిల • వేగముతో నెడ నిల్వకేగి నీ
పతి గల మాల్యవంతమునఁ • బన్నిన ప్రాలెద నీకు భద్ర మ
బ్బుత భవదీయ సేవకుని • బోఁడిమిఁగాంచుము తల్లి ! లెమ్మికన్

ఉ॥ దైత్యులు కాంచి యడ్డుపడఁ • దప్పను కార్యమె యందువేమొ సం
స్తుత్య బలంబుతో నరుల • దోర్బలముల్ నశియింపఁ గూల్చి నా
యత్యురుకోప మార్చికొని • యప్పుడ కేటఁదనంబు గాంతు సం
ప్రత్యయ మంచు మమ్మరొ ! భ • వత్ప్రితి గాంచియు సైపనేర్తునే ?

చ॥ పెలుచన లంకతోడఁగొని • వే చనుమన్నను కెల్గగించి యేఁ
జాలుకన నొక్కచేతఁ గొని • చుట్టిన దైత్యుల నొక్కచేతఁ బెన్
జలమున నుగ్గుచేసి రఘు • నాయకు పాదసరోజ సన్నిధిం
దొలఁకక డించువాఁడ నిది • దొడ్డగు కార్యము కాదు చేయఁగన్.

చ॥ మరలుచు లోకమోహనుని • మందట మీయమృతంబుఁ బోలు సుం
దరి దితిజేంద్రుపైచు చెఱ • దప్పు నుపాయము లేక మిక్కిలిం

బరిపరి రీతులన్ మనసు • మూఁడఁ దపించుచు నున్నదన్న నా
వెరవరి దౌత్యమేమి యొన • వించినదో ? వచియింపు మమ్మరో!

ఉ॥ గాయములేని పీనభుజ • కాండముతో నటకేగి శాత్రవ
స్తోయ బలంబు నేఁ బ్రబలి చెప్పఁగ నెట్లగుఁ ? దోడికొంచునే
నాయమఁ దేరలే దకట! ప్రాణము మాత్రము గాచుకొంటి మీ
నాయికఁ గాంచి పల్కు జత • నం బొనఁ గూడద యంచునా? యటన్.

ఉ॥ రక్షితసాలమైన నగ • రంబును గాలిచి బూదిచేసి యీ
రాక్షస వర్గముం బద క • రంబులతో నలిగాఁగఁ ద్రొక్కి నే
యీ క్షణమందె సర్వము న • దీశుని పొట్టను పెట్టి రావణుం
దక్షతఁ జంపుమన్న వడిఁ • ద్రమ్మెద నాజ్ఞ యొసంగు మమ్మరో!

ఉ॥ శ్రీరఘు వీర శేఖరుఁడు • చెల్వగ నిప్పుడె నిన్ను గూడి మున్
గూరిన తాపమెల్ల విడి • కోరికతోడఁ బ్రసన్న విస్ఫుర
చ్ఛ్రీమతోఁ జెలంగి మఱి • చెన్నటి దానవ వంశమెల్లఁ బో
కారిచి లోకజాలముల • కష్టములం దొలఁగించు టొప్పగున్.

ఉ॥ ఇందుల కొక్కయడ్డు వచ • యింపఁగఁ దగ్గది లేద యట్టి భా
గ్యందిర నాకు లభ్యమగు • నిమ్ముల నీవు దలంచితేని రా
ముం దగఁ జేరి దుఃఖములఁ • బోకడపెట్టి సుఖింతువమ్మ! న
న్నుం దయఁ జూచి మూఁపుపయి • నూల్కొన నెక్కుమ యంచు మ్రొక్కినన్.

తే॥ పూన్కి యుక్తవాక్యంబులఁ • బొసఁగఁ బలికి, తల్లికడ నిల్చి లేఁగనాఁ • దనరి నిలుచు
హనుమఁ గాంచి నిర్దుష్ట వా • క్యముల మృదుల, ఫక్కి నిట్లనిపలికె నా • పద్మగంధి.

శా॥ అన్నా! నీకిది దుష్కరంబగునె ? యో • గ్యప్రౌఢి నీశక్తికి
మన్నింపందగు భంగి నెంచితివి సా • మర్థ్యంబు మెచ్చయ్యె నీ
కన్నన్ దిక్కట లేరు లేరయిన ము • గ్ధాత్వంబుచే నిట్టి నీ
పన్నాగం బసమంజసం బనుచుఁదె • ల్పం బూనితిన్ మారుతీ!

ఉ॥ అంబుధి మధ్యమందు దను • జావళి క్రన్ననఁ జుట్టు ముట్టి క్రూ
రంబుగ నస్త్రశస్త్రముల • రాయిడి చేసిన వారితోడ ఘో
రంబుగఁ బోరెదో ? మఱియు • రక్షణచేసెదొ నన్ను? రెండు నం
తంబునఁ గష్టమే యొసఁగఁ • దప్పును కర్జ మొకండ పొటచే.

చ॥ మఱియొకమాట రాఘవు న • మంచిత కార్ముకవిద్య యాదికం
బొరయును చాప మాఱడిని • పొందును పక్వపు బోగిరంబుఁ గు
ర్కుమములు దొఁగిలించుకొనఁ • గోరిన రీతిగ నొప్పు గార్యమున్
వెరవరియైన నీవును ప • విత్ర మనంబున నిట్టు లెంతువే ?

శా॥ ఘోరా యోధసమందు రాఘవు మహా • కోదండ పాండిత్య మే
పారన్ వేల్పులు చూచుచుండ, నను చా • ర్య ప్రౌఢి సాధింపుచుం
గారాగారమునందు కూర్చిన మహా • కష్టాత్మ కన్నుల్ సమి
ద్ధూరంగంబునఁ గాకముల్ పొడువ సం • తోషించి వీక్షించెదన్.

ఉ॥ రాముఁడు లక్ష్మణుండును దు • రంబునఁ గార్ముక హస్తులౌచు స్వ
స్థేమముఁ జూపి దైత్యుల వ • ధింపఁగ ముక్కిడిఁ బోలి రాక్షస
స్వామిను లెల్ల దైన్య విధ • వాత్వము లొందినఁగాక నాయెడన్
రామత నంబు నాసయును ? రాజిలునే? గురుతన్ గడించునే ?

చ॥ కనకమయ త్రికూటమునఁ • గ్రాలెడు లంకయె నేను చూడ దై
త్య నికర శల్య సంచయ యు • తంబుగ నిల్వదయేని జీవితం
బును సుచరిత్రమున్ గరిమ • మున్ మహిమాన్వితమౌ సతీత్వమున్
జనులకు నెవ్విధిం దెలుపఁ • జాలుదు నీవ వచింపు మారుతీ!

శా॥ ఈ రక్షో నిలయంబ కాదు మఱి యీ • యారేడు లోకంబులన్
శ్రీరామాస్త్రమువోలెఁ గాల్తు నివృతై • చిందన్ సతీత్వాగ్నిచే
నారామప్రభు నేర్చినట్టి విలువి • ద్యా ప్రౌఢికి న్న్యూనతన్
గూరంజేసిన దాన నౌదు ననియే • కోపక్రియన్ మానితిన్.

తే॥ మఱితాజికమునిన్ను స • మ్మాన్యుఁడనుచు, జగము వినుతింతు; రామువక్షంబుదక్కఁ
దక్కు మేనుదాఁకుట నాకుఁ • దగదు నీకు, రాముకీర్తికి భంగ మో • ర్వంగఁదగదు.

తే॥ ఉదరి నను రావణుఁడు తాఁకి • యుందు నేని, వానిమేన నిన్నాళులు • ప్రాణమున్నె
ప్రాణములు త్రుటిలో నీడు • ననియెవాఁడు. నేఁ గెల్లగించికొని వి • న్వీవి నేగె.

తే॥ తన్నుచేర నిష్టపడని • తరుణిఁదాఁకె, నేని శీర్షముల్ తెగి యిల • పైని గూలు
ననుచు నలువ యిచ్చిన శాప • మరయ నాదు, ప్రాణముల నిన్నినాళ్ళు కా • పాడెనయ్య.

తే॥ అట్టి శాపంబు గలదని • యరసి సత్య, వంతుఁడగు విభీషణు పుత్త్రి • పరమ సాధ్వి
ప్రేమ నాయెడఁ గలదియౌ • త్రిజట చెప్పె, నాకు భయము దీర్చెడు జత • నంబుతోడ.

క॥ అది కలుగుటచే ధర్మము, వదలదనుచు నిశ్చయించి • పతి శౌర్యంబున్
మదినమ్మి నిష్కలంకత, వదిలమ్ముగఁ దెలుపనుంటిఁ • బ్రాణమ్ములతో.

ఉ॥ అచ్చటినుండి రావణుఁ డ • హమ్మతి ధాత్రిఁ బెకల్చి తెచ్చి నాఁ
డిచ్చటనుంచె లక్ష్మణుఁడ • హీన గుణుం దొనరించి నట్టి యీ
పచ్చని యాకుటింటిని కృ • పామతిఁ జక్షువులారఁ గాంచి నా
యెచ్చెములేని మానస మ • హోన్నతి నమ్ముము నీవు పావనీ !

ఉ॥ ఇచ్చటు వీడి యెచ్చటికి • నేగెడు దానను కాను రాము మే
నచ్చముగాఁగఁ బోలు నమ • లాంబువు లున్న సరోజ సద్మమున్

ప్రథిత భవంబునం దొదరి • పట్టను నెమ్మదినైన నెంచ నం
చధిక ముదంబుతో సనుట • యార్యునకున్ వినిపింపు మారుతీ!

ఉ॥ చిక్కులఁ బొంది యిచ్చటనె • జీవములం ద్యజియింతునేని వే
త్తొక్క భవంబునందయిన • నుత్తము వీరు పవిత్ర దేహమున్
దక్కక దాఁకు నిష్కలుషి • తంపు వరంబును కేలుమోడ్పుతో
మిక్కిలి కోరుదాన నని • మేదిని భర్తకు విన్నవింపుమా.

చ॥ సలువుగ రాజ్యపాలన మొ • నర్ప ననర్ఘ మణుల్ ఖచించు తా
వళములఁ దాల్చు భద్రమద • వారణ రాజముపై రహించి వీ
థులఁ దగనేగు వేడుక కు • తూహలినై కన నోచకుండు నే
నెలసి వృథా వచించి ఫల • మేమి? పురాకృత మిట్టులుండఁగన్.

తే॥ తన్ను గూర్చి జనంబులు • తలపుచుంట, తల్లిచింతయు భరతుండు • తనకుఁగాఁగ
ననుభవించు నొవ్వియునెంచి • యచటికేగుఁ, గాని యిచటికి నెట్లు రాఁ • గలుగు నతఁడు.

తే॥ తల్లిదండ్రులకును బంధు • తతికి నాదు. కేలుమోడ్పు లందింపు సు • గ్రీవుతోడ
రాముతో నయోధ్యకుఁ జని • రాజచెడిన. పురికిఁ బట్టము గట్టఁగ • మొగిచె ననుము.

## హనుమంతుండు సీతకు ధైర్య వాక్యములాడుట

తే॥ వెగడు పడి యిట్లు పలుకు స • ధ్వీమణిం గాంచి, తల్లి యింకను దుఃఖానఁ • దలదేల?
యనుచు మృదు మధురములు స • మంజసములు. నైన గంభీర వాక్యము • లనియె హనుమ.

క॥ స్రుక్కెదు నీవింకనె, స్రుక్కని రాముండు త్రిదికి • చొచ్చు నయోధ్యన్
జక్కని మకుటము దాలుచు, నెక్కుడి మాటలివి! చింత • యేటికిఁ దల్లి!

చ॥ విడిపడి పోవ మానవుడు • వేడ్క వహించెదు కాలయంపె క్రౌ
త్తడిత స మించుకేనియును • తాఁలని నిన్ను గలంచు పంక్తికం
ఠుఁడు తనశీర్షముల్ భువిని • డుల్లక కొంచకొనున్ రఘూత్తముల్
వడి సనినుండి పొటుదురు • పాతక మిట్లును సిద్ధిఁ బొందునే?

ఉ॥ అన్నుల మిన్న! యెల్లరము • నక్కటికంబు విషమంత లేక సన్
బన్నము నొంద జేయు ఖలు • పాపులఁ గూల్పక మాకరీముల్
మన్ననఁ గాచికొంచు నృప • మాన్యుని ముందటి కేగ నాతకున్
గ్రన్నన వింటితోఁ దన పు • రమ్మనకున్ మరలం దలంచునే?

క॥ భరియింపరాని వెతలం, బరితాపము నొందనీక • ప్రాభవమును మా
కిరవుగ నొసఁగిన నృపతికి, మరల న్నినొన్ని సఁగకున్న • మహితులమె కదా!

చ॥ వ్రతులగు మౌనివర్యులను • వచ్చి భుజించెడు దైత్యపాళి శో
ణిత పలలాంత్రరాసుల గు • ణించి పిశాచ సృగాల గృధ్ర సం

తతులు గ్రసింపఁ బంపక ప్ర • థా విలుపూని యయోధ్య కేగనన్
ప్రతిన యొనర్చు వానికొక • పాటియె యూపని ? రాజనందినీ!

క॥ అడఁగని పగవారి చెఱుం, బడు నిను గైకొనక వదలి • మరలితి మేనిన్
బడులును పెద్దలు పిన్నలు, నడరి హసింపరొకొ ? తల్లి! యదియొక బ్రతుకే ?

క॥ క్రొత్తదియగు గృహిమణి దో, స్మత్తులు లాఁడుటను మున్నె • నాశిలె నంచుం
జిత్తము మదిమది మరలిన, యుత్తమ విక్రమ మదెంత • యొప్పారునొకో ?

క॥ చెడితిం జెడితి ననుష్ఠలం, బెడఁదాసితి వేని నిశిత • విశిఖమ్ములచేఁ
దొడిఁబడ సకల జగమ్ములఁ, బొడిపొడి సేసినను కొదిమె • పోవునె తల్లీ ?

క॥ మునుపే ముజ్జగములఁ గల, దనుజులఁ బరిమార్తు ననుచుఁ • దలపదు నతఁడో
జనకజ! నీస్థితి యెఱిఁగిన, వెనుకను నెమ్మది వహించి • వీఁగునె ? తల్లీ!

క॥ ఊరక రాని యమర్షము, క్రూరుల జీవములమాత్ర • గొని శాంతిలుచో
వేరేది దాని కాహుతి ?, ధారణియుం దివియుఁ గ్రుంగి • తాటి సమయదే ?

క॥ లయకాల వహ్నివోలెన్, రయమున భువనముల సాగ • రముల నివుఱు చే
సియె పీడుఁగాక యడఁగునె ? నియమిత రామాస్త్ర వితతి • నీస్థితి విన్నన్.

క॥ దేవరాతులఁ ద్రుంచెను, కావలముల మాన్చె సుజన • గణములఁ గాచెన్
దీవరుల కొసఁగె సద్గతి, శ్రీవరలక్ష్మి యను కీర్తి • చెలఁగఁ దలఁపవో ?

ఉ॥ నీవలనన్ జగంబులు వి • నిశ్చల వృద్ధి భజించునమ్మ! శో
కావలినే గ్రహించి శ్రమ • లంది యొకించుక కాల మిట్టులే
త్రోవుము లోక మంగళము • తూకొని చేసెడు వారె పెక్కులా
హావడు రొందువారు భువి • హాయికి నోర్పుల భావ్యమేకదా!

తే॥ రోయఁదగు లోక కంటక • రుధిర పూర, మునను ప్రేతభూతాదులు • మునిఁగి క్రీడ
సేయ దాఁగిన సురలు హ • ర్షించి పొంగు, సత్కృతిని నీవు చూడంగఁ • జాలవేమి ?

మ॥ ప్రళయాంభోద తటిన్మహోరుచుల ని • ర్ఘాతంబులం బోలె రా
మ లసద్భీకర బాణరాజి దనుజ • క్ష్మాపాల సైన్యంబులన్
దొలువం గాఱెడు నస్రపూరము పయో • ధు ల్నిండి ఘోషింప వీ
నుల విందారఁగ నుత్సహింపుము విన • న్గానాళ్ళలోఁ దల్లిరో !

చ॥ కరువులు జాఱు నట్లసుర • కాంతులు కడ్పుల మోఁదికొంచు వం
దురుచును దుఃఖబాష్పములఁ • దోఁగుచుఁ ద్రెంచిన తాలికాటువల్
గిరులయి మింటి నంటి వడి • ఖేచర లోకవిమానముల్ చనన్
దెరువున కడ్డమై నిలువఁ • దేఁకువఁ జూడఁగ నుత్సహింపుమా.

తే॥ నింగి కానఁబడక కప్పి • నిండు భూత, ములును కంకగృధ్రము లస్ర • జలధి మునిఁగి
దైత్యవనితల బాష్ప న • దంబులందు, స్నానమాడుట గాంచ ను • త్సాహముంచు

ఉ॥ వీణల మించి గాత్రములు • వెల్వడ మర్దళముల్ ధ్వనింపఁగా
జాణలు వేల్పు సానులు ప • సందుగ నాట్యము సేయు చోటులన్
బ్రీణన ముల్లసిల్లఁ గపి • వీరులు వీరరవంబుసేయుచుఁ
గ్రేణిగ మోదనృత్యమున • రేఁగుటఁ జూడఁగ నుత్సహింపుమా.

చ॥ కొడిమలు మీఱ నైచ్యములు • గూరిన క్రూరుల మేలు ప్రీలఁగా
వెడలెడు రక్తవాహినులు • వే కొని పోయెడు కొండలట్టి పె
న్పడుగుల కుప్పతిప్పలు సు • పర్వులు వెక్కసమంది చూడఁగాఁ
గడలిని నిండి పొర్లుటను • కాంచఁగ నీమది నుత్సహింపుమా.

తే॥ అవనిజా వహ్ని రామ శ • రానిలమున, నల త్రికూటమన్ కుంపటి • యందు పెరిఁగి
కూరిర దానవు లనెడి బొ • గ్గులను కాల్ప, లంకయను పైడి కరఁగుట • లక్ష్మి! కనుమ

తే॥ భువన కంటకుఁడగు దశ • ముఖుని తలల, వ్రాలి పుణ్యఫలముఁ బోలి • పావన మగు
పీ శరీరంబుఁ గాంచిన • నేత్రపంక్తి, నొలిచి కాకులు దినఁ జూచి • నుత్సహింపు.

చ॥ మును సురవైరి కోడి బిడె • ముంగొని మాఱుమొగంబుగొన్న ది
గ్ఘన గజ వాల సన్నిధి ది • గాలు మనంబఱ రాఘవాంక మా
ర్గణములు పంక్తి కంఠుని శ • రంబుఁ ద్రెంచి తొలంగఁద్రోవఁగా
గుణవతియైన యోజననిఁ • కోరికఁ గాంచఁగ నుత్సహింపుమా.

ఉ॥ ఖంబు చెమర్చెనేమొ యని • గాదిలి నప్తు దల్ల పీచు శ్వే
తాంబరముం బలెన్ వెలయు • నట్టి ధ్వజావళి యొప్పు లంకలో
నంబుల వర్షముం గురియ • నల్లరి సేయుచు లేచు భూతముల్
పంబిన ధూళిలో వికృత • భంగుల నాడుట గాంచు మమ్మరో!

ఉ॥ నల్లని రేయి ద్రిమ్మరుల • నల్లల వెల్లువలెల్ల వార్ధి జొ
బ్బిల్లి తలంబులేమి నటు • వెన్కకు మళ్ళుటయున్ సమస్తముఁ
ద్రెళ్ల యుగాంత వేళలను • తృప్తి వహింపని మృత్యు మూర్తియున్
గొల్లగ మెక్కి క్రక్కుటయుఁ • గూరిమిఁ గాంచెదు గాక తల్లిరో!

ఉ॥ వేలుపు బోట్ల వంటి యలి • వేణులతో నసురాళి క్రీడలం
దేలు సుగంధ కల్పవన • దీర్ఘికలన్ గపిమూఁక వక్ర లాం
గూలము లొండొకళ్ళ వడిఁ • గూరిచికొంచు వినోద లీలలం
బోల మునుంగు చుండుటలు • పోఁడిమిఁ గాంచెదు గాక తల్లిరో!

ఉ॥ పెక్కులు పల్కనేల? రఘు • వీరుని దివ్య శరాళి లంకలో
నెక్కొను దైత్య కాయముల • నిల్వక యవ్వల దుస్సి పోఁకు లె
య్యెక్కడ నుందు రయ్యచటి • కేపున నేగఁ ద్రిలోక వాసులా
రక్కసి మూఁకలెల్ల సమ • రంబునఁ గూలుటఁ గాంతు వమ్మరో!

చ॥ ఒకనెల తీఱు లోపల నె • యుమ్మలికంబు రపంతయేని పొం
దక సుఖియింతు పమ్మ త్వరి • తంబున నేఁ జని రాముఁ గాంచుచే
యొక తడ వంత మీఁద నిట • కొందఁగ రాఁ దరితీపు గల్గునే ?
యొక క్షణమేని భూరమణుఁ • దొప్పరికించునె యింకఁ దల్లిరో ;

తే॥ ప్రాణ మున్నదని వచింప • నంతెకాని, తన శరీరము తాఁకి మాఁ • దని సుమములు
చివురులును లేవు వేలాలు • చెదరకుండు, తరువులును లేవు వల్లు లం • తకును లేవు.

తే॥ తెలివి లేటలుండినఁ గదా • తిపురుపంత, మొగులు పిడుగులతోడఁ బై • దిగులుచున్నఁ
నైదుతలల సర్పము బొమ్మ • నంటి కలచు, చున్న నెఱుకగల్గదు రాఘ • వోర్విపతికి.

తే॥ చిలుకఁబడు దధికై వడిఁ • గలఁతనొంది, యెదను తడఁబడు ప్రాణంబు • లింద్రియములు
గందనగు పైత్యమును వియో • గంపు వంత, యెంత కలదొ లెక్కగ వచి • యింపనగునె?

తే॥ ఇట్టి శోచనీయస్థితి • నెనయు రాముఁ, డుండె సుఖముగ ననుమాట • యొప్పుకాదు
పలుకునపి యెల్లఁ గరతలా • మలకముగను, చూపెదను చూచెదవు గాక • సుగుణచరిత;

శా॥ తల్లీ! నిర్మలుఁడైన దాశరథి యు • ద్దండుండు సుగ్రీవుఁడున్
దెల్లం బారఁగ నీదువార్త విని శృ • ప్తిం జెంది మున్నే కపుల్
ప్రోల్లాసంబున వార్ధిదాటి నగరం • బుం జుట్టి హుంకారముల్
మొల్లంబొప్పఁ నొనర్చుచుంట విని స • మ్మోదింతు నిక్కంబుగన్

శా॥ దేవీ! లెక్కిడరాని వానరులు ప్రో • ద్దీప్తిన్ దగన్ రేపె లం
కావాటిన్ వడిఁజేర మధ్యమున నా • కాశంబునం దార్ఢ్యపై
శ్రీవిష్ణుండలె నా భుజంబులపయిం • జెన్నారు రామప్రభున్
సేవింపారఁగఁ గాంతుగాక కను లు • న్మేష స్థితిం జెందఁగన్.

ఉ॥ అంగదు మూఁపుమీఁద నుచ • యాద్రిపయిం గనుపట్టు బాల భా
నుం గనులీల లక్ష్మణుఁ గ • నుంగొని మోదము నొందెదమ్మ! పో
రుం గొన వాన రేంద్ర నికు • రుంబము నాయితమై చెలంగు నీ
యంగదయుం దొలంగు నరి • యూటయు నీఁగు వియోగముం జెడున్.

ఉ॥ ఈమెయి నీవు పల్కగదు • విచ్చిన మాసములోనె వచ్చి శ్రీ
రాముఁడు నీచెఱన్ విడుగ • రం బొనరింపఁడయేని నిందచే
రాముఁడె రావణుండగును • రావణుఁడున్ మఱి రాముఁడే యగున్
శ్రీమహిళామతల్లి! కొద • చెందెదవేల? వహింపు నెమ్మదిన్.

తే॥ తొదరి మోదకరములు ని • ర్దుష్టములును, పౌరుషోచితములు నగు • పలుకు లాంజ
నేయుడాఁడఁగ నుప్పొంగి • నెమ్మది గొని, యుర్వితనయ యిట్లని పల్కె • నుత్సుకతమ

## సీత యానవాళ్ళు తెలుపుట

శా॥ అయ్యా! యేగెదుగాక వైశముగ శ్రే • యః పాళి నిన్నొందుఁ గా
కయ్యె విఘ్నములం దరించెదవుగా • కార్యంబు శ్రీరాముతో
నెయ్యం బారఁగ నానవాళ్ళదరు వా • నిం బ్రీతి వాక్రుచ్చు మా
యయ్యా కం దొలఁగించు భారమది నీ • దే కాదె ప్రాభంజనీ!

ఉ॥ ముందటఁ జిత్రకూటమున • మ్రుక్కఁడి కాకము వాఁడి ముక్కుతో
డం దగ నాయురమ్మునఁ గ • ఢంగి పటుక్కునఁ గాటుసేయ నేఁ
గుందఁగఁ జూచి నెత్రుగని • కూర్మివిభుం దొకపూరిఁ గొంచుఁ బ్రేఁ
పొందఁగ బ్రహ్మ మంత్రమున • నుగ్రత నేయుడుఁ గాకి భీతిమై.

చ॥ కొదుకుచు సత్యలోకమున • కుం జని ధాతయు రొప్పి త్రోలనా
ప్రదరము వెంటనంట వడిఁ • బాఱుచు శంభుని డాసి యాతఁడుం
బదరఁగ మళ్ళి దిక్పతుల • వల్లను రక్షణమొందలేక యె
య్యదియును దోఁప కేడ్చు నెద • నాత్మల వేల్పులు పిచ్చలించుచున్.

ఉ॥ ఇంద్రసుతా! జయంత యిటు • లేల చరించితి నీతిమాలి ని
న్నింద్రుఁడె కాఁడు సర్వభువ • నేంద్రులు చేరియుఁ గావనేర్తురే?
రుంద్ర యశస్వి శ్రీరఘువ • రున్ శరణంబని చేరు మా దయా
సాంద్రుఁడె కాచు నిన్ను రభ • సంబునఁ బొమ్మని పల్కనాతఁడున్.

చ॥ భయమునఁ బాఱివచ్చి రఘు • వర్య! భవత్పద పంకజంబులే
దయఁగల వంచు నే నభయ • దానము వేఁడితి నన్ను సత్కృపా
శ్రయుఁడు క్షమించి వానిదగు • చక్షు వొకండు గ్రహించి యస్త్రమా
పయి నుపసంహరించుటలు • పావని! నాథునకున్ వచింపుమా.

తే॥ నీ చరణములే శరణముల్ • నిఖిలనాథ!, యనఁగ దొసఁగు మన్నించితి • నవనియందు
కాకి రెండుకన్నుల కొక్క • కంటిపాప, యుండు నీవల్ల ననుటయు • నొగి వచింపు.

తే॥ మ్రొక్కి సెలవంది కాకంబు • పోయె దివికి, సురలు పువ్వుల వానలు • కురిసినారు
దీని సౌమిత్రి సుంతయుఁ • దెలియఁదయ్య, యింపు పలుకులతో వచి • యింపు మిదియు.

ఉ॥ ప్రేముడిఁ బెంచు నాచిలుక • పిల్లకు నెవ్వరిపేరు పెట్టుదున్
శ్రీ మహితా! యన న్మగులఁ • జిర్నగవార మదీయమాత స
త్ప్రేమ మయాత్మయౌ కయిక • పేరిడుమా యని నాఁడు పల్క నా
యామెత గూర్చు వాక్యముల • యాదరమున్ వినిపింపు మారుతీ!

ఉ॥ ఇన్నియుఁ బల్కిమీఁద వచి • యింపఁగఁ దగ్గది యొండు లేద యం
చెన్ని ధరించు వస్త్రమున • నింపుగఁ గట్టిన మానికంబు పై

మున్ను జగంబు గ్రుంది జగ • మొప్పుగఁ గల్గిన కాంతి సంతతిన్
గ్రన్న జయించు దాని నటఁ • గైకొనె మారుతియున్ భ్రమింపఁగన్.

తే॥ హనుమ యచ్చెరు పాటొంది • యరయ సాగె. సప్తలోకంబుల తమంబు • సమసిపోయె
రవియు భయపడ కీ నగ • రంబు చేరె. నేమి? యని దైత్యులును శంక • నెనసినారు.

ఉ॥ శోకము నొందు జక్కవలు • సుక్కుట పీడె ముడింగియున్న ప
ద్మాకరమందు పంకజము • లన్ని యెలర్చెను సూర్య కాంతముల్
తూకొని నిప్పు లుమ్మినవి • దుఃఖముతో ముకుళించెఁ గల్వలున్
వే కనుపట్టె నయ్యెడ ర • విప్రభఁ దోఁచెడు చిన్నె లన్నియున్.

చ॥ మృదువగు కేశపాశమను • మేఘముపై గ్రహరాజుఁబోలి య
మ్మదిత మనోజ్ఞ సంహసన • ముంబలె రాగమునొంది రాగ సం
పదగల రామపాదముల • బాగున వెల్గు శిరోమణిం గుణా
స్పదయగు సీత చూపెఁ గనె • వాయుసుతుండు ప్రమోదమందుచున్.

చ॥ వెదకుచు వచ్చి జీవముల • విండగ నిచ్చిన పుణ్యమూర్తి। నా
కిది యొక కంటిపాప పలె • నింబుగ నుండుఁ జిరంబు వల్వలో
విదులక చుట్టియుంచితి న • భిజ్ఞగఁ గైకొను మంచు సత్యవా
క్పదయగు సీతయిచ్చెఁ గడు • భక్తిని గాడుపు పట్టి చేకొనెన్.

ఉ॥ కైకొని వస్త్రమందు దుసి • క్రమ్మక యుండఁగ ముడ్చి వీడికోల్
కైకొని మ్రొక్కి మున్మలు వ • లంగొని చాఁగిలి లేచి దీవనల్
కైకొని ధీరవాక్యములు • క్రమ్మలఁ బల్కి మఱిన్ మఱిన్ నుతుల్
కైకొని యుబ్మి గంతులిడి • గంధవహాత్మజుఁ డట్లు క్రమ్మఱెన్.

## 7. వనభంగ పటలము. (60).

చ॥ వనమును గూర్చి యుత్తరపు • వైపునకుం జననెంచి దొడ్డ రూ
పును ధరియించినట్టి కపి • ముఖ్యుఁడు స్వల్పకృతిం బొనర్చి యేఁ
జనుట వివేకలక్షణమె? చయ్యన నచ్చటికేగి రాఘవుం
డును ముదలించు వాని కొకఁ • డున్ సరి పల్కమి దూత లక్షమే?

ఉ॥ ఏపునఁ గాలుసేతులనె • యెల్లర నీచులఁ ద్రొక్కి చంపి లం
కాపురి వార్ధి నూఁకి జన • క ప్రభు పుత్త్రిని గొంచు రాఘవ
శ్రీ పదపద్మ సన్నిధిని • చేర్చనయేని తలంప నెవ్విధిన్
లోపములేని యుత్తమ గు • ణుండగు దూతుఁడ నౌదు నిద్ధరన్.

ఉ॥ వంచకుఁడైన రావణుని • వాలముచే దశ మస్తకంబులున్
మించిన చేతు లిర్వదియు • మిక్కుఁగ నుక్కఁగఁ గటి కారలో

నుంచిన వాడఁగాను గడు • నుద్ధతిఁ దాఁకి జయింపలేదు మా
ప్రాంచిత రామ భానుజ ప • రస్పరమైత్రి ఫలించు టెట్లగుణ్.

చ॥ బలయుతమైన యీ యసుర • వర్గముఁ గాద్పడఁజేసి కూల్చి దో
ర్బలు దశకంఠుఁ బట్టికొని • క్రచ్చుగ మోఁది యతండు కన్నులం
బులుకునఁ జూచుచుండ మయ • పుత్త్రి శిరోజములం గదించి వె
ల్వెలగొన నీడ్చి తెచ్చి చెఱ • వేయుట దోసముఁ గూర్చు కార్యమే?

ఉ॥ వీరల హింస చేసి పృథి • వీభరముణ్ రఘువీరు భారముణ్
దీఱ నడల్చి దూతకృతి • తీరుగఁ బూర్తి యొనర్చుచే తగం
గారియ మంచు భావమున • గట్టి యొనర్చి దితి ప్రజాతతిన్
బోరొనరింప రేఁపు విధ • ముం దలపోసె మనంబు లోపలన్.

తే॥ కదఁగి యిప్పుడే యివ్వనిం • గాడుపఱుతుఁ, బఱుచు పెనుదొని చెవిఁబడఁ • బలల భుజులు
కోపులై యెదిరింపంగఁ గూల్చువాఁడ, విదియ తగిన యుక్తి యనుచు • నెంచె మదిని.

చ॥ పొదివిన దైత్యులన్ మరలి • పోవఁగ నీయక కూల్తుఁ గూలి రే
నెదురఁగ రావణాసురుఁడు • నేపున దుస్సహ సైన్య యుక్తుఁడై
కదలును వచ్చెనేని కదు • కావరముం జెడ మస్తకంబులన్
జిదురలు చేసి నాకసి న • శింపఁగ నెమ్మదినంది మళ్ళెదన్,

చ॥ అని తలపోసి రేవగలి • కాడ్పులు త్రిమ్మరు మేరుశైలమున్
జెనయు భుజాగ్రభండు మును • చెన్నుగఁ గొమ్మున భూమినెత్తు నా
ఘనకిటిఁ బోలి దొడ్డ యద • గైకొని వేలకువేలు కావలిన్
గనిన యశోకికా వని న • గంబులఁ గాళలఁ ద్రొక్కి వ్రీలఁగన్.

తే॥ విఱిగెఁ జీలెను వ్రాలెను • పెల్లగిల్లె, నడఁగెఁ బొడియయ్యె మడఁగెఁ బె • ల్లవిసె నెగసెఁ
జెదరె మండెను మాడెను • ప్రిదిలెఁ ద్రేలె, బొగ్గులగుచు ఛిన్నాభిన్న • ములుగ రాలె.

తే॥ కొన్ని వేళ్ళతో లేచెను • కొన్ని కాలెఁ, గొన్ని మొగుళులలోఁ జేరెఁ • గొన్నిచీలె
కొన్ని మున్నీటఁబడిపోయెఁ • గొన్ని తేలెఁ, గొన్ని దేవలోకముఁదాఁకెఁ • గొన్ని తూలె.

తే॥ చుట్టి విసరిన మబ్బుల • సుడిసి కొన్ని, దిక్కరుల కాకు మేఁతగా • దిగువ వ్రాలె
నడుగు పట్టి వీచిన కొన్ని • యాకసంబు, దాఁటి యింద్రు నందనమును • క్షేత్రమ్ము చేసె.

తే॥ వాలి యలలచే జలధి క • ల్లోల మయ్యె, దైత్యుల విశాల సౌధముల్ • ధరణిఁ గూలెఁ
గులగిరులు తుమురయ్యెను • కుసుమచయము, పట్టు దప్పి దిక్కరులతో దఁ • బడి యడంగె.

చ॥ పొడవగు వేళ్ళతో నదరు • భూజములన్ వడిఁ బెల్లగించి త్రొ
క్కుడుపడి లోకముల్ ప్రిదుల • గోఁటున వైచిన కొన్ని దిక్కరుల్
పిడులకు నందియీయఁ దమ • బెట్టిదమౌ రదనాంతరంబునన్
బెదఁకుచు వ్రేలు తుండముల • వీఁక ధరించిన రీతి భాసిలెన్.

ఉ॥ క్రూరుని పంక్తికంధరుని • కోమల వృక్ష వనంబులోనివా
సౌరభ పుష్పసంచయము • చక్కఁల పర్వతమందు దేవతా
వారములుండు స్వర్గమునఁ • బద్మదళాక్షులు మూఁగి వచ్చి యిం
పారఁగ నొక్కసందఁ జిదు • మాఁకిరి యొందొరు మించి వేడుకన్.

తే॥ కనక రత్న మయంబులై • క్రాలు తరులు, దిక్కులకు మించులంబోలెఁ • దిరుగుచుండెఁ
గొన్ని సూర్యకాంతులఁబోలెఁ • గొన్ని నడుమఁ, దాఁకిరాలుదిక్కులవలె • ధరణిఁగూలె

తే॥ పక్షులను బంటి యీఁగలు • భ్రమరములును, మొగ్గలఁ జివుళ్లఁ దేనెయుఁ • బూలుపండ్లు
కదలిఁబడ మీలు గ్రుంగుచు • మిడిసియాడెఁ, బచ్చి చెట్లంతలోఁ బడఁ • బచ్చడయ్యె.

క॥ చెదరిన పూవులఁ దాలిచి, లవసుల గంధంబు పీచి • జలధులు వేల్పుల్
సుదతులతోఁ గ్రీడించు ప్రమదావన సరోవరముల • మాడికి నొప్పెన్.

మ॥ హనుమంతుండు పెకల్చి వైచు మణిహే • మాంచత్ప్రభా వేదులన్
ఘన భూజ వ్రజముం బొవచ్చు పెనుపె • క్కంజొచ్చి నింపారుటన్
జనముల్ దాఁటియె పోవఁగాఁదగు వనం • జాల్పంప్ర మవ్వేళఁ గా
లి నడన్ దాఁటఁగఁ దగ్గదయ్యె ననఁ జా • లెన్ జూక్కి కబ్రంబుగన్.

తే॥ గ్రీష్మ భానుని పోలి య • గ్రిమమరీచు, లడర మింటి కెగసి యుర • వడిని మరల
తరులవలన దానవుల సౌ • ధములు తుమురు, లయ్యె నశనిచేఁ గుధరంబు • లవియునట్లు.

తే॥ హనుమ పెకలించి వైచిన • యగచయంబు, క్రిక్కిఱిసి మబ్బువలెఁ బోఁవ • గినుకచేత
రావణుని వనమెల్ల స్వ • ర్గంబుచేఁరఁ, బంపు క్రియదోఁచె నప్పటి • యతని చెయిది

ఉ॥ తేనియ తుంపురుల్ చెదర • దిక్కఱి పక్షులు రంపుసేయఁగా
సూనచయంబు నిండుకొన • శోభిలు రత్నమయావనీజముల్
మానుగ మింటఁ గ్రిక్కిఱిసి • మంజుల కాంతులు కత్తులట్లు సిం
గాణులరీతిఁ గ్రాలి వడి • గాఁ జనె మేటి విమాన పంక్తినాన్.

ఉ॥ వారణ రాజముం జెనయు • వాయు కుమారుఁడు చుట్టివైచు భూ
మీరుహముల్ సుడింబడుచు • మింటను నిల్వక క్రమ్మఱిల్లి పెన్
వారిధి వ్రాలుచుండుటలు • వట్రిలి తో యదముల్ పయోధిలో
నీరము నానఁగా దొడఁగి • నిండుగ వ్రాలిన లీలఁ గన్పడెన్.

ఉ॥ పాపముచేసి మర్త్యమ భు • వంబున జన్మముఁగాంచి జ్ఞానులై
తాపములన్ జయించి విను • తంబగు ముక్తిని పొందు వారి య
ట్లేపున నూడ్చి పైకెగుర • నేసిన కల్పకజాల మప్డు స్వ
ర్గోపరి భాగమేఁగి మఱి • యొందెను మున్నటి స్వస్థలంబులన్.

తే॥ గుఱిగ మణికుట్టిమంబులఁ • గూలఁదన్ని, చదిపి చవికలు దీర్ఘికల్ • చదునుచేసి
కుడ్యములను క్రీడాద్రులఁ • గుదియ ద్రొక్కి, చేయ దుస్సాధములనెల్లఁ • జేసివైచె

తే॥ సాల సర్జకాదులఁ ద్రోచి • పూలతోడఁ, జంపక శ్రేణి గెంఁకి ప • జ్జను గలట్టి
చూత సాలంబు లూడ్చియ • చ్చోటఁ జెంఁగు, ఫలతరూత్కరం బెల్లను • పాడుచేసె.

ఉ॥ కంతు వసంతు మోముల వి • కాసము లెల్లఁ గృశింప నా హనూ
మంతుని పాదముల్ దగుల • మంజుల పుష్పవనంబు తారు మా
ఱెంతయు నొందఁ జందన మ • హీజము లింధన భంగిఁ గాల న
య్యంతర భాగమెల్లఁ బొగ • యై నివుఱై కనెఁ గాడు పోలికన్.

క॥ రొద సేయుచు భ్రమరంబులు, చెదరఁగ భూజములు గలసెఁ జేడ్పడి మంటన్
మదవతుల నృత్యశాలలు, కదిసిన విరి లతలతోడఁ • గూలెఁ బదడుగాన్.

చ॥ తలరెడు పూలకొమ్మలు ల • తావితతుల్ పికముల్ రహించు క్రొం
దలిరులు గల్గు మావులును • తావులఁ జిమ్ముచు నల్లిబిల్లిగా
నలమిన తీఁగలం జెలఁగి • యందము చింద నమర్చు ద్వారముల్
పులుగులతోడ గుల్మముల • పుంజములున్ జెడె నుగ్గు నూచమై.

ఉ॥ పైచు ప్రవాళ వల్లరులు • వారిద పంక్తిని మించు లట్లు చ
ట్టేచిన కొండలంబడి ర • హించె మహీధ్రము వంటి యేనుఁగుల్
మోచిన మోము పట్టములఁ • బోలి హిరణ్మయ చూత శాఖికల్
వేచని యందు దంతులకు • వేడుక యోగిరమయ్యె నయ్యెడన్.

తే॥ పిట్ట లఱచు శబ్దంబులు • వృక్ష చయము, విఱుగు సవ్వడి మారుతి • పెలుచఁ జేయు
సింహనాదంబు పెనురొద • సిం దరించి, యండగోళంబులం దాఁటి • యవలికేగె.

క॥ కూలెను పాటల కుజములు, వ్రీలెను వర గోఁగులును ద్వి • రేఫ రవంబుల్
మాలెను విహగ రుతంబులు, గ్రాలెను రోదనముగాఁగఁ • గడలిం బడుచున్.

క॥ అడఁగెం బొదవగు మేడలు, మడఁగెం బందిళ్ళు లతలు • మఱి వృక్షంబుల్
పడియెం గావేరీనదిఁ, జెడియెం గంగాజలంబు • చేరఁగఁ దేఁకుల్.

క॥ అందము చిందెడు కొలఁకులు, చందనముం గలిపినట్లు • చెడెఁ బంకముగాఁ
బెందరువులు కూలిన యా, సందర మొక పూలతోట • చందంబయ్యెన్

ఉత్సా. సిందువార వారమేగి • చెదరి చేరె వారిధిన్
చందనములు ఱివ్వుమంచు జరగ • దైత్య సౌధముల్
పొందు మేల్కవాటములను • పొడిచి విఱిచె నుగ్గుగా
నందు రక్కసీంద్రు జడిసి • యఱచి పఱచి యేడ్వఁగన్.

ఉ॥ ఆకసమందు మించి వెలుఁ • గారెడు రిక్కలఁ బోలి నందన
ప్రాకట వృక్ష పుష్పములు • పైఁబఱపై వీఁసిల్లెఁ దింత్రిణుల్
ప్రేకనఁ జుట్టి చుట్టి కడ • లిం దిగబాఁదఁగ శంఖ కీటముల్
వ్యాకులమంది ముత్తెముల • నయ్యెడ రాల్చుచుఁ బాఱె భీతిమై

తే॥ ఆకసమునదు పీచిన • యండమైన, కొమ్మలం గల్గు మణిమయ • ధ్వజము లచటఁ
దివిరి దైత్య వినాశ దు • ర్దిన నిమిత్త, మైన యింద్రధనువు వోలె • గానఁ బడియె

మ॥ చతురంభోధులలోఁ బడన్ విసరు నా • చాంపేయ ఫల్లీ తతుల్
చితుకం దాయుచు రాలుచుండుటలు వీ • క్షింపన్ దిగం తొచ్చుచున్
సిత జీమూత వితానముల్ జలములన్ • సేవించు వారాశి నా
తతరీతిం బ్రసరించు భాసురర సం • తానంబునా భాసిలెన్.

తే॥ ప్రాఁకులం బ్రిప్పివైపఁ బు • రంబునందు, లాయములు రథశాల లా • లాన శాల
లాటపట్టులు పానశా • లాదికములు, నేలమట్టంబులై పేరు • మాలిపోలె

తే॥ ప్రాఁకులను కొండలను తారు • మాఱుఁగాగ, పైచుటం జేసి బంగారు • ప్రహరులెల్ల
జీలిపడ మేడలగ్గిచేఁ • జిటిలి పెటిలి, యతల కుతలమై పురమెల్ల • నదలు గుదిచె.

చ॥ అవనిజకై వగం బొగుల • నట్లుడికించితి విప్పు నారు శా
త్రవులగు వారు నవ్వఁ బ్రమ • దావన నాశము సేయుచుండ గా
రవమునఁ గాంచు చుంటివని • క్రాఁగి చిరాకు గడించునంచు దా
నవపతి కల్కి దాఁకొనెన • నన్ హరిణాంకుఁడు డాఁగెఁ బైదెసన్.

చ॥ కనకము రత్న రాజి రవి • కాంతములున్ శశికాంతముల్ మణుల్
మునుకొని వెల్గు ప్రాఁకులుగఁ • బొల్చిన యావన వృక్ష సంతతుల్
హనుమఁడు పెల్లగించి కడు • నంతరదేశములం బడంగ వై
చిన కతనన్ జగంబు విల • సిల్లెను పట్ట పగంటి చాడ్పునన్.

చ॥ మెకములు భీతిమైఁ జెదరి • మిక్కిలి భ్రాంతి వహించి యార్చుచున్
గకవిక చెంది ప్రాలె నెఱ • కల్ గల పక్షులు కొన్ని పాఱెఁ గొ
న్ని కదలిఁ జెట్లతో నడఁగె • నిచ్చలు పాలిన వెల్లఁ గొంత మే
రకుఁ జని తత్తఱిల్లి ధర • వ్రాలెను పక్షములన్ విదుర్చుచున్.

ఉ॥ పువ్వులతోడ భాసిలిన • భూజములన్ హనుమంతుఁ డుగ్రుఁడై
జివ్వన వీవ నత్తరుల • వ్రేలెడు గూఁడులతో విహంగముల్
త్రెవ్వక కొన్ని చేరినవి • దివ్యపదంబు నతం డనుగ్రహం
బువ్వన నూనెనేని మఱి • యున్ దగనెట్టి ఫలంబు గూర్చునో!

తే॥ రాక్షసులు కాచుచున్న యా • రామమందు, శ్రమలనొంది తపించు భూ • జాతయున్న
వృక్షమొండు మాత్రము నిల్చె • విలయవేళ, విష్ణుఁడు పరుండు వట వృక్ష • విధము దోఁప.

ఉ॥ మిక్కిలి కాంతిగల్గు నొక • మేటి శిరోమణి భూమిజాత తా
నిక్కడ నానవాలుగఁ ద్రి • యేశున కొందఁగ నిచ్చి పంచె నిం
కొక్కటియేని భూషణము • నొందద యంచుఁ దలంచి సాగరుం
డక్కటికంబుతోఁ బవిచె • నన్నవిధంబునఁ దోఁచె భానుఁడున్

చ॥ ననిచిన యవ్వనం బటులు • నాశముచేసి మరుత్సుతుండు పొ
ల్పున విలసిల్లె నొక్కఁడయిఁ • పోఁడిగ లోకములెల్ల గొల్చి ని
ల్చిన జగదీశు పోలికను • క్షీర మహోదధి మధ్యనొప్పు మం
థన నగముం బలెం బ్రళయ • దాహ రుషానల నేత్రు కైవడిన్.

శా॥ ఈలీలన్ వనమెల్లఁ గూల్చి హనుమం • దేపారు నవ్వేళ దై
త్యాలోలాక్షులు లేచి హా యనుచు న • త్యంతంబుగా నుల్లముల్
వ్రీలన్ మేరువువోలె నిల్చు నతనిన్ • వీక్షించి వీఁడెవ్వఁడే?
బేలా! కాంచితి వేమె? యన్నఁ గని పృ • థ్వీజాత దానిట్లనున్.

చ॥ కొడిమెలు సేయు రక్కసులు • కూడని మాయలు చేయుచుండ నా
చెడుగరులే యెఱుంగ మఱి • చెప్ప సమర్థులు గాక యన్యులున్
నుడువ సమర్థులే? మనుపు • నూల్కొని దైత్యుఁడు జింకయై కనం
బడ వలదంచు లక్ష్మణుఁడు • పల్కిన సత్యమ యంచుఁ గోరితిన్.

చ॥ అని జనకాత్మజాత పలు • కాడఁగ తొమ్ములు మోఁదికొంచు న
వ్వనితలు నేలయుం జదలు • వారిధులన్ వడఁకొందఁ బాఱఁగా
హనుమయుఁ జెంత స్వర్ణమయ • మై పొలుపారెడు హోమ మండపం
బును గని దీనిఁ గూల్తునని • పూనికఁ జేతులు సాఁచి పట్టుచున్.

సీ॥ కనులఁ జూడను గాదు • కాలుపెట్టనుగాదు, స్తంభముల్ లెక్కింపఁ • వరముగాదు
నిసులందు జీఁకటుల్ • నెఱయవు ధరణియుఁ, గడఁగి మోయుటయన్న • గానిపనియె
యాకాశమంటు హే • మాద్రియు సిగ్గిలి, మదినొచ్చి వుండగు • మాడ్కి బెరిఁగి
క్రమముగా వర్ధిల్లి • కళల సంపాదించి, దుగ్ధంబుఁబోలు కాం • తులను కురియు

తే॥ శీతకరుఁ దాఁకు కందను • చీఁకటులను, వారి తినునట్లు వింశతి • బాహునాజ్ఞ
బ్రహ్మదేవుండె స్వయముగా • బంగరు గొని, మానుగాఁ గట్టినట్టిదా • మండపంబు.

సీ॥ స్తంభంబులెల్ల ర • త్నమయంబులుగుఁ జుట్టు, ప్రక్కలు మొత్తమ్మ • స్వర్ణతార
మయములు వెనుక సం • ప్రథిత మహోపల, మయములు రవికిని • మందనములు
దశకంధరుఁడు మున్ను • తారాద్రి నెత్తుట, విన్న మారుతి యది • వెలితి పఱుప
మేరువునే తోఁడి • మీఁదికెత్తిన యట్లు, దీర్ఘ బాహులతోడఁ • దివిని యెత్తి

తే॥ లంకపై వైచె మేడలు • క్రుంకె నిప్పు, మిడుఁగుఱులు లేచి కొన్నింటి • నదరి కాల్చెఁ
బూఁడి బ్రగ్గిరి కొందఱు • పొలసుదిండ్లు, చెడుగరులకు వచ్చెడునవి • చెడుగులెకద!

సీ॥ అయ్యశోక వనంబు • నరసి కాపాడెడు, షడృతుదైవతములు • సాశ్రుపూర్ణ
ముఖపద్మముల వస్త్ర • ములతోఁ దుడిచికొంచు, దుఃఖాగ్ని మనసులఁ • ద్రొక్కి కాల్ప
వ్రీలి నెత్తురుకాఱు • పెను దేహములతోడఁ, దళఁబడి పెనఁగు పా • దములతోడఁ
బురమెల్ల గగ్గోలు • పొరయ రోదించుచుఁ, బరుగున రావణా • సురుని దఱిసి

తే॥ చరణములఁ బడి దానవ • సార్వభౌమ! వనము నేఁడు కావఁగ లేని • వారమైతి
మొక్కపెనుకోఁతి యారాము • మూడ్చి విఱువ, నగ్గిఁబడు పక్షముండోలె • నవిసెఁద్రుటిని.

కవిరాజ. పలుకఁగఁ దేలికయౌ పని గాదిది • పాద కరంబులతోఁ గసవున్
నలుసులు దూసియులే కఱుసట్టు లో • సర్చి మహా క్రతు మండపమున్
బెలుచ నగల్చి పెనన్ విసరెం బుర • వీథుల మేడలు కొన్నియ వో
నిలువ సమస్తము నాశమొనర్చె ప • నేచర మర్కట! యిక్కరణిన్.

చ॥ అనవిని రావణుండు పరి • హాసముతో నొకకోఁతి చొచ్చి యా
కనక తరూత్కరంబుఁ గడఁ • కన్ విదళించి మఖాగ్ని శాల భూ
మిని పడఁద్రోచి గొప్ప కడి • మి న్నగరంబును కాడుసే సెనే?
దనుజుల పేర్మిమెచ్చఁదగుఁ! దప్పి వెడంగులు నిట్టు లందురే?

చ॥ అనవుడు వారలిట్లనిరి • యయ్యరో! యా ప్లవగంబు మేను మో
చిన ధరణీ న్నుతింపఁదగు • శిష్ట గణార్చితులౌ త్రిమూర్తు లం
దున నొకఁ డీతఁడన్న నది • తోఁచును న్యూనతగాఁగ నక్క పీం
ద్రుని కడిమిన్ గణింప నెవ • రుం బనియేమిఁకఁ గాంచ నేర్పడున్.

ఉ॥ వారణి చీలి యానెఱియ • దందడిఁ గంధి జలంబు నిండ ది
గ్వారణముల్ సురాసురులు • కక్కరి బిక్కరిగాఁగ దైత్యనా
రీ రమణీయ గర్భములు • వ్రీలఁగ రోదసి బూరటిల్ల న
మ్మారుతి హుంకరించె దశ • మస్తకుతో నటు వారు పల్కుచో.

## 6. కింకర వధ పటలము. (61)

చ॥ కులగిరి గహ్వరంబున న • ఘోర మహారవని పాత ఘోషమున్
జలనిధి మోషణంబు శివ • చాప విదారణ భీషణారవం
బిల సరిపోలు నారుతి స • మిద్ధ మణీమయ శీర్షక స్ఫుటా
కలిత దశాస్య మస్తదశ • కం బదరన్ వడిఁ జొచ్చె వీనులన్.

మ॥ చిఱునవ్వించుక యొర్వలేమి యలమం • జింతించి యాకోఁతి యం
బర వీథిన్ మఱి యెట్టులుం జనని తే • వన్ జట్టుముట్టాడి దు
ర్భరమౌ పోరొనరించి యేని త్వరగా • బంధించి తోతెండు పొం
డురవౌ సేనలతోడ నంచు సుభట • వ్యూహంబులం బంపఁగన్.

తే॥ శూల కుంత తోమర భిండి • పాల ముసల, పరశు పట్టిసాదులఁ దాల్చి • కజకునోఁకు
మూఁక లయకాలమున వార్ధి • పొంగి లేచు, కరణి నదరి బయలుదేఱెఁ • గపిని పట్ట

సీ॥ అలంబుపేరు వి • న్నంత మద్యముకంచె, నతిశయోత్సాహంబు • నందువారు
అడవి కంచెను పరమైన వారలు పెను, ఘోషచే బదధిక • గొప్పవారు

గిరికంబె నున్న త • వర దృఢ దేహులు. యశమున నాకస • మందువారు
దేవదానవకీర్తి • దీధితులను తమ. హుంకృతి చేతనే • యూడ్చువారు
తే॥ స్వల్పవైరంబు నిర్లక్ష్య • సరణి విడుట. యాపదలకు మూలంబని • యరసి దాని
కోఁతి వలనఁ దీర్చుకొనఁగఁ • గుందిసిగ్గు. పడిన హృదయంబు గలవారు • బాహుబలులు.
సీ॥ కత్తులు గలవారు • కవచముల్ గలవారు. వీర చిహ్నంబుల • వెలయువారు
వసుధ నడఁగ ద్రొక్కు • పదములు గలవారు. కదలనంటెడు కేలు • గలుగువారు
గగన మంటెడు మస్త • కంబులు గలవారు. కాళ్ళతో మలలను • గడపువారు
పిడుగుల కంటెను • పెదబొబ్బ గలవారు. వారి కరుల మ్రింగు • నోరివారు
తే॥ క్రొన్నెలంబోలు కోఱలఁ • గొఱలువారు. గుణకిణాంకిత భుజులు మా • ర్గణ నివిద్ధ
పాద పాణి వక్షఃఫాల • భాగులైన. వారు దివ్యభూషణముల • వఱలువారు.

ఉ॥ కేల గదాది సాధన వి • కీర్ణ మయూఖము లెండగాయఁగా
లీలఁగఁ బోవలేమి నడ • లించుచు బొండని త్రోవ ముందు వా
రేలొకా సాగరంచు బయ • లీదుచు నూకుచుఁ ద్రుళ్ళి నేలకున్
వ్రాలుచు నట్టు వ్రాలుటకు • వైనము లేక శ్రమంబు నొందుచున్

ఉ॥ సాధనముల్ తటిత్తులుగ • జాపము లింద్ర శరాసనాలుగాఁ
గ్రోధముతోడి యూరుపులె • ఘోరమరుత్తుగ మేసులెల్ల ధా
రాధర పంక్తిగా నదరి • రక్కసి మూఁక యుగాంతకాల పా
థోధరపాళి తారసిలు • తోయమునం జనుదెంచె నత్తఱిన్

చ॥ సురుచిర భూజయి క్షమయి • శోభిలు నివ్వని నెల్లఁగూల్చి భా
స్వర మఖ మండపంబు నొగిఁ • బగ్గము పాడుగఁ జేసినట్టి దొం
టరియగు కోఁతియయ్యెః విక • టంబుగ నున్నది నిద్దరారి వి
స్ఫురదురు శౌర్యమున్ ఘనయ • శోవిభవంబులు గాల్పనే యిఁకన్ ?

మ॥ అని అంపిల్లుచు నాయుధ ధ్వనులు శిం • జారావముల్ సింహ గ
ర్జనముల్ దంతుల ఘీంకృతుల్ తురగహే • షల్ గూడి పెన్ మ్రోఁతయై
తనరన్ భర్జనంబులఁ గపిం • చట్టుంచు కొట్టుండు చం
పినఁ జంపుండని యార్చి రయ్యమర వి • ద్వేషుల్ వడిం బోవుచున్

సీ॥ వీథులలోఁ జన • వెరవింతగానక. యెగసి మింటనె బోవ • నెగడు వారు
బొమలు విండుల నొక్క • పోలికగా వంచి. పొగయు నిట్టూర్పులు • పుచ్చువారు
ఒకరి నొండొకరు త్రో • చికొని ముందేగుట. గని వీరుఁడేః యని • కనలువారు
లంకలోఁ డమకుఁ బో • లఁగఁ జాలినంత తా. వమరదే యని పెద్ద • యఱచువారు
తే॥ తూణములనుండి యమ్ములు • దూయువారు. నొలలనుండి కత్తులనూడఁ • బెఱుకువారు
నెఱసి చోటింతలేక క్రి • క్కిఱియువారు. కుటిలదంతముల్ పటపట • గొఱుకువారు.

సీ॥ అల్పతపస్వులౌ • నహులు • పోరఁగలేక, పాఱుచో నవ్విన • వారువీరు
ధనదుని కీర్తి పా • తఱవేయ నలకను, పాదౌనరించిన • వారు వీరు
దురము సేయుట లేక • దురద పుట్టిన కేలఁ, బోరుగోరి తిరుగు • వారు వీరు
పూర్వయుద్ధంబుల • ముక్కాఁకలం దీఱి, వీరమద్దెలఁ గొన్న • వారు వీరు

తే॥ కొండలం బలెఁ జలియింప • కుండువారు, సమరదోహలులు కృతాస్త్రి • లమరవరులఁ
బెక్కుసారులు గెల్చిన • వీరవరులు, పుడమి నడుము విఱుగునట్లు • నడచినారు.

ఉ॥ కొండలఁ ద్రోయఁ డన్న వడిఁ • గుంభిని గూలఁగఁ ద్రొక్కఁ డన్న మా
ర్తాండుని నేల కీడ్వఁ డన • నబ్ధములన్ వెసఁ బిండుఁడన్న నొ
క్కండొకఁడే సమర్థుఁడయి • క్రాలు మరుత్సమ వేగవంతు లు
ద్దండబలుల్ రణక్రమ వి • దగ్ధులు సాహస శౌర్యధుర్యులున్

ఉ॥ పాచరజమ్ము స్వర్గపుర • వాసుల కన్నులుగప్ప శౌర్యమే
మోదము తోడ రూపమును • బొందిన చందము దోఁప మత్త నా
గాదన సంఘముం బలెను • వ్యాఘ్ర కదంబమువోలె నీల మే
ఘోచయ మట్లు దైత్యులు మ • హోద్ధతి నేగిరి బాణవేగులై.

చ॥ మిడుఁగులు కన్నులం దురల • మిక్కిలి యూర్పుల ధూమమొప్పఁగాఁ
దొడిబడు నాయుధంబుల ద్యు • తుల్ మిఱుమిట్లు గడింప రక్కసుల్
పిడుగులఁ బోలె నార్చుచును • వీఁకున నుబ్బుచు గంతులేయుచున్
సుడిసిరి చూచి పాడగు న • శోక వనంబు కాద్వడన్.

ఉ॥ భానుఁడు పూర్వచర్య మదిఁ • బాఱఁగ భీతిలి మింటఁదాఱఁగా
మానుగ రేఁగి వర్ధిలిన • మారుతి కాహళ తూర్య శంఖ భే
రీ నినదంబు మ్రోఁగ విని • రేఁగి నిశాచరు లాజి సేయఁగాఁ
బూనిక వచ్చు చుండుటలు • పోలునటంచుఁ దలంచి మోదిలెన్.

చ॥ వనమును గూల్చుచే తగిన • పద్ధతియంచుఁ దలంచె మున్నె యా
పని యనుకూల మార్గమును • పట్టుటచేఁ బెనుపోరు గల్గె నీ
దనుజుల తోడ నియ్యదియె • తాఁ దలపోసిన మైనమాట నె
మ్మనమున మోదమంది హను • మంతుఁడు వారలఁ గాంచెఁ దేఁకువన్.

చ॥ పగటనె రాత్రి తోఁచు చెలు • వంబగు నల్లని సోఁకుమూఁక యా
పగతుఁడు వీఁడె వీఁడె వెసఁ • బట్టుఁడు కొట్టుఁడు కట్టుఁడంచుఁ దెం
పుగ నటుచొచ్చి వాఁడిమియుఁ • బోఁడిమి వెల్వడ నార్చిరెల్ల భూ
గగన ధరాధరంబులును • కంధియు లంకయు బిట్టు కంపిలన్.

సీ॥ జలనిధి బెడిదంపు • టులివు కీడ్పడ శంఖ, భేరీరవములు గా • వించువారు
గుహలఁబోలిన నోళ్ళు • రహిఁ దెఱచినవారు, పొగరేఁగు చూపులనె • గడువారు

భుజగేంద్రు మెదయును • భుజము లొక్కటిగాఁగ, నడఁగంగఁ బుడమిపై • నడచువారు
బహువిధాయుధ మహా • ప్రభలు వంశాటవి, నలమినగతి వెల్గ • నడరువారుఁ
తే॥ గసిమసంగి యాలము సేయఁ • గడఁగినంతఁ, బావనియు నొక పెనుపాద • పంబు మిత్రు
పగిదిఁగని కేలఁదాలిచి • వాలి కదలి, నడిమి మందరమన వారి • నడుమ నిల్చె.

ఉ॥ కొండల ప్రీల్చునట్టి పిడు • గుల్ సహితంబు వడంకు పోటు దో
ర్దండ బలంబునం దరు వ • రంబున రక్కసి పిండుఁ దాఁపఁగాఁ
గొండల వాఁగులం బలెనె • కొండలఁబోలు భుజాలు వ్రచ్చి యం
దుండి మహాస్ర ధార లిల • నోడిగిలం బడి చచ్చి రక్కసుల్.

తే॥ కొందఱతనిపైఁ గైదువుల్ • గూర విసరి, పొట్టలవియఁబండ్లునుబోవ • మొగము లగలఁ
ద్రొక్కఁబడి రక్తమాంసముల్ • దుక్కిగాఁగఁ, జదిసి రూపఱఁ జచ్చి రా • స్థలము నంద

చ॥ ఒరపిడిచేత రాఁజిన మ • హోజ్జ్వల వహ్ని యెసంగి వెండ్రుకల్
మటుమటఁ జూఁడఁ గంఠములు • స్రుక్కఁగ గన్నులువోవ మూఁపులన్
విరవిరవోవ వీఁపులును • ప్రీలఁగ నిట్టటు వోవలేక దు
ర్భరమగు తాపముం బొరసి • పాసిరి కొందఱు జీవితంబులన్.

॥ అక్కునఁ దన్నఁగ నెత్తురు, గ్రక్కుచు బొమ్మలును పగుల • ఁగరములు విఱుగన్
స్రుక్కుచు విలవిల వోవుచు, ముక్కుచుఁ గొందఱు నలంగి • ముగిసిరి సోఁకుల్.

ఉ॥ పొందుగఁ జెంతఁ గానఁబడు • భూధ్రము మీఁదికి వైవ నందుచేఁ
గొందఱు నాకలోకమునఁ • గొందఱు గుహ్యక పట్టనంబునన్
గొందఱు వ్యోమమందు మఱి • కొందఱు సందరమందుచేరి యే
చందమునన్ నివర్తిలఁగఁ • జాలక యీల్గిరి పోవు త్రోవలన్.

॥ కాళ్ళు చేతులు విఱిచి య • క్కడనె వైవ • తెక్కలూడిన కొండల • రీతిఁబడిరి
తివిరి వాలంబునం జుట్టి • త్రిప్పివిడువ, గిరగిరం దిర్గిఁ రువ్వఁ బొం • గరములట్లు.

ఉ॥ కొందఱ ఖడ్గముల్ విఱిగెఁ • గొందఱ చాపగదాదు లుక్కఱెన్
గొందఱ బాహువుల్ తెగియెఁ • గొందఱ మోములు నల్గి రూపఱెన్
గొందఱ పండ్లురాలె మఱి • కొందఱ కాళులువోయె మధ్యముల్
కొందఱ కుక్కె నెమ్మికలు • కొందఱకుం బొడియయ్యె నయ్యెడన్.

ఉ॥ కొందఱ చర్మముల్ చినిఁగెఁ • గొందఱ వర్మము శీర్ణమయ్యె వే
కొందఱ మేలు చీలె మఱి • కొందఱ దేహము లయ్యె నజ్జుగాఁ
గొందఱ మస్తముల్ చిదిసెఁ • గొందఱ కాయము లయ్యె బజ్జిగాఁ
గొందఱ గాత్రముల్ మునిఁగెఁ • గ్రొత్తగ నొత్తిలి పాఱు నెత్తుటన్.

॥ కాలఁ గొందఱ రాఁచి • కేలఁ గొందఱఁ దాఁచి, వాలుతోఁ గొందఱ • వైచి వైచి
చూపులఁ గొందఱఁ • దాఁపులఁ గొందఱ, రాపులఁ గొందఱ • వ్రాల్చి వ్రాల్చి

వీరం గింకర వర్గముల్ మడిసెనా ? • వీరాటమున్ మానెనా ?
పాఱం బోచ్చెన? యేమి యయ్యె? ననుచుం • బ్రశ్నింప నవ్వారలున్.

తే॥ వారు బెగ్గిలి పాఱిన • వారుగారు, ప్లవగ మని యలక్ష్యంబున • వదలలేదు
తెలిసి కల్ల సాక్ష్యంబిచ్చు • ములుచ కొలము, మాడ్కిఁ గోఁతిచే వారలు • మాఁడిరనుడు.

మ॥ తనయాజ్ఞన్ దరిఁజేరి సేవలను వాం • దం జేయు దిక్పాలురం
గని లజ్జించుచు రావణుండు వనర • క్షా దళులం గాంచి యూ
రిన చందం బిది యంచెఱుంగఁగ విచా • రింపంగఁ బ్రాల్మాలి నో
రను వెవ్వడ్డదియెల్లఁ బ్రేలెదరె దు • ర్వారింతాత్మలై ముంగలన్.

తే॥ అనుడు వారరయున నేమి • యనఁగలేక, వడఁకుచు న్నిల్వ కోఁతి యీ • పగిదిచేతఁ
మీరు విన్నదా? కన్నదా? నీరునమల, • కంతయును దెల్పఁగోరెద • ననఁగ వారు.

ఉ॥ ప్రక్కఁ గొదింగి నిల్చి భయ • భావమునం దనువుల్ కుదించి నేఁ
డక్కట! నేమి సెప్ప దను జాధిప! కోఁతియొకండె కింకరుల్
క్రిక్కిరఁగుండఁ జావ నొక • వృక్షము చైకొని త్రిప్పి త్రిప్పి య
మ్మక్కఁ! సమస్తముం జదిపి • యచ్చట నున్నది పాటి దెయ్యెడన్.

## జంబుమాలి వధ పటలము.

మ॥ వనపాలోక్త విధానము న్వినిన దే • వద్వేషి కోపించి క్ర
న్నన బిట్టూర్చుచు జంబుమాలిఁ గని సై • న్యశ్రేణితో నేగి కో
తిని గర్వం బడఁగించి పట్టుకొని వే • తెమ్మిట్లు నామ్రోలకున్
ఘన మోదంబును నాకుఁ గూర్చు మిది నీ • కార్యంబనన్ దైత్యుఁడున్

ఆ॥ మ్రొక్కి లెక్కలేని • మూఁకలో నన్ను నీ, పనికిఁ దేర్చిపంపు • భాగ్య మొదవె
ధన్యుఁడైతి ననుచు • దైత్యు కోపంబె రూ, పొందెననఁగ నేగె • యుద్ధమునకు

మ॥ తన సైన్యంబులతోడఁ బంక్తిముఖుఁ డొం • దం బంపు సైన్యంబుతో
జనకుం డంపిన సేనతోడను సుహృ • త్సైన్యంబుతో నేగి నేఁ
డని సేయంగల భాగ్యమబ్బె నను న • త్యానంద వృత్తిం బ్రహ
స్తుని పుత్త్రుండగు జంబుమాలి నడచెన్ • దోషాటు లగ్గింపఁగన్

సీ॥ పిడుగుల మొగుళులఁ • బెనచి ప్రాణమువోసి, నిలిపెనా నొప్పు న • నేకపములు
ఉఱుములు మెఱుములు • నొక్కటిగాఁ జేయఁ, బరఁగిన వననొప్పు • నరదములును
గాలిని నాలుగు • కాళ్లుగా నొనరించి, ధరనిల్పె నన నొప్పు • హరి చయములు
వజ్రంబు వినుము హృ • ద్వపువులు గాఁగొని, గ్రాలిన వననొప్పు • కాల్బలములు

తే॥ గుహలనుండి పులులు వచ్చు • కోపుదోఁప, ఖడ్గ శర శరాసన తూణ • ఘనగ దాది
సాధనంబులు మెఱయంగ • జంబుమాలి, సైన్యములు సాగె మేదినీ • చక్రమదర.

తే॥ చిఱుకటారు లీఁటి యలును • సిడము లంబు, దంబు నొరయంగనైన రం•ధ్రములనుండి
కాఱు జలములు రజముతోఁ • గలిసి వ్రణము, లందు గాఱు రక్తంబునా • నతిశయిల్లె.

తే॥ నేమి రవములు శంఖధ్వ • నియుఁ దురంగ, హేషణములు వివిధ వాద్య • ఘోషణములు
కింకిణుల విండ్లరుతులు ఘీం • కృతులుమిగులఁ, గలిసివేల్పుల పలుకులఁ • గలఁతపఱిచె.

తే కనకమయమైన లంకా వ • గరము ప్రిదిలి, యెగురు ధూళిపైఁబడఁగొండ • లెల్లస్వర్ణ
గిరిని పోలెను తక్కిన•పుర వరములు, నాక లోకంబు బోలి వి • న్నాణమొందె

తే॥ రక్కసులసేనఁ బదివేల • రథములుండె, వాని కినుమడియై యుండె • వారణములు
వానికిమ్మడియై యొప్పె • వారువములు, వానికిబ్బడి యయ్యెగా • బ్బలములెన్న.

ఉ॥ అందఱు నాఱితేఱిన మ • హాహవ యోధులు మాయలందు పే
రందినవారు నేత్రముల • యందు మహోగ్రత చూపువారు చే
వం దనరారువారు తత • వక్షములం గవచంబు దాల్చినా
రెందును సాటిలేని విజ • యేందిరఁ జేకొనినారు నిచ్చలున్.

తే॥ వారణారోహణక్రియా•ప్రథితు లస్త్ర, శస్త్రవిద్యాప్రవీణులు • చతురమతులు
వ్యూహ నిర్మాణచతురులు • సాహసులును, నిర్ఋతివంశ్యులు తరణి స • న్నిభులువారు

తే॥ రథగజాదిరోహకుల శి • రంబులపయి, నెగిరిపోవు మనోవేగమె• నయు వార
లాశ్వికులు వారి గుఱ్ఱమ్ము • లట్టివయగు, వివిధ గతులనెఱింగిన • జవన హరులు.

చ॥ అరయఁగ జంబుమాలి చతు • రంగ బలంబులు చుట్టిరాఁగ ని
ర్జరులు భయంపడం గనులు • చంద్ర మిడుంగుఱు లట్లు వెల్గఁ బె
న్నరదము మీఁదఁ గొండవలె • నాతఁడు గ్రాలఁగఁ గంకటంబు పే
రురమునఁ గారు చిచ్చువలె • నుజ్జ్వలమై వెలయన్ వెసం జనెన్.

చ॥ రణమొనరింప రక్కసులు • రారొకొ? యేలొకొ తామసంబు ప
ట్టణమున నున్న వీరుల క • దంక నశించెనొ యింతకం చవా
రణగతి మారుతాత్మజుఁడు • క్రన్న నశోక వన ప్రధాన తో
రణ ముఖసీమ దానవుల • రాకఁ బ్రతీక్షణ సేయఁగాఁ జనెన్.

చ॥ స్ఫటిక శిలా హిరణ్మయ వి • భాసుర సౌధ విశేష కాంతి చీఁ
కటులఁ జెదర్పఁగాఁ జకచ • కల్ గల రత్న మయూఖ జాలకం
బటనట వన్నెచిన్నె లెస • లాఁరగ మారుతి యందుఁ దోఁచెఁ జొ
క్కటమగు వేవెలుంగు నడు • కంధిని భాసిలఁ దోఁచు రీతిగన్.

చ॥ పిడుగుల తోడ మేఘములు • ప్రీలఁగ సంభ్రమము కొండలింప ము
వ్పడరిన దంచు పర్వత గు • హాంతర సీమల సర్పముల్ విసం
బెడలఁగఁ గ్రక్క రక్కసుల • హీనభయంబు భజింప వేల్పు పిం
డడలఁగ నాంజనేయుఁడు మ • హారవముం బొనరించె నయ్యెడన్.

తే॥ దిగ్గజములు విశ్రాంతిఁ బొం • దెను కూర్ముండు, దద్దరిల్లె వృక్షంబులు • ధరణిరాలెఁ
బర్వతంబులు భూమియు • బ్రద్దలయ్యె, నలఁగెఁ గరియు హనుమ బా • హాస్ఫాలింప.

తే॥ అంత దైత్యులు కదలి పె • ల్లార్చి పేర్చి, పెంటలును రక్తవాహినుల్ • పెరిఁగివారి
నాఁడె పెట్టుట వలన నా • హనుమఁ జేర, ననువుదోఁపక చిక్కులి • యడిచిపడిరి.

తే॥ జంబుమాలి సైన్యము విధ • జనముచేసి, రెండు ప్రక్కలఁ బంపి యా • దండ తాను
రథికుఁడై దాయ హనుమ వా • రలనుగాంచి, సంతసింపఁ బూరించె ఘ • జంబు లంత

చ॥ అమరిన దీప్త దీప శిఖ • యందము నొంది వెలుంగు నూర్ధ్వ పుం
డ్రములగల ఫాలమే మొదటి • రాణువగా సఖరాజి నిట్టరో
మములు చెలంగు బాహువులె • మధ్యమసేనగ వాలు వెన్క సై
న్యముగఁ బొసంగఁ బావనియు నాయితమయ్యె రణంబుసేయఁగన్.

ఉ॥ కాహళముల్ చెలంగ నెస • కంబుగ వాద్య విరావమొప్ప మా
యాహవ దోహలుల్ బహు వి • ధాయుధ వర్గము నాంజనేయుపై
నోహరి సాహరిన్ వయిచి • రుద్ధతి నాతఁడు చూచి లోక వి
ద్రోహులు కుంపఁ దూల్చె నొక • దోరణ గంబముతోడ నన్నిటిన్

ఉ॥ దోరణ గంబమున్ సమర • దోహలుఁడై కొని తాను దిగుటల్
పోరుట గానలేక వెలుఁ • బొందుచు గుంపులు గూడుచున్ విడం
బాఱుచుఁ దాఱుచున్ మరలి • పైకొనుచున్ దిరుగాడు విద్విష
ద్వీరులఁ గాల సద్మమున • విందులుగాఁ జనునట్లు మోఁదుచున్.

తే॥ ఏయునవి క్రమ్మనవి యగు • నాయుధముల, నెదమచేత నలంచుచు • గుడికరమున
పోరు సాగింప నంజనీ • పుత్త్రకుండు, దొరలె రథములు గజములు • తురగములును

తే॥ మోఁదుదిన్న యేనుంగులు • మీఁది కెక్కె, ములను దంతములను తొండ • ములను చెవులఁ
గాళ్ళ మద జలంబులను ఘీం • కారములను, కినుకలెల్లను పోఁగొట్టు • కొనియె నపుడు

తే॥ వీరు లెక్కివచ్చిన రథ • వితతి నొగలు, ప్రక్కలును శిఖరములు చ • క్రములు కింకి
ణులుఁ సుధ్వజములు వారువ • ములును నలఁగి, మహిని చెదరి పడియె హనూ • మంతుచేత

ఉ॥ కొన్నిటి కుత్తుకల్ దెగియెఁ • గొన్నిటి పొట్టలు వ్రీలెఁ బ్రేవులున్
గొన్నిటి కీఁగెఁ గొన్నిటి య • కుంఠిత వేగము క్రుంగెఁ గాళ్ళు వోఁ
గొన్నిటి ముచ్చులే విఱిఁగెఁ • గొన్నిటి యెముకలు వ్రస్సె నుగ్గుగాఁ
గొన్ని నశించెఁ • గొన్నివడెఁ • గొన్ని యడంగెఁ దురంగ బృందముల్

ఉ॥ కొందఱు వివ్వలించుచును • కొందఱు కుందుచుఁ గొంద ఱేడ్చుచుం
గొందఱు దిగ్భ్రమంగొనుచుఁ • గొందఱు వోవుచుఁ గొంద ఱార్చుచుం
గొందఱు పాఱుచుం బొరలి • కుప్పలు గూలుచుఁ జచ్చుచుండఁగాఁ
గొందఱు దవ్వునుండి కని • కొంకుచుఁ బాఱిరి తిర్గిచూచుచున్

ఆ॥ కరులచేతఁ గరుల • హరులచే హరులను, కాల్బలముఁతోడఁ • గాల్బలముల
స్యందనములతోడ • స్యందనంబులఁ గూల్చెఁ, గదనమందు హనుమ • కసిమసంగి.

ఆ॥ కాళ్ళు తలలు తునిఁగెఁ • గంధరంబులు తెగె, భుజము లూడిపడియె • బురదయయ్యె
మెదడు నెత్తు రురలి • మదగజావళులందు, మునుక వేసి యట్లె • మునిఁగిపోయె.

తే॥ దనుజవరులను వక్రదం • తములతోడఁ, గరులతో విండ్లతోడ ఖ • డ్గములతోడఁ
గడిమితో గర్జనలతోడఁ • గజకుతోడఁ, నలగఁ ద్రొక్కి చంపెను మరు • న్నందనుండు.

చ॥ మిడుఁగులు సుందుగాఁ జెదరి • మేఁగ జరించెడు వాయుపుత్త్రుఁ డా
సిడముల చెంత నేనుఁగులఁ • చెంత రథంబులచెంత గుఱ్ఱపుం
దడముల చెంతఁ బద్గసము • దాయముచెంత మతేడఁ జూడ న
క్కడఁ గనవచ్చె నచ్చెరువు • గాఁ గనువారల కుగ్ర వేగుఁడై.

తే॥ కరుల తలలపై వీర వ • క్షములమీఁద, వారువముల వీఁపులపయిఁ • దేరులపయి
విలయకాలాశనియొ నాఁగ • వెలసి దుమికె, హనుమ నజ్జునజ్జుగ నవి • నవసిపోవ.

మ॥ జగతిన్ నిశ్చలరీతి వర్తిలు నృపా • జ్ఞాచక్రముం బోలె ము
జ్జగముల్ పొంపిరివోవు సజ్జనుల వి • జ్ఞానప్రభం బోలె బా
డిగకున్ దేహము నొప్పగించు ధనచే • టీ చిత్తముం బోలె నా
శుగపుత్త్రుం డెటఁ జూడఁ దానమయి సం • శోభిల్లె రంగస్థలిన్.

మ॥ భగవద్భక్తులు సర్వదా హరిని సం • భావించి సారూప్య మొ
ప్పుగ సాధించెదరన్న యర్థమును సం • పూర్ణంబుగాఁ జూపుచున్
గగనంబందున ధాత్రియందునను ది • గ్భాగంబులన్ ముందరన్
దగ దెందంబునఁ గానిపించెను మరు • త్సంజాతుఁ డయ్యెడన్.

మ॥ ధ్వజరాజద్రథ పంక్తి రథ్యములతో • దాచేత మత్తద్విప
వ్రజమున్ వేఱొకచేత గుఱ్ఱముల ను • గ్రక్రోధుడై పోరు పు
ణ్యజనాళిం బన సంప్రఘాతముల భ • గ్న ధ్వంసముల్ జేసి య
క్కజుఁడై పేర్చె యుగాంతకాల లయరే • ఖం బొల్చు రుద్రుండనన్.

తే॥ చక్రఖడ్గతోమర పర • శ్వథరథాశ్వ, గజ లసచ్ఛత్ర కేతన • కాండమెల్లఁ
గుప్పలై కూలి నెత్తుటఁ • దెప్పదేలె, పూచి విలసిల్లు పెను జల • పూరమట్లు

తే॥ దొరకు నాయుధములఁ గొని • తొదరియేయఁ, దెగినతలలును కొండలఁ • బగులు తలలు
నెగురుతలలు నొండొంటికిఁ • దగులు తలలు, తటపటాయించె సంగర • స్థలమునందు.

తే॥ జముని కరణి విజృంభించి • జంబుమాలి, కుపితసింహంబు కరిఘటం • గూల్చుత్రోయ
మిగిలి యున్న యూధపమట్లు • మెఱసి తేనె, వంటి కన్నుల నిప్పుకల్ • వఱలఁదాఁకె

ఉ॥ పీనుఁగు లడ్డదిడ్డముగఁ • బెంటగఁ గూలిన సంగరస్థలిన్
జానుగ స్యందనం బరుగఁ • జాలని తీరు నెఱింగి వేఁగుగాఁ

టో నెదలేక యుండియును • వీరుసదుం ద్వరసేసెఁ బాప మా
దానవవీరు దుస్థితి వి • ధంబడి యొప్పెను శోచనీయమై

ఉ॥ పూచిన కింశుకాకృతిని • పోల్చిన పాపని జంబుమాలితోఁ
జూచిన స్యందనమ్మొకటి • సొమ్ముగ నాయుధ మొక్కటయ్యె నిన్
గాచుట కేగుదెంచిన ని • కాయముఁ గావక యొంటివైతి ని
న్నేఁచుట సిరిగాదు మఱి • యేగుము పిదెద సన్న దైత్యుఁడున్

శా॥ కారుణ్యామృతమూర్తి వీ పదియు ని • క్కంబిప్డు నాపైని దై
వాలం జూపితి మేలుమేలు భళీ యె • వ్వాఁడంచు నన్నెంచితో
పోరాటంబున కేను జంకుదునె పో • పొమ్మంచు దర్పించుచున్
గ్రూరాస్త్రంబులు పెక్కులేసి యొదలం • గ్రుచ్చెం గ్రుధామగ్నుఁడై.

ఉ॥ మారుతి జంబుమాలిఁ గని • మాయురె యాయుధహీనుతోడ వే
పోర వలంతి వౌదనుచుఁ • బూనిన దోరణ గుంజఁ ద్రిప్పి దే
వారి శరంబులన్ జలక • బాపలి వాయువు దూల్చు లీలఁ బెం
దూపమునం బడంగ వడిఁ • దూల్చి హసింపఁగ వాఁడు హుంకృతిన్

చ॥ అదలిచి తేరు వాయుసుతు • నందకుఁ దోలఁగఁ దెర్వులేమి నం
గదగొని కిన్క వాయుజుని • కాయము మొత్తము నొవ్వఁ గర్కశ
ప్రదరములేసి చేతఁ బొల • పంబగు దోరణగుంజ తున్కలై
చెదరఁగఁ గొట్టి యార్చెఁ గపి • శేఖరుఁ డంతట రేఁగి యుద్ధృతిన్

ఉ॥ లెక్కకుమీఱి పైఁబడు శి • లీముఖముల్ గణియింపకోర్చి పే
రుక్కున వాని తేరిపయి • కుగ్రతరాకృతి నుద్గమించి వి
ల్లక్కసుతోడ లాగి గన • యమ్మునఁ గొంతు దగిల్చి నెత్తురుల్
గ్రక్కుచుఁ గూలి చావఁగ స • రాలున నీడ్చెను దోర్బలంబునన్

ఉ॥ ఆవలఁ దేరినుండి దిగి • యారథమున్ రథచోదకుం దురం
గావళి నుగ్గునూచముగఁ • గాళ్ళనుద్రొక్కి విదిర్చి తోరణ
స్థావర గుంధ మెక్కెను స • దాగతి పుత్త్రుఁడు తీఱువృత్తమున్
గావలివాండ్రు కాంచి కలఁ • కం జని రంతయుఁ దెల్ప జేనికిన్.

చ॥ పరుగున శోక విహ్వలత • వచ్చి దువారములందు చూచు న
త్తరుణులు భర్తృదేహముల • దారుణ రీతిగ నీడ్చుకొంచు నె
త్తురు వఱదల్ రహింపఁగని • దుఃఖము జెందిరి లంకయెల్ల దు
ర్భరమగు నాలగోడుగను • బాలుర గోడుగ నయ్యెడన్

ఉ॥ ఏగిన కావలీంద్రు దను • జేంద్రుని సన్నిధిఁజేరి తెల్పఁగా
వీఁగుచు వెక్కసంపడుచు వెక్కుచునుండఁగ భీతియేల? మీ

రేగతి గాంచినారొ ? యన • నిట్లని పల్కిరి జంకి వారు దే
వా ! గతియించి రెల్ల రొక • వానరుచే మన జంబుమాలితో.

ఉ॥ ఆ పలు కాలకించి దను • జాధిపుఁ డుల్లము మండఁ గన్నులన్
వేపకు రక్త బిందువులు • దీర్ణత రాలఁగ నిట్టులయ్యెనే
నాపని ? నేనవచ్చి జత • నంబునఁ బట్టెదఁ గోఁతినన్న సే
నాపతు లేవు రిట్లనిరి • నాయకు కోపము సుంత శాంతిలన్.

## 10. సేనాపతి పంచక వధ పటలము. (67)

॥ సార్వభౌమా ! నీవు • సాలీఁడులం దిని. మనుకోతితోఁ బోరఁ•జనెదవేని
వర్షహీనత చేత • వనటిన సెలయేళ్ళఁ. గల పర్వతంబుల • కరణి నున్న
దిక్కరుల్ క్రమ్మఱఁ • దివిరి సాగర దాన, సీధువు లొప్పారఁ • జెలఁగకున్నె ?
ఉరుజవ సత్త్వుండు • గరుడుఁ డుద్ధతి మశ, కములపై నేగెడు • కరణిఁ గాదె ?

॥ అల్ప వానరుపై నీవ • యరిగినంత. నీభుజబలంబుఁ జింతించి • నిసియఁ బవలుఁ
గొదుకు తారాద్రి తనదు సం • కోచవృత్తి. మాని యెప్పటి సంస్థితి • నూనకున్నె ?

॥ ఈవ యాకోఁతిపై • నేగితివేని ని, న్నెదిరించి ఫలమేమి • యొదవ కుండ
నీపేరు వినుటకు • నోపక భీతిల్లి. పాఱు త్రిమూర్తుల • వదనములకు
మందహాస రుచులు•కందళింపవె ? దీన, ఫలము సుంతేనియుఁ • గలదె నీకు ?
నదిగాక నీ వస • హాయుఁడ వైతంచుఁ. బరులు తలఁపఁ దగ్గ • పని యదేల ?

॥ మున్ను కొందఱఁ బంపితి • మోఱకులను ఇప్పుడు చితంబుఁ బాటించి. యెలమినించి
మమ్ము పంపుమా యనుచు న • మస్కరింప. లెస్సయని సమ్మతించె ని • లింపవైరి

॥ అఖిల జగముల కాధి ప • త్యము వహించి. నంత సంతసమంది సే • నాధిపతులు
వలసినంత బలముగొని • బవరమునకు. నేఁకరిన వారు రందని • యెఱుక పఱుప.

॥ సంభ్రముంబలెఁ దెరలెను • సైన్యసమితి. మొగులులంబలె దుందుభుల్ • మ్రోఁగెఁ బెలుచ
కారు మబ్బుల మెఱపుల • కరణిమెఱసె. నసురల కరంబులందలి • యాయుధములు

॥ గగనముం దాఁకు పొడవైన • కాళ్లగలవి. నింగి వాఁక యలఁఁబోలె • నెగడుసవియు
నైన పెక్కేముల్ చచ్చిన • యసురకీర్తు. లట్లు గాలికిఁ దటపట • లాడుచుండె.

॥ పసిఁడి గండపెండరములు • బాణపూర్ణ. తూణ కవచాదుల ధరించి • రాణనొప్పి
యరదములకు గుఱ్ఱాలకు • హస్తిఘటకు. స్వేచ్ఛకొలఁది వేడుకగఁగై • సేసినారు.

ఉ॥ ఏఱులఁజేసె మార్గము మ • దేభ గళన్మదధార లేఱులన్
దేరులు త్రొక్కి దమ్ముగను • దీర్చెఁ దురంగ ఖుర ప్రఘాతముల్

మాటిచె దుక్కిగా మరల • మావుల చెంగలు చేసె రొప్పుగాఁ
దోరము క్రింది వారల గ • తుల్ వివిధంబులు భూతలంబునన్.

తే॥ స్యందన ధ్వని హరుల హే • షలును కరుల, ఘీంకృతులు తూర్యవాదన • ఢాంకృతులును
సింహ నాదమ్ములొక్కటై • చేరియెసఁగి, కడలిఘోషంబుకంటె ము • మ్మడుఁగు మీఱె

క॥ ఏఁబదివేల రథంబుల, నేఁబదివే లిభచయంబు • నిమ్మడి తేజుల్
ధీబలయుతమై లక్షలఁ, బైఁబడిన పదాతిసేన • బయలన్ వెడలెన్

సీ॥ సేనాపతుల వీరఁ • జెప్పెదరాఁ గ్రోవ, లేక క్రిక్కిఱిసిన • మూఁకయందు
కైదువు లొఱసెడు • కతన వెల్వడిన యిం, గలములు మొగుళులఁ • గాల్చుచుండ
మదగజ ఘంటికా • మాద్యద్ధ్వరావంబు, పిడుగుల కంటెను • భీతిఁగొలుప
విప్పులవలె నున్న • నేత్రముల్ ఘూషామ, ణులు మబ్బువిడు రవి • చెలువుకోఁప

తే॥ మద మతంగజంబుల పయి • మావులపయి, సరదములపయి వెడలు వీ • రాళిఁగాంచి
చెలుల లోహాబి సారంబు • సేయవచ్చి, పతులఁ గనుఁగొని యుల్లముల్ • పల్లటిలఁగ.

చ॥ వెడలిన వార లొక్కరును • వెన్కకురారు ప్లవంగ వీర్యమో
బెడిదము పోవకుండనుడు • వీరు లుపేక్షయొనర్పఁ జెల్వలున్
బడిబడి పోయి కీళునకె • ప్రాణము నిత్తము భర్తృ యోగ మె
య్యెడలను వీడకుండు నని • యేఁరి కొందఱు కొందలంబునన్

సీ॥ కాలమేఘముకంటె • ఘనదేహములవారు, పంచభూతంబులే • యంచితముగ
రూపుగొన్నవి యన • రూఢికెక్కినవారు, మహిత సైన్యాంబుధి • మధ్యగతులు
పంచసేనాపతుల్ • భాస్వద్రథము లెక్కి, పంచ భాస్కరులనఁ • బరిఢవిల్లి
పంచేంద్రియంబుల • పగిది నెల్లర కుప, ద్రవము శెల్లప్పుడుఁ • దడవువారు

తే॥ వజ్రివజ్రము వరుణుని • పాశము యమ, దండమును వ్యర్థపఱచు వో • ర్ఘండు లెదుట
మొనసి పెక్కు వాద్యంబులు • మ్రోఁగుచుండ, నారి మొరయించుచు బయలు • దేఱినారు

తే॥ తారకుని కూల్చినట్టి కు • మారునెక్కి, రింత యూఁకల తోడ వి • రించియంచ
తెక్కలను పేనినట్టి సూ • త్రికల వీర, పట్టములను ఫాలంబులఁ • గట్టినారు

తే॥ రావణుని వక్షముం దాఁకి • ప్రస్సి పడిన, దిక్కరుల రదనములఁ జి • త్రింపఁబడిన
కుండలములు గలారు ది • క్కుంభివదన, పట్టములనె నోసళ్ళకుఁ • గట్టినారు.

తే॥ నవనిధీశుని లంకాధి • నాయకుండు, గెలిచి యలకాపురము కొల్ల • గొలుపునాఁడు
తేర్చిమూట గట్టుకొనిన • దివ్యభూష, ణములఁ దాల్చి వెలుంగు నం • గముల వారు

తే॥ అమరవిభుఁ దోడిపాఱ వె • న్నంటి తటిమి, వెల్ల చౌవంతి వాలంబు • వెనుకకీడ్చి
పట్టి జాణవయేని వే • పాఱుమనుచు, నిలువఁబెట్టిన ఘన భుజ • బలులువారు.

తే॥ బ్రహ్మయాజ్ఞచే సమవర్తి • ప్రాణములను, గొనుచు భవదాజ్ఞ దాఁటినాఁ • డనుచు లంక
జనులపక్క విభుని యాజ్ఞ • క్షమనుఁబట్టి, కట్టి బంది నుంచిన పరా • క్రముల వారు.

తే॥ కరువలం గేరు పీన వ • క్షములవారు, ఉదధి యలల హసించు బా • హువులవారు
జముని మించి తత్కార్యంబు • జరపువారు, కొలిమి నిప్పులవంటి క • న్నులుగలారు.

మ॥ విలయోత్పాతముగాఁగ బాడబము పృ • థ్వీభాగమున్ గప్పినన్
బలువాతోద్ధతి ఘోరమై పరవినన్ • వారాసు లుప్పొంగినన్
జలదశ్రేణి భువిం గలంప నదరన్ • సత్త్వంబుచే వాని య
గ్గలికన్ మాన్ప సమర్థులున్ శిఖగుణ • క్లాంతి వ్యథాదూరులున్.

తే॥ వెడలి తోరణంబును సమీ • పించి చుట్టి వాహినుల వ్యూహముగ నిల్పి • పతులు పిలువ
వారి పనులను కనుల నే • పారఁగాంచి, హనుమ యొకసారి గర్జించె • నసురు లదల.

తే॥ దళమొ యధికంబు మొనగాండ్ర • బలమొ పెచ్చు, పావనియొ యొంటియయ్యె నే • పగిది ముగియు
ననుచు నింద్రాది దేవత • లాకసమున, జంకుగొంకును పొంది రా • సమయ మందు.

తే॥ వచ్చి రీరక్కసులు జము • వాతఁబడఁగ, ననుచు మారుతి చుట్టు సై • న్యములఁ గాంచి
తన భుజంబులఁగని మది • వనజనేత్రుఁ, గొని మహోత్సాహమున లేచి • కొప్పరించె.

తే॥ కోఁతి యొక్కటి జరిగిన • ఘోరసమర, మందు జయమంది వేలుపు • లొందుకీర్తిఁ
గ్రుంగఁజేసిన రాకాసి • కూటువలన, దంచెనే యని కుందె న • క్తంచరాళి.

తే॥ నందనము నుండి తెచ్చి వ • నంబునందు, రావణుండు నాటించు తో • రణము మీఁదఁ
గౌతుకంబునఁ బెరిఁగెను • గగనమంట, భువన భీకరుఁడై వాయు • పుత్రుఁడపుడు.

తే॥ వర్ధిలిన మారుతిని కని • భ్రమము నొంది, విమతులై బొమల్ ముడివైచి • విండ్లువంచి
నిశిత నారాచముల నాంజ • నెయు మీఁదఁ, బరపి రయ్యెడ శంఖ రా • వంబు ప్రబల.

తే॥ తక్కురక్కసు లగ్నులు • గ్రక్కువాఁడి, కైదువులనేసి రవి కపి • కాయ మంటి
దురదపోవ గీఱిన గతి • దొరయ హనుమ, కొంత సేపు కనుల్ మూపి • కొనియె సైఁచి

తే॥ మఱియుఁ గొట్టవచ్చి నయంత • మారుతియును, తక్కువారలుపోరరాఁ • దరుణ మొసఁగి
యెదుటి వారల వడిమడి • యింపఁదలంచి, యందుగల యుక్కు కంబంబు • నందికొనియె.

తే॥ కంబమును గొని వైచిన • కైదువులను, వీరులను వారువంబుల • వారణముల
రథ చయంబుల బలు దుమా • రంబు రేఁగఁ, జితుకఁగొట్టె క్షణంబునఁ • జెలఁగియార్చె

తే॥ రథసమూహంబు విఱిచి చ • క్రములఁగొంచు, దంతులఁ జడిపి వాని దం • తములఁగొనుచు
నసురులం జంపి వారి క • రాసులఁగొని, చీల్చె నశ్వచయంబు నా • శ్వికులతోడ.

తే॥ రెండు పెద్ద తేర్ల • రెండు చేతుల నెత్తి, రెండు కరులు చదిసి • ప్రీలవైచె
రెండు కరులనెత్తి • రెండు గుట్టంబుల, నలఁగఁగొట్టె వీర • నాద మొసర

॥ పెద్దకొండ యొండు • పెకలించి కొని వేయి, పొదవుతేరు లడఁగఁ • బూడ్చివైచెఁ
బెద్ద సాల మొండు • పెకలించికొని వేయి, నాగ సముదయంబు • నలియఁ గొట్టె.

తే॥ ద్వీపములం దవ్వి తేరులఁ • దిరుగవైచి, తేరుల నలంచి పిడుగుల • యోజ దుమికి
వీరవరుల శిరంబులు • పేఁపు లగల, నలఁచి పొడిచి ఱిక్కి కలచి • పొలియఁ జేసె.

తే॥ వేగముగఁ బాఱు రథముల • నాగములను, నింటికిని దిగంతములకు • విసరివైచె
స్వారిగుఱ్ఱంబులను వాని • పైని నుగల, బలిమి నొక్కటిగాఁ జేసి • నులిమి వైచె.

చ॥ ఎగురఁగ వైవఁబడ్డ ద్విర • దేంద్రము లంబుధిలోనఁ గూలుచున్
దగఁ దెలు చాపతో మునిఁగి • తాఱు శిలంబుల ధంగిఁ దోఁచె న
ల్లెగసిన స్యందనావళులు • హేమమణి ప్రభ లుల్లసిల్ల నం
దగపడె నప్పుడే పొడము • నంబుజమిత్రు రథంబు కైపడిన్.

ఉ॥ మారుతి మింటికిన్ విసరు • మావులు రక్తము గ్రక్కుచున్ మహా
వారిధిఁ గూలి వహ్ని విడు • బాడబ సంఘముఁ బోలె వాలుతోఁ
దీరుగ దిక్తటం దిరుగఁ • ద్రిప్పుచు వైవఁగఁ బడ్డ రక్కసుల్
కోరికఁ ద్రిప్పఁబడ్డ తరి • గొందఱ క్రియం దిరుగాడి రంబుధిన్.

తే॥ వడిగఁ బాఱిన రక్తప్ర • వాహతతుల, హనుమ విసరివైచిన ద్విర • దావికములు
కదలిఁ బడుచుకు మున్నుగాఁ • గడచి చేరె, గొప్ప ధ్వనితోడఁ బంతంబు • గోరినట్లు.

సీ॥ ఘన తోరణ ద్వార • మున కిరుప్రక్కల, నెలరేకవంటి కో • ఱలను గుహలఁ
బోలు నోళులు రక్త • మును నిప్పులను గ్రక్కు, జంకెన చూపుల • చక్షువులను
బొమముడి పీడని • మొగములు పెదవులఁ, గొఱుకుచు నున్నట్టి • కఱకు పండ్లు
గల రక్కసుల పీనుఁ • గుఱ గగనంబును, దాఁకు కొండల మాడ్కి • పేఁకఁ బెరిఁగి

తే॥ చూచు వారల చూపులు • సురిఁగిపోవఁ, గాంచువారల మనసులు • కరఁగిపోవ
మకర తోరణ ద్వారమ్ము • మఱుగు పడఁగ, నిండిపోయెఁ బెలు గని • బెంకుపడఁగ

చ॥ తరువులు కంబముల్ గిరులు • దండిగ నుండఁగ దండపాణియుం
దరుణము వేచి పాశియయి • దండకే యుఁడగఁ గోపమూర్తులై
దురమునకు న్నిశాచరులు • దూఁకుచు నుండగ దున్నహంపు దు
ర్మరణము గాక పక్క మఱు • మాటయు వేఱొకరుండు గల్గునే?

క॥ భవనకు భూలముకై వడిఁ, బవన సుతునిచేతి కొక్క • పరిఘము దొరకన్
దవిలి కసిమసఁగి దానవ, నవహముఁ బరిమార్చె రొక్క • నిముసమునాలోనన్.

క॥ సేనాపతి పంచక సే, నా నివహంబట్లసమసి • నం దెలిసిన లం
కా నగరమెల్ల గగ్గోఁ, లూనఁగ దళపతులు కినిసి • యుల్లము నొవ్వన్.

చ॥ శవములఁ ద్రోచికొంచుఁ జన • సాగిన నెత్తుటిలోనఁ జక్రముల్
దవిలి నిదానమై చను ర • థంబుల నేవురు దాసి యార్చుచున్
బవనజుపై ననేక శిత • భల్లములేసి యలంప నిచ్చలుం
డవు హనుమంతుఁ డంత నొక • స్యందన చక్రము లూఁడఁ దన్నుడున్.

సీ॥ రథము పొడగుడు దు • ర్ధర్షణుఁ డాకాశ, మున కేగ హనుమండు • కినిసి యొక్క
యినుప కంబముతోడ • నేసె వాఁడును దానిఁ, దన వింటితో నొడ్డి • తలఁగఁజేయ
సింగిణి విఱిగెఁ గొం • డం గొని వాఁడేయఁ, బదరక యినుప కం • బంబుతోడఁ
జదిపి దుర్ధర్షణుఁ • జంప నానల్వురు, కాలాగ్ని కీలల • కరణి మండి

తే॥ కన్నులను పొగల్వెల్వడఁ • గార్ముకములఁ, బాణ వర్షము గురిసి పా • వనిని పొదువ
నతఁడు పెనుబండవైవ వా • రడఁగి వైచి, వికటహాసంబుతో విఱ్ఱ • వీఁగినారు

ఉ॥ వారల బాణముల్ హనుమ • వక్షము తంగు మనంగఁ దాకి ని
స్సారము లౌచు వెన్కలకు • స్రగ్గె మరుత్సుతుఁ డంతఁ గిన్కమైఁ
గూరఁగ దాసి యొక్కరథ • కూబరముం బదిలించి పట్టి యా
హారవ మొప్ప దోర్బలత • నంబరవీథికిఁ ద్రిప్పి వైచుడున్

ఉ॥ రాక్షసు తేరు నింగి కెగు • రం గని లోపలనున్న యా విరూ
పాక్షుఁడు లాఘవంబున న • హార్యము కైవడి వాయు సూను పై
కక్షముఁడై పడిందుముక • నాతఁడు నాగము మీఁది కేఁగు హ
ర్యక్షము మాడ్కి వానిపయి • కామిక దాఁటి నలంచెఁ ద్రొక్కుచున్.

చ॥ నలిగులియై యతండు మర • ణంబు భజింపఁగఁ దక్కు ముర్వుర
త్యలఘుతర ప్రకోపమున • నార్చుచు వానరః యెందువోయె దీ
తులు వతనంబు సాగదని • తూఃపులు కోపులుగాఁగ నాట దో
ర్బలమున సేయునంతటఁ బ్ర • భంజనపుత్త్రుఁడు రేఁగి హుంకృతిన్.

ఉ॥ ఆక్షణమందె దాసిన శ • తాంగ యుగంబును రెండు కేల ని
ర్లక్షముగాఁగఁ బట్టి యత • లంబునకుం గొని పోవుచుండ యా
పాక్షుఁడు భాసకర్ణుఁడు త • దంతరమందు తొలంగఁ గాంచి గ
ర్వక్షయ మొందవైచెను క • రంబుల నుండిన రెండు తేరులన్.

చ॥ ఖరువుల సాటఘుల్ పడఁగఁ • గార్ముకముల్ విఱుగంగ వార లు
ద్ధురతర రోష భీషణతఁ • దూఁకొని మల్లరణంబు సేయఁగా
నురవడి భాను ప్రుంగుటకు • నుద్ధతి వచ్చెడు రాహుకేతువుల్
పరిగొను వైఖరిం బొదివి • పట్టుడు మారుతి వాలి పెంపుచున్.

ఉ॥ కంఠములన్ బిగించి యొడి • కంబున నొత్తుడు నుక్కిబిక్కియై
కుంఠిత సత్త్వులై ధరణిఁ • గూలి నశించిరి రాహుకేతు లు
త్కంఠత బట్టి వీడఁగ వి • కర్తనుఁ డయ్యెడ వెల్గు పోలికన్
ఖంఠలు చావఁగాఁ బవన • సూనుఁడు శోభిలె సంగరస్థలిన్.

తే॥ మిగిలియున్నట్టి ప్రఘసుఁడు • మీఱిరాఁగ, ఘనతరాకృతి నూనిన • గాలికొడుకు
కరువమీఁదికి దుముకు సిం • గంబుమాడ్కి, వానితల నలిగులిగాఁగ • నూనిదుమికె.

ఉ॥ వంచన దుష్కృతంబులు న్వ • భావముగా జనహింససేయు స
ఞ్చరు లెల్లరుఁ మడియఁ • దత్పురు లేపురు చావఁ జింతలం
గ్రుంచెదు దుఃఖసంతతులు • ఘోర తరేంద్రియ పంచకంబు ని
ర్వంచలతన్ గుదించి చను • జ్ఞానిక్రియన్ హనుమండు భాసిలెన్.

తే॥ సమరమున నొక్కడైనను • చావుదప్పి, మిగుల యుండుట దశపడుల్ • మిడికి యటుల
కన్నులారంగఁ గని భయ • కంపితులయి, తడయఁ జంపునొ యని యెంచి • దప్పునంది.

సీ॥ వన పాలకులు పడి • పడి నేగి రావణు, శుద్ధాంత సౌధంబు • చొచ్చియచట
మైథిలిపైఁ బ్రీతి • మమ్ముఁ గన్నెత్తియుఁ, గాంచఁడంచు నెడందఁ • గలఁతచెంది
యున్న కాంతలఁ జూచి • యుడుకుచు దూషించు, చున్న ప్రభుని గాంచి • యుల్ల మెరియఁ
గర్ణ రంధ్రంబులు • గాఁడ సేనలును సే, నాపతు లేపురు • నాశమొంది

తే॥ రయ్య! యొక కోఁతిచే నది • యడవినట్టు, గాదు లయకాలుఁడగు నను • కంప మమ్మ
విడువ వచ్చితి మింకను • వీఁకవచ్చు, వారు లేరా యనుచు నుండె • బద్ధకించి.

## అక్ష వధ పటలము.

మ॥ అను పల్కుల్విని దానవేంద్రుఁ డొడలన్ • వ్యాపించు రోషంబుచే
ఘన హారంబులు మాఁడ నార్చి యటులా • కానిమ్ము! తద్వానరం
బును నేనే యెదిరించి పట్టెద రథం • బుం దేరఁగాఁ బల్కుఁడీ
యన నక్షుండు నమస్కరించి యనియెన్ • వ్యాహార గంభీరిమన్

మ॥ అది ఫాలాక్షుని నందియా? హరికి వా • హంబా? భుజంగేంద్రుఁడా?
పదరన్ దిక్కరులం దొకండొకొ? మహా • ల్పంబైన యాకోఁతిపైఁ
బ్రవరంబుల్ గొని తేరిపైఁ గడఁగి పో • రన్నీవు పోఁ జూచుటా?
ఇది నీకోఁటికి యుక్తకార్యమగునే? యీయక్షుఁడుం జచ్చెనే?

మ॥ మును వృద్ధశ్రవుఁబట్టి తెచ్చుటకు నిం • బున్ దంబు పెంపార మా
యనఁ బంపించి కొంతంత గూర్చి తది యిం • దైనం దొలంగింపుమా
నను శాఖా చరు మీఁదికైనఁ బనుప • న్నాజంబు గాదయ్యనే?
అనుమానింతువె? నక్క యుప్పతిలునే • హర్యక్ష గర్భంబునన్?

॥ చిచ్చుల కంటియె మనకొక, పొచ్చెము గూర్పంగఁ బ్లవగ • మూర్తింగొని తా
వచ్చిన యేనియు నేఁగొని, తెచ్చెద నీమెచ్చు గొనెద • దితిజాధీశా?

మ॥ అవనిం గోఁటల గ్రుచ్చియెత్తిన వరా • హస్వామి యౌఁగాక దా
నవ సంహారముసేయఁ గంబమున జ • న్మంబంది వంచించు మా
నవ సింహంబగుఁ గాక పోరిన నజాం • డం బావలం దాఁటినన్
దవులం గట్టియె తేకయుండిన ననున్ • దండింపు దైత్యేశ్వరా!

చ॥ అని యిటుపల్కి యాజ్ఞ యిడు • మంచు నమస్కృతిసేయు పుత్త్రికం
గని రథమెక్కియే నిలుము • కార్ముకముం గొని పోరుసేయు మా
వనచరుఁ డాయఁబోకు మెటు • వచ్చిన యేని నియుద్ధ పద్ధతిం
జనకుము పోయి రమ్మనుడుఁ • జక్రసహాయుఁడు వాఁడు వెల్వడెన్.

చ॥ మునుపటి యుద్ధమందు సుర • ముఖ్యుఁ డొసంగిన దార్ఢ్యమైన తే
రను తగ రెండు పందల గు • ఱ్ఱాలను గట్టిన దాన నెక్కెఁదీ
వన లిడి రెల్ల దానవులు • వాద్యరవంబులు మిన్ను ముట్ట వా
హినులను వాహినీపతు ల • హీన సహస్రము వోలె నుబ్బఁగన్.

సీ॥ వనధిని మకరంబు • లను లెక్కపెట్టుచో, వారణంబుల లెక్క • పఱుపవచ్చుఁ
గడలి మత్స్యంబులు • గణనకుఁ దెచ్చుచో, స్యందనంబుల లెక్క • సలుప వచ్చు
జలధి యిసుకరేణు • వుల నెంచనైనచోఁ, గాల్బలంబుల నెంచఁ • గడఁగ వచ్చు
శరధి వీచీ సము • త్కరమెన్నఁ దగినచో, నచటి వాజుల లెక్క • యరయ వచ్చు
తే॥ నన నసంఖ్యాకమై యొప్పె • నందుమఱియు, దావ కీలలఁ బోలిన • తన యనుంగు
కాంచు పండ్రెండు వేల ర • క్కసులు చుట్టి, యరుగు దేరంగఁ జనియె దే • వారిసుతుఁడు.

తే॥ ప్రగ్గడల కుమారులు దళ • పతుల సుతులు, వేల్పు పడఁతు కలకు నుద్భ • వించినట్టి.
రావణుని కొడుకులు చేరి • రథములందు, నాల్గులక్షల వీరులు • నడచివారు.

చ॥ ముసల ముసుండి శూల ఘన • ముద్గర తోమర చక్ర కుంత ప
టిస ధనురాది సాధన ప • టిష్ఠులు కైదువు లెండగాయ ధూ
ళి సముదయంబు పైకెగుర • లేఖుల లోకమువోలె భూమియుం
బసిఁడి మయంబుగా వెలుఁగ • బంధురవైఖరి సాగి రయ్యెడన్

సీ॥ కాకులు గ్రద్దలు • ఘన పిశాచంబులు, కాలందు సంచిత • కర్మచయము
వెన్నంటిరా నన్ను • టిన్నల దృష్టులు కలువ పూసరముల • కరణి నెఱయ
విధవల యేడ్పు ను • దధి ఘోషమును వాద్య, సేనా రవంబులు • చెవుడు పఱుప
పోయిన వారలు • పోవుదె కాని క్ర, మ్మఱ రంచుఁ దమ నతు • లఱచు చుండ
తే॥ దర్పరణ దోహలత్వముల్ • తఱుముచుండ, నీర్ష్యయును కిన్క తమకు ము • న్నేపుచుండ
వాహినీరాజి బలసి రాఁ • బంక్తివదన, తనయుఁ డయ్యెడ సంగర • స్థలికి నడచె.

చ॥ రవి కిరణాళిఁ గప్పె బహు • రత్న విభూషణ కాంతి పంక్తి కై
దువుల వెలుంగులున్ మఱిఁగెఁ • [illegible]రపు భూషలఁ గ్రాలు దాలుఁ దా
నవ ఖర దంష్ట్రికా సుషమ • నాఁడెప్పు [illegible]లల యొప్పుఁ గప్పఁగాఁ
బవలును రాత్రియుం గలిసి • భాసిలు చందము దోఁచె నత్తఱిన్.

సీ॥ కుదిరలు రథములఁ • గునుకుపా టొందంగ, నెడమ కన్నులు కేలు • [illegible]
రక్తవర్షంబు ని • ర్జలదంబు గురియంగఁ, బిడుగులు పైనుండి • పెటిల్లి [illegible]

బరఁగఁ గృతాంతుండు • భావి నాలోచింపఁ, గంక గృధ్రంబులు • కదకుఁ దిరుగ
భూతగణంబులు • పొంగి నాట్యముసేయ, ఖేచరుల్ మిగుల సం • కోచ మొంద

తే॥ నొక్క వెల్లువ సేన త • న్నొలసిరాఁగ, భువన భీకరుఁ డగుచు వై • భవము తోడ
వచ్చు దశముఖ సుతునక్షు • వాయుపుత్త్రుఁ, డించుకంత దూరాన గ • ణించికాంచి.

ఉ॥ వచ్చెడు వాఁడు రావణుఁడొ • వాని కుమారకుఁ డింద్రజిత్తొ కా
వచ్చు మదీయ పుణ్య ఫల • భాగ్యము నేఁడు ప్రసన్నమయ్యె నీ
వచ్చు రణంబు కీర్తియును • వచ్చును రాముని మెచ్చు వచ్చు నా
కచ్చుగ సంచు మోదిలి భు • జార్గళముల్ తగఁ గాంచి వెండియున్.

ఉ॥ శ్రీరఘు వీర శేఖరుని • సీతను చిత్తము నందు నిల్పి కై
వారముచేసి నాతపము • పండఁగ సిద్ధముగాఁగ నుంటి నా
చేరువఁ గాలుఁడుం బడటు • సేయుచుఁ గాచియె యున్నవాఁడు నా
కారియ మిప్పుడే యదను • గాంచి ముగించెద దాపురించుడున్.

మ॥ పది శీర్షంబులు లేవు గానఁ దలఁపం • బౌలస్త్యుఁడా కాఁడు మా
య దల్పిరం బురుహూతుఁ గెల్చిన మను • ష్యాదుండొకో కాఁడు దు
ర్మదుఁ డెవ్వఁడొకొ సుందరుండగుఁ గుమా • రస్వామియుం గాఁడు పెం
పొదవం గాటుకకొండ యట్టిఁడు మహో • ద్యోగుండు వీఁడెవ్వఁడో ?

మ॥ అని సంతోషము నంది తోరణముపై • నాసీనుఁడై యున్న పా
వని నక్షుండు గణించి చూచి యిదియా • భంజించి యుద్యానమున్
దనుజానీకముఁ గూల్చినట్టి ప్లవగేం • ద్రం బంచు నిర్లక్ష్య భా
వనతో నవ్వఁగఁ గాంచి సారథి యిటుల్ • వాక్రుచ్చె నయ్యక్షుతోన్.

శా॥ ఈ లోకంబునఁ గల్గు వింతలు సదా • వీక్షింపుచున్ నేఁటికిన్
లీలామాత్రముగాఁ దలంపఁదగ దా • లింపందగున్ వాలియుం
బోలం జూచిన నొక్క కోఁతియె గదా • పొంగార్చె మీతండ్రి నా
పాశంబుం దగ జ్ఞప్తి నుంచుకొని సం • భావింపు మియ్యాలమున్.

ఉ॥ సారథి వాక్కులన్ వినిని • శాచర రాజ కుమారుఁ డిట్లనున్
వారిక మాపురంబునకు • వచ్చియు నూరక పోక యిట్టి వ్యా
పారము చేయు దీని నిట • వచ్చుటతో మదమర్ష మింత చ
ల్లారుదు రోసి రోసి ప్లవ • గావళి వంశమె రూపు మాపెదన్.

శా॥ కానిండంచు స్వసైన్యముం దఱుమ లం • కానాథ పుత్త్రుండు త
త్సేనల్ మారుతిఁ జుట్టిముట్టి బహు హే • తివ్రాతముల్ వైవఁగా
మూనాక స్థలు లల్లలాడెను మరు • త్పుత్త్రుండు తప్పించు కొం
చేనుంగుల్ రథముల్ హయంబులను మా • యించెం బద క్రీడచేన్.

గడ్డిమీఁద • నెరగలి పడినట్లు, లసురవరుల మీఁద • హనుమ యడరె
ప్రాణములను • వారి కొంపోవఁ గిం, కరులు చాలఁ గలరె • కాలునకును ?

॥ వచ్చుట కాయితంబయిన • వారును వచ్చుచు నున్నవారు ము౯
వచ్చిన వారు లెక్కయిడ • వైనము గామి యటుండఁ బోరిలోఁ
జచ్చిన వారుఁ జచ్చుచును • చచ్చియుఁ జావక కూలువారు నై
పెచ్చుగ నెమ్మిలేని మయి • వీఁక నలంగిరి దైత్యు లయ్యెడన్.

॥ మిక్కుటమైన శోణితము • మీఱి ప్రవాహముగాఁగ దానిలో
నుక్కఱి వ్రీలి కూలిన మ • దోత్కట వారణముల్ తురంగముల్
మిక్కిలి పంకిలంబుగ గ • మించెను మారుతి నాఁడె లంకలోఁ
గొక్కిరి మూఁకఁ గాలునకుఁ • గొల్ల యొసంగిన రీతి దోఁపఁగన్.

॥ కొందఱు చచ్చుచుండ మఱి • కొందఱు ముందఱి కేగుచుండఁగాఁ
గొందఱు పాఱుచుండఁగను • కొందఱు దవ్వుల నిల్చి చూచుచుం
గొందలమందెఁ దేరులనిఁ • గూలె మదావళ రాజియంచు వే
ద్రుందెఁ దురంగపాళి యని • మాఁడెఁ బదాతి యటంచుఁ బల్కఁగన్.

॥ చిలికెడు కుండలోని దధి • చెన్నున నొప్పె నిశాచరావళుల్
చిలుకుచునుండు కవ్వమను • చెల్వున నొప్పె మరుత్కుమారకుం
డిలఁగల జీవసంచయము • లెల్లను సోఁకులె గాఁగఁ దోఁపఁగా
విలయ సముద్ర మట్లు యిరి • వీఁకను మారుతి బాడబాగ్నిగాన్.

॥ వచ్చెడ వారు పైపయిని • వచ్చుచు నుండఁగ వెంట వెంటనే
చచ్చుచునుండ నొక్కరును • చావక తప్పినవారు లేమిచే
హెచ్చుగ భీతినొంది యెడ • యూఁగిరి పాఱిరి తక్కువారు వి
వ్వచ్చమె రూపుగొన్న క్రియ • భాసిలి యక్షుఁడు తాఁకె మారుతిన్.

॥ అక్షుఁ డెదిర్చె నొక్కడిన • మందె నిశాచర రాజి నుద్వృతిన్
లక్షలకొద్ది చంపిన వ • లంతి యెుకం డెమరయ్యె దీని మా
యక్షుల మూయరాని విధి • నందిన మేము కనంగనయ్యె మా
కక్షమ మయ్యె నంచు సుర • లంజలు మూసిరి కేలఁ గన్నులన్.

॥ అయ్యెడ నక్షుఁడేసె వడి • నగ్నులఁ గ్రక్కుశిలీముఖంబులన్
దయ్యక వాయుజుం డినుప • దండముతో నెగఁదట్టె నుగ్రుఁడై
దయ్యముఁ బోలు నాయినుప • దండము నుగ్గుగఁ గొట్టె దైత్యజుం
డొయ్యనఁ గేల బాణముల • నూడ్చుచుఁ బావనియేగె మందలన్.

॥ అరదము మీఁదికిం దుమికి • యాతని సారథి జంపి వాజుల౯
ధరఁ బడఁదన్ని నక్షుఁడు ను • దగ్రతరాస్త్రము లేసి కీశు పె

స్ఫురము భుజంబుల స్ఫులఁచె • నుక్కున మారుతి లెక్కసేయ కు
ద్ధురతర రోష భీషణతఁ • దోరపు వింటిని పట్టె గట్టిగన్.

తే॥ పట్టుకొన్న వింటిని దన • బలిమి లాగ, పెళ్లుమంచు రెండుగ నది • విఱిగిపోయె
చిక్కటారితో నక్షుండు • చీల్పఁ బూన, పీఁకఁ బట్టి దానిని లాగి • విఱిచివైచె.

ఉ॥ విల్లు కటారియున్ విఱుగ • వీఁకున దైత్యకుమారుఁ డంతటన్
మల్ల రణంబుసేసి పరి • మార్పఁగ మారుతిఁ బట్టెఁ బిట్టుకున్
గొల్లగ వాఁడి రోమములు • గ్రుస్వగ వాలము వెంచి వాని మే
నెల్లెడ సందులేక బిగి • యించి తటాలున నెక్కె వానిపై.

ఉ॥ చెంపలఁ గొట్టె దంతములు • శీర్ణముగాఁగ మెఱుంగు లట్టు లా
కంపిత దేహమందు మణి • కాంచన భూషణ రాల నాంత్రముల్
జంపుగ జాఱఁ గ్రుమ్మి రభ • సంబునఁ గంఠము వంచి క్రుంచి వి
ల్వంపుగ మేను వంగఁ గటి • భాగము జానువు నూఁది త్రొక్కుచున్.

చ॥ సమరశిలంబు సన్నికలు • జాఱిన నెత్తురు నీరు గాత్ర మే
యమరిన నానఁ బ్రాలు తన • హస్తమె పాత్రముగాఁగ జీవముల్
యమునకుఁ జెంద నూతె నని • లాత్మజుఁ డక్షుని మిన్నుమన్ను వా
రసుర మనుష్యవర్గ మర • యం గని విస్మృతి చెందకుండఁగన్.

సీ॥ కొందఱు నెత్తురు • చిందు గాయములతోఁ, దాఁగిరి భూత భం • డారములను
కొందఱు భీతిచేఁ • గుంది గ్రమ్మందిరి పోవ, వెరవు దోఁపక చాల • విహ్వలించి
కొందఱు సాధన • బృందంబు దిగజాఱఁ, బోయిన పోకగాఁ • బోయినారు
కొందఱు మీలై య • కూపారముం జొచ్చి, రావులై కొందఱు • త్రోవలందు

తే॥ పూరి మేయసాగిరి కంక • వారమగుచుఁ, దిరుగసాగిరి కొందఱు • ధరణిసురుల
రూపములు కొంద ఱూనిరి • పూపచనుల, పడుచులై కొంద ఱరిగిరి • పతులఁగనుచు.

సీ॥ కొందఱు వారలే • కూడని వారలు, మేము గామనిరి సా • మీరితోడ
గొందఱు సతిసుతు • లొందంగ నలమిన, మేము చుట్టాలము • గాము సురల
మని దూరమేగిరి • మనుజుల మనిరి కొం, దఱు తేఁటులై రి మం • దార వనిని
కొందఱు దిగ్భ్రమఁ • గొందలించిరి కొంద, ఱరసి దంష్ట్రికలను • విఱిచికొనుచుఁ

తే॥ వెందుశ్రికలను నల్లనగఁ గా • వించుకొనుచు, వేషముల మార్చికొనిరి దు • ర్భీతిచేతఁ
గొంద ఱెమరగు వారిని • గూడఁ ద్రోచి, పరుగులెత్తిరి పోవుచో • టెఱుఁగ రాక.

సీ॥ కుండల కర్ణలు • కుంకుమపంక .            మధుర ర • సాధరలును
క్రొమ్మమ్మడుల్ పీడి ప • దమ్మలఁ బెనఁగ త్రొ, మ్ములు మోదికొంచు నె • మ్ములు నలంగఁ
బలవించు రోదన • ధ్వని లంకయే గాక• భువి దివిఁ గదచుచుఁ • దివిరి నిండ
బాలభాస్కరుఁ బోలు • వదనంబు లొప్పారు, పతుల పావంబుల • పైని వ్రాలి

తే॥ తూలి సోలులోలాక్షుల • తుఱుములూడి, తమయుఁ దమసతులయు శరీ • రములఁ గప్పఁ
దచ్చిరోజంబులకు రక్త • ధారలకును, సుంత యేనియు భేదంబు • చూడలేదు.

తే॥ దురమునందు చచ్చిన తమ • దొరలమీఁదఁ, బ్రతిమలంబోలు చెలువలు • పడుచు నూర్పు
పుచ్చుచును తెప్పలార్పక • మొత్తు యిడిరి, తనువు వేఱగు కతనఁగా • మొనయు నిద్ది;

తే॥ అసువులను రోయు దేహంబు • లట్లు పరుగు, లిడిరి రాణి వాసము వార • లెల్లఁగుణప
నివహమున వెవకిరి ప్రేమ • నిగుడు కతనఁ, బతులఁ జేరి రంభాదులఁ • బదరినారు.

క॥ తరలాక్షి గోల యొకతుక, దురమున నటియించు నట్టి • తోఁ దచ్చిరమున్
నరి నిలిపి మ్రొక్కి వేఁడెను, పరుఁ జూపుము నీకుఁ బుణ్య • ఫలమగు ననుచున్.

క॥ చెలువ యొకర్తుక నాథుని, తల గైకొని చెగురుచుండు • తనువును గని మే
నలసెను రమ్మని పిలుచుచు, సలమి బిగియఁ గవుగిలించె • నారట పడుచున్.

ఆ॥ వెదకి పతుల మేలు • సుపతుల గనిపెట్టి, కడకుఁ బ్రాణములను • విడిచినారు
దితిజనాథుఁ జేరి • బుతు దేవతలు కడ, చనిన వృత్తమెల్ల • వినిచినారు.

తే॥ మయుని తనయ మందోదరి • మందగమన, తుఱుము వీడంగ బాష్పబిం • దువులు గనుల
జాఱఁగా వచ్చి తననాథు • చక్కిఁ జేరి, కడుపు బాఁదు కొనుచు నేడ్చెఁ • గళవళించి.

తే॥ లంకలో నున్న కాంత లె • ల్లరును వచ్చి, యేడ్చి రురలిరి దైత్యేంద్రు • నెదుట; లోన
ముదము నొందియు వెలుపల • గదురనీక, తెరలి చాలఁ గుందిరి బుతు • దేవతలును

## 12. పాశ పటలము. (63)

తే॥ శత్రుగెల్చిన యురు కీర్తి • వాలి తమ్ము, మరణ వార్తను విని మది • మలఁగి పంది
కనుల నిప్పులు రాల జ • గంబు లదర, రోష భీషణుఁడై చల • ద్భ్రుకుటి యదర.

క॥ మది యెరియఁగ మిడుఁగుఱులం, జెదరి ముక్కుల్లూర్పు లుబ్బి • చెలఁగఁ బురంబుల్
పదటునఁ గలిపిన రుద్రుని, పదురున నెటఁ జూడరాని • పద్ధతి లేచెన్.

చ॥ అమర జగంబు పైసరుదు • నంచెడు వేయి పిశాచ పంక్తు లం
దముగ నమర్చి కట్టిన ర • థంబు పయిన్ వెస నెక్కి వీర వా
క్యములు వచించుచున్ జనని • కాయము ఘీతిలి పొలు సింహ నా
దము లొనరించుచున్ జనియె • దారుణ చర్యల నాచరించుచున్.

ఆ॥ వీర మద్దియలును • వీర కింకిణులును, భేసు లులిసె నవని • బృంద మదల
నింద్రు నసువు లూర • కెగసి పోవఁగ నసి, బలిసె నని త్రిమూర్తు • లలఁగి మలఁగ

ఉ॥ తమ్ము మృతిం దలంపఁగనె • ధారలు ధారలు గాఁగ వేఁడి బా
ష్పమ్ములు గాఱ నొక్కయెడ • వాసము లేక తరూత్కరంబులం
దిమ్ముగ గంతుచుండు నొక • యెల్లి నమౌ ప్లవగమ్ముచేత నా
తమ్ముఁడు గూలెనా? సమసె • దానవనాథుని కీర్తియుం గదా?

చ॥ అని తలపోయుచున్ జరుగ • నాతనితోఁ జను విల్లు వీరులన్
ఘన గదలన్ ధరించి చను • కర్పురులన్ గుధరంబు రెండుగాఁ
దునుమఁగఁ జాలు దోర్బలులఁ • దోరపు లెక్కలఁ దెల్పలేము స్యం
దనములు వారువంబులును • దంతిఘటల్ పదిరెండు వేలగున్.

చ॥ మఱియును సైన్యనాయకులు • మానుగఁ జేరుచునుండఁ గన్నులన్
విరివిగ బాష్పముల్ కినుక • పెచ్చుగ నించిన యింద్రజిత్తు త
త్తఱమున వచ్చి చేరెఁ దన • తండ్రి వసించు కన ద్వితాన సుం
దరతర సౌధమున్ గనక • దండ భటాలి మహా నిరోధమున్.

ఉ॥ చేరి నిశాచరేంద్రునకుఁ • జేతులు మోడ్చి యనుంగుఁ దమ్ముకై
యారట మందఁ బంక్తిముఖుఁ • డాదట నాతని గౌఁగిలించి క
న్నీరొలికించెఁ జెంతఁ గల • నీరజ నేత్రలు దుఃఖ మొంద న
వ్వారలఁ దేర్చి యవ్వలకుఁ • బంపి సురేంద్ర జితుండు తండ్రితో.

చ॥ ఇతరుల చేవఁగూర్చి యొక • యించుకయైనఁ దలంప కిప్డు దుః
ఖితమతి వౌట యేమిటికిఁ? గీశుని చేవయు నేర్పు పెంపు సూ
చితమయి యుండియుం జనుఁడు • సేయుఁడు పోరని పంపి పంపి నీ
దితిజ బలంబు నెల్లఁ గడ • తేర్చిన వాఁడవు నీవ కావొకో ?

ఉ॥ కింకరు లాదిగాఁగ జని • గీటడఁగం జనినార కాక యీ
వంకకుఁ గ్రమ్మఱిల్లిన దె • వండు శరీరముతోడ నయ్య ! మీ
నాంకుని పోలు సూనుని వ • నాటుని వాతను పెట్టి చూచెదే ?
యింక జయింపమా? యనుట • యేటికి ? నయ్యది తెల్వికార్యమే ?

ఉ॥ దిక్కరులన్ జయించితివి • తేఁకువ నెత్తితి శంభు భూధరం
బుక్కున లోకముల్ గెలిచి • తొక్క ప్లవంగముకై తపించుటల్
చక్కటియే ? వహింపుము ప్ర • శాంతము వానరుఁబట్టి యేనె నీ
చక్కికిఁ దెచ్చెదన్ బరవ • సంబున నుండుమయంచుఁ గ్రమ్మఱెన్.

ఉ॥ ఓడిన చీఁకటుల్ మరల • నుగ్రతపం బొనరించి చేవతోఁ
గూడిన మేను లొంది రవి • ఘోర కరంబులె భూషణాలిగాఁ
బోఁడిమిఁ దాల్చి శత్రు పల • మున్ రుచి చూచిన శాత ఖడ్గముల్
నాఁడెముగా ధరించిన వ • నందగి వచ్చెఁ జమూ సమూహముల్.

ఉ॥ మావులు తేరులుం గరులు • మత్తులు చేరిన దైత్యసైనికా
రావము వార్ధిఘోషముఁ గ • రంబు జయింపఁగ వీర ఘోర సే
నా వనరాశి మధ్యమున • నాణెముగా వెలుఁ గొందు మేరువన్
కైవడి నొప్పె వీరవర కర్మము • నూనిన మేఘ నాదుఁడున్.

చ॥ జనములు వేల్పులున్ మునులు • జంకు వహింపఁ బ్రయాణ భేరికా
నినదముతోడ లేచు రజ • నీచర నాథ కుమారుఁ డప్పు డ
య్యనుపునఁ బోరినట్టి యని • లాత్మజు ధైర్య పరాక్రమంబులన్
మనమున మెచ్చె శాత్రవు సు • మాళము శూరులు మెత్తురే కదా ?

సీ॥ శవమయమైన యీ • సంగరస్థలి గొప్ప, రక్తపంకమున న • రాజు లొనరఁ
గదలుచుండుటచే న • గంబులు నదులు కా, ననములు గల భువ • నంబుఁ బోలి
వెలయుచున్నది గదా • వీరవర్యులు లోక, ముల జయించిన దైత్య • కులమువారు
పెక్కండ్రు నశియించి • రొక్క వానరుచేత, నేమి చోద్యం బిట్టు • లెన్నఁడయ్యె ?

తే॥ నింకరాముఁడే తమ్ముతో • నిటకు రాఁగఁ, బ్రజ్ఞలం బల్కి యే వీర • బలము గొనుచుఁ
గలన నెదిరించి విజయమ్ము • గాంచువార, మనుచుఁజింతించెఁ గొంత సే • పసురకొడుకు.

సీ॥ కనులఁ బోలినవారు • మనముఁ బోలినవార, లలవు బలము గల్గి • యరయువార
లైయట నీల్గిన • యసురవరుల నసం, ఖ్యాకులఁ గని నిల్చి • యొడు గలచి
కోలను వ్రణమున • గ్రుచ్చిన క్రియ నొచ్చి, తపియించి రోషంబు • దర్పమొంది
వనమున నత్తకు • నొనరిన యవమతి, ఖరదూషణాదుల • కాడుపాటు

తే॥ ప్రాణధనమైన తమ్ముని • పజుచుపాటు, తక్కువారల మరణంబుఁ • దలఁచి తలఁచి
నరులచే నొక్కకోఁతిచే • జరిగె నింత, ప్రాభవం బేటికని చాలఁ • బరితపించె.

సీ॥ మరణించు దైత్యులు • మందెడు చోటుగాఁ, గనిపించు నట నీడ్వఁ • గాని కుణప
పర్వతంబులు నట్టు • లుపంగ జరగు పు, రందరజిత్తు నూ • లంగఁ బడిన
యనుజు కళేబర • మును తన కన్నులు, కరఁచిన తామ్రంబు • కరణి వెలుఁగఁ
గినుకతోఁ గని తాన • కుని నెత్తురనఁదగు, వెల్లువ భీభత్స • విధమునోఁప

తే॥ ఖర నృసింహ నఖర దంష్ట్రి • కా విదారి, తోగ్ర కనకకశిపు తను • వ్యత్క్రమంబు
కరణిఁ గనఁబడఁ దనతేరు • నురక నిలువఁ, జేతి ధనువును జారని • శ్చేష్టుఁడయ్యె.

ఉ॥ నీరును నిప్పు నెత్తురును • నేత్రములన్ వెలివారు దుఃఖ దు
ర్వార మనస్కుఁడై యసుర • రాజ నిదేశము మీఱి చంపఁగా
నేరఁడు కాలుఁ డీ జగము • నేరదు తండ్రికి లోఁకువౌట నీ
వే రహి నెందు దాఁగితివొ • యింతుక నేరను కాదె తమ్ముఁడా!

చ॥ అని సహియింపలేక మతి • యల్లల నాడఁగ గుండువేళఁ గో
పన గుణమొందె కాదె పరి • భావ వికారములెల్ల మాన్చు ? న
య్యనుపున నింద్రజిత్తు వగ • యంతయుఁ బైకొను మేకు క్రింది మే
కును పడిఁగ్రుంచు వైనమునఁ • గోపముచే మఱుఁగయ్యె వ్రేల్మిడిన్.

అట్టి తరుణమంద • యరదంబుపై నున్న, యింద్రజితుని గాంచె • నీరసమునఁ
ద్రిపుర దాహమునకు • దీకొని లేచిన, యుగ్రుఁబోలి హనుమ • వ్యగ్రుఁడగుచు

ఉ॥ పచ్చెడు వాఁడె గాపలయు • వాసవు గెల్చిన వాఁడు మున్ను నే
నచ్చుగఁ గాంచినట్టి విట • యంబు సరాయన పీనిఁ దెచ్చె నేఁ
డిచ్చట గెల్చుటో యనుటొ • యెన్నఁగ నొక్కటె తక్కియుండు నా
త్రిచ్చను దీఱుపచ్చె నిట • గాదె మహోదయ వేళ నాకుఁగన్.

ఉ॥ వీఁడు నశించె నేసి యది • విశ్రుత రావణ నాశహేతువౌ
వీడును జానకిన్ విడుచు • వేల్పుల ఱేఁడు మనోవిభీతియున్
వీడును దైత్యసంఘ మని • వేడుకఁ జేష్టల లంక యిప్పుడే
వీడెను రణ రావణుని • పేరిమి గెల్చినవాఁడ నయ్యెదన్.

చ॥ అని తలపోయుచుండ దను • జావళి మావులఁ దేరులం గరుల్
మొనయుచు మూఁడు లోకముల • ముమ్మరు లోరిచి కాఁక దేఱు మే
ఘ నినదములగా భయద • గర్జనముల్ పొనరింప నంజనీ
తనయుఁడు కోపగించి యొక • తాలము గైకొని కొప్పరింపఁగన్.

సీ॥ తాఁచిన కరులును • త్రోచిన కరులును, పొరలిన కరులును • మరలు కరులు
దొరలిన కరులుపై • నురలిన కరులును, త్రుళ్ళిన కరులును • త్రెళ్ళు కరులు
విఱిగిన తేరులు • తఱిగిన తేరులు, మడిగిన తేరులు • నుడిగినవియు
చెదరిన తేరులు • నదరిన తేరులు, పగిలిన తేరులు • నగలినవియు

తే॥ నుగ్గులై బొగ్గులై యగ్గ • ముగ్గఁ బడిన, యిరుసు లూడిన చక్రంబు • లిఱుకుఁ గ్రుంగి
వాలి కూలిన యవియునై • వారణములు, స్యందనంబులు నలఁగె నా • సమర భూమి

సీ॥ తలలు నలఁగి కుత్తు • కలు వ్రేలవైచి క, న్గ్రుడ్లు చెదరి కాళ్ళు • కుదియఁ గూలి
నడుములు విఱిగియుఁ • గడుపులు తఱిగియు, తొమ్ములు పగిలియు • నెమ్ము లగలి
కీళ్లూడి నెత్తురు • బొళ్ళున గ్రక్కి కు, ప్పలు గూలె బవరాన • వారువములు
పట్టువడిన వారు • గిట్టి పడినవారు, క్రుంగఁబడినవారు • మ్రంగువారు

తే॥ కఱచి వాలంబుతోఁ జుట్టి • చఱచి తన్ని, మెడల నుల్చి తోఁకల నొల్చి • కడుపు ప్రేల్చి
నడుము విఱిచి శిరము వ్రచ్చి • నలఁచుచుండఁ, గూలినారు నక్తంచర • కోటు లెల్ల.

చ॥ గుడుసుగ విండ్లు వంచి విడు • కోలలు తక్కిన యా యుధంబులున్
బడి హనుమాను మేనిపయి • వ్యర్థములయ్యె నయశ్శలాక లు
గ్గడువుగ గ్రాఁగి దాకలిని • గాల్పని తీరున నెట్టి లేమచున్
మిడుఁగురు లుప్పతిల్లి ధర • మీఁదఁ బడెన్ నశియించె వానితోన్.

చ॥ అదిగని యింద్రజిత్తు మది • యట్లుడుకన్ జ్వలదగ్ని సంయుత
ప్రదరము నాంజనేయు పయి • వైవఁగ నయ్యది కాలి మాఁడు చుం
డెవరుట గాంచి యొంటిమెయి • నిల్చిన దోర్బలశాలి నవ్వుచున్
బెదరక రమ్మ రమ్మనుచుఁ • బిల్చుచు దాసె మహోగ్రమూర్తియై.

ఆ॥ పిడుగులెల్లఁ బెటిలి • పడఁ బురందర శిర, మదర శేష శిరము • లటమటింప
నండ కుహర మదలి • యల్లలనాదఁ డం, కృతి యొనర్చె గడఁక • నింద్రజిత్తు.

ఆ॥ అండ గోళమెల్ల • సడలి బ్రద్దలువాఱఁ, గొండ లదరి దొరలఁ • గువలయంబు
దిశలు పగులఁ దెగయుఁ • దెగ నార్చె శ్రీరామ, దూత యప్పళించి దోర్యుగంబు.

ఆ॥ మేలు మేలు మిగుల • మెచ్చితి నీవంటి, వీరులెవరు తెంపు పెంపునఁదు ?
నేఁడు ముగియ వచ్చె • నీ జీవితపు మితి, యనుచు మేఘనాదుఁ • డార్చియాడె.

చ॥ తులువల జీవితంబులకు • దుష్ట విచేష్టలకున్ గళంక దు
ష్కృలములకున్ సుకార్య విని • షూదన ధృష్ట మహాయుధాళికిన్
జెలఁగె ముగింపు కాల మది • చేయఁగ వచ్చితిఁ జూడు నన్ను నా
బలమున కెల్ల లేదు బల • వైరిని గాననె నాంజనేయుఁడున్.

ఆ॥ పరఁగ వీని కున్న • బలమందు నమ్మిక, తొలతు నంచు వాఁడి • తూపు లేసి
యురము శిరము నొంచి • విరివిగ నెత్తురు, వఱలఁ జేసె నింద్ర • వైరి యంత.

ఆ॥ చిన్నతల్లి పలుకు • శిరసావహించి రా, జ్యంబు వదలి ధర్మ • మందు నిలుచు
రాము కీర్తివోలె • రహి నాకసము నంటఁ, బెరిఁగి నిలిచె హనుమ • భీకరముగ.

తే॥ భూరి దశదిశా యుతములౌ • భువనములకు, నాయకుండగు హరిహయు • నలఁచికట్టి
నట్టి మేఘనాదుఁడు గాలి • పట్టి రూపు, పూర్తి గన లేక దిగ్భ్రాంతిఁ • బొంది నిలిచె.

ఆ॥ దీర్ఘ భుజము చాఁచి • దితి వంశ్యుఁ డేసిన, యటుఁగు లొడిసి పట్టి • యతని నేసి
వాని రథము తురగ • పంక్తితో సారథిఁ, జావమోఁదె రామ • సేవకుండు.

ఆ॥ పవన జవన వాజి • నివహంబుఁ బూంచిన, వేఱు తేరి నెక్కి • విదిత బలుఁడు
పవనసుతుని మీఁద • బహు విధ చక్ర స, న్నిభ శరంబు లేసి • నించికప్పె.

ఉ॥ మారుతి మేనినంటి పలు • మార్గణముల్ తగ గ్రేఁచుచుండ న
మ్మెఱీన సాయకావళుల • మేను విదిర్చి తొలంచి ధీరశం
దేరికి దాఁటి లోకములఁ • దేఁకువ గెల్చిన వానివిల్లు దో
స్సారముచే వడిం దిగిచి • చాఁగఱ లాడె నిలింపు లుబ్బఁగన్.

ఉ॥ పెళ్ళున చేతి విల్విఱుగు • భీకర శబ్ద మదంగు నంతలోఁ
ద్రుళ్ళుచు నింద్రు నోర్చిన దు • రుద్ధర సంగరమందు గొన్న పె
న్విల్లు ధరించి రావణియు • నిండు తెగిన్ శరరాజిఁ గూర్చి వే
వెల్లిగ నేయ మారుతియు • పెక్కుస పాటున సోలి యంతలో.

ఉ॥ లేఖులు సంతసిల్ల పడి • లేచి మహోద్ధతి నార్చి యుల్లస
ద్వైఖరి నొక్కసాలము జ • వంబునఁ గైకొని పెర్చి లోక జీ
వాళిల భీకరంబుగ సు • రారి శిరంబును చూచి వైచెఁ ద
చ్ఛాఖలఁ జిక్కి నొచ్చి వివ • శత్వము నొంది యతండు తేఱుచున్.

చ॥ పటపట పండ్లు గీటుచు ను • పర్వులు దిగ్భ్రమ చెంది నిల్వ సు
త్కట గిరి శే పడి స్వలయము • గాడుపు పట్టి యొడల్ చలించి లం
పటగొనఁ బుంఖ పుంఖ ముగ • బంధముగాఁ గొన రింగు రింగునన్
జటపట నారసముల్ పలుక • సాయక జాలము లేసి నొంపఁగన్

చ॥ శరము సురాంతకుఁ డాహవంపుఁ • చిన్నెన గ్రుమ్మచు నొంప నొప్పి యు
ద్ధురతర రోష భీషణుఁడు • దూకొని శ్రీ రఘు వీర దాసుఁడై
ఖరిఁ బని మారుతాత్మజుఁడు • నిర్భరు తోడను వాని తేరి సం
బరమున కేఁగ మీటి ఘన • బంధుర గట్ట యొసర్చి మించఁగన్

క॥ కనుమూసి తెలియునంతనె, ఘనుఁ డింద్రజితుఁడు శతాంగ • గతుఁడై మిన్నె
ల్లను గాంచి నెతు రొలుకుచుఁ, దనుకుచు ధరమీఁద బడెడు • తత్సమయమునన్.

తే॥ తప్పి దనుజసుతుఁడు • తడఁబడ కపిలీల, గగనమునకు నెగసె • గాడ్పుపట్టి
యంతలోన నున్న • యరదంబు లన్నింటిఁ, గాంచి దన్ని విఱిచి • కూలఁ ద్రోచె.

## హనుమంతుఁడు బ్రహ్మాస్త్రముచేఁ గట్టువడుట

మ॥ సిరి పుష్పంబులు ధూప దీపములు నై • వేద్యంబు ధ్యానంబుతో
స్థిరభక్తిన్ మది నర్చనల్ సలిపి దృ • గ్భ్రూక్యాది సర్వప్రరా
చర సృష్టిం దగఁజేయు ధాతృ శరమున్ • సంధించి ఘోనాక భీ
కర లీలన్ హనుమంతు బాహువుల ల • క్ష్యం బుంచి యేసెన్ వడిన్.

ఆ॥ అమరు లదల వచ్చె • నయ్యమోఘాస్త్రంబు, సర్పరాజ రూప • సరణి మెఱసి
ఖగకులాధి పతియుఁ • గటరి దిగ్భ్రమఁ జెందఁ, బవన సుతుని కేలు • పట్టి చుట్టె.

మ॥ బల సంపన్న శరీర మావిధమునన్ • బ్రహ్మాస్త్ర బద్ధంబుగా
విలయాంతోగ్ర విఘుంతుద గ్రసిత ని • ర్వీర్య ప్రభా యుక్తిమై
నిలకుం ద్రెళ్ళిన చంద్రుఁడో యనఁగ ను • గ్రేక్షింపఁ దవ్వేళ నొ
త్తిలి వెన్నంటిన ధర్మదేవతయు నా • ర్తిం బొంద భూమిం బడెన్

మ॥ వనవాటీ బహిరంగణంబున జగ • త్ప్రాణ ప్రమోదుండు త
ద్ఘన పాశంబు విరించనాస్త్రమనియున్ • దన్మూర్తి, దా నేర్చియున్
వనజాతాసను వాక్యముం దలఁచి ని • ర్బంధంబు నంగీకృతిన్
గనుల న్మూసెను డాసె నింద్రజితుఁడున్ • గౌతూహల స్వాంతుఁడై

మ॥ అసువుల్ దక్కెనఁ జాలునంచు వడి ము • న్నత్యంత భీతాత్ములై
దెసలం దూఱిన దైత్యు లప్పుడు మహా • ధీరాత్ములై డాసి వె
క్కసమై చుట్టిన నాగపాశమును వీఁ • కం బట్టి యాడించుచుం
గసి దీఱం గని తిట్టి గార్చిరి మహా • గాంభీర్యముల్ సూపుచున్.

ఉ॥ కోఁతి బలంబు గ్రుంగె నని • కూఁతలు వెట్టుచు గంతు లేయుచుం
బ్రీతి వహించు లంక యొక • భీకర వారిధి వొల్పు దోఁచె న
వ్వాతసుతుం గవించు నహి • వాసుకిఁ బోల నిశాచరుల్ సుర
వ్రాతముఁ బోల నొప్పెసఁగె • వాయుజుఁ డయ్యెడ మందరాద్రినాన్.

మత్త. నాగ పాశ నిబద్ధ మారుతి • నవ్య కాంచన దేహముం
బాగుగా గమనించి చూడఁ బ్ర • భంజనుండు కదల్పఁగా
భోగిరాజు కదించి చుట్టిన • భూరి భూధరమో యనన్
రాగిలెన్ స్థిర చిత్తతన్ రుచి • ర ప్రభా లస దంగితన్.

చ॥ పురుషులు చెల్వలుం గలిసి • మూఁగిరి దిక్కులు భూతలంబు సం
బరమును సందులేక వడి • వాయుజుఁ గాఁచిరి పొంగియార్చి ర
వ్వూర మపుడొప్పె మున్ను సుర • ముఖ్యుఁడు పట్టు వడంగ నైన సం
బరమును సంతసంబు వెలి • పాటును పొంది రహించు కైవడిన్.

## 13. పాశ బద్ధ పటలము. (140)

సీ॥ ఏయుఁడు నలకుఁడు • వేయుఁడు పొడువుఁడు. చీల్పుఁడు ప్రేవులు • వేల్పఁ దనుచుఁ
ద్రెంపుఁడు త్రుంపుఁడు • తినుఁడు మ్రింగుఁడు కొంది. వచ్చుది సేయుఁడు • బ్రదికె నేని
మన జీవితంబులు • మాఁడు ననుచు వాని. పురుషులు తరుణులు • ముసరి కసరి
యిందాఁక నుసుఱుండ • నిత్తురే యనుచును. తలను రోఁకండ్లతో • దంపుఁ డనుచు
తే॥ నగ్నిలో వైచి కాల్పుఁడీ • యనుచు నంజు. కొనుఁడి యంచు నేలను రాచుఁ • డనుచు తాలు
కట్టి కదలిఁ ద్రోపుండని • నెట్టుఁ డనుచు. వారివారికిఁ దోఁచిన • పగిది ననిరి.

క॥ నాతండ్రిని నాయన్నల. నాతమ్ముల నొప్పగించి • నడువు మనుచు వీఁ
డీ తీరు రాఁగతము న్వ. ర్ఞాతుల దీకనుచు వారిఁ • జంపుం డనుచున్.

ఉ॥ కొండల వంటి దార్ఢ్యము న • కుంఠిత సత్త్వము గల్గు భర్తలన్
గొండొక వీడి యుండ మిఁక • గోడుగ నేడువనేల కోఁతి పె
న్మొండము ద్రొక్కి నిల్చి పెద • మోముల నూర్ధ్వము తాకి దొట్టులన్
ముండలమైతి మంచు వెత • ముచ్చిరు చెల్వలు పల్వు రయ్యెకన్.

తే॥ ఈడ్చుకొని పోవు వారికి • నెదురు వచ్చు. లంక జనములు సేయు కో • లాహలంబు
పతులు మరణింప విలపించు • సతులకెల్ల. నించుకంత సమాశ్వాస • మెనయఁజేసె.

ఉ॥ వీరుల గొడులన్ హరులఁ • బెంపగు శేరుల నెత్తివైవ బృం
దారక నాథ వజ్రహత • ధాత్రి ధరంబుల మాడ్కిఁ బడ్డ సిం
గారము గల్గు వీథుల న • గారములన్ గని సంతసిల్లుచున్
మారుతి పోవుచుండె నల • మానుష భోజను లీడ్చు త్రోవలన్.

ఉ॥ చీమల రాటుపల్ ముసరి • చెట్టును చుట్టిన యట్లు సంగర
క్షేమము నొందు బాహువులు • దివ్య భుజంగ నిబద్ధమౌట కాం
తామణు లారఁ గానక వి • తాకున నీకపి వచ్చె నీడ క
మ్మా ! పనకేది దిక్కనుచు • మానిరి చేష్టలు కొంద ఱత్తఱిన్.

చ॥ పలువురు చూచి నివ్వెఱగు • పాటున నేడ్చిరి విహ్వలించుచున్
పలువురు వెన్క నేమిగతి • పట్టునొ యంచొగిఁ బాఱి రవ్వలన్
బలువురు హాఁప బ్రాఁకు లోక • పాటియె యంచు వచించి రొయ్యనన్
బలువురు కీరితించి రల • వాయుజ వీర విహార లీలలన్.

ఉ॥ కొందఱు పిచ్చలించి కని • క్రూర భుజంగము పాశ మీ మరు
న్నందను మేనఁ బూసరము • నాణెముగాఁ బెనవైచి నట్టు లిం
పొంద వెలుంగుచుండెను స • ముస్నతి నాస్కము సత్ఫలంబులన్
డెందములందు తేటిచి ఘ • టించుట మేలని యాడి రయ్యెడన్.

తే॥ రాజు కడకుఁ గొంపోవుట • రాజకాదు, క్రుంగి వీఁడుంట కట్టుల • లొంగి కాదు
వెనుక యాలోచనము వేఱు • వెతలు గలుగు, ననుచు వాయుజుఁగని మ్రొక్కి • యణఁగి నారు

తే॥ వైనతేయుని మించిన • బాహుబలులు, దైత్యు లేఁబదివేలు గం • ధ వహు తనయుఁ
గట్టినట్టి పాశంబును • పట్టి లాగి, కొనుచుఁ బోవుచుండిరి వేడ్క • కొనలు సాగ.

క॥ అంతకుఁడు బల పరాక్రమ, వంతుల దైత్యుల నడంప • స్వాకృతితో రా
స్వాంతమున జడిసి యీ వహి, వింతగు రూపంబు గొని క • వించెనొ యనుచున్.

చ॥ దనుజ చిరంటికల్ ఘన సు • ధా ధవళంబగు సౌధ వీథులన్
మునుకొను చంద్ర శాలలను • మంగిళు లందున దిడ్డియందు వా
దనములు గల్గు చోటుల ము • దం బలరారఁగఁ జూడవచ్చి యీ
వనచరుఁ డెందు వాఁ డితనిఁ • బంపిన దెవ్వరొ యంద్రు నివ్వెఱన్

తే॥ మదఁతి సీత పాతివ్రత్య • మహిమచేత, రేఁపఁగా ఖండపరశు వీ • కృత్రిమంపు
రూపుగొని యందమైన లం • కా పురంబు, మాలు పంబూని వచ్చెఁ గాఁ • బోలుననిరి.

తే॥ అమర కాంతలు విద్యాధ • రాంగ నలును, భుజగ కన్యలు చక్కెరఁ • బోఁడులైన
సిద్ధవనితలు మత్తకా • శినులు జక్కి, నులును కలకలమని వచ్చి • యెలసిచూచి.

తే॥ వారిధిని యోగనిద్ర నొ • ప్పారు చక్రి, సృష్టికర్తయై వెలయు వి • రించియుఁ బగ
పూని తమ తమ రూపముల్ • మాని యొక్క, దేహముంగొని భూమికి • దిగిరొ యనిరి

ఉ॥ దైత్యులు దైత్యకామినులు • దక్కఁగఁ దక్కిన యక్ష కిన్నరా
దిత్య భుజంగ సిద్ధ సుద • తీ మణు లెల్లరుఁ గాంచి డెందమం
దత్యనురాగలై కనుల • నశ్రులు నించిరి ధారణీ సుతా
నిత్యహితంబు గోరుటనొ ? నిర్మల ధర్మము నాశ మౌటనో ?

॥ వీరుఁడు మారుతి యిదియే, కారణముగ నిల్చె వేఱు • గాక చనుచు లం
కా రమణుం గాంచుట నా, కారయ లగ్గనుచు నెంచి • యటులే యరిగెన్.

ఉ॥ నాజనకుండు వాయు కరు • ణన్ రఘురామ పదారవింద హృ
త్పూజను తల్లి రాము సతి • పూర్ణమతిన్ దయసేయు దీవనన్
జేజె లొసంగు సద్వరము • చేతను వారిజగర్భు నస్త్ర మి
య్యోజనె త్రెంచికోఁగలను • ప్రోద్బల పద్ధతిఁ జేయ నియ్యెడన్.

సీ॥ రాక్షసేంద్రుని సంధించి • రాజిత గతి. నెల్ల రెఱుఁగంగ రఘురాము • వీర్యశక్తి
సంభవించు పరిస్థితుల్ • చక్కఁ దెలుప, డిటవు చెడి జానకిని వీడఁ • దివురవచ్చు.

ఉ॥ అంతియ కాక వాని సచి • వాప్త చమూబల సంపదాళియున్
సంతనగా నెఱుంగ నగుఁ • జక్కటి దెల్పఁగ వచ్చు రావణ
స్వాంతము జాడయున్ దిటవు • సంస్థితి గానఁగవచ్చు వాఁడు త
త్స్వాంతము దాఁచినన్ మొగము • తప్పక చెప్పదె యెల్ల రీతులన్,

సీ॥ వాలి నిధనంబు మఱి సాల • భంజనంబు, వానర బలంబు రవిజు న • వార్య గరిమ
తెలియఁ దెలుపఁగ వచ్చును • తెలిపినంత. మదికి నాటినఁ జెదుగులు • మానవచ్చు.

ఉ॥ కావున నేగుటే తగిన • కార్యము రామ పరాక్రమ స్థితుల్
రావణుఁ దాలకించి తగు • రాణఁ జరించిన లెస్స కాదయే
నావలఁ గొంచె కొంచెముగ • నచ్చిన దానవ సేనఁ గూల్చి ధా
త్రీవరుఁ జేరుటే తగిన • తీరని మారుతి యేగె వారితో.

ఆ॥ గొప్పసేన తన్ను • గొలిచి రా వృషభంబు, పగిదిఁ గట్టు వడిన • వాయుసుతుని
రాజ సౌధమునకు • రాణతోఁ గొంపోయె, నెల్లవారు చూడ • నింద్రజిత్తు.

క॥ దూతలు మున్నుగ వెసఁ జని, దైతేయ ప్రభుని గాంచి • తలిరుచు భక్తిన్
వాతూలి కట్టువడె జల, జాతాసను నస్త్రమునఁ బొ • సంగఁగ ననుడున్.

తే॥ వినిన యతఁ డుత్సహించి య • వ్వినుచువారి, కిచ్చె దిగ్గజ రదనంబు • లీడ్చికొన్న
తారహారంబు తన తొమ్మ • సూర చంద్ర, రహిత గగన స్థలంబను • రహి వెలుంగ.

తే॥ అమిత కౌతూహలమున బా • హాలి వొంగ, గండొవలు వికసింప లం • కా విభుండు
సత్వరంబున మీరేగి చంపకుండఁ, గోఁటి నిటకుఁ దోడ్తేరఁ బ • ల్కఁడని పంపె.

క॥ వార్తాహరు లరిగి విభుని, వార్తను తనయునకుఁ దెలుపఁ • బరవిన యది య
వ్వార్త పురమెల్ల నదివిని, యార్తిని మదిగుంది సీత • యమిత వ్యథచే.

ఉ॥ కావలి గల్గు నీవనముఁ • గాడుగఁ జేసెను పట్టవచ్చు దై
త్యావళిఁ గూల్చెనంచు విని • యప్పటి కప్పుడ సంతసించితిన్
బావని యిట్టి యాపదల • పాలగుటం దలపోయ దుర్విధుల్
పోవవు నన్ను వీడి యని • బుద్ధిఁ దలంచెద నంచుఁ గుందుచున్

ఆ॥ ఒడలు ధూళిఁ గ్రుంగ • నొడిదంపుఁ జిత్రంబు, పొగచు కరణి నొప్పు • భూమి పుత్త్రి
చెడుగు మృగయు చేతఁ • జిక్కిన పోతంబు, కొఱకు నేర్చు హంసి • కరణి వగచె.

తే॥ మింటి నంటెడి పొడపగు • మేను గలిగి, సర్వ విద్యల నేర్చిన • చదురు గలిగి
జలధి దాఁటిన యలఘుసు • బలపు గలిగి. యక్కటా! చిక్కితివె యొక • యసురు చేత

చ॥ తగవె జయించు నిక్కపసను • తద్జ్ఞుల పల్కులు పొల్ల యయ్యె నీ
డగు బలశక్తు లిక్కరిణి • నాతెనె? పాపమె గెల్పు నొందెనే?
జగతిని ధర్మమే నిలువఁ • జాలక తాతెనె? యక్కటక్కటా?
నెగుళులపె నెగుళ్ళ లిటు • నిల్వనఁ గాల్చనె నన్ను నిచ్చలుఁ?

ఉ॥ ముద్రిక నిచ్చి ప్రాణములు • ముచ్చట నిల్పిన నీకుఁ బ్రీతిమై
భద్రములం జిరాయువును • పల్కితి నయ్యని తప్పదంచు నీ
క్షుద్రుల గెలడంప భుజ • శూరతఁ జూపఁ దలంచి యట్లు నో
పద్రవ మార్గగుండవయి • ప్రబ్బి గడించితి వాయునందనా!

మత్త. ప్రాణ దాతవు నీవు నాపడు • పాటు లచ్చటఁ దెల్పినా
ప్రాణ నాథుని తోడి తెత్తువు • రాముఁ బాజిని రావణ
ప్రాణముల్ తొలఁగించి నా చెఱఁ • బాపునే యని యో జగ
త్ప్రాణ నందన! నమ్మియుండఁగ • బాదు చేసితి వన్నియున్.

తే॥ అనుచుఁ బలువార్త లాడుచు • మనసు కరఁగఁ, బ్రాణములు చలింపఁగఁ గ్రేపు • కట్టు
గోవవలెఁ దపించుచు గ్రుంగి • కోమలాంగి, సీత మేదినిపై సొమ్మ సిల్లి వ్రాలె.

ఆ॥ అట మహాత్ముఁడైన • యంజనీ పుత్త్రుకు, నిఱియఁ గట్టినట్టి • యింద్రజిత్తు
తొలి తపః ఫలమునఁ • దొడరి జగంబుల, గెలచినట్టి యసుర • కొలువు చేరె.

సీ॥ ముల్లోకముల వెల్గు • ముద్దు చంద్రుండనఁ, గ్రుచ్చి యెత్తిన వెండి • కొండ యనఁగ
ముత్యాల గొడుగు స మున్నతి వెలుఁగఁ జ. క్ర పవి శూలంబుల•వ్రణ వితాన
మతివల నఖ రేఖ • లలరారు వింశతి, బాహుల నంగద • ప్రభలు వెలయ
నురుకోప వహ్నిచే • నూర్పుల పొగలచే, వడగాలి వడదెస • నదరె ననఁగ

తే॥ మరకత ద్యుతి ప్రతతితో • మణుల శోభ, నరకమున కేగి దాఁగిన • యిరుల గ్రుంగ
శేషుఁ డన్ని దిక్కులకును • శిరము లలరఁ, ద్రిప్పి పేరోలగంబున • నొప్పెననఁగ.

ఉ॥ తేర్చి ఖచించినట్టి మణి • దీప్తులు కాసియ నుండి పర్వఁగాఁ
బేర్చి దివాకర ద్యుతిఁ గ • వించు విభూషలు బాహు కీర్తులన్
దీర్చి వెలుంగ వారినిధి • దివ్య సువర్ణ గిరీంద్ర శృంగముల్
మార్చి కిరీట పంక్తిగ న • మర్చి ధరించిన చెల్వ దోఁపఁగన్.

ఉ॥ చెందిర వన్నె మీఱు కటి • చేలము కచ్చముతో వెలుంగఁ దా
రేందు సర ప్రకర్ష ముతు • హీర మణి ద్యుతి నెచ్చరింపగా

డాంధ తమంబు సాంధ్య రవి • నంతరమందు ధరించి తారకా
బృందము భూష గాఁగఁ జలి • వెల్గును ఛత్రముగా ధరించెనా.

తే॥ సౌరునకు వేదములకు గం • భీరిమకును, తావలంబగు మొగములు • దశ దిశలకు
దృష్టులం ద్రిప్పు నపుడెల్ల • దిగిభ పాల, కులకు ధ్రువ శేషులకు భీతి • గొలుపు చుండ.

సీ॥ లోకైక నాయకు • కౌకుత్స్థు దేవిని, కాంచిన పిదప నా • గంబునుండి
సత్యమ్ము దాఁక నీ • జగముల తరుణులు, పురుషుల వలెఁ దోఁచు • పొలుపు నిలువ
వానర హరి హర • మానవావళి తక్కఁ, బెరవారు కేల్మోడ్చి • బిరుదు లాడ
వేణు వీణాదిక • వినుత రవంబుతో, రంభాదు లించు న • ర్తనము సలుప
లయకు ననుగుణంబుగ మద్దె • లయు ధ్వనింప, హస్తములు నేత్రములు బొమల్ • హరువు మీఱ
మునులు సైతము ముక్తిపై • మనసు రోసి, యాడు మేనకపైఁ జూడ్కు • లలర నిలుప

సీ॥ ఒక మోము పొలయల్క • నూనిన సతి ముఖా, బ్జాత మరంద మా • సక్తి నాన
ఒక మోము తన తోడ • నొగిఁగూడి యలసిన, చెలి యధరామృత • మొలసి యాన
ఒక మోము తనియ గీ • తికఁబాడు కామినీ, తారుణ్య మోహామృ • తంబు నాన
ఒక మోము నర్తన • మొనరించు మగువల, యభినయ రస సుధ • నాస నాన

తే॥ ఒక మొగము వేల్పులకు నాజ్ఞ • లొసఁగు చుండ, నొక మొగము మంత్రణంబుల • నొనరఁజలుప
నొక మొగముఘోర పాప చి • హ్నకల వెలుప, నొక మొగము జానకీరూప • మూహ సేయ.

తే॥ ధరణి జాత సతీత్వమున్ • శరధి నీఁది, దరిని చేరు టెట్లని యొక • శిరము దలఁప
మలయజ స్తనుల్ తన చుట్టు • నిలిచి చూపు, ముకురమునఁ దన సౌరొక • మొకముచూడ.

చ॥ తొలుటను తేనెకై చను మ • ధు వ్రతమట్లు ధరాత్మజాతపై
పరుగులు వాఱు డెందమును • భావన సేసి తపించు వారు చ
న్గిరులను-బాష్ప బిందువులు • నెట్టన రాలఁ గృశించువారు నొ
తెఱవల చూపు తూపులు ప • దింబది బాహుల మీఁద వ్రాలఁగన్.

ఉ॥ షట్పొదిఁ బూసికొంచు మధు • వుం దగఁ ద్రావుచుఁ దమ్మి మొగ్గల
ట్లొప్పిన చన్నుదోయి పయి • నొందిన చందన మందు డిందుచున్
గుప్పున వచ్చు తెమ్మెరలు • గొప్ప ప్రతి క్రియ సేయు కైవడిన్
విప్పగు పుష్పబాణ శర • విద్ధ మహా వ్రణరాజిఁ దూఱఁగన్:

తే॥ వాలు గంటుల యానన • పద్మములకు, భాస్కరుంబోలు వాఁడై సు • పర్వ వరుల
కేలుఁ దామరలకు శశిఁ • బోలియున్న, వైశ్రవసుఁ గాంచె ముంగల • వాయుసుతుఁడు.

ఉ॥ కాంచి భుజంగముం గను ఖ • గస్రవరుం బలె నుగ్రమూర్తియై
సంచిత కర్మబంధముల • జ్ఞానముచే బలె నాగ పాశముం

యొంటని వారిపట్ల వడి • యోచన సేయఁగఁ దగ్గ తీరు చె
న్నంటుల పట్లఁ జేయఁ దగు • నా? యిదిపోలునె నిన్నుఁజోఁటికిన్?

ఆ॥ సంకటమ్ము వచ్చెఁ • జావేది? బ్రదుకేది? యనఁగనేల? నన్నె • యంపితేని
వనచరులను నరుల • వధియించి నీపగ, రూపు మాపి వత్తు • రూఢిగాఁగ.

క॥ అనుచు మహోదరుఁ డాడఁగ, విని కన్నుల నెత్తు రొలుక • వీక్షించుచు రు
ద్రనిభుండు వజ్రదంష్ట్రుఁడు, దనుజేంద్రుని దిక్కుఁదిరిగి • తాత్పర్యమునన్.

చ॥ మనుజులు వానరుల్ మిగుల • మాన్యత చూపఁగఁ దగ్గవారె? యో
దనుజ వరేణ్యులార! చని • దర్పముతో వెసఁబట్టి మ్రింగుఁ డం
చనుమతి యిచ్చి యిచ్చటనె • హాయి వహించుట మాని యిట్లు మీ
మనమునఁ జింతిలం దగునె? • మాపయి నమ్మిక మీకుఁ బుట్టదో?

ఆ॥ ఆజ్ఞ మీఱువారి • నప్పుడ తెగటార్చి, లోకములను మీకు • లోఁగఁ జేయు
నేను మిమ్ము మీఱి • యెన్నఁడు నడచితి? నుత్తరువు నొసంగ • కుండుటేల?

ఆ॥ అనుడు నుండు మనుచు • నావజ్రదంతు నా, క్షేపణంబు చేసి • భూపు మొగము
గాంచి దుర్ముఖుండు • కడు నల్పువలె నుండ, నేల? యనుచు మఱియు • నిట్టులనియె.

తే॥ దిక్కరులు దుర్బలంబులై • తేజు మాసె, వేల్పు లుడిగిరి రజతాద్రి • బెండువడియె
నట్టి నీకు నృపులు కపు • లధికులైన, మెచ్చఁ దగినదే నీ బల్మి • యిచ్చకొలఁది!

తే॥ బాగుగాఁ జూడ నీ తీరు • బలవిహీను, లైన వారల తీరగు • నయ్య నిజము
పగఱు బలవంతులే యైనఁ • బ్రాణరక్ష, ణంబుకై వారికడఁగి యుం. • డంగఁ దగునె?

క॥ మనుజులు నెలఁగులుఁ గపులును, మన కాహారములు; వాని • మార్కొన దిగులుం
గొనుదుమయేనిన్ జగమున, మనకంటె విపేకులెవరు? • మగ లెవ్వారల్?

తే॥ ఒక్కకోఁతి సంద్రము దాఁటి • యూరఁజొచ్చి, నిప్పుపెట్టి పల్వురఁజంపి • నెగడిమరలె
రాక్షసులమైన మనకుఁ బు • రంబు వీడి, దాడి సేయుట తగదేమి? దానవేంద్ర!

తే॥ మన పురికివచ్చి సౌధముల్ • మంటఁగలిపి, సైన్య బలపరాక్రమముల • నరణిఁదెలిసి
ప్రాణములతోడ మరలిన • వారలెవరు, గలరు జగమునఁ గోఁతి యొ • క్కండుదక్క?

తే॥ తగవు కర్తవ్య జయములఁ • దలఁచి తీరు, మానముగఁ జేయఁ దగ్గది • మనుజవర్య
యున్న కడకేగి వారల • యసుఱు లూడ్చు, పద్ధతియె యొప్పు నన మహా • పార్శ్వుఁడనియె

తే॥ కోఁతి యొక్కటి పురి నాల • గోడు బాల, గోడుగాఁ జేసి పోవఁ గ • న్గొనుచునున్న
మనము పొందక నిజముగ • మానియున్న, పేదతనమేది? విలిపిన • పేర్మి యేది?

తే॥ మొదటిపోరున బలహీన • పురుషులొక్క, కొంద ఱా కోఁతిచేతుల • గూలినంత
తక్కువారల చేవయుఁ • దఱిఁగెనేమి? లంకతో శౌర్యమును కాలి • క్రుంగెనేమి?

తే॥ పంపినారలో మనుజులు; పచ్చసటియొ, తరుచరము; చేసినది పుర • దాహమయ్యె
దానికై దైత్యవర్యులు • తలరిరన్న. నింక నేమేమి తొడరునో • యెన్న నగునె?

తే॥ ఇచట నిలిచి మాటాడుట • కిష్టపడను. వెంటనే యేగి వారల • పేరు లేక
చేసి తనివారఁ దినుటయే • చేయఁదగిన. కర్జమిఁక వేఱు యోచనల్ • కానివనియె

తే॥ ప్రభువు బలికి కర్తవ్యంబు • ప్రశ్నచేసె. నేగి తలకొక్క దిక్కుగా • నీల్గి టెంకఁ
గొడుప! యని విసుగొంది యం • గదను మండి, చాలనవెఁ బిశాచుఁడను ని • శాచరుండు.

తే॥ ఇంతగా విభు పేర్మి శం • కింతుమేని, కార్యమిదియేని మనకంటె • ఘనులు వారు
మనము తక్కువ వారమే • యనుచుఁ బలికె, సూర్య శత్రువనెడు దైత్య • వర్యుఁడొకఁడు.

క॥ మన మాలోచించెడు నది, మనుజులఁ గూర్చియె కాన • మనచేవయుఁ బా
లన శక్తి చెడియె నను వి. న్నన కిది చాలునని యజ్ఞ • నాశకుఁ డనియెన్.

తే॥ జ్వలిత నేత్రుఁడౌ శివుపైకి • జరుగుటన్న. నవ్వఁ దగియుండుఁ గపిపైకి • నరులపైకి
వెడలుకంటెను వార లి • వ్వీడు సేరు. నంత కోర్చియుండమని ధూ • మ్రాక్షుఁడనియె.

తే॥ తక్కువారలు పాము చందమున బుసలు. కొట్టి యిదియె లెస్సనుచు వాక్రుచ్చినారు
పిదప నెల్లర వారించి • వినతి తోడ. నిలిచి కుంభ కర్ణుం డిట్లు • పలుకఁ దొడఁగె.

—: కుంభకర్ణుఁడు హితము పలుకుట :—

తే॥ వెనుక ముందారయఁగలేని • పిన్న లెల్లఁ. బలుకుకంటె నూరకయుంట • పాడియగును
తమ్ముఁడని యెంతువేని హి • తమ్ము దెలుపు. వాఁడఁ గటు వేని మన్నింప • వలతు విన్న

ఉ॥ పుట్టితి బ్రహ్మవంశమునఁ • బోఁడిమి వేదము లభ్యసించి య
ప్పట్టున విద్యకుం దగిన • ప్రజ్ఞయు శీలము నొందినాఁడ వీ
కట్టిఁడి సేఁత నీకు నవుఁ • గాదన నేల? విరాళి వహ్నిపైఁ
బుట్టె నిఁకింత మాత్రయును • పొందకమెన్నె ఫలంబు దానిచే?

ఉ॥ అందము చిందు లంక యెరి • యంగఁ బ్రభుత్వమె కూలినట్లు నీ
డెందమునం దపించితి క • డిండిగ రాముని దేవిఁ దెచ్చు నీ
చందము మంచిదేమి? [illegible] ములు • చల్ కడుపాపులు పొందఁ దగ్గ యీ
నిందకు మించి రోయఁదగు • నీచత ధాత్రి నొకండు గల్గునే?

చ॥ నగరము రూపు మాసెనని • నాన వహించెదు ధర్మపత్నులా
మగువలు నీపయిన్ రుచిర • మందతర స్మితకాంతు లూన్ప న
న్యగరిత కాళ్ళపైఁ బడుచు • నోర్వక యామెయుఁ బ్రువ్వఁదిట్ట నో
ర్పుగొని సహించుచుండుటయు • రూఢ య[illegible]ంబు నొసంగఁ జాలునే?

శా॥ ఏనాఁడిట్టు లధర్మరీతిని కృపా • హీనుండవై క్రొత్తడిన్
మానం బార్పఁగ నీచ పద్ధతుల సం • భావించుచుం దెచ్చితో

యానాఁడే మన వన్నెవాసి తటిఁగెన్ • సైన్యంబు చేకూరె లో
కానన్ దుష్కృతముల్ పొనర్చి యశముం • గాంక్షింపఁగాఁ బోలునే?

చ॥ అకలుషశీలయౌ నొకని • యంగనఁ దెత్తము కారనుంతమున్
బ్రకటిత కీర్తిఁ గోరుదము • వాక్కుల శౌర్యము వెల్లడింతమున్
వికలత గూర్చు కామమునఁ • బ్రీతి వహింతము మానవాలికిన్
గకవికలౌనమున్ జయముఁ • గాంక్ష యొనర్తము మేలుమేలగున్.

ఉ॥ పెద్దలు సేయు కార్యముల • వీఁడితి వంశవినాశ కార్యముల్
పెద్దగఁజేసి తా పయిద • లిన్ విడిపించుట యెల్లిదంబుగా
బుద్ధికిఁదోఁచెఁ గాన నిఁక • భూపకుమారులు వచ్చి కీర్తియున్
దొద్దకుఁబోవఁ జంపినను • దోసమె? నిందయు రాదు ధాత్రిపై.

చ॥ వనమున నొక్కఁడే ప్రబల • వాహినిఁ గూలిచి తమ్ముఁ జంపిరేఁ
పెను పెనువైర మియ్యదియు • వెత్తిగనున్నది యింక ముఖ్యమౌ
పని సమరంబు సేయుటకు • వాహిని సిద్ధముచేసి యుంచుటే
మనకు హితంబు; వేతొకటి • మాన్యత గూర్పదు చింతచేసినన్.

తే॥ మనుజు లల్పులే యైనను • వినుము వారు, వచ్చుదాఁక నోర్తమయన్న • వారితోడ
నమరులును లోకములు నొక్క • సైన యెడల, మనకు నాపద తప్పదు • దనుజ నాథ.

తే॥ సేన మితిమీఱ వారికిఁ • జేరుమున్నె, వనధిదాఁటి నేఁడే నర • వానరులను
అవలి కేఁగనీయక చుట్టి • యవియఁజేయు, కర్జమే ముఖ్యమని కుంభ • కర్ణుఁడనియె.

చ॥ అనవుడు దానవేంద్రుఁ డను • జా! కడులెస్స పచించి తీవు నా
మనమున నున్నవాని నను • మానములేక గ్రహించి తెల్ల; వే
రనుకొనుటేల? నేఁడె విజ • యధ్వజ సుందర సైన్యరాజితోఁ
జని పగఱన్ వధించి పెలు • చం జనుదెంచుట మేలు లెండనన్.

-: ఇంద్రజితుని ప్రతాపోక్తులు :-

తే॥ అంత మేఘనాదుఁడు లేచి • యనియెఁ దండ్రి! నీవ వైశమ దండెత్తి • నీచజనులఁ
జంపఁ దగినంత స్థితి యేమి • సంభవించె? మా బలంబులు కృశియించి • మాఁడెనేమి?

క॥ భవుఁడును సహస్రదళ సం, భవుఁడు ప్రసాదించి యొసఁగు • పాశాదికముల్
దివులఁగల దనుజు లుండిరి, తవిలి యలయుచుండు నొకఁడు • దాసుఁడ నుంటిన్

ఆ॥ మూఁడు లోకములును • మొదటి వేలుపుతోడ, నెదిరినేని గెలుపు • నిత్తు నీకుఁ
గాదయేని కొడుకు • గాను నిజము పులి, కడుపునందు మేఁక • పొడము నేమి?

చ॥ వనచరు లాజిఁ గూలఁగఁ గ • బంధము లెల్లెడ నాట్యమాడఁగా
మనుజులు చింతిలన్ జన స • మాజము జాలి వహించు రీడతో

జనకజ యేడ్చుచుండఁ గడు • జాల్మిల రాఘవులన్ వధించి నేఁ
దనువుగ వారి శీర్షముల • సర్మిలిఁ గానుక యిత్తుఁ జూడుమా.

ఉ॥ చందు ముఖంబు రోఁతపడఁ • జూచెదు కోఁతులు మన్మహోగ్ర కో
దండ విముక్త చండ నిశి • త ప్రదరంబులు ముంచి నొంచఁగాఁ
బందు లిగిల్చి దిక్కులకుఁ • బాయుట గాంచి మనంబులోపలఁ
నిండుగ మోదమంది వెస • నీఁగెదు నీదగు చింత చూడుమా.

చ॥ కరిఘటలుఁ రథంబులకుఁ • గట్టఁ దురంగములుఁ బదాతులున్
బొరపగు పూర్వజన్మ కృత • పుణ్యము రాజ్యములేని శత్రులా ?
విరివిగ గూనులైన యట • వీచర వర్గముఁ గూడి గెల్తురా ?
సరిసరి యట్టులైన దను • జవ్రజ శౌర్యములేల కాల్పనే ?

తే॥ పాంచ భౌతికమై యొప్పు • ప్రాణికోటి, నెల్లఁ గూఁకుడు వేళ్ళతోఁ • గెల్లగించి
నరులు వానరులను పేరు • ధరణిలేక, చేసి గాక క్రమ్మఱఁగ నా • సింపఁ జుమ్మ.

తే॥ అనుచుఁ బదములఁబడి లేచి • యంజలిఁగొని, సెలవువేఁడఁగ నిఖిల దు • ష్కృత్యములన
గెలిచి తత్త్వజ్ఞుఁడై లస • త్కీర్తి గను వి. భీషణుం డౌడుగఁబడి యి • వ్విధి వచించె.

—: విభీషణ నీతి :—

చ॥ నెఱి వివరించి పల్కు జత • నించిన కుఱ్ఱఁడ ! మూర్ఖబుద్ధివై
నెఱిఁగిన వారిఁబోలె వచి • యింపఁ దొడంగితి రాఁగలట్టి కీ
డెఱిఁగితె ? ముందు వెన్కలొక • యించుక యారయ కిట్టు లిచ్ఛమై
వెఱిమొఱి పల్కులాడి యొద • వింతువె కార్యము పిల్ల చేష్టలన్ ?

ఉ॥ గ్రుడ్డి యొకండు చిత్తరువు • కుంచియతో లిఖియించు తీరుగా
నెడ్డె తనంబునం బలుక • నెంచితి కార్యము చంద మారయన్
దొడ్డ గుణంబులున్ తలఁపు • తోరము కార్య విచక్షణత్వముల్
బిడ్డలకున్ బలంపడునె ? పెద్దల కూటమి నుండఁబోలునే ?

చ॥ విమల గుణమ్ములన్ వెలసి • విశ్రుత సత్య పథానువర్తులై
యమరిన పెద్దలేల ? యసు • రావళిలో గుణ శీల సంపదల్
క్రమమునఁ బొందుచేతనొ ? తి • రంబుగ వంచన చేతనో ? పరా
క్రమముననో ? మహత్త్వమును • గాంచిరి కొందఱు నీవ చెప్పుమా ?

తే॥ నిర్జరుల మాయచే గెల్పు • నేర్పు నీకు, నిచ్చినది తపంబో ? మఱి • యేదొ ? చూడు
కలుషముల నీఁగి ధర్మమా • ర్గముననడచు, వారెసుమ్ము నీ కొనఁగిరి • బలము నలవు.

తే॥ పాపశీలురు జగములఁ • బరిధవిల్లి, బ్రహ్మముఖ్యామరులగెల్చి • పరుసు ముదురఁ
బాపములఁ జేసి తుదిఁ గూలి • పడిరిగాక, తిరముగా స్వర్గ మేలిన • ధీరులెవరు ?

॥ పూర్వమును తరువాతను • బుద్ధి నిలిపి, చెడుగులం బ్రోచి మోక్ష సం • సిద్ధి గన్న
పెద్ద లెందఱు గలరు భా • వించి చూడ, వారిలో నొక్కరేఁ జెడు • వారు గలరె?

॥ ఎఱుక లేని బాలుఁడ వౌట నిట్లుపలికి • తంచు బలయుతు సుతు మంద • లించి యవల
రావణుం గని పల్కె న • ర్థంబు గేలి, సేయ కాలింతు వేని వ • చింతు ననుచు.

ఉ॥ తల్లియు నీవె తండ్రియును • దైవము నన్నయు నీవె చూడఁగా
నెల్ల సుఖంబు లీవగుదు • నింద్ర సుఖంబుల నొందుచున్న సం
పల్లలితార్థమౌ పదవి • పాడఱఁ జేసెద వంచు మించి చిం
తిల్లెద దుష్కృతంబులకుఁ • దీఱకయున్నె సురేంద్ర భోగముల్?

చ॥ చదివినదానికిన్ ఫలము • సచ్చరితంబున లేదయన్న ని
ష్పాదవిన కార్యమందు తగు • యోచన శక్తియు లేదయన్న నొ
ప్పిదమగు కార్యనిశ్చయ వి • వేచన లేకయయున్న నానుడుల్
తుదివఱ కాలకించి మఱి • దోసము దోఁచినఁ గోపగింపుమా.

జానకి యను పేరొందిన, మానవతి పతివ్రతాగ్ని • మాడ్చెన యది లం
కా నగరము గాకున్న నొ, కానొక వానరము కాల్చెఁ • గా యనఁజనునే?
ఎవరెటు యోచించిన గౌ, రవమును పోఁగొట్టుకొనుట • రమణుల వలలోఁ
దవిలి; యటుగాక యున్నను, భువికై; యివి రెండు గాక • పుడమిం గలదే?
శరధిపరిఖమగు లంకా, పురి కధిపు తపః ఫలంబు • పూర్తిగఁ జెడుటల్
నరతరుణి కొకతెకై యని, పరులాడఁగ విని సహింపఁ • బాల్పడ నగునే?
ఉరుతపము చేసి యజుచే, వరములఁ గొనునాఁడు మనుజ • వర్యులచే నో
టొరయక గెల్పొందుటకున్, వర మడుగవు పొసఁగు టెట్లు • వారిం గెలువన్?
మనుజుల వలనన్ మన మొం, దిన వానిని చింత సేసి • తెలుపఁగ వలెనే!
విను వేయి కేల వానిం, జెనసి నిలువ కడఁగి తిపుడు • చేయుట గలదే?

చ॥ పొడవయి యంబర స్థలము • ముట్టిన తారగిరిం బెకల్చి నాఁ
డడరి చతుర్భుజుండగు మ • హాత్ముఁడు నంది యొసంగు శాప మి
య్యెడ ఫలియింపఁగాఁ దొడఁగె • నింతకు హేతువు వాలిచే బలం
బెడలి కృశించునాఁడె గ్రహి • యించితిఁ బెద్దలవాక్కు తప్పునే?

ఉ॥ నిప్పునఁగూలి ప్రాణముల • నీఁగిన క్రొత్తడి యిచ్చు శాపమున్
దప్పికొనంగ నేర్తుమొకొ? దందడి దుఃఖము నీకుఁ గూర్తు నం
చప్పుడు పల్కె వేదవతి • యంబుజసద్మ యయోనిజాతయై
యిప్పుడు సీతగాఁగ జని • యించె నిజంబిది దానవేశ్వరా!

దశరథుఁడను నరపతి తన, వశమున నీజగము నడవ • వర్తించి మహా
యశుఁడయి శంబరుఁ జంపి త్రి, దశపతికిని స్వర్గమును ప • దంపడి యొసఁగెన్.

సీ॥ వృషభ రూపుండైన • యింద్రుమీఁద నిలిచి, దైత్యకులము రూపడఁచు క • కుత్స్థ నృపుఁడు
ఉర్వి గోవుగఁ జేసి • యోషధుల్ పిదికించి, జనులఁ గాచిన పృథు • చక్రవర్తి
జలనిధిం ద్రవ్విన • సాగరులును గంగ, గ్రిందికిఁ దెచ్చు భ • గీరథుండు
పొడమిన కులమునఁ • బుట్టి జగంబున, శత్రులఁ దునిమి వి • శ్రాంతి నొంది

తే॥ ధర్మముం గాచి న్యాయ ప • థమున నిలిచి, యబల కొసఁగిన వరము లే • దనఁగ లేక
సత్యమునకుఁ బ్రాణము వీడు • జన శరణ్యు, దశరథుని పుత్రకులు వారు • దానవేంద్ర!

క॥ వార లసామాన్యులు ముని • వీరులకును వేలుపులకు • వేత్తై యెఱుఁగం
గా రాని వారు మన క, ర్మారంభముచేత సులభు • లైరి మనుజులై.

తే॥ బ్రహ్మతోడ స్పర్ధించి ప్ర • పంచమొందు, సృష్టి చేయంగఁబూను కౌ • శికుఁడు పూర్వ
మభవుపలన నొందిన యమో • ఘాస్త్రములను, వారికొసఁగె యజ్ఞముగాచు • పట్టునందు.

తే॥ దేవదానవులకుఁ బోరు • దిపురనాఁడు, గరుడు నెక్కి విష్ణువుగొన్న • కార్ముకమును
పుర విదాహంబు సేయు పం • క్తిరుశరమ్ముఁ, గుబ్జుఁడైన యగస్త్యుచేఁ • గొన్నవాఁడు

చ॥ అతని శరాహులో జగము • లన్నిటి లేహన సేయు దిక్కులన్
జతనములోడఁ గొల్చును వి • సంబును గ్రక్కును ఘోరదంష్ట్రికా
యుతములు తూణ ఘాకముల • నుఁడు మహాత్ముల హింస సేయు దు
ర్మతులను దక్కఁ దక్కగల • ప్రాణుల నాహుతి సేయ నొల్లవున్.

చ॥ ధనువులు రామలక్ష్మణులు • దక్కఁ బరుల్ గదలింప లేరు శిం
జినులను చేవయుం జెడవు • శ్రేష్ఠము లౌ మనవిండ్లు పెద్దవై
నను తమ విండులన్ విఱువ • నాటఁగ లేవవి కల్పకంబులో?
కనుప వెదుళ్లొ? మేరువులొ? • కాక కులాచల సత్త్వ మూర్తులో

తే॥ వాలి వక్షంబు పగిలె భు • వంబుఁ గ్రమ్మి. నేడు మద్దులు గూలె దై • త్యేంద్రులైన
ఖరవిరాధులు మడిసిరి • కదనమైనఁ, బగఱు తెగి మాలుటయె కాక • బ్రతుకఁగలదె?

ఉ॥ కాంతులకెల్ల నెల్లయగు • కార్ముక వీరులు రామలక్ష్మణుల్
స్వాంతములం జలింపక వి • శంకట వృత్తిని తోడు లేకయే
మంతురు లోక జాలముల • మానుగ సోఁకులమూఁక దుంపతోఁ
ద్రెంతు రటంచు నమ్మియె త • ఱిం గని మౌనులు వేఁడి రిమ్ములన్.

చ॥ మనసునఁ జింతచేఁ గుమిలి • మాఁడుచు నీయెడఁ బల్క జంకి యీ
దనుజులు రేఁబవల్ విదుర • తక్కి కృశించుచుఁ గల్వరింత్రు నె
మ్మనములఁ జింతనూని గతి • మాలిన వేల్పులు సీత యన్విషం
బును గొనువారు నిశ్చయము • బ్రుంగెదరంచు మదెంచినారలున్.

ఉ॥ కీరితి మాయ నోర్పుగొని • కీడ్పడి చిర్నవు మాని తేజముం
దేరకుఁ బోవఁ గాంతి చెడి • దీనతఁ బ్రాణము మాత్రమొంది చిం

తారతిఁ గుందుచుం బగటి • తమ్ములదాయను వోలియున్న వా
రారయఁ బూర్ణిమా విధుని • యందము నందిన వారు నిర్జరుల్.

చ॥ ధరణిని దాఁటి యావలికిఁ • దాఁటిన కాలుఁడు దేవ యక్ష కి
న్నర ఫణి ముఖ్యులెల్ల రఘు • నాయకుదేవి విదేహపుత్రి యీ
షరిఁ జెఱ నున్న దంచు • విని • మోదమునొంది భయంబు వీడి చె
చ్చెర నపుడప్పు డిందలి వి • శేషము లారయుచుండ్రు శ్రద్ధమై

చ॥ చెడు శకునంబు లెన్నియొ వ • చింపఁగరానివి కానవచ్చె నా
క్కడఁ బగయూని యోటువడి • యేడ్చిన వేల్పులు దానవేంద్రు లిం
డెడనెడఁ గాన వత్తురు మ • దేభ తురంగము లిప్పు డిండ్లలో
నెడమ పదంబు వెట్టి చరి • యింపఁగ వచ్చెడు రాక్షసేశ్వరా!

చ॥ వరలెను జిహ్వికల్ దనుజ • పాళికి నక్కలు సంచరించె మం
దిరములలోఁ జిరంటికల • తీరగు ముంగురులందునన్ విప
త్కరముగ మిక్కిలిం గమరు • కంపు బయల్పడె నింతకంటె దు
ర్భరతర సూచనల్ గనఁగ • వాంఛ యొనర్తువె రాక్షసేశ్వరా!

సీ॥ ఖరుఁడు దూషణుఁడు త్రి • శిరుఁడు మారీచుండు, వాలి విరాధుండు • కూలు తీరు
నారసి చూడంగ • సారంగ పాణియుఁ, జక్రపాణియు వారి • సములె? చెపుమ
వారితోఁ గూడిన • వానర వరులు దే, వతలు వారలతోడ • వైరమేల?
ఇది మంచి పని యని • యెంచుట తగవె? నీ, కీర్తి భోగంబులు • కీడు పడును

తే॥ ప్రాభవము ప్రాలు నపవాదు • పైకి వచ్చు, నెల్లిదంబగు బంధులు • హితులు సుతులు
చెడెడి చేఁతలు తగదయ్య! సీత వీడు, మింతకంటెను మేలు నీ • కెదియు లేదు.

ఉ॥ మేలు దలంచి తమ్ముఁడిటు • మేవడి నాడిన పల్కులన్ రణా
భీలుఁడు రావణుండు విని • పెద్దగఁ జేతులు దట్టి వక్ర దం
ష్ట్రాళి వెలుంగ నేత్రముల • నగ్నికణంబులు రాలఁగా భుజా
పాళి యురంబు గ్రక్క దలఁ • బక్కున నవ్వి గణింప కిట్లనున్.

ఉ॥ మేదుర రీతిమై హితము • మీఱ వచించెదనంచుఁ బూని యు
న్మాదుని పోల్కిఁ బల్కితివి • మాయురె! నన్ను మనుష్యులంట! పెం
పేదక గెల్తురంట! విని • యెవ్వరు నవ్వక యుందు వార! లీ
పేదతనంబు గల్గినది • భీతినొ? ప్రేమనొ? యెందుచేతనో?

తే॥ మనుజ పశువుల గెలుపొందు • మాడ్కి యడుగ, లేదటంటి దిగ్ఘస్తుల • లీల గెలుచు
నాఁడు కైలాసగిరి నెత్తు • నాఁడు నేమి, వరము లొందితిఁ దెల్పంగ • నలతునిన్ను.

తే॥ ఇంచుకైన యోచింపక • యిట్లు వ్యర్థ, వాక్కులాడితి గాక కో • పంబు గొన్న
త్రిదశు లేమైరి తెలియవే • యిది యటుండ, నిమ్మ నీకంటె మానవు • లెచ్చువారె?

తే॥ పలుకఁదగిన వాక్పద్ధతి • దెలియపిపు, జయము నొకసారయైన ని • ర్జరులు గొనిరె ?
నింగి నెత్తంగ ధరణిఁ జీ • ల్పంగ నేర్తు, నన్ను నరులు గెల్తురనుట • నాయమగునె ?
తే॥ దేవవరములచే నైన • తేజమందు, వేని హరిహరులను మున్ను • దేనగెలిచి
నాఁడఁ తెల్పుము ? పిఱికి త • నంబు లేల ? నన్ను నరులు గెల్తురని యె • న్నంగఁదగు
తే॥ నందిశాపంబు గలదని • యందువేని ? కలుగు శాపంబులకు లెక్క • గలదె ? యేమి
చేసె ? నింద్రాదులిపుడు నా • చెడుగు గోర, కుంద్రె ? పిల్లి శాపంబుల • కుట్లుతెగునె ?
తే॥ కనకకశిపును వర్తించెడు • కాలకంతు, వలన వరమునొందుట మున్నె • తెలియనైతిఁ
గానవారికోడితిని ని • క్కంబె ? యైనఁ, దక్కుకపులు గెల్తురటంచుఁ • దలఁచితేమి ?
క॥ హరిహరులైనను వాలిని, దురమున నెదిరింప వారి • దోర్బలము కపీ
శ్వరుఁజేరు దాని నెఱిఁగియె,. నరుఁడు మఱుఁగునుండి కూల్చె • నారాచమునన్.

చ॥ చివికిన చాపమున్ విఱిచి • చేవ తొలంగి పగుఱ్ఱవాలు సా
ల విటపవర్గముం దొలిచి • లభ్యపదం బొక టాఁగయుక్తిఁ బో
వ విడిచి కాలనం బడి యు • పాయము పన్నఁగ నాలిఁ గోలుపో
యి వెతల డిందు మానవుని • యీ వొకరుండవె మెత్తు విచ్చమై

తే॥ అనుచు సజ్ఞాని యని విభీ • షణుని పలికి, లెండు దాటిసేయుదము రా • రండటంచు
నుదుటు గొను నన్నఁగని యూర • కుండలేక, వెండి నుడివె నీరీతి వి • భీషణుండు.

శా॥ అన్నా ! రాఘవుఁ డప్రమేయుఁడు జగ • ద్వ్యాప్తుండు నిర్ద్వంద్వుఁ డా
పన్నానీకశరణ్యుఁ డర్థిజన క • ల్పప్రాయుఁ డాద్యుండు భ
క్తి న్నాకేశులు కోరఁగా దనుజులన్ • గీడ్పాటు సేయంగఁ బు
ట్టె న్నాపైఁ గరుణించి మానుమని ప • ట్టెం బాదముల్ ఖిన్నుఁడై

మ॥ దనుజేంద్రుండు వచించు నిట్టు లనుజా ! దైత్యారి లోకేశ్వరుం
డనెదా మోలకు నెన్నిసారులొ రణ • వ్యామోహినై తాఁక నో
డినవాఁడై యెట డాఁగెనో యెఱుఁగరాఁ • దే ! వాఁడు నిర్భీతుఁడై
మనుజాకారము దాల్చి వచ్చెనొకొ ? నన్ • భ్రమింపఁగా నియ్యెడన్ ?

మ॥ అమరేంద్రుం జెఱనుంచుచో దివముఁ గొ • ల్లాడించుచో దిగ్గజేం
ద్రములం బట్టి రదంబులం బెఱుకుచో • దైత్యద్విషుం దోలుచో
సమరంబందున శత్రులం డునుమ చో • సాధింపఁగాలేని బా
ల్యము నందుండెనొ ? యేమిగాఁ దలఁచెనో • యంబేదయై ? తెల్పుమా.

క॥ హరిహర విరించనులు సుర, వర నర నాగులు నడంగి • వర్తింపఁగ నేఁ
డిరముగఁ ద్రిజగము లేలుట, నరుఁ డీతఁడు పుట్టకుంట • నా ? తెలుపఁగదే ?

మ॥ బలవంతుండగు శౌరి వేయిశిరముల్ • బాహా సహస్రంబు ని
య్యాలఁ గొల్వంచగు పాదముల్ గలుగు రూ • పెన్నంగఁ బిన్నంచు ని

చ్ఛలఁ యోచించి నిశాచరావళికి భ • క్ష్యప్రాయమై యున్న దు
ర్బలమౌ మానవ రూపముం గొనియెనే? • పల్కాడవే తమ్ముఁడా?

మ॥ భవుడున్ విష్ణుఁడు సంగరాంగణముఁనన్ • భ్రాంతాత్ములై పాఱుచో
నెవులుం బూనిన నందిపై గరుడుపై • నే వీఁపునం బూన్చు బా
ణ విశేషంబులు హ్రాదినీ సమములై • నాయొద్దనే యుండ మా
నవులా నన్ను జయించు వారలు? జగ • న్మాన్యా! భ్రమం బొందితే?

తే॥ రావలదు నీవు మాతోడ • రణము సేయ, లంక పెద్దది పెను విశా • లంబు గలది
భయపడక యుండుమని పల్కి • పరిజనహ ।r, గాంచి యెకసక్కె ముగనవ్వఁ • గనలుతోడ

తే॥ అప్పు డా విభీషణుఁడు ద • శాస్యుఁ గాఁ . పలికె నీకంటె నతిశయ • బలము గలుగు
వారు బంధులతో వెన్ను • వలన మున్ను, చెడిరి వినుము వారల కథ • చెప్పు వాఁడ.

## హిరణ్యకశిపు వధ పటలము.

చ॥ అకలుషమూర్తి బ్రహ్మ క్రతు • లన్నియు నేర్పెఁ దపంబు మెచ్చి కో
రికల నొసంగె శంభుఁడు వి • రించి రమేశు డు దొడ్డ భూత పం
చకము వహించియుండు గురు • సత్త్వము లెల్లను తాల్చె యా హిర
ణ్యకశిపు దానవేంద్రుఁ దమ • రాది విరోధుల గెల్చె వ్రేల్మిడిన్.

చ॥ కమలజ శౌరి శంకరులు • కాంచి భరించి నశింపఁజేయు నీ
కమలజ గోళ మొక్కటియె • కాదు గణింపఁగ రాని పెక్కు గో
ళములఁ గలట్టి ప్రాణు లవ • లంబముగాఁ దననామమే సదా
విమల మనస్కులై తగ జ • పింపఁగఁ బాలన సేసె బల్మిమై.

తే॥ రెండు దిగ్గజములఁ గేల • రెంట బట్టి, యూడ్చి చేరంగ విడుచు లో । • తెన్న రాని
కదళి లేడింటి నొక యంజఁ • గడచునట్లు, దాఁటిపోవుచు నుండు నా • దనుజ విభుఁడు.

ఉ॥ పండలి వెట్టుచుం బొరలి • పాఱు తరంగిణులెల్లఁ జిన్నవం
చండకుఁ బోఁడు మేఘముల • యంబువు చల్లన గాదటంచు వా
డంతు పయోధి యుప్పని క • డంగి యజాండముఁ దూఁటుచేసి వే
ఱండములోని వారిధి ప • యస్సు చొరం జలమాడు నందునన్.

ఉ॥ నాగ భువంబుఁ జేరి యట • నాగ వరాంగుల తోడ నింపుమై
నోగిరమాని నాకమున • నుండి దినంబును పుచ్చి రాత్రియం
దేగి విరించి లోకమున • కిమ్ముగ నచ్చటఁ గొల్వు సేయు ను
ద్యోగి సమస్త లోక భయ • దుండు నిశాచర రాజు నిత్యమున్.

చ॥ ఇనుని రథంబునెక్కి యట • నేత్తైఱఁ ద్రిమ్మరుచుండు శీత భా
నుని చవికం గ్రహించుచు వి • నోదముగాఁ బయనించు దిక్పతుల్

మునుకొని సేయు కార్యములు • పూర్తిగఁ దానె యొనర్చు మేరు భూ
మిని కొలువుండి బ్రహ్మవలె • మేకొని పాలనసేయు వీరుఁడై.

తే॥ పంచభూతాది దేవతా • వవపులెల్లఁ, దాన కైకొని సకల భూ • తముల కార్య
ములను మేఘుని పనుల ని • మ్ముగ నొనర్చు, సర్వశక్తుఁడై యామినీ • చర విభుండు

క॥ కమలాక్షుని నామస్మర, ణము నిఖిల జగంబులందు • నడపక తన నా
మమె జపియింపఁగఁ జేయుచు, సమరుల భాగము హవిస్సు • నతఁడే కొనియెన్.

శా॥ ముమ్మూర్తుల్ తమ కార్యపాళి సతత • మ్మొం జేయ లేరన్నచో
నెమ్మిం దక్కిన వారి కార్యముల పూ • న్కిం జెప్పఁగానేల ? యో
గమ్మం బూనిన మౌనులుం బదవులం • గాసిల్లి కోల్పోయి ని
త్యమ్మున్ దానవ సార్వభౌము పదముల్ • దక్కొండు పూజింపరున్.

మ॥ అమరుల్ నేరిచి పల్కుచుండుదురు దై • త్యస్వామికిన్ మేలు ! ని
త్యము వేదంబులు సర్వశాస్త్రములు నే • యాద్యున్ జగద్వంద్యు త
త్త్వము వాక్రుచ్చెడు నాహిరణ్యకశిపున్ • దాశ్చర్య మేపార స్తో
త్రములం జేయుచు మ్రొక్కుచుందుమని యు • ద్యద్భక్తమై నిచ్చలున్.

తే॥ త్రిదశు లసురులు క్షీరాంబు • ధిని మథింపఁ, దెచ్చు మందరగిరి తన • దీర్ఘబాహు
వులను దాలిచి తనదగు • బలముచూపఁ, దగిన దండము కాదని • తలఁచి విడిచె.

క॥ రవి యుదయాస్తాచల గిరు, లవి చూడ హిరణ్యనేత్రు • నన్నకు సొబగౌ
జెవి పోఁగులె యగు నాతని, జవ సత్త్వము లుగ్గడింప • శక్యమె ? యరయన్.

ఆ॥ అప్రమత్తుఁడైన • యాహిరణ్యకశిపుఁ, డడుగు మోపెనేని • యహి పదంకు
నిలుచునేని శిరము • నింగిని దాఁకు భూ, తాలి వెంటఁ దవులు • నంగ లిడిన.

సీ॥ స్త్రీలచేఁ బురుషుల • చే నపుంసకులచే, బ్రతివిఁ జరాచర • వితతిచేత
దృశ్యవస్తువుల న • దృశ్య వస్తువులచే, సురలచేఁ దిక్కుల • చరులచేత
నజ హరి హరులచే • నగ్నిని గాలిని, పుడమిని చదల నం • బువుల నింట
వెలుపలఁ బ్రాణంబు • గలవాన లేని వా, నను రేలఁ బగలఁ జా • వొనరకుండు

తే॥ నస్త్రశస్త్రాదులను వాని • కణుటలేదు, మునుల తిట్టు లాదిక్కునఁ • బోవలేవు
మనుఁ డాదెసఁ జూపులఁ • జాఁపలేఁడు, వాని యసువు గొనఁగఁ జాలు • వారలెవరు ?

తే॥ చావఁ దభివారములకును • జనకుఁడేని, యొంటరిగ వచ్చి చంపిన • నుసుఱువోదు
సకలలోకంబులందున • సాటిలేని. మేటి ప్రభువయి యతఁడొక • పాటినుండు.

సీ॥ ఆ హేమ కశిపున • కరుదుగాఁ బుట్టిన, ధీరుఁడు జ్ఞానుల • మేరుపూస
శ్రుతులకంటెను శాస్త్ర • మతులకంటెను సత్య, సూక్తికంటెను పరి • శుద్ధ గుణుఁడు
సర్వేశ సంబంధ • సంపూర్ణ విజ్ఞాని, శీల వర్తనులలో • మేలుబంతి
భూతదయను తల్లిఁ • బోలిన సుగుణుండు, యుగముల దాఁటు నా • యువు గలాఁడు

తే॥ జగములెల్లను పూజింపఁ • దగినవాఁడు, లలిత మోహనమూర్తి ప్ర • హ్లాదుఁడనెడు
తనయుఁ గని సంతసించి వి • ద్యను గడింపు, మనుచు నొక దేశికుని యొద్ద • నప్పగించె.

తే॥ అంధుపోలిక నున్నవాఁ • డస్మదీయ, చరిత మీతనికిం దెల్పి • చక్కఁజేసి
కన్ను దెఱపి తెమ్మని పంపఁ • గరుణతోడ, నొజ్జగొనిపోయి నేర్పంగ • నుత్సహించి.

సీ॥ ఓం నమో దనుజకు • లోదధి చంద్రాయ, హేమ కశిపవే మ • హేశ్వరాయ
యనుమన నతఁడు ర • యంబునఁ జెవులను, మూసి మీపద్ధతి • పొసఁగలేదు
వినఁగఁజాల ననుచు • వేద శిరోర్థమౌ, నిత్యవస్తువు పేరు • నియతి నుడివి
చేతంబు కరఁగ ని • శ్చేష్టుఁడై రోమ హ, ర్షణమొప్పఁ గనుల బా • ష్పములు జాఱ

తే॥ నొడలు మఱచి నటింప నా • బుడుతఁగాంచి, చెనఁటి ! నిను గాక నన్నను • చెఱచెదేమి ?
వేలుపులకును పలుకంగ • వీలుకాని, పలుకు పలికితె యని వడ • వడ వడంకె.

సీ॥ తత్త్వ విజ్ఞాన ని • ధానంబు ప్రహ్లాదుఁ, డిట్లను నన్ను నీ • వేర్చుకొంటి
జనకు నీదెర్చితి • నిను గడతేర్చితి, నెల్లలోకముల నీ • వేర్చునట్టి
నారాయణుని దివ్య • నామంబు ప్రణవంబు, తోఁ జేర్చి పలుకుట • దోసమగునె ?
నాఁగ నీతండ్రి స • నాతనులగు సుర, లకుఁ ద్రిమూర్తులకు నా • యకుఁడుసుమ్మ

తే॥ అతని శ్రీనామమును జపమర్థిఁ జఱపు, విప్రుఁడైన నాకంటెను • విజ్ఞుఁడగుదె ?
యొనర నీపేరు మఱిమఱి • యుచ్చరించి, నన్ను చెఱుపకుమయ్య ! నా • యన్న కాన !

తే॥ అనుచు గురుఁడు వేఁడంగఁ బ్ర • హ్లాదుఁడనియె, సకలలోక నాయకు పేరు • సన్నుతింతుఁ
గాక యొండెఱుంగను నేర్వఁ • గా నొకండు, లేదు నిక్కచ్చి పఱచిన • లేదు ఫలము.

చ॥ శ్రుతులకు నెల్లఁగాఁ దెలియు • శుద్ధ పరాత్పరుఁ డెల్లవేళ సం
గతమతి నాయెదన్నెలవు • గాఁ గొని పాయకనిల్చె వేఱు సం
స్తుతమగు వాక్యముం గలదె ? సూనృతమున్ సుకృతంబు సుస్థిర
స్థితిగల క్రొత్త వాక్యములఁ • దెల్పుము నేరిచికొందు భక్తిమై.

తే॥ శిష్టు లేదైవమును విమ • ర్శించి పలుకు, వార లుపనిషత్తులు దెల్పు • వస్తువేది ?
కర్మ ఫలములు నశియింప • ఘనులు వేని, నామమును జపియింతు రా • నందమునను

ఉ॥ వేదము లభ్యసించి క్రతు • బృందము లెన్నియొ యాచరించి సం
పాదిత తత్త్వ విజ్ఞతను • వాంఛిత సిద్ధి భజించినట్టి వి
ద్యా దయితుల్ జపించు జగ • దాశ్రయు నామము పల్కినాఁడ నీ
వాచట నేర్పినట్టి శ్రుతు • లందున వేఱొక వస్తువున్నదే ?

చ॥ వనబిల పర్వతంబులను • వాసముచేసి మృగాజినంబులన్
గొని ధరియించి యాకులను • కోరికతో భుజియించి శీర్షముం
దన మొనరించి పెక్కులు జ • డల్ ధరియించి శ్రమంబులోర్చి కై
కొను ఘనులొందు భాగ్యమును • కొంటిని వేఱొక టున్నె కోరఁగన్ ?

తే॥ భక్తులకు సేవసేయు పా • వనులు శాస్త్ర, విషయ మెఱుఁగక యున్నను • వేదసార
మైన యర్థ ద్వయంబు మే • లరసియుండ్రు, వారె కవులు తత్త్వార్థ వి • ద్వరులు నిజము.

తే॥ అపనిసుర! నాకు బ్రహ్మ రుద్రాపరులకు, నరయరాని యేకైక నా • యకుఁడు నన్ను
చేరెఁ గామిత సంసిద్ధిఁ • జెందినాఁడ; నీవు నతని భజింపు మే • లెనయఁగలవు.

చ॥ అనవిని విప్రుఁడేటి బదు • లాడఁగ లేక యెదం గలంగి నా
కును చెడు కాల మబ్బె నిఁకఁ • గుఱ్ఱఁడు బాగు పడండు తామసిం
చినఁ జెడునంచుఁ బాటి విభుఁ • జేరి యనెన్; సమయోచితంపు వ
ర్తనము మహీసురావళుల • దగ్గఱకంటెను గల్గనే భువిన్?

తే॥ ప్రభువరా! నీ సుతుండు క • ర్మద్వయంబుఁ, బ్రెంచు పలుకులు నాకు బో • ధింపసాగె
నించుకైనను వినఁడు కా • వించు బోధ, వేఱుమార్గంబు లేవని • విన్నవింప.

తే॥ మనకుఁ దగనిది క్రొత్తది • తన తెలివికిఁ, దోఁచినట్టిది వాలుఁ డే • తోయమునను
పలికెఁ దెలుపుమా యన విప్ర • వరుఁడు వడఁకి, కేలుమోడ్చి యిట్లనియె జం • కెనయలంప.

తే॥ దానవేంద్ర! నాశ్రవణ రం • ధ్రములయందు, క్రూరవిష సర్పములఁ బోలె • దూఱినట్టి
వాక్యములఁ జెప్పి నరకంబు • పడయఁజాల, నాలుకయు మొట్ట మొదటికే • వ్రీలుననియె.

తే॥ వానిఁ దోడి తెండని రాజు • భటులఁ బంప, వారు చని తోడి తేరఁగా • భక్త వరుల
జనకుఁ దగు విష్ణునామంబు • సంస్మరించి, యొడలు మఱచి కొడుకు తండ్రి • కడకువచ్చి

ఉ॥ మ్రొక్కిన సూను మూర్ధమును • మూర్కొని మేని కలాప మంటఁగా
నక్కునఁ జక్కఁ జేర్చి యొడి • యందునఁ బ్రేమడి నుంచుకొంచు నీ
వెక్కడ నేర్చితో విన స • హింపని వాక్కుల నాడితంచు నే
నక్కజమంద నీ గురు కు • లాఢ్యుఁడు పల్కె నదేదొ తెల్పుమా?.

తే॥ అనుడుఁ దనయుఁడిట్లను శ్రుత్యు • లభ్యసించు, నెడలఁ దొలుత వచించు లో • కేశు పేరు
జన్మ దుఃఖముల్ దొలఁగింపఁ • జాలు పేరు, పలికినాఁడ నంతకు మేలు • గలదె! యరయ.

తే॥ అనఁగఁ దండ్రియిట్లను, గురుఁ • డరసి యుక్త, మే వచింప నట్లుండనీ • యావు పలుకు
పేరదెయ్యది తెల్పుము • వినఁగవలతు, ననుడుఁ గొడుకు ప్రియంబున • ననియె నిట్లు.

సీ॥ వలచిన పురుషార్థ • ముల నిచ్చును త్రివర్గ, మును దాఁటఁ దోడ్పడి • ముక్తి నొసఁగు
నక్షయం బాద్యంబు • నజ హరాదులకు న, దా చింతనీయం బు • దారతమము
సత్యలోకము దాఁక • సకల లోకంబుల, స్థావర జంగమ • సమితి యందు
దెంపంబునం గల్గ • తెలివిచే ధ్యానింప, నలవియై యుండు న • ష్టాక్షరముల

తే॥ మహిమ వివరింప నరిదియౌ • మఱచువారు, నిజము జీవచ్ఛవములు వి • న్పింతుఁబూత
నామమోం నమోనారాయ • ణాయయగును, అనదృశంబైన మంత్రమి • య్యదియె తండ్రి!

మ॥ భవ వారాశిని పూర్వ కర్మమను నా • వర్తంబు నందుండి జం
తువులం దీరము చేర్చు నావ జిగి దొం • తుల్ గూర్చు మైమర్వ న

ద్భవికంబుల్ పొసఁగించు నామము ముకుం • ద్ర స్తుత్యముగా వేద శీ
ర్ష వధూ మస్తక రత్న మీ విమల మం • త్రం బన్య దుస్సాధమున్

శా॥ నీకు న్నాకు సమస్త జీవులకు గ్లా • ని న్మాన్పి భవ్యంబు ల
స్తోక ప్రాభవ మొప్ప నిచ్చునదియం • చున్ విజ్ఞులే పల్కఁ వా
రేకీభావముతోడ నంచుఁ దనయుం • డిమ్మాడ్కి భాషింప రౌ
ద్రాకారుండయి చూచి దానవకులా • ధ్యక్షుండు దట్టించుచున్.

శా॥ ఓరీ మోఱకు ! నేఁటిదాఁక నొకఁడే • నొక్కప్డు నా ముంగలన్
ధీరత్వంబునఁ బల్కలేఁడు పలుకన్ • దీంద్రించి నాయాజ్ఞ దు
ర్వార ప్రక్రియఁ గాల్చివైచుఁగద యె • వ్వారిట్లు బోధించి రె
చ్చో రూఢంబుగ నేర్చితో తెలుపుమా • శుంఠా ! వది న్నిక్కమున్.

క॥ అజహర ముని దివిజాధిపు, లజస్రము మదీయ నామ • మర్థి జపింప్రా
రజమున వారలుఁ దెలుపరు, నిజముగఁ జాఁదలఁచి యెవఁడు • నేర్పెఁ దెలుపుమా ?

క॥ కదనము సేయఁగఁ బలుమా, ఱెదిరించియు విఱిగి గరుడు • నెక్కి యుదధి వె
ల్లిదముగఁ జేరి యివల రా, కొదిఁగిన యాపంద నామ • మొసఁగునె మేల్మిన్ ?

మ॥ మన వంశంబున వారలెందఱో మహా • మాయావియౌ విష్ణు వం
చనచేఁ గూలిరి నాదు తమ్ముని జగ • జ్జాలంబులం గర్వమం
దునఁ దాల్పం దగువానిఁ బోఁద్రియఁజు యా • దుష్టుండె చంపెన్ ధరి
త్రిని సర్పంబును మూషికం బలరు భ • క్త్రిం గొల్వ మేలౌనొకో ?

చ॥ సకల చరాచరంబులకుఁ • జావును పుట్టువు గూర్చువాఁడ నే
నొకరుఁడ నెందులేఁడు మఱి • యొక్కఁడు కార్యముచేతఁగాక తోఁ
పికల నెఱుంగు చెక్కడి వి • వేకము ? నేర్పిన వాఁడెవండు ? వా
నికి మఱి నీకు జీవితము • నిక్కము దాసె నిఁకేల చెప్పఁగన్ ?

చ॥ శ్రుతిహిత కార్యముల్ సలుపు • శూరులు మేల్పడుచుండువారు; దు
ర్గతులకుఁ బోవుచుంద్రు చెడు • కార్యములే యొనరించువారు; వి
శ్రుతము జగత్స్వభావమునఁ • జెడ్డది మంచిది రాజు నాజ్ఞచే
గతులు వహించు నాది తుది • గల్గదు లోకమునందు దేనికిన్.

ఉ॥ గొప్ప తపంబుచే నమర • కోటి త్రిమూర్తులు మేల్మినొంద నే
నొప్పుగ వారికంచెఁ దప • ముత్కటరీతిగఁ జేసి మించఁగా
నిప్పుడు తాము మేల్పదవు • లెల్లను ముందటఁ గోలుపోయి నా
రప్పటినుండి వారి పను • లన్నియు మానిరి చుల్కనౌటచే.

ఉ॥ జన్నములుం దపంబులును • శత్రుల కక్షయ సౌఖ్యదంబులౌ
ట న్నెఱినెంచి వానిని క • దంక నొనర్పఁగనీక మాన్పితిన్

బన్నుగ వార లిప్పుడు త • పంబు మఖంబులు లేమి సత్త్వసం
పన్నత డింది దిక్కఱిరి • పాయక నిన్నెటు కావనేర్తురో?

తే॥ క్రించ: పితప్పు నిపుడు ప • న్నించినాఁడ. వ్యర్థవాక్కుల నింకిటు • లాడఁబోకు
గురుల వాక్కులు శ్రేయంబు • గూర్చుననుచు, నమ్మి పతియింపుమనె హిర • ణ్యకశిపుండు

తే॥ చదువులవు నెల్లఁ జేసురి • చందమగుచుఁ. గ్రతువులకు శ్రుతులకుఁగట్ట • కడపటిదగు
నెఱి యొకండు దెల్పెదను మ • న్నించి యరయు. మనుచుఁ దెలుపంగఁదొడఁగెఁ
ప్ర • హ్లాదుఁడిట్లు.

తే॥ విత్తులేక వృక్షము పుట్టి • వెలయఁబోదు, భ్రాంతి గొలుపు నజ్ఞానంబు • వదలి సత్య
మెఱుఁగఁ దలఁచినఁ దెల్పెద • హెచ్చరికను, తెలియుమా దీనిఁగరతలా • మలకముగను.

మ॥ తనలోనుండి సమస్తలోకముల ను • ద్యల్లీల సృష్టించి యం
దున వెవ్వేఱుగఁ బెక్కురూపముల జం • తుశ్రేణియై వానిలో
నన తైలంబును నువ్వులంబలెనె యు • న్నాఁడైన భేదంబులం
గొనఁ డా యాద్యుని తొంటియున్కి తరమే • గుర్తించి వాక్రువ్వఁగన్?

తే॥ వస్తుతత్త్వంబు విభజించి • పలుకు సాంఖ్య, యోగములు రెండు త్రోవలా • యునికి
పూర్తి
గా నెఱింగిన వారికిఁ • గాక యాది, పురుషు నుచ్చస్థితి నెఱుంగఁ • దరమె? తండ్రి!

సీ॥ వేదాంత శాస్త్రముల్ • విజ్ఞానమయుఁడని, తనరఁ దెల్పెడు పర • తత్త్వ మతఁడు
తమ్ము దామెఱిఁగిన • తద్జ్ఞు లీయర్థంబు, నెఱుఁగుదు రజ్ఞాను • లెఱుఁగ లేరు
తెలియని వారు ము • క్తిని కాంచలేరు ప్ర, త్యక్షాది సుప్రమా • ణాదులఁ గొని
కొలువంగ రాని యా • కూటస్థుఁడగువాని, మాయ నెఱుంగ నె • మ్మాడ్కిఁగాదు

తే॥ త్రిగుణరూపుండు త్రిజగ దా • కృతి చరాచ, రాది రూపుఁ దేకాకృతి • నందియుండి
భిన్నరీతులఁ దోఁచు న • వ్విభుఁ డనుగ్ర, హించు కర్మముల్ చులుకన • నెఱుఁగనగునె?

క॥ క్రియలును ఫలములు ఫలదా, తయుఁ గర్తయు భోక్తయైన • తత్త్వంబును ని
శ్చయముగ నెఱిఁగిన చతురులె, నియతిన్ భవ జలధి దాఁట నేర్తురు తండ్రీ!

క॥ తపములు మంత్రములు జపము, తపఃఫలము కుడుపు నగుచు • ద్రష్టయు దృగ్దృ
శ్య పరిజ్ఞానంబులు నగు, నపరుని మాయాబలంబు • నగునె తెలియన్?

మ॥ తొలి కర్మంబులకున్ ఫలానుభవముల్ • తొల్తం బ్రసాదించు న
వ్వలి కర్మంబులకున్ ఫలంబు నవలన్ • బ్రాపింపఁగా జేయుఁ ద
త్ఫలముల్ ముందులు వెన్కలై వెడ తడం • బాటొందుటల్ తప్పియుం
దొలఁగం బాఱుట లేదు చిత్రముగ నొం • దుం గర్మ సంబంధముల్.

తే॥ పాప పుణ్య కర్మంబుల • ఫలములెల్లఁ, బరిమితంబులు పరమేశు • భక్తితోడఁ
దలఁచు ఫలములు కొలఁతలే • కలరుచుండు, నింతకంటెను మేలేది • యెఱుఁగఁ గలదు?

ఆ॥ యాగములను తుదిని • యోగేశ్వరునకొంక. వేల్మి వేల్చుచుండ్రు • విజ్ఞులెల్ల
నది చరాచరంబు • లందు చేరుననుచు, శ్రుతులు దెలుపు ఫలము • సూటి యదియ.

సీ॥ ఆ పరబ్రహ్మమే • యానంద లీలకై, మూల ప్రకృతినుండి • మొట్టమొదటఁ
గార్య రూపంబైన • చర్యా ప్రపంచంబు, సృష్టి గావించె వి • చిత్రరీతి
శాస్త్రంబులందు చ • ర్చా ప్రసంగంబులౌ, నర్థంబులన్నియు • నాద్యమైన
ప్రకృతి యొసంగిన • వికృతులచేనైన, భేదంబులే కాని • వేఱు కావు

తే॥ బ్రహ్మ మొదలగు నీ జీవ • రాసులెల్ల, బంధురంబైన తన్నాభి • పంకజమున
నతిశయంబైన బీజంబు • నందయొక్క, భాగముననుండుఁ బూర్తియా • బ్రహ్మకనెనె॰

చ॥ అసదృశుఁ డప్రమేయుఁ డజుఁ • డాద్యుఁడు మేరయె లేనివాఁడు ని
ర్వ్యసనుఁడు కన్నులం గలఁడు • పర్విన చూపులనుండు విజ్ఞ మా
నసముల నిండియుండు గగ • నంబున భూమిని సర్వభూత హృ
ద్వసతులలోన బాహ్యమున • భాసిలు సర్వ జగత్ప్రపూర్ణుఁడై.

క॥ తలఁపునఁ బలుకులఁ జేఁతల, గలఁ డింద్రియములను గలఁడు • గలఁ డోంకారో
చ్చలిత స్వర సంధులలోఁ, గలఁడు త్రికాలములఁ గలఁడు • కలఁ డసురేంద్రా!

క॥ అరిషడ్వర్గము భక్తుల, దరిఁజేరఁగనీక కాచి • దరిఁజేర్చెడు స
త్కరుణానిధి నామమె త, త్పరులకు భవ జలధి దాఁటఁ • దరణి మహాత్మా!

క॥ వటబీజ న్యాయంబున, విటతాటములేని మహిమ • వెలసిన హరి యు
త్కటకాలము స్థానమ్మును, పటు సాధన శీలములును • ఫలమును తండ్రీ!

క॥ వీణియ సుస్వరముం బలె, నాణియమగు శీల మదరు • నారాయణు వి
న్నాణంపు మహిమ సర్వాం, గీణంబగు నంటకుండుఁ • గించి త్తైనన్.

సీ॥ ఏకాక్షరంబయి • యెసఁగు నోంకారంబు, నందావ్యకారమై • ప్రాణమైన
యక్ష రార్థంబగు • నాదిదేవుఁడు జ్ఞాన, మునకు జ్ఞానంబుగా • నొసరువాఁడు
నిఖిల లోకములందు • నింపారియుంటచేఁ, బొగయు నిప్పునుపోలె • నెగడువాఁడు
నవ్యమాలా సుమ • సన్నులఁ బోలిన, వివిధ మతములందు • వివిధగతులఁ

తే॥ దరిచి వాదించువారలు • పసరుకతనఁ, గలుగు పలుభేదములు గాక • గలదె యతని
కిన్ని భేదంబు లిం తేల • యెంచిచూడ, కడలి కలలకు భిన్నత • గలదె? తండ్రి!

తే॥ ఇట్టి యసమాన విభవు నీ • వెల్లిదంబు, చేసి సంపదాయువులను • క్షీణపఱచి
కొందుపే యని చ్చింతింతుఁ • గొదవలేక, వినుతి చేసి ధన్యుఁడనైతి • నని పచింప.

తండ్రి ప్రహ్లాదు వివిధోపాయములఁ శిక్షించుట.

మ॥ విని దైతేయ కులేంద్రుఁ డుగ్రుఁడయి ని • ర్భీకన్ వివాదించు పు
త్త్రుని ధాత్రీస్థలి ద్రొబ్బి నేత్రముల ఖ • ద్యోతంబు లుప్పొంగఁ జూ

చిన భూగోళము కంపిలెన్ గ్రహములుం • జీకాకులయ్యెన్ గిరుల్
వణఁకెన్ సప్తాబ్ధి లేచియుండె సభయుం • బంకించె బ్రహ్మాండమున్.

ఉ॥ ఇంతటనుంచి నాకుఁ బగ • యేదియులేదు శరీరమందె దు
ర్దాంత రుజా ప్రరోహము వి • ధంబునఁ బుట్టె నెఱుంగనేల యీ
భ్రాంతుని చిత్తవృత్తి? హరి • భక్తుఁడనంచు వచించువాఁడు ని
శ్చింతముగాఁ బెగం బొడిచి • చీల్పుఁడు త్రుంపుఁడు చంపుఁ డుద్ధతిన్.

చ॥ అని దనుజేంద్రుఁ డాడ హృద • యంబున నక్కుటిలంబు నంతయుం
గనియని రక్కసుల్ ప్రభుని • చిన్నికుమారు మృగేంద్రు లేన్గు గు
న్నను గొనిపోవు రీతి జత • నంబున వాకిటి కీడ్చి తెచ్చి యొ
క్కసువున వాఁడి కత్తులు గ • దాపళి వీచిరి పిచ్చలించుచున్.

తే॥ సదయుఁ బ్రహ్లాదు నదియులు • సరగఁ బుట్టి, వైచు కైదువుల్ జగదీశ • భక్తవరుని
శాత్రవులు తిట్టు తిట్టుల • చందమగుచు, నిష్ఫలంబు లయ్యెను రజ • నీచరేంద్ర!

ఉ॥ కాలిచివైచి ప్రస్కడి • కండలుగాఁ దెగనేసి రెండుగాఁ
జీలిచి త్రోచు కైదువులు • చేద్పడి ఛేదిలి నుగ్గునూచమై
బాలునిపై నిపై బురద • పాపిన కోపున నొప్పె నాతఁడున్
దీలక సోలిపోక హరి • దివ్య పదంబుల నిల్పె నాత్మలో.

ఉ॥ అంతట దానవుల్ చని సు • రారికి నంతయు విన్నవించి యా
వంతయు నొవ్వఁ డాయుధము • లన్నియుఁ జూర్ణములయ్యె నన్న బ
ల్వింతగ నాలకించి పడ • వేయుఁడు నిప్పులగుంటలో ననన్
గంతులు వైచుచుం జనిరి • కట్టిఁడి దైత్యులు సంతసంబునన్.

తే॥ పెద్దగుంటలోఁ గట్టెలు • పేర్చి చమురు, పోసి నిప్పు రగిల్చి యా • బుడుత డాసి
పట్టి త్రోసిరా మంట శ్రీ • వరుని కరుణఁ, జందనము చందమునఁ జాలఁ • జల్లనయ్యె.

ఉ॥ సోఁకులు తైల వస్త్రములు • చుట్టి రగుల్ప మరుత్తనూజు పెం
దోఁకకు మైథిలేంద్ర సుత • దుర్దమ తీక్ష్ణ సతీత్వ వహ్నిచే
నాఁకయి వేఁడి చల్లనయి • నట్టులు రక్కసి మూఁక రౌల్చు నా
భీకర వహ్ని బాలునకుఁ • బేరిన మంచును బోలె నయ్యెడన్.

ఆ॥ అవల వారలేగి • యసురేంద్రునకుఁ దెల్పఁ, మండిపడుచు జగము • మాడ్చు విసము
గలుగు నహులఁదెచ్చి • కఱపింపుఁడని యాజ్ఞ, యిడఁగ దనుజ భటులు • వడిగఁ జనిరి

తే॥ అష్టనాగంబు లసురేంద్రు • నాజ్ఞవచ్చి, విసము లుమియుచు హరిభక్తు • వీరు మేనఁ
గోఱలూనంగఁ గఱచెఁ గు • మార వరుఁడు, మదిని వెన్నుని సన్నుతి • మానఁడయ్యె.

ఉ॥ దగ్గఱ నున్నవారలు వ • డంకుచు నెత్తురు గ్రక్కు సాంద్రమై
మ్రొగ్గిన నీరదంబునను • క్రొమ్మిల చొచ్చినలీల మేనిలో

నిగ్గడి కోఱలూనికను • సీఁగి పదింబదితుండులై ధరన్
మ్రగ్గెను వానిలో విసము • మా అమృతంబు స్రవించె వింతగన్.

తే॥ దనుజు లావింత తమ ప్రభు • వునకుఁ దెలుప, రాక్షసేంద్రుండు కనలియై • రావతంబుఁ
దెచ్చి త్రొక్కింపుఁ డన వారు • త్రిదశరాజు, నడుగ నాతండు భయమున నట్టె • యొసఁగె.

తే॥ కాలు సేతుల తొమ్ముననఁ గంఠమందు, నిటియఁ బాశంబులం గట్టి • యేన్గు నెదుట
దొరలఁజేయఁ బ్రహ్లాదుండు • దొడ్డబుద్ధి, నిట్లు వాక్రుచ్చెఁ జౌదంతి • నెసఁగఁ గాంచి.

క॥ భుజగకులాధిపశయనుఁడు, భుజగారిధ్వజుఁడు భుజగ • భూషనుతుఁడు మీ
గజరాజుఁ గాచినాతఁడు, త్రిజగద్వంద్యుండు నామ • దిం గలఁ డన్నన్

క॥ దంతి తలవ్రాల్చి యాగుణ, వంతునకున్ మ్రొక్కి మరలెఁ • బ్రభు భటు లావృ
త్తాంతముఁ దెలుపఁగ మండుచు, నంతకువలెఁ గనలి దాని • నడుపుం దనియెన్.

క॥ రక్కసులు చంప డాయుదు, నక్కరి ప్రహ్లాదు నురము • నంటఁగఁ బొడిచెన్
మిక్కిలి యనంటి బోదెల, ముక్కలవలె విఱిగె మేన • ముట్టిన దంష్ట్రల్.

క॥ దనుజులు వడివడిఁ జని జరి, గిన వార్తం దెలుప వేసఁ • గిని మండెడు సూ
ర్యుని పోలె మండి జనకుఁడు, తనయుని వనరాశిఁ ద్రోవ • దైత్యులఁ బంపెన్.

ఉ॥ ఈ దనుజేంద్రుఁ డెట్లయిన • నీతని చంపక మానఁడంచుఁ బ్ర
హ్లాదుని పట్టి యొండొక య • హార్యముతో జతగట్టి యగ్గభీ
రోదధి మధ్యమందు నుగు • బోత్తరుఁ ద్రోచిరి భక్తవర్యుఁ డా
శ్రీదుని పాద పద్మముల • చింతన సేయుచు నుండె నిచ్చలున్.

క॥ జడధి యొక మడువువలె నే, ర్పడ గిరి కలమగుచుఁ దుంబి • ఫలముపగిది నా
బుడుతను తేల్పఁగ నాతఁడు, కదలిని వటపత్రశాయి • కరణిని వెలసెన్.

మ॥ కరుణావారిధి! యప్రమేయ మహిమా • గంభీర! లోకేశ్వరా!
దరహంకారినొ? దుష్ట మానసుఁడనో? దుర్వంశ జాతుంపనో?
యరయం జాలవొ? భారమో? తగఁ బరీ • క్షార్హుండనో? మాధవా!
వరదా! దీనశరణ్య! యన్య మెఱుఁగ • భక్తావనా? ప్రోవవే.

క॥ వంచకుల వంచకుండవు, చంచలమతినైన నన్ను • సంశోధింపన్
బ్రాంచ త్పద్ధతి యగునే, పంచముఖాదులకు నెఱుఁగఁ • బడవు మహేశా!

మ॥ పరమేశ న్నిను పొందఁగాఁ దగు మహో • పాయంబె విజ్ఞాన మం
చరయం గల్గిన తత్త్వవేత్తలును ని • న్నందంగ లేకుండి బ
మ్మెరకున్ లోఁగిరి నేస పాపిని మదా • త్మయుండ దైతేయుఁడన్
శరణం బంటిని దీనవత్సలత నీ • స్వమ్మయ్యె మన్నింపవే!

క॥ స్థిరుఁడను నేనితంపము లం, స్థిరము లహం బ్రహ్మమని వ • చింతురు పలుకం
జొరవయగుఁ గాని పలికిన. కరణి జరగునే ప్రపంచ • కర్మము లెల్లన్?

మ॥ జగదాద్యంబగు వస్తు వున్నదనుచుం • జర్చింప లేదంచు రెం
డగు రీతుల్ పచియింపుచున్ శ్రుతులు భి • న్నార్థంబులై యొప్పు భూ
రి గుహాంతస్థము ధర్మ తత్త్వ మది గు • ర్తింపంగ దుస్సాధ మి
ట్లగునే నీదు నిగూఢ పద్ధతిని మా • యా నాటకం బాడఁగన్?

మ॥ తెలియన్నేరని నన్ను బోఁటులు విధా • తృండంచు రుద్రుండుగాఁ
బలుకం జెల్లునె? కాయలాకులు పువుల్ • పండ్లుం గొమల్ బీజమం
దలి వైసట్టులు సర్వ దేవతలు నీ • తత్త్వంబునం దోఁచు వా
రలు నీ వాదిమ బీజమై వెలయు దీ • రాద్ధాంతమే నిక్కమౌ

క॥ వెలువడి నీనుండి జగము, పలుభేదము లొందిసంతఁ • బరఁగునె వేఱై?
పలు భూషలు పలు పేరులు, గలవైనను కనకమగును • గాకేమి యగున్?

క॥ తలిదండ్రులక్రియఁ బ్రేమను, కలిగించితి వీవు వెలయఁ • గల హృదయంబే
కలవాఁడను భవ దుఃఖం, బుల నొసఁగిన నీవ తీర్పఁ • బోలుదు తండ్రీ!

క॥ అని వినుతించుచు నుండిన, తనయుని స్థితియెఱిఁగి దనుజ • దయితుఁడు వానిం
గొని తెమ్మని హాలాహల, మును పోలిన విసము నొసఁగె • మున్నుగఁ ద్రావన్.

క॥ విషధర యనుని భక్తుఁడు, విషముం గొని త్రావె భవుని • విధమున నది ని
ర్విషమై సుధ యయ్యెను ని, ర్విషయునకున్ విషము ఫలము • వృథ గాకున్నే?

క॥ రక్కసులు గవల మోఁదఁగ, నుక్కఱఁడును కందికుందఁ • డుల్లంబునఁ దా
నొక్కొక్క ముకుంద నామము, చెక్కు చెదరకుండ నిలిచి • చింతన చేయున్.

ఆ॥ సాటిలేని మాయఁ • జావకుండెడు నుపా, యమ్ము నైజముగనె • యమరినాఁడు
వీని నేన చంపి • విశ్వంబులో నప, ఖ్యాతిఁ దొలతునంచు • నతని డాసి.

మ॥ అసురేంద్రుం డదలింపఁ దండ్రికి సుతుం • డత్యర్థిమై మ్రొక్కి నా
యసువుల్ నీయవికావె? యైనను జగ • ద్వ్యాప్తుండు నారాయణుం
డెసకంబారఁ దలంచినన్ జరగు గా • కిల్లెన్ని చందాల నీ
రసచేఁ బూనిన నొనాకో భువన సం • త్రాణుండు తా నుండఁగన్?

శా॥ చూపం జూడఁ దలంపుఁగొన్న దనుజే • శుం డంత మూఢాత్మకా!
నా పేరే జపియించుచుం బ్రదుకుచు • న్నారైన ముమ్మూర్తులో?
ప్రోపుం గోల్పడినట్టి వేలుపులొ? యా • భోగీంద్రుఁడో • మోనులో?
యేపాటిం గలవారొ? తెల్పు జగముల్ • సృష్టించు నానేర్పరుల్?

సీ॥ అనిన తండ్రికిఁ బుత్త్రుఁ • డను లోకములనెల్ల, సృష్టించినాఁడు లె • క్కిడఁగరాని
ప్రాణులఁ గల్పించి • వాని యన్నిటిలోనఁ, బూవులఁ దావి నూ • వులను నూనె

పోఁడిమి నిండి యు • న్నాఁడు మానాయకుఁ, డతఁడు నాకనులకు నరయఁదగిన
కరణి నెల్లెడలను • కానవచ్చెడువాఁడు, చూడుమా చూచెదు • చొప్పుదెలుప
తే॥ నమ్మకున్నావు నిజము నీ • తమ్ముఁడు, జీవములఁ గొన్న యాహరి • నీవుచూడ
దగినయంత చుల్కనయయి • తనరువాఁడె!, సర్వ జీవాంతరాత్మయౌ • సత్యమూర్తి.

ఉ॥ మూఁడు గుణంబు లాతనివె • మూఁడు పనుల్ మఱిమూఁడు మూర్తులున్
మూఁడగు నేత్రముల్ స్థితులు • మూఁడను మూఁడు జగాలు వానివే
మూఁడగు కాలముల్ దెలియు • ముఖ్యుఁ డతండె సమస్తసాక్షియౌ
ప్రోడ యతండె సత్యమిది • ముమ్మఱు సత్య మనంగ నాతఁడున్.

మ॥ వినరా మూర్ఖ! సమస్త లోకముల పై • వ్వైతైన వస్తు వ్రజం
బున నొక్కండె కలం డటంచు మిగులన్ • మూర్ఖించుచున్నావు నీ
వను మాటల్ నిజమైన దొంగయగు నా • యబ్జాక్షు నీ కంబ మం
దునఁ జూపింపుము పిమ్మటన్ దగిన యు • ద్యోగంబు గావింతమున్.

సీ॥ అనుచు జగన్నాథుఁ • డణువున నున్నవాఁ, డణు శతాంశంబున • నణఁగినాఁడు
మేరువం దున్నాఁడు • మింట నున్నాఁడు నీ, వాక్యానఁ గలఁడు స్తం • భమునఁ గలఁడు
చూడంగ వల తేని • చూచెదుగాకని, ప్రహ్లాదుఁ డనఁగఁ గ్రూ • వ్యాదనాథుఁ
డోరి! నీయనుకూలు • నొప్పుగ నీస్తంభ, మందు చూపుము చూప • కుందువేని
తే॥ కరి శిరంబును హరి చీల్చు • కరణి మెఱసి. నిన్ను నీఖడ్గమునఁ • జీల్చి నెత్తురాని
మ్రింగి పై చెదనని పెను • మేఘమట్లు, గర్జనము చేసెఁ దర్జన • భర్జనముల.

మ॥ జనకా! నాయుసుఱంత చుల్కనగునే • సర్వేశ్వరుం డీవు కో
రిన యాతావులనెల్లఁ గానఁబడఁ కా • ర్వేరంబునం డాఁగి యుం
డెనయేనిన్ బ్రదుకంగనొల్లఁ దనువు • న్నే నే విసర్జించెదన్
దన దాసుండను కానటంచుఁ దుదిఁ బం • తంబాడఁ బ్రహ్లాదుఁడున్.

## నృసింహమూర్త్యావిర్భావము

తే॥ అసురనాథుండు మేలు మే • లనుచు నవ్వి. హస్తమున నొక్కకంబంబు • నంటఁజఱచెఁ
బెలువ దిక్కులు గోళముల్ • బీఁటలెగయ, సింహగర్జన మందుండి • చెలఁ గెనపుడు.

మ॥ అరవిందాసన శంకరాదులును ది • వ్యాబ్దంబు లెన్నేనియున్
స్థిరభక్తిం దపమాచరించియును వీ • క్షింపంగ లేనట్టి శ్రీ
హరి నవ్వున్ విని యుబ్బి గంతులిడి ప్ర • హ్లాదుండు కేల్మోడ్చి త
త్పరుఁడై పాడెను వేఁడె నేడిచె గగు • ర్పాటొందెఁ జొక్కెన్ స్నగెన్.

చ॥ పటపట పండ్లు గీఁటి సుర • వైరి యదల్చుచు నవ్వినట్టి నీ
విట నెట డాఁగినాఁడపుర • యూతఁడు పల్కిన కేశవుండవా?

కిటివయి తమ్ముఁ జంపితివి • కీడ్పడి జంకి పయోధి దాఁగి తి
ప్పటికి పగందవైన వెలి • వాయుము రమ్మని కాలుద్రవ్వఁగన్.

శా॥ స్తంభం బప్పుడు పెన్నినం బగిలె ది • గ్జాలంబు లూటాడ సం
రంభుండై హరి వెల్వడె న్మనుజ హ • ర్యాకారకృతిన్ వాని పా
దాంభోజంబులు భూమినుండఁ బయి లో • కాలిఁ వెసం దాఁటి యా
యంభోజాసనుఁ డప్డె పుట్టిన విధం • బందెం దదీయస్థితుల్

ఉ॥ లెక్కయిడంగ రాక పొద • లెన్ శిరముల్ కరముల్ సురారి కొ
క్కొక్కని కొక్క మోము కర • యుగ్మము కన్నులు మూఁడు వారిథుల్
గ్రుక్కగొనంగఁజాలు పెను • ఘోర ముఖంబులు గల్గి యెల్లరన్
జిక్కఁగఁబట్టి నొక్కుచును • జిందరవందర చేసె నుగ్రతన్.

తే॥ విలయ కాల వహ్నిని మించి • వెలిఁగెఁజాలు. విలయవాయువులను మించి • వెల సెనూర్పు
అవ్వి రెండు నృసింహుని • యందనిలిచెఁ, గాని చిత్రము జగములఁ • గాల్పలేదు.

చ॥ పొదిఁగి ప్రదిల్చి పిల్లలను • పోషణ చేసెడు తల్లి కోడి యా
పద తఱి ఱెక్కలం దడఁచి • పట్టుగఁ గాచెడు లీల నందముల్
కుదురుగ లోనఁదాల్చి వెలి • గూర్చ వసించెడు జీవులెల్ల న
య్యదన నృసింహ నాస్యమున • యంద యడంగె భయంబు డిందఁగన్.

చ॥ నలువను దొట్టి వచ్చిన స • నాతన ధర్మపథంబు నుంతయున్
వలవని దుష్ట రాక్షసుల • వారలఁ జేరిన వారిఁ గూల్చి సా
ధుల నుదరంబునంద యిడి • దొడ్డ కృపామతిఁ గాచె; సజ్జనుల్
తొలుత సిలుంగు లొందఁ దుదిఁ • దూకొని సౌఖ్యము గాంతురే కదా।

సీ॥ దంష్ట్రిలఁ జీల్చి కొం • దఱఁ జంపెఁ గొందఱ, నండ కటాహంబు • నంటవైచె
ధరణిని రాచెఁ గొం • దఱఁ గొందఱను మేరు, గిరికిఁ దాఁకఁగఁ బట్టి • తిరుగవైచెఁ
గొందఱ జలరాశి • యందు పాఱఁగవైచెఁ, గొందఱ బడబాగ్నిఁ • గూల్చి కాల్చెఁ
జూఱుచుఁ జూచికొం • దఱ త్రుళ్ళడంచెఁగొం, దఱ హుంకృతిని తూలి • తెరలనడఁచె

తే॥ రెండు గాఁజీల్చె శిరములు • చెండెఁజర్మ, మొలిచెనలఁచెఁ బ్రేవులఁజుట్టి • మెలియనూడ్చె
కన్నుగ్రుడ్లను పెఱికెను • కాళ్ళ నఱకెఁ, జెలఁగి లయరుద్రుభంగి నృ • సింహమూర్తి.

తే॥ దంతి రథ వాజి భటుల ను • ద్ధతిని మ్రింగుఁ, దోయధిఁ జలంబు చేఁపల • తోడఁద్రావు
మేఘములఁ బిడుగులతోడ • మ్రింగివైచు, ధర్మదేవతయును చాల • దద్దఱిల్ల

తే॥ కొందఱనుకులగిరులపైఁ • గూలమోఁదుఁ, గొందఱనుచక్రవాళాద్రిఁ • గూలమోఁదుఁ
గొందఱను గోళకుద్వయంబు • గూలమోఁదు, గొందఱదిగంతములుదాఁటి • కూలమోఁదు

తే॥ శిరములం గిల్లి కొందఱ • దొరలఁద్రోచు, నిప్పు పుట్టంగఁ గొందఱ • నేలరాచు
జలము పింగి కెగురఁబట్టి • జలధివైచుఁ, దోఁచినట్టి తెఱంగులఁ • దూల వీచు.

తే॥ జగములను మూఁట నసురుల • మిగులనీక, కడఁకఁ జంపి దైత్యాంగనా • గర్భములను
నాశ మొనరించి యట వారి • నలుసులేమి, బయటి యండంబులకుఁ గేలు • పరఁగఁ జాఁచె.

క॥ నరసింగఁడు ప్రహ్లాదుని, హిరణ్యకశిపువును దక్క • నెల్లరఁ దునుమన్
గురుకోపంబున రాక్షస, వరుఁ డుఱుముచు నతనిఁ గాంచి • వారని కడిమిన్.

తే॥ వజ్ర ఖడ్గంబు నొఱనుండి పఱల దూసి, డాకరంబున దొడ్డ ఖే • టకముఁ దాల్చి
యమరు లులుక సంభ్రమంబులు • నద్రులదర, నార్చి పేర్చి యొడుగఱచి • యతనిడాసె.

మ॥ అమరస్తుత్య యశోభిరాముఁ డగు ప్ర • హ్లాదుండు తండ్రీ! జగ
ద్భ్రమణుం గాంచియు నించుకంత హితముం • దర్కింప వేమయ్య? దెం
దమునం దప్పులఁ ద్రోచి కాచు భువనా • ధ్యక్షున్ రమానాథు మ్రొ
క్కుము మేలొందెదు పాప జాలము తొలం • గుఁ జెమ్మనన్ రౌద్రుఁడై

ఉ॥ పిల్లను గ్రుడ్డు గేలి గొను • వీఁక వచించెదు చిత్రమైన యీ
కల్ల మెకంబు చేతులను • కాళ్ళను ద్రుంచి వధించి యంత నిన్
ద్రెళ్ళఁగ జంపి యవ్వలనె • తీవ్ర శరాసిని వ్రాల్తు నాయెడన్
మెల్లన వ్రాలుటల్ గలదె • మెల్తుక లల్క వహించి నప్పుడుఁ.

సీ॥ అని కాలు సేతుల • నడిదంబున న్నోటఁ, బొగలు నిప్పులు గ్రక్క • నెగడి డాయ
దనుజమాయలఁ దల • దన్నెడి మాయల, యందు నేర్పరియౌ ము • కుందుఁ డంత
గజకుల కరిది ల • క్షణములు గల కాలు, సేతులతో వానిఁ • జేర్చిపట్టె
బెడిదుఁడై నిర్భీతిఁ • బెనుపారిన హిరణ్య, కశిపుండు మేరు న • గంబుఁ బోల

తే॥ ఖర నఖరముల తోడ భీ • కర విరావ, గర్జతో నృసింహుఁడు పాల • కడలి పొంగి
బ్రహ్మలోకంబు దాఁకంగఁ • బరవు పగిది, నొప్పి మేరువు ముంచిన • చొప్పుదాల్చె.

మ॥ భుజముల్ ఖడ్గములుం గిరీటమును సం • శోభిల్లి పైనున్న తో
యజ గర్భాండ కటాహ కుడ్య మొరయన్ • వ్యాపించి జ్యోతిర్గ్రహ
వ్రజముల్ మేరువుఁ జుట్టు చందమున దీ • ప్యద్రత్న భూషాలి యా
రజమై రాజిల దానవేంద్ర చరణా • గ్రం బెత్తి త్రిప్పెన్ వడిన్.

తే॥ వ్రేలఁచుండిన పోఁగులు • రెండు చెదరి, పడినవై యిప్పు డుదయాస్త • పర్వతములు
గాఁగ వెలసెనందలి పద్మ • రాగ కాంతి, యేకదా సాంధ్యరాగమై • యెసఁగుచుండు.

ఆ॥ ఉగ్రమూర్తియైన • వ్యగ్రు నృసింహు క, రాగ్ర ఖర నఖరము • లానినంతఁ
గర్బురేంద్రు వజ్ర • కఠిన వక్షమునుండి, నల్ల బయలు వెడలె • వెల్లిగాఁగ.

శా॥ మాయమేయ జగన్నియామకుఁడు దు • ర్మానిన్ నిలింపద్విషున్
సాయంకాలమునన్ దదీయ నగరిన్ • రత్నప్రభా దేహళిన్
మాయింపం దొడపైనఁ జేర్చికొని సే • మంబుల్ జగంబొంద దై
తేయ శ్రీ కిరవైన వక్షము సము • ద్భేదించి చంపెన్ వెసన్.

తే॥ కనఁగ రాక డాఁగిన మూఁడు • నెనిమిదియును, వేయి కన్నులు గలవారు • వెండి దిక్ప
తులును ఋషులును గుంపులై • కలిసి వచ్చి, చేరి రేవంటితోఁ జూచు • వారమనుచు.

తే॥ కాంచఁ గాంచఁగ నెక్కెడఁ • గానవచ్చు, కాలుసేతులు మోములు • గాఁగ నిండి
మనసుచే వాక్కుచే జ్ఞాన • మహిమచేతఁ, గడ యెఱుఁగలేని రూపంబు • కనిరి జడిసి.

తే॥ పండ్లు సందులే దిక్కులు • పట్టపట్టి, సనఁగఁదగు మొగములు కోటు • లగుచు వెలయు
నారసింహ రూపము గను • లారఁగాంచి, బ్రహ్మ తత్కీర్తి నీరీతిఁ • బ్రస్తుతించె.

తే॥ నిన్ను సృష్టించు కొనువాఁడు • నీవ యనెదు, సత్య మీరూపమున నిద్ధ • స్పష్టమయ్యె
నిట్టులైనచో బ్రాణుల • సృష్టిసేయ, నన్ను పుట్టించు టేటికో? • నారసింహ!

తే॥ బుద్బుదంబుల కరణి నీ • భువన వితతి, ప్రబలు నీయంద యల్లరూ • పములు నీవ
యిట్టి రూపంబు నొకదాని • నీవు పూన, నాది మధ్యాంత రహితత్వ • మమరు టెట్లు?

తే॥ పరఁగి యేకమై నామ రూ • పములు పెక్కు, లందుదువు నీవతొలి హేతు • వగుచునుండ
నెవరి సృజియింతు? కాచెద • వెవరి? నేరి, సంహరింతువు? తెలియంగఁ • జాలనయ్య!

శా॥ నీవే నన్ను సృజించినాఁడవు తొలిన్ • నిన్నుండి నీ సత్కృపా
భావం బబ్బుటచే జగంబుల సృజిం • పన్ గల్గినాఁడన్ జగం
బీవే కర్తవు నీవె భర్తవును నీ • వే హేమ మీవౌదు వం
దావిర్భావము నొందు భూషణము నే • నౌదుఁగా జగన్నాయకా!

క॥ అని వినుతించుచు బ్రహ్మయుఁ, బినాకియును దిక్పతులును • వేల్పులు మునులున్
వినతులయి కేలు మోడ్పఁగ, వనజాక్షుం డుగ్ర కోప • వర్తన మానెన్

తే॥ జగము లెల్లను నేఁడె నా • శంబు నొందు, ననుచు వడఁకెడు దివ్యులఁ • గని ప్రసన్న
మూర్తియై నరసింహుఁడు • పూర్ణ కరుణ, తనర హస్తమం దభయ ము • ద్రను వహించె.

సీ॥ అండజంబులకు నెల్ల • నాభరణంబు న, మస్త జీవులకు సం • పదయుఁ దోడు
నీడయుఁ గారుణ్య • నిలయ లోకజనని, యమృతంబు తోఁబుట్టు • వమృత హస్త
పద్మాలయను హరి • పత్నిఁ జనుమని, ప్రార్థించి వేల్పులు • పంప నృహరి
తావి గుబాళించు • తలిరుపంటెది యగు, కనులను నెనరున • గారవించె

తే॥ మునులు వేల్పు లంతట • మూఁగి వేఁడ, వారిఁ గరుణించి ప్రహ్లాదుఁ • జేరఁజీరి
వాఁడుకొని వత్స! నీభక్తి • మేర మీరె, దీనికిం బ్రతికృతి యెద్ది • తెలుపుమయ్య!

సీ॥ నీ యెట్ట యెదుటనే • నీతండ్రిఁ జంపఁగా, నిశ్చలబుద్ధితో • నిలిచితయ్య!
ప్రాణముల్ వెడలు కై • వడి నొడల్ చీల్పఁగా, దుఃఖమింతయు లోనఁ • దొడరవయ్య!
సేకంబులను వారి • నీఱుగాఁ జేయఁగా, నొక్కింత యారాట • మొందవయ్య!
నీ వంశమునఁ బుట్టు • నిర్జర వైరులు, దుష్టులైనను వారిఁ • ద్రుంపనయ్య!

తే॥ నీవు సాత్త్వక వరుఁడవై • నెగడుకతన, వలయు మేలేదియో తెల్ప • వలతునయ్య!
దాంతిమై భవ జలధిని • దాఁటితయ్య! యనుచుఁ బ్రేమతోఁ బలుకఁ బ్ర • హ్లాదుఁ డంత.

శా॥ ఓ కారుణ్యపయోధి! నీకరుణ నె • న్నో మేళ్ళు నేనొందితిన్
లోకంబందునఁ బొందఁగాఁ దగిన మే • లుం గల్గునే యొండు? నా
కే కష్ట ప్రభవంబు నిచ్చిన సరే • యింపారు నీభక్తి య
స్తోకంబై విలసిల్లనిమ్ము మది సం • తోషింతు మానాయకా.

సీ॥ అంజలి ఘటియించి • యట్లు వేఁడిన దైత్య. తనయుని గని హరి • తనిసి యనియె
పంచభూతములు న • శించిన సర్వదా, స్థిరుఁడవై నావలెఁ • జెలఁగుచుండు
భక్తవరులు నన్ను • ప్రార్థించి పడసెడు, ఫలము నిన్నర్థించి • పడయఁ గలరు
లోకత్రయము నీకు • లోఁబడియుండు నా, భక్తులెల్లరును నీ • భక్తులగుదు

తే॥ రసురులకె కాదు సురలకు • నధిపుఁ డగుదు, వితర దుర్లభ మిది చుమ్ము • శ్రుతుల ధర్మ
సత్యములు కరుణయు శీల • సమితి సుఖము, నిన్ను సేవించుచుండఁగా • నెగడఁగలవు.

॥ అని వర మొసఁగుచుఁ బ్రహ్లాదున • కభిషేకంబు సేయఁ • దోడ్తోఁ బనులం
బొనరింపుఁ డనుచు వేల్పుల, కనుమతి యిడె నెల్లవార • లానందింపన్.

చ॥ సురపతి ముఖ్యు లెల్లరును • సూటిగఁ గార్యము లొగ్గిసేయఁ దా
మరసభవుండు హోమము క్ర • మంబుగఁ బూర్తి యొనర్పుచుండ నా
గరకులు సన్నుతింప సుర • కాహళ దుందుభి ఘోషమొప్ప నా
సిరివరుఁ డుల్లసిల్లి యభి • షేక మొనర్చె సురారి సూతికిన్

॥ మును జరిగిన చరితం బిది. మనమున నా వార్త సుంత • మన్నింపక త్రో
చినఁ జెడుగులు తప్పని సరి. యనుచు విభీషణుఁడు పలుక • నన్నయుఁ గినుకన్.

## 4. విభీషణ శరణాగతి పటలము. (155)

॥ విని విమర్శింపఁ జాలక • వీఁగి నిజము. తెలియనేరక భేద బు • ద్ధిని గ్రహించి
కనులఁ బారాణి పూసిన • కరణి నెఱ్ఱ. చేసి నిప్పుక కురియుచుఁ • జెప్పఁదొడఁగె.

॥ మృత్యువిజయ తపోబల • మేటి బలము. గలిగి నాతఁడగు హిరణ్య • కశిపు నర్థి
జనులఁ గాచెడు హరి చంపె • నని తలంచి, యతని మెచ్చ భక్తిగొంటి వీ • వయ్య? లెన్న?

॥ కని పెంచిన జనకుని తో, మ్మును మాయలమారి చీల్చి • మోదించిన యా
తనయుఁడు మన శత్రువునెడ, నెనరూనిన నీవు సములు • నిజము పకేకీ?

॥ ఆ రామలక్ష్మణులతోఁ, బోరి మడియ నాదు రాజ్య • భోగంబులఁ బెం
పారఁ గొనఁ దలఁచితే? పితృ. మారకుబలె నీవు భ్రాతృ • మారకుఁ డగుదువ్.

॥ ఇది ఫలియింప నే • రద యైనఁ బేరాస. మునుపె వారల యెడ • నెనరుఁ గొంటి
మనుజులవలె నీవు • దనుజులయెడ గొప్ప. యోర్వలేని విరోధ • మూనియుంటి
వెమ్మలు కరఁగు ప్రే • మమ్ము రాఘవులందు. తెలుపుచు నుంటి స్తు • తించుచుంటి
వానంద బాష్పమ్ము • లధికమ్ముగా వారి. వినుతించు నపుడెల్ల • విడుచుచుంటి

తే॥ శరణమగుదురు వారలా • నరుల కపుడు, బొమ్మ కర్తవ్యమదియని • యమ్మ నన్ను
గెలుచు వెరవు నాలోచించి • తెలిసికొంటి. నీకు మంచిన శత్రుండు • నాకుఁ గలఁడె?

ఉ॥ నాఁడొకకోఁతి వచ్చి వన • నాశము సేయుచుఁ జంపుఁడంచు నే
నాడఁగ దూతఁ జంపుటలు • న్యాయము గాదని పల్కినాఁడ వా
నాఁడె భవిష్యదర్థము మ • నంబున నెంచితె యడ్డుకొంటివో
నేఁడది వెల్లడించితివి • నీ కృతకంబు ఫలానుమేయమౌ.

చ॥ అరులకు భీతిఁజెంది తటు • లోటను వోటరి కావు నిక్కమా
నరులకు భక్తిఁ జూపి వెను • నమ్మరి ముంచితి వంచకుండవై
పురుషుని తోడ వచ్చు గుణ • పుంజము లెల్లను మార్చుకొంటి నీ
గరువగు చెల్మికంటె భుజ • గంబు మెడం గొనుటెన్న మేలగున్.

తే॥ జగము నిందకు జంకి నిన్ • జంపకుంటి. వదరుటింకను మానవు • వడిగ నన్ను
విడిచి పొమ్ము పోవక వెంది • నుడువఁ బూను. దేని నిన్ను జంపాదక • మాన ననుడు.

క॥ తలపోసి యేమి చేయం, గలనని తమ్ముండు మిత్ర • తతితో గగన
స్థలమున నిలిచి విడక నయ, కలితములగు వాక్యములను • క్రమ్మఱ ననియెన్.

క॥ బ్రదుకం దలఁచిన యన్నా!, మదిమది సుఖసంపదలను • మనఁదగియుండన్
వదరల పలుకులఁ జెడియెదు, బ్రదుకు గలదె నీతిచెడిన • ప్రాణుల కెందున్?

చ॥ సుతులును బంధు మిత్రులును • స్తోత్రము చేసెడు బుద్ధిహీనులున్
హితులును శూర కేసరులు • నెల్లరు రామ శరాళిచేత భూ
పతితులు గాఁగఁ జూచి మఱి • ప్రాణము వీడఁ దలంచినాఁడవే?
హితము వచించు నన్ను గణి • యింపక శత్రువుగాఁ దలంచితే?

ఉ॥ తేరుపఁ జూచితిన్ హితము • దెల్పి సహింపక నీతిమాలి న
న్నూరక దూఱులాడితి హి • తోక్తులు నీచెవిఁ దూఱవయ్యె; వి
న్నారము పూర్వమున్ గరిఁటె • నాకి వ్రతమ్మను కోలుపోవు చా
ప్పారయనయ్యె నొక్క చెలి • కై కులనాశము దెచ్చికొందువే?

క॥ మన్నింపుము నాతప్పుల, నన్నా! సెలవిమ్ము పోదు • నని వెడలుటయున్
గ్రన్నన మంత్రులు నలువురు, తన్ను విడక వెంటనంటి • తరలిరి ప్రీతిన్.

క॥ అనలుఁడు సంపాతి హరుం, డనిలుండను వారితోడ • ననువుగ నాలో
చనచేసి విభీషణుఁ డ, య్యనకులుతో నెయ్యమాడ • నేగె ముదమునన్.

క॥ ఇంబుగ పనధిఁ గడచి దీ, పంబులు విలసిల్ల దుగ్ధ • వారాన్నిధి య
ద్ధంబులు పూచె ననెడు చం, దంబున వికసిల్లు కపిక • దంబముఁ గాంచెన్.

క॥ ఒక ప్రక్కను గపి సంఘము, నొక ప్రక్కను జీవకోటి • నుంచి గణింపన్
దుకము మిగులు వానర సై, న్య కదంబమె యనుచు మఱియు • నతఁడిట్లనియెన్.

సీ॥ ధర ధర్మమార్గ సం • స్థాపకుఁడగు దాశ, రథి యెడ నామనో • రథము పాఱె
కీర్తిదంబగు శుద్ధ • వర్తనంబునఁ గాక, యే మార్గమున నేగ • నిచ్చగింప
సోదరుండగు నాదు • సూక్తి గైకొనని మా, యన్న చే వీడంగ • ననదనైతి
నీయదనందు నేఁ • జేయంగఁ దగిన దె, య్యది వచింపుఁడు మీర • లనుఁగులార!

తే॥ యనుడుఁ బుణ్యపురుష! బుధ • ప్రార్థదాయి, యైన శ్రీరాము దర్శించు • టధికముఖ్య
మనుచు శాస్త్ర విజ్ఞానులౌ • తనదు హితులు, పలుక నాతఁడు సమ్మోద • కలితుఁ డగుచు.

మ॥ శుభదంబౌ ఫణితిన్ వచించితిరి మీ • సూక్తుల్ హితంబయ్యె మా
కభయం బిమ్మని వేఁడఁ బోవుదము సీ • తాధీశ్వరుం దర్శిదు
ర్లభుఁడే? వేఱొక తీరు సేసినను • త్రోలన్నేర్తుమే దుష్ట దై
త్యభవంబుల్? మన కిద్దియే యిపుడు క • ర్తవ్యంబు చింతింపఁగన్.

మ॥ మును దర్శింపఁగ లేదు విన్న యదియుం • బొల్పార దెన్నండు నె
మ్మనమం దిట్టులు ప్రేమగల్గఁ గతమే • మాత్రంబుఁ గానంగ రా
దనయంబుం దలఁప శరీరము గగు • ర్పొందున్ గరంగున్ మనం
బిన రాజన్యుఁడు దైత్యదేహి కరి యం • చీమాత్ర చింతించెదన్

తే॥ అయిన సర్వజ్ఞుఁ డీమాత్ర • మరయకున్నె?, దైవభక్తి ధర్మము నీతి తప్పమియును
భూతదయయు బ్రహ్మవలనఁ • బూర్వమునవె, పడయువరములు ఫలియించు • నెడయువచ్చె

తే॥ మేలె పల్కితి రీరు స • మీక్షచేసి, శ్రీశు పదములఁ బొంది య • భీష్టములను
గొంద మిప్పుడు చీఁకటి • గొఱలు కతన, నుదయమునఁ గాంత మని వని • నుండునంత.

తే॥ కడలి దాఁటు నాలోచన • గలుగఁ గలువ, కంటి జానకిఁ దలఁచి దుః • ఖమున మనసు
చలన మొందుచునుండ భా • స్కరుఁడుపొడమె, రాముఁడునువచ్చె వార్థి తీ • రంబుచేర.

తే॥ తమమునం దటఁ గల యుప్ప • శముల నైక, తములఁ బున్నాగములఁ దమా • లములఁ గంజ
ములను కలువల వేడ్కమై • నలరు హంస, మిథున సంతతిఁ గాంచెను • మిహిరకులుఁడు

తే॥ పసిఁడి రంగు నిండారిన • వసచయములు, సికత వేదికా స్థలుల నె • ట్టుకొని వచ్చి
కెరటములుచేర్పు మణిసము • త్కరము మదికి, నింపుగూర్పఁగఁ గనె జాన • కీశ్వరుండు.

ఉ॥ అందలి సుందరుల్ మెఱుపు • నందము చిందెడు భూషణావళుల్
చందముగా ధరించిన ప • సందగు ప్రేకలు రాయ బాష్పముల్
క్రందుగఁ గాఱుటన్ సుడియు • కాల్వలఁ బూడ్చుచుఁ గాలిప్రేళ్ళ భూ
మిం దగ గీచు గీఁతలును • మిక్కిలి గల్గు వనంబులం గనెన్.

తే॥ ఇంచు గేదంగులందుండి • హిమకణములు, జాఱఁ బెంటులఁ జేరె ప • క్షముల నదిమి
కొనుచుఁ దూఁగెడి హంసల • గుంపుగాంచి, యుల్లమున నొచ్చి గొప్ప ని • ట్టూర్పుపుచ్చె.

తే॥ తిన రుచించుమీలను పట్టి • తెచ్చి యిసిన, గంటు పులుఁగుపచ్చెడు దిక్కు • గాంచి యింపు
మీఱఁ గూయు నారణపక్కి • లిటుగాంచి, చింతగావియె శ్రీరాముఁడు • చిత్తమందు.

తే॥ ఒక్క పెట్టపై వలపూని • యుల్లసిందు, మచ్చరసు పెచ్చురేఁగ దీ • మసముతోడ
రెండుపుంజులు పోరాడుచుండఁ గాంచి, పసుటౌసుల ముడిపెట్టె రా • ఘవ పదుండు

తే॥ ఆప నిండిన నెయ్యంపు • టక్కయుండు, గెలుపు గొనలేని యొకహంసి • కలయికందు
జయము నొందుట గని రాము • ఁ డనవిధుండు, పపడముం బోలు సధరంబుఁ • బంటనొక్క.

తే॥ దాసి హనుమదాదులు సమీ • రాశ్వసపలుప, చింతపీడి తెలివి కౌర • చేరు పిచ్చి
వానికైవడి నాచోటు • పసలిపోయె, శ్రీవిభుండు సీతా క్రాంత • చిత్తుఁడగుచు.

తే॥ ప్రాజ్ఞులైన వానర మిత్ర • వరులు బలిసి, రాఁగ నదచు వాహిని కొక • ప్రక్క నిలిచి
శంకలేని మదిని విభీ • షణుఁడు వదఁవఁ, గాంచుమండి యిట్లనియె రా • ఘవుఁడు వినఁగ

క॥ నీకంతెను సుశరణ్యము, నాకెవ్వియు లేదు రక్ష • ణం బీవె యనన్
గాకుత్స్థుఁడు విని మిత్ర వ, నౌకసుల మొగమ్ము లరసి • యల్లన ననియెన్.

క॥ శరణము తండ్రీ! యని యిపు, డరుమగ వచియించు వార • లరయంగా నే
తరమునవారలో మీమీ, యరసిన తెలుఁగెంత పట్టొ • యరయుడ మనుడున్.

తే॥ అచట నవ్విభీషణుఁ గాంచి • యనుపలిందు, చేరిరిఁకఁ బట్టుకొనుఁడు హిం • సింపుఁడుగ్ర
గతులఁ జంపుఁ డనుచుఁ గపి • గణము వారిఁ, దర్జనముల భర్జనముల • దాసిచుట్టి.

తే॥ పాడి దేవతయే వీనిఁ • బట్టి తెచ్చె, నితఁడు పాపాలపుట్ట లం • కేశ్వరుండు
మన తలంపులు నేఁడె చ • య్యన ఫలించె, తెరలకుంపని వారి నె • దిర్చినారు.

క॥ తలలు పది చేతు లిరువది, గలుగవు దౌర్భాగ్యనకసు • గతియించెనొకో;
తెలియ మనువారు మాతోఁ, దలపడు మని త్రోసికొనుచు • దాసెడు వారున్.

క॥ పట్టి పెడతెక్క లీడిచి, కట్టి సలఁగఁ బొడిచి రాము • కట్టెమటికిఁ దో
సెట్టుదప యనెడు వారును, తిట ట్టుచుఁ జెడుమనుచు నెదురు • తిరిగెడి వారున్.

క॥ గగనమునకు నొక త్రుటిలో, నెగసినఁ జేయునది యేమి • యిప్పుడు వీనిం
దెగటార్చము రూపఱఁ జిదు, కఁగఁ బొడుకము తామసింపఁ • గావను వారున్.

తే॥ పలు విధమ్ముల నీరీతిఁ • బలుకుచుండ, గణన కెక్కు మైంద్ర వ్యాక • రణ విశార
దుండు హనుమంతుఁ డంప మైం • దుండు ద్వివిదుఁ, డనెడు వానర వీరు లా • తనిని దాసి.

తే॥ ధర్మపద్ధతు లెఱుఁగు మైం • దద్వివిదులు, వానరుల నవ్వలికిఁ ద్రోచి • వదరవలదు
[illegible] • దూరము లగు, ననుచు వారంతోడ ని • ట్లనిరి యపల.

[illegible] మదియేది? రణము • కాంక్షించితిరో,
[illegible], తీరులు మదిదాఁచకుండఁ • దెలుపుఁ డనంగన్.

మ॥ అనలుం డిట్లను ధర్మవర్తనుఁడు స • త్యాచార సంపన్నుఁ డీ
ఘనుఁ డబ్జాసన పౌత్రుఁ డార్యహిత స • త్కార్యుండు పేరన్ విభీ
షణుఁ డీరాఘవ పాదపద్మములు వాం • ఛం గొల్చి జన్మంబు పా
వనతం గాంచఁగఁ గోరి వచ్చెఁ గరుణా • వష్టంభులారా! వెసన్.

ఆ॥ పాడి తప్పకుంట • పరమాత్మ పై భక్తి. సత్యవాక్య నిష్ఠ • శమ దమాదు
లబ్జభవుని వలన • నరుదైన తపమున, వరముగాఁగఁ గొన్న • వాఁడితండు.

ఆ॥ ప్రజ్వరిల్లు నగ్ని • వస్త్రంబునం జుట్టి, నట్లు లోకనాథుఁ • డైన రాము
పత్నిఁ గార నిడితి • వదలి బ్రదుకు గను, మనుచు హితము దెలుప • నన్న కితఁడు.

తే॥ విగత సద్బుద్ధి దానవ • విభుఁడు కినిసి, తమ్ముఁడవు గాన బ్రదికితి • తావునుండి
తొలఁగి పొమ్మ్మ పోవేని మృ • త్యువు నిజంబు, పలువ! యని పల్కఁ నీతండు • వదలివచ్చె.

ఆ॥ అనుచు ననలుఁ డాడ • ననుజుని సేనను, గాంచి హెచ్చరికను • గనుచునుండుఁ
డేను రాఘవునకు • నీవార్త దెలిపెద, నంచుఁ బలికి మైందుఁ • డచటు వీడె.

తే॥ పాడియుఁదపంబుజ్ఞానంబు • ప్రహరులుగను, గౌరవంబు శాంతంబును • ద్వారములుగ
కరుణయను దేవళంబునఁ • బరఁగు లోక, మోహనుని పద కంజాత • ముఁకు నెఱఁగి

తే॥ తెలుప వలసిన దొకవార్త • గలదు దేవ? ఏమి ఫలియించునో మాకు • నెఱుఁగరాదు
వంచకుండగు రావణు • వదలి యతని, తమ్ముఁడగు విభీషణుఁడు మీ • దరికి వచ్చె.

తే॥ పట్టి కట్టుఁడు కొట్టుఁడు • వ్రచ్చుఁ డనుచు, మన చమూబృంద మాతనిఁ • జెనయనేను
వారి నదలించి వచ్చిన • మీరలెవ్వ, రేమి పనియన నొక మంత్రి • యిట్టులనియె.

తే॥ తనకు వ్యతిరేక గుణుఁడగు • దశముఖుండు, మనసు వోయిన త్రోవనె • చనెడుకతన
దగిన శరణ ముదారుఁడౌ • దాశరథియె, యనుచు నాశ్రయింపఁగ నిట • కరుగుదెంచె.

తే॥ ధర్మమార్గ వర్తనమును • దైవభక్తి, సత్యనిష్ఠయు ఘన తప • శ్శక్తిచేత
వీత దానవ గుణుఁడు వి • భీషణుండు, బ్రహ్మవలన వరంబుగాఁ • బడసినాఁడు

చ॥ అలఘుపతివ్రతామణి కు • లాంగన రాముని ధర్మపత్ని ని,
ట్లలయఁగఁ గారలో నునుప • నక్షయసంపద లీను లంక యె
మ్మెల గిరులౌను నీమకుట • భూషిత మస్తక సంఘముల్ ధరా
స్థలి దొరలు న్నిజంబని హి • తంబు వచింపఁగ నన్న కిన్కమై.

తే॥ ఇటు విరుద్ధవాక్కుల వచి • యింతువేని, చంపువాఁడఁ బొమ్మవలి కీ • క్షణమునందె
యనుచుఁ దఱుమఁగొట్టంగ మి • మ్మాశ్రయింప, వచ్చినాఁడఁట! యిదికల • వార్తయనుడు

తే॥ రక్షణీయుఁడొకాఁడొయీ • రావణాను, జుండు మీసూక్ష్మమతులకు • సూటిగాఁగఁ
దోఁచువిధము దెల్పుండు మి • త్రులరుమీర, లనిన రఘువర్యుఁగనిరవి • తనయుఁడనియె

## సుగ్రీవాదులు తమ తమ యభిప్రాయములఁ దెలుపుట

తే॥ విధికి మించిన వాఁ డను • పేరుఁ గాంచి, హరిగణాధిప! నీ విట్లు • ప్రశ్న సేఁత
మావలన నెఱుఁగుట కౌనె? నన్ను గౌర, వించుటకుఁ గాక యాగను • వినుత చరిత!

తే॥ ఐన వచియింతు నెఱిఁగిన • యంతవట్టు, నిను మని నిది సరియైనచోఁ • గొనుము పిదప
భావి ఫలితమ్ము తీర్మాన • మరచి నీవ, తెలిసికొనఁగల్గుదువు దయా • కలితచిత్త!

ఉ॥ అన్నను వీడి వచ్చుటిది • యారయ నైపుణిచేతఁ గాదు వ్యా
పన్నత నొందికాదు తన • ప్రాణము గాచికొనంగఁ గాదు పే
రెన్నిక గల్గునంచు నెన • నెంచియు గాదొక కీడుచేసి కా
దున్నతుఁ డొక్కరుండు కలఁ • డో ఖలుడైన నిశాచరావళిన్?

తే॥ తల్లిదండ్రుల గురుల బాం • ధవులఁ బ్రభుల, శత్రువులు చుట్టు ముట్టిన • సమయమందు
చేయి విడిచి వచ్చుట యెట్టి • శీలమయ్య! హేయమగుఁగాక సజ్జన హితము నగునె?

తే॥ వలయు పనులందు నింపగు • పలుకులాడి, రణము సేయ వలయునెడఁ • బ్రాణమైన
వీడవలసిన పద్ధతి • వీడి శత్రు, పక్ష మొందు వాఁ డొక ధీర • వర్యుఁ డగునె?

ఉ॥ జ్ఞానము ధర్మమున్ దనరు • సమ్మతపద్ధతి నుండవచ్చు న
వ్వానికి భంగముల్ దొరయు • పట్టున చేసరి సన్న్యసింపఁగా
బూనుట భావ్యమైనపని • మూర్ఖులు నైతము నవ్వ శత్రు ప
క్షనకు వచ్చి చేరుటది • సజ్జన సమ్మతమే? యనింద్యమే?

తే॥ అన్న సుఖియింపఁ దానుసౌఖ్యంబు లంది, ముట్టవచ్చిన తఱిఁ దోడు • పూనకిట్లు
వీడివచ్చు నీతడు తగు • వేళరాఁగ, నెవ్వరికిఁ దోడుపడునని • యెంచవచ్చు?

తే॥ వృద్ధుఁడైన • మారీచుఁడు • విభునియాజ్ఞ, చెడుగయైనను విధిలేక • చేయఁబూనె
రాజధర్మ తత్త్వజ్ఞుఁడై • రాజు వీడి, వచ్చెనని నమ్మి చే యూయ • వచ్చునేమి?

తే॥ యమునితో లోకమెల్లనే • కముగనగుచుఁ, దాఁకినను మాఱుకొనఁగ సిద్ధముగనున్న
వారమోరామ! మనప్రక్క • వచ్చితోడు, పడునె శత్రుతమ్ముఁడు? నమ్మ • వచ్చునేమి?

తే॥ అసురులను సమూలముగ ను • క్కడఁచిధర్మ, మొనరనిలిపెడు గౌరవ • మూనియున్న
మీరువీనిఁ దోడుగఁగొన • మీగురుత్వ, మునకె పెనులోటుగాఁ దోఁచు • వినకులాఢ్య!

తే॥ బందుగుల హితులును వీడు • పట్టునందుఁ, గూడియున్నెడ సంపదల్ • కొల్లవోవు
నపుడు బిందారగించెడు • నపుడు నొక్క, పద్ధతిగ నుండువారలే • పరమహితులు.

తే॥ కపట నాటక మాడంగ • గడఁగి వీఁడు, వచ్చెఁగాక శరణమొంద • వచ్చినతఁడు
కాఁడు శత్రుఁ జేర్చుకొనఁగఁ • గాదు వీని, తీరు సంశయాస్పదమని • తెలియఁబలికె.

తే॥ అందుపై బహుశ్రుతులలో • నసముఁడైన, జాంబవంతుని గని రామ • చంద్ర విభుఁడు
నీ యభిప్రాయ మేమని • నెనరు దోఁప, నడుగ ధర్మపద్ధతి నిట్టు • లాతఁడనియె.

చ॥ పగఱను చేర్చుకొన్న నెటు • వంటి మహాత్ములె యైనఁ గీడులం
దగులుట నిక్కవంబు పగ • ధర్మపదుండని చూతురేని వం
శగత దురాగతంబు విడి • జాలునె యెన్నఁటికేని ? లోక మీ
పగిదిని సమ్మతింప దిది • పార్థివ పద్ధతి గాదు రాఘవా।

ఉ॥ క్రూర విరోధు లెప్పుడును • కోరుచునుందురు మిత్రభేదముం
దారి గనంబడం జెడుగు • దార్తురు వేళ గ్రహించి పోరికిం
ధీరత నెత్తుచుందురు • తేఁకువతో జయముం గడింతు రి
ట్లారయ దుష్టసంగతి న • యంబు నొసంగునె? రాఘవేశ్వరా।

తే॥ వేదములయు యాగములయుఁ • బేరు మాపి, శిష్టులకు వేల్పులకు బల్మిఁ • జెడుగు గూర్చు
పాపులగు రక్కసులు మన • పక్షఁ జేరి, సజ్జనాచారములఁ గొనఁ • జాలువారె?

చ॥ శరణము సొచ్చి రం చభయ • సంపద పెంపుగ నిచ్చి కాచుచో
దొరకొన వీరి మోసమున • దోసము లెయ్యవి సంభవించినన్
భరమయి ప్రాణముల్ విడువ • వచ్చిన నప్పుడు వీరి వీడినన్
తిరమగు నిందయొఁ దగవు • దేవతయున్ దొలఁగున్ రఘూత్తమా।

తే॥ ఎక్కువగఁ దెల్పనేల? మీ • రెలమితోడఁ, గాఁటనుండ బంగరు లేఁడి • గాఁగ వచ్చి
మోసపుచ్చు మారీచుని • మునుపు రాక, వీనిరాకయు నొకటిరె • వీరవర్య।

తే॥ అనుడు బహువిధ శాస్త్ర సి • ద్ధాంతములను, చక్కఁగా విని యెఱిఁగిన • సైన్యపతిని
నీలుఁ గని నీయభిప్రాయ • నిశ్చితంబు, దెలుపుమన నాతఁ డిట్లని • పలుక సాగె.

సీ॥ కూడని వారలఁ • దోడుగాఁ గొను పద్ధ, తులు గొన్ని కలవు రా • ట్తిలక వినుము
తమవంశమున వారి • సమయించు వారల , కడ కెల్లిదమ్ముగ • నడచువారు
వనితల విషయాన • వైరంబు గలవారు, పగఱచే ధనము గో • ల్పడినవారు
మఱవఁగూడని యవ • మాన మొందినవారు, దాయలవలన బీ • దలగువారు

తే॥ సంగరంబున వెన్నిచ్చి • శరణు చొచ్చు, వారు పరుల మిత్రుల బాధ • పఱచువారు
ప్రక్క రాజులచేఁ గీడు • పడయువారు, వైరి సోదరులైనఁ జే • పట్టఁదగును.

సీ॥ పగఱఁ జేరఁదగిన • భంగంబు లొంటని, వారును శాత్రవ • భయద బలులు
చేరిన నదను వ • చ్చినఁ దొలఁగంగఁ దీ, ర్మానించు కొనియుంద్రు • గానఁ దగదు
ఈ విభీషణు రాక • కిందేది కారణ, మగునని యారయఁ • దగును మనకుఁ
గాల దేశములు నృ • పాల నీతియుఁ జూడ, విసిగిన వాని స • ద్వృత్తియొకఁడె

తే॥ కాంచినమ్మంగఁదగదు ని • క్కముగనిదియ, నాయభిప్రాయమనఁగ వా • నరులు తక్క
వార లుచ్చావచంబుగఁ • బలికి తుదకుఁ, బగను చేపట్టఁ దగదని • పలికినారు.

## హనుమంతుఁడు తన యుద్దేశమును దెలుపుట

సీ॥ సర్వసామాన్య వి • జ్ఞానంబున రతీతుఁ, డైన శ్రీరామ భూ • జాని యపల
మతిమంతుఁడగు హను • మంతుని గని బహు, శ్రుతుఁడ! నీ తలఁపున • చొప్పువినఁగ
నెంతు నీవారెల్ల • రేన వాద్యులై యయి, రను సూచకంబుగ • ననయునంత
నాలోచనమున వీ • రజ్ఞానులైనను, దగు గౌరవింప దాం • ధప్యరీతి

తే॥ ననుచుఁ గృతమతి మారుతి • యపనతాంగుఁ, డగుచు హస్తముల్మకుళించి • యాననమున
కడ్డముగఁ జేయియిడి పెద్ద • లందఱొక్క, పద్ధతిగఁ బల్కు మీఁద నేఁ • బలుకవలెనె?

తే॥ కృతమతులు మంత్రులెల్ల రీ • రీతి తీర్చి, పలుకుచున్న భావ్యంబగు • ఫక్కియైన
నితఁడు దుర్గుణుఁడని సంశ • యింపఁజాల, దీనికిం దగు హేతువుల్ • దెలియ వినుఁడు.

క॥ వంచకుల వక్రపదనము, లంచించి పరీక్ష సేసి • యరయఁగ వచ్చున్
వంచనము వారు దాఁచిన, నంచిత హృదయంబు మోము • నం దెదలించున్.

క॥ పగవారు శరణుచొత్తురె?, పగటం జీఁకటులు కానఁ • బడునే? మదిలోఁ
దగులుకొను చౌర్యమునకున్, మొగమే యద్దమయి స్పష్ట • ముగ వెలిపుచ్చున్.

తే॥ వాలి స్వర్గలోకముచేర • నేలయెల్లఁ, దమ్ముఁ డొందఁగఁ జేయు నీ • ధనువుబలము
జయము శీలము సర్వమ్ము • చక్కనెఱిఁగి, రాజ్యకాంక్షచే నితఁడు చే • రంగ వచ్చె.

తే॥ దనుజదుష్పాలనమునకుఁ • దాళలేమి, తమ్మునకు రాజ్యమిచ్చు ను • దారబుద్ధి
సత్య వాక్పాలనము ధర్మ • సంస్థితియును, తీరుగా నెఱింగియె నిమ్ము • చేరవచ్చె.

తే॥ ఇతఁడు కాలదేశంబుల • నెఱిఁగి నీవు, వాలిఁ జంపుట దెలిసి రా • వణునకింక
నాశమే నిజమని లోక • నాయకుఁ డగు, నిన్ను చేరఁగోరియె వచ్చె • నన్నవీడి.

క॥ దానవ నైజము మాయలు, వాని నెఱుఁగు వలఁతు లిపుడు • వశులైరి జయం
బే నిక్కువమగు మనకిఁక, దీనికిఁ జింతింపనేల? ధీరవరేణ్యా!

చ॥ దనుజులు మానసంబులను • దాఁచిన క్రూర గుణవ్రజంబులన్
గనుఁగొన దుష్కరంబ యగుఁ • గాక నృశంసులు వీరిలోన నుం
డినఁ దగ నుండవచ్చును క • డింది మగంటిమి గల్గు వైరిచేఁ
దనుకఁగ బన్న మొందిన క • తమ్మున నయ్యవి యెన్న గూడునే

మ॥ నను దైత్యేంద్రుఁడు చంప నాజ్ఞయిడ న • న్నంగాంచి యాతండు దూ
తను చంపించుట పాడిగాదు మఱి త • త్కార్యంబుచేఁ బూర్తిగాఁ
జనునే శాత్రవ శేషమంచు నబలా • జాతిన్ బలంబేది యుం
డినవారిన్ వధియింపరాదనుచుఁ జా • టించెన్ సభన్ ధీరతన్.

తే॥ రాత్రి నీవిభీషణు మంది • రమున కేగి, నపుడుఁ దరువాత నాత్రోవ • నరిగి నపుడు
మంచిశకునంబులయ్యెనా • మదికినించె, మఱియునితనిగూర్చికొంత • యెఱిఁగినాఁడ.

తే॥ సజ్జనావర్హమైన మాం • సంబు నింద్య, మైన మద్యంబు నితని గృ • హంబునందు
కానరావు దైవార్చనల్ • దానధర్మ, విధుల నొప్పారె సుకృతాత్మ • వేశ్మమనఁగ.

తే॥ ధరణిజాత దుఃఖింప నీ • తని కుమారి, పాపి యసురకు బ్రహ్మశా • పంబు కలదు
నిన్ను బలిమిమై దాఁకంగ • నేరఁ డనుచు, డిందుపడవలదని యూఱ • డించుచుండె.

మ॥ దనుజాధీశుఁడు పొందినట్టి వరముల్ • దర్పంబు మోసంబు త
క్కిన దుర్జాతిగుణంబులన్ వెలికిఁ గ్ర • క్కింపంగఁ దానొప్పు నీ
ఘన కోదండ విముక్త శాత శర సం • ఘాతం బమోఘంబుగా
నని యూహించియె వచ్చినాఁడు రఘురా • మా: భక్త చింతామణీ!

చ॥ తన వరముల్ గుణంబులు కృ • తార్థత నొందఁగఁ జూచి యందుపై
ననితర సాధ్య కార్యముల • నారసి యాసదవేళఁ గావుమా
జనవర! యంచు వచ్చిన ని • శాచరుడైనను బోవ వీడినన్
వననిధి బావి నీటిఁ గని • వారని శంక యొనర్చి నట్లగున్.

చ॥ అరులకుఁ జేరువారలు స • హాయులు కారని యా విభీషణున్
దొలఁగినచో నయజ్ఞులిల • దొడ్డగ నవ్వరె? యన్నదమ్ములా
పురుషులకారె వైరమును • పూనుచు నుండ్రొక వెంట కోసమై
యిరవిది తెల్పితిం బిదప • నిష్టము వచ్చినయట్లు చేయుఁడీ.

## శ్రీరాము నభిప్రాయము.

చ॥ అను హనుమంతు వాక్యముల • నారసి దేవ సుధం గ్రహించు చొ
ప్పున మది నుల్లసిల్లి కడుఁ • బోఁడిమితోఁ గొనియాడి తక్కువా
రిని గని యాతఁ డాడినది • కృత్యము మీరలుఁ జర్చసేయుఁడీ
వనచరులార! నా తలఁచు • పద్ధతి యియ్యదియే నిజంబుగన్.

ఉ॥ నిర్వహణ ప్రభావమును • నెక్కొన వచ్చిన వేళయున్ మనః
పూర్వక రాజ్యకాంక్షయును • ముఖ్యములై తగియుండె వీని ని
ర్గర్వము మెచ్చఁ దగ్గది తి • రంబుగ నిల్చిన కార్య దీక్షయుం
బర్వెన బుద్ధి గొప్పయవి • పాపమొకండును లేనివాఁడగుకా.

ఉ॥ మారుతి పల్కులెల్లను స • మంజసముల్ పలుమాట లేటికిన్
వేరగు తీరుచె గెలుపు • వీడినఁ బ్రాణము లేగినన్ జయం
బేరహిఁగల్గినకా బహు సు • రేశ్వర భోగములబ్బినకా సరే
కోరికమీఱ నన్ శరణు • గోరినఁ గాచుట నా వ్రతంబగున్.

చ॥ శరణము గోరి నాతఁడొక • శాత్రవుఁడైనను క్రొత్తయైన ము
ష్కర గుణుఁడైన మాతృ పితృ • ఘాతుకుఁడైనను భ్రాతృ హంతయేన్

శరణమునొందిన పిమ్మటను • జాలిన దాస యశంబకాక దు
ర్భరమగు దుర్యశంబు మన • పాలఁ బొసంగునె యెన్నఁడేనియున్.

చ॥ ఇనకులచంద్రుఁడైన శిబి • యిచ్చెను మేను కపోతపక్షి కా
పునని యశంబు నేఁటికిని • గల్గదె? నా శరణమ్ము గోరి యొ
ప్పిన సుఖమొంద వచ్చిన వి • భీషణు చేవిడనాఁటికంటె నా
యన కపటంబుచే మరణ • మందిన నాఁడెకదా కృతార్థుఁడన్.

ఉ॥ హాలహలంబు మ్రింగి యమ • రావళిఁ గాచిన శంభువృత్తముం
బోల నెఱుంగరో? యిడుమఁ • బొందిన వానిని పీడువాఁడు భా
గ్యాలిని దాఁటువాఁడు శర • ణార్థిని గావనివాఁడుఁ గాంచఁగాఁ
జాలెడువారె ధర్మఫల • సంపదఁ బిమ్మటఁ జింతనొందినన్.

ఉ॥ దారను బట్టఁబెట్టికొని • తన్నును పట్టఁగ నున్న బోయకుం
బేరిమి నగ్నిఁగూర్చి చలి • పీడిచి యాఁకలి బాధవోవ నా
హారముగాఁగ దేహము స • మర్పణసేసిన పిట్ట సత్కథన్
ధీరులు మేలుమేలని ను • తింపరె నేఁటికి మంచి వేళలన్?

క॥ కరి మకరముతోఁ బోరఁగ, సరిరాక యలంగి నొచ్చి • శరణార్థిని శ్రీ
వర కావవె యన విష్ణువు, కరుణించిన కథను మఱవఁ • గలరే సుజనుల్?

చ॥ కరుణను సృష్టిచేసి తగఁ • గాచెడు విష్ణువు సర్వలోకముల్
చరములు స్థావరమ్ములును • సత్యము ధర్మము తత్ఫలంబులున్
గర మరుదారఁ దానయయి • కావఁగఁ గోరిన వారిఁగాచు శ్రీ
వరదుఁడు గాఁగ నొప్పెనన • వార్తల నాడఁగనేల దీనికిన్?

తే॥ తక్కువగ జీవితంబును • దాన యొసఁగి, యవలఁ జావ భీతిలి యభ • యంబువేఁడఁ
గాచఁ గాలమర్దించి మృ • కండసుతుని, మృత్యువు మాన్పఁడె శంభుండు • మేలుగూర్చి?

ఉ॥ దిక్కొకయింత లేదనుచు • దీనత జానకి యేడ్వ నీకు నే
దిక్కయి యుంటిగా యని యె • దిర్చి సురారి కులేంద్రు దోర్బలం
బుక్కఱఁ జేసి ఘోర కద • నోర్వి యశస్కరరీతిఁ బ్రాణముల్
దక్కిన పక్కిరాయని వి • తంబది మాకును పాటి కాదొకో?

చ॥ శరణము వేఁడువానిఁ దన • చందమునం గయికొనివాఁడు మేల్
మఱచినవాఁడు నిష్కలుష • మానసమందునఁ దత్త్వచింతనం
బరమరలేక చేసి భువ • నాథ్యుఁడు లేఁడను నాస్తికుండుఁ బెం
పఱి మరలంగలేని నిర • యంబునఁ గూలెదు వారు నిచ్చలున్.

చ॥ పనివడి దేవమౌనుల కు • పద్రవముల్ పొనరించు రావణున్
జెనకి దురంబునందు పది • శీర్షములన్ దెగవ్రైతునంచు నే

ననుట విదేహకన్య కొఱ • కా? మునులెల్లరు వేఁడఁ బద్దుగా
ననిన వచస్సు తప్పఁగల • నా? యని మానులు తప్ప నేర్తురే?.

చ॥ తలఁచిన కార్య మొక్కఁ సుప • థంబున సంతసగాఁగ సాగనీ
యలవడకుండనీ కృపగ • లట్టి జనాళికి మేల్మి గూర్పఁగాఁ
గలిగిన కార్య మింతటను • కల్గునె? కావుమయంచు వేఁడు న
ల్పాలకయి జీవము ల్విడుచు • పుణ్యులు ధారణి నెంద ఱుందురో?

ఉ॥ కావునఁ గావుమా యని యొ • కం డభయమ్మను కోరినప్పుడే
త్రోవక కాచుటే తగవు • త్రోవ సమంచితు లీరు నాయెడన్
వావిరి ప్రేమచే నిటులు • పల్కితి రైనను తప్పులేదు సు
గ్రీవ! బిరాన నీవ చని • ప్రీతిని తేవలయున్ విభీషణున్.

॥ శంక సుంతయు లేక ప్ర • సన్నమైన, మనసుతో రాముఁడిట్లు ప • ల్కినఁ గపీంద్రుఁ
డెదఁద తేటదనంబుతో • నేగె నతనిఁ, బిలుచుకొని వత్తునని మోద • కలితుఁడగుచు.

ఉ॥ వచ్చు కపీంద్రుఁ గన్గొని య • పార కృపారసధాముఁడైన యు
ద్యచ్చరితుండు రాముఁడు స • మంచిత రీతిని నిన్నుతోడి తే
విచ్చెను రాజు నంపె నని • యెన్ ద్వివిదుండు విభీషణుండు దా
హెచ్చు ముదంబుతోడ నెదు • రేగె వికస్వర మానసంబుతో.

చ॥ చిరముగఁ జేరియున్న మదిఁ • జేరరు శుద్ధగుణంబులేని వా
రరుదుగఁ జేరినంతఁ గలి • యం గల వారలు శుద్ధ మానసుల్
త్వరగ మనంబు లొండయినఁ • దార్కొన నిర్వురు రేయియుం బవల్
దరికొని చేరునట్లు సము • దారతఁ జేరిరి కౌఁగిలింతలన్

తరణి వంశజులకుఁ • దగిన పద్ధతిని ము, దాన సీకు నభయ • దాన మొసఁగు
రామవిభుని పాద • రాజీవముల నాశ్ర, యింప వెడలుమని యె • నిన సుతుండు.

ఎడఁదవలెనె యొడలు • కడుఁ జల్లనయ్యె దా. నికిని మించి గగురు • నెఱసెఁ గనుల
నంత కెక్కుఁడయ్యె • నానంద బాష్పముల్, ప్లవగనాథు పలుకు • చెవుల బడఁగ.

శా॥ పారాణిం దలపంగనే యెఱుపులౌ • పాదంబులం గల్గు ప్రే
తారామం బెడఁబాపు పాపమతికిం • దమ్ముండనౌ నన్ను నిం
పారం జేరఁగఁ బిల్చెనే? యభయ మే • పారం బ్రసాదించెనే
శ్రీరాముండు? కృతార్థుఁడైతి హరుఁడ • ర్థిన్ మ్రింగు క్ష్వేళక్రియన్.

ఉ॥ రాముని మానసంబునఁ ది • రంపుఁ దలంపిది యయ్యెనేని త
త్ప్రేమము నిట్టిదైన నవి • వేకి దశాస్యుఁడు నా హితోక్తులన్
దామసవృత్తిమైఁ గొనక • తక్కఁ జెడెన్ జెడితిన్ మహోద్ధతిం
దామరసాప్తుఁ డింకఁ బ్రమ • దంబున లంకపయిం జరింపఁడే?

తే॥ త్రోవరాని కీడులు సేయ • దొడ్డవారు, నైన మిగుల కృపాళతను మా • నంగఁగలరె?
మందరము నాటి యుడుఁగులుల్ • చిందునట్లు, చిలికినను నీదె • జలధి సుధను.

చ॥ ముని హితుఁడైన రాఘవుఁడు • మోదముతో నను నమ్మ్రతించి చే
కొని యిఁక నెప్పుఁడుం బెడని • దారిమి నాకభయం బొసంగె నే
మనఁగలవాఁడ? గీడు లన • యంబును మాయఁబ్రోదఁ జేయు నీ
దనుజభవంబు వీడితిని • తప్పెను నారకముం దరించితిన్.

చ॥ అనవుడు సూర పుత్రుఁడను • నయ్యా! రఘుప్రభుఁ డొద్దయుండు స
ద్గుణములు దుర్గుణంబులును • గోరికి నారయు వాఁడయయ్యు న
ర్థిని తనప్రాణముంబలె మ • తించు దయాళువు నిన్ను గాంచు నా
స నెదురు చూచువాఁడగు వె • సం బదమా యని వెంబడింపఁగన్.

తే॥ వడికిఁ దరువులు గిరులును • వఱఁకుఁ గొంద, నీలగిరియు మేరువు వచ్చు • నెటి రహింప
వినుత పూర్వపుణ్యులు కపి • దనుజ విభులు, చెలఁగి సాలభంజను కడఁ • జేరినారు.

—: శ్రీ రాముఁడు విభీషణున కభయ మొసఁగుట :—

సీ॥ ఇల నాకసంబున • కెగుర వైవఁగఁ జాలు, బలయుతులగు కపి • వరులు గొలువ
పొడవైన విల్లు చేఁ • బూని మేరువుక్రియ, వహించి సౌమిత్రి • ప్రక్కనిలువఁ
బాలకడలి చుట్టి • పరవ వికచ పద్మ, యుత నీలవార్ధి నా • నొప్పు వానిఁ
జతురబ్ధి వేష్టిత • సర్వసర్వంసహా, నాయకుఁడగు నర • నాథ సుతుని
తే॥ వేలుపుల వేఁడికోలునఁ • జాలవెల్లి, పాఁపపానుపు వీడి యి • వ్వసుధ కేగు
దెంచు శ్రీశ్వరుఁబోలెఁదో • తెంచువాని, విశ్వ మోహనాకారుఁడై • వెలయువాని.

సీ॥ భ్రూలతక్రియ వంపు • పొలుపారు వీచికా, తతుల పరంపరల్ • తాఁకుచుండ
ధరియింపఁదగిన ము • త్యాలకై వడి డాలు, నవరించు సైకత • స్థలమునందు
ధవళిమమై యున్న • తలమును తనమేని, కాంతులు నీలిమ • గాఁగఁజేయ
నర్ధేందుఫాల సీ • తాంగన కనుపాప, వలె నొప్పిదంబుగ • వెలయువాని
తే॥ రతనపు న్విల్లులేని నీ • రదముభాతి, రత్నహారముల్లేని యు • రంబువాని
నరయఁ దరిత్రాడు లేని మం • దరముకరణి, బాహుపురిలేని భుజములఁ • బరఁగువాని.

తే॥ అమృతవృష్టి మానుచుఁ గరు • ణామృతంబు, గురియు నిందు చందపు మోము • పరఁగువానిఁ
దండ్రి యిచ్చిన మకుటంబు • తమ్ముఁ దొందఁ, దల్లి యిచ్చిన జడలతోఁ • దనరువాని.

తే॥ ఎలమి దర్శించి యొడలెల్లఁ • బులకరింపఁ, గనుల నీరుకాలఁగ మది • కరఁగ నిలిచి
కాంత మినుమును లాగిన • కరణి నామ, నంబు నీడ్చు నీతఁడు లోక • నాధుఁడనుచు.

సీ॥ ఎట్టని కనులతో • నెలరారి కనువారి, యాత్మల లాగు నీ • లాద్రి యేమొ?
రక్తాంబుజంబులు • రాణఁ బుష్పించి క్రొ, మ్మించుఁ బాసిన బాల • మేఘ మేమొ?
తనియంగఁ గరుణామృ • తంబు వర్షించుచుఁ, బొలుపుమీఱిన ధర్మ • మూర్తియేమొ?
యననొప్పు శ్రీరాముఁ • గనులారఁ గంటిధ, న్యతగంటిఁ గలుచు మా • యంగఁగంటి

తే॥ మిడుఁగుఱుం బుర్వు పగిదిని • మెఱయు భవ ప, రంపరల నీఁగఁగాఁ బద్మ • రాగమకుట
మును విసర్జించి పాదుక • ల్గొనినయితనిఁ, గొలువఁ బంపుననన్నుయుఁ జాల • కూర్మికాఁడె.

తే॥ తాపసులకును నీఁగఁగాఁ • దరముకాని, భవరుజం బాపు మందునాఁ • బరిఢవిల్లు
రాఘవుఁడు తానెవాఁడినా • రాచములను, పరపిచంప రక్కసు లెంత • భాగ్యయుతులొ?

చ॥ రతనపు బొమ్మికంబు పయి • రాజిలు చేకులతోఁ దరుల్ శిలల్
మెతుకనయై కరంగ మితి • మీఱిన భక్తిని తన్ను రాఘవుం
డితవుగఁ జూడ నొగ్గుచు మ • హీస్థలిఁ జాఁగుచుఁ జేరి మ్రొక్కెఁ వాం
ఛిత మణు లిచ్చు వార్ధిక్రియఁ • జెన్నరు తత్పద కంజ సన్నిధిన్.

వ॥ తొలఁగెను జన్మ బాధలనీ • తోఁచు మొగం బెలరార నుబ్బుచున్
వెలువడ మోవ బాష్పములు • పృథ్విని వక్షముసోక మ్రొక్కఁ జి
ప్పిలు కరుణన్ విభీషణుని • శీర్షము దాఁకుచు రాఘవుండు పెం
పొలయఁగఁ గూరుచుండుమని • యొప్పగు తావును కేలఁ జూపుచున్.

మ॥ భువనంబుల్ రవిచంద్ర తారలు మహా • భూతంబులున్ భవ్య రా
ఘవ నామం బపె యెంత దాఁక నిలుచున్ • స్కన్నంబు గాకుండ సం
స్తవలీలన్ భరియింపు మంతదనుకన్ • దై తేయ రాజ్యంబు నం
చు వచించెన్ గరుణాళుఁడై త్రిదశులున్ • సూరుల్ ప్రశంసింపఁగన్.

మ॥ అకలంకాత్మకుఁడైన రామ కరుణా • వ్యాపారముం గాంచియో
ప్రకటాత్ముండగు నవ్విభీషణుని ధ • ర్మప్రోన్నతిం గాంచియో
యొకటన్ రెంటిని కాంచియో జగతి భూ • తౌఘంబు సంతోష తా
రకమయ్యెన్ రఘురామ భూవరుని వా • ర్తన్ విన్న యప్పట్టునన్.

ఉ॥ దాసుఁడు ధన్యుఁడయ్యెనని • దండము పెట్టిన యవ్విభీషణున్
డాసిన లక్ష్మణుంగని కి • డంకను నిద్దుర మాను తండ్రి! సం
త్రాసము పాసినట్టి మన • తమ్మునకున్ మకుటాభిషేకముం
జేసి ప్రమోదమానసుఁగఁ • జేయుము యంచు ననుజ్ఞ యీయఁగన్.

చ॥ అదను నెఱింగి కార్యఫల • మారయునట్టి విభీషణుండు స
మ్మదమున రాముఁగాంచి జన • మాన్య! తలుంగని శ్రేష్ఠసంపదల్
ముదమున నిత్తువే నసుర • ముఖ్యభవంబు తగుల్ తొలంగఁగా
నొదవుచుఁ గైకపుత్త్రునకు • నున్నతి నిచ్చు కిరీట మీయవే!

సీ॥ అనుడు శ్రీరాముఁ డి • ట్లను విభీషణుఁ జూచి, పరసోదరులము న • ల్వురమె యుంటి
మావల గుహునితో • నేవురమైతిమి, పదపడి వానర • ప్రభునితోడ
నార్వురమైతి మీ • యదనున నీతోడ, నేడ్వురమైతిమి • యింపుమీఱ
నీతండ్రి దశరథ • నేత రాంతారంబు, నారిచ్చి సుతులచే • నలువునొంది

తే॥ వెలసె నని పల్క విన్న వి • భీషణుండు, నన్ను మీసోదరులలోన • నెన్నుకతన
బానిసలయందు మేటినై • పరఁగినాఁడ, ధన్యుడైతిని భయములు • శూన్యమయ్యె.

మ॥ అని సందేహము వీడి రాముపద చి • హ్నంబై లసద్రత్న శో
భనమై యొప్పిన హేమశీర్షకము నా • ప్వందాల్చి భానూదయం
బునఁ బూర్వాద్రి యెలర్చు లీల వెలసెన్ • బుణ్యుండు సౌమిత్రి త
క్కిన కీశాదులు మోదమందిరి దివిన్ • గీర్వాణు లగ్గింపఁగన్.

క॥ విరిసోనలు వర్షించెను, శరధులు ఘోషించె మేఘ • సముదయ ముఱిమెన్
సుర దుంధుభి శంఖాదులు, మొరసెఁ బసిఁడి కురిసె గంధ • పొడియును రాలెన్.

చ॥ అమృతము లొల్కు పల్కు లల • రారెడి జానకిపట్ల ధర్మమున్
సమయుటచేఁ గృశించిన ప్ర • శస్తగుణంబును నేఁడు గౌరవం
బమరఁగఁ గాంచె నంచు విధి • హర్షమునొందె దశాస్య దుష్ట కా
ర్యములను సంపదల్ పొలిసె • నంచు నెలర్చెను ధర్మదైవమున్.

తే॥ శత్రురాజ్యసంపద విభీ • షణుని పొందు, టింబుగా నెల్ల రెఱుఁగఁ బా • శెంబునందు
మెఱవడిం జేయుఁ డీవును • మిహిరసూనుఁ, డనుచు రాముఁ డాజ్ఞాపింప • నాక్షణమున.

క॥ గుణనిధి విభీషణుని ల, క్ష్మణుఁడు రవిసుతుండు పెను వి • మానంబునఁ బే
రణితో ముదమున వానర, గణములు మోవఁగ మెఱవణి • గావించి రొగిన్.

ఉ॥ ఏ జగదీశు పాద రజ • మెల్ల ముముక్షులు పొందఁగోరు వా
రా జనవంద్య పాదముల • నారసి బ్రహ్మ యజింపఁ బుట్టు గం
గా జలమందు మున్గ నర • కంబును పొందరు తత్పదంబులే
రాజిలఁ దాల్చు వారెనయు • ప్రాజ్యపదంబు వచింప శక్యమే?

తే॥ సురలు మౌనులు దానులు • సోమయాజు, లాత్మవిజ్ఞులు దేవర్షు • లమరవరులు
తక్కపెద్ద లీదైత్యవం • దమున మేల్మి, నొందినట్టి వారెవ్వరీ • యుర్విఁగలరు?

చ॥ మెఱవడియైన యప్పదప • మ్మెల్లన నాతఁడు వచ్చి భక్తిమై
నెఱఁగినఁ గేలనెత్తి వసు • ధేశుఁడు దీవనలిచ్చి విల్వఁగా
నుఱవగు తావుచూపె నట • నుగ్రకరంబులచేత వారలం
బఱచితి నంచు లాగికొనె • భానుఁడు స్వీయ మయూఖజాలమున్.

## లంకా వృత్తాంత పటలము. (23)

తే॥ సాంధ్యకృత్యముల్ రాముఁడు • సలిపికొనియె
మనసు తపియింపఁ బూవిల్లు • మదనుఁడెత్తె
నాకసంబెల్ల నెఱ్ఱన • యయ్యె మఱి జ
గమ్మునం జిమ్మ చీఁకటుల్ • క్రమ్మనయ్యె.

తే॥ దిక్కులన్ డాగియుండిన • తిమిర సమితి, జలధి జలము భూమిని ముంచు • చందమునను
పరవె నిండు కొలఁకు పూచు • పగిది మిన్ను, తేజరిల్లె నక్షత్ర దీ • ధితుల వలన.

తే॥ మహిత వివిధ సుందర వేణి • మహి తనూజఁ, దలఁచి తపియించు రాముని • నలఁగఁజేసి
నిసులఁ బూచు మల్లికలు రా • జించు వనము, ఋక్షయుతమైన గగనంబు • రీతినొప్పె.

చ॥ తన యెనలేని నెమ్మొగము • తామర నీటుగఁ జూపి నన్ను చు
ల్కనయొనరించి గెల్చిన యి • లాతనుజాత విభుఁడు జయింతు నే
నని పెను కందుతోఁ గినుక • నబ్జుఁడు వెన్నెల కత్తి దూసి చో
ర నికర భీతిదుండయి బి • రానఁ గనంబడెఁ దూర్పుదిక్కునన్.

తే॥ గోచరముగాక యెచ్చోట • గూఢరీతి, నున్న ప్రీచాయ యేరీతి • నున్నఁ జాలఁ
బల్లెవ నటంచుఁ జంద్రుండు • పరవునట్లు, వెన్నెలనియెడి పెనువల • విసరివైచె.

ఉ॥ మేలయి యొప్పు నాయెడలి • మేదురవర్ణము గొంటకాక కీ
లాలిని రేఁచి నన్నును ర • యంబునఁ గట్టఁ దలంచి రాముఁ డీ
లీలను డాసినాఁడని చ • లించి యయుత్సుకతన్ దరంగలన్
గేఁ దటంబు మోఁదుచును • కేరినరీతి నెలర్చె నబ్ధియున్.

తే॥ ప్రాఁతదై ఘోష మొనరించు • వార్ధి ముదిమి, గొన్న మేనెల్లఁ బోలొల్చు • కొమరుపోఁచు
సికతవేదులఁ బాలు పో • సిన విధానఁ, బండువెన్నెల లెల్లెడఁ • బరవఁదొడఁగె.

తే॥ మల్లికా విష దంష్ట్రిలు • మధుప దుర్గ, మెఱ్ఱని కనులు శైల వి • హ్వృతియుఁ గలుగు
మలయ మారుత వ్యాఘ్రంబు • మలయఁ జొచ్చె, బెట్టు ధ్వనితో వియోగ హృ • ద్భేదకముగ.

తే॥ వాలి యురమును ఖరు తొమ్మ • సాలములను, తొలిచినట్టి శ్రీరాముని • లలిత వక్ష
మందు మదను నమ్ములతోడ • నిందుకిరణ, జాలమను శాతఖడ్గంబు • జాఁదూఱె.

తే॥ ఒడలుచూచుఁ బుడమిపట్టి, యెడఁదఁదలఁచుఁ, గష్టములనెంచి చింతించుఁ • గదలిఁజూచు
దొంగయై చెలిఁ గొంపోవు • ధూర్తులంక, దిక్కుచూచు రాముఁడు వింటి • దిక్కుచూచు.

ఉ॥ చందము చిందు మేలినగ • చందము నందము నొందుసీత మై
యందము డెంధమందు పెను • పందఁ దలంచి తపించి విభ్రమం.

బొందిన రాఘవుండు వీలు • పుం దలపించెడు మౌక్తికంబులం
జెందిన పద్మరాగమునఁ • నెల్లు ముఖంబును విస్మరించునే?

తే॥ ఇట్లు పరితపించెడు రాము • నినకులుండు, గాని కర్తవ్యమును తల • పోసి చేయఁ
దగిన దీవిట్లు చింతింపఁ • దగునె? యంతుని. పిలిచి యోచింపు మన రఘు • వీరవరుఁడు.

తే॥ అంతఁ గొంత చెప్పి శ్రీ పతి • చింత పిదప, యల విభీషణుఁ దోడి తె • మ్మనుడు నతఁడు
పిలువ రాక్షసత్వము మాని • వినుతిపథము, నొంది నాతఁడు శ్రీ రాము • నొద్దఁ జేరె.

తే॥ వికసితాంబుజాత వనంబు • విధము దోఁచు, పార్థివేంద్రుండు తన పాద పద్మములకు
మ్రొక్కిన విభీషణాఖ్యుఁ గూ • ర్చుండఁ బెట్టి, మృదుల ఫణితి నిట్లని ప్రేమ • మీఱఁ బలికె.

తే॥ రావణుని స్వీయబలము దు • ర్గంపు బలము, సంగబలమును మారుతి • యచటఁ జూపు
విక్రమంబును నే విన • విశదరీతిఁ, దెలుపుమా యన నాతండు • నిలుచునంత.

తే॥ వలదు కూర్చుండియే తెల్పు • పచ్చుననఁగ, నమ్రుఁడై యంజలిఘటించి • నయముమీఱ
నడుగు ప్రశ్నములకు సంశ • యంబు లీఁగఁ, దగు సమాధాన మిట్లు పల్కఁగఁ దొడంగె.

తే॥ హనుమతండ్రియౌ వాయువు • కనకశిఖరిఁ, బాఁపఁ దేఁచూని యుండ లే • పంగఁ బ్రతిన
చేసి యలత్రికూట శిఖర • మీసమీప, జలధిలోఁ బడవైచె నా • స్థలమె లంక.

తే॥ యోజనంబులు నూఱు లోఁ • తొలయుచుండు, నేడునూఱులౌ నాకోట • గోడవెలుపు
పొడవు గలదు జ్యోతిశ్చక్ర • మునకు మించి, బలసియుండు లంకను చక్ర • వాళ మట్లు.

తే॥ ప్రహరిపనితనమును యంత్ర • పద్ధతియును, బురుజులును తక్కఁగలయవి • పొగడిచెప్ప
మనసు విసుగొందుఁ బరిఖయే • వసధియగును, మీఱఁ చూడఁ గలరు దాని • మేల్మి నిఁక.

సీ॥ ఉత్తరద్వారమం • దుండు వీరులు రెండు, కోటులు కాలాంత • కునకు సములు
పడమటి వాకిట • వారి కిమ్మడుఁ గగు, వారు మృత్యువుఁ బోలు • శూరవరులు
దక్షిణద్వారానఁ దగఁ బదునాలు కో, టులు జము సంశంబు • గలుఁగువారు
తూర్పు గవని వారు • తొమ్మిది యేడు కో, టులు దిక్కరుల నేల • నలఁచువారు

తే॥ నింగిఁ గన్నులు మూయక • నిలుచువారు, గండు గలవారు, ముప్పది • రెండుకోట్లు
పగలు నిద్దురు లెప్పుడో • వత్తురనుచు, ధరణిపైనుండ్రు లెక్కకు • దాటువారు.

తే॥ ప్రహరిలోపల వెలుపల • బలసి కాచు, వారు తేఁకువగలవారు • మారుతంబె
కుడుపుగాఁ గల్గి పెనుగాలి • పడగలవలె, విన్ను వీథిఁ దిరుగువారు • వేయికోట్లు.

తే॥ నగర రక్షణ దుర్గము నె • సొగసుమీఱి, మూఁడు గలవు వానిని గూర్చి • పొగడనేల?
వాని దొంబది కోటు లి • వాస్యబలులు, చెంగి రేయింబవళ్లు ర • క్షించుచుంద్రు

తే॥ రాజసమ్మాన మొంది వి • క్రమమునంది, ధర్మదూరులై శత్రువుల్ • దాఁకువేళ
వంచనము లేక సాహాయ్య • పడెడువారు, పదియు నాలు నూఱుల కోట్లు • పరఁగుచుంద్రు.

తే॥ విసముకాదు ఘోర • వీక్షణ మనఁదగు, కనుఁ వారు తిరుగు • పనులవారు
అంతిపురము చుట్టు • నలువది నాలుగు, కోటు లసుర వరులు • క్రూరగుణులు

ఆ॥ వదరి వదరి మఱియు • వర్ణింప ఫలమేమి?, యుర్విఁ బంక్తివదనుఁ • డుంచియున్న
సేన లోకముల న • శింపఁ జేయఁగఁజాలి, వేయి వెల్వలగుచు • వెలయుచుండు.

క॥ ఒక్కుమ్మడి లోకమ్ముల, నుక్కునఁ బెకలింపఁ జాలు • నురుబలు లసురుల్
మొక్కలులు మణుల వాకిటఁ, గుక్కలవలెఁ గాచువారు • కోటుల కోటుల్.

తే॥ పరఁగుఁ దేరులు పదివేల • పద్మసంఖ్య, అంతకంటె రెండంతలు • దంతిబలము
అంతకంటె రెండంతలు • హరుల బలము, అంతకంటె లొట్టియలు రెం • డంతలగును.

తే॥ నగరికోట యిట్టిదియ సే • నా బలంబు, నిట్టి దీశ్వరుచేఁ గత్తి • నెసఁగఁ గొన్న
రావణునకుఁ దోడగునట్టి • రక్కసులును, తపము ఫలముగా వర బలో • ద్ధతి గలారు.

చ॥ యుగములు చెల్లఁగాఁ జెడక • యుగ్రతపం బొనరించినాఁడు పెన్
జగడము లొండు దక్క మఱి • సత్కృతు లేవియు లేనివాఁడు సే
న గలుగువాఁడు వక్ర రద • నంబులు గోళ్లను లేకయుండు ను
గ్ర నృహరిఁ బోలు వాఁడొకఁ డ • కంపనుఁ డబ్ధిని ద్రావు జాణఁడున్.

తే॥ మేషవాహను గెల్చిన • మేటి యొక్కఁ, డున్నవాఁడు నికుంభుఁడన్ • పిన్నవాఁడు
కోపశీలుండు తొమ్మిది • కోట్ల మత్త, గజ తురంగ రథాదులు • గలుగువాఁడు.

తే॥ సిద్ధులను చెఱసాల నుం • చిన ఘనుండు, కుంభుఁ డనెడి దైత్యుఁడు పది • కోట్ల బలము
లసరువాఁడు కల్పాంత మా • ర్తాండుకంటె, వేఁడి గలవాఁడు దుస్సహ • వీరవరుఁడు.

తే॥ కరి పిశాచ తురగ ఖర • కాండయుక్త, రథము లొక పదికోట్లు ప • రఁగువాఁడు
తల్లినైన వంచనముచేఁ • దాఱుమాఱు, పఱుపఁజాలు నేర్పరి మహో • దరుఁడు గలఁడు.

ఉ॥ కొండలనుండు రెండు పది • కోటుల సేనకు నాయకుండు నేఁ
డుండెడు వాఁడు రెప్ప గలఁ • దోయను నానుడి సార్థకంబుగా
మెండుగఁ గన్న వారలను • మ్రింగుచునుండును యజ్ఞనాశకా
ఖ్యుండు భయంకరుండు బలి • యుండు సురావలి గెల్చె వేమఱుల్.

తే॥ నరసురాదుల వెవ్వేఱు • పఱచి నిలుప, నొక్క దినమునఁ దినఁజాలు • నుక్కడంష్ట్ర
సాయుధులు రెండుకోట్లతో • నమరువాఁడు, సూర్యశత్రుఁడు క్రూరదృ • ష్టులు గలాఁడు.

తే॥ ఋషులు సుమనస్కులును త్రిమూ • ర్తులను చేరి, పలకుఁలం జూచి మాటాడ • వలసినట్టి
బెట్టిదుఁడు మహాపార్శ్వుడన్ • వికృతకోపి, కలఁడు పదునాఱు కోటుల • బలమువాఁడు

తే॥ తలకుఁబై ప్రక్కసూర్యుచం • దంపుమోము, గలుగువా డెనిమిదికోట్ల • బలమువాఁడు
వజ్రదంష్ట్రుండు జమునకుఁ • బైని జముఁడు, శూలపాణి యసాధ్యుండు • సుకృతవైరి.

తే॥ చంచలతలేని పదికోట్ల • సైన్యములకు, దొర యసామాన్య బలుఁ డసా • ధ్యుండు యక్ష
సిద్ధ సాధ్యగుహ్యకులహిం • సించినాఁడు, మదయుతుఁడు పిశాచాఖ్యుఁడు • న్మత్తుఁ డొకఁడు.

తే॥ చదురుగల చతురంగముల్ • పదియు నాల్గు, కోట్ల సైన్యములకు నాయ • కుండు కొండ
లదర గర్జించువాఁడు తి • ర్యక్ప్రచారుఁ, డధికకోపి దుర్ముఖుఁడను • నసురవరుఁడు

తే॥ నాయకుఁడగు పదికోట్ల సే • నలకు ఖడ్గ, యుద్ధమునఁ బ్రసిద్ధుండు వి • ద్యుజ్జిహ్వుండు
మాపె విద్యాధరులకీర్తి • మహిమ లెల్ల, ఘనబలుండు విరూపాక్షుఁ • డనెడువాఁడు.

ఆ॥ శవ సమూహముల శ్మ • శానంబునకుఁ బోవ, నీక పట్టి పండ్ల • నిఱుకువాఁడు
పద్మసంఖ్య సైన్య • పతి ధూర్తపరుఁడు ధూ, మ్రాక్షుఁ డొక్కరుండ • హార్యబలుఁడు.

తే॥ మందరముఁ బోలువారు దుర్మానయుతులు. కడలిఁబోలిన సైన్యంబు • గలుగువారు
వారి పేర్విన్న లోకము • ల్వడఁకుచుండు, రణ శిరుండు వ్యమత్తుఁడన్ • రక్కసేంద్రు.

తే॥ ఇట్టి యుద్ధవీరుల లెక్క • యిడఁగరాదు, వీరికంటె నిమ్మడి సేన • వెలయువాఁడు
సమర దోహలుఁడు సమస్త • సైన్యములకు, నధిపుఁడు ప్రహస్తుఁడను నిర్జ • రాంతకుండు.

తే॥ ఇంద్రుచౌదంతి దిగ్భ్రమ • మెనసి యేడు, సంభ్రమముల దాఁటి యవలికి • జావుపరువు
వెట్ట దిక్కున కొకరుగా • వేలుపులును, పఱుగులిడ శరవర్షంబు • గురిసె వాఁడు.

ఉత్సా॥ తఱిమి వెల్లదంతి నాల్గు • దంతములను వేరుతోఁ
బెఱికి వానితోడఁ గొట్టి • వేల్పు లెల్ల దెసలకున్
వెఱచి పఱవ నరుణ నగము • వెట్టి యెత్తి తిరుగు నా
కరణిఁ దిరిగి నతఁడు కుంభ • కర్ణుఁ డధిపు తమ్ముఁడౌ.

ఉత్సా॥ చంద్ర రవులఁ జెఱనువైచె • జయము వానిసొమ్ము తా
నింద్రుఁబట్టి కట్టువాఁత • లిప్పుడుం గనంబడున్
సాంద్రకీర్తి గొన్న వాఁడు • చాల మాయలొప్పు వాఁ
డింద్రజిత్తు రావణునకు • జ్యేష్ఠసుతుఁడు భూవరా!
చెనకి పాడివేల్పు తన్ను • చెఱచునంచు నెంచఁడున్
వనజభవుని వలన విల్లు • వరముగాఁగఁ బడసె వే
ఱనఘుఁ డింద్రుఁ డొకఁడు లేమి • నన్న పేరు దాల్పలే
దనఁగనొప్పు నింద్రజితున • కపరజుఁ డతికాయుఁడౌ.

తే॥ ముగుడు మూర్తు లెదిర్చిన • మొక్కవోని, యరిది సత్త్వంబు గలుగు దే • వాంతకుండు
త్రిశిరసుఁడు నరాంతకుఁడనఁ దిరుగువారు, రావణుని ముద్దు కొమరులు • రాఘవేంద్ర!

సీ॥ అసురేశునకు సహా • య బల మిట్టిది వాని, దార్ఢ్య మెఱింగి నం • దాఁక వినుతు
నజుని పుత్త్రుండగు • నల పులస్త్యుని పట్టి, సుకృతియౌ విశ్రవ • సుని సుతుండు
బలు తపంబున బ్రహ్మ • వలనను హరు వల, నను వరాలొంది యు • న్నతి గడించెఁ
బంచభూతంబులు • పాంచ భౌతికములు. నతని స్వాధీనంబు • లై యడంగుఁ

తే॥ బార్వతీ పరమేశ్వరుల్ • భక్తి పాల, నంబు వొంటె వేంచేయఁగ • నలువుమీఱు
వెండికొండను పాదుతోఁ • బెల్లగించి, నింగి దాఁకంగ నెత్తిన తుంగబలుఁడు.

తే॥ దిగ్గజంబుల దంతముల్ • విఱిచి భుజము, లందు డిగ లెక్క సేయని • యతిబలుండు
సుర గరుడ యక్ష సాధ్యకిం • పురుషనాగ, వరుల దెసచెడి పాఱంగఁ • దఱిమినాఁడు.

తే॥ మణి కిరీట మస్తకములు • మహిని కూలఁ, గాల కేయూర భుజములఁ • దూలఁజేసె
రావణుని పేరు విన్న మా • త్రాన నిపుడు, నచటికొంతల గర్భంబు • లవియుచుండు.

మ॥ ఘన రాజ్యేందిరయున్ మహానిధులు లం • కా రాజ్య సర్వస్వమున్
ఘనతం గోల్పడి బెబ్బులిం గనిన జిం • కం బోలెఁ బొర్లాడి భీ
తిని రాజ్యంబును పుష్పకంబు నెడగా • దీనత్వముం బొంది యా
ధనదుం డిప్పుడు దాఁగినాఁ డలకలో • దైత్యాన్వయాయాంతకా!

ఉ॥ త్రాణచెడంగ వీఁపునయి • రక్తము లొల్కెడు పుండ్లఁ జూచుచున్
బాణ విఘాత జాత హతిఁ • బాల్పడి యోర్వక యంశకుండు స్వ
ప్రాణములన్ హరించునని • పాటి దినంబులు లెక్కగొంచు గీ
ర్వాణ విరోధి నామమె జ • పంబొనరించుచు నుండు రాఘవా!

క॥ తరణి వణకేల చెప్పఁగ, వరుణుని కన్నులను చొచ్చి • వడఁకయవు లంకన్
వరుణుఁడు పాశముఁ గోల్పడి, శరణముకై వడిగఁ బాఱి • జలధిం దూఱెన్.

ఉ॥ కొండలు పిండిసేయ రణ • కోవిద కర్కశ బాహు దండముల్
కొండొకయు న్నలంగని య • కుంఠిత విక్రమశాలి రావణో
ద్దండ పరాక్రమంబు తుది • దాఁక వచింపఁ దరంబె? నీదు కో
దండవిముక్త బాణ శర • దంబునఁగాక నశించునే యెటుల్?

సీ॥ పావనిచేఁ గోట • వాకిటి తోరణ, స్తంభంబుచే బల • దర్పులైన
దనుజులు చదిసి చ • చ్చినవారు సంభ్రమపు, టిసుకకంటెను లెక్క • కెచ్చువారు
తదితరుల్ వ్యాఘ్రంబు • తఱుమంగఁ బాఱిన, జింకలక్రియఁ జెల్లి • చెదరినారు
రక్త మేదో మాంస • రాసులు ప్రేవుల, ప్రోవు లెల్లెడలను • తావుకొనియె
తే॥ వీఁకతోఁ దాకు నక్షుని • విఁడితోడఁ, బట్టి నేలకు రాచిన • ప్పటి యసహ్య
పలల మస్తిష్క శోణిత • పంకమింక, నాఁటికున్నది వర్ణించి • తెలుపనేల?

క॥ అమరుల నగరముతో మా, నము చూఱలు చేసినట్టి • నాయకులను సై
న్యములను చుట్టంబుల ప్రా, ణములఁ జెఱచె దంతి చెఱల • నలఁచిన భంగిన్.

చ॥ ఎనుబది వేల సైనికు ల • హీన బలాఢ్యులు కింకరాఖ్యుల్
హనుమని తాఁకఁగా బెగులు • నాఁకలిగొన్న మృగేంద్రు కైవడిన్
గినిసి పరాక్రమించి పడిఁ • గేలను కాలను వాలుతోడఁ గూ
ల్చెను త్రిపురాసుర వ్రతతి • లీలను రుద్రుఁడు త్రుంచువైఖరిన్.

ఆ॥ జంబుమాలి గొప్ప • సైన్యంబుతో వచ్చి, యంపవాన గురిసి • హనుమ భుజము
నొంచ నితఁడు వాని • యంచిత ధనువుచే, తనె కృతాంతు వేశ్మ • మునకు నంపె.

తే॥ కనక దుర్గ వేష్టితము లం • కాపురంబు, నందు నలఁగి తలలు పోయి • నట్టివారు
లెక్కలేరు హనుమ గాల్ప • లేచినట్టి, యగిని రక్తప్రవాహంబు • నిగురఁజేసె.

తే॥ నాఁడు దాల్చిన విడులు చం • దనము నగలు, పక్షములు మార్చకుండి న • భంబునంద
యేడు దినములు నిలిచె లం • కేశ్వరుండు. నగరి కాలిన తెఱఁగును • పొగడనేల?

తే॥ నగరిఁగూర్చికోటలఁగూర్చి • తగినరీతిని, వినిచితిని లంక కాలిన • పిదప దేని
యాజ్ఞచే బ్రహ్మ మునుపటి • యట్లె సృష్టి, చేసియున్నాఁడు జానకీ • చిత్తనిలయ!

ఉ॥ ఆలమునం దెదిర్చిన ఖ • రాదులఁ గూల్చుటచేతఁ గాద య
వ్వాలి నమోఘబాణహతి • వ్రాల్చుటచేతను గాద సంగరా
భీలుఁడు వాయుసూతి తొలి • వేల్పుల మూఁకలఁ గూల్చుటల్ పురిం
దేలిక నగ్ని కాహుతిగ • దీల్చుట నమ్మిక గొల్పవచ్చితిన్.

ఉ॥ స్నేహముచే నెలర్చిన వి • శిష్టగుణుండు విభీషణుండు సం
దేహము లేని తేవ నిగ • దించిన పల్కుల నాలకించి వై
దేహిని పాయు హేతువున • దీల్పడి సన్ననయైన బాహువుల్
దేహముతోడ నుబ్బ జగ • తీపతి మారుతిఁ గాంచి యిట్లనున్.

సీ॥ వీరవరేణ్య! వి • ద్వేషి సైన్యంబులో, నగముపైఁబడ నీవ • చంపివైచి
రావణుపురము పూ • ర్ణంబుగాఁ గాల్చి నీ, ఘనపరాక్రమము నే • వినుచునిండ
శుకవాణి జానకిఁ • జూచి తోడ్కొని రాక, మరలుట చూడ నా • శరబలంబు
తెలిపింపఁగోరి యి • త్తెఱఁగున వచ్చితి, వని మనంబున నెంచి • తనిసినాఁడ

తే॥ నీవు చూపిన మగఁటిమి • నిండియున్న, వైరి నగరాన మఱికొన్ని • వీరకృత్య
ముల నొనర్తము గాని నీ • పొగడు నెదుట, భాను నెదుటి దీపమువలెఁ • బ్రబలఁగలదె?

తే॥ మద్బలంబును రావణు • మహిత బలము, నీదిగాఁ జేసికొంటివి • నిపుణచరిత!
వనజభవుపద మీజన్మ • మునకుఁ బిదపఁ, బడయుమా నీకుఁగాఁగ నే • ర్పఱచినాఁడ.

చ॥ అని రఘురామమూర్తి పలు • కాడఁగ నంజలిచేసి యంజనా
తనయుఁడు సిగ్గునొంది వసు • ధాస్థలిఁ జూచుచు నూరకుండె నె
మ్మనముల నుబ్బి ముక్తిగొను • మాన్యులభంగిని మోదవార్ధిలో
మునుఁగుచు నోలలాడి రిన • పుత్త్రుఁడుఁ దక్కిన కీశబృందముల్.

## 6. వరుణ ప్రార్థన పటలము. (75)

సీ॥ ప్రథిత విజ్ఞానసం • పన్ను! విభీషణ! కడలి కట్టునకు లోఁ • బడునయేని
మూఁడు లోకములును • భుజబలంబున నడ, చుటయు నాశంబు సే • యుటయునరుదె?
ఉత్సాహవంతమై • యున్న యీమనసేన, జలధి దాఁటుట యెట్లొ • తెలుపుమనఁగ
మఱువడియున్న నీ • మహిమంబు నెఱుఁగఁడీ, శరధి మీకులము సా • గరుల వలనఁ

తే॥ ద్రవ్వఁబడెఁ గానఁ బ్రేమ వ • రం బొసంగు, మనము దాటంగ మార్గమి • మ్మని సముద్రు
వేఁడు టుత్తమ పద్ధతి • విమల హృదయ!, యని విభీషణుఁ డాడంగ • నాత్మ నలరి.

తే॥ లెస్స వచియించి తంచుఁ దా • లిమిని పొగడి, అర్కసుత విభీషణ పవ • నాత్మజాదు
లెల్లఁ గ్రేవల రా నాప • గేశతీర, మునకుఁ జనునంత నినుఁడును • పొడమెఁ దూర్పు.

తే॥ వేఁడి వెలుఁగుచేఁ జీఁకటుల్ • విరియునంత, షోడశ కలాప్రపూర్ణుఁడౌ • సుందర శశి
యరయ రాహువు మ్రింగి వె • ల్వఁఅచుచున్న, చందమునఁ దోఁచెఁ గాంతులు • సమసిపోవ

మ॥ యువతీరత్నము సీతఁ దెచ్చుటకునై • యుర్వీశ సింహుండు రా
ఘవ చంద్రుండొక త్రోవ యిమ్మనుచుఁ గాం • క్షన్ వేఁడఁగాఁ గోరి శా
స్త్ర విశిష్టంబగు పద్ధతిం జలువు ద • ర్భాస్తరంబందు వే
డ్క వసించెన్ జపియించె శ్రద్ధ వరుణాం • కంబైన సన్మంత్రమున్.

ఉ॥ మేనఁ బరాగముం బొలయ • మిక్కిలి యెండ మొగంబుపైఁ బడన్
జానుగఁ గన్ను మోడ్చి యొక • జాము యుగంబుగఁ దోఁప నేఁడు నా
ళ్లూని వసించి తోయములు • నోగిర మంటక వేఁడ నీరధీ
శానుఁడు సంతసింపఁడు ప్ర • సన్నుఁడు గాఁడును పల్కరింపఁడున్.

మ॥ బలవంతుండయి యీ నదీశ్వరుఁడు నన్ • భంగించుచున్నాఁడు ని
శ్చలితుండై యవుఁ గాదనఁడు మది నా • సంతాపముం గానఁ డీ
లలి భీష్మించుచు దాఁగినాఁడని కృపా • లంకారుఁ డా రాముఁ డ
గ్గలికన్ జూచెదనంచు వంచె బొమ లు • గ్రక్రోధ దుర్వీక్షుఁడై.

ఉ॥ కోరనివారలైన నొక • కోరిక నొక్కనియొద్దఁ జేరుచున్
గోరికిఁ దెల్పఁగాఁ బిసిని • గొట్టు స్వభావగుణంబు వీడునే?
వారిధిఁ ద్రోవ యిమ్మనినఁ • బల్కఁడు చూడఁడు మేలుమేలు! నా
ఘోరశరాళికింత రుచి • చూపెదఁ గాకని నవ్వెఁ గిన్కమై.

ఆ॥ దైత్యుఁ డపహరింప • దారను గోల్పోయి, పరువుచెడిన వింటి • బరువు మోసె
ననుమ నెంచి చుల్కఁ • దనము చేసినవాఁడు, గావలయును జడధి • కరుణమాని

తే॥ తోడుపడికొంట పొగడిత • తోడఁ గొనుట, బలిమిగైకొంట యనుమూఁడు • పద్ధతులె జ
గంబునం గల్గు; వేఁడియు • గౌరవంబు, పాడిచెడ దాఁగెఁ బలికియు • ఫలము గలదె?

తే॥ అడవులం జొచ్చి కాయలు • నాకులు తిని. యొడలు పెంచువాఁడనియెంచు • జడధి గొప్ప
తనము నల్పమానవుశక్తి • తగ్గు హెచ్చు, లెఱుఁగుదురు గాక వేలుపు • లెల్లనింక.

ఉ॥ నింద యటంచు జంకి ఘన • నిష్ఠను వేఁడఁ దిరస్కరించి న
న్నెందున గాక చూచిన • దీశ్వరు లేద్వురు మండి మాఁడఁగా
దెందమునందు పుట్టిన క • డింది భయంబునఁ బంచభూతముల్
సందడిఁ బ్రాణభిక్ష గొని • సాగఁ జరింతురు గాక వానరుల్.

ఉ॥ మోక్షము నొందినట్టి ముని • ముఖ్యులె యైనను చూచు వేడ్కతో
నీక్షితిఁ జేరిరేని ధన • హీనత గాంచిన యంత గౌరవ
ప్రేక్షణముల్ వహింపఁ గన • రెవ్వరు; రుద్ధరయున్నఁ దేలెఁ బో
గక్షములెందునే నిధులు • గన్పిన నిప్పును లెక్కగొందురే!

ఉ॥ వనచరులెల్లఁ గాల్పడిరె • వారిధి దాఁటుదు రింక లక్ష్మణా!
ధనువిటు లెమ్మ యంచుఁ గడు • దారుణ కోప పరీతచిత్తుఁడై
కనఁ దన తమ్ముఁడెట్టినగు • కన్నులతో ఘనచింతతో శరా
సనము నొసంగ రాఘవుఁడు • సవ్వడిగాఁగ గుణంబు నెక్కిడెన్.

ఆ॥ ధనువు నెక్కువెట్టి • గొనయమ్ము లాగఁగాఁ, గలిగినట్టి పేరు • టులివు హరుని
కొమ్మ యొందు ప్రణయ • కోపంబు సడలించె, జగము లొక్కసారి • సంచలించె.

ఉ॥ మేలగువానిలో మిగుల • మేలగు యూపుల వర్షధారలం
బోలి యుగాంతకాలమున • భూమి జలంబులఁ బ్రావు భాస్కరుం
బోలి పురారినేత్రమును • బోలి మహాలయ కాల పావకుం
బోలి సముద్రమెల్ల నొక మూర్తము లోపలఁ గ్రమ్మె దండడిన్.

సీ॥ కులశైలములకంటె • బలమైన కోదండ, మును మండలాకార • ముగను వంచి
నిఖిల చరాచర • నికరంబుఁ బ్రళయ వే, ళను కాల్చు నగ్ని కీ • లలకు మించి
నగములు మత్స్యముల్ • నాగు లింధనముగా, తటతటంబులు చిన్న • చిదుగులుగను
కదలి నీరము నెయ్యి • గా రామబాణాగ్ని, గొలల వారిధి యగ్ని • కుండమయ్యె

తే॥ నేడు జలధులలోఁ బొగ • లెగయఁగా న, భంబుఁ గప్పుచుఁ జక్రవా • ళంబు నవలి
చిమ్మచీఁకటిఁ బోఁగొట్టి • బమ్మగోళ, మగ్నిగోళమయ్యెఁ బో • యనఁగఁ జేసె.

క॥ నెఱఁకులు చుఱుక్కుమనఁగాఁ, జొఱమీఁను చొక్కి యొఱఁగ • సురతరువులు చి
చ్చుఱ పిడుగులక్రియఁ బడుతుం, పఱచె షూఁడంగ రామ • బాణము లడరెన్.

క॥ మిడుఁగుఱులతోడి జ్వాలలు, పొడమఁగ బొగ్గులయి రాలె • మొగుళుల గములున్
జడధి బడబాగ్ని పలెఁగా, వడిఁ గమరె నటించు వేల్పు • పడఁతుల కురులున్.

తే॥ లెక్కఁబడరాక నెత్తురుల్ • గ్రక్కి తేలె, మకర నికరంబులును పెక్కు • మడిసి తేలి
కెరలెఁ బసు తిమింగిల తిమిం • గిలగిలములు, రామశరములు, వారాశిఁ • ద్రచ్చికాల్ప

తే॥ బూది యెగయంగ నగ్నులు • పుట్టి కొంద, లన్నియుం [illegible] వేకోట్ల • యంపగములు
చొరఁగ నదులతో బురదతో • శరధి మాఁడెఁ, బాఁపజేని తలలు గాన • వచ్చెనంత.

తే॥ మాటదప్పిన మూకదొడ్డ • మనుజకులము, సరణి నిర్మూలమయ్యె మ • త్స్యముల కులము
స్తంభములతోడ నావలు • జరగునట్లు, వీఁపుపై బాణములతోడ • వెలసె మీలు.

తే॥ శ్రేణులై సిత శరములు • చెలఁగుకతనఁ, గొన్ని యుడుకుచుమాఁడి బొగ్గులయి బూది
యయ్యె నల్లతో బాణాగ్ను • లలముకతనఁ, గంధి యొప్పె సంధ్యాకాల • గగనమనఁగ.

తే॥ రామ శితసాయకాగ్నులు • త్రావ నీర, మున్నదో లేదా యనఁనొప్పు • నుదధి యొక్క
క్రమిదఁ బోలఁగ నేతిలోఁ • గ్రాఁగినట్టి, వానిఁబోలెను జలచర • ప్రతతి చూడ.

తే॥ శిత శిలీముఖములు రక్త • సిక్తముఖము, లగుచు జలమెల్లఁ ద్రావర • త్నాశిబయలు
పడఁగ జడనిధియుడుకు చా • ర్వంగరాని, మిడుఁగుఱులఁ జెదర్చుచునుండె • మితముమీఱి

తే॥ ఎల్లయెడ బయలుగ జల • మింకిపోవ, సంబరువువైచి దుంపలు • శాకములును
పరుగులుగఁ జేసి యుంచిన • కరణినొప్పెఁ, గ్రొవ్వినట్టి మత్స్యములును • కూర్మవితతి.

తే॥ ఉలివుతో వచ్చు బాణమ్ము • లొండొకండు, దాఁకి వెదురుటడవిఁ బోలె • దవము రేఁప
నెల్లజంతువు లుడుకుచుఁ • ద్రెళ్ళుచుండె, నవ్వి క్రక్కిన శోణిత • మలలు పాఱె

ఆ॥ కొండగములనుండు • కుజములు తుండ్లయి, కడలి జలము పైనిఁ • బడుచునుండ
మండుచుండెఁ జమరు • మఱిమఱి చల్లండ, నాఱకుంగ మండు నంగమునను.

తే॥ రామవిభుఁడు పరపు శర • స్తోమ మజుని, యస్త్రమట్టు లమోఘంబు • లగుచు మనసు
కంచె వడియయి మిడుఁ గుఱుల్ • గలుగఁజేయ, గొప్ప పద్మాకరము క్రియఁ • గొఱలె శరధి.

తే॥ ఉత్తములు కోపగించిన • నొదవు మేలె, యనుట పిచ్ఛోట దృష్టాంత • మయ్యె వార్ధి
యుప్పుకడలి యనెడిపేరు తప్పి శుద్ధ, జలధియయ్యెను శ్రీరాము • చలము కతన.

చ॥ క్రమముగ నండగోళములు • గర్భమునం గొని కాచు విష్ణు నం
శమగు రఘూద్వహుం డసదృ • శ ప్రదరంబులచేఁ బయోధి తో
యముల నశింపఁజేయు టొక • యద్భుతమొః లోకములన్ జలంబు నీ
రములను వహ్ని మ్రింగునను • ప్రాక్తనవాక్యము నిల్పె గట్టిగన్.

చ॥ చిరముగ వార్ధిలోనన ప • సించుచు శ్రీశుని పాదచింత ని
బ్బరముగఁ జేయుచుండు బుషి • వర్యుల కెగ్గొక యింత లేద; యు
ద్ధురముగ నన్ని దిక్కులను • ధూమ సమూహము పర్వ దట్టమై
తరణి గుణాలు నల్లనయి • దారి తడంబడ నిల్చె దిగ్భ్రమన్.

చ॥ దురమున భీకరుండయిన • తోయజనేత్రుఁడు మా యవస్థ దా
నరసియు లెక్క సేయని య • నార్యుని పోలిక నుండెనంచు నం
బరమున సంచరించు జల • పక్షులు పెంటులఁ బాసి చింతమైఁ
గరఁగుచు నిప్పుముట్టి యెఱ • కల్ గమరం బడి చచ్చె నంబుధిన్.

ఉ॥ ఓరుపు వీడ హేతువయి • యొప్పిన వారిధి నిప్పు నిండఁగా
బేరిచి వేణు కాననము • వీఁక వహింప వచింపఁ బోలునేః
తోరపుఁ బేర్పులై యడరు • ధూమ సమూహము చుట్టుకొంటచే
నాటిచెఁ గన్నుదోయి నమ • రావళి మేనులు చెమ్మరింపఁగన్.

సీ॥ పూలపైనను పోవఁ • జాలని మృదుపద, కంజాత జానకి • గతులకోడి
యవమతి నొందిన • హంసలెల్లను వహ్ని, నెఱయన్ని త్రోవ గా • న్పింపకుంటఁ

బలువఁ జాలనివయి • వరుణుని కీర్తి కై, పడి బడధింబడి • యడఁగి పోయె
మొగుళులు మండెడు • నగముల కై పడి, నింగి నిల్వఁగలేక • క్రుంగిపడియెఁ

తే॥ జచ్చి చచ్చి కూలఁగఁ గొన్ని • చాపడుండుఁ, గొన్నిపులుఁగులు గుడి దిరు • గుచును పొగలు
గ్రమ్మగ్రుడ్లు పెట్టిన చోటు • గానలేక, ముత్తెములఁగాంచి భ్రాంతిచేఁ • బొదుగఁజేరు.

మ॥ జలజాతేక్షణు రామచంద్రు నరుగాఁ • సామాన్యుగా నెంచియే
చులుకం జూచితి మింతవచ్చె ననుచుఁ • శుష్కించుచుం బెక్కు సి
ల్గిలకున్ లోనయి పండ్లిగుల్చుచును ది • క్కుల్ దోఁప కల్లాడుచున్
జలశాఖా మృగసంచయం బడలెఁ బ • శ్చాత్తాపముం బొందుచున్.

ఆ॥ దుష్టకార్యములను • తూకొని చేయుచు, సంద్రమందు దాఁగి • సంచరించు
చుండునట్టి వార • లుగ్ర మాంసాశను, లట్టె యుడికి తెట్టె • గట్టినారు.

తే॥ గొప్ప పైఁడి విమానముల్ • కుండ లవిసి, పిదపఁ గరఁగుచుఁ బడినని • వేల్పుటేటి
దండిజలము తుంపురులతో • వండుగట్టి, యెండె నుడు గణ ముడుకుచు • నిళకురాలె.

తే॥ చేవ గలవి నిప్పులు రేఁచు • తేవ గలవి, పద్ధతిం జనునవి తప • స్సిద్ధి గలవి
పెక్కురూపముల్ గొనునవై • విశిఖ వితతి, కంధి జీవన మానె న • గస్త్యుఁబోలి.

క॥ వనధిఁ బొడము నగ్గిని దై, త్యుని పురిలోఁ బ్రహరి కరఁగ • నుప్పరిగలు మం
డినఁ గని పౌరులు పదపడి, హనుమానుఁడు వచ్చెననుచు • నదలిరి పెలుచన్.

తే॥ ఉదయభానునివలెవెలుఁ • గొందుచుండు, మలత్రికూటంబుబంగరు • మూడ్కిఁగరఁగి
శోణితము పడనయ్యెఁగిం • శుకము కరణిఁ, బొనుఁగువడి ప్రవాళంబులు • బొగ్గులయ్యె.

తే॥ కులగిరులవంటివగు కొన్ని • గొప్పమీలు, నెలవు నెమ్మదిచెడి లోఁతు • నీటికేగి
జలముకంటెను వహ్నియే • చల్లనైన, దంచు భూమిపైఁబడి తత్త • రించుచుండె.

తే॥ కదలి కలగుండు వడ నుద • కములఁ ద్రావి, మఱియు నీరు లేకుంటచే • మనుజులెల్ల
దిగ్భ్రమమునొందఁ బాతాళ • తిమిరచయము, తలఁగనేగె నారాచముల్ • తపనుభంగి.

తే॥ అంబుధులలోని యుప్పునీ • రంబుఁ ద్రావి, చాలదగయెత్తి శ్రీరామ • సాయకములు
త్రావ నీరులేమిని యండ • తతులఁ దొలిచి, కొనుచు వడినేగె నందలి • వననిధులకు.

ఉ॥ లీల నయోముఖంబుల శి • లీముఖము ల్గల రామబాణముల్
వాలి సముద్రమున్ బయలు • వాఱఁగఁ జేయఁగ రత్నసంతతుల్
చీలిన భూమి గర్భమునఁ • జిందెడు రక్తము రీతి వెల్వడెన్
మీలును నాగజాలములు • మేవిన ప్రేవుల తేవఁ గన్పడెన్.

తే॥ అంబువులు వట్టిపోవ ర • త్నాకరములు, భాగ్యశాలి మణులు నించు • భవనములను
పోలె నారసములు చింద • ములకుఁ బొడుచు, కొనఁగ నయ్యవి యబకల • కొమరుదాల్చె.

తే॥ వేలకొలఁది చీలికలయి • విద్రుమములు, మౌక్తికంబులు రత్నముల్ • మలసె జగతి
గొప్పవారు కోపించినఁ • గోపగింపఁ, బడినవారు మేలొందక • చెడుదురేమి?

క॥ సలసలఁ గ్రాఁగిన యాజల, ములఁ జచ్చిన జీవవితతి • ముక్తిని పొందెన్
జలజాక్షునిచేఁ జచ్చిన, యలుపులకును ముక్తిదొరకు • టరుదే తలఁపన్?

తే॥ అనల శరములు-మిక్కిలి • యలమికొనఁగ, ధారణీదేవి నీలంపుఁ • జీర విడిచి
యెఱ్ఱపూల రంగులతోడ • నెలమి గులుకు, చీర నడుమునఁ గట్టిన • చన్నుదోఁచె

తే॥ విజయ శీలుఁడౌ రాఘుని • విశిఖ వహ్ని, త్రావినట్టి కడలి వీడి • తావు వేఱు
వెదకికొన లేమక్రియ విజృంభించె బడబ, యితర పాండితి మెచ్చు పండి • తులె·యరిది.

తే॥ జగము నడఁగింపఁకొని యాక • సంబు గూడ, నలమి బడబాగ్ని యప్పుడు • విలయవేళ
లోకముల నాశమొనరింప • వీఁకలేచు, పెను మహార్ణవ మట్టులు • పెఱిగి లేచె.

తే॥ ఊర్ధ్వముఖమై పురాణించి • యుడుకుచూపఁ, గ్రతుభుజులులేచి సత్యలో • కంబు దనుక
వెడలుచుండిరి వేఁడిమి • తొడఁకనీక, యింక భూజనములఁ గూర్చి • యేమిచెప్ప?

తే॥ జగము సిలుగొందునని యెంచఁ • జాల నిపుడు, వరుణు నిచటికిరప్పించు • వాఁడ ననుచు
నధిక కోప సంయుక్తుఁడై • యవని విభుఁడు, చెలసి బ్రహ్మాస్త్రమును కుడి • చేతఁ గొనియె

క॥ వడఁకిరి వేల్పులు మొగుళులు, పిడుగుల వెదలించెఁ బుడమి • బీఁటలువాఱెన్
తడఁబడి జీవులు వెలవెల, పడియెన్ నదులెల్ల నింకి • వందలి గట్టెన్.

ఆ॥ అండగోళమునకు • నావలి జలధులే, యఁడికెనన్న భూమి • నున్న వానిఁ
జెప్పనేల? మఱిఁగె • శివుని జటాగంగ, యజు కమండలు జల • మల్లనుడికె.

ఆ॥ లోకనాథుఁడైన • కాకుత్స్థ వర్యుని, యరయలేక నుసలె • వరుణుఁ డిట్టు.
లితనికంటె మూర్ఖు • లెవరని ప్రాజ్ఞులు, తలఁచి చింతనొంది • తల్లడిలిరి.

చ॥ తలఁపునఁ జేసి తొట్టతొలు • తన్ దనుదానె సృజించికొంచు న
వ్వల జగముల్ సృజించి పరి • పాలనసేయు విభుఁడు కోప మ
గ్గలముగఁ బూనె నింక బ్రతు • కం గలవారమె? యంచు నెల్ల ప్రా
ణులు తపియింపసాగె పరు • ణున్ శపియించుచుఁ బ్రాణ భీతిచే.

## వరుణుఁడు రాముంజేరి శరణు వేఁడుట

మ॥ పొగచేఁ జూడఁగలేని నేత్రములతోఁ • బుంఖానుపుంఖంబులై
తగులం బాఱిన మేని బాణములతో • దైవాఖు జ్వాలాళితో
దిగు లిగ్గాడు మనంబుతో వణఁకుతో • దీల్పడ కేల్మోడ్పుతోఁ
దగు వేడ్కోలులతో సముద్రపతి సీ • తానాథుఁ జేరెన్వడిన్.

తే॥ కడలి కడపలనుంటి లెం • కనగు నేను, గాన నీపిల్పు విననైతిఁ • గరుణఁజూడు
మనుచు విప్పపై నడతెంచు • జనుని పగిది, నలలపై వచ్చె నడచుచు • జలధిఱేఁడు.

మ॥ సురుఁగన్ మాఁడిన మోముతో వెగపుతో • గోఁకంబుతో నన్యథా
శరణం నాస్తి యటన్న వాక్యములతో • శంకించుచుం గ్రుద్ధి పై
ఖరిఁ దొట్రిల్లుచుఁ గ్రుంగు పాదములతోఁ • గాన్పించు నబ్ధీశు ద
క్కరుణావారిధిఁ గాంచి యిట్లనియె ను • త్కంపంబు హెచ్చిల్లఁగన్.

సీ॥ లోకేశ నీవె యీ • లోకఁ గోపించిన, మాకేది శరణ మీ • లోకమందు
నీకసాధ్యం బేది? నిన్నెదిరించు స, త్త్వము మాకుఁ గలదె? ని • త్యప్రకాశ
నీరధు లీవ య • గ్నియు నీవ విలయంబు, నీవలననె కదా • నెగడుచుండు
లోకంబులును నీవ • లోకాంతరస్థభూ, తంబులు నీవ త • త్త్వంబు నీవ

తే॥ జగములను వొడమించి ర • క్షణము సేసి, యుదరమునఁ బదిలంబుగ • నుంచుకొందు
నీవు కినిసిన లోకముల్ • నిలువఁగలవె? సర్వలోకాంతరాత్మక • శరణు శరణు.

తే॥ దిగ్భ్రమకుఁ గారణంబగు • తిమిరవనముఁ, గిరణ ఖడ్గంబుచేఁ ద్రెంచు • తరణిలోన
నుండు జ్యోతివి బ్రహ్మదు • లొందఁ గలుగు, పొక్కిలి గలట్టి ప్రాక్తన • పురుష! శరణు.

తే॥ సర్వ భూతాంతరాత్మక • శరణు శరణు, సకల భూతకారణ భూత • శరణు శరణు
సాధు జనచయ సంత్రాణ • శరణు శరణు, సామజేంద్ర సంరక్షణ • శరణు శరణు.

తే॥ తల్లియును తండ్రియును సమ • స్తంబు నీవ, మోక్ష నరకము లాద్యంత • ములును నీవ
యేను దాస దాసుండ ని • న్నెఱుఁగఁగలనె? నిన్ను నీవ యెఱుఁగకుందు • నిష్కలంక!

ఉ॥ నేరక పిన్న వార లొక • నేరమి చేసిరయేని పెద్దవా
రోరిచి బుద్ధి చెప్పఁదగు • నో జననాయక! కావుమంచు మే
ల్హారము సూర్యతేజ నిభ • మైన దొకండు ధరిత్రినుంచి యా
సారసనేత్రు పాదముల • సన్నిధి వ్రాలె నిలాతలంబునన్.

తే॥ వ్రాలి మంటలతోడి గా • త్రంబు చూపి, పిచ్చుకపయి బ్రహ్మాస్త్రంబు • విడువఁ దగునె?
యనుచు వేఁడ రాముని కోప • మంతరించె, పొంగు పాలలో నీర్వడు • పొలుపుదోఁప.

క॥ కోపము వీడితి భయమును, తాపంబును విడుము భక్తి • తాత్పర్యములం
బ్రాపింప వేఁడ రాకిటు, కోపింపఁగ వచ్చు కతము • కోరెదఁ దెలియన్.

చ॥ అన వరుణుండు రాముఁగని • యార్య! భవత్స్తుతి శాంతరూప యీ
జనకజ చెందినట్టి యగ • చాట్లును నీవును కోరి పిల్చుటల్
మును విననైతి నేదవ స • ముద్రమునం గల మీలు కయ్యముం
బెనుపఁగఁ దీర్ప నేగితి క్ష • మింపుము హేతువు వేఱు లేదిఁకన్.

తే॥ వరుణుపల్కుచే రాముఁడు • కరుణచెంది, యైననగుఁగాక యీయమో • ఘాస్త్రమునకు
దేని లక్ష్యంబు చూపెదు • తెలియఁబలుకు, మనిన బ్రతికితినని యాతఁ • డనియె నిట్లు.

తే॥ అనఘ! వినుమ మరుకాంతార • మనెడి దీవి, యందు దైత్యులు పలుకోటు • లమరినారు
జగములకు నాకుఁ బీడలు • సలుపుచుంద్రు, వారిపై నీ మహాస్త్రంబు • వదలు మనఁగ

క॥ పూతుఁడు శాస్త్ర జ్ఞానా, తీతుఁడు రాముండు విడిచెఁ • దివిరి శరంబుఁ
ఘాతుకులను పరిమార్చిచి, సీతాపతి కడకు నదియుఁ • జేరె క్షణమునఁ.

క॥ పరిశీలన గుణమొప్పఁగ, నెఱి దప్పకయుండు జనికి • నెగడునె కీడుల్?
వరుణనిపైఁ బొడమిన కఱ, కరి దుష్టులు రాక్షసులకె • కష్టము గొలిపెన్.

తే॥ చాలదూరము పోయి ము • ష్కరులఁ జంపె, శాంతమూర్తులౌ పెద్దల • శాపమట్లు
రామచంద్రు నమోఘ శ • రంబు జగతి, ధర్మమె బలీయమనుట సా • ర్థకముగాఁగ.

మ॥ జలధీశుం గని రాముఁడిట్టులను ర • క్షన్ వేఁడ మన్నించితిన్
బలుదుష్టుల్ దితిజాళి నాకగడు గూ • ర్పంబూని పాథోధియన్
పులుకాల్వఁ దమ కోటగాఁగొని మహా • మోదంబుతోఁ జేయు తాం
గలి నృత్యంబులు మానునట్టు లోక మా • ర్గం బీయవే పూకనఁ.

సీ॥ జగముల వ్యాప్తికి • సరుదులు లేనట్లు, లోఁతునకును వెడ • ల్పునకు మేర
లేదు నీరింక నె • న్నోదినంబులు వట్టు, నంతకాలము నిల్వ • నైతిగాదు
బండకై వడి ఘనీ • భావ మొందుదునన్న, మలఁగి నాలోని ప్రా • ణులు నశించు
నాపై విడిన వృక్ష • నగ శిలాదికములఁ, దొలఁగనీయక తేల్చి • నిలుపువాఁడ

తే॥ సేతు వొకఁడు నీపేర నా • శిరముమీఁద, నమర నీ సేన నడపింపు • సమరభీమ
రామ! సద్గుణధామ! దు • ర్జనవిరామ! శుభదనామ! మునిస్తోమ • సూక్తిసీమ!

సీ॥ అని వరుణుఁడు పల్క • విని సంతసమునంది, కాకుత్స్థ వర్యుండు • కడఁకతోడ
నీమహా సత్కార్య • మే చేయుదము వార్ధి, శ్రేష్ఠత మనచే న • శించెనేని
తక్కిన నాల్గు భూ • తములును చులక ద. నంబు నొందును గాన • నయముమీఱ
పర్వత ఘనవృక్ష • వారంబులం దెచ్చి, కట్టుఁడు సేతువు • గట్టిగాఁగ

తే॥ ననుచు వానర వరులకు • నాజ్ఞ యొసఁగి, యిరవునకు నేగ రాముని • కరుణతోడి
వీడికోలు గైకొని యబ్ధి • విభుఁడు పోయె, నుత్సహించిరి వనచరు • లుదధి గట్ట.

## —: 7 సేతు బంధన పటలము :—

తే॥ వానరేంద్రుఁడు రాక్ష సే • శ్వరుఁడు జ్ఞాన, సిద్ధులగు కపివరులు యో • చించి నలుని
పిలిచి సేతుబంధనము గా • వింపు మిదియ, యిపుడు ముఖ్య క ర్తవ్యమం • చెఱుకపఱుప

క॥ పలుమాటలేల మేరువు, నలుసును సమమగు తెఱంగు • నాణెంబుగ నీ
జలధిం గట్టెద విరివిగ, శిలలు తరులు గిరులు దేరఁ • జెప్పుఁడి కపులకున్.

క॥ అని నలుఁడన నజపుత్త్రుఁడు, వనధిని పూడ్పంగ రండు • వనచరులారా!
యని చాటింపఁగ వచ్చిరి, గొనకొని యొండొకరు త్రోసి • కొని యుత్సుకులై

తే॥ రామ లక్ష్మణ వానర • రాక్షసేంద్రు, లరుదుగాఁ జూచుచుండ వ • నాటు లెల్ల
భుజశిరంబులపై గిరుల్ • మోచితెచ్చి, రుదధులాతొక్కటిం బూడ్ప • నొలయుకరణి.

క॥ కొన్ని పెరలించుచుండఁగఁ, గొన్ని ప్లవంగంబు లిడ్చి • కొనివచ్చెను వే
కొన్ని శిరంబుల మోచెను, గొన్ని కదలి దించెఁ గొన్ని • కూఁతలు వెట్టెన్

క॥ కొన్ని దొరలించెఁ గాళులఁ, గొన్ని కరతలములఁ దెచ్చెఁ • గుండాడుచు వే
కొన్ని తమ వాలములతోఁ, బన్నుగ పీడ్చికొని వచ్చెఁ • బటుతరశక్తిన్

క॥ అనఘుఁడగు నలుఁడు వడిగాఁ, గొని తెండని త్వరపఱచుచుఁ • గొండల నొకచేఁ
గొని వరుసలుగాఁ బేర్చుచు, వనధిని కల్లోలపఱచి • వరఁకం జేసెన్

క॥ †కరుణాకరుఁడగు విడుపరి, శరణార్థుల రహి భరించు • చందమునఁ గపుల్
తొరతొరఁ దెచ్చిన కొండల, భరియించె నలుండు కార్య • భరణ నిపుణతన్

తే॥ చంద్రముఁడు కాళ్ళఁ దదవెడు • శైలములను, కెల్లగింపఁగ మేఘపం • క్తియును చెదరె
నందు దిరుగు యక్షిణులును • యక్షవరులు, పడుచు లేచుచుఁ దడఁబడి • పరుగులిడిరి.

ఉ॥ పాదగలించి గొప్పగిరి • పంక్తుల వీచుడు నొక్కటొక్కటిన్
మోఁదఁగ నిప్పుకల్ పొడమి • మున్కొని మాలిక లొచుఁ బోవఁగా
వేదనచెంది వెండి రఘు • వీరుని భీమ శరాగ్ని వచ్చె నే
మో దరికొంచు నంచు భయ • మొందె సముద్రవిభుండు చూచుచున్.

తే॥ కొండనగలించికొని గవా • క్షుండు తెచ్చి, గుభిలుమనవైవ నంబుధిఁ • గొఱలు మౌక్తి
కములు జలబిందువులతోడ • గగనవీథిఁ, జేరి నక్షత్ర మండలిఁ • గేరి వెలిఁగె.

చ॥ కరులు వసింపఁగాఁదగిన • కందర లున్న మహీధరంబులన్
ఉదధిని వైచుచుండ రభ • సంబున మింటికి లేచు ముత్తెముల్
వరుసలుగాఁగ నేర్పడుచు • వారిద పంక్తికి జల్లియయ్యె న
ప్పరుసు జలేజమిత్రునకు • వైచిన పందిరిఁబోలె నయ్యెడన్.

తే॥ వెదురుగుములున్న కొండల • విసరివైవ, నెగయు జలబిందువులఁ దడి • యెనయు వలువ
లంగముల కంటుకొనఁ గాంచి • యమర వనిత, లెదఁదలందున నాన వ • హించినారు

తే॥ పెను తరులతోడి కొండలఁ • బెల్లగించి, జలధి వైవఁగ బిందువుల్ • చాల దవ్వు
పోయి మరలుటచేత వే • ల్పుల జగమ్ము, వాన కురిసిన చందానఁ • బరిఢవిల్లె.

తే॥ కదలి మద వారణంబులు • పడుచునుండ, వాని మొసళులు గాంచి కా • ల్వట్టిలాగఁ
దొండములనెత్తిగీపెట్టి • తొల్లి గజవి, భుండు హరిఁగూర్చి మొఱవెట్టు • పోల్కినొప్పె.

తే॥ అలరులను తేనెవాఁకలు • నగురుచంద, నములుతక్కు గందంపు ద్ర • వ్యములుమిన్న
గప్పుచుం బడి దట్టంబు • గాఁగఁ బర్వ, శరధి నీచు వాసన వీడి • పరిమళించె.

తే॥ ఉత్తములకుఁ బూర్ణ వినాశ • ముప్పతిలిన, నైజమైన యుదార గు • ణంబు విడరు
ఫలతరులతోడి శైలముల్ • జలధిఁగూలి, మత్స్యములకుఁ దేనెలుపండ్లు • మాంసమొసఁగె.

---

తిరువెణ్ణెయ్ నల్లూరి జటప్ప నీవే శరణమని వచ్చిన వారిని భరించునట్లు. అని మూలము

తే॥ క్రమఫలములఁ దినఁ గాంక్ష • గలిగినోరు, తెఱచుకొని పేవలట్లు వా • శ్చరములుండ
బురదలోఁ బూఁడుకొని పోయె • గిరులు కొన్ని, యాచకులకీక దాఁచు లో • భులఁ బోలె.

ఉ॥ గాలిపటంబు కైవడిఁ ద • గం దిరుగాడు ప్లవంగముల్ మహా
శైలములం బెకల్చి రభ • సంబుగ నంబుధిపైవ దంతులన్
బోలఁగ నోట పైచుకొను • బుద్ధి భుజంగము లుండి చచ్చె మూ
ర్ఖాలి దొసంగెసంగు తతి • నైన వివేకము చెందనేర్తురే?

తే॥ తొండములఁ బెనవైచి దం • తులను తమ్మ, పట్టవచ్చు నక్రమ్ములఁ • గిట్టి పొడువఁ
గరులు మకరులు పోరాటఁ • గలిగినట్టి, విరవ మొప్పారెఁ జెవులు గిం • గిరులుపోవ.

తే॥ నిప్పు లురలంగఁ దాఁకుచు • నీరధిఁ బడు, భూమిధర శిఖరము లల్ప • పుణ్యముగల
జనములం బలె స్వర్లోక • మునకు నెగసి, నిలువలేక క్రమ్మఱిన వ • న్నియఁ జెలంగె.

తే॥ శరభ సింహ శార్దూలముల్ • శరధిఁ జొచ్చి, మీలచే నోడి గుటుకున • మ్రింగఁ బడియె
నున్నచోటు వీడిన నెట్టి • యున్నతులును, బన్న మొందుదు రల్పుల • వలనఁగూడ

తే॥ బుద్ధి పూర్వకంబుగఁ దోడు • పొనరకున్న, నుత్తముల సొత్తు బీదల • కొదవుచుండు
మింటికెగసిన చేఁపలు • వెంట నెగయు, కొండ తేనె ద్రావి కపుల • కొమరుక్రొవ్వె.

తే॥ మంచునీటిని చిందించు • మలలనుండి, దపమునిండ వెదుళ్ల చిం • దంగఁజేయు
ముత్తెములకు వారిధి మత్య • ముల వలమురి, చిందములను ప్రేమంబున • విందుచేసె.

ఉ॥ అంబరమంచితంబులగు • నదుర్లఁ దెచ్చి కపీంద్ర సంఘముల్
డంబుగవైవ నందలి జ • డంబులు పొంగి ధరిత్రి ముంపఁగా
నంబుధి పంబు భూస్థలియె • యయ్యె ధరాస్థలి సంద్రమయ్యె లో
కంబున దుర్ఘటం బొకటి • గల్గునె? తారక నాముఁ డెంచినన్.

తే॥ దట్టముగఁ బడు కొండలం • దలి మృగేంద్ర, శరభ శార్దూల సంఘము • ల్దిరుగుకతనఁ
దీరభూమి యదిత్యక • తీరుదాల్చె, నిఖిలనాథుండు తలపఁ గా • నిదియుఁ గలదె?

తే॥ మేము తిననివే యిచ్చట • మిగులఁగలుగు, నంచుఁ దిండి మానినవి మృ • గాదులెల్ల
మెకములంటని నీర్వాని • మీలచేతఁ, దినఁగఁ బడనివి లేవు ధా • త్రీస్థలమున.

తే॥ క్రూరమృగములైనను పెంచు • వారియెడలఁ, దాలు ప్రేమను వీడంగఁ • జాలఁగలవె?
తమ్మసాకు కొండల వీడి • తరలమన్న, చందమునఁ బడె మెకములు • జలధియందు.

తే॥ తపము సుకరముగాఁ జల్పఁ • దావలములు, ఫలదములు చల్లనివి యైన • పర్వతముల
విడువలేక తోడనె పడఁ • దొడఁగినారు, బంధములఁ ద్రెంచినట్టి తా • పసులుకూడ.

తే॥ పదెదు కొండలయందున్న • పలలభుజులు, తలలఁ గేలుంచుకొనిచింత • యలమికొనఁగ
లంక కేగిరి కాణాచి • లంకె వీడి, జన్మభూమి యేరికిని దు • స్త్యజమకాదె?

తే॥ మునిఁగినట్టి మలలమీఁద • మునుఁగకుండు, శిఖరములఁ జేరి యుండిన • సింహ శరభ
వితతి గొప్ప సేతువునకు • వింతయైన, మాలిక లమర్చు తీరున • మలయుచుండె

ఆ॥ వైచు పర్వతములు • వనధిని మునిఁగెను, నీలపసుపు పచ్చల • శైలములను
శ్రమము లెక్కయిడక • చని తెచ్చియిచ్చెను, నుండినారు కొండ • యుత్సుకతను.

ఆ॥ భూమిదేవి వీఁపు • పెద్ద రంధ్రము పడఁ, బెల్లగించి తెచ్చు • పృథ్వీధరము
లందునుండి జాలు • వహులు ప్రేలె ధరిత్రి, ప్రేవులవలె గిరుల • వేళ్ళువలెను.

తే॥ పద్మరాగమయాద్రుల • ప్రక్క నీలి, రత్నమయమహీధ్రములు పే • ర్వ్రంగఁ బడఁగ
నెసఁగె రిక్తకంఠుఁడు సము • ద్రేశ్వరునకు, రఘువరుండిచ్చు రత్నహా • రం బనంగ.

తే॥ స్థిరనివాసంబు నాత్మకుఁ • దెలియువెవరు, యోగులంబలెఁ దోయధి • సుపలినట్టి
కొండచిలువలువడిఁ బాఱి • గుహలఁజేరె, నడఁగునేయెన్నఁడును గాఢ • యాచిమరులు.

తే॥ సేతు మహిమకు నొప్పుగాఁ • జెప్పఁదగిన, వేలు రావణమొందు భా • వింపుఁడేలః
రామ దూత వైచిన గిరి • వ్రజమువలన, స్వర్గముండేరె మీలును • జల కణములు.

తే॥ నీలఁ దేపున వైచిన • నీలనగము, జలధి యడుగు వఱకుఁదాఁకి • జలము పొరలి
నేలముంప జీవులు పాఱు • లీల గొప్ప, వలకలంబును పుట్టించె • గాటముగను.

క॥ మైందుఁడు వైచిన గిరిచే, సందరము జలంబు లాక • పం బొరసి పడన్
దొందరపడి దిగ్గజములు, మందరగతిఁ దిరిగెఁ జెవరి • మల్లటపడుమున్.

క॥ పూనిక లక్ష్మణుని శరము, లైనను తొలగింపరాని • యద్రిని బలభి
త్సూనుని కొమరుఁడు తెచ్చి య, నూనగతిన్ వైచె మఱియు • నుదధి గలంగన్.

క॥ హనుమని భుజమును పోలిన, ఘనగిరి భల్లూకరాజు • కడిమిం బెకలిం
చెను వనధివైచెఁ దుంపురు, లనువొందఁగ నెగసి పడఁగ • నమరుల తలలన్.

క॥ శైలము కుముదుఁడు వైవఁ గు, శిలవు లాస్యమున కనువు • చెడక ధ్వనించెన్
దమనగర దుంపురులు వడ, నమరుల కమృతాశ క్రొత్త • యై యుదయించెన్.

తే॥ పనసుఁ దేపున వైచిన • పర్వతములు, పిడుగులంబలెఁ బడుచుండ • వెగడు కుడిచి
యోర్వలేక స్వజీవిత • ముజ్జగింప, నిరశనవ్రతముం బూనె • నురగవిభుఁడు.

తే॥ లెక్కలేని భల్లూకము • లొక్కమొగిని, పెక్కుమలలను వైవ నొం • డొక్కదానిఁ
దాఁకి పుణ్యహీనుని ప్రయ • త్నంబు పోల్కిఁ, గకవికలుగాఁగఁ బడిపోయెఁ • గడలియందు

తే॥ బహుళ యోజన విస్తృతి • పరవియున్న, యొక తిమింగిల పృష్ఠంబు • వికలముగను
కొండయొక్కండు పడ నది • క్రుంగి యవలి, కేగఁ గొండయు జలధియు • నిమ్మదప్పె.

తే॥ నేర్పుతోడ నలుఁడు శిలా • నిచయములను, పొందికగ నిడి విఱిచి చే • ర్పుగను చేసి
మలలఁ బేర్చి యిసుక చల్లి • తలలుగాన, రాక కేలఁ దడవి యెత్త • రంబు నదుము.

తే॥ వానరులు తెచ్చు భూధర • పంక్తులెల్ల, నినుప కంబంబులం బోలి • యెసఁగు కేలఁ
గొనెడు నంతలోఁ దునకలై • కుఱుచలగుచు, నలరు నట్లుగఁ గాళ్ళతో • నలఁచి యడఁచు

లీల శైలముల్ మోచు వ • లీముఖములు, పోవఁ జోటు లేకుండ స • ముద్రమందె
గాక తలలమీఁదనె యొక • గట్టిసేతు, వానరి యున్న చందంబున • నొప్పుమీఱె.

పెద్దకొండలఁ దాల్చిన • పెక్కుకపులు, వరుసలై నిల్వఁ దక్కిన • వారు పోవఁ
ద్రోవలేమిఁగొండలతోడఁ • దోయధిఁబడి, యీఁది తెచ్చియిచ్చుచునుండి • రెసక మెసఁగ.

పొడవు కొండల మోవంగఁ • దొడఁగి కాళ్లు, సంచలింప నాఁకలిగొన్న • శైలచరము
లట్లెమోచు మలల దించి • యందు గలుగు, మధువు దంచిగఁ ద్రావి మై • మఱచిసొక్కె.

అన్ని దిక్కులఁ బరవిన • యగచరాలి, చొచ్చువారు మరలువారు • వచ్చువారు
నగుచు నెంత దూరము సేతు • వయ్యెననఁగఁ, గొంద ఱందురు సగము చే • కూడెననుచు

ధాత్రిధరముల యందున్న • ధాతువులును, పేఁటులందున్న పెందేనె • పెరలుఁ దరుల
మంజరులు తీరమందెల్ల • మలసియుండఁ, దద్భయంకరాంబుధి మధూ • దధిని పోలె.

కష్టములు రేఁగి మిక్కిలి • కలఁచుచున్న, నోర్పుమైఁ గుటుంబముగాచు • నుత్తము వలె
గొప్ప భూమీధరములు పె • క్కులుగలంపఁ, గలఁగఁడయ్యెను సుంతైన • జలధిఱేఁడు.

పరవియున్న ప్రవాళ వ • ల్లరులు మునుఁగ, నుదధి వైచిన కొండల • నుండి చెదరి
దరులఁ బడియున్న పెక్కు ర • త్నాలకాంతు, లింద్రధనువుల కైవడి • నెసఁగుచుండె.

వానరం బొకండు • వటవృక్షమును పెక, లించికొనఁగ నట వ • సించు పులుఁగు
లాదరువుగ నున్న • యధిపుఁడు మరణింప, నడలు బంధులట్లు • లఱచుచుండె,

పాంథవిశ్రాంతి కేడమయి • పరఁగుచుండు, మావిమ్రాఁకులు వనధిలో • మఱుఁగువడఁగ
రక్షకులు గతియింప ని • గ్గతికులయిన, సేవకులక్రియఁ దుమ్మెదల్ • చెదరిపోయె.

చెల్లాచెదరై తుంపురు, లెల్లెడ వ్యాపించుచుండు • టీక్షింపఁగ నొం
పిల్లు పయోనిధి పూఁడఁగ, మెల్లఁగ వేజెడకు జాఱు • మీలం బోలెన్.

వలపుగొని ముసరుచుండిన, యళిబృందము సంభ్రమున మ • హాద్రులతో దం
తులు గూల విడిచి మరలెను, వలపెద లేకుండు పణ్య • వనితలకరణిన్.

ధరనూనిన వేళలతో, నురలింపఁగఁ బడి సిలుంగు • లొందినవయ్యెన్
వరసతుల క్రియను తీవలు, తరువుల విడకుండి శర వి • ధానమున బడెన్.

జలకణము లెగుర నవ్వలి, జలధియు నుప్పయ్యె సళని • చల్లనయయ్యెన్
జలదములు గురిసె నుప్పని, జలముల వేవెలుఁగు కూడఁ • జలి వెలుఁగయ్యెన్.

పరిమళించు పర్వతముల • వలన నెగురు, పసిఁడివంటి తుంపురులు గ • ప్పఁగ నెలర్చి
వడిగఁ బైకి లేచిన తీఁగ • పగడములు తు, అంగలించెను మింటి మె • ఱుంగు లట్లు.

పన్నిదంబులు వైచుచుఁ • బరగులిడుచుఁ, బ్లవగు లడవులఁ గలపాప • పముల గిరుల
వెదకివెదకి తెచ్చి కడలి • విడుచుకతన, మొక్కలును చూడఁ గనరాక • పోయె ధరను.

తే॥ నెఱవు కీరితి పఱపు వా • నరుల పఱపు, గిరుల పఱపును వనముల • పఱపు డాలు
ధరణిఁ బఱపుటం బోలి చి • త్తముల పఱపు, విరియ నౌక శరధి పఱపు • తెలుఁగు దోచె
తే॥ అఱయఁ బగళులు మూఁడేగు • సంతలోఁ ద్రి, కూటముంజేరె సేతువు క్రోఁతు లపు డౌ
నర్చ కోలాహలము గగ • నంబు బ్రద్ద, లగ నొనర్చె; నియ్యది వేఱు • గగన మేమొ?
తే॥ వేఱ యుపమ లుత్ప్రేక్షలు • వెదక నేల?, ప్రభుఁడు రాముఁడు సీత యా • పదలఁ దీర్ప
నాపయిం బదాబ్జములుంచి • నడచుఁగాక, యనుచు శేషుఁడు నిల్చె నా • నలరెఁగట్ట
తే॥ సత్యవతియగు లంకయన్ సరసిజాక్షి, దైత్యు లొనరించు చెడుగులు • తాళలేక
జలజనేత్రుని చేసాఁచి • పిలుచు కరణిఁ, జెలఁగె రణజయ హేతువు • సేతు వపుడు
తే॥ తనదు ప్రియపుత్రి పడు బాము • లను తలంచి, సైఁపలేక భూదేవి హ • స్తంబు చాఁచి
సీతయున్కి చూపిన దనఁ • జెన్నుమీఱె, బంధవారిధి వారధి • పాప రోధి.
తే॥ కడలిపై సేన రాముండు • నడపవలసి, యుఱిద నేను కాకెవరిప్పు • డౌదవు వార
లనుచు విష్ణు పాదోద్భవ • యవనికి దిగి, నట్టి చెలువున వంతెన • యమరెఁ జూడ.
తే॥ మలలయందుండు రత్న రా • సులు జ్వలింప, వానరులు గట్టు జలనిధి • బంధనమ్ము
వేవెలుం గత్తమిల్లిన • వేళలందు, మెఱుపుఁదీఁగల కైవడి • మెఱయుచుండె.
తే॥ కపులు పూర్తిగా వంతెన • గట్టి పిదప, వనచరేంద్రుండు రాక్షస • వల్లభుండు
తక్కువార లావిషయంబు • తనియఁ దెలుపఁ, జనిరి కుతుకంబుతో రాము • సన్నిధికిని.
తే॥ దాని సేతువు నూఱామ • డల పొడవును, వెలుపు పదియామడలుగాఁగ • వెలసెననుచు
శ్రీరఘూత్తము చరణ రా • జీవములకు, మ్రొక్కి విన్నవించిరి మోద • పూర్ణులగుచు.

## 8. చారశ్రవణ పటలము. (66)

ఉ॥ వారిధియైన వార్తవిని • వారిద వర్ణుఁడు మేరమీఱు ము
ద్వారిధిఁ దేలి వారల న • పార కృపారస మారఁ గౌఁగిలిం
జేరిచి మేనులం దడవి • సేతువుఁ జూడఁగఁ బోదమంచు దు
ర్వార విరోధి రాక్షస వి • రాముఁడు రాముఁడు లేచెఁ గ్రన్ననన్.
క॥ ప్రానెలవు కడలి కెదుటను, సేనావారిధికి దిగిన • జీమూత మనన్
మానుగ నిలుచు సేతువు, జానకిఁ గన్నట్లు గాంచి • సంతసమందెన్.
సీ॥ పలు తరఁగలచేతఁ • గలగుండు పడుచుండు, జలధి నిండంగఁగొం • డలను పేర్చి
వారధి నిర్మించు • నేరుపు మెచ్చయ్యె, దీని లోఁతెంతయో • తెలియవశమె?
నడువ నిర్మింప నె • న్నాళ్లకు ముగియునో, యీలంక యేడు సం • ద్రాల కవల
నున్నను నలుఁడింకఁ • గొన్ని దినాలలో, నిక్కంబుగాఁ గట్టి • నిల్పఁగలఁడు
తే॥ అనుచుఁగొనియాడి కారువు • నర్మిలిమెయి, నలమినాఁడు వరుణుఁడిచ్చు • హారమొసఁగి
లంక జయమునిశ్చయమని • యెఱుఁగఁబలికి, బయలుదేఱఁగఁ ద్వరపడెఁ • బరమవిభుఁడు..

ఉ॥ మున్ను విభీషణుఁడు బహు • మోదముతో నడవంగ జ్ఞాన సం
పన్నుఁడు వాయుసూతి కపి • వర్గము వెన్కలరాఁగ లక్ష్మణుం
డన్నను వెంబడింప మద • హస్తి క్రియన్ రఘురామ భూవరుం
డున్నడ తెంచె వంతెనఁ గ • డుంగడు సంతసమంది చూచుచున్.

ఉ॥ చారు చిరత్న రత్నములు • చందనముల్ చరణాలఁ గ్రువ్వఁగా
హారి వనంబులెల్ల నల • లట్టులు ప్రక్కల నుల్లసిల్లఁ గా
వేరిని పోలియున్న కడు • విస్తృత సేతువుపైఁ గపీంద్ర సం
చారము రామచంద్రునకు • సమ్మతిఁగూర్చె ననేక భంగులన్.

తే॥ కొండప్రక్కలఁ గల తిను బండములను, వారుకొని మోచితెచ్చుట • వలనజలధి
నడచు కతనను ప్లవగ సై • న్యంబుచూడ, గొప్ప కావేరి వఱదనాఁ • గొమరుమీఱె.

చ॥ నడవఁగఁ బల్లము ల్వడిన • నాఁడెపు జాడలలోఁ దరంగముల్
నడుమను తూఁటుచుండ జత • నంబున సంగర రంగమందు ప
ర్వడు తురగాల నెక్కి చను • రీతి మనోహర లీలలన్ వడిన్
దడములు పోవసాగెఁ గను • దమ్ములు విందుగ సందడించుచున్

తే॥ ఇఱుకు గానున్న చోటుల • నేగలేక, యొరలం బోయి పడనున్న • వారిఁబట్టి
చేయి యూఁత యొసఁగి దరిఁ • జేర్చినారు, కరుణ నిండిన కపివరుల్ • కదఁక చెదక.

క॥ పలువురు ప్లవగులు రాఘవు, తలపై నాతపము వేఁడి • తగిలెడి నని జొ
బ్బిలు జొంపములగు తరు శా, ఖల గొడుగులక్రియను పట్టి • కడపిరి త్రోవన్.

క॥ కాకుత్థ్సు మేను వాఁడగ, నీక నవిచియున్న విటప • నిచయమ్ములతో
జోకగఁ జామరలవలెం, జేకొని వీచిరి చెలంగి • సేనానాథుల్.

తే॥ జానకీదేవిఁ జేరంగఁ • జనుటఁ దలఁచి, యుత్కమైన మనంబుతో • నుర్విభుఁడు
బలసి వచ్చు సేన తోడ జలధి దాఁటి, యవలి దరిఁజేరె వేల్పులు • హర్ష మొంద.

చ॥ సురలును మౌనులుం గడఁక • స్రుక్కక గొప్ప తపంబుచేసి య
త్యురుఫలమొందు హేతువున • నుద్భట వానర సేనతోఁ బ్రియా
వరజానితో నరుంధతియు • భక్తిని మ్రొక్కఁగఁ దగ్గ సీత ము
చ్చిరు నగరంబు పొంత విడి • సెన్ రఘువీరుఁడు వే సువేలపై

క॥ శ్రీరాముఁడు మనసేనా, వారమ్మున కెల్ల వలయు • పద్ధతి విడుమన్
నేరుపుతోఁ దీరుపుఁడని, యారఁగ నీలునకుఁ దెలుప • నతఁ డగుననుచున్.

చ॥ నలునకుఁ దెల్పి నాతఁడును • నాల్గుముఖంబులుగా నమర్చి సే
నలకును దండనాథులకు • నాణెము లేర్పడ వేఱు వేఱుగా
నెలవు లమర్చి దైత్యకుల • నేతకు భాస్కర సూతికిం గుతూ
హలమున రమ్యమైన నిల • యంబులు దా సవరించె నెవ్వడిన్.

తే॥ రామలక్ష్మణులరు మధ్య • రమ్యములగు, ఱాలు మలిచి కట్టిలు గట్టి • పూలతలను
గప్పి దర్భలఁ బఱపి చో • టిముగఁ జేసి, యెలమి నిట్లు స్కంధావార • మెల్లఁ దీర్ప.

తే॥ లోకరక్షకు జానకీ • లోలు నెల్ల, వారు మనసుచే వాక్కుచేఁ • బ్రస్తుతించి
యెఱిఁగి తమతమ విడుదుల • కేగినంత, రాముఁడును తనవీడు చే • రంగ నరిగె.

ఉ॥ వ్యాపన శీలులైన కపి • వర్యులు కొండలు తెచ్చివైవ ని
ర్వ్యాపక యబ్ధి వాఃకణము • లుప్పర వీదికి వచ్చి విద్రుమ
శ్రీ పెనుపారు నంశువుల • చెన్ను తొలంగఁగఁ జేసె నంచుఁ దా
నీపరిఁ దానమాడుటకు • నేగిన కైవడి నేగె భానుఁడున్.

క॥ దార రహితుఁడై యుండెడు, శ్రీ రాఘవు నేయఁ గోరి • చిత్తజుఁ డెక్కుం
గూరిచిన చెఱకు విల్లన, వారుణిఁ గనుపించె లేఁత • సలివెలుఁగంతన్.

ఉ॥ నీరజ పుష్ప రేణువులు • నిండఁగ నూఱుచు మంచు బిందువుల్
చేరిన మందమారుతము • చేతను రేయను దావవహ్నిచే
మార శిలీముఖంబను స • మాఖ్యవహించు కృతాంతుదూతచే
ఘోరతర ప్రతాపమును • కోరికఁ జూపె విధుండు గొబ్బునన్.

చ॥ అలుకను గూడఁ గ్రొత్తయగు • నందము చి • దుముఘోర విందముం
గలచెలిఁ బాసి నిద్దురను • కంబను వీడిన రాముచేయి వె
న్నెలలు కవించుచుండె గమ • నింపఁగఁ బచ్చలకొండ నెమ్మిఁ బల్
తలగె నటంచుఁ బ్రాఁకు బెడి • దంబగు పాముల పిల్లలోయనన్

తే॥ లంక డాయుటచే రాము • లలితగాత్ర, మతిశయోత్థిత సంతాప • మధిగమించె
నెట్టినోరు నల్లనికను • లెనయు నగ్ని, కాల్చె దవ్వులనే డాయఁ • గాల్పకున్నె?

చ॥ తన చెడువేళ దగ్గఱిన • దానవనాథుఁడు రావణుండు పం
పిన కొటికాండ్రు వానరుల • వేషమునం జనుదెంచి పాళియం
బునఁ దిరుగాడుచుండఁ దన • పూర్వులు చేయు తపః ఫలంబు రేఁ
పిన లలి వచ్చి యుండిన వి • భీషణుఁ డొయ్యనఁ గాంచె వారలన్.

తే॥ వానరులవలె సేనలో • వఱలుచుండు, వారిఁ గనిపెట్టె నప్పుడే • ప్రాజ్ఞవరుఁడు
కలశ వారాశిలో నీటి • కణము పడిన, వేఱుపఱచి త్రోచెడు హంస • విధముగాఁగ.

తే॥ పరఁగ నణువై మహత్తయి • పరవి నిండి, విద్యలకుఁ గట్టువడి తిరో • వృత్తిఁ దనరు
జీవు నీశ్వరుఁ గనుల దర్శించినట్టి, యోగిరీతి విభీషణుఁ • డొప్పె నపుడు.

చ॥ కడఁకను దెల్ప వానరులు • కాళులు సేతులు గట్టి వారలం
బిడికిటి పోట్లచే నొడలు • భేదిల నెత్తురు గ్రక్క గ్రుద్దుచున్
వడివడి రాఘవేశ్వరుని • వద్దకు నీడిచి తెచ్చి చూపఁగా
నెడ ద దయారసం బతిశ • యింప నతండును గాంచె వారలన్.

చ॥ కని పగవారలంచుఁ గిను • కన్ వహియింపక నింద్యమైన చొ
ప్పున నగచాట్లు వానరులు • పూన్చిరె యంచు దయాంబురాశియై
కని పగవారెయైన నొడి • కంబు చెడన్ శరణంబు వేఁడ నొ
ప్పని పని సేయఁగా దగునె? బంధములన్ విడిపింపుఁడీ యనన్.

చ॥ మనమున మార్దవంబుగల • మాన్యుఁడు రాముఁడు గూఢచారులఙ్
గనులను నీరు చిప్పిలఁగఁ • గాంచినఁ జూచి విభీషణుండు శ్రీ
వనజదళాక్ష! రావణుఁడు • పంపఁగ వచ్చినవారు వీరు వీఁ
డనయుఁడు సారణుండగు శు • కాఖ్యుఁడు వీఁడగు నంచుఁబల్కఁగన్.

ఉ॥ వంచకులైన వేగులు కృ • పారసధాముని రాముఁగాంచి యో
యంచితరూప! వానర బ • లాతిశయంబు నెఱింగి గెల్వముం
గాంచుట దుర్ఘటం బనుచు • గారడముల్ పచరించి మమ్ము చం
పించఁగ వచ్చినాఁ డితఁడు • వెద్దరి నిక్కము నమ్ముమీ యనన్.

ఉ॥ భేదము గూర్తురా యని వి • భీషణుఁ డప్పుడు మోహనప్రతి
చ్ఛేదక మంత్రమున్ బఠన • సేయఁగ గుట్టు బయల్పడెన్ వడిన్
బాదరసంబుసోకి తెలి • పాఱిన పైఁడి పుటంబు వెట్టఁగా
నాదిమ వర్ణముం జెనయు • నట్టులు వారు యథాస్థితిం గొనన్.

తే॥ భీతిచే వడఁకుచునుండు • వేగులఁ గని, దీనరక్షకుఁడైన యా • దిత్యకులుఁడు
మోమునన్ మందహాసంబు • మొలకలెత్త, నలుకు పలదు వచ్చిన పని • తెలుపుఁడనఁగ.

తే॥ వారలేమియుఁ దోఁపక • నోరు మెదుక, శ్రీకరా! లోకమాతయౌ • సీత తనకు
మృత్యువని యెఱుంగని దాన • వేశ్వరుండు, పంప వచ్చిన వంచనా • పరులమయ్య!

తే॥ అనుడు రాముఁడిట్లను మీర • లలుకులేక, చూడఁదగు వాని నెల్లను • చూచియవల
మీ దశాస్యుని కడకేగి • మేము తెలుపు, పలుకులెల్లను మఱవక • పలుకవలయు.

సీ॥ మేరలేకుండు లం • కా రాజ్య సంపద, కీ మా విభీషణు • డీశుఁ డనుఁడు
మకరాలయంబును • మలలచేఁ బూడ్చి పెం, పెచ్చంగ వనచరుల్ • వచ్చిరనుఁడు
విన్ను నీవారిని • నీఱుగాఁ జేయఁ బ్ర, తినగొన్న వీరు లే • తెంచి రనుఁడు
భోగానుభవమును • భూరి విక్రమ వైభ, వంబులు పూర్తిగాఁ • బాసె ననుఁడు

తే॥ ఆలు బిడ్డల బంధుల • ననుఁగువారి, నింపు దీఱఁగ నిపుడ వీ • క్షింపు మనుఁడు
అన్ని యాసలఁ దెగ గోసి • యనికి వచ్చి, ప్రాణముల నా శరాశికి • వదలు మనుఁడు

ఉ॥ గుత్తులుగాఁగ మస్తములు • గూడినరావణ! లంక వార్ధిలో
నొత్తిలి కానరాక పడి • యుండుటచే నసువుల్ భరించి పె
న్మత్తున దారపుత్త్రహిత • మంత్రులతో మనఁగల్గి తింక నే
యెత్తులు చెల్లవంచు వచి • యింపుము తప్పక రాక్షసేశుతో.

క॥ హరిహర హిరణ్యగర్భులు, గరుడోరగ సిద్ధసాధ్య • గంధర్వాదుల్
దురమున నినుగాచిన నీ, శిరములు నాశరము లురలఁ • జేయు ననుండీ

మ॥ తన తండ్రిన్ వధియించు హేతువున ను • ద్యత్క్రోధుఁడై భార్గవుం
డనిలో బంధులతోడ నర్జునుని సం • హారంబు గావించు తీ
రున నీవారల నాజిలోఁ దునిమి నీ • క్రొవ్వారు రక్తానఁ ద
ర్పణముం జేసెదఁ బక్కిఁ జేని కని నా • వ్వం బల్కుఁడీ మీరటన్.

ఉ॥ మాయలమారివై తపసి • మానిని యొంటిగఁ గాన నుండ న
న్యాయము మీఱఁ గొంచుఁ జెఱ • యందు వసింపఁగ వైచు నీచునిన్
న్యాయముతో సమూలముగ • నాశముచేసి దురాన నారకా
ఖ్యాయతకారయందు తిర • మారఁగ నుంచెదనంచుఁ దెల్పుఁడీ

తే॥ వేరు కోరిక లున్నచోఁ • గోరికొనుఁడు, ప్రాణభీతి మానుండు మా • వారలెవరు
మిమ్ము బాధింపకుందురు • మీరు పోవుఁ, డనఁగ బ్రదికితిమని వార • లరిగినారు.

## రావణుఁడు రహస్యమందిరము చేరి యాలోచించుట

ఆ॥ వరుణుఁ డొందు భయము • వారధి నిర్మించు, నేర్పు కపుల వచ్చు • నెఱియువినిన
రావణుండు పగము • రాతిరివేళ నే, కాంత మందిరంబు • నందుచేరె.

ఆ॥ రమ్మనంగఁ దక్కఁ • దెమ్మెరయును రాని, మంతనంబు సేయు • మందిరమున
నున్న స్త్రీలు పురుషు • లొగి నవ్వలికినేగ, నతఁడు హితులతోడ • నందు చేరె.

ఆ॥ విజ్ఞ లక్షణంబు • వెలయనివారు మూ, కులును చెవిటివారు • గూనివారు
కుబ్జులైన వారు • గూడి యచ్చట దీప, ములను మోచికొంచు • నిలిచినారు.

తే॥ వినత దానవ మస్తక • విమల మకుట, రత్నదీపిక చరణుండు • రావణుండు
పగలు నర వానరులు పురి • పఱగడందు, చేరినారు కార్యంబు చ • ర్చింపుఁడనుడు.

తే॥ మాల్యవంతుఁ డిట్లను దశ • మస్తకునకు, రామబాణాగ్నిచే నబ్ధి • రాయఁ డుడికి
నడిఁకి హార మొక్కండు కా • న్కగ నొసంగు, తీరు విన నామనంబు వే • ధించుచుండె.

తే॥ చీలికలుగాఁగ జలనిధి • చీల్పఁబడఁగఁ, జూపులంబలెఁ బడు రాము • తూపులకును
భంగపాటొంది భయమంది • వనధిరాజు, త్రోవ యిచ్చుట నామదిఁ • బొలుచుచుండె

తే॥ కానవచ్చిన వెల్లఁ బె • కల్చి తెచ్చి, సృష్టి మల లింక లేవనఁ • జేసినట్టి
కపులు భుజ మప్పళించుట • కడలి నడర, నీక యడఁచుట నామది • నేఁచుచుండె.

తే॥ వలఁతులైన వనచరేంద్రు • బలవు మెఱయఁ, దెచ్చి యిచ్చు మలలఁ జేత • తీఁటపోవ
నొక్క కపి యందుకొని యబ్ధి • నుంచుచున్నఁ, గడపు చేవెట్టి కలఁచిన • కరణియయ్యె

క॥ కాల్చినది చూచి సేతువు, దాల్చినయది చూచి కాన • దానవవరులన్
మాల్చినది చూచి యెదుర, న్నిల్చిన యదిచూచి తలఁచు • నియతియుఁ దగునే?

తే॥ అనుచుమాతామహుండు పల్క • నసురవిభుఁడు, కనులనిప్పులురల నౌడు • గఱచిచూచి
మేలు మేలు నీయోచన • చాలమేలు, తమ్ముతోఁ బొమ్ము నీపంద • తనము మెఱయ.

ఆ॥ అనుచుఁ బరుషవాక్కు • లాడ నాతఁడు మూర్గ, పట్ల హితము హీన • పఱచు నిజము
సత్యవాది బహుళ • జన విరోధియకాదె, యనుచు మౌనమూనె • నంతమీఁద.

సీ॥ దండనాథుఁడు లేచి • దర్పంబుతోఁ జూచి, నఱువ దేఁడులు దాఁట • నరులొ మరులొ
యనుమాట నిజమాయె • వినుము తాత! కపు, లగడిత దాఁటిన • యలవు తక్క
దిక్పాలకులు భీతి • తిగువ నక్కుచువచ్చి, సేవించుచుంట వీ • క్షింపవేమొ?
పండ్లిగిలించుచుఁ • బరువెత్తు కోఁతులు, మలల మోచిన వంచుఁ • దెలుపుచుంటి

తే॥ గౌరి భయమంది పురవైరిఁ • గౌఁగిలింప, రజతాద్రి రావణుండగు • రావణుండు
వెండిమల జల్లివేళ్లతోఁ • బెల్లగించి, నింగిదాఁక నెత్తుటయు నె • ఱుంగవేమొ?

చ॥ జరిగిన వానిఁగూర్చి యెల • నంబుగఁ జర్చలు సేయనేల • ము
ష్కరులగువారు కొందఱు వి • శంకట దుర్విధి చంపఁబూని యీ
కరణిని త్రోవ సంగర ము • ఖంబున జావఁగనెంచి సింహ కం
దరమునఁ జొచ్చు గొఱ్ఱెల వి • ధంబున వచ్చిరి యంచు నుండఁగన్.

తే॥ వేత్రహస్తుఁడౌ కంచుకి • వేగవచ్చి, దేవరం జూడ వేగు లే • తెంచిరనఁగ
లోని కంపుఁడనుచు విభుఁ • డానతీయఁ, జిత్తమని వాఁడు చారులఁ • జేరఁదెచ్చె.

తే॥ వానరులఁ దలంచిన యంత • వడఁకువారు, పలుకు నపుడెల్ల నెత్తురు • లొలఁకువారు
చారు లా దశాస్యుం డున్న • సరస కరిగి, పాదములకడ సాగిలఁ • బడుచు లేవ.

తే॥ ప్రాణములఁ గొనఁ బెదవు ల • ల్లాడ్చుచుండు, యమునివంటి రావణుఁడు నయంబు మెఱయఁ
దరుచరులఁ గూడియున్న సో • మరుల తెఱఁగు, లెఱుఁగఁ బలుకుఁడియన్న వా • రిట్టులనిరి

ఉ॥ దాసులమైన మేము వసు • ధావర సేనను పూర్తి చూచు పే
రాసను వానరాకృతుల • నంచితరీతి గ్రహించి పోయియున్
దోసముతో విశాలమగు • తోయధి విస్తృతి గాంచ బల్మిమై
నాసలఁజుట్టి వచ్చిన ఖ • గాధిపుకైవడి లేము దేవరా!

ఆ॥ జలధి వేల గానఁ • జాలనివింత తొ, లంగఁ బర్వతములఁ • గ్రుంగఁ బేర్చి
నప్పు డార్చి లేచు • నంబుకణంబులే, వచ్చి తెలుప లేదె? పలుకవలెనె?.

ఉ॥ కుట్టినఁ దేలు కుట్టమిని • కుమ్మరిపుర్వనునట్లు వేఁడినన్
నెట్టన గానరాఁడు నది • నేత యటంచుఁ బతంగ వంశజుం
డట్టి భుజంబులన్ శర శ • రాసనముల్ తగఁ గాంచినంతనే
బిట్టుడికెం బయోధి కడు • భీతములయ్యె జగంబు లన్నియున్.

క॥ సీతమ్మఁడు శ్రీరాముని. ప్రీతికిఁ బాత్రమయి పొందెఁ • బేర్మిని లంకా
శ్రీ తరుణిని సూర్యేందులు. భూతంబులు రాముపేరు • పొలిచెడువనుకన్.

క॥ దూతగ వచ్చిన హనుమని. ఖ్యాత బలము తెలిసియున్న • కతమదియుండగా
సేతువు గట్టిన నేరుపు. సీతజి తలపోసి చెప్ప • హింపఁగ నేలా ?

తే॥ వేల్పు లమృత పానము సేయు • వేళయందు. సూర్యచంద్రులు రాహువుఁజూపినట్లు
నీదు తమ్ముండు వానర • నికరమునకు. మమ్ముగుర్తించి తెలిపె య • త్నమ్ముతోడ

తే॥ దేహమెల్లను నలఁచి పే • ధించిరట్టి. యీడ్చికొనిపోయి పగలింటి • యినునిభంగి
వెలుఁగుచున్నట్టి జానకీ • విభుని యెదుట. నిలిపినారు వానరవరుల్ • నిర్జరారి !

ఉ॥ పావనుఁడైన రాముఁడు కృ • పాళుఁడు గావున మమ్ము గాంచి స
ద్భావముతో వదల్చి మఱి • పంపుచుఁ జిర్నగ వంకురింపఁగా
రావణు మున్ను పొందిన వ • రంబులు తోడ్పడవంచు నాజి దై
త్యావళి చావు నిక్కమని • యాడెను దైత్య కులాబ్ధి చంద్రమా!

తే॥ అనుచు రాముఁడు దెలుపు వా • క్యములు సైన్య. బలముదెల్పి దొసంగులు • తొలగుఁగాత
మసురవిభుఁడు చిరాయుష్కుఁ • డగుత మనుచు. విజయ గీతంబు పాడిరి • విపులభక్తి

## 6. లంకాదర్శన పటలము. (48)

ఉ॥ శాపమువంటి మేటి శర • చాపములన్ ధరియించినట్టి యా
తాపసవేషు లీ జలధి • దాఁటి పురంబునఁ జొచ్చుచుండఁగా
నోపికతోడ వేఱొకటి • యోచనసేయ గ. బోలదన్న లం
కాపతిఁ గాంచి సైన్యపతి • క్రమ్మఱ నిట్లను ధీరపద్ధతిన్.

ఉ॥ సీతను వీడినన్ భయము • చెందెనయంచు విరోధులం దప
ఖ్యాతి ఘటిల్లు సంగరము • గల్గిన వైరము తీఱవచ్చు దు
ర్నీతుఁడు నీదుతమ్ముఁ డొక • రీతిని సంధి పొసంగనీఁడు చు
మ్మీతఱి యిక్కుపాటొదవ . నీయక యోచన సేయఁగా. దగున్.

తే॥ మనము దండెత్తవలయు క్రొ • మమ్ము లేక. పగతె యిచటికి వచ్చిర • వ్వాంఛతోడ
వలసినట్టి శైలము పయి • వానగురిసె. నింతకును మించి యనుకూల • మేది మనకు ?

ఉ॥ రక్కసి వేయి వెల్లువల • రాఘవ ప్రాణముఁ దీయఁబూనుచోఁ
దిక్కుక నూఱు మృత్యువయ • దేవతలైనను వచ్చి కావలెన్
దక్కువయేది నీవిచట దా • రుణభంగిఁ గన ల్వహించినన్
గుక్కలు సింగమున్ గనిన • కోపునఁ గోఁతులు పాఱకుండునే?

ఉ॥ వచ్చిన వానరావళులు • వచ్చిన త్రోవనె పాఱ తోయధిం
జొచ్చి నశింప దైత్యకుల • శూరుల తోడుత నేను పోయి పె

న్మచ్చరమూని సేయు కవ • నంబును కాంచెదుగాక యానతిం
బుచ్చుము దేవ! నన్నని చ • మూపతి యుత్సహనోక్తులాడఁగన్.

తే॥ మాటలంగాక వీరునఁ • బోటు చూపు, టుత్తముల లక్షణంబగు • నుర్వియందు
కాఁగలది కాకమానదు • కాదె యనుచు, మాల్యవంతుఁడు వాక్రుచ్చె • మఱియునిట్లు.

తే॥ జలధివేష్టిత భూతల • చక్రవర్తి, దశరథ సుతుండు జానకీ • ధవుఁడు శింశు
మార చక్రంబుకంటెఁ బై • నారసుండు, దేవదేవుఁడె యని మహా • ధీరులంద్రు.

తే॥ అతని తమ్ముఁడు పరతత్త్వ • మందునుండి. వీడకుండియు వీడిన • విధము తోఁచి
ప్రాణులం బలుతెఱఁగులఁ • బరిఢవిల్లు, విష్ణుశయనమే యని తత్త్వ • విజ్ఞు లంద్రు.

తే॥ కులగిరులలోని సారమొ • క్కూట గడంచి, నలువ యారాముని శరాస • నంబుచేసె
నల్లెత్రాడు శేషుఁడు నిశి • తాస్త్రతతులు, కాలచక్రంబు సైతంబు • గడుచునంద్రు.

తే॥ అంగదు సురేశుఁడనినీలు • నగ్నియంద్రు, వాయువనిరుద్రుఁడనియంద్రు • వాయుసుతుని
నతఁడు పిమ్మట బ్రహ్మయే • యగు నటంద్రు, సకలవనచరుల్ దేవతాం • శములవారు.

చ॥ నలువ పదంబు మారుతికి • నల్వుగ నిచ్చిన రాఘవుండు దై
త్యులఁ దుదిముట్టఁ గూల్చుటకె • యొప్పుగ నివ్విధి వచ్చెనన్న యీ
పలుకులు పల్వురాడుదురు • వారి గుణాదులఁ బట్టియో నిజా
కలనముచేతనో తెలుపఁ • గా ఫలమేమది నీవెఱుంగవే?

చ॥ నిజము వెఱింగియో తెలివి • నేర్పుననో మఱి భీతిచేతనో
యజహర పూజ్యమైన యమ్మ • తాగ్రజ పద్మిని లోకమాత భూ
మిజ యని పల్కుచుందు రది • మిథ్యయొ సత్యమొ తెల్పనేల?
రజముగ నెల్లిదంబుగ ని • రాకృతి సేయఁగరాదు రావణా!

చ॥ అడవుల కేగుదెంచుటయు • నక్కట వేల్పుల ప్రేరణంబుచేఁ
బొడమిన కార్యమంద్రు సుర • ముఖ్యులు వేఁడఁగ మాధవుండు కే
రడమున నీవుపొందిన వ • రంబుల లోటు నెఱింగియే యిటుల్
పుడమి నరాకృతిం బడసి • పొల్చె నటంద్రు మహాత్ము లెల్లరున్.

చ॥ పలుమఱు దుర్నిమిత్తములు • పట్టనమందునఁ దోఁచుచుండె న
య్యిల తనుజాత నారయఁగ • నేడ్తెఱవచ్చిన దూత తాఁక నీ
నెలవున నున్న దేవతయు • నీఁగినదందురు కల్గె యుద్ధముం
బొలుపుగ మేలుగూర్చు పని • ముఖ్యముగాఁ దలపోయు రావణా!

మ॥ భవకోదండ విఖండనంబున స్వస • త్వంబున్ బయల్పుచ్చు రా
ఘవ బాణంబులకుం బలాశనులె ల • క్ష్యంబైన వారంద్రు దా
నవ రాజేంద్ర! విభీషణుండు గురుక • న్నన్నించు విజ్ఞాని గా
రవ మొప్పారఁగ మున్నె తెల్పియె కదా • ప్రాపించె సీతావిభున్.

మ॥ వినుమా యయ్యవి యెల్ల నేఁ దెలియుటన్ • వెండిన్ హృషీకేశుచే
మును నావారలు కూలుటన్ మనుపుఁడన్ • ముద్దున్ మనో వేదసం
బును నన్నిమ్మడిఁ గష్టపెట్టఁగ ఖగం • బుం గూర్చు పల్కాడెదన్
దనయా! సీతను వీడుమా యనుచు నొం • దన్ మాల్యవంతుండనన్.

చ॥ పకపక నవ్వి రావణుఁడు • గ్రాఁలిగ సీవను పల్కెనెప్పు! త
క్కు కలుదులుండనీ సరులు • కోఁతులు పట్టుగ నింతకాల మె
య్యొకటియుఁ జేయలేక వెలి • పొంది మఱుంగుల డాఁగు దేవ నా
యక మణులంట! నేనపజ • యంబును పొందెదనంట! వింతగున్!

చ॥ అతగుల మానవేశ్వరుల • నల్పులు కీశులే కాదు తోడుగా
నితర మృగంబులన్నియును న • హీనవిధిం గలియంగనిమ్ము నన్
క్షితిపయిఁగాదు నాగులు వ • సించు భుపంబునన్నైనఁ దాఁకనీ
క్షితిజకు నైనచోఁ జుణిఁగి • చెంగుదునే ప్రళయంబు గల్గినన్.

చ॥ చెడుగులకుం బ్రతిక్రియలు • సేయునప్పై భువసంబులం గదుం
గడిమిని గెల్చి నిర్జర ని • కాయము వీఁపుల దుస్సినట్టిపై
యడరిన మన్మహోగ్ర నశి • తాస్త్రము లక్కట కోఁతిమూఁకపై
పెడలఁగఁజాలవంచు నొక • వేటిఁడియైనఁ దెగించి పల్కునే?

ఉ॥ శూలియు నొక్కక్రోఁతియయి • సూటిగ నన్నెదిరించి నిల్చినన్
గేలిగ నెల్లవారు నగఁ • గీడ్పడి పాలునుగాక గెల్చునే?
మేలగు నా శరావళులు • మ్రింగఁబడంగ జగంబు మ్రింగఁగాఁ
జాలిన వారిధిం బొడము • చండతరంబగు హాలహాలమే?.

చ॥ బవరమునందు మున్నొదిఁగి • పాఱిన చక్రియు వెండివచ్చి యు
క్కువుఁడయి తాఁకినంత నను • గెల్వఁగ నేర్చునె? మత్తను ర్వము
క్త విశిఖ సంతతుల్ శి వి • కర్తన ఋక్ష గణంబు మాడ్చుచున్
నివుడ భరింపఁగా నుదధి • నీటను పుట్టిన కౌస్తుభంబొకో?

తే॥ జిష్ణుఁడొక కపి రూపొంది • చెలఁగె నన్నఁ, దాను వైచిన వజ్రాయు • ధంబుచేత
తెక్కలూడి లేవక పడి • నక్కియుండు, కొండ లొనొకో మద్భుజా • దండపాళి.

సీ॥ అని దశాననుఁడు గ • ర్వాంధుఁడై నగుచు వీ, రాలాపములఁ దగ • నాడుచుండ
మనసులే దూతలై • మునుపేగు నభిసారి, కల మనంబులు చాలఁ • గలఁతనొందఁ
జక్రవాకంబులు • సంతోషమొందంగఁ, బద్మినీ వదనంబు • పరిఢవిల్లఁ
గనకశిఖరి దాఁకఁ • గ్రమ్మిన యిరులు ప్ర, వాహజలము తగ్గు • పగిదిఁ దొలఁగె

తే॥ నిట్టిదని తొంగిచూచని • యినుఁడు నాఁడు, రాము డాఁపున బంగరు • ప్రహరిఁజూచు
కోర్కి తన దెండమునయందు • గుదురుకొనఁగ, మెల్లమెల్లన లంకపై • మెదలసాగె.

## రాముఁడు సువేలాద్రి శిఖరముఁ జేరుట

మ॥ సుదతీరత్నము సీత లంకఁ గలదం • చుం దెందమందున్న పె
ల్లిదమౌ ప్రేమము రేఁప నందమగు ప్రో • లిం గాంచు సాకంజునన్.
నిదురన్ వీడిన లక్ష్మణుండు వెనుకన్ • నిర్భీత కీశవ్రజం
బెదురం బ్రక్కలరాఁ గకుత్స్థ కులజుం • డెక్కెన్ సువేలాద్రిపై.

ఆ॥ కదన వీరవరులు • కలసి ప్రక్కలరాఁగ, రాజయుగళి తోడి • రామవిభుఁడు
పెక్కు పులులు చుట్టి • ప్రక్కల రా మృగ, రాజ మద్రినెక్కు • రాణ దోఁచె.

చె॥ పుడమి సమస్తమున్ జలధిఁ • బూఁడిన కైవడిఁ గ్రమ్ము చీఁకటిన్
దొడిఁబడ లంకయున్ బొదలు • తోరపు సంపదలు న్నశించు పో
బడి దెలుపంగఁ దూర్పుమల • పై నుదయించుటమాని తాలుమా
ర్వడ వలదిక్కు దోఁచు కటి • భానునిఁబోలెను రాముఁ డత్తఱిన్.

చ॥ అసమ మహీధ్రముల్ వయిచి • యబ్ధిని దాఁటిన రమ్య మేరు శై
ల సదృశ ధీరుఁడౌ కపికు • ల ప్రభు లంమన నుల్లసిల్లె రా
క్షస కుల కాలు డైన ధర • జా హృదయాంబుజ భాస్కరుండు మే
ల్పసిఁడి నగంబుపై వెలయు • పచ్చలు నిండిన కూటమోయనన్.

చ॥ జనకజ పేరుపొందిన ని • జంబగు ప్రాణము వీడ జంటఁ బా
సిన కరరింబలెన్ వగపు • చే విలపించెడువాఁడు సేతువుం
గనుఁగొను పిమ్మటన్ గినుకఁ • గన్నుల మానినవాఁడు రాఘవుం
డనువుగఁ గాంచె లంక నయ • నాంబుజ యుగ్మముతో వెలుంగుతో.

## రాముఁడు లంకానగర సౌందర్యంబు లక్ష్మణునకుఁ దెలుపుట

మ॥ అనుజన్మా! గమనించి కీ మన యయో • ధ్యం బోలు సౌందర్య ప
ట్టనముల్ వర్ణనసేయుచో సుకవి కూ • టంబుల్ సురేంద్రస్థలిన్
గొనుచున్నా రుపమాన వస్తువుగ నా • క్కొండేని లంకాపురిన్
గొనమిం జూడఁగ గొట్టిదాఁటె యని వా • క్రువ్వంచగున్ లక్ష్మణా!

సీ॥ దోసంబులేక వి • ద్యోతించు నపరంజి, మయమైన స్థలముల • మణి గణములు
ఖచియింపఁ బడి రవి • కాంతులు సిగ్గిల, దీప్తిమయంబుగఁ • దేజరిల్లి
వ్రాయ నలవి కాని • వైఖరి నొప్పారి, మిన్నంటుచుండు న • మ్మేడలందు
కల శిల్ప మొకయింత • కనులపండువుగాఁగఁ, గాంతమన్నను వీలు • గాకయుండె

తే॥ నధిక రత్నదీప్తులు నింగి • నంటుచుండ, ధ్వజ పటాంచితమగు లంక • పవనసూనుఁ
డుంచు నిప్పుచే నిప్పుడు • మించి యుండు, చున్న తీరున దోఁచుచు • నుండెఁ గంటె.

చ॥ మొగులులు గ్రమ్మి యున్నతిని • మూసిన పచ్చలమేడలన్ ధగ
ద్ధగమను కాంతు లెల్లెడ సు • దంచితలీలలఁ బర్వ మంచి వెం
డి గదులు హంసలట్లు పుర • డింపఁగఁ బచ్చని యాకుజొంపముల్
నెగడి సరస్సునం దలరి • నిండిన తమ్ములఁబోలుఁ జూడుమా।

మ॥ అనలజ్వాలలపంటి తేజములతో • నంగారు మాణిక్యముల్
మనుఁగం జెక్కిన కంబముల్ గల గృహం • బుల్ కాంతులన్ జిమ్మఁగా
ఘన సంఘంబులు మింటఁబోవునవి లం • కాపట్టనం బన్న కొ
ల్మిని గ్రాఁగించిన యెట్టినౌ నినుప ప • ళ్లెంబుల్ బలెన్ దోఁచెడిన్.

తే॥ కరులు కాళ్ళతోఁ ద్రవ్విన • యిసుకరజము, పైనిఁ జల్లికొనుటచేత • వన్నెమీఱి
స్వర్ణగిరుల వైఖరి మెల్లఁ • బనుచుచున్న. వింతతీరులఁ గాంచితే • వినుతచరిత।

ఉ॥ అందపుఁ బైఁడికాఁడ లల • రారెడు చామరలందునుండి పు
ట్టొందిన గాలిచేఁ గదలు • సున్నమిత ధ్వజముల్ వియత్తలం
బందు చరించు వారిదము • లందలి మైల తొలంగఁ జేయుచున్
బొందిక నంచపిండువలె • బొల్చెడి వింతలఁ గాంతే తమ్ముఁడా।

ఉ॥ కనకకంబు నూలిడిన • యేపున శ్రేణులుగాఁగ నొప్పు మే
లైన కడాని చిత్రముల • నందము చిందెడు సౌధపాళియన్
మానగు తారహారమున • నాయకరత్నముగా దశానన
స్థానమెలర్ప నద్ధిపతి • దాల్చిన హారముగా వెలింగెడిన్.

తే॥ మించి గృహ రత్నకాంతులు • మీఁదఁబడఁగ, వీథులందేగు గుఱ్ఱము • ల్వింతరంగు
లీన నైజవర్ణము జాతి • యెఱుఁగరాక, యింద్రధనువుల కైవడి • నెసఁగుఁగంటె.

తే॥ చెఱకు విలుకాని సైతము • చిక్కువెట్టు, పటికఱాల మేడలు వేఱు • వర్ణముపడ
నెఱుఁగనగుచుఁదక్కిన యప్పు • డెఱుఁగరాక. నీటచేఁగట్టఁబడిన సం • దియము దోఁచు.

తే॥ పండువెన్నెలఁ బోలిన • నిండుకాంతు, లొలయుచున్న ముత్యాల పం • దిళుల నడుమఁ
జెక్కఁబడినట్టి పచ్చలు • క్షీరవార్ధి, పైని శయనించు వెన్నుని • మేనిఁబోలు.

తే॥ వీరసింహమా! తారక • వితతిఁ దాఁకు, మేడలం దొక్క వేలుపు మెఱుఁగుఁబోఁడి
గౌసెనం దీయ ముకురంబు • గాననయ్యె. రాహు వెరగొని వీడిన • రాజుకరణి.

తే॥ ధ్వజములొప్పారుమలల చం • దమునఁదోఁచు. సౌధములలోని మాణిక్య • దీధితులను
మావిచివురులె యని భుజిం • పంగఁ గోరి, పొదవు మెడల జాఁచెడు నుష్ట్రి • ములనుగాంతె

తే॥ కైశ్యవాసనకై కంబు • కంతు లిడిన, అగురు ధూపమెల్లెడఁ గ్రమ్మి • యెగయుకతన
దంతిచర్మధారిని బోలి • తనరుచున్న. పగడపు న్మేడలం గంటె! పావనగుణ।

తే॥ విశ్వకర్మ నిర్మితములై • వివిధగతులఁ, జెలఁగి లోభులౌ రక్కసుల్ • చేర్చియుంచు
పాపపుం బొక్కసంబుల • పగిదినున్న. నీలరత్న సౌధంబుల • నెఱిని గంటె?

తే॥ హరిణ నిభ భీత దృష్టుల • యందము చెడి, పతి వియోగముచేఁ జాలఁ • బరితపించి
మొగులుగను నెమిళులకూట • ములనుబోలె, దేవసతులుమసలఁగాంచు • తీరుగాంచె.

తే॥ సురలు సురకాంతలును మన • చొప్పుగాంచి, మంచిదినములు వచ్చిన • వంచునెంచి
గొప్ప లంకాపురంబును • కూర్చి పాడు, చేసి పాడెడి క్రియనున్న • చెన్నుగాంచె.

చ॥ తెలిపిన తీరు వెండియును • తెల్పకయుండెడు తీరు దోఁపఁగాఁ
బలు తెగలన్ దశాననుని • పట్టణపు న్నెఱి నిట్లు తమ్ముతోఁ
బలుకుచు నుండునంత దశ • వక్త్రుఁడు రాముని సైన్యసంఘముం
దలకొని చూడఁగోరి చనెఁ దత్పుర గోపుర శీర్షభూమికిన్.

## 10. వానరసైన్య దర్శన పటలము. (35)

సీ॥ సీతయందలియాస • చేఁ బచ్చవిల్కాఁడు, శరము లుచ్చిన బాహు • లిరువదియును
శిరములు పది గొప్ప • శిఖరము లలరారు, పెనుపర్వతంబు నొ • ప్పిదముతోఁ ప
వలపుచేఁ గృశియించు • బాహువు లాలంపుఁ, దలఁపు మాత్రన నుబ్బి • బలుపుమీఱ
దశముఖుఁ డుత్తర • ద్వార గోపురముపై, నధిక వైభవమున • నలరి యపుడు

తే॥ కలశములె శిఖరంబులు • గాఁగ గొప్ప, రంబె మేరువుగాఁ బన్ని • దంబు సేయు
ననిలు గెల్వంగ శిఖరంబు • నదిమిపట్టి, నిలుచు పాఁపరాయని మదిఁ • దలఁపఁజేసె.

సీ॥ దశదిశలను వాని • దాపుల నీడల, మ్రింగు ఛత్రము తల • మీఁదఁ గ్రాలఁ
జామర వాయు వి • స్రస్తోత్తరీయంబు, కొండకాల్వవలె న • కుఁసను వ్రేల
రంభాదిసతులు ధ • రాజాత కెక్కు డం, దము గలిగించుచు • దాసిరాఁగ
బాల్కఁడలి జనించు • పదునాల్గువేల కా, మిను లింపుగాఁ బాడు • కొనుచురాఁగ

తే॥ బాలచంద్రు లిర్వంద్రొక • పర్వతగుహ, లందునుండి వెల్వడులీల నలరు దంష్ట్రి
కల వెలుంగు నగలకాంతిఁ • గలిసియెలయ, రావణుం డొప్పె నీలాద్రి • రాజుపోలె.

తే॥ కుండలములు దాల్చిన యొక • కొండనుండి, శబ్దమే లేక వర్షంబు • జాఱుతీరు
ననుకరించు వీనులయందు • నల్ల కలువ, లోలకములు మిక్కిలి కాంతు • లొలయ వ్రేల

ఆ॥ సీత సీత యనుచుఁ • జిత్తంబు తపియించు, చుండుకతనఁ జాల • నుసురు క్రుంగ
సామవేద సుధను • చల్లుచు వీణతో, నారదముని పాడ • నాణెముగను

ఆ॥ క్రూర చాప ఖడ్గ • ధారులు హరుకంటె, నలవు బలము కలుగు • నసురవర్యు
లంగరక్షకులుగ • నధికంబుగఁ ద్రావి, మైకమెక్కు కనుల • మలసిరాఁగ

తే॥ జగములం ద్రవ్వి యెత్తంగఁ • జాలువారు, నగరి లంకయుఁ బుట్టిన • నాఁటినుండి
పేరు పొందినవారు ని • ర్భీతులు నగు, యక్షవరులు కైవారంబు • లలరఁజేయ.

క॥ భూచరులు గగనచారులు, నై చెలఁగుచు దుందుభి ముర • జాదికముల ని
ర్మోచనముగ మొరయించుచు, నేచు కదలి యులివు చెడ న • నేకులు రాఁగన్.

తే॥ వినము భీతిల్లి సట్టి చూ • పెసఁగుచున్న, నాగ కన్యకా మణులును • నానయొంద
నరసురాంగనల్ పంచమ • స్వరమునందు, పరభృతంబుల కైవడిఁ • బాడుచుండ.

తే॥ మేఘ గంభీరరవముల • మించువారు, నిడుపు టంగీలు కలవారు • నిర్జరేంద్ర
భీకరులు వేత్రహస్తులు • వెసుకముందు, హెచ్చరికతోడ దూరాన • నేగుచుండ.

తే॥ కంఠ గంభీరరవము న • దరింత భుజ, గిరుల వాసించు చందనా • కీర్ణ మోద
వాయువుల మోచికొని గంధ • వహుఁడు దారి, మించి తనరాక మున్నెతిఁ • గించుచుండ

తే॥ అగ్ని నేత్రులు చంచలు • లధికబలులు, సూక్ష్మబుద్ధులు వినతిమై • చొప్పు దెలుపఁ
దోరణ ద్వార శిఖరమం • దాకనిలిచి, వేదవేద్యుని దానవ • విభుఁడు కాంచె.

తే॥ ఔడు గఱచిన రావణు • నషులందు, నుండి మిడుఁగుఱుల్ చిటపట • మండిరాలెఁ
బెను విరావంబు దిక్కుల • విసఁగవచ్చె. మనసు మాఁడె నెడమ కేలుఁ • గనులునదరె.

తే॥ ఇట్లు పెక్కు దుశ్శకునంబు • లెసఁగుచుండ, రామభూవిభుఁ గాంచిన రా • వణుండు
దుర్నిరీక్ష్యుఁడౌ సూర్యునె • దుర్చు రాహు, పోల్కి నుతుకుఁదనంబుతో • బొందెఁగినుక.

తే॥ పరవియున్నట్టి యూకపి • వరులయందు, రాముఁడీతఁడని తన శరీ • రంబె తెలిపెఁ
దక్కువారల నెఱిఁగింపు • త్వరితగతిని, యనిన విభునకు సారణుఁ • డనియె నిట్లు.

తే॥ ఇతఁడు లంకాధిపుని చెల్లె • లేమెయనుచు, విన్నయంత నే తనకేల • నున్న కత్తి
చేత దర్పితుఁడై ముక్కు • చెవులుగోసి, లజ్జ నీకుఁ గల్గించిన • లక్ష్మణుండు.

తే॥ ధర్మగతి తక్కఁ దక్కిన • తానములకుఁ, గనుల బోనీయకుండెడు • కర్మఠుండు
కడలికొక చక్రవాళంబు • రణిసుండు,, దపసుల కసాధ్యమౌ నిద్రఁ • దఱిమినాఁడు.

తే॥ లక్ష్మణుని కేలు తనదు కే • లంధరించి, యున్న ఘనభుజుఁ డండంబు • నరయునట్లు
వాలితో ననిచేసిన • పంక్తికాఁడు, కీశ కుల వరేణ్యుండు సు • గ్రీవుఁ డధిపు

సీ॥ వానరశ్రేష్ఠుఁడై యున్న • వానితండ్రియె పేలు. వుల కోరఁ గలశాబ్ధిఁ • జిలికినతఁడు
ఆ నడచెడువాఁడె • యక్కాని వెంగట, నెగయుచు విద్యల • నేర్చినతఁడు
ఇలను కోటలతోడ • నెత్తిన వెన్నుని సాటివాఁ డంబుధి • దాఁటినాఁడు
ఆతనిచేఁతను నీవు • నరసినవే కదా, అట నిలుచున్న వాఁ • డగ్ని సుతుఁడు

తే॥ దండపాశ శూలంబులు • తనరకున్న, భయదమైన యొడలి రంగు • పరఁగకున్నఁ
గార్యపంబట్టి శత్రుప • ర్గంబులితని, జముఁడెయని పల్కుచుండుదు రా • క్షస కులేంద్ర!

ఉ॥ వేరుగ నిల్చినాతఁ డతి • విశ్రుత కీర్తి నలుండు వార్ధి జేఁ
డూరక గర్వమొంది తన • కొప్పుగఁ ద్రోవ యొసంగఁడంచు సీ
తారమణుండు పొందిన క్రు • ధా బడబానల మాఱుమున్నె యీ
వారిధి బంధనంబు గరు వంబుగఁ జేసెను రాక్షసేశ్వరా!

చ॥ అరయఁ ద్రికాలవేది యను • రాముఁ డంబుధిఁ ద్రచ్చు వేళ ద
గ్గఱఁ దగ నుండె నాతఁడు జ • గంబులఁ గొల్చిన నాఁడు విష్ణువున్
గురుతర భక్తితోడ వలఁ • గొన్న మహాత్ముఁడు వృద్ధుఁడయ్యు ని
ద్ధరణి సమస్త మెత్తఁగల • దట్టుఁడు భల్లుకరాజితండగున్.

తే॥ నీలశైలంబు ప్రక్కన • నిల్చు రెండు. పైఁడికొండలవలె నీలు • ప్రక్కనిలిచి
రామలక్ష్మణులం బలె • రాజిలు కపు. లమర వైద్య పుత్త్రులు వార • లసురనాథ!

సీ॥ ఆదూరమునఁ గాన • నగువాఁడు కుముదుండు, కుముదాక్షుఁడట నిల్చు • కొన్నవాఁడు
గవయుఁ డీతండగు • గవయాక్షుఁ డాతఁడు, బ్రహ్మరుద్రులఁ బోలు • బంటుఁగన్న
సజ్జనహితుఁడు కే • సరియగు నాతండు, నరసింహు బోలిన • మురభుఁడతఁడు
పెక్కుకొండలఁ జేర్చి • పెట్టి యెత్తఁగఁజాలు, శరభుఁ డీతఁడు • శతబలియగు

తే॥ మూఁడుకన్నులు లేని త్రి • పురదహనుఁడు, పనసుఁ డనువాఁడు దురమను • పబ్బమెల్ల
జరుపఁ బూనినవాఁడు ఋ • షభుఁడు వాని, యెదుటివాఁడు సుషేణుండు • హితగుణుండు.

సీ॥ కపిరాజు డాపలఁ • గలభంబు కైవడి. నొప్పినవాఁడు మ • హోద్ధతుండు
కొండల నొకచోటఁ • గూర్చి భూమధ్యంబుఁ, గ్రుంగింపఁ జేసిన • గురు బలుండు
దధిముఖుఁ డనువాఁడు • తత్సన్నిధిని గానఁ, బడువాఁడు శంఖుండు • ప్రథితయశుఁడు
కడలి మీలను లెక్క • యిడవచ్చు వారిధి, యిసుకను లెక్కించి • యెఱుఁగవచ్చు

తే॥ చుక్కగమినైన లెక్కించి • చూడవచ్చు, వానరుల లెక్కయిడ నేరి • వలనఁగాదు
దనుజచంద్రమ! మేము గాం • చిన తెఱంగు, విన్నవించితి మన దైత్య • విభుఁడు కినిసి.

ఉ॥ చేలఁ జరించుచున్ వికృత • చేష్టలఁ జేయుచు నుండు కోఁతులన్
బోల నుతించుచుంటి వది • పోలునె. జింకలు కోటి గూడి బ
ద్ధాలస శీర్ణ వార్ధక మృ • గాధిపుఁ డాఁకి జయింప నేర్చునే
యేల వృథా వచింప? నని • యెల్లిద మాడుచు నవ్వె ఫక్కనన్.

## 11. మకుటభంగ పటలము. (52)

తే॥ రావణుం డట్టులుండ శ్రీ • రాముఁ డిచట, రావణానుజుఁ గాంచి పు • రంబునుండి
మనలఁజూచు వేడుక ద్వార • మునకు వచ్చి. నట్టివారి గుణాదుల • నరయఁ దెలుపు.

చ॥ అనుడు విభీషణుండు ధర • ణాధిపుఁ గాంచి వచించు బంధు లా
ఘను లను నాఱు నూడ్చి నర • కంబున నాటఁగ స్వీయవంశమున్
గొనకొని మిక్కిలిన్ బురద • గుంటగఁ జేసిన నీచకర్మి పా
వన కులకాంతలన్ జెఱను • వైచిన రావణుఁ డాతఁడే చుమీ.

చ॥ అనుచు మఱొక్కనిం గుఱిచి • యాడ దొరంకొను మున్నె భాస్కరుం
గనిసిన పండటంచుఁ దిను • కాంక్షను దాఁటిన వాయుసూను మా

డ్కొని కపిరాజు కన్నుల తొ • డింబడి దూఁకఁగ విస్ఫులింగముల్
మునుకొని దాఁటె రావణుని • మూర్ధము లంఘ్రులఁ దన్ను కోర్కిమై

తే॥ కోఁతి ఱేఁడు సువేలాద్రి • కొమ్మమీఁది, రావణుండున్న పెనుగోపు • రంబుమీఁద
దాని బలమడఁగఁగ దూఁకెఁ • దరణి యుదయ, గిరి విడిచి యస్తగిరిఁ జేరు • కరణిదోఁప.

చ॥ అరయగఁ బల్లమఁదు పడు • నంబుపులంబలె ధాత్రిఁగూలి కుం
దొరయు త్రికూటముం జలన • మొందఁగ దూఁకిన సూర్యసూతి మున్
ధరణిజ దుఃఖ మొందఁ గని • దానవుపైఁ దన దెండమట్లు పె
న్నురవడి దూఁకినట్టి విహ • గోత్తము పోలిక నొప్పె నత్తఱిన్.

ఉ॥ నీరదగాత్రు తామరస • నేత్రు ఋషధ్వజశైత్రు రాముఁ జె
న్నారఁగఁజూడ గొప్పవగు • నఱలు గల్గుటకున్ మనంబులన్
మీఱిన యుబ్బుగొన్న దివి • మెల్తలు పిగ్గు పడంగఁ బాఱు మా
యూరములట్లు దిక్కునకు • నొక్కరుగాఁ బరువెత్తి రోటమై.

తే॥ ఇన కుమారుండు రావణు • నెదుటనల్ల, మలయెమటఁ దెల్లమల యొండు • నిలుచునట్లు
దిగఁగ హాలాహలము లేవ • దిగులుగొనక, నిఱుచు హరుచందమున నిల్చి • నిర్జరారి

తే॥ వచ్చు కార్యమేమని కపి • వర్యు నడుగ, మాఱుపలుక కాతఁడు దశ • మస్తు నొడలు
పదరఁ దన బలిష్ఠంబగు • బాహువతని, తొమ్మనం దిగఁబడునట్లు • గ్రుమ్మనంత,

తే॥ వృక్షసాంద్రమహారణ్య • విధముగాఁగఁ, బెరిఁగియున్న బాహులతోడఁ • బిడుగుపోల్కి
దెసలు ప్రతిరావములతోడ • దిమ్మపుట్టఁ, గినుక దైత్యుఁడు పొడిచె సు • గ్రీవునురము

క॥ కొట్టినచోటున నెత్తురు, పుట్టఁగఁ గపిరాజు కోప • పూర్ణనయనుఁడై
కిట్టి పదితలల మోముల, గట్టిగ దాఁచెను కడింది • కాలన్ గేలన్.

తే॥ తన్ని నట్టి సుగ్రీవు పా • దములు రెండుఁ, బట్టికొని క్షణమున దృఢ • బలము చూపి
మదగజమును హర్యక్షంబు • మాడ్కి నసుర, విభుఁడు గోడకుఁ జేరిచి • విసరి తాఁచె.

తే॥ తాఁప భానుజుఁ డొడికానఁ • దప్పికొనుచుఁ, గొట్టినట్టి రావణుమేను • క్రుంగునట్లు
నేలకుంద్రోచి కందరఁ • బోలు నోటఁ, గ్రక్కఁ బొడిచి నెత్తురువట్టి • కదఁకఁ ద్రావె.

ఉ॥ కాటుకకొండవంటి ఘన • కాయము గల్గిన రావణుండు చో
క్కాటపు నెత్తుద్రావు ఘన • కర్మని దేహముఁ బాఁపఱేఁడు మేల్
హాటకశైలమూనిన న • యంబునఁ బట్టి బలంబుతోడ ది
క్కూట నగంబుపై నుదుకు • కోపునఁ ద్రిప్పె మిడుంగుఱుల్ వడన్.

చ॥ త్రిపురములన్ దహించుతఱి • రేఁగిన రుద్రునిమాద్రి పొంగి య
క్కపికులకాఁతుఁ దట్లు తన • కాయముఁ ద్రిప్పిన వాని తొమ్మనన్
దపఃకున వాఁడిగోళ్ల దిగ • దాయఁగ గ్రుద్ది దశాస్యు మధ్యమున్
ద్రపగొనఁ బట్టి త్రిప్పి వడిఁ • దాఁచెఁ గడంక నగస్థలోఁ బడన్.

ఉ॥ రావణుఁడుం బదంపడి తి • రంబుగ నచ్చటి కెక్కివచ్చి సు
గ్రీవునిపట్టి త్రోచి దరి • కిం జనుదెమ్మని పంతమాడ నా
త్రోవనె యాతఁడెక్కి పడి • దోర్బలు లిర్వురు బీఱువోక యొ
క్కవడిఁ బోరిపోరి పడి • యాఁగిరి యొక్క యగడ్తలోనికిన్.

క॥ ఇరువురు కుడియెడమలుగాఁ, దిరుగుచు డాయుచును డాయఁ • దిగుచుచుఁ దొలఁగం
జరుగుచు నడఁగుచు లేచుచుఁ, బోరిపోరి శ్రమదీర్చుకొనుచుఁ • బోరిరి కడిమిన్.

గ॥ అగడిత యను పెనుకడలిన్, సొగసుగఁ జిలుకంగ నొక్క • సుడి యేర్పడఁగా
నగచరపతి వాలిక్రియన్, దగఁ గవ్వపుఁగొండపగిది • దనుజుం దొప్పెన్.

తే॥ చెఱకుగానుగనుండి పా • ల్దొరఁగురీతి, గాయములనుండి రక్తంబు • కాఱుచుండ
వార లెగసిరి పక్షుల • వలెనె మింటఁ, బురజనంబులు భీతిల్లి • పరువులెత్త.

తే॥ గగనమందు పోరాడెడు • కపివరుండు, కట్టియొడలున్న రాక్షస • కాంతు పెక్కు
బాహువులచేత నడుమంగఁ బడుచుఁ బరిధి, చుట్టియున్నట్టి నడుమింటి • సూర్యుఁబోలె

తే॥ మింటఁగోపంబుతోఁ బోరు • మిహిరసుతుని, మైకఱకు దన భుజముల • మఱుఁగుపుచ్చు
పంక్తికంఠుఁడొప్పెను దిన • ప్రభునికాంతి, మఱుఁగుపడఁ జేయుదొంతుల • మబ్బు మాడ్కి.

క॥ నూపురములు మ్రోయఁ జెలులు. కాఁపురములు వీడిపాఱఁ • గలఁత వడుచు లం
కాపురము చెడఁగ దాఁటెం. గోపురమడఁగ న్నృసింహు • కోపునఁ గపియున్

తే॥ మెఱుపనెడి దంతములు గల • మేఘ మొక్కఁ, డసదృశంబగు పిడుగు వె • న్నాడుతీరు
తోఁప మ్రింగివైచెదనని • దుడుకుతోడ. వచ్చి రావణుఁ డాతనిఁ • బట్టికొనియె.

సీ॥ డాసిన రావణుఁ • ద్రోసి నేలకు రాచి, సుగ్రీవుఁ డార్చిన • సుర విభుండు
యంత్రంబుక్రియ లేచి • యాతని నెత్తి యె. వ్వలికి దవ్వుగబాఱ • వైవ నతఁడు
చెండువలెనె లేచి • చెలఁగె నాపోరున. ధరణి బీఁటలువాఱెఁ • దరులు విఱిగె
గోడలు వ్రీలెను • గొండలు చలియించెఁ, బ్రాకార మెల్లెడఁ • బగిలి చెడియె

తే॥ గాలిపడగలవలె మింటఁ • గ్రాలుచుండు, వారి దేహస్థితులు దాసె • వదలెఁ గలిసె
నెడసె విసరిరి పొడిచి రం • చెఱుఁగలేక, రక్కసులు నోటగొనిరి దు • రంబు సేయ.

## శ్రీ రాముని చింత

తే॥ ఇట్లు వారికి సంగ్రామ • మెసఁగుచుండ, నీల నీరద వర్ణుండు • నీతిమేర
ప్రాణమిత్రుఁడౌ సుగ్రీవు • రాక గనక, తలఁపులెల్లను కలఁగఁ జిం • తను భజించి.

మత్త॥ ఈవు లేక యసూత్కరంబు వ • హించి యేనొక కార్యమున్
దావుకో జరుపంగ నేర్తునె? త త్త్వవిత్తమ! మిత్రమా!
దేవతాళికిఁ గూర్చినాఁడవు • తీవ్రదుఃఖము నీదు కో
పావిలంబగు దెందమిట్లు జ • యంబు దైత్యుల కిచ్చెఁగా!

మత్త॥ పాయలాని నిశాచరేంద్రుని • మాయ జిక్కితి తప్పిరా
నేయుపాయములేదొకో? యిట • కీవు రాముని క్రూరదై
తేయపాళి జయించియుం గల • దే సుఖంబు? వియోగినై
మాయుచుండఁగఁ బ్రాణమిచ్చిన • మాసనీసు సుహృద్వరా!

ఉ॥ కోరిక యొక్కటైన సుతి • కూడిన దొక్కటియున్నె నక్కటా!
ధారుణిఁ దీవు ధీరంబుగ వృ • థా బ్రదుకన్ మది నిష్పగింప దే
వారియు నిన్ వధింపఁ గడు • నాఅడి చేరఁగ నన్నుగూడ నీ
ఘోర రణంబునందు తెగఁ • గూల్చినవాఁడవు నీప కావొకో?

ఉ॥ నేఁడిటులీవు బ్రుంగ నిట • నిల్చి సురారులఁగూల్చి ప్రాణముల్
పీడుదునేని యాపదల • వేళలఁ దోడయినట్టి మిత్రుఁ గా
పాడఁగలేకపోయెనని • పాపపులోకము నిందసేయ దే?
నీడనుపోలె నన్ను విడ • నేరని చెల్వుఁడ! యట్లొనర్తువే?

ఉ॥ ప్రాణముపోవునట్టి పని • వట్టితి నాపయినున్న ప్రేమచేఁ
బ్రాణ మొసంగి జీవములఁ • దార్చి సుఖంబులఁ గూర్చి నాకు సం
ప్రీణనముం బొనర్చిన య • మేయ గుణాకర! సైన్యమెల్ల ని
న్నాణముగాఁగఁ గ్రమ్మఁటిన • నామది నంగద పాయనేర్చునే?

మ॥ అని శ్రీరాముఁడు దుఃఖ మొంద సట వీ • రాగ్రేసరుల్ గెల్పు ని
ల్పును లేకుండఁగఁ బోరుచుండ నిఁక మే • లంగూర్చుఁ జావైన నం
చును లంకేశ్వరుఁ డెంచ శీర్షకములన్ • శోభిల్లు రత్నంబులన్
దినరాట్పుత్రకుఁ దూడఁదీసికొని ప్రీ • తిం జేరె సీతాపతిన్

ఉ॥ చింతఁ దపించుచున్న రఘు • శేఖరు పాదసరోజ రేణు వ
త్యంతము శీర్షమంటఁగ స • మర్పణసేసెను తన్మణీగణం
బంతట నెల్ల వారలకు • బ్రాణము లప్పుడు వచ్చినట్లు పె
న్వంతసమబ్బె నబ్బె మది • చక్షుల బాష్పముగ్రమ్మె నిమ్మగన్.

ఉ॥ ఎమ్మెదాఁకఁ జీలిన క • పీంద్రుని గాయములందు వచ్చు ర
క్తమ్మును రాక్షసేశ్వరుని • తాఁకిన హైన్యమువోప రాఘవుం
డిమ్మగఁ గౌఁగిలించి నయ • నేంద్రియముల్ వెడలించు బాష్పపూ
రమ్మునఁ దానమార్చి యను • రాగముతో వచియించె నిర్వ్యథిన్.

తే॥ నన్ను నీ వెడఁబాయుట • నామనంబు, భేదన మొనర్చుచుకదా • ప్రేమపూర్ణ!
ఒడలు స్తంభించె మది చేష్ట • లుడిగె జీవ, ములును తల్లడిల్లెను దిగు • లలమికొనియె.

మ॥ కరుణాహీనుఁడు రావణుండు నిను వీఁ • కం జంపి యున్నని త
ద్దురుదోషంబుఁ దలంచి క్రూర శర సం • దోహంబుచే మూలము

ట్టిజ రక్షోన్వయమెల్లఁ గూల్చినను నా • ప్రాణంబులం గాచికో
ధర జీవింతునయేని యోడుటయె గా • దా? మిత్రవాంఛాశయా!

మ॥ ఒకచిత్తంబున నెంతుమేని యశమున్ • యోగ్యత్వమున్ బ్రాయి యో
ర్మికి సత్తంబు నొసంగునట్టివికదా • మేలంబు గారఁబు నీ
వకటా! యెంచ కిహంబు మోక్షమును మా • యంజేసెదే? యూరకే
యొకటింగోరి మఱొండు చేసితివి నీ • కొప్పారునే యీ విధుల్?

శా॥ సంతాపస్థితిగొల్పి యింతదనుకన్ • జాలంబునే సేయుచో
వంతం గుందెడు సీతచే ధరణిచేఁ • బ్రాణంబుచే నాకిటన్
సుంతైనన్ సుఖమబ్బునే? యసువులన్ • స్రుక్కించు లోకంబు వి
శ్రాంతిం గోరక నన్ను వెన్కొనును కా • ర్యంబిట్టులుం గూడునే?

తే॥ పిల్లతనపుఁ జేష్టల నింక • వీడు మనుచు, నుపదలించ రామునికడ • మంపటిల్లి
శిరము వంచిన సింగంబు • కరణినుండి, యిట్టు లనియెను సుగ్రీవుఁ • డీలగొనుచు.

శా॥ కాటంజేసిన గృధ్రరాజుపనియుం • గావింపలేనైతి నా
నాటం జేసిన బోయరాజుపనియున్ • గావింపలేనైతి నీ
నాటం జానకి యొందుచున్న వెఱయున్ • దప్పింపలేనైతి ని
వ్వీటన్ రావణుశీర్షముల్ పదియు న • ర్పింపంగ లేకుంటిఁగా.

మ॥ బలియుండైన విరోధి ప్రాణములతో • భాసిల్లుచున్నాఁడు కీ
శులకుం బోలిన చేష్టఁజూపి తుద కీ • చొప్పెగ్గుంగి నీకీర్తికిం
గలుసుంగొల్పితి నావిరోధి ననిలో • ఖండించి రాజ్యంబు నా
కొలయంగూర్చిన మీకె మీపగఱ నే • నొప్పించితిన్ లేకనై.

తే॥ దిక్కరుల దంతములకంటె • దప్పవయ్యె, నాభుజంబులు నీమహా • బాణములకంటె
ముందుగానేగి ముష్కరు • పగిలఁజేయ, వాంఛనేగి వ్యర్థుండనై • వచ్చినాఁడ.

తే॥ శాస్త్రబలుఁడగు నీదూత • పని యొనర్చె, సమరమున శస్త్రబలమును • శత్రుబలము
బాహుబలము శత్రువు చూప • వాలిబలము, చూపెనా కాలిబలమిట్టుఁ • జూపినాఁడ.

తే॥ అనుచు వినతశిరస్కుఁడై • యర్కసంభవు, సన్నిధిని వసించుచున్న • సమయమునను
అతనిఁగని రాముఁ డెఱుఁగంగ • నసరసేత, యగు విభీషణుఁ డిట్లు ప • ల్కెఁ బొదఁగె.

చ॥ పెకలిచి తెచ్చు రత్నములు • పెట్టిమఁటో దివిజేంద్రవైరి మ
స్తక మకుటాగ్ర సన్మణిక • దంబము కాపున వానికంటె సు
త్సుకతనుకూర్చు వస్తు విఁకఁ • జొప్పడునే దనుజేంద్రుకీర్తి పా
డు కలఁగఁ జేసినాఁడవు సు • దుష్కరమియ్యది యెట్టివారికిన్

చ॥ సలఁచి భుజంగమేంద్రుని ఫ • ణామణు లూడఁగఁ దీయవచ్చుఁగా
కలఘు దనుఃకళాచణు ద • శానను మస్తక రత్నరాజముల్

బలిమిఁ బెకల్చి తెచ్చిన చ • లంబు మగంటిమి రుద్రమూర్తి కే
వలపడునేమి? కీర్తికర • మైనది యింతకు మించి కల్గునే?

చ॥ హరుని శిరంబునం దమరు • నంబుజునైనఁ బెకల్పవచ్చు శ్రీ
హరియురమందు కౌస్తుభము • నైనను బల్మిఁ గొనంగవచ్చు నా
కరణి పనుల్ మగంటిమివి • గావు దశాస్య కిరీట రత్నముల్
పరువడి తీయుటన్న సుల • భంబగు కార్యముకాదు మిత్రమా!

చ॥ మెఱుపులఁబోలు కాంతులను • మించిన యంగద బాహువీర! సం
బరమునఁ జంద్రహాసము ను • మాపతినుండి గడించినట్టి ని
ర్జర రిపు మస్త రత్నములు • రాముఁడు నిల్వ జయేందిరా పదాం
బుజహ మలంకరించుటకుఁ • బూనికఁ దెచ్చిన యందియల్ సుమీ!

చ॥ అనుడు దినేశవంశ్యుఁడను • నయ్య జయేందిర చంచలాత్మ యొ
క్కనువుగ గెల్పుమున్ శుభము • లందవు మేలును కీడువచ్చుఁ గా
వున నిటు సాహసించి యటఁ • బోవలదంటిని నీవు చేయు ని
ష్పని సులభంబె భూమిఁ గొన • పంట ధరించిన పోత్రికేనియున్?

మ॥ జయశీలుండగు దైత్యరాజ మకుటా • చ్ఛ స్ఫార రత్నావళుల్
భయముగ వీడి పెకల్చెఁ బుత్త్రుఁడని నన్ • బాధించునో యంచు సం
శయుఁడై యయ్యెడ దాఁగువానివలె భా • స్వంతుండు క్రుంకెన్ విని
ర్దయులౌ వారికి జంకకుందు రెవరీ • ధాత్రిన్ జగత్సేవకుల్?

తే॥ రాత్రిగాఁగ రావణ శిరో • రత్నచయము, దీపములవలె మిక్కిలి • తేజరిల్ల
నగచరేంద్రుని విజయంబుఁ • బొగడి యలరి, రామచంద్రుండు తనశిబి • రంబు చేరె.

ఉ॥ ఎన్నఁడు నిట్టి భంగములు • నించుక యొందని రావణుండు తన్
బన్నగ నిర్జరావళి నె • పంబిడి కాంచెనొ యంచు సిగ్గుతో
నన్నుల చూపులెల్ల మగ • లన్నల చూపులె యౌచునుండఁ ద
త్ప్రక్కన్నయశంబుమాడ్కి దిగె • ధారణికి న్నడపీన్గు కైవడిన్.

## 12. వ్యూహ నిర్మాణ పటలము. (28)

క॥ మాన నిహత మర్ముఁడగు, దానవ విభు మోము ముడుఁగుఁ • దామరవలెఁ గా
మానగు సౌధమునకుఁ జని, పానాదికములను వీడి • పడకకుఁ జేరెన్.

సీ॥ వాఁడి కోలలచేత • వీడు మణులచేత, నిట్టూర్పు పెనునోళ్ల • నియతిచేత
తలల విరివిచేత • దామోదరుని వీడి, పాలకడలినుండు • పాముపోలె
నుండ జననికంటె • మెండుగ నలవాటు, పడిన వారలనైన • భ్రమలుపుచ్చు
శార్దూలుఁడను వేగు • సరగున నటకురా, ద్వారపాలకుఁడు దై • త్య విభుఁజేరి

తే॥ వైరులను డాసి వారల • పనులెఱింగి, రమ్మనిన గూఢచారి ద్వా • రంబుచేరె
సెలవె? యనఁ దల పంకించి • చేతిసైఁగ, సేయఁ గంచుకి వానిని • చేరఁబిలిచె

తే॥ ఎఱిఁగినట్టి వృత్తము వచి • యింపుమనఁగ, బ్రభుని మోముజాడను తాప • పడుటదెలిసి
జంకుచును వేగు మెల్లఁ దాఁ • జన్న మొదలు, గాంచినది పద్ధతిగఁ జెప్పఁ • గాఁదొడంగె.

తే॥ పదియునేడు వెల్వలతోడఁ • బవనసుతుఁడు, మొనసి పడమటివాకిలి • ముట్టఁజనియెఁ
బదియునేడు వెల్లువలతోఁ • బ్లవగరాజు, నుంచుకొనియె రాముఁడు తన • యొద్దనధిప!

తే॥ పదియునేడు రాణువలతో • వాలికొడుకు, దక్షిణంపుగవని ముట్టఁ • దరలినాఁడు
పదియునేడు నేరువలతోఁ • బరవి నీలుఁ, డరిగెఁ దూరుపువాకిలి • నాక్రమింప.

తే॥ వాహినీద్వయమును పోరు • వారికెల్లఁ, బండ్లు గాయలు శేర నే • ర్పఱచె నీదు
తమ్ముఁ డన్ని గవంకులఁ • దనరు స్థితుల, నరసి తెలుపుచునుండు న • ట్లాజయయ్యె.

మ॥ అని శార్దూలుఁడు పల్క రావణుఁడు రౌ • ద్రాకారుఁడై రేఁగి పం
డ్లను దర్పమ్మున గీఁటుచున్ బగటుఁ జం • డ ప్రక్రియన్ రేపె తు
త్తునియల్ సేసి రణాంగణంబున మహో • త్తుంగంబుగా లేచు ధూ
ళిని గ్రుంగించెద రక్తపూరమున నా • లీనంబుగాఁ జూడుమా.

మ॥ తరుసాంద్రంబగు నీలశైలముపయిం • దార్కొన్న లేయెండ వై
ఖరి రక్తంబుల డాలు మైనొలయ లం • కానాథుఁ డవ్వేగు నం
పి రయంబారఁగ రేఁపు వృత్తిగల పూ • విల్కానిచే మాఁడు పూ
సరముల్ మాఱిచి యేగె మంతనముకై • సన్మిత్ర వర్గంబుతో

సీ॥ బయలె యయ్యది యని • బమ్మెర గొలుపు ప, టికరాలచేతఁగ • ట్టింపఁబడిన
సౌధంబునందు పి • శాచగణంబులఁ, జుట్టుకావలిగాఁగ • నొరిది పిలిపి
కర్తవ్యమును చక్కఁ • గా విమర్శించి వ, చించు నుత్తమ కుల • శీలపరులఁ
గని మహాద్వారంబు • లను కోఁతిమూఁకలు, ముట్టడించెను పెను • పోరుగలిగె

తే॥ వచ్చినది వలదన్నను • వదలఁబోదు, తలఁచి చేయంగ • దగినది • తెలుపుఁడనిన
వారిలో నికుంభుండను • వాఁడులేచి, పంక్తికంఠు మోమును కాంచి • పలికెనిట్లు.

ఉ॥ డెబ్బది వెల్లువల్ ప్లవగ • డింభకముల్ మనకోట ముట్టుచున్.
నిబ్బర మొందియుండెనని • నీవిటఁ • జింతిలుచుంటివేల? మే
లబ్బెను వేయివెల్లువలు • హాళిగ సైన్యము వారికోరికల్
దబ్బఱసేయఁ గాంక్షగొని • తత్తఱ మందుచునుంట గాంచవో?

చ॥ ముసల గదాది సాధన స • ముత్కరముల్ ధరియించి వచ్చి రా
క్షసు లెదిరించి నిల్వఁ బ్రిద • శప్రకరంబులె కేలు మోడ్చి వే
డెసలకుఁ బాఱుచుండు నన • దిక్కఱి బ్రామ లెదు కోఁతిమూఁక య
క్కసుగొని వట్టిచేతులను • కాంచు జయంబది మెచ్చఁగాఁదగునా,

తే॥ అనిరణోత్సాహ వాక్యంబు • లాడుచుండ, మాన్యసూర్యవంశుఁడు వాలి • మనసునొంచి
వేధ మొనరించు రాముమ్మ • పేరుతోడఁ, బెలచె సరియెంచి యాపిఁ • జెప్పఁబూనె.

సీ॥ మన నగరముచొచ్చి • యసలంకు పరికొల్పి, సిబుచేసిన యాంజ • నేయుచేత
శరములుండెనొ శరా • సనముండెనొ పట్టి, కాలుని కేలును • వాలుగార
మలలట్టి యాదశ • మస్తకంబులుసున్న, ముఖులఁ గొంపోయిన • వనచరునకు
కూలముండెనొ క్రింది • పాలముండెనొ గొప్ప, వాలముండెనొ తలఁ • పంగవలదె?

తే॥ రామచంద్రుని బాణముల్ • రాముమున్నె, యుర్విజ నొసంగి సాయుధీ • యుల మనాయు
ధీయులను శరణనుచుఁ బ్రా • ర్థించుటొక్క, యిమ్మనక్కవేతొక రక్ష • కమ్మకలదె?.

ఉ॥ నాశముగూర్పనున్నవిధి • నాలుకఁ బ్రిస్పుచునుండఁ జూచి లం
కేశుఁడు తాతపల్కులకు • వీక్షుము ల్కడుఁ గెంపుచేసి నా
కీ శని దాపురించెఁ జన • విచ్చ కతమ్మున నంచు దుష్టవిధా
పేశము గొల్పు పల్కులను • వీడుము నా నతఁడూనె మౌనమున్.

తే॥ అనివి తలసూపు కాలకే • యాదుల మద, మడఁగఁజేసినవీర! ప్ర • హస్త! యారి
తేజియున్న సైన్యముల ని • న్నూలు వెల్లి, పలను కొనుచుఁ దూర్పు గవని • వలనికరుగు.

తే॥ దుర్ముఖర్గృతాంతు ఘోషంబు • తూలపుచ్చు, బలి! మహోదరా! మన మహా • పార్శ్వుతోడ
రెండువందల వెల్వల • నందగఁ గొని, దక్షిణపుఁ గోట వాకిటి • దండ నిలుము.

ఉ॥ ఇచ్చటఁ బ్రజ్ఞలాడ ఫల • మేమియుఁ గల్గదు మేఘనాద! నాఁ
డచ్చుగ వాయుసూనుని ప • రాక్రమముం దగఁగాంచితే కదా!
నచ్చిన వారితోడ జత • నంబున రెండగు వంద వాహినుల్
చెచ్చెరఁ గొంచుఁ బశ్చిమము • చేరుము వారలకంటె మున్నుగన్.

మ॥ అరుదా జీవితమెల్ల వేల్పులకుఁ గ • ష్టౌఘంబులం గూర్పనే
యరిగె న్నీసరివీరులెవ్వరు విరూ • పాక్షా! యలంతుల్ వనే
చరులం గూల్పఁగఁబోవు టెల్లిదమగున్ • జర్చింపఁగా నీకు ను
ద్ధురమౌ మూలబలంబుతోడఁ బుర ము • ద్యోగంబుతోఁ గావుమా.

ఉ॥ ఇమ్ముగ సత్యలోకమున • కీవలనున్న జగంబులందునన్
ముమ్మరమైన పోరులను • మున్ జయమందు శతాంగ వారణా
శ్వమ్ములఁ గాల్బలంబు లిరు • వందల వెల్వలఁగొంచు నేనె ము
ఖ్యమ్ముగ నుత్తరంపు దెసఁ • గాచెద నంచు వచించి పంచినన్.

సీ॥ జగము కళంకమొం • దఁగ హేతువైన త, మంబు రూపొందు క • ల్పంబుమాయ
సర్వదా సుఖులయి • సంచరించెడు సుర, గణములు మాత్రమా • కాదుకాదు

ఇహ భోగములఁ ద్యజి • యించిన మౌని ని కాయంబు మాత్రమా • కాదు కాదు
అడజడి కూడుగా • గడియ యుగంబుగాఁ, గల సీతమాత్రమా • కాదుకాదు
తే॥ కడకు రాముఁడు మాత్రమా • కాదు కాదు, కర్బురేంద్రుండు మాత్రమా • కాదుకాదు
ఎల్లవార లానందాన • నుల్లసిలిరి, తిమిర మడఁగుచు భల్లునఁ • దెల్లవాఱ.

మ॥ కరుణాహీనుని చండశాసనము నీఁ • గన్ లేక యల్లాడు చి
ల్లర పేఁడుల్ తలయొగ్గి యుండఁదగు వే • ళ౯ సార్వభౌముండు ము
ష్కరులం గూల్పఁగవచ్చుచోఁ గనెడు వీఁ • కన్ లోక ముత్కంఠతో
వెరవారం గనుచుండ వెల్వడెఁ దమో • విద్వేషి వ్యోమంబునన్.

చ॥ తెల తెలవాఱుచుండఁగనె • దిక్కుల ముంపఁగఁ బాదధూళి పే
రులివు సముద్రఘోషణము • నొత్తఁగ వానరసైన్యనాయకుల్
తెలిపిన పద్ధతిం బ్లవగ • ధీరులు మిక్కిలి యుత్సహించుచున్
దలకొని ముట్టి రొక్క మొగి • దానవనాథు పురంబు వాకిళుల్.

తే॥ చుట్టి యండంబు లగలంగఁ • జుక్క లురల, నాస్ఫటింపఁగ సౌమిత్రి • యగచరేంద్రుఁ
డౌసరముందుగా నడవ దీ • వనలు మఘవుఁ, డౌసఁగ జానకీవిభుఁడాజి • కెనఁగ నడచె.

తే॥ పాతకుండగు రావణు • పట్టణంబు, దైత్యసేనయన్ కడలిచేఁ • ద్రావఁబడిన
కరణిఁ గనిపించెఁ గపిసేన • కవియుతీరు, దాని క్షీరాబ్ధిచట్టిన • వైనమయ్యె.

ఉ॥ లెక్కకు మీఱియుండిన ని • లింప విరోధుల గుంపు లగ్గమౌ
చెక్కునఁ గోఁతిమూఁక నెగ • దెన్ వల మీలకుఁ బన్నుకై వడిన్
మిక్కిలి వాతఘాతమున • మీఱి సముద్రములేదు రేఁగఁగా
నక్కుచుఁ బ్రొక్కుఁడౌ జగమ • నంగఁదగె౯ దనుజేంద్రసైన్యముల్.

## 13. అంగద దౌత్య పటలము. (43)

ఉ॥ జంకొక యింత లేని కపి • చంద్రులతో రఘువర్యుఁ డుద్ధతి౯
లంకను ముట్టడించి యక • లంకను సీతను దొంగిలించు ధూ
ర్తుంకిలిసేయరాని హృద • యంబున భావనసేసి దైత్య తూ
లంకష మౌక్తికంబనఁ జె • లంగు విభీషణుఁ గాంచి యిట్లనున్.

క॥ ఒకదూతను లంకేశ్వరు, నికటంబునకంపి ధార • ణిజను విడ నొ
ప్పికొనెదొ? యని సేసెదొ? యని, ప్రకటించుట రాజనీతి • పద్ధతి యనఁగన్.

ఉ॥ మేలని యవ్విభీషణుఁడు • మెచ్చె విభాకరపుత్త్రుఁ డిద్దియే
పోలును సద్గుణాఢ్యులగు • భూపలకంచును సమ్మతించె బా
ణాలిని గాక వాక్యముల • నల్పువి వేఁడుట కూడదంచు సం
శీలుఁడు లక్ష్మణుండు నిర • సించుచు వెండియు నన్న కిట్లనున్.

చ॥ చెదుగులొనర్చె వేల్పులఁ దు • శీలఁ గులాంగన సీతఁ గారలోఁ
బడ నునిచెన్ మునీంద్రులకు • బాధలు పెట్టెను బ్రాణికోటికిన్
బెదఁదలఁగొల్పె లోకముల • వీకున నేలఁగ నింద్రభోగముల్
చెదనొడిపెన్ జరించె బహు • చేష్టలఁ ద్రోవలుకాని త్రోవలన్.

తే॥ సిలుగులం గూర్చి మిగుల వం • చించి నీకు, సతివియోగంబుగూర్చెన • య్యతివ కద్దు
పడు యుగాంతంబుఁ జూడఁగొ • ప్పదు చిరాయు, వొప్పుతండ్రి జటాయువు • నుక్కడంచె.

ఉ॥ రావణుఁ డిప్పు నీవలపు • రాణిని వీడెనయేని వాని ర
క్షావిధిఁ గాతువేని త్రిజ • గంబుల నీదగు పేరునిల్చు కా
లావధి లంకనేలు మను • జా! యను వాక్యము రిత్తవోవదే?
యేవగ నిల్చుఁ దాపసుల • కిచ్చిన నీ యభయప్రమాణముల్?

చ॥ నెఱియును గొంపపంబు మది • నిల్పి వచించిన యాప్రతిజ్ఞలన్
మఱచితివేమి? లంకఁగల • మానిత సంపదలెల్లఁగాంచి యి
త్తెఱఁగునఁ జేటుగూర్ప మది • తీరద యేమి? యనేక రీతులం
దఱిమి తలంచినన్ దురమె • నాముదికిం దగునంచుఁ ద్రోఁచెడిన్

సీ॥ అనుడు రాఘవుఁ డిట్టు • లను లక్ష్మణా! నేను, మదిలోన నేదియు • మఱవలేదు
నిక్కంబుగాఁ దుది • నెగడునదియుఁ బోరె, కాన నాసడి మన • మూననేల?
గురుశుక్రులాదిగా • గుణధర్మశాసకుల్, పలికిన పద్ధతుల్ • దొలఁగఁదగునె?
వీరవర్యుల కేని • విజయహేతువు క్షమ, రాచపాడియు క్షమ • రాణనొందు

తే॥ మరలమారుతిఁ బంపుట • యురవుకాదు, పగఱకును సుల్కనగుఁగాన • వాలిసుతుఁడె
పోయి రాఁదగువాఁడు పా • పులు కలంగి, విక్రమించిన నోర్చి రా • వెరవరియగు.

తే॥ అనుచు నెల్లవారలు సరి • యన్న పిదప, నంగదునిపిల్చి నీవేగి • యసురయెదుటఁ
బలుకవలసిన యర్థంబు • నలుకులేక, తెలుపుమన నాతఁ డుత్సాహ • ధీరుఁడయ్యె.

మ॥ తెలివిన్ జానకి వీడి జీవముల ర • క్తిన్ గాచికోల్మేలొ? కా
కిల నీ మస్తకముల్ ధినేశకులు ను • గ్రేష్వాస నిర్ముక్త శా
త లసత్క్రూర శరమ్ములం దెగిపడన్ • దర్పించి యాయోధన
స్థలి కేతెంచుట మేలొ? రెంట నొకటిం • దర్కించుమంచాడుమా.

ఉ॥ మోదముకై యడంగి పెఱ • పూని వసించుట ధర్మమార్గమున్
గాదు పరాక్రమ క్రమము • గాదు మగంటిమిగాదు మేలిమిన్
గాదు విరోధివక్షమునఁ • గాఁడ శరంబుల, నేయుశక్తి నిం
పాదిగఁ గల్గెనేని పొలు • పార నెదుర్చుమ యంచు నాడుమా.

చ॥ అని పనుపంగ మారుతికి • నవ్వల నెన్నఁగఁదగ్గవాఁడ వీ
వను గరువంబు గల్గెనని • యంగదుఁడార్యుని పాదపద్మ వం

దన మొనరించి యంబర ప • థంబున సింగము దాఁటుభంగి రా
ముని శరమట్టు లేగె సుర • ముఖ్యులు కాంచి ప్రశంస సేయఁగన్.

ఉ॥ ఉగ్ర నిశాచరావళుల • యుక్కడఁ జేయఁగ క్షీరసాగరో
దగ్ర భుజంగతల్పమునఁ • దందరమాని యయోధ్యయందు సు
వ్యగ్రమతిం జనించిన కృ • పాళుని యాజ్ఞను వాలిపుత్త్ర కుం
డుగ్ర మయూఖుఁడుం గనని • యున్నత దుర్గముదాఁటి యుద్ధతిన్.

ఉ॥ రావణు కొల్వు చేరి నగ • రస్థ జనుల్ హనుమంతె వచ్చెనం
చీవల వావలం బరుగు • లెత్తుచు బంధులఁ జేరుచుండ సే
నావలిఁ గాంచుచున్ హితుల • యార్యుల మంత్రుల యుక్తవాక్యముల్
భావనసేయు దైత్యకుల • వర్యుని గాంచె సభా స్థలంబునన్.

ఉ॥ తాలను చెట్లు గన్గె జల • రాశిని పూడ్చితిమన్న గర్వముం
బోలఁగఁ గల్గెఁగాక తల • వోయఁగ రాఘవుకార్ముకంబు నే
త్రాలకు గోచరింప నెడ • దన్ భయమందునుగాక క్రొత్తగాఁ
గాలుఁడు పుట్టెనేమి దశ • కంఠుని ప్రాణము దీయ నేఁటికిన్?

ఉ॥ వీని బలాదికంబు తల • పెట్టిన వాలునఁగట్టు గోత్రభి
త్సూను నురఃస్థలంబు నొక • తూపున వ్రచ్చిన రామచంద్రుఁడే
పూవి వధింపవచ్చు ననఁ • బోలును గాని మనంగ నాస లో
నూనిన యొక్కప్రాణి యొక • యొప్పమి వీనికిఁ జేయనెంచునే?

తే॥ అంగదుండిట్లు తలపోసి • యగ్నివిషము, కాలుఁడను మూఁటిచేఁ బద • కరములొంది
యున్న కదలినాఁ జను దశా • స్యుండు వఱలు, సింహపీఠిక దగ్గఱఁ • జేరి నిలిచె.

చ॥ నిలిచిన యంగదుం దనుజ • నేత. ఖరేక్షణపంక్తిఁ జూచి ని
శ్చలమతి వచ్చు హేతువది • చక్కఁగఁ దెల్పుము నీవెవండ వీ
పొలదిను సేవకుల్ గనక • మున్నె శుభంబగు వార్త లుండినన్
బలుకుమ యన్న నాతఁడును • పక్కున నవ్వి వచించె నివ్విధిన్.

ఉ॥ నిండిన భూతపంచకము • నేత సమస్త జగత్ప్రభుండు మా
ర్తాండకులుం డయోనిజ ధ • రాత్మజభర్త జితేంద్రియుండు కో
దండధరుండు వేదముల • దాఁటిన వస్తువు ధాతతాత శ్రీ
దుండగు రామచంద్రవిభు • దూతగ వచ్చితి నేను రావణా?

ఉ॥ అంగదుఁ డిట్లుపల్కఁ నఁజుఁ • డా? హరియా? హరుఁడా? వనాటులన్
సంగడికాండ్రఁ జేసికొని • సంద్రపుఁ గాల్వను పూడ్చివచ్చి పీ
తాంగన నిచ్చునేమొ కరు • ణాత్మకుఁడై యని పంపినట్టి యా
వెంగలియో ముకుందుఁడవి • వీకున దానవనేత నవ్వుచున్.

చ॥ నెలను వియన్నదిన్ నొసటి • నేత్రముఁ దాల్చిన రుద్రమూర్తియుం
మెలుపుగ శంఖచక్రములు • పూనిన విష్ణుఁడు లంకలోనికిన్
దలఁకెడువారు వచ్చుటకు • దర్పముతో నొకమర్త్యుకై భయా
కులుఁడవు గాక వచ్చు మొఱ • కుండ వదెవ్వఁడవో వచింపుమా.

తే॥ అనుడు నిను తనవాలున • కంటఁగట్టి, వనములందెల్లఁదిరిగిన • వాఁడు సురల
కొఱకు క్షీరవారాశిని • తరిచినట్టి, యగచరేశ్వరు పుత్త్రుండ • నంగదుండ.

క॥ అన రావణుఁ డిట్లను నీ, జనకుఁడు నామిత్త్రుఁ డీవు • చనుదెంచుట మే
లెనసెను నరునకు దూతగఁ, జనునయ్యా రాఁగ మేము • చచ్చితిమె? కటా!

ఉ॥ నీకిపుడే యొసంగితి వ • నేచరరాజ్యము తండ్రిఁ జంపు లుం
టాకుని వెంటఁ జేతులు మ • డంచి మొగంబును వ్రేలవైచి నీ
శ్రీకునివోలె గౌరవము • చేటుగ నెల్లిద మొందుటేల? సీ
తా కమలాక్షిఁ గొంటినటు • తప్పక గొందును నిన్ను పుత్త్రుఁగన్.

చ॥ మనుజులు నేఁడె వత్తు రను • మానము మానుము మానసంబునన్
వనచరరాజ్య మీదినమె • పట్టము గట్టెద సింహపీఠిపై
దనుజ నిలింప వానర క • దంబము సన్నుతి సేయుచుండ న
త్యనుపమ భోగసం • పదల • నందుము కల్పముదాఁక వేడ్కమై.

చ॥ అనవిని వాలిపుత్త్రుఁడు భు • జార్గళముల్ వదనమ్ము ఱొమ్ము ప
ట్టనమును సంచలింప నగి • టక్కరి! యెంతటి మాటలాడె దీ
దనుజులకెల్ల నిందు మృతి • తప్పనిదంచు నెఱింగికాదె నీ
యనుజుఁడు నిన్ను వీడి సుఖ • మందఁగ వచ్చెను మమ్ముచేరఁగన్.

ఉ॥ నోటికి వచ్చినట్లు పెడ • నుడ్గులు ప్రేలుచు నన్ను లోఁగొనన్
గాటపు యత్నముం జలుపఁ • గా వశమౌటకు బేలఁగాను నీ
యాటలు సాగవింక నృపుఁ • డంపఁగ వచ్చుట నీచకార్యమే?
నీటుగఁ గుక్క యీయఁ గొను • నే మృగరాజు మృగాధిపత్యమున్?

చ॥ అనవిని రావణుండు కడు • నల్కను లేచియు నీచు వానరున్
దునుమఁగ నాయుధంబు గొన • న్యూనత గల్గదె యంచు నాయువున్
జినిఁగిన మర్త్యు నమ్మి మృతిఁ • జెంద మనోరథమయ్యెనేని వ
చ్చిన పని తెల్పుమన్నఁ గపి • సింహము దానవుఁ గాంచి యిట్లనున్.

చ॥ ఇంకను నెమ్మది న్నెనరు • నీఁగని రాముఁడు నిన్నుగాంచి నీ
లంకఁ గలట్టి నీ కుల బ • లంబుల నాశము గోరి పోరికిన్
జంకి మరింప భీతిలిన • సాగునె? విప్పులు మ్రింగి యేద్వఁగా
నింకునె? సీత వీడు మది • యుంచనిచో నని వీడు ప్రాణముల్.

శా॥ నీయవ్వన్ మడియించుచో ముఖమునన్ • నీమామ నుగ్గాడుచో
దాయన్వచ్చిన నీదు చెల్లియలి సౌం • దర్యంబు పోకార్చుచో
నీయాజ్ఞన్నెఱవేర్చు తమ్ములననిన్ • నిర్జించుచో రాని పం
దా! యీనాఁడిఁకఁ జూపు పౌరుషము క • ద్దా? దాఁగి జీవింతువే?

చ॥ బదనిక సంతతంబు పర • పాదప భుక్తి గ్రహించుభంగిఁ బె
ల్లిదమగు కల్వు సస్యతతి • లేబరముం బొనరించుమాడ్కి దు
ర్మదులయి ప్రాణివర్గముల • మూడ్చుచునుండిన నీదు బంధులా
గదనమునందు చంపుతఱిఁ • గావఁగరా విపుడేవి వత్తువే?

ఉ॥ తమ్మని నన్ను వంచన వి • ధమ్మున దవ్వులకంపి దారఁ జౌ
ర్యమ్మునఁ గొంచుఁబోవు కలు • షాత్ముఁడు పోరొనరింప వచ్చునే?
నెమ్మది సీతఁగాంచి రజ • నీచరులన్ సమయించి పుత్త్రుఁ బా
దమ్మున రాచి మారుతి ము • దమ్మున లంకను కాల్చినన్ సరే.

ఉ॥ వేగుల భీతిమాన్చి విడి • పించినయప్పుడు వార్ధిరాయఁడున్
జాఁగిలి మ్రొక్కినప్పుడును • సమ్మతి లంకను తమ్ముఁడొందుచో
సాగరబంధనమ్ము వడి • సాగెడునప్పుడు రాని పంద యిం
కేగతివచ్చు యుద్ధమున • కేత్తెఱ డాఁగక యాఁటదింబలెన్.

చ॥ చెఱఁగలవేల్పు చెల్వలు హ • సించుచుఁ జూడఁగ నవ్వలంకలన్
బఱపుగ నున్న నాగ సుర • పద్మదళాక్షులముందు నిన్న భా
స్వరసుతుచే నడిన్ మకుట • భంగమునొందియు సిగ్గుమాలి వెన్
దఱుముచురాని భీరుకుఁడు • ధైర్యముతో దురముం దలంచునే?

చ॥ అని తెలియంగఁ బల్కుమని • యార్యుఁడు పంపెను మేలుగోరినన్
జనకజనిచ్చి రామపద • సన్నిధి వ్రాలి సుఖంబునొందు మా
పని తగదందువే వెడలఁ • బాఱుము నావెనువెంట నిప్పుడే
యని మొనఁ బుత్త్ర బాంధవ హి • తానుజవర్గముతోడఁ జావఁగన్.

ఉ॥ నీటను మంట మింట నగి • నిం జనియించిన ప్రాణిసంచయం
బోట భజింప సంగరము • లోజ నొనర్చిన నీవు నేఁడు నీ
వీటనె చేరి శాత్రవులు • వీరరవంబులతోడఁ బిల్వఁగా
నేటికిఁ గొంతయట్ల చరి • యించెదు రమ్మిఁకఁ జావ రావణా!

॥ అను నంగదు పలుకులు విని, దనుజేంద్రుఁడు జగము మ్రింగు • దారుణ కోపం
బున వీనిని పట్టుఁడు ధా, త్రిని మోఁదుఁడు చంపుఁడవి వి • ధించె నలువురన్.
॥ నలువురు తను పట్టఁగ వా, రలతో వాలిసుతుఁ డుప్ప • రమున కెగసి వా
రల తలల గిల్లి రావణు, తలకెదురుగ వైచి త్రొక్కి • తగ నిట్లనియెన్.

క॥ పొగలెగయ చగ్నులయియుచు, నెగయొందఁగ వెడలు రామ • భీమాస్త్రంబుల్
నెగడి నెఱియుటరు మున్నే సగరి విడిచి పాఱిపొందు • వాల్ల దెసలకున్.

తే॥ అని పలికి చిందు నల్లమై • నలసుకొని ర, లాపముం బోలెఁ గోలాహ • లముగ నార్చు
చద్రి బింబంబు దిగినట్టి యనుపుదో౯ఁప, నంగదుఁడు వచ్చి మ్రొక్కె రా • మాంఘ్రులకును

తే॥ రావణునితలంపెదియని • రాముఁడడుగఁ, బూర్తిగాఁ దెల్పఫలమేమి? మొఱఁకువాఁడు
శిరములు పదియు రణభూమి • బొరలుదాఁక, వలపు మానఁజాలఁడనియె • వాలికొడుకు.

## 14. ప్రథమ యుద్ధ పటలము. (256)

తే॥ రణము తప్పనిదనియుఁ బ్రా • రంభమయ్యె, ననియు సూచింప మురజవా • ద్యములు మ్రోఁగె
న్యములఁగాంచి శ్రీరామ • జనవిభుండు, మొగ్గరములతోఁ గవఁకులఁ • బొదువుఁడనియె

ఆ॥ వార్ధిఁ బూడ్చి మున్ను • వాదుకపడియున్న. కేలతోడఁ దరులు • గిరులు తెచ్చి
నగరి చుట్టునున్న • యగడిత పూర్తిగాఁ, బూడ్చివేయుఁ డిదియ • మొదటిచేఁత.

తే॥ తరువులను వైచి రానీక • తదయఁజేసి, లగ్గపట్టి వప్రంబుల • నగ్గపఱచు
కొనుఁడు పేరెత్తి సంగ్రామ • మునకుఁ బిలుఁడు, వెనుకదీయకుఁడో కపి • వీరులార!

క॥ అను శ్రీరాముని యానతిఁ. గొని క్రోల్పులులట్లు చెలఁగి • కుధరవరులు దాఁ
పున నుండు తరుల గిరులను, గొని పూడ్చిరి వనధిఁబోలి • కొఱలెడు పరిఖన్.

క॥ ఎనిమిదవ వనధియన నొ, ప్పిన సైన్యము పరిఖఁ బూడ్చ • వెడలు జలము రా
మునకున్ సాయపడిన య, చ్చున వాకిండ్లందు తూఱి • చుట్టెను నగరిన్.

క॥ గెలుపుగల దనుజ కీరితి, మొలకలతోఁ బెల్లగించి • ముంచిన క్రియ మొ
గ్గలతోడి యబ్జముల దుం, పల తోడఁ బెకల్చి పూడ్చి • వైచిరి ప్లవగుల్.

క॥ నీరములఁ గపులు దుముకఁగఁ, దారంబులఁ బాడుతేంట్లు • తబ్బిబ్బువడన్
నీరజములఁ గల హంస కి, శోరంబులు బెదర మీలు • స్రుక్కుచుఁ ద్రుళ్లెన్.

క॥ ఇందీవరములు మొగుడఁగ, నిందితుఁడగు దనుజకీర్తి • నేఁటికి జలధిం
జెందెనని కనులు మోడిచి, కందక మేడిచిన పగిది • గన్పట్టె నటన్.

క॥ తమ్ములు పెకలింపంబడఁ, దుమ్మెదలను రొదలు చెదరఁగఁ • దొలఁగి పఱచె హం
సమ్ములు ముక్కులఁ దమయం, దమ్ములుగొని త్రోవ తడఁబ • డన్ వడిఁబాఱెన్.

క॥ శిలలు మలలు గుమురగు తరు, వులు దట్టముగాఁగ నిండి • పూఁడుటచే నం
దలి జలము పొంగి పలు కా, ఖల నదులై పాఱి కడకుఁ • గదలిం గలిసెన్.

క॥ కొండలు వైచుకొలఁది సుడి, గుండంబులఁ బూఁడి నీటఁ • గొంచెముగాఁ బై
నుండి కనఁబడెడు తోయజ, షండము లెనసెఁ మునుంగు • సతుల మొగములన్.

క॥ గౌరవములకు న్నిలయం, బౌ రావణు పెద్దపరిఖ • నగచర బలముల్
దోరుపఁగాఁ దోఁచెను సం, సారికిఁ బేదఱిమి కలిమి • చంచల మనుచున్.

క॥ అగడితఁ బూడ్చిన కోఁతులు, జగడించిన దనుజ బలముఁ • జక్కాడుచుఁ బై
కెగసి బురుజులను చేరుచు, మొగుళులు చెదరంగ మోద • మున గర్జించెన్

క॥ బలువౌ కనకాచలమని, తలఁపందగి యాకసంబు • దాఁకెడు దుర్గం
బులపై నెక్కిన వనచర, బలములు తెల్లని ధ్వజాళి • పగిదిం దోఁచెన్.

చ॥ రతనపుఁ డెంకియైన గిరి • రాజము మేరువు త్రాసుగుండుగా
జతనునఁ దూఁచఁగా సమత • సాగు వనేచర బృంద మొక్కటన్
మితి యెడమీఱి మెట్టఁగ న • మేయ భరంబు సహింపలేకయే
కుతికిలఁగ్రుంగె నాప్రహరి • కూల్పఁగ నక్కఱ గూర్చ కత్తఱిన్.

క॥ మురజముల మోఁదు మదకరి, వరములపై వెలయు డాలు • వరుసలచే నం
బరము మఱుఁగయ్యె ధూళిం, గుఱుచయ్యెం దెసలు దనుజ • కోటి వెడలఁగన్.

ఉ॥ భేరులమ్రోఁత నంబరము • భేదిలె గర్జనచేసె సింగముల్
హేషలుం జలించె నట • దశ్వ గళస్థిత కింకిణీ రుతుల్
తేరుల గంటలుం గలిసి • దిగ్బధిరత్వము సేసెఁ దోడుగా
వారణ కంఠ ఘంటిక ల • వారిత రీతిని వైచెఁ దాళముల్.

చ॥ కులములతో సమూలముగఁ • గ్రూరులు దానవులెల్లఁ గూల ను
జ్జ్వలగతి దేవ మానవుల • సంఘము తావుకొనంగఁ గాల మ
త్యలఘుగతి న్నిమిత్తముల • నారయఁ దెల్పుచునుండ వానరా
వలియుఁ గుతూహలం బడర • వచ్చిన సోఁకులతోడ డీకొనెన్.

క॥ వానర సేనలు కరదం, ష్ట్రా నఖ తరు గిరులతోడఁ • జలమునఁ బెనఁగెన్
దానవ సేనలు పోరెను, బాణ ముసల ఖడ్గ కుంత • పరశు గదలతోన్.

క॥ అమ్ములచేఁ బాషాణము, లమ్ములు నురు తరులచేత • నఱిముఱి యయ్యెన్
ఇమ్మిగ దూసి వెడలు కుం, తమ్ములచేఁ దెగిన తరులు • ధరణిం గూలెన్.

తే॥ కదనమునఁ గపులైచిన • కఠినశిలలు, తగిలి దైత్యులశిరములు • పగిలి రుధిర
పూరములతోడ మెదడును • ముక్కులందు, చెవుల నోటను వెలువడి • చెదరిపడియె.

తే॥ చీఁకటులె యోడిపాఱుమై • చెన్నుగలుగు, పొలసుదిండులశరములు • పొడువఁగాఱు
రుధిరధారలలో వాన • రులు మలంగి, కేలఁగల ఱాలతో ధరఁ • గూలినారు.

ఆ॥ కోటకొనలనుండి • కోఁతులువైచిన, ఱాలు పిడుగులట్లు • రాలుకతన
ఱాలు తగిలినట్టి రాకాసివీరుల, నొక్కరైన బ్రదికి • యుండరైరి.

ఆ॥ మిహిర తేజమట్లు • మిఱుమిట్లు గొలుపు క, న్నులు గలట్టి రక్క • సులు కదంగి
వైచినట్టి యీఁటె • లేచిన కపుల తొ, మ్ములకు దవులఁ బ్రహరి • వెలికిఁ బడిరి.

తే॥ కపులు మిక్కిలి కోపులై • గుంచి పొదివి, మెదల నులిమియు గోళ్లతో • నొదలు బరికి
కాలఁదన్ని వాలంబుల • బిలబట్టి, కొట్టి పెక్కండ్ర సోకులఁ • గూల్చినారు.

తే॥ వంచడులగుదైత్యులపిచి • పైచియేసి, కొట్టి పొడుచుచు మూఁగఁగాఁ • గోతిమూఁక
తగ్గికాలును శేలును • తలలు మెదలు, దునిసి వేలయి నెత్తుట • మునిగిపోయె.

ఉ॥ చిల్లుసఁ జిమ్మ నెత్తుటను • చెన్నగు బంగరుకోట చూడఁగా
నెల్లనయై ప్రవాళగిరి • యేపునఁ జుట్టినరీతి నేర్పడెన్
పల్లుగ నెత్రుచేఱ్ఱు శప • పర్వతపంక్తుల నడ్డుదిడ్డుగా
బిల్లున సీడ్చికొంచుఁ గడు • భీకరలీలఁ జనెం బయోధికిన్.

తే॥ హరిహయుండేని సాధింప • ననుపపడని, లంకపైఁ బలుజాతుల • కంకగృధ్ర
వాయసాదులు గుమిగూడి • వలలుకతనఁ, గ్రొత్తపందిరివైచిన • కొమరుదోఁచె

తే॥ నిప్పులంబోలి వెలుఁగొందు • నెత్రుచేరు, లనెడి సంజమింటను తమి • యను కబంధ
పంక్తిచేతులెత్తికొని యా • పలకునీవ, లకుఁ బరుగువాటి నర్తించె • వికటలీల.

తే॥ భయదమైపాఱు రక్తప్ర • వాహమందు, మునిఁగినట్టి పక్షుల పక్ష • ములను తగిలి
పడిన కణములచేఁ బలు • వన్నెలున్న, తీగలన్నియు నెల్లనై • తేజరిల్లె.

తే॥ చేవతగ్గి రక్తము మేనఁ • జిమ్ముచుండ, నిలుపలేక ప్రాకారమ్ము • తొలగవిడిచి
ప్లవగములు కనకాద్రిపై • భాగము విడి, ప్రక్కలకు దిగు సంభ్రంబు పగిది దిగియె.

తే॥ ప్రహరియందును బురుజుల • వాకిటలను, తక్కువానరుల్ పట్టిన • తలములందు
రాక్షసబలంబు పైఁబడి • ప్రబ్బికొనియెఁ, గోఁతిమూకలువెఱచి ది • క్కులకుఁబాఱె.

క॥ నక్తంచరు లొత్తుటచే, రక్తాంబువు లీఁది వాన • రంబులు పోవన్
శక్తు లుడిగి పడెఁ గొని యట, ముక్తాంబకములను కొన్ని • ముడిఁగెను త్రోవన్.

క॥ కోటంబట్టిన వానర, కోటి బలముతగ్గ నసుర • కోటి కడంకన్
బాటించియార్వఁ దద్ద్రుతి, వాటముగా నెగసె విజయ • వారిధి రుతినాన్.

తే॥ పటహ కాహళ శంఖ త • మ్మట మృదంగ, పణవ భేరీ ప్రముఖ విరా • వములు చెలఁగఁ
జెవులు చిల్లులువోయె వీ • చీకలాప, యుత పయోధి సంక్షోభంబు • నతకరించె.

తే॥ కమలగర్భుని నాల్గుమొ • గములనుండి, సకలలోకముల్ వెలివడ్డ • సరణినపుడు
దనుజసేనాసముద్రమ • ద్దంబునొరయు, నాల్గువాకిండ్లనుండియు • నడచె వెలికి

తే॥ మత్తగజఘటల్ నడ తెంచు • మలలఁబోల్కి, నడచి పెక్కెంబులకుఁదగు ల్వాడిన లతలు
కొమ్ములను త్రుంగిపడఁ ద్రోసి • కొనుచువచ్చె, బిచ్చికిం దోడు భూతంబు • రెచ్చినట్లు.

క॥ వారణ మదజలములచేఁ, గూరిన పంకమున విలయ • ఘోరానిల సం
చారము కరణిం బరుగిడు, తేరులు వన్నియల ధూళి • తెరలఁగ లేపెన్.

తే. ముట్టడించిన కపులచేఁ • గొట్టబడిన, గట్టి కోటయన్ వలువను • గట్టినట్టి
లంకయనుచెలి ద్రావిన • వంకతేని, యలలనఁగనొప్పి వెలువడె • హయచయములు.

తే॥ జరిగినట్టి దినంబులఁ • బెరిఁగినట్టి, చీఁకటుల మొత్త మొక్కచోఁ • జేరియుండి
నడచివచ్చిన చందాన • వెడలఁబాఱె, దనుజసైన్యంబు ధాత్రియు • దద్దఱిల్ల.

తే॥ రేఁగి వెలివడ్డ పెంధూళి • శ్రేణులైన, తలలమీఁది శేషుని మోఁత • తగ్గునట్లు
విన్ను ముట్టడింపఁగఁబోవు • విధము నంద, భిత్తి వెనుబడ దిక్కుల • నొత్తి యలమె.

తే॥ క్రమ్ముకొని యసురులు నెట్టు • కతనఁ గపులు, విచ్చి వికవికలై నొచ్చి • విసిగి కలఁగి
గుట్టకొకరుగఁ దిట్టకొ • క్కొరుగఁ బఱచి, యొదిగి చేరిరి సుగ్రీవుఁ • డున్న యెడను.

ఉ॥ చేవచెడంగ విక్లమము • చెంది ప్లవంగులు పాఱిరాఁగఁ గ్రూ
రావిల మానసుల్ దనుజు • లంతట నంతట వెంబడింప సు
గ్రీవుఁడు కాంచి దంతములు • గీఁటుచుఁ జెంతఁగలట్టి యొక్కపెన్
రావి యగంబు బీఁకికొని • రక్కసి పిండు నెదిర్చెఁ బోఁడిమిన్.

క॥ ఒక్కొక రక్కసి పిండున, కొక్కొక సుగ్రీవుఁడగుచు • నురడించి తొలిన్
వెక్కసమై కనవచ్చిన, యక్కరువలిపట్టివోలె • ననిమొనఁ దోఁచెన్

క॥ కరి తురగ పదాతులకుం, జరణంబులు విఱుగఁ దొరలి • చనఁ దేరులు నె
త్తురుటేర్లు విరియ గపిపతి, కెరలుచుఁ గైనున్న తరువు • గిరగిరఁ ద్రిప్పెన్.

ఆ॥ ప్రభువు ముందు చొరఁగఁ • బ్లవగవీరులు కసి, మసఁగి తెంపుమీఱ • మరలివచ్చి
క్రూరదానవులను • కొఱికి చీలిచి తన్ని, ఱక్కి విసరివైచి • ప్రూల్చినారు.

ఆ॥ లెక్కయిడఁగ రాదు • లీల తాలను ఱువ్వఁ, బ్రాణములను విడిన • రక్కసీంద్ర
లెక్కయిడఁగ రాదు • లీల ధనుర్ముక్త, బాణవితతిఁ గూలు • బలిముఖముల.

ఆ॥ ముమ్మరించినట్టి • పోరున వానరుల్, బలము చూపి తాలు • పైవ మదము
తూలి కూలు రాక్ష • సాలి జీవంబులు, దక్షిణాశ నిండెఁ • దలము లేక

క॥ పాడెఁ బిశాచ సముత్కర, మాడెఁ గబంధములు మింట • చెఁ బతత్రుల్
కూడె జలధి నస్రంబులు, చేడె లచట వెదకినారు • చెలువుల మేనుల్

క॥ ఏనుఁగుల • మేనులెల్లెడఁ, బీనుఁగులై పడియె నంప • వెల్లిని మునిఁగెన్
వానరసైన్యము లొక్కెడ, వానఁ దడిసియు ప్రజల తేవ • వఱలెం జమువుల్.

క॥ అలుక వహించిన వనచర, బలగురు ఖర ర దీర్ఘ • షలలాశి తనూ
గళదస్ర పూరముల క, వ్వల నీచును కాఱి కనుల • బరువయ్యెనటన్.

## సుగ్రీవుఁడు వజ్రముష్టిం జంపుట

తే॥ అసురబలము క్షీణింపఁగ • నరసి తక్కు వారు పాఱఁదొడంగిన • వజ్రముష్టి
కాంచి యుగ్రుఁడై తేరిపై • గ్రద్దమూఁక, వ్రాలుచుండఁ గదలినావ • పగిదివచ్చి

తే॥ ఎడరి బాణవర్షము గురి • యించి కపుల, బెదరఁగొట్టె దిక్పతులను • బెదరిపఱవ
భాస్కరసుతుండు నొచ్చియు • వాని నుగ్ర, వీక్షణంబుల మిడుఁగుఱుల్ • వెడలఁజూచి

ఆ॥ తేరిమీఁది కుటికి • వారుపంబులఁ ద్రుంచి, సారథి తలఁ దునిమి • చండగతిని
విండ్లు తూణములును • విఱిచి వానిశిరస్సున్, బట్టి యూడఁ బెఱికి • పాఱవైచె.

తే॥ కొండ దొరలినపడిఁ దేరి • నుండి డొరలి, వజ్రముష్టి ఘూర్ణింబడ • వానిసేన
పదరి లంకాపురముఁ ద్రోపఁ • బట్టిపోవ, వనచరావళి ఘోషించె • వార్ధిపోలె.

## తూర్పు వాకిటి యుద్ధము

తే॥ విలయ వారాశి యుబ్బొంగు • లలని రేఁగి, దనుజసైన్యంబు పూర్వది • గ్ద్వారమందు
ముట్టి యున్నట్టి ప్లవగ స • మూహములను, దాఁకి పెనుపోరు గావించె • దర్పమొప్ప.

తే॥ కాలకూటంబువంటి రా • క్షస గణంబు, శూల కుంత తోమర భిండి • పాల ఖడ్గ
శర గదాదుల వర్షంబు • చందమునను, గురియఁ గాలువాలులు తెగెఁ • గ్రోఁతిగమికి.

తే॥ కొండలను పెనుమ్రాఁకులఁ • గొంచుఁ దెచ్చి, వనచరులు చండ పవనంబు • పగిది వీవ
సోఁకుమూఁకలోర్వఁగలేక • సుక్కిటూలెఁ, గయలు హారులు మధరఁ జాప • కట్టుగఁబడె.

తే॥ దర్పమున దనుజులు శూల • దండచక్ర, తోమరాది సాధనముల • తోడఁ బోర
తఱుచు మైగాయములు నొవ్వ • తెలుప నిలుప, వెనుకకుఁ దగ్గె ప • లీముఖములు.

తే॥ నీలుఁ డొకగొప్ప నీపావ • నీరుహంబు, ప్రేఁకతో లేపికొని ఘోర • విలయపవను
భంగి వీవఁగ రాకాసి • బలము కుప్ప, తిప్పలై రణ ధారణిఁ • ద్రెళ్లిపడియె

తే॥ రథములును రథికులును సా • రథులు రథ్య, ములును రథముల్ పంచాస్య • ములును వార
ణములు నేలకు దొరల వ్ర • ణములనుండి, వెడలు రుధిరంబు వట్టియి • కదలినించె.

తే॥ పౌలికలను వీడుగాఁగ న • ప్పొలసుదిండి, పటలములు పాఱఁజూచి కుం • భానుఁ డనెడి
సైన్యపతి సహింపక శరా • సారపూర్వ, దగుపఁ గీశవారంబులఁ • దగిలి నొంచె.

చ॥ అదిగని యెల్గుబంట్ల కొద • యందు హిడింబుఁడు చండకోపుఁడై
కదిసి కరంబునం బెను న • గంబును గైకొని వైవఁ దేరిపైఁ
బొదలు పతాకఁ ద్రొట్టి హయ • ముల్ రథచోదకుఁడున్ శతాంగమున్
జదిసెను వాఁడు భూమికి వె • సన్ డిగియెం గపులెల్ల భీతిలన్.

తే॥ డిగ్గి వజ్రమువంటి పి • డికిలితోడ, త్రొమ్మువాడుచు కుంభాను మా • ఱుగను మోఁది
రత్న మకుటంబుతో డిశి • రంబు వ్రాల, వాని కేలు హిడింబుఁడు • పట్టికొనియె.

తే॥ ఒడిసి నడుముపె రెండుకా • ళ్లూఁది యెక్కి
తలను పొడువ నాల్కయు గ్రుడ్లు • వెలికిఁ బిదుక
సగము తలయుఁ గంఠమునకు • దిగఁబడంగఁ
బ్రాణములఁ బాసి దొరలెఁ గుం • భానుఁ డపుడు.

## ప్రహస్తుని యుద్ధము

తే॥ తనదుదండనాథుఁడుతన • యెదుటఁ బొలియ, నలసుమాలిసూనుండుప్ర • హస్తుఁడలుక
వింటి నెక్కువెట్టి గుణంబు • వీనులదర, మొరయఁజేసి హిడింబుపై • మోహరించె.

ఆ॥ భుజములుబ్బఁ బ్లవగ • ముఖ్యులు బెగడొంద, విల్లు గుద్దుసుపడఁగ • విస్తరించి
యంపవాన గురియ • నగచరుల్ మొగతప్పి, యోర్వలేక వెనుక • కొదిగినారు.

ఆ॥ శరము లొడలినిండ • నెరవ హిడింబుండు, విహ్వలింప సేన • వీఁగుటయును
క్రని కపర్దివోలెఁ • గనలి నీలుఁడు ప్రహ, స్తుని యెదిర్చి పేరు • కొనుచుఁ బిలిచి.

ఆ॥ ఒకఁడు తెచ్చుచున్న • యొక తిట్టగొని చేవ, చూపి యొడిసి వైవ • నోఁకు మూక
పఱచి విఱుగ నచట • బయలయ్యె దానిఁ బ్ర, హస్తుఁడమ్ములేసి • యడఁచివైచె.

ఆ॥ మరల నీలుఁడొక్క తరువును గొనివాని, విల్లు పడిగ తేరు • విఱుగఁగొట్టి
వారువములఁ జంపి • సారథిఁ జదియించి, సింహనాద మొదరఁ • జేయునంత.

తే॥ విరథుఁడైన ప్రహస్తుండు • వీఁక చెడక, దండముంగొని లంఘించి • ధరణికి దిగి
పరిధి వీడిన భానుని • పగిది మెఱసి, దుర్నిరీక్ష్యుఁడై నీలుని • తొడరి తాఁకె.

ఆ॥ బొడు గఱచి కనుల • నగ్నులు గ్రక్కుచుఁ, దాఁకు దనుజవీరు • నాఁకపఱచి
వానిఁబట్టి యెగుర • వైచె నాకసమున, కమరులదలి కాంచి • యవలఁబాఱ.

ఆ॥ వైవవాఁడు మెలఁకు • వను నొవ్వకుండఁగ, ధరకు దిగుచు సురలు • తత్తఱింప
దండముగొని మోఁదె • గండని నీలుని, నేత్రములను నోట • నెత్తురొలుక.

తే॥ మోఁదఁ జలనమందక కపి • ముఖ్యుఁ డదరి, వాని దండ మొడిసికొని • పాఱవైచి
నేఁటితోఁ దీఱితని త్రావు • నెత్తురెల్లఁ, బొళకుబొళకని క్రక్కంగఁ • బొడిచె శిరము,

తే॥ శోణితము క్రక్కుచును ప్రహ • స్తుండుకడఁక, చెడక నీలునివక్షంబుఁ • బొడుపనతఁడు
కినుక నట్లచేయఁగ నిర్వు • రును పదలక, పోరి రెచ్చుతక్కువ లింత • పొందకుండ.

తే॥ వాలమున నీలుఁడవ్వల • వాని యొడలు, కదలనీయక చుట్టి వ • క్షంబు పగుల
గాఢముష్టిఁ బొడువవాఁడు • కందరాద్రి, పగిది వదనంబు దెఱచి జీ • వముల వీడె.

తే॥ సైన్యనాథుండు పడఁగని • చదల వేల్పు, లెలమిఁబాడి విరులు గురి • యించినారు
రక్తరోమముల్ వికృతదం • ష్ట్రిలు జ్వలించు, మబ్బుద్రిమ్మరు లుడ్డాడి • మరలినారు.

తే॥ దక్షిణద్వారమున కేగు • దనుజవితతి, నేఁచి యేడాటలాడించి • యేకు నదుల
నీరు ద్రావించి దళవాయి • నిహతుఁజేసి, యంగదుం డార్వ హతశేషు • లచటువిడిరి.

తే॥ పోటుబంటుల మేటిదు • ర్ముఖుఁడు రేఁగి, పశ్చిమద్వారమున గాడ్పు • పట్టి చేతు
లనెడి జమువాతఁ బడిపోయె • ననుచరులును, మరలలేదొక్కరైనను • పురముత్రోవ

తే॥ అంత నాలుగు దిక్కుల • యందు జరుగు, దురముగాంచి రా నరిగిన • దూతలేగి
దశముఖునితోడ జరుగువృ • త్తాంతమెల్లఁ, దెలియబల్కి రేకతమునఁ • దేటపడఁగ.

క॥ వడి భటదాన్త్యాశ్వగ్రాము, నడఁబోలిన సైన్యముఖ్య • నాయకుఁడు ప్రహ
స్తుఁడు తన బలములతో ఘుమిఁ, బడియెను తద్వీపములు ది • వంబున కరిగెన్.

క॥ శూలకరులు దనుజులు కొం. రాళముతో నడచి దక్షి • ణద్వారమునన్
వాలికొడుకుచే ధారుణి. పాలై రని నడపు మన సు • పార్శ్వం డీల్గన్.

తే॥ ఉత్తరంపు గవఁకున కేగి • యున్న వజ్ర, ముష్టియును వసమటితట్టు • మొనయు దురు
ఖుండు నేఁబదివెల్వ ల • కుంఠితబలు, లడరి పెనుపోరు గావించి • యడఁగినారు.

ఆ॥ మంటవైచు ఘృతము • మాడ్కి నవ్వార్తలు, ప్రభుని మనము మిగుల • రగులఁజేయ
నుండియుండి యేమి • యును దోప కెడనెడ, వేఁడి యూరుపులను • విడుచుచుండి.

ఉ॥ తూరుపు వాకిటన్ సమర • దోహలు సైన్యపతిం బ్రహస్తుతోఁ
బోరిన వీరుఁడెవ్వఁ డది • పోలఁగఁ దెల్పుఁడి యన్న వారలున్
గౌరవకీర్తులన్ దిశలఁ • గప్పిన నీలుఁడు వహ్నిపుత్రుఁ డం
గారము పూరిఁగాల్చిన ర • కంబున సేనల రూపుమాపఁగన్.

మ॥ విలయాదిత్యునిభంగి రేఁగి సమరో • ద్వేగంబు చూపించి బి
ట్టలుకం దాఁకి ప్రహస్తుఁ డుగ్రతర బా • ణాసారముం గూర్ప మాం
సల దమ్యంబు జడిం జరించుక్రియ రో • సంబార నీలుండు ని
శ్చలరీతిన్ జరియించె నిర్భరకు ము • ష్టాముష్టి యయ్యెం దుదిన్.

ఉ॥ అంత దురంత దుస్సహ మ హాశనిఁ బోలిన నీలు ముష్టిచే
నంతకు నింటి విందయి ప్ర • హస్తుఁడు వోయెఁ దదీయసేనలో
నింతకు మేము దక్క మఱి • యెవ్వరుఁ గ్రమ్మఱలే దనంగ దు
ర్దాంత పరీత రోషుఁడయి • రావణుఁ డాశలు మండఁ జూచుచున్.

ఉ॥ వింటిరె వింతవార్త యిది • వీనులఁగాల్చె మనస్సు మాడ్చె వే
గంటిని గెల్చినట్టి రణ • కర్కశు నొక్క ప్లవంగుఁ డాజిలో
గెంటెనె ? యెల్క పిల్లి హతి • కిం గనకాద్రి ధరిత్రి దొర్లెనే ?
మంటను గొల్పు మిద్గు తొక • మాత్రముగాఁ దలఁపంగ రాదెటన్.

రావణుఁడు రణమున కేగుట

చ॥ అని యొకకొంత చింతిలి ద శాస్యుఁడు బాణ కృపాణ పాణులన్
గని రణభూమికిం బదఁడు • కంటు సమస్తము దీర్చికొంద మే
మను తగ వత్తునంచు వడి • నూత్న కలాప మలంది మేలి భూ
షణ కుసుమాంబరాదుల భృ • శత్వరఁ దాలిచి యెక్కెఁ దేరిపై.

సీ॥ ఆకేరు వేయి హ • యంబులఁ గలయది, శరనిధి యంతటి • పరపుగలది
సురలోక మంతటఁ • దిరిగినయది యింద్రుఁ, డోడి నొచ్చిన యప్పు • డొసఁగినయది

యిష్ట దేవత రుద్రు • నెలమి ధ్యానించి డా, పలిచేత నున్నట్టి • ప్రథిత ధనువు
శింజినీ రవ విశే • షంబున యముని యా, యుష్కాలమును గూడ • నూడ్పఁగలది

తే॥ మఱియుఁ గేల ధరించిన • మహిత సాధ, నములు దిగధీశ దార్ఢ్య వ • క్షములఁ దాఁకి
మొక్కవోనివి తొడిఁగిన • బొందడంబు, వజ్రమయమై యభేద్యమై • వఱలిన యది.

తే॥ వీవఁబడు చామరములచే • విరిసి వార్ధి, నీరు నురుగుగట్టఁగ రజ • నీచరుండు
రమణ ముత్యాల గొడుగు శి • రమునఁ గ్రాలఁ, బూర్ణ శశిక్రిందఁగల జల • ముచముఁబోలె

తే॥ పటహములు మ్రోఁగె వానర • బలము కలఁగి, పరవ నిర్జరుల్ చెమ్మట • పట్టి నుసల
సందభిత్తిక లగల శం • ఖాది సమర, వాద్యములు మొరసెను జీవ • భయదరీతి.

క॥ వీరులు హరులును కరులును, తేరులుఁ గ్రిక్కిఱియ నడచు • దితిజుల నడుమన్
వారిధులు పొంగి చుట్టిన, మేరువుక్రియ రావణుండు • మీఱి వెలింగెన్.

తే॥ ఏడుతంతుల వీణ రూ • పెసఁగు ధ్వజము, విలయకాలుని నాలుక • లలినిగ్రాల
దనుజ వారాశి నేఁటికి దాఁటఁగలిగె, ననుచుఁ జూడవచ్చిన సుర • లదలిపాఱ.

తే॥ కనుల కోపాగ్నిచేఁ బొగల్ • గ్రమ్మ నల్ల, సోఁకుమూఁకల యెట్టని • జుంజుతైన
పెంద్రుకలు తెల్లఁబాఱ దా • పించు బంధు, సంఘములు గాంచి మిక్కిలి • సంశయింప

క॥ అరదంబుల భటకరముల, ద్విరదంబుల మీఁది సిడము • తెట్టువ లొరయఁగా
మరుదంబు శైవలిని ఘన, శరదంబులఁ గల జలంబు • సమయఁగ వచ్చెన్.

తే॥ పూని వాఁడియాయుధములు • మోచికొనుచు, వేలకొలఁది పిశాచముల్ • వెంటరాఁగ
గంటలులియఁ దేరులు వెంటఁ • గదలిరాఁగఁ, గదనరంగంబునకుఁ బంక్తి • వదనుఁ డరిగె.

తే॥ రావణుఁడు గొప్ప సేనతో • రణముసేయ, వచ్చెనని రామునకుఁ గపి • వరులు దెలుప
భూమిజకు నేఁడు కారా ని • మోచనంబు, గలుగునన్న యామోదంబు • గాంచె నతఁడు.

## రాముఁడు రణసన్నద్ధుఁడగుట

తే॥ కర్మముల యెల్లఁగాంచిన • ఘనులు దివ్య. దృష్టిచేఁ గాంచుటకు ముఖ్య • దృశ్యమైన
రామచంద్రుండు నారచీ • రను దిటంబు, గాఁగఁ జుట్టి నుధ్యంబునఁ • గత్తిఁ జెక్కి

తే॥ జగములం గొల్వఁజాఁచిన • చరణములను, పదుకు నొక పదఁబిగఁజేయు • పాదములను
భక్త హృదయంబులను వెల్గు • పదములందు, చెలువు పనిగల వీరపు • ద్దెలు ధరించి.

తే॥ ఒత్తుగాఁ జుక్క లలరిన • యుప్పరంబు, పగిది వెలుఁగొందు కవచంబు • బిగువునాఁగఁ
దొడిగె శ్రీవత్సమలరు న • య్యెదను లక్ష్మి, యెదయు కతన నొవ్వ దనుచు • నెంచెనేమొ॥

తే॥ శర్మద కరాంబుజములకుఁ • జర్మ కవచ, మొనయఁజుట్టిన యొప్పిద • మెంచిచూడ
నీవి మ్రాఁకుఁ దమ్మల నెడ • మీయకుండ, నల్లత్రాఁచు చుట్టిన లలి • నుల్లసిల్లె

తే॥ రేలఁబగళుల నొక్కచే • రీతి వెలయు, తామరలఁ దేఁటులుండు చం • దమున నొప్పి
శ్రేణులై యొత్తుగా నున్న • వ్రేళ్లకంత, గోధికాచర్మ కవచంబు • గూర్చినాఁడు.

తే॥ బహుళపద్ధతుల్ గలిగిన • భాషయందు, నారితేలి కావ్యంబుల • ననుసరించు
సుగుణులగు కవీంద్రుల వచ • స్సులను బోలి, వీఁపు నక్షయ తూణముల్ • దాల్చినాఁడు.

తే॥ మొగులునం దోఁచు మెఱుపును • బగిది మెఱయు, పీతపట్టంబు నడుమను • వెలయఁగట్టి
మలయు లేఁగాంతి గల పస • మాలతోడఁ, దులసిమాలయు రణమాల • తో ధరించి.

తే॥ సకలలోకంబులును చరా • చరచయములుఁ, దాను పేరుగానున్న ప • ద్ధతియు నిట్టి
దనుచు నూహింప మనము స • మర్థులమొకో? అతఁడు చేకొన్న విల్లు వే • అగునె తనకు?

తే॥ సురలు నరులును మోదించి • విరులు చల్ల, గొప్ప వానరసేనతోఁ • గూడి రామ
విభుఁడు పాలకడలితోడ • వెన్నుఁ డరుగు, దెంచి ప్రత్యక్షమైన రీ • తిగను దోఁచె.

తే॥ ప్రళయవేళను రుద్ర రూ • పంబునొంది, జగములను నాశమొనరించు • పగిదినొప్పి
విపుల సేనాముఖంబున • విల్లుదాల్చి, నిలిచియున్న లక్ష్మణుని స • న్నిధిని చేరె.

తే॥ అంత దక్షిణ దిఙ్నాథుఁ • డగు యముండు తనదుకృత్యంబు త్వర నెడ • గొనక నడప
నుభయసేనలు కలసి యొం • టొంటిఁ దాఁకె, వనధి వనధి యెదిర్చిన • వైన మడర.

తే॥ అన్ని దెసల దంష్ట్రిల కాంతు • లలమికొనియెఁ, బడియెఁ గనక రాసులపోల్కిఁ • గపిశవములు
దనుజ కుణపముల్ సెలతెట్టు • లనఁగనొప్పె, వింత వానకురిసినట్లు • వెలసె దురము.

తే॥ తెగియెఁ దలలు ప్రేవులు జాఱెఁ • దేరు లురలె, గెడసె ఖురువులు కరులును • మడిసె సమర
మేదినియుఁ బీనుఁగులచేత • మిట్టయయ్యె, నెల్ల దెసలకు నెత్తురు • టేఱు పాఱె.

క॥ ఘోరాకారులు వానర, వీరులు హస్తములఁ బొడువ • విటతాటముగా
వారువము లరచె రాక్షస, వారముల యురమ్ము లగలెఁ • బడగలు విఱిగెన్.

క॥ తత సేతువు తెగు లలి శో, ణిత వాహిని విరియ దనుజ • నేత యడరి యు
ద్ధతగతిని శింజినీ టం, కృతి యొనరుప బెదరి చెదరెఁ • గీశచయంబుల్.

క॥ పిడుగు బెడిదంపు మ్రోఁతకు, నడఁగి యొదుఁగు సర్పరాజి • యనువునఁ బ్లవగుల్
పడి రేడ్చిరి పాఱిరి తడఁ, బడిరి వడఁకి రురలి రాస • నదలిరి భీతిఁ.

క॥ నిర్దయు డగు దనుజేంద్రుని, దుర్దమ గుణరవము దినము • దూఁటింపఁగఁ ద్రా
సార్దితులై రసురులె యన, నిర్దేశములేల ప్లవగ • నిచయము పాటుల్?

తే॥ ఖేచరులు పరులిడి తల • దాఁచుకొనిరి, లక్ష్మణుండును ప్లవగ • వల్లభుఁడు దనుజ
పతి విభీషణుఁడును తగు • పగిది యరయ, నిలిచి రితరులు పాఱిరి • నివ్వెఱపడి.

చ॥ అవనిఁ బెకల్పఁజాలిన బ • లాఢ్యుఁడు రావణుఁ డీడ్చు శింజినీ
రవమునఁ బ్రహ్మాండ వివ • రంబును తల్లడమందె భీతిమై

దివిజులు కల్పకాల సము • దీర్ణ మహాశని యంచుఁ బాటి రీ
పవిది నరామరాదులకు • బాధలుగూర్చుట తారకాఁబగాన్.

క॥ చండగతిఁ బడెడి పిడుగన, గొండనొకటి వైచెఁ బ్రొద్దు • కొడుకు కద్దానిన్
మండెడు కినుకను దశవద, నుండొక బాణమున నుగ్గు • నూచము చేసెన్.

క॥ అందులకు భానుసూనుఁడు, డెందంబున రోసి వసుమ • తీ గర్భము బ్రీ
లం దరు వురవడిఁ బెకలిచి, యందికొనియె హస్తమున న • హంకృతితోడన్.

క॥ చేపట్టిన పెను కుజమును, తూపులచే రావణుండు • తునుకలు సేయన్
గోపంబున సుగ్రీవుఁడు, దీపించుచు నొక్కగిరిని • తేఁకువ వైచెన్.

క॥ దాని నొకమ్మునఁ దునియలు, గానేసి పనాటులెల్లఁ • గలఁగుచుఁ బఱవన్
బూని విలు గుడుసువడ నొక, బాణపు మొదలంటి తూఱ • భానుజు నేసెన్.

క॥ ఆనే డియమ్ము చొర సు, గ్రీవుండు కలంగెఁ గలఁగి • కీడ్పడు మున్నే
పావని తత్స్థితి యెఱిఁగిన, కైవడిఁ జని యడ్డుపడియె • క్షణకాలమునన్.

చ॥ తెలిసిన మూర్ఖ! కీశ జగ • తీపతి క్లేశము తీఱునంతలో
పల నను దాఁకి వీఁక బహు • భంగుల సంగరముం బొనర్తె ముం
గల ? నని వాయుపుత్త్రుఁ డడు • గంగఁ గృపాణత మున్నువీడినన్
వలనఱి వెండిఁ జచ్చుటకు • వచ్చితివే యని రావణుండనెన్.

ఉ॥ శైలమొకండు మారుతి వె • సంగొని వైచిన దానిమీఁది మే
ఘాలియు మాఁడి నింగి కెగ • యంగని పంక్తి ముఖుండు సాయక
జ్వాలలచేత బూది సలు • పన్ మఱియొక్క నగేంద్రమెత్తి యు
ద్వేల బలంబునన్ విసరి • వేసె దిశల్ వడి రింగు రింగనన్

తే॥ పిడుగుకంటెను వడిగాఁగ • వెడలి శిఖరి, దనుజు నమ్ముల నొకలెక్క • గొనక మీఱి
వాని భుజములఁ దాఁకి ఖా • పంబువోలె, బాహుపురులతో నదియును • భగ్నమయ్యె.

ఉ॥ ఇంచుకనొచ్చి రావణుఁడు • హేలగ వేఱొక శైలమెత్తి తా
టించఁగనున్న వాయుజుఁ గ • డింది బలంబున నారి లాగి పా
టించి యురంబుగాఁడ నిగి • డించిన నొవ్వక గాడ్పుపట్టి యం
కించి కుజంబు వైచి యడఁ • గించెను సారథి పంచజీవముల్.

తే॥ మఱొక చోదకుఁ డంతలోఁ • దఱిసి నడప, నసురనాథుండు వందసా • యకములేసి
ఎరియు మోదుగువలెఁ గశే • బర మొనర్ప, నుంతనొచ్చి కర్వలిపట్టి • సొమ్మసిల్లె.

ఉ॥ ప్రేలుచు తాలు మ్రాఁకులను • వీచుచు గోఁకలతోడఁ బండ్లతో
నాలము సేయు క్రోఁతులని • యక్కటికన్ మదినూని వీడుచో
నేలిద మింత యయ్యె నిఁక • నే ధనువుంగొని యాజి నిల్వఁగాఁ
దూలక మీరు ప్రాణముల • తో జయముం గొని యేగువారలే?

చ॥ అని వికటంబుగా నగియు • గొంత వలాహక భంగిఁ గ్రమ్మి మా
ర్గణ గణ వర్షముం గురియుఁ • గాఁ సమీర మహోరితాద్రి మా
ద్కిని కలగుండు వొందుటను • కీశులు పర్విడ లక్ష్మణుండు నా
ఘన శరపాళి వీనిఁ గడి • కండలు సేసెప నందు డాయుచున్.

## లక్ష్మణ యుద్ధము

మ॥ లయ కాలాంబుద ఘోషణంబు క్రియ భీ • లన్నారి మ్రోయింప దు
ర్భయ సంతాపము లొంది మాయలను దు • ర్వారంబుగాఁ గొన్న దు
ర్నయ దైతేయులు సింహగర్జనము నా • రన్ విన్న మత్తేభ సం
చయ భంగిం గడు విహ్వలించిరి రణో • త్సాహంబు చల్లాఱఁగన్.

మ॥ తన సైన్యంబుల తీరుగాంచి యమ నే • త్ర ప్రానిభంబైన ల
క్ష్మణ బాణాసన రావముల్ విని మదిన్ • జంకొంద కీ నీచుఁడున్
మనుజుండే యని నవ్వి రావణుఁడు స • న్మాణిక్య దీప్తి ప్రభా
జనకంబుల్ ముకుటంబు లున్నతములై • సాఁగన్ బడిన్ గర్జిలెన్.

చ॥ పడియెడు వానచిన్కులొక • పద్ధతి లేకయ క్రాలుటీల నొ
త్తడిగల లక్ష్మణాశుగ క • దంబము తేరుల గుంపుమీఁదఁ ద
త్తురుపయిన్ మతంగజ వి • తానముపై దనుజ వ్రజంబుపై
నడర రణాంగణంబు రుధి • రాశయమై కనుపట్టె నెల్లెడన్.

తే॥ కరుల మదజల ముఖములఁ • గాఁడినట్టి, నెలఁబు వెనుకటి కాళ్ళలో • వెలలి యరుల
వక్షములఁ దొల్చి తేరుల • యక్షములను, విఱిచి నిలువక యటనుంటి • వెలికినేగు.

తే॥ పగలు రేఁపినకరులు వా • ర్వములు సమయ, వ్యూహమమరిన యసుర సం • దోహమదరి
మొనసి కైదువులను లోక • పుణ్యఫలము, వంటి శ్రీరాము తమ్మని • పైనివైచె.

ఉ॥ వైచి విరోధి మానవుఁ డ • వార్య పరాక్రము దానవేంద్రుపై
నేచుఁచు డాసెనేని మన • కేటికి జీవములంచుఁ బల్కుచున్
దాఁచక యిచ్చుచుండెడు న • దారుని చుట్టును మూఁగు పేదలౌ
యాచకులట్లు దానవు ల • హమ్మతి లక్ష్మణు చుట్టుముట్టఁగన్.

చ॥ ఎడపడకుండ దానవుల • నేసి సురారుల వాఁడికైదువుల్
వడిఁ బడఁద్రుంచి తప్పిపడు • వాని ధరించె సుమిత్రపట్టి; యు
గ్గడువుగఁ బ్రాణము ల్గొనఁగఁ • గాఁడఁడుఁ జీఁవఁబనొందె రక్తముల్
కదలివి చేరనీక యన • కట్టిగ నేర్పడె నాజిఁ బీనుఁగుల్.

ఉ॥ త్రుంగెను వీరమస్తములు • త్రుంగెఁ గరంబులు వ్రేళ్ళు పాదముల్
త్రుంగె నురంబులున్ గటులు • త్రుంగెను శూలములున్ నరాజులున్

ద్రుంగె శరాసనంబులును • ద్రుంగె శరంబులు బాణ తూణముల్
ద్రుంగెను తక్కుకైదువులు • ద్రుంగెను దానవ శౌర్యసారముల్.

ఉ॥ త్రెవ్వె శతాంగ సంఘములు • త్రెవ్వెఁ దురంగపు దీర్ఘ కంఠముల్
త్రెవ్వె మతంగజాంగములు • త్రెవ్వెఁ బదంబుల వీరమద్దియల్
త్రెవ్వెఁ బ్రసూనమాలికలు • త్రెవ్వె హిరణ్మయ వజ్రవర్మముల్
త్రెవ్వె ధ్వజ ప్రజంబులును • త్రెవ్వె సముత్సుకతా విరావముల్.

చ॥ తరమిడి సంగరావనిఁ బ • దాతి వితానము గూల దానిపైఁ
దురగ నికాయముల్ తునిసి • తూలఁగ వానిపయిన్ మదేభముల్
దొరల మదేభరాజిపయి • దొంతరలై పెనుతేరు లొర్లఁగా
శిరములు వానిపైఁ బడఁగఁ • జీఁకునేని మొడంబు లేదటన్

చ॥ వడివడి లక్ష్మణుండు శర • పంక్తుల నెత్తుట కూర్చు టీర్చుటల్
విడుచుట యేదియుం దెలియ • లేక నిలింపులె మిట్టిచూడ రా
విడిచిన బాణముల్ దనుజ • వీరుల మేనులఁ జొచ్చి పోక విం
గడముగఁ గానరైరి మఱి • కాంచిన దప్పటి పీనుఁగులేః

ండకోపు లసురులేయు • శక్తి శూల, పరశు పట్టిన కుంత తో • మర గదాది
విధ సాధనములు భిన్న • భిన్నములయి, పడియెఁగాని తప్పినది క • న్పడఁగలేదు.

చ॥ సమర ధరిత్రిఁ జేరిన య • సంఖ్యములైన మదేభముల్ తురం
గమములు కేతన స్ఫురిత • గాంగ రథంబులు వ్యాఘ్ర ఖడ్గ సిం
హములను తక్కు జీవములు • నమ్మలఁ గూలెనకాక సుంత స
క్రమమున నిల్చినట్టివియుఁ • గ్రమ్మఱినట్టివి లేవ యయ్యెడన్.

మ॥ తనవారల్ తలలూడి కాళ్లుతెగి హ • స్తంబుల్ సగంబై రణా
వనిఁ గూలం బెఱవారు డాఁగి పఱి వో • వం బంచబంగాళమై
మెనయన్ నిల్వమి లక్ష్మణుండు విజయా • మోదంబుతోఁ బేర్చుటం
గని రక్షోధిపుఁ డకులం దసహనో • గ్ర క్రోధముం జూపుచున్.

మ॥ జవనాశ్వంబులఁ బూన్చినట్టి రథమున్ • సంగ్రామ రంగంబునం
దవలీలం బఱపించి బిట్టలుక డా • యంబోవ నిర్భీతి రా
ఘవు తమ్ముండును గాంచి యోరి జగడం • గా! యింక నేమార్ప వీ
కవునే? యంచు నిశాత బాణములచే • నంగంబు నొప్పింపఁగన్.

ఉ॥ ఏసిన తూపులెల్ల శపి • యించిన సంచునఁ దాఁక సోఁకు బా
ణానన మెక్కుపెట్టి కొన • లంటఁగ నీడ్చి శిలీముఖంబు లు
ద్భాసిత రీతిగాఁ బఱపి • తచ్ఛరముల్ నడుమన్ హరింప ని
ట్లె సమరాన నిల్వమని • యేపున లక్ష్మణుఁ డేసెఁ దూపులన్.

తే॥ వర్షమువంటి లెఁ బలుపిన • బాణచయముఁ, దొలఁగఁజేసి సౌమిత్రిని • తూణమందు
శరము లెత్తనీయక చేసి • మెలుసె ధర్మ, మెల్లఁజదివియు మఱచు లం • కేశ్వరుండు

## హనుమద్రావణ ముష్టియుద్ధము

ఉ॥ అత్తటి సౌమ్మదేటిన మ • హాబల నందనుఁ డడ్డువచ్చి దు
ర్మత్తుఁడ! నీచమాయలను • మానుము పందువుగూర్తు విష్టు నీ
కెత్తిన కాలదండమిది • యేర్తెఱ గల్గిన వాఁడవేని నీ
చిత్తము వేఱువంకలకుఁ • జేర్పక చూడుము నన్ను రావణా!

చ॥ గెలిచితి మూఁడులోకముల • గెల్చితి దిక్కులనెల్ల వేల్మిడిన్
గలఁచితి వింద్రుకీర్తి కల • కాలము చెల్లక యొక్కతీరుగా
నలఁచెదఁ జూడు నేఁడిట వి • నాశము తప్పదు నీకు నంచు న
గ్గలికముతోఁ ద్రివిక్రముని • కైవడి లాయుచుఁ గేలు సాఁచుచున్.

శా॥ చాపాద్యాయుధవిద్యలెల్లను విశే • షస్ఫూర్తి సాధించి తీ
వేపారంగ భుజంబు లిన్ని యతిశా • యిత్వంబునం బొంది దో
ర్వ్యాపారాంచిత సత్త్వముం గలిగి వి • క్రాంతిన్ విజృంభించి న
న్నేఁప న్నిల్చితి నిల్వ మన్నిటిని మా • యింతున్ వెసన్ ముష్టిచేన్

చ॥ పలుకులచే ఫలంబు గను • పట్టదు దిగ్గజ శంభుశైలముల్
బలువిడి నోర్చు ధీర! యొక • పాటిది కింగిరి కోఁతి ముష్టికిన్
న్నిలుతువె? నిల్చితేని విను • నీ పిడిపోటున కిత్తు తొమ్మి నీ
బలమున కోర్తుఁ గాని మఱి • వాఁడిమి చూపఁ దలంప నీయెడన్.

చ॥ అనవుడుఁ బంక్తికంఠుఁ డని • లాత్మజు పల్కుల సన్నుతించి నీ
గొనములఁ మెచ్చఁగూడుఁ బలు • కుల్ మగపాడికిఁ దగ్గయట్టి వీ
యనువున నీవుగాక మఱి • యన్యుఁడు నాయెదురన్ వచించునే?
ఘనమగు నీదు కీర్తికి జ • గంబులె కొల్వఁగఁ గొల్లకోలలో!

చ॥ అసదృశ వీరపుంగవుఁడ • వాయుధ మొక్కటి లేక దైత్యులన్
వసమఱఁ జంపినాఁడవు త • పంబునఁ బొందిన చాపఖడ్గముల్
దెసలు భ్రమింపఁబట్టి పెను • తేరున నెక్కిన నాదు సన్నిధిన్
నుసలక పల్కి నిల్చిన ఘ • నుల్ నినుబోలెడు వార లుందురే?

చ॥ క్రతుభుజు లాదిగాఁగఁ ద్రిజ • గంబులఁ దిక్కులు దక్క నెవ్వరున్
బ్రతుకఁగఁ గోరువారు బవ • రంబున నన్నెదిరించి నిల్తురే?
కౌతుకక నిల్చి వక్షమునఁ • గ్రుమ్ము మటంచు వచించి తిట్లు ధీ
రత నివి పల్కఁగాఁ దగిన • ప్రజ్ఞలుగావు మహాబలాత్మజా!

తే॥ చేతు లిరువది కీర్తిగాం • చినవి కలవు, శయము లొకరెండె నీకుఁ గే • సరి కుమార!
కఱుదులాడితి జయమింత • కంటెఁ గలదె? జగిలి నీతోడఁ బోరుట • తగవుకాదు.

తే॥ దిక్కులం గెలిచిన కీర్తి • తెఱఁగుమాయ, నింతకంటె వేతొండునా • కిలను గలదె?
బాలు వక్షు నేలంబెట్టి • కాలరాచి, నట్టిపైరి నామున్నిట్టు • లాడుచుందె?

ఉ॥ పగ్గెలు పల్కినాఁడ విటు • పల్కుట పాజమె మాతెఁ గాలమున్
ప్రగ్గిన మాఱుపల్కినఁ బొ • సంగెడు లాభములేదు అట్టుచే
సిగ్గిలి నిన్నెదుర్ప నిక • సించుమసుంటి జగంబు చూడఁగా
మ్రొగ్గక వచ్చి నీదు పిడి • పోటునఁ గ్రుమ్ముము తొమ్ముచూపెదన్

తే॥ అసురవిభుఁ డిట్టులాడ మే • లనుచు హనుమ, లీలఁ దేరిపై కుఱికి నే • త్రాల మిడుఁగు
యిరల సరులతోఁగ వచంబు • నొదలు పొడిగఁ, బడఁగ వక్షమ్ముఁ బొడిచెను • వజ్రముష్టి.

తే॥ కొండ లిసుకయై రాలిన • కొమరుదాల్చె, పెరుఁగువలెనై మెదడువచ్చి • వెలికినుఱికెఁ
దలలు పదియును మెడలపై • నిలువలేక, వ్రాలె నసురుల జీవముల్ • వ్రాలెఁదోడ.

ఉ॥ జాఱెను వీరచాపములు • జాఱె గుణంబులు జాఱె ఖడ్గముల్
జాఱె మనస్థిరత్వమును • జాఱె జయాశయు నుత్సుకత్వమున్
జాఱె శరీర దార్ఢ్యమును • జాఱె దెగింపును జాఱెఁ దేజమున్
జాఱెఁ బరాక్రమంబు దను • జ ప్రభు తొమ్మున నిప్పు జాఱఁగన్.

తే॥ ముష్టిపోటుచే నురముస • ముష్ప విఱిగి, నాటియుండిన దిజ్మన • నాగదంత
ములును దశవదను యశంబు • వలెనె వాని, వీఁపునన్ దుస్సి పుటుకున • వెలికివచ్చె.

చ॥ చిరిఁగిన కంకటంబున ఖ • చించిన రత్నచయంబు రిక్కల
ట్లురవడి దిక్కులం బఱచె • నుల్లమునందలి ప్రాణవాయు సం
చరణము తగ్గ రావణుఁడు • శైలము తల్లడమందు భంగి ని
బ్బర మొకయింత లేక గరు • వంబు చెడం జలియించె మిక్కిలిన్.

చ॥ అమరులు సంతసిల్లి కడు • హర్ష రవంబులు సేసి స్వర్ణ పు
ష్పములను చల్లి దీవనలు • సల్పిరి రక్కసు లీర్ష్యనొంది రు
ల్లముల ముదాతిరేకమున • లంగలు వేయుచుఁ గీశరాజి పం
క్తిముఖుని కీర్తి మాసెనని • కేకలు వైచెను మెగగుప్పుతోన్.

తే॥ వహ్ని నైజ గుణము ప్రాణ • వాయు గుణము, ననుభవించి యెఱింగిన • ఘనులు, వేఱు
తనువునం జొచ్చి క్రమ్మఱఁ • దమ తనువునఁ, జేరుకరణి రావణుఁడు మూ • ర్ఛిల్లి తెలిసె.

తే॥ తెలివినొంది యూరుపుపుచ్చి • తెరలి నోట, మాట రాక యుఱిమిచూచి • సాటిలేని
మేటిమగని మారుతిఁగని • మిడుకకింక, మద్బలంబును చవిచూడు • మా కపీంద్ర!

చ॥ జగతిఁగలట్టి సర్వజల • శక్తులు నీయెడఁగల్గు! నీవ పో
మగల మగండవౌదు హను • మంత! కృతాంతుని చూచివచ్చితిన్

దుగినుఁడె వచ్చి నీవు భయ • దుఃఖములొందెదవన్న సుంతయున్
బెగడని యేసు నీవలన • భీతి నెఱింగితి సంచలించితిన్.

ఉ॥ నిక్కము నన్ను గెల్చిన సు • నిశ్చల విక్రమ శాలివైతి: వే
ఱొక్కటియేల? నిల్వుము స • ముల్కట మత్కర ముష్టి ఘాతముల్
దక్కక సైఁచి జీవముఁ • దాల్చితివేనియు నింతదాఁక ని
న్నక్కజలతో నుతించిన స • మస్తము నిశ్చయమంచు సమ్మెదన్.

చ॥ అనుడు మరుత్సుతుండు బిడి • యంబును పొందెద నీవు జీవివై
ననుగని మాటలాడు కత • నన్ జయమొందినవాఁడవే చుమీ
మొనసి మదీయ ముష్టి హతిఁ • బొంది మరింపక నిల్చి నా బలం
బును వినుతించు దిట్టరిని • మున్నొకసారియుఁ జూడ నెచ్చటన్.

ఆ॥ అప్పుదీర్చికొనుమ • యని బొమ్మ చూప ద, శాననుండు పెదవు • లంటఁ గొఱికి
నిడుదకేలు మెఱుఁగు • బొదవుగాఁ జాఁచి పా, వని యురమ్ముఁ బొడిచె • బద్ధముష్టి.

ఆ॥ విలయమందుఁ జెదని • విజ్ఞానమతి జగ, త్ప్రాణసుతుఁడు పంక్తి • వదనుబలము
మునుపుగన్న రజత • మూర్ధంబుకైవడి, వాని పోటువలనఁ • బల్లటిల్లె.

ఉ॥ తూలఁగ వాయుసూతి దివి • తూలెను ధర్మము తూలె సత్యముం
దూలెను సద్గుణావళియుఁ • దూలెను కీర్తియుఁ దూలె వేదముల్
తూలెను నీతియున్ దయయుఁ • దూలె దపంబును తూలె భూమియుం
దూలెను బంచభూతములు • తూలెను తూలె సమస్త సత్కృతుల్.

క॥ అక్కడఁగల కపివరు లపు, డొక్కొక రొక్కొక్క నగము • నొగిఁదెచ్చి వడిన్
రక్కసులఱేనిపై బయ, లెక్కడఁ గనరాక ముసరి • యేసిరి కడిమిన్.

క॥ బలసంపన్నులు ప్లవగులు, విలయోగ్రముభంగి నింగి • పిక్కటిలఁగ న
ద్రుల వైవ నియచ్చరు లొ, త్తిలి చెచ్చెర నవ్వలికి నొ • దింగిరి భీతిన్.

తే॥ మింటఁ జోటు లేకొండొంటు • గెంటికొనుచు, నవ్వలికిఁబోక నిలిచె నా • యద్రిచయము
తరణి మఱుఁగయ్యె జగముల • నిరులుప్రింగె, రక్కసులు తగ్గిరని సురల్ • క్రమ్మిరవల.

తే॥ కొండ లొకటిపై నొక్కటి • కూలి విఱుగ, మిడుఁగుఱులు లేవ మెఱుపులు • మెఱయఁ బిడుగు
లట్లుదాఁకి శిలావృష్టి • యట్లు రామ, భద్రు దివ్యాస్త్రవర్షంబు • పగిదిఁ గురిసె.

తే॥ కర్బురుల పెనుసైన్యంబు • కలఁగి చెదరి, మలఁగె మింటిరిక్కలతో వి • మానపంక్తి
రాలె మిడుఁగుఱచే నబ్ధి • క్రాఁగి మీలు, తేలి సోఁకుల కనుగ్రుడ్ల • లీలనుండె.

ఉ॥ లోకము నేఁడె కూలెనని • లొగ్గడిఁ గల్గిన రావ మెల్లెడం
గ్రాఁకగ రావణుండు విని • పట్టని రోషభరంబునన్ సురా
స్తోక యశోవిభూతులను • చూఱలు వెట్టిన దొడ్డవిల్లు బిం
బాకృతిఁదోఁపఁ దూపు లొల • యం బఱపించి చెదర్చె నన్నిటిన్.

ఉ॥ అమ్ములు విండ్లు తుండ్లుగ హ • యమ్ములు ద్రుంచఁగ వారణమ్ము ల
ప్పమ్ములుగాఁగ సింహ శర • భమ్ములు వ్యాఘ్రము లా రణస్థలిన్
దమ్ముగఁజేసి కుప్పలుగఁ • దార్కొను పర్వతముల్ కుజంబులున్
దుమ్మయి గాలిలోఁగలియఁ • దూలె దశాస్యుని యంపవానచే

క॥ ఔరా: తీరగు శరసం, చారము! గిరి యొకటి లక్ష • శకలము లయ్యెన్
సౌరగు కర లాఘవ మ, య్యారే! యని విద్రిచికొనిరి • హస్తము లమరుల్

తే॥ పంక్తిముఖుచేవ పగ్గము • పాడుచేయ, హరులు వైచిన గిరులఁ ద • చ్ఛరము లదరి
ద్రుంచి యన్నిదెసల వార్ధి • ముంచివైచె, నేల నెత్రు గప్పెను మేల • ధూళిగప్పె.

క॥ వానరులతోడ నేఁడే, మానిసు లిర్వురను రూపు • మాపెద ననుచున్
దానవవిభుఁ డుగ్రుండై, పూనెం బది యెడమకేలఁ • బౌరిఁ బదివిండ్లన్
పది దీర్ఘ బాహువులతో, బది ధనువులవంచి పదులు • పదులుగ నమ్ముల్
వదలి దశదిశలు కదలియుఁ, గదిరి శరమయముగఁ బంక్తి • కంతుఁ దొనర్చెన్

క॥ పొలిసెను కపిసైన్యము కు, ప్పలుగా నాకుప్పలపయి • ప్రాలె వనదముల్
పొలికలను రక్తమయమై, వెలసెను సాయంతనంపు • విన్ను విధమునన్.

సీ॥ నిలువంగ లేఁడయ్యె • నీలుండు నడవలేఁ, డయ్యె నలుఁడు లేవఁ • డయ్యె గజుఁడు
కొలుఁ గానఁగలేదు • గవయుఁ డంగదుఁడును, జీవించునా యను • స్థితి భజించె
చలియింపలేఁడయ్యె • జాంబవంతుఁడు కొఱ, మాలి పడియె గంధ • మాదనుండు
గువ్వరీతి ముడింగి • కుదికిలె శతబలి, పనసుని మెడ తూలి • పడుచునుండె

తే॥ మఱియుఁగల గొప్పవీరులు • నెఱఁకులంటఁ, దేజు మాసిరి కూలిరి • తికమకపడి
పాఱి రదిగని సౌమిత్రి • భయదరోష, భీషణాకృతితో విజృం • భించి నడచి

తే॥ రావణుఁడు వైచినట్టి శ • రప్రకర్ష, మడఁచి వాని యహంకార • మడఁగఁ బది శ
రాసనమ్ములఁ బదితూపు • లేసిద్రుంచి, దనుజు లదరంగ సింహ నా • దమ్ముచేసె.

తే॥ వేలుపులు చాల మోదించి • కేలుఁజట్టి, విరుల చల్లిరి మునులు దీ • వించినారు
ధర్మదేవత యుత్సుక • త్వమున నాడె, మెచ్చె లంకేశ్వరుండు సౌ • మిత్రి నేర్పు.

తే॥ మేలు సంగరోత్సాహంబు! మేలువిద్య!, మేలు రణకార్య పద్ధతి! మేలు తెంపు:
మేలు కర లాఘవంబును! మేలు నేర్పు! మేలనుచు మెచ్చె ముక్కుపై • వ్రేలుచేర్చి.

ఉ॥ దండకలో ఖరాదుల మ • దంబు నడంచిన రాఘవుండు నా
ఖండలు ప్రేల్మిడిన్ రణ ము • ఖంబున గెల్చిన నాసుతుండు ను
ద్దండ శరాసనంబు బెడి • దంబుగఁ దాల్చిన యేను దక్క బ్ర
హ్మాండమునందు లేరు సమ • రావని నీ సరివచ్చు దిట్టరుల్

## రావణశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట

తే॥ అనుచు వింటిచే గెలుపంగ • నసువుగాఁగ, బంపు వీనిని విడువరా • దంచు నసుర
ధాత యొసఁగిన శక్తి హ • స్తమునఁ గొనుచు, వైచె లక్ష్మణుపై నెల్ల • వారు బెగడ.

ఉ॥ వైచిన శక్తి లక్ష్మణుని • బాణ నికాయములెల్ల లీలఁగాఁ
బూచిక లట్లు త్రుంచుచును • పోయి యురమ్మున నాటె దాని పై
గాచిక శక్తిఁగన్న గుణ • శాలి యురమ్మున వ్రాలి మూర్ఛిలెన్
మోచిన చింతతోఁ గపులు • ముచ్చిరి రాల్చిరి సోఁకు లబ్బుమై

తే॥ ఎల్లసురలును దమసొమ్ము • కొల్లపోయి, నట్లు వెలవెలపోయి ర • త్యాహితమున
మునులు విసిగిరి ధర్మ చిం • తనమునందు, ధరణి దిరిగెను మార్పుదెఁ • దరణికాంతి.

తే॥ దీని కితఁడు జంకఁగ లేదు • బ్రెక్కలేదు, మూర్ఛపోయినాఁడని ద • ముఖుఁ డెత్తింగి
యితని మేను గైకొని లంక • నేగెదనని, క్రూరచిత్తుఁడై దిగివచ్చెఁ • దేరినుండి.

తే॥ బాహు లిర్వదింటను కవ్వి • పట్టి మున్ను, రాజగిరి నెత్తుటకు సిగ్గు • మీఱ నిప్పుడు
మేరుగిరి నెత్తఁబూనిన • తీరువోఁప, నెత్తె బలమెల్లఁ జూపి సం • ద్లీలకఱచి.

తే॥ తాను పీతాంబరుండను • జ్ఞానగరిమ, మానసమ్ము హేతువున రా • మానుజుండు
శివ నగంబును చలియింప • జేసినట్టి, హస్తముల కెత్తరాని వాఁ • డయ్యె నపుడు.

క॥ దశముఖుఁడు కదలిఁ బోవెను, దశముఖ హస్తంబు లబ్ధి • తరఁగలఁ బోలెన్
దశరథ సూనుఁడు సాగర, శయ వనఁదగు శశిని పోలి • చెలఁగెం జూడన్.

తే॥ ఎత్తయత్నించి కదలింప • నిమ్మువడక, యూర్పువిడుచు వేశాక్కఁ జూచో • నున్న హనుమ
కని కటాలున వచ్చి రా • వణుని గెంటి, యవ్వలికిఁ గొనిపోయె రా • మానుజన్మ.

ఉ॥ పావని జ్ఞానులం బడిక • పావనుఁ • డౌటను లక్ష్మణాఖ్యుఁ డా
శ్రీ వరుఁడౌటచే మదిమఁ • బ్రేమబలంబును బొద్దదౌట సం
భావిత భక్తిచేతఁ బసి • పావను తల్లి వహించు కైవడిం
గైవడిఁ గొంచుఁ బోయె • రఘు కాంతుని సన్నిధికిన్ రయంబునన్.

## రామ రావణ ప్రథమ యుద్ధము

తే॥ జానకీవిభు డాసి ల • క్ష్మణుని దించు, నంత నతఁడును తెలివంది • యుర్వి లేచె
రాముఁ డప్పుడు లయకాల • భీమ భంగి, నసురి రావణుతోఁ బోరు • నడవ నడచె.

తే॥ దంతిమీఁదికి లంఘింపఁ • దలఁచు సింగ, మట్లు రాముఁడు వచ్చుట • యసురవిభుఁడు
గాంచి రాఘవు నెదుటికిఁ • గనక రథము, బోవనిచ్చె నుత్సాహంబు • పొదలుచుండ.

క॥ రణకోవిదుఁడగు దానవ, గణనాథుఁడు తేరిమీఁదఁ గ్రాలఁగ సమరాం
గణమున రాముఁడు నేలం, గణఁక నిలుచు టనువె? యనుచుఁ గదలె హనుమఁడున్.

। తనకు మున్నొనసంగిన గంగఁ • దలను దాల్చి, పావనుండైన శంభుండు • పాపవితతి
మలయుచోఁ బదచారియౌ • మామఁ గాంచి, యూరకుండుట తలఁపంగ • మేరయౌనె?

॥ అసమరీతి రణముసేయ • నసుర తేరి, పై వెలయ నేల నీవుంట • పాడిగాదు
సేవకుఁడనగు నాభుజ • శిఖరియందు, కూరుచుండుమ యని వేఁడు • కొనియె హనుమ.

। మంచిదని రామవిభుఁ డెక్కె • సంచితముగఁ, గొండపై నెక్కుసింగంబు • కొమరుదోఁప
గనిన బిడ్డను మోచిన • జనని పగిది, హనుమ యలరె సురాలి దీ • వనలు చేసె.

॥ అలత్రివిక్రమ రూపంబు • నరసియున్న, హనుమఁ డతి యానందంబు • నందఁగాంచి
శ్రీహరికి వాహన శయన • శ్రీలఁదాల్చు, గరుడి లజ్జించె శేషుండు • శిరము వంచె.

ఉ॥ మారుతి క్షీరవారిధి క్ర • మంబున నొప్పె రఘూద్వహుండు నా
క్షీరపయోధిశాయి యనఁ • జెన్నగు నన్నను యోగ నిద్రకుం
దారఁడు; వాయుసూతి శ్రుతి • తండము వేదశిరోర్థ మా ధరా
జారమణుండనంగఁ దగు • సామ్యము చొప్పడు నిశ్చయంబుగన్.

। మఱియుఁ జూడంగ నాహను • మంతుఁ డొప్పె, సకలలోకమూలంబగు • ప్రకృతినాఁగ
రామభూపాలుఁడొప్పెఁద • త్ప్రకృతి శక్తి, కరయ మూలకారణ విరా • ట్పురుషుఁడనఁగ

॥ వనజజాండంబు లెల్ల గ • ర్భమునఁ గొన్న, దాశరథికిఁ గావలయు ప • ద్ధతులఁ దిరుగు
మారుతి భుజాగ్రదేశంబు • మేరుశిఖరి, నెనసె నన్న న్యూనోపమ • మే ఘటించు.

॥ ధర్మదేవత మోద స • ర్తనముచేసె, ఋషులు కేలెత్తి దీవన • లిచ్చినారు
బ్రహ్మ రుద్రాది దేవతల్ • రణము చూడ, వచ్చి యింట మూఁగిరి రఘు • వరుఁడు కదియ.

॥ సంగరోన్ముఖుఁడగు రామ • చంద్రుఁడపుడు, కేలఁగోదండగుణము లా • గిన రవంబు
దివియు భువియు సమస్తంబు • తివిరి మ్రింగు, రుద్రమూర్తి సేయు మృగేంద్ర • రుతముఁబోలె.

॥ యక్షులును రాక్షసులును ప్రా • ణా నిలములు, పీడకున్నను నిలుకడ • యూడి నాల్క
లెండఁ గలఁగిరి మలఁగిరి • యండచయము, నెలవు దప్పె బ్రహ్మోదుః • తలలు నాడె.

॥ విద్రుమ వర్ణముల్ • విలయాగ్ని నిభములు, జలధి నీటిని ద్రావఁ • జాలినవియు
దిక్కులఁ గొలువంగఁ • దివురునవియు మింటి, మంటిని తొలువ స • మర్థములయి
యడరు నేదమ్ముల • నసురవిభుండేసె, వాని నేదమ్ముల • వనజ నయనుఁ
డేడేసి తుండ్లుగా • నెడలించి యొక్క సా, రిగ నైదు తూపుల • మొగిఁ దొడింగి

॥ పరప దశకంధరుఁడు నైదు • శరములేసి, నడుమనేత్రుంచి మఱి • పది తొడుఁగులంట
సీడ్చి విడువంగ సూర్యకు • లేశ్వరుండు, విశిఖ దశకమ్మచే వాని • విఱిచివైచె.

॥ దగ్గఱగనున్న రావణు • దండువైచు, నాయుధమ్ము లన్నిటిని పె • క్కుమ్మలేసి
వెండి వైచినఁ బొడిచేసి • వీరమస్త, కావళుల నోక తిట్టగాఁ • ద్రోవచేసె.

తే॥ సైన్యనాథులేసిన యస్త్ర • జాలములను, రాఘవాగ్రగమ్ముల వాన • రావళిపయిఁ
జెదరనీయక తొలగించి • శిత శరముల, సంగపతుల మస్తములు డు • ల్లంగనేసె.

చ॥ ఘనతర రామబాణముల • గంటెసు దెందముకంబెఁ దొందరన్
జను హనుమానుఁ డీధర నె • సంగెడివాఁ డసుసంటలో నథం
బునఁ గసుపట్టు రావణుని • ముందరఁ దోఁచు నెదంద యుక్కన
ద్దనుజుల కన్నులందు బెడి • దంబుగ వెక్కసమై కనంబడున్.

ఉ॥ ఆడఁదొడంగె నట్టలను • వందఁగ వేడుకతోఁ బిశాచముల్
పాడఁదొడంగెఁ గంకములు • ప్రబ్బి వియత్తలమెల్లఁ జుట్టి త్రో
పాడఁదొడంగెఁ బీనుఁగుల • యంగములం గొని నెత్రుతోయధిం
గూడఁదొడంగె రాము శిత • ఘోర శిలీముఖ రాజి పర్వఁగన్.

తే॥ చక్రములు ఖండములయియ • క్షములువిఱిగి, ఖరువు లుపలి ధ్వజంబులు • కెరలి తేరు
బారు లెడసి తార్కాణుగఁ • బడియెఁ గరులు, తుండములు తెగిపడెఁ గొండ • పిండులట్లు

తే॥ బండ్లుపోవ విండ్లునుపోవఁ • బండ్లుపోవఁ, గరులుపోవ హరులుపోవఁ • గంకటములు
పోవ శౌర్యంబుపోవ గ • ర్వరులు తుదకుఁ, దలలుపోవఁ గూలిరి రణ • స్థలమునందు.

తే॥ సుతనుమధ్యలు రణభూమిఁ • బతుల తలలు, కపుల హరుల తలలు నొక • కరణినుండఁ
దెలియనేరక తచ్ఛిరం • బులను చేర్చి, కొనుచు నేడ్చి యేడ్చి యచటఁ • గూలినారు.

చ॥ అడఁగెను సింహనాదము ల • హంకృతు లాఁగెఁ జిరాకు చూఁపులన్
మడఁగెను ధూళియున్ డిగియె • మందటిలెన్ బహుళాయుధా రవం
బుడిగెను టంకృతుల్ కడచె • నుత్కట ఘీంకృతులిఁగె హేషలున్
ముడిఁగెను సైన్యముల్ దనుజ • ముఖ్యుఁ డొకండయి నిల్చె నాజిలో

తే॥ నాల్గు విధముల సేనలు • నలిఁగి తునిఁగి, యొడుదుడుకుగాఁగఁ గొండల • వడువుదోఁప
నున్న శవరాసులను కాంచి • యుడికి యసుర, వరుఁడు బుసకొట్టసాగె స • ర్పంబుపగిది

తే॥ నారి నాకర్ణముగ లాగి • ఘోర శరము, లేసి రాముని భుజముల • గాసిపఱుప
నతఁడు చిఱునవ్వుతోడ సు • రాంతకు ధను, వైదు తుండ్లుగ విఱిచె నై • దంబకముల

తే॥ వేఱువిల్లందుకొని యెక్కు • పెట్టునంత, రామవిభుఁ డదియును ద్రుంచి • రాక్షసేంద్రు
పవన జవన తురంగమ • పంక్తిఁ గూల్చి, సారథిని చంపివైచె ని • ర్జరులు పొగడ.

తే॥ అసురమఱియు వేఱొకకైదు • వందికొనెడు, నంతలోనదుమన త్రుంచి • స్యందనమును
గొడుగు తోడధ్వజము తోడఁ • గూల్చివాని, దృఢతనుత్రాణమునుగూడఁ • ద్రెంచివైచె.

తే॥ వేఱువేఱు తేరులు వచ్చి • చేరుచుండ, నెక్కనీయగ నడుమ మా • యించుచుండె
రాఘవుఁడు; రావణుఁడును • రౌద్రమూర్తి, యయ్యె మృత్యువు నటియించు • నాజియందు

తే॥ రత్న ఖచితమ్ములైన శి • రకములపయిఁ, బడిఁకోరీలఁ బఱప ఛ్భా • స్వరునిమీఁది
కెగయు హనుమనికైవడి • నేగి విశిఖ, దశక మవ్వాని దోర్చె సం • సంభ్రమునఁ బడఁ

తే॥ మణుల కాంతులు దిక్కుల • మలయుచుండ, జడధిఁబడిన దైత్యేంద్రు శీ • ర్షకములపుడు
నిగుడు చండ ప్రభంజన • నిహతిచేతఁ, గూలు మేరువు శిఖరాల • లీలఁ దోఁచె.

క॥ రాముని నిశాత బాణము, లా ముకుటములఁ గొనిపోయి • యబ్ధిని విడుటల్.
ధామనిధిఁ గొంచు రాహువు, దీమసమున జలధిఁ ద్రోచు • తెఱఁగున నొప్పెన్

క॥ అపజయ మెన్నఁడు నెఱుఁగని, కృపణుఁడు మకుటముల నీఁగి • కీర్తియుఁ జెడఁగాఁ
దపన నిశాకరు లలఁని, యపకృష్టాహర్నిశముల • యనువున నొప్పెన్

తే॥ మకుటములఁ గోలుపడు దశ • మస్తకుండు, ప్రతిభటాఖిల గురుత ను • న్నతుఁడెయైనఁ
బ్రవిమలాత్మకుఁడైన సు • కవి శపింపఁ, బ్రథితకీర్తిని కోల్పోవు • ప్రభువుఁబోలె.

ఉ॥ క్రిందికిఁ జూచు కన్నులును • కీడ్పడు మోమును రిత్తకేలు ప్రే
లం దిగి యూడమట్టి యన • లంబు శరీరమతోడ నున్న దై
త్యేందు డధర్మచారులకు • నిట్టిదె పాటని లోకులెల్లఁ బ
ల్కం దలవంచి నేలపయిఁ • గాలను రాచుచు నిల్చె నచ్చటన్.

తే॥ అట్లు నిలిచిన రావణు • నరసి ధీర, వరుఁడు సుగుణుండురాముండు • వట్టికేల
నున్న వాడఁని చంపంగ • నుల్లమందు, తలఁప కిట్లని పల్కె నౌ • దార్యఫణితి.

ఉ॥ ధర్మపథంబు ద్రొక్కక య • ధర్మవిధంబున సంచరించు దు
ష్కర్ములు వేల్పులైనను య • శంబు జయంబును గాంచ శక్యమే ?
దోర్మద ముజ్జగిల్లెనె ? వి • ధూత బలుండవు నిన్ను చంప నీ
యర్మిలివారిఁ గూడుకొని • యందుము సౌఖ్యములెల్ల నేటఁకే.

శా॥ నీవంశస్థులతోఁ గుమారకులతో • స్నిగ్ధాళితో వెండియుం
జేవంగల్గిన సేనతోఁ దొడరి యు • త్సేకంబుతో నెల్లి ర
మ్మీ వేళం బెనుపోరునం దలసి నీ • యేపుం బ్రపూర్ణంబుగా
నావంకం గనిపింపవైతి వది గా • నంగోరియే వీడితిన్.

మ॥ సమరోత్సాహము గల్గునేని కడఁక • సైన్యంబుతో రమ్మ ప్రా
ణములం దాఁపఁ దలంతువే జనక క • న్యం దెచ్చి యొప్పించి రా
జ్యము సీతమ్మనకిచ్చి కొల్వు మతనిన్ • జాకుంటకున్ వేఱు మా
ర్గము లే దెన్ని విధాలఁ జూచినను ని • క్కంబిద్ది లంకేశ్వరా ?

మ॥ దురమే సేయఁదలంతువేని బలసం దోహంబు చేకూర్చుకొం
చిరవారన్ శ్రమదీర్చికొంచు వది నా • యత్రంబుగా రేపె నీ
శిరముల్ నాశరపాళి కాహుతిగ న • ర్పింపంగ రమ్మింక ని
ల్వరమున్ లేదు నిజంబు మాయలును చె • ల్లంబోవు రక్షోధిపా !.

తే॥ నేఁడుకొంచితే గాలికి • నెగయు దూది, పింజలట్టులు నీసేన • విఱిగి కలఁగి
కూలుటలు నేఁటికేగి రే • పాలమునకు, రమ్మనుచుఁ గరుణాళుఁడై • రాముఁడనఁగ.

## 14. కుంభకర్ణ వధ పటలము. (363)

సీ॥ దిగ్గజంబుల పోటు • లివిరి యొర్చిన రొమ్ము, కైలాసమెత్తిన • ఘన భుజములు
జగడాల తపసి మె • చ్చఁగఁ బాడు నాల్కయు, శివుఁడిచ్చు కత్తియు • శీర్షకములు
శౌర్య సంపదయును • సంగరస్థలి వీడి, త్రిజగంబు లేలిన • దితిజ విభుఁడు
తలయెత్తనీని యు • త్తలపాటుతో భంగ, పాటుతో బిడియంపు • బరువుతోడ

తే॥ భటులఁ గన్నెత్తి చూడక • పట్టఁ జేరు, సుతులఁ బ్రేమను కాంచక • సతులఁ గనక
పరవి యున్న సేననుగూడఁ • బాటిగొనక, వెంటవచ్చు వారలను భా • వింపకేగె.

తే॥ కమలవదనల కనులు ఖ • డ్గములపోల్కిఁ, గష్టములె కూర్చెసుతుల వా • క్యములు రామ
బాణములవలె నొంచెఁ జె • ల్వాల పయోధ, రములు తన భుజములవలెఁ • బ్రమద మిడవు

తే॥ మంత్రములు తెల్పువృద్ధులు • మందయాన, లైన భార్యలు సైన్యనా • యకులు బంధు
హితులు ప్రతిమలపలె నిల్వ • దితిజవిభుఁడు, దంతివలె నేగి చేరె నం • తఃపురంబు

తే॥ అచట నొక పైఁడిపీఁటపై • నమరి చింత, యించుకంత కుదించి యో • చించి పిదప
గంచుకిని పిల్చి వేగ వే • గరులఁ దోడి, తెమ్మనుచు నాజ్ఞయిడ వాఁడు • తీవ్రగతిని.

తే॥ వెడలి వాయువేగుఁడుమరు • తుఁడు మనోగ, తియుమహామేఘుఁడాదిగాఁ • దెలివి గలుగు
దూతల నసంఖ్యజనములఁ • దోడితేర, వారలకు రావణుం డాజ్ఞ • వఱలఁజేసి.

తే॥ ఏడుదీవులయందు మ • హీధరములఁ, జక్రవాళంబు మీఁదను • సర్వభువన
మందుగల రాక్షసుల వడి • నరుగుదేర, నాజ్ఞ దెలిపి తోతెండని • యనిపి వారి.

చ॥ క్రమముగ నాజ్ఞమోచి యుఁడి • గంబులు సేయు త్రిలోకవాసులన్
దమవిభు భావమిద్ధియని • తత్పరతన్ గమనింపలేక డెం
దములఁ దపింప రామ శర • దారుణ వేదన నోర్వలేక నా
గము తనసెజ్జఁ జేరుక్రియఁ • గర్బురనాథుఁడు చేరె శయ్యకున్.

ఉ॥ సుందరియైన జానకి వ • సుంధరపుత్రిక నిండియున్న యా
డెందమునందు నిండుగ బి • డెంబు గడల్కొనఁ దోడఁ జింతయున్
గ్రందుగఁ జేర నించుకయుఁ • గట్టిఁడి కూరుకురాక లోపలన్
గుందుచు భంగపాటు వెలి • గొల్పఁగ గొప్పగ నిశ్వసించుచున్.

ఉ॥ పాఱిన వేలుపుల్ నరులు • పల్చన నవ్వుదురంచు శాత్రవుల్
మీఱఁగ నవ్వు వారనుచు • మెట్టుకు సిగ్గు వహింపఁబోఁడు లం
కా రమణుండు సీత నగుఁగా • యని మిక్కిలిగాఁ దపించె నౌ
నారులు నవ్వ సైఁపనగు • నా మగవారికి నిల్వరంబునన్?

ఆ॥ అంత నసుర తాత • యగు మాల్యవంతుండు, వృద్ధు మేను విల్లు • విధము వంగ
రావణునకు నగు ప • రాభవంబును విని, వచ్చి కూరుచుండి • వానిపజ్జ.

ఉ॥ వాని పరిస్థితిన్ దిగులు • వాలు నెగాదిగఁ జూచి చూచి య
క్షీణ తపోనిధీ! కడిమి • చేడ్పడ ముమ్మరమైన పోరునం
దూనితి నోటునంచు దిగు • లొందె కృశించెదె? యేమియయ్యె? నా
మానవు లెట్టిరో? తెలుపు • మా విన నామది తత్తఱించెడిన్.

ఉ॥ మనసును మేను కన్నులును • మండఁగ శర్కరమైన ద్రాక్షయై
నను రుచి గానలేని వహి • నాలుకయెండఁగ దైత్యనాథుఁ డి
ట్లనియెను తాపసాకృతుల • నందిన మర్త్యులతో రణంబు కూ
రెను మన వంశగౌరవము • వ్రీలెను నాస్థితి గోడిగంబుగాన్.

## రావణుఁడు మాల్యవంతునకు రాముని పరాక్రమాదులు తెలుపుట

క॥ తాతా! రుద్రుఁడు మొదలుగ, నాతత లోకముల వార • లందఱు పెలుచన్
నాతోడైన సుమిత్రా, జాతుని బాణముల కాగఁ • జాలరు వింటే.

చ॥ సమరమునం దగణ్యమగు • సైన్య కదంబము రూపుమాపుచో
దమథముపూన్చి మోటమిని • దార్చెడుచో నుబిమట్టి యుండలన్
దమకముతోడ పంథరకుఁ • దొలఁగ నేసిన నాఁటి లీల చం
దమునన యుండెఁ గాని భయ • దస్థితిఁ దాల్పఁడు రాముఁ డయ్యెడన్.

ఉ॥ రాక్షససేన దట్టమయి • క్రాలిన లక్ష్యము దప్పకుండు రా
మాక్షయ బాణసంఘము శ • తాంగ తురంగ మతంగజాదులన్
బక్ష శిరోధి మధ్య కర • పాదములన్ వడిఁ ద్రుంచుఁగాక యే
క క్షణమైన నేమెడను • గాఁడుచు దుయ్యక యందు నిల్చనే?.

ఉ॥ రాముని చేతినుండి ప్రద • రంబులు వెల్వడు పిమ్మటన్ జగ
త్త్రోమముఁ గొప్పఁగాని వెను • ద్రొక్కవు కల్పము దాఁటవచ్చుఁ ద
ద్భీమ శరప్రఘాతములు • పీదవు దిక్కులఁ గాల్చు మాఱు ప
ల్కమనఁ గాఁచ్చె వైర మెద • నెంచినఁ గాల్చు లయాగ్నిఁ గాలుచున్.

ఉ॥ మేరువుఁ జీల్చుమన్న వడి • మింటిని రంధ్రము సేయుమన్న నీ
ధారణి వ్రచ్చుమన్న జల • దంబుఁ జెదర్చుమయన్న వారిధిన్
నీరముఁ ద్రావుమన్నఁ దన నిస్తుల సాయకపాళి శక్తికిన్
నేరుపుగాఁగ దోఁప వవి • నిల్చునొ నిల్వవొ వాని ధాటికిన్?.

ఉ॥ అమ్ముల నెత్తికొంట గొన • యమ్మునఁ గూర్చుట యేయుటల్ విలా
సమ్ముగఁ దోఁచెఁ గాని కెల • నంబుగఁ గాంచెడు వేల్పులేని స్వ
ల్పమ్మును గానరైరి కర • లాఘవమున్ శర లాఘవంబుఁ బ్రా
ణమ్ములఁ గ్రోలఁడీ చనుఁడ • నం దన సైన్యము వోలె వెల్వడున్.

క॥ ధరణీశ నాథుని శర సం, చరణమ్ములు సురని వాక్య • చరిత గుణాలం
కరణ ధ్వనులం గలిగియు, విరమణములు లేని విబుధ • వినుతికి నెక్కెన్.

చ॥ భవుని త్రిశూలముకన్న మహపు • వజ్రము వెన్ను ని చక్ర మాజిలోఁ
జవి గవినాఁడ భేదము ని • జంబుగ నెక్కువ యున్నదయ్య! రా
ఘవ శరవేగమున్ సయింపఁ • గాకయె క్రుంగితి నేనుగాక వే
తెవ రిఁకఁ దచ్ఛరాలిఁ గిను • లెత్తి కనం గల వార లీధరన్?

తే॥ రుద్రు బాహాష్టకంబు నిం • ద్రుని భుజద్వ, యంబు విష్ణుని బాహు స • హస్రకంబు
నితని యొక వ్రేలి బలిమికి • నీఁడు రావు, తాళఁజాలవు తాఁకి య • థార్థ మిద్ది.

తే॥ వీరు లెందఱేనియు నుగ్ర • విఖ్యులైనఁ, గాత్రవీర్యఁ బోలినవారు • కారు నిజము
అట్టి యర్జునుఁడును రాము • ననుజు పాద, ధూళికిని వోల్పసాటి కాఁ • జాలఁడయ్య!

చ॥ త్రిపురములన్ దహించుతఱి • శ్రీగళుఁ డూనిన విల్లు దాని ముం
దెపుడును వేఱ్కఁ జేని ధరి • యింపఁగ నొప్పదు దానికొక్క వే
ఉపమితి పల్కలేదు శ్రుతు • లొక్కెడఁ దప్పినఁ దప్పుఁగాక యా
తపన కులేంద్రు చాపము ప • దల్చు శరంబులు తప్ప నేర్చునే?

సీ॥ వెలుచో నాగ్నిమో • ములవేల్పుఁ బోలును, చెఱుచోట సహస్ర • శీర్షుఁ బోలుఁ
బగఱఁజేర యుగాంత • భైరవుఁ బోలు నా, చిలుకుల పనులు వ • చింప నరిది!
నా బలగర్వముల్ • నశియింపఁ జేసిన, నన్న వేఱొక సాక్ష్య • మెన్న నేల?
వాఁడు పట్టినవిల్లు • పడమటిదో? తూర్పు, దో? దక్షిణంపుదో? యుత్తరపుదో?

తే॥ మూలలందలిదో? విశాల • భూమిఁ గలదో?, మింటిదో సమస్తంబును • మేవినదియొ?
యెఱుఁగఁజాలకుంటిని కుడి • యెడమలఁదు, నిక్క మేవంకనుండెనో • నేర నిఁకను.

మ॥ వసుధాధీశుని వాహనం బనిలుఁడో • వైశ్వానరుండో విభా
వసుఁడో కాలుఁడొ కావలెం దెలియఁగా • వచ్చుం బ్లవంగంబుగా
వెస నక్కోఁతి యొనర్చు చేఁత లరగ • ద్వేష్యుండుఁ గావించునే?
యసమానోన్నతి నొంద దద్దియన నా • యజ్ఞత్వముం దెల్పదే?

చ॥ కదనతలంబుఁ జేరి యెఱుఁ • గంవగు నక్కఱలేదు గౌరవా
స్పదయగు ధాత్రి కీడయిన • జానకి రాముని మేనుగాంచి భీ
తిదమగు వాని వీర విహా • తింగని యుఁడుట మన్మథుండు నే
మొదలుగ నెల్లవా రతివ • ముందఱఁ గుక్కలు గాక యన్యులే?

క॥ నాశము గలిగెడి వేళను, శ్రీశ విరించన మహేశ్వ • రేంద్రాదులచే
నాశిల్లక యుత్తమ వసు, ధేశు నొకని వైరిగాఁగ • నెనసితిఁ దాతా!

చ॥ అనవిని మాల్యవంతుఁ డను • నన్న! వచించితి మున్నె నీకు నేఁ
జనవున వానిఁగైకొనవు • చాలఁ జిరాకుసు గొంటి వా యకో

పనుఁడు విభీషణుండు తెలు • పన్ వినకుంటివి కారణంబు లు
న్నను పరికింప కుంటి వి(క • నాతరమా వివరింప శ్రేయముల్?

చ॥ కటువుగాఁగ నున్నను సు • ఖంబులం గూర్చెడు పద్ధతుల్ విశం
కటగతిఁ జర్చచేసి యొడి • కంబుగ నిక్కపు బంధులాడ నొ
క్కటియుఁ జెవిం గదింపక ము • ఖస్తుతి చేసెడు మూర్ఖ వాక్కులం
బటిమగ విన్చు నీ గతిని • పాడొనరించుచు నుంటి సర్వమున్.

తే॥ అనుడునవ్వలనున్న మా • యావిమిన్న, యగుమహోదరుఁడెడసొచ్చి • యతనినుజీమి
చూచినొచ్చిన ప్రభు నిట్టు • లేఁచఁదగునె?, యనుచునుత్సాహకరముగా • నాడఁదొడఁగె

ఉ॥ మేలు దలంచి మంచిదని • మేవడిగొన్న యనంతరంబు గె
ల్పే లభియింపనిమ్ము మఱి • యెద్దమిచే నసువుల్ త్యజింప నో
ఉే లభియింపనిమ్ము తమ • యెన్నిన పట్టున నిల్చుటే మహా
శీలుల లక్షణంబు వెను • చెంగిన నిందయు రౌరవంబగున్.

తే॥ అల త్రివిక్రముఁడును త్రిపు • రాంతకుండు, పోరి యోడిరి వైభవ • స్ఫూర్తి చెడఁగఁ
జంచలీకృత కైలాస • శైల? నరుల, తోడి పోరున కీవు వె • న్నాడుదేమి?

చ॥ గెలిచిన వార లోడెదరు • గెల్చెద రోడినవార లొక్కచోఁ
గలిమిగలారు క్రుంగెదరు • కల్మి వహింతురు లేకివారలున్
బలమున కొక్కయెల్ల కను • పట్టునె? యల్ప తపః ఫలంబుచేఁ
దొలఁకెడు రామలక్ష్మణుల • దొడ్డగఁ బల్కెదు బట్టు పోలికన్.

ఉ॥ సీతను వీడిలేని యొక • చెట్టయు రా దటు వీడకున్న చో
పీతముగాఁగ జీవముల • నీఁగిన నీఁగఁగవచ్చు వేఱు సం
పాతము గల్గునేమి? సిర • బంధుర గౌరవ మింకిపోవఁ జిం
తా తలిమంబుపైఁ బొరలి • తాపము నొందినఁ దప్పిపోవునే?.

ఉ॥ ఊరక యిట్లు పున్వెనుక • లుయ్యల లూఁగుచునుండ లంకలోఁ
బౌరులతోడ మమ్ము ఫల • పాదపబృందము వోలె రాము డం
డారడ మొప్ప నార్పడె? జ • లార్ణవమందొక కొంత నీరమున్
సూరుఁడు త్రావ నంతయును • శోషిలె నంచడలంగఁజెల్లునే?.

మ॥ మును ముమ్మూర్తులు వేల్పులోడి పఱవన్ • ముల్లోకముల్ నీమహా
జ్ఞను పాలించుచునుండగాఁ దృణముపై • నట్టాడు ప్రాలేయముం
జెనయంజాలని మానవాధముల వా • నిం బెద్ద కొండాడి నీ
యనుఁగుందమ్ముని కుంభకర్ణు బల గ • ర్వాదుల్ డిగం బూన్చెదే?

తే॥ కుంభకర్ణు రప్పించి సం • రంభ మొప్పఁ, బంపుదేని యతనిఁ గాంచి • పాఱి డాఁగు
వారు; నిలిచినచో వారి • ప్రాణములను, తీసికొని రాఁగలండు దై • త్యేం ద్ర!

ఉ॥ నావుడు రావణుం డతని • సన్మతి మెచ్చి కుమార! వైభవ
శ్రీ విలసిల్లఁ బల్కితివి • ప్రేమను మేలయుఁ గల్గునేమి? ర
క్షో వన పాలకుండ వని • సొక్కి సమాహితచిత్తుఁ డయ్యె: వి
ఘ్నావలి వచ్చునేమి నడు • మంతరమందు వినాశవేళలన్?

## కుంభకర్ణుని మేలుకొలుపుట

మ॥ ఇది మేలంచు వచించి రావణుఁడు మీ • రింపారఁగా నేగి యె
వ్విధమైనం దగఁ గుంభకర్ణు నిదురన్ • వేతోలి తోడ్తెండనన్
బదఁడంచున్ యమదూత లట్టు లసుర • వ్రాతంబు నిద్రాళు నిం
టి దరిన్ వాకిట నిల్చి లెమ్మనుచుఁ దా • టింపంగ వాద్యంబులన్.

ఉ॥ లేవని కుంభకర్ణుఁ గని • లెంకలు లోనికిఁ జొచ్చి లేఁదువఙ్
గ్రేవలఁ బోయి తోమర వ • రిష్ఠ గదాదుల మస్తకంబుపైఁ
జేవ యెలర్ప మోఁదియుఁ గృ • శింపని నిద్దుర గాంచు దానవున్
సేవకు లంతఁ గన్గొని వ • చించిరి చీఁదల యగ్గలింపఁగన్.

ఉ॥ నిద్రాదేవికి ముద్దుకూన! విను ని • ర్నిద్రుండు కాలుండు నీ
నిద్రాభంగము చేసినాఁ డలుపమా • నిద్రాళుతన్ వీడి పె
న్నిద్రం బొందుము కాలమందిరమునన్ • నిండారు ప్రేమంబుతో
భద్రంబుల్ సమకూర్చె నగ్రజుఁడు నీ • పాండిత్యమున్ మెచ్చుచున్.

మ॥ కొఱలేకుండిన దానవాలి బ్రదుకుల్ • క్షోభంబులం బొందఁగాఁ
గొఱవిం జేకొని నెత్తి గోఁకికొను మూ • ర్ఖుం బోలె మీయన్న యి
క్కాఱగాముల్ పొనరించి దీర్ఘమగు కూ • ర్కు న్నీకుఁ జేకూర్చె ని
క్కాఱయౌ నిద్ర యిఁకేల లెమ్మనుచు ర • క్షోవీరు లంకించుచున్

ఉ॥ నొచ్చిన కేలు మిక్కిలిగ • నొవ్వఁగఁ గొట్టియు మేలు కాంచమిన్
గ్రచ్చఱఁ బోయి రావణుని • గాంచి ప్రభూత్తమ! తమ్ము నియ్యెడన్
జెచ్చెర లేప మావలనఁ • జెల్లదటంచు వచింపఁగా నతం
డెచ్చగ దంతిమూఁకలఁ బ • యిం బఱపించుచు లేపుఁ డీయెడఙ్.

తే॥ వారణములు త్రొక్కినను లే • వకయయున్న, మీకుఁగల నేర్పులంజూపి • మేలు కొలుపుఁ
డనుచు వేవురు మల్లుర • ననుప వారు, ప్రభునిచింత వీతఁడు తీర్ప • వలఁతి యనుచు.

చ॥ తలఁచుచు నిద్రలేపఁ జని • ద్వారముతీయఁగ వాని శ్వాస మ
త్యలఘువుగాఁగ వీవ జడు • లందు దగుల్పడి లోని కేగుచున్
వెలి కరుదెంచుచుం దగులు • వీదమిఁ జేతు లొకళ్లొకళ్ళు వి
ట్టలముగఁ బట్టికొంచును ది • టంపు బలంబున దాఁటి రంకిలిన్.

తే॥ పడకయను వారినిధినుండి • పైకిలేచు, తనను నిడుపైన మేనిపైఁ • దనరి యలము
బాడబాగ్ని కీలలో యనఁ • బరఁగు నిడుపు, వేగుజైన రోమములఁ • బెలఁగువాఁడు.

తే॥ దెసల గెలిచిన దశకంఠు • దెసకు మునుడు, బాంకి చండ మయూఖుండు • జాతవేదుఁ
డడఁగి యుండఁ దగిన గుహ • లనఁగ నిద్రఁ గప్పు పీడని లోఁతగు • కనులవాఁడు.

తే॥ వారణంబులు చరియించు • పర్వతగుహ, పంటి దోనములఁ గల ముక్కు • వఱలువాఁడు
కొండ చిలువలు నిద్రింపఁ • గూడునట్టి, పెద్ద శ్రవణ రంధ్రంబులు • వెలయువాఁడు.

తే॥ ఐన కుంభకర్ణుని గని యన్నగారు, పిలుచుచున్నారు మిమ్మని • విన్నవించు
సేవకులతోఁడ జనె దశ • శీర్షుఁడున్న, మందిరమునకు నగరాన • గ్రందుపట్ట.

తే॥ పెద్దకొండ పరుండిన • విధముదెలియఁ, జాఁగి తమ్ముఁడన్నకు మ్రొక్క • వేగయెత్తి
గ్రుచ్చి కౌఁగిలించుకొనె ర • క్షోవిధుండు, కొండ కొండను తడవిన • కొమరుదోఁప.

తే॥ ప్రక్కఁగూర్చుండనిడుకొని • రక్తమద్య, ఘటఘటలుకొన్ని తెప్పించి • కాంక్షనొసఁగి
పలల మిచ్చి తెల్లని పట్టు • వస్త్రములను, రత్నభూషణముల నపా • రముగఁ బెట్టి.

తే॥ ఇంద్రుఁ డైరావతంబుతో • నీగిపోటు, వేళఁ దప్పి జాలిపడిన • వీరపట్ట
మమర ఫాలభాగమున లం • కాధినాయ, కుండు తమ్మున కర్మిలిఁ • గూర్చికట్టె.

తే॥ మెఱపుకైవడి మేనెల్ల • మెఱయుచుండఁ, జెందిర మలందిన గజంబు • చెలువుదెలుప
మొగులుఁబోని దేహంబున • బుగులురావి, చందనముపూసెఁ దనదు హ • స్తములతోడ

తే॥ విసము కసిమసఁగినరీతి • విస్ఫురత్ప్రోవ, యొరయు నిల్చిన తమ్ముని • యురమునందు
భవుఁడు ప్రేమతో నొసఁగిన • వహ్నిఁబోలి, వెలుఁగు కవచంబు దొడిఁగెను • విబుధవైరి.

ఆ॥ ఎడమకన్ను బొమయు • నెడమ భుజంబును, కంపమొందఁ గుంభ • కర్ణుఁ డంత
నన్నఁగాంచి సంగ • రాలంకరణమేల, సేసె దనఁగఁ బంక్తి • శిరుఁడు తెలిపె.

క॥ నరపతి సుతు లిరువురు వా, నర సేనలతోడ వచ్చి • నగరమ్మును పెం
పఱ ముట్టి యెవ్వ రెన్నఁడుఁ, బొరయని విజయమ్ము గొనిరి • పోరిగొను వారిన్.

## కుంభకర్ణుఁడు రావణునకు హిత ముపదేశించుట.

ఉ॥ నావుడుఁ గుంభకర్ణుఁడు ఘ • నంబగు యుద్ధము సంభవించెనే?
పావనియైన జానకికి • బన్నము లంకను నీఁగలేదొకో?
దేవ మనుష్య లోకముల • దీపిత రాక్షసకీర్తి మాసెనే?
యీవగ దాపరించెనె స • మిద్ధ కులంబునకున్ వినాశముల్?

చ॥ సమరము దాసెనే? యదియు • జానకి కోసమె సంభవించెనే?
కమలదళాక్షిపైఁ బెడుగు • కామము వల్దని మున్నెయంటి నే
త్రముల విసంబు గల్గిన వృ • దాకువుఁ బోలిన ధాత్రిపుత్త్రి పైఁ
దమి విడకుంటివో? విడక • తక్కుటయున్ విధికృత్యమేయగున్.

చ॥ వసుమతిఁ గ్రెల్లగించి సుల • భంబుగ నెత్తఁగవచ్చు లోకముల్
కసిగొని మ్రింగవచ్చు రఘు • కాంతుని సంగరమందు గెల్వ మా
నసమున నెంచుటల్ జనక • నందిని మేను పరిష్వజింపఁగాఁ
బొసఁగుసటంచు నెంచుటను • బోలును రాక్షస వంశ భూషణా!.

చ॥ గెలుపును గల్గునే? మరియుఁ • గీడ్పడుఁగాక పులస్త్య ధాత్మ స
త్కులమున మేలిమిన్ జెడఁగఁ • గోరి యొనర్చితి భూగుణంబు చే
జల గుణమున్ విభిన్నమగు • జానున నుత్తమ వంశ కీర్తి నీ
వలన నశించె సర్వమును • పాడుపడెం బలుభంగులం గటా!

క॥ ఇచ్చితి జయము మఘవునకు, గ్రొచ్చితి పల్లంబు బందు • గులకు న్నీకున్
దెచ్చితి పలువగలఁ జెడుగు, వచ్చితి చానిచ్చఁ దొలఁగు • పద్ధతి గలదే?

తే॥ మంచి ధర్మపద్ధతుల శ్ర • మించిచేసి, వన్నె మున్ను గూర్చితి బల • భాగ్యములకు
నట్టి ధర్మంబు నీవయి • యడఁచిపైచ, నంచితంబుగ నెవ రుద్ధ • రించువారు?

చ॥ త్రికరణశుద్ధి యుల్ల సిరి • దీన శరణ్యత ధర్మ వర్తనల్
ప్రకట పరోపకారము ను • భాసిలు పుణ్యుల మ్రోలఁ గల్ల బూ
టకములఁ బాపమందును వ • టారి తనంబు వహించినట్టి మో
అకులు జయింపనేర్తురె? లో • అంగునె ధర్మ మధర్మ పీడచే.

చ॥ మఱియొకమాట విన్నఁ గడు • మంచిదెయౌ వినవేని లెస్స యొ
డ్డారకములేల? యున్నది ప • యోధిని దాఁటిన కోఁతి, సీతయుం
జెఱవడె వాలి వక్షమును • చీల్చిన బాణముకద్దు దైత్యులుం
గొఱవడకుండఁగా మనముఁ • గూడితి మేది కొఱంత యెన్నఁగన్?

శా॥ సీతాదేవిని వీడి రామ పద రా • జీవంబులన్ వ్రాలి ప్ర
స్ఫీత ప్రాభవ మొందు నీయనుజు సు • స్నిగ్ధుండవై కొల్చి త
చ్చేతో మోదన రీతి వర్తిలుము; నీ • సేనాతతిం బంపి త
ద్ద్రావిఁబుల్ నశియింపఁ జింతిలుట భా • వ్యంబౌనె? లంకేశ్వరా!

తే॥ పేర్చి దశములఁ బూర్తిగాఁ • గూర్చికొంచుఁ, గదనరంగంబునకుఁ జని • కడిమిఁ జూపి
శత్రులఁ జయించుటో లేక • సమయుటో తగుఁ, గాక యిది యుక్తమగు నెలం • కాపురీశ!

తే॥ అనిన విని రావణుండు ని • న్నక్కఱపడి, పిలుచుచున్న భవిష్యత్తు • దెలుపఁగాదు
వెడలి యల్పమానవులఁ జ • క్కడఁపఁగాని, నీహితములెన్న! తెలిసె న • త్యాహితంబు.

క॥ విడిచితివి పౌరుషంబును, కుడిచితి వుదరంబు నిండఁ • గుదురుగ నింకన్
నడువుము చల్లనియెడ కటఁ, బడి నిద్దురబొమ్మ రేలు • పవలును ప్రీతిన్.

తే॥ మానవులకుఁ గేల్మోడ్చి న • మస్కరించి, గూనిమానిమన్కులకు మ్రొ • క్కులనొసర్చి
బ్రతుకు మనుగడ తిండికై • బ్రతుకునట్టి, నీకు నీతమ్మునకుఁ దగు • నాకుఁ దగునె?

శా॥ ఓరీ సేవక! సాయుధంబగు బలం • బొంటించి తెప్పింపు దు
ర్వార ప్రోద్ధతి దేవ నాగ నర ప • క్షింటెల్ల నొగ్గ్రుమ్మదిన్.
జేరన్వచ్చి మనుష్య వానరులకున్ • బేర్పాటు గాకుండఁగా
బోరన్ రండని యెల్లవారలకుఁ జె • ల్పుండీ మదీయాజ్ఞచే.

చ॥ అని పయనంబుకై తొడఁగు • నన్న పదంబుల వ్రాలి శూలమున్
మినమినలాడఁ గైకొని వి • ముంపుము గెల్పునె పొంది వత్తు నే
నని పచియింపఁజాల విధి • యార్పుచు గెంటుచు నుండెఁ జావు త
ప్పని సరి చత్తునేని జన • పాలక సంధిని వీడు మేలగున్.

తే॥ ఇంద్రజితుఁడును లక్ష్మణు • నిసుపుచేతఁ, బడుట నిక్కము సేనయో • పవనధూత
భూతియగు; బావిశుభములఁ • బొందు తెఱఁగు. చప్పచేసి యంచితరీతిఁ • జలుపుమన్న!

క॥ నను గెలిచి రేని పిమ్మట, నిను గెలుచుట నిజము; విచన • నెమ్మి దలఁచి సీ
తను వీడనుట పెదఁగగుఁ, బనిగొని విడుచెన్న నీ త • పఃఫల మన్నా!

తే॥ నేర్చి నేరక తొలినుండి • నేఁటివాఁడ. నేనొనర్పు తప్పులు గల • వేని సైఁపు
మన్న! నీయెదుటికి వచ్చు • టరిది యింక, సెలవె? యని కుంభకర్ణుండు • వెలలఁబాఱె.

తే॥ నిలుచు రావణు కన్నుల • నీరె కార. నెత్తురును చిందె నచ్చటి • నెమ్మి బందు
గులును మిక్కిలి తపియించి • కుములినారు. కుంభకర్ణుండు పోయెను • కోటదాఁటి.

తే॥ శూలధారియై చను మహా • శూరతోడ. వెడలఁగాక సైన్యంబని • విభుఁడు పలుక
దనుజ బృందంబు వెడలె వా • ద్యములతోడ, మింట సురవితలల దూఱి • మేవుకొనఁగ.

తే॥ స్యందనములపై మాతంగ • బృందములును, గాలిబంటుల కేలను • గ్రాలు కేత
నమ్ము లాజిని లేచు ర • జమ్ము దివిని, మైలపఱప వానిఁ దుడుచు • లీలనొప్పె

తే॥ ఆయుధంబు లొండొంటి రా • యంగ లేచు, నిప్పుకలు వీరుల కనుల • నిగుడు మిడుఁగు
ఱులను మిక్కిలి మెలువడి • యలముకతన, వేఁడిచేత జీమూతముల్ • మాఁడిరాలె.

చ॥ కరులు తురంగముల్ రథ ని • కాయము పంపడియై కదల్కొనన్
ద్వరపడి ముంగల న్నడచు • దంటును వెన్కల నేగు సేన క్రి
క్కిఱిసి కుదించి మధ్య నిఱి • కింపఁగ లోపలి మూఁక నేలపైఁ
జరణము లూనలేక యెల • సంబున వే చనె నంతరంబునన్.

ఆ॥ వేయి శరభములును • వేయి సింగంబులు, వేయి భూతములును • వేయి కరులు
కట్టఁబడిన దిగిభ • గణమీడ్వలేని శే, రెక్కి కుంభకర్ణుఁ • డేగుదెంచె

ఆ॥ పరశు చక్ర భిండి • పాల గదాసి తో, మర నిషంగ చాప • దర ఖరోగ్ర
ముసల శూల శస్త్ర • ముద్గరాదులఁ దాల్చి, దనుజసేన నడచె • ధరణి యదర.

ఆ॥ వరుస వరుసలుగను • వడివడి చేనూని, యంది యిచ్చు రాక్ష • సాలి మద్య
పాత్రములను పక్వ • పఱచిన మాంసంబు, నినుచు బండ్లతోడఁ • జనియెవెంట.

సీ॥ పెక్కండ్రు పనివాండ్రు • వేవేగ బడిబడి, యిరుగేల వారి యం • దిమ్ముచుండ
గుహను చొప్పించు నం • గున నోట నించుచుఁ, గుంభకర్ణుఁడు రణ • క్షోణిఁ జేర
వీని యీకొలపని • వానర వితతితోఁ, బూర్తియై నిలుచునో • పొదవుకొనునొ?
వీని కడుపునిండఁ • బ్రాణివర్గము లెల్లఁ జాలియుండునె యను • శంకపొడము

తే॥ చరణ ముంచిన చోటెల్ల • శవ మయంబు, వీని మూలాన సమవర్తి • వేఱుక్రొత్త
దారి యెఱిఁగెనుయముఁడె ప్ర • త్యక్షమయ్యె, బాఱుపెట్లనియమరులు • పరుగు లిడిరి

తే॥ సర్పరాజు శిరమునుండి • జాఱి భూమి, తోడ మేరువు వచ్చిన • తోయ మొప్ప
కనక రథమెక్కి వచ్చు నా • ఘన రీరుఁ, గుంభకర్ణుని శ్యామలాం • గుండు కాంచె.

తే॥ ఘన పతాకయందున వీణ • గానరాదు, సింగ మున్నది వాని వి • చిత్రతనువు
చిత్తవేగముతోడఁ జూ • చినను పూర్తి, కాదు రాక్షసరూపుఁడీ • ఖరుఁ డెవండొ?.

చ॥ ఒక్క భుజంబుఁదొట్టి మఱి • యొక్క భుజం బగుదాఁకఁ జూడఁగా
నిక్కము కొన్నినాళ్ళు పయ • నించును కాళ్ళు జనించినట్టి గ
ట్టొక్కటి యిట్లు వచ్చెనొకొ? • యుద్ధము సేయఁగఁ గోరివచ్చు పెన్
మొక్కలుఁ డంచెదం దలఁపఁ • బోలదు ఘోర శరీరుఁ డెవ్వఁడో?.

మ॥ ఉదయాద్రిన్ మొలతెంచు భాను కిరణో • ద్యోగంబు మట్టాచ్చి పె
ల్లిదమౌ చీకఁటి నించు వీని తనువున్ • లెస్సం బరీక్షించి నె
మ్మది భీతిల్లి ప్లవంగముల్ దెసలకుం • బర్వెత్తె నీసైన్యమున్
జెదరం దోలఁగ రావణుండు గొను నా • భీల క్రుధారూపమో?

## విభీషణుఁడు రామునకుఁ గుంభకర్ణు నెఱింగించుట

మ॥ అని శ్రీరాముఁడు ప్రశ్నసేయ విని లం • కాధీశు తమ్ముండు ప
ల్కను మాయన్న కృతాంతతుల్యుఁడు లయో • గ్రుం బోలు వాఁడంబుజా
సను గన్నాతఁడు యోగనిద్ర మదిలోఁ జాలింప దైత్యాళి నీ
ల్గను; వేల్పుల్ మరణింతు రీయసుర కూ • ర్కన్వీడి కన్విచ్చినన్.

తే॥ లేప రేని కల్పముదాఁక • లేవకుండు, విదురపోతు గాలికి మించి • కదలువాఁడు
యమునకు యముండు హరిహయు • నాజిఁ దఱిమె, రోషశీలుండు కుంభక • ర్ణుఁడనువాఁడు.

సీ॥ పైనున్న యింద్రుండు • పడకుండఁ జౌదంతిఁ, దేకుఁవ గిరగిరఁ • ద్రిప్పినాఁడు
శ్వాసనుఁబట్టి నలంచి • సారంబు దీయంగఁ, బిడుచువాఁడు జలధి • నడచువాఁడు
చేవకుఁ దగు దృఢ • చిత్తంబు గలవాఁడు, బ్రహ్మచే వరములఁ • బడసినాఁడు
శూలిని మెప్పించి • శూలంబు గొనినాఁడు, సురల పీఁపువలె సదా • చూచువాఁడు

తే॥ ప్రబలి తాటియాకుల గాలి • పడగవోలెఁ, దిరిగినాఁడు జగంబులఁ • ద్రిప్పినాఁడు
ఇంతదాఁకను నిద్రయం • దీతఁ డుంట, వలన జీవించియున్నది • ప్రాణి వితతి.

తే॥ పాడితెరువు గాదిది నీని • పలుక మనకుఁ, బ్రాణహాని నిశ్చయమని • యన్నతోడ
రెండు మాటలు పలికె సీ • తం దుదాని. వెడఁగు దైత్యుండు పెడచెవిఁ • బెట్టినాఁడు.

తే॥ సాధ్యమైనంతవఱకును • సామమునను, హితము బోధించి తుదకింత • యేని వినమి
విసుగుచెంది మృత్యువు శిరో • వీధి నిలిచె, ననుచుఁబల్కి నీయెదుటికి • నరుగుదెంచె

తే॥ అని విభీషణుఁ డాడ వ • నాటవిభుఁడు, వీనిఁ జంపిన లాభంబు • గానఁబడదు
వచ్చునేని చేర్చికొని య • వ్వల వలసిన, పనులు గావింత మిది నీకుఁ • జనునకాదె?

తే॥ అనుడు నతనియొద్దకుఁ • బోవ నర్హుఁడెవ్వఁ, డనుచు రాముఁడు పల్కిన • యిల్లైన వేగి
కలుపుగోలుతనంబునఁ • బలికి వచ్చు. నేని తోడ్తెత్తు ననె రావ • ణానుజుండు.

తే॥ మంచిదని రాముఁడన దైత్య • మాన్యుఁ డేగి, యతనిరాకను విని మోద • మందుకుంభ
కర్ణు పాదముల్ తన మస్తకంబు సోఁకఁ, జాఁగి మ్రొక్కి నతఁడు నెత్తి • కౌఁగిలించె.

## విభీషణ కుంభకర్ణుల సంభాషణము

చ॥ కనుల ముదశ్రు బిందువులు • గాఱ శిరంబును మూరుకొంచు మె
ల్పున నురమానఁ జేర్చి యొడ • లెం బలుమాఱులు దువ్వి దువ్వి స
జ్జన తిలకాగ్రగణ్య! శుభ • సంతతులెల్ల నొకండ వొంది తం
చును ముదమందు నాతలఁపు • శోషిల వచ్చితివేల యజ్ఞతన్?

ఉ॥ నీ వభయంబు నొందుటయు • నిర్జరు లేనియుఁ జెందరాని సం
భావిత సౌఖ్యముల్ చెడని • పద్ధతిఁ గాంచుట వీనులారఁగా
నే విని పొంగి పోయితి గు • ణీ: జమువాతను చిక్కియున్న మా
తావున కేలవచ్చి తమ్మ • తంబుమ రోసి విసంబుఁ గోరితే?

చ॥ చెడి కృశియించుచున్న కుల • శిష్ట గురుత్వము నీ కతంబునన్
దొడి బడకుండ వర్ధిలును • తొల్లిటి కైవడి నంచు మోదసం
బదర వహించు నాతలఁపు • లాఱడి వోవఁగ నాల్కయెండ ని
య్యెడ కరుదెంచితేల మది • యెంతయుఁ దాపము నొంద నక్కటా!

మ॥ తన ప్రాణంబులు వోవునట్టి దశ యు • త్పాదిల్లినన్ లోక పా
వనుఁడౌ రాఘవుఁ డాశ్రితావళిని త్రో • వన్ సాహసింపండు ము
న్నె నశించెన్ మరణంపుభీతి యిపుడా • నిత్యాత్మ సేవించుటన్
జననోద్విగ్నత వోయె నింక నెడియో • సాధింప నీ వచ్చుటల్?

సీ॥ సద్ధర్మమూర్తి శ్రీ • జానకీనాథుని, కలిసి సేవించు భా • గ్యంబు నోచి
పాపకారణములై • పరఁగు నజ్ఞానంబు, నన్యథాత్వము సంశ • యంబు ననెడి
మూఁడు దుర్గుణముల • మూలంబుతోఁ ద్రెంచి, భవదోషముల నెల్లఁ • బాఱఁదోలి
నిర్మలమూర్తివై నెగడు నీవింకను, పరదారలను గోరు • దురిత మతుల

తే॥ బంధువులఁగాఁ దలఁతువే? • బ్రహ్మవలన, నీతి ధర్మంబు జ్ఞానంబు • నిర్మలతయు
నమృత జీవితమును పొంది • యన్న! తుదకు, మన కులాచార వాసన • మానవేమి?

మ॥ దనుజధ్వంసి ధరాత్మజాధిపుఁడు కో • దండంబు నెక్కించి హె
చ్చిన కోపంబున మాకుఁగా నటఁ బ్రతీ • క్షించెన్ దదీయానుజుం
డును కీలాలియుఁ జంపనెంచిన యముం • డున్నిల్వఁ ద్రోవంగనే
రని మా దుర్విధి కాచియున్నది కుమా • రా! యేల నీవచ్చుటల్?

తే॥ నీవు రాము శరణుచొచ్చి • నిలువవేని, రాక్షసుల మేము రామ శ • రవ్రజమున
నాశమొందుచుంగ నుదక దా • నమ్ముసేయ, నొక్కఁడైన లేకుండుట • యొప్పునయ్య?

ఉ॥ లంకకు నీవు వచ్చుట క • లంక వహించిన దైత్య వంశముల్
గ్రుంకినమీఁద నెమ్మదిఁ గ • కుత్స్థ మహాన్వయుతోడనే చుమీ
శంకిల నేల? యక్షయ య • శస్కర సంపద లందుమయ్య! నా
కంకిలి పల్కకింకఁ జను • మా యన నన్నకుఁ దమ్ముఁ డిట్లనున్.

చ॥ పెడఁగగు నాయెడం గరుణ • పీ డని రాముఁడు నీవు వచ్చినన్
విడువఁడు ప్రేపుఁజూపుఁ బగ • వీడు భవాంబుధి దాఁటఁజేయుఁ బం
పడరఁగ నాకొసంగిన స • మస్తము నిచ్చెద లంకతోడ నా
యెడఁ గరుణించి రమ్ము శుభ • మింతకు మించియు నున్నె చూడుమా?

ఉ॥ తప్పికొనంగరాదు నయ • ధర్మవిశారద! పాఱి దాఁగఁగా
నెప్పు గనంగరాదు మర • ణించుట నిక్కము రిత్త చావఁగా
నొప్పునదేది? సత్పథమ • యొందఁగఁదగ్గది నీకు నింతఁగాఁ
జెప్పెడి పాటి వాఁడనె? వి • శిష్ట గుణాకర! యెంచి చూడుమా.

చ॥ చెడుగులె యెల్లవేళలను • చేయుచునుండిరయేని వారు తోఁ
బొడమిన వారలంచు బుధ • పుంగవులంచును బంధులంచు నె
ద్దడి పడి యోర్చునొనె సత • తంబును ధర్మ పథానువర్తికిన్?
బొడవగు నింట దీపమని • ముద్దిడ మూతిని కాల్చకుండునే?

ఉ॥ ఉత్తమకార్యముల్ మిగుల • నోర్పునఁ జేయఁగ నింద యబ్బునే?
క్రొత్తగు దుఃఖజాలములఁ • గూర్చును సంసృతియంచు నిచ్చలున్
బొత్తులఁ దల్లిదండ్రులను • పుత్రుల భార్యల వీడువారు పె
న్బత్తిని ధర్మమున్ విడరు • వారికి నవ్వియ యిచ్చు మోక్షమున్.

చ॥ చెడు గొకరుండు సేయ నటు • సేయని వాఁడును వానితోడనే
యడఁగుట మేలొ? కీడొ? వెర • వారి వివేకిత గల్గువాఁడవే
నుడువుము కన్నతల్లి నెటి • నూఁకుటచేఁ గద భార్గవుండు చ
క్కఁదఁచె; భవుండు బ్రహ్మతల • నక్కట! త్రుంచె దొసంగు గల్గుటన్.

ఉ॥ ఆఱడి యొంది నారకము • సందడఁగందగు చెడ్డ కార్యముల్
పిఱిఁది చేయువాఁ డనుచు • విజ్ఞులు చేయుదురే? శరీరమ్ము
దాఱని పుండునందు చెడు • సంగముఁగోసి తొలంచి కారుష్యం
దూఱిచి మూర్ఖుఁగాఁదగును; • తోయధి నింగువ గల్పు టొప్పనే?

ఉ॥ అన్నను కావఁదగ్గ వెర • వారయ లేద యధర్మ వృత్తముం
గ్రన్నఁ దొలంతమన్న నడి • కాదిఁక దిక్పతులెల్ల నవ్వఁగా
బన్నము బొంది ప్రాణములఁ • బాయఁగవచ్చును రౌరవంబునం
బెన్నిక నుండవచ్చు మఱి • యేది యొనర్పఁగ వచ్చుఁ దెల్పుమా!

ఉ॥ లోకములెల్ల గెల్చితివి • లోఁగొని పాలన సేయలేదు భూ
లోకమునందు విద్వరను • లోలతఁగొల్చితి నేఁటిదాఁక న
స్తోఁకలితోర నాయువును • యౌవనమున్ వృథగా గతించె నేఁ
డీ కరణిన్ ద్యజింపఁదగు • నే యనువర్గ మధర్మవృత్తికై?

చ॥ నెసరున రాఘవుండు కరు • ణింపఁగ నిద్రయు వీడి సౌఖ్య భా
జనమగు జీవితంబుగొని • సార్వజనీనముగాఁగ రాజ్య పా
లన మొనరింప నర్హుఁడవు • లభ్య పదంబిది కూడివచ్చె నా
మనవిని వ్యర్థ పుచ్చక న • మంచితరీతి ననుగ్రహింపుమా.

సీ॥ ధర్మ సంస్థాపనా • ర్థంబు విష్ణువు రాముఁ, డై జనించెను భాస్క • రాన్వయమున
నాదిదేవుఁడె యీయ • నపవాదు గల్గునే?, యెల్లిదమౌనె? రా • యిడియు నున్నె?
నీచుల పద్ధతుల్ • నీఁగి విబుధ సంఘ, నియమముల్ గొని నీవు • నెగడుదేని
రాక్షసాన్వయ మహా • వృక్షంబునకు వేఱు, పురువు దశాస్యుండు • పొలియు పిదప

తే॥ నీ కుమారులతోడను • నా కుమారుల, లన్న కొడుకులు సౌఖ్యంబు • లరయువారు
మన పులస్త్య వంశంబు ని • ర్మలినమగును, తెలియవే యింతమాత్రంబు • ధీరచరిత!

సీ॥ మునులు ప్రేమింతురు • దనుజ విరోధులౌ, సురలు ప్రేమింతురు • సూ దడంగు
శాత్రవులే నీకు • జగతి లేకుందురు, పిందెలు పుట్టెడి • వేళయందు
పూలు త్రుంచుట దొడ్డ • పురుషాల పనియౌనె, జానకీపతియె నై • సర్గికమగు
కరుణచే నాయెడఁ • గల ప్రేమచేత ని, న్నర్థించి పిల్వ న • న్నంపినాఁడు

తే॥ రాముఁ జేరుటె మేటి క • ర్తవ్యమగును, కాన ధర్మంబుఁ గడపక • కడఁకతోడ
వచ్చి మేలొందుమని వాని • పాదములను, వినమితుండయి పట్టె వి • భీషణుండు.

ఆ॥ శిరము భూమి సోఁక • నెరఁగి కాళులు పట్టి, కొన్న పిన్నతమ్ముఁ • గ్రుచ్చియెత్తి
యక్కు చేర్చి కనుల • నస్రముల్ రాల్చుచుఁ, గుంభకర్ణుఁ డిట్లు • కుదురఁబలికె.

చ॥ జల లిఖితంబు వంటి సుఖ • సంపద లందఁగఁగోరి యెల్లవే
శలఁ దగఁబెంచి పోరికి న • లంకృతిచేసి జయేచ్ఛచేత న

న్నెలమిని పంపు నన్నుకు వ • హించిన ప్రాణము లీయకుండ శ
త్రులకడఁ జేర నాకొనరు • దుఃఖముఁ దీర్తువయేని పొమ్మికఁక.

తే॥ చెడని ధర్మమార్గము చిరం • జీవితయును, ధాత వరమునఁ బడసిన • తండ్రి! నీవ
జగములకుఁ బ్రభుండవు నీకె • తగినదదియు, సమర మరణంబె నాకు య • శస్కరంబు.

ఉ॥ యోచనలేని యొక్క ప్రభు • వొప్పమిసేయఁ దలంచెనేని యా
లోచన సెప్పి దిద్దు టది • లోకమతంబు వినండయేని వీ
రోచిత వృత్తినుండి విభు • నోరెము మెక్కిన వాక లాజిలో
దాఁచక ప్రాణముల్ విడుట • ధర్మము; వీడుట కీర్తి మార్గమే?

చ॥ చెలువుగ దేవదానవులు • సేవలు సేయఁగ మూఁడు లోకముల్
బలిమిని గెల్చినట్టి రిపు • వారణ సింహము రామబాణ ని
ర్దళిత తనూజ బంధు హిత • తండముతో మరణించుచుండఁ ద
మ్ములనాకరేని తోడ్పడక • పూర్తిగ నీఁగుట భావ్య మౌనొకో?

చ॥ ఎదురొకరింతలేక విజ • యేందిర నెల్లెడఁ గొంటచే భయం
బెదగొనియున్న శాత్రవులు • హేళన సేయ సుమా మహేశ్వరుల్
పొదలు నగంబు నెత్తిన ప్ర • పుష్ట భుజంబులు కాలపాశ బ
ద్ధ దశ భజింప నొంటిగఁ గృ • తాంతుని సద్మము సేరఁ బాడియే?

చ॥ బలితపు రాగికోటలను • భాసిలు పట్టణ సంపదున్నతిం
దెలిసి మదగ్రజాసువులఁ • దీసిన విద్విషు సంస్తుతించుచున్
గలనిని మార్గణాహతిని • కాయలుగాచిన యొమ్మతో పడిన్
వలకదతేని దుర్మదముఁ • బాపిన యేనును మ్రొక్కనేర్తునే?

సీ॥ హనుమంతు నంగదు • నర్కసుతుని వీర, మనుజులౌ రామల • క్ష్మణుల నీలుఁ
గాయలు కసరుల • కై ప్రాఁకులాడు వా, నర బుక్షవరులను • నుఱుముచేసి
ప్రాలేయహరుఁడైన • భాస్కరుకైవడిఁ, గదన రంగంబునఁ • బొదలువాఁడ
హాలాహలముఁ గన్న • యమదులవలె హరి, సేనలు దెసలకుఁ • జెదరిపాఱఁ

తే॥ గదలి స్థితిచప్ప నగ్నియు • గాలి పఱవ, విలయమందు జగంబులు • విహ్వలింప
శూలమును కేలఁగొని తాటి • గాలిపడగ, పరుదునం దిరిగెనఁ జూడు • మెమరులేక.

తే॥ కలఁగి పాఱక సమర రం • గంబునందు, నిలుచు వా రెట్టివారైనఁ • జెలగివైతు
నాదు పలుకుల మన్నించి • వాదు విడిచి, భాను కులుల స్నేహంబు గా • పాడుకొనుము.

ఉ॥ తమ్ముఁడ! యేగు మాజి తుది • దాఁకిన పిమ్మట రామువేఁడి త
త్సమ్మతి సంగరస్థలిని • చచ్చినవారికి శాస్త్రయుక్తి నీ
తమ్ముగ నౌర్ధ్వదైహిక విధానముల న్నెఱవేర్చి మమ్మెపే
రిమ్మెన నారకంబునకు • నేగఁగనీయక యుద్ధరింపుమా.

తే॥ కాకమానదు కాగల • కర్మ ఫలము, నిలిచి కనువిచ్చి కాచిన • నిలువఁబోదు
కలరె నీకంటె విజ్ఞాన • ఘనులు? చింత, సేయవలదు మాయెడఁ; జిరం • జీవి వగుము.

చ॥ అని మఱి చేరఁదీసి ప్రియ • మారఁగ బిగ్గఁగవుంగిలించి మైఁ
బులకరుచుఁ దేప తెపలుగఁ • బొంగెడి భ్రాఁతిని బాష్పపూర్ణవీ
క్షణములఁ జూచిచూచి పెలు • చందెగె నేఁటికి సోదరత్వమి
ట్లని పనపంగఁ దమ్ముఁ దద • లాఁపఁగనేరక వ్రాలె నన్నపై.

ఉ॥ నోరు మొగమ్ము దెంవము క • నుల్ వదినెండె శరీర జీవముల్
తాఱి తపించె పిర్వ్వరకుఁ • దక్కక వాదు పెరుంగ మేలు చే
కూరదటంచు నగ్రజుని • కోరి యనుజ్ఞను వేఁడి సేనలం
బేరిమిఁ గేలుమోడ్పఁగ వి • భీషణుఁ డయ్యెడనుండి క్రమ్మఱెన్.

ఉ॥ చౌర్యము గల్గు మమ్ముఁ దన • జాతి గుణంబులు వీడి వేద వి
ద్వర్యుఁడు మా విభీషణుఁడు • బాల్యము నైతము ద్రోసెనంచు నే
చర్యయు లేక క్రుంగిన వి • చారముతోఁ గనుఁనీరు రక్త సాం
కర్యము నొంది వెల్లువలు • గా నటనిల్చెను కుంభకర్ణుఁడున్.

ఉ॥ వచ్చి విభీషణుండు రఘు • వర్యుని పాద సరోజ యుగ్మమున్
హెచ్చిన భక్తి మ్రొక్కి ధర • ణీశ్వర ! చావఁదలంచువారికిన్
నచ్చునె ధర్మచింతనలు ? • న్యాయము సౌమ్యము నేర్పుచూపి పె
న్మచ్చిక చేసితిన్ మనసు • మాఱదు పోదు కులాభిమానమున్.

తే॥ అంచుఁబలుకంగ శిరము పం • కించి రామ, చంద్రుఁడనియె నీయెదుటనె • జాలిమాలి
యాఱి నీయన్నఁ జంపు ట • నర్హమనుచు, మంచిదేయంటి; విధికిని • మాఱుగలదె ?

కుంభకర్ణుని యుద్ధము

తే॥ అనుచు మెల్లన ననుమంద • నసురసేన, వనచరావళిఁదటిసి పో • రునకుఁ దిగువ
నెగసినట్టి రజము నింద • నీరరాశి, ఘోష మడఁగె దద్విధము కా • కుత్స్థుఁ దెటిఁగె

ఉ॥ పాఱెఁ దురంగముల్ కరులు • పాఱె రథంబులు పాఱెఁ గొండలుం
బాఱెను నెత్రు వెల్లువలు • పాఱెఁ గబంధము లెల్లచోటులన్
మీఱి నటించె భూతములు • మిక్కిలి గంతులు వైచెఁ దెక్కముల్
తాఱెను కంక గృధ్రములు • తారె వియత్తల మెల్ల నిండుచున్,

సీ॥ ఎమ్ములు మెదడు మాం • సమ్ము రక్తము క్రొవ్వు, నలినలిగాఁగ దా • నవులు పడిరి
శిరములు భుజములు • తరులును గిరులును, పొడిపొడిగాఁ గపుల్ • కెడసి పడిరి
వీసిరి రక్కసు • లేసిరి వనచరుల్, విసరిరి దనుజులు • విసరె హరులు
నలఁచిరి దైత్యులు • నలచిఁరి ప్లవగులు, తిట్టఁ దిట్టిరి కొట్టఁ • గొట్టినారు

తే॥ చీల్పఁ జీల్చిరి చెలగంగఁ • జెలగినారు, క్రుమ్మఁ గుమ్మిరి కొఱకంగఁ • గొఱికినారు
హెచ్చుతక్కువ లేకుండ • నెసక మెసఁగ, రణము సల్పిరి ఖేచరుల్ • భ్రాంతినొంద.

ఉ॥ వాపను తోలు గాలియును • వాయువుతా(కున కోర్చ వానయున్
మానగు తారకాణగన • మంబుగ, బోరెడు పోరుగాంచె శ్రీ
మానిని నిర్జరేంద్ర పుర • మార్గము( ద్రొక్క(గనీని శూలముం
బూనిన కుంభకర్ణు(డు స • ముద్ధతి వచ్చె సమిద్ధరిత్రికిన్.

॥ విలయవాతంబునందు జీ • వులు భ్రమించు, సనువుదో(పధూళిని దగు • ల్కొనియునేత్రు
చేఱులం జక్రముల వార • జేంద్రములను, తగులుకొని నేల(గూలెను • తరుచరాళి.

॥ శైలముల్ వైచుచు • స్యందనాగ్రమునకు(, బఱతెంచు వానర • ప్రతతి( బట్టి
మొనసియొండొకటితో • మో(దునుతన్నును, నలచును మ్రింగును • నపలి యుమియు(
ద్రెంచును చీల్చును • త్రిప్పి యెగురవైచు(, బిడిచి రక్తము మేన( • దడవికొనును
నేల నడ(చివైచి • కాల రానును నీట, ముంచును నిప్పున • నుంచు( గ్రుంచు(

తే॥ పేరునకు( గొట్టు జలనిధి( • జేరవైచు, దిక్తటంబుల( దవులంగ( • దివిరివైచు(
బొదల మ్రా(కుల(బడవైచు( • గుదియవైచు(, బర్వతంబుల( బడవైచు( బాఱవైచు.

ఉ॥ ఖేచరపాళి భీతి( గల( • గెన్ మల(గెన్ దొల(గెజ వియత్స్థలిన్
వేచెను కంకగృధ్రములు • పీను(గులం దిన మూకమూ(కలై
మోచిన కొండలెల్ల( బొలి • వోయె( గృతాంతు(డు సాధ్వసంబునం
జూచెను కుంభకర్ణు(డు వ • సుంధర( గో(తుల( జక్క(డంప(గన్.

చ॥ విసరుట కొక్క( జాయియును • వృక్షము( జిక్క(దు నే(డె తెచ్చుకొం
డెసకమునన్ శుభంబు లద • యించెను రండని వానరౌఘముల్
వెస( గొని తెచ్చి కొట్టినవి • వేసిన తాలు గిరుల్ కుంజబు ల
క్క(సపడకుండ దైత్య భుజ • కాండము లోర్చె నహోయనన్ సురల్.

ఆ॥ విసరుతాలు మట్టి • పెల్లలు( దరుగిరుల్, నుగ్గునూచ మగుచు • మ్రగ్గిపడ(గ
వైవ నెవియులేక • వానరుల్ సంద్లీల, కటచి దాసి త్రుళ్లి • తెలలినారు.

ఉ॥ కొండలు గుంపుగూడి యొక • కొండను వ్రాలెడి పిట్టలెట్టులన్
చందమునంది వానిపయి( • జయ్యన నెక్కు(చు( గేల నొవ్వ(గా(
గంద(గ గ్రుద్ది ఱక్కి పెడ • కాటులు వైచు ఫలంబులేక చే
యం దగ నెద్దియుం గనక • యంజట( బాటిరి మూలమూలకున్.

తే॥ నీలు(డొక గొప్పమల నప • లీలనెత్తి, నిప్పు లురలంగ గిరగిర( • ద్రిప్పివైవ
శూలమున దాని( బొడిచేసి • లీలపవ్వె(, గుంభకర్ణుండు వానరుల్ • కుతిలపడ(గ.

తే॥ అవల నొకగిరివైచియు • వ్యర్థమైన(, గపులుగల(గుదురని శతాం • గమున కెదురు
నడచి పిడుగును మించిన • పిడికిలిగొని, కుంభకర్ణుని పొడిచెను • కుతలమదర.

ఉ॥ చేతులు కాలునొచ్చి తన • చే(తలు వ్యర్థముగా(గ నీల(డు
ద్ఘాతముసెంది కూల( దన • దాపలికేలను తా(చె దైత్యు( డా

ఘాతముచేత నీలు నను • కాండము తల్లగముండె నాయుధో
పేతుఁడుగామి శూలమున • వ్రేయుఁడు నిర్జరవైరి పాడిమై.

చ॥ అదిగని యంగదుండు రథ • సాతిశయంబున వార్ధినుండి బె
ట్టిదమగు కొండఁదెచ్చి పుర • ఢించి నిశాచరుఁ డీల్గెనంచు స
మ్మదమున వానరాపటులు • మానుగ గంతులు పెట్టవైచె న
ప్పదిలుఁడు తాఁచె దానిఁ • దన వామభుజంబున దైత్యు లార్వగన్.

తే॥ తాఁప నక్కొండ ముక్కలై • ధరణిఁ బడియె, నేది తెరుపని హరులు పెం • పేది పఱవఁ
బెరిమె ముందుంచు పాదంబు • వెనుకఁ దివక, యక్కసును తానుగా నిల్చె • నంగదుండు.

తే॥ కుంభకర్ణుఁ డంత నమోఘ • ఘోరనిశిత, వజ్రదండ మెడమచేతఁ • బట్టివైచెఁ
బ్రాణములు వీడఁగలవని • పలికి దాని, నంగదుడు పట్టుకొనె వేల్పు • లభినుతింప.

తే॥ పట్టిన దండముఁ ద్రిప్పుచు, దిట్టండగు కుంభకర్ణు తీసి • యసురులన్
నెట్టన గొనియెదనని పిదు, గట్టులు మిడుఁగుఱులు సెదర • నతనిం డాసెన్.

చ॥ కదిసిన వాలిపుత్త్రకుని • కర్బురవర్యుఁడు గాంచి చావఁగాఁ
బదరెడు వానరేంద్రుఁడవొ • వాలిసుతుండవొ? లంకయందు ని
ప్పు దపులఁబెట్టి రాక్షసుల • పొంకమడంచిన వాయుజుండవో?
కొడుకక తెల్పుమా? యనఁగఁ • గోరిక నంగదుఁ డంత నిట్లనున్.

మత్త॥ వాలపాశముతోడ రావణుఁ • బట్టి దిక్కులఁ ద్రిప్పు నా
వాలిపుత్త్రుఁడ రామభృత్యుఁడఁ • బంతమారఁగ నిన్ను నా
వాలమందునఁ జుట్టి రాఘవు • పాదసన్నిధిఁ జేర్పఁగా
లీల వచ్చినవాఁడ నంచద • లించి పల్కఁగ దైత్యుఁడున్.

చ॥ మఱుఁగున నిల్చి నీజనకు • మ్రందఁగఁజేయు మహోపకారికిం
బెరసిన నూడు దీర్చి మఱు • మేలొనరింపవయేని లోకు లె
బ్బెఱికముతో హసింపరె ప్ర • వీణతఁ జేసితి మంచికార్యమే
తెలుఁగరులైన శూరులు ను • తింపరె దీనికి నిన్ను? బాలకా!

మ॥ వడి నీలావును వానరుల్ పొగడ నన్ • వాలంబుతోఁ జుట్టి పెం
బడిఁ గొంపోవఁగఁ గాదుగాని సుమనో • వక్షస్థలుల్ గ్రుమ్మి పె
ల్వడు శూలాగ్రమునందు గ్రుచ్చికొని వ్రే • లన్ మింటిపై కెత్తి ని
న్నదరన్ లంకకుఁ గొంచుఁబోవుటకె నీ • యభ్యాగమం బర్భకా!

ఆ॥ అనుచు నుఱిమిచూచి • యా కుంభకర్ణుండు, చేత వ్రేయ నూఱు • చిదురలగుచు
వజ్రదండ మవనిఁ • బడిన నంగదుఁడును, కినుక వాఁపలేక • కేలుసాచి

ఆ॥ పొడిచి కూల్తు ననుచు • మెడవంచి దుముకంగ, నసురవరుడు శీర్ష • మడఁగఁ బొడిచె
వాఁడిపోటుతోడ • వాలిపుత్త్రుఁడు సోలి, నేలఁగూలె నాంజనేయుఁ డడ్డె.

ఉ॥ వెండియుఁ గుంభకర్ణుఁడు క • పిప్రభు పుత్రుని ఁ బొమ్మగాఁడఁ జే
నుండిన శూలమున్ విసర • నుజ్జనసేసెదు నంతలో నగం
బొండు వహించి వాని శిర • ముగ్రత మోఁదుచు సింహనాద ము
ద్దండతఁ జేసి వాయుజుఁడు • దాశరథి స్తవ, మాచరింపఁగన్.

॥ తలపై మఱియొక తలవలెఁ, జెలఁగు మలను చేతఁగొనుచుఁ • జిందజతోఁ గ
ర్వలినుతు బొమ్మన సమ్మెట, వలెఁ దగులన్ వైచి దనుజ • వర్యం డార్చెన్

॥ అపుడు కీశవీరు • లంజక యంగదుఁ, గొనుచుఁబోవ గొప్ప • కొండఁ గొనుచు
హనుమ కుంభకర్ణు • నదటున నీక్షించి, పన్నిదంబు చఱచి • పలికె నిట్లు.

॥ వైచెద నీపై దీనిని. నీచేవయు నెల్లవారు • నియతి నెఱుఁగఁగాఁ
దోఁచితివేనియు నీతో, నేచి దురము సలుప కవలి • కేగెదఁ జుమ్మీ.

॥ అన విని దనుజాధీశ్వరు, ననుజుఁడు రదనముల కాంతు • లదరఁగ నగి నీ
పెనుమల నను నోలిఁచిన, నని గెలిచినవాఁడ వగుదు • హనుమా ! వినుమా !

చ॥ అనుటయుఁ బిన్న నవ్వు నగి • యాశుగపుత్రుఁడు నీవు చేవ గ
లిన దనుజుండవేని తమ • కింపక నిల్వుము నిల్వలేనిచోఁ
జనుము రణస్థలిన్ విడిచి • చయ్యనఁ బ్రాణముతోడ నంచు వై
చిఁన జలియింప కట్టె నిలి • చెన్ భుజమొందఁగఁ జూపి దైత్యుఁడున్.

చ॥ తిరుఁడయి నిల్చి బాహుల వి • దిర్చిన నమ్మల వేయి వ్రయ్యలై
ధరణిని రాలఁ గాంచి నయ • దాంతుడు మారుతి వీని చేవకుం
బరిమితి లేదు రాఘవుని • వాఁడి శరంబులె చీల్పఁజాలుఁ గ
ద్బరుని భుజాంతరంబు నని • పోయెను దవ్వగ వీడి యాస్థలిన్.

॥ దెబ్బది వెల్లువ • లుబ్బునఁ దాఁకి చ, చ్చినవారు పోవ శే • షించియున్న
వానరు లందొక • రేని మిగులక, క్రూరుని శూలమున్ • కొట్టునందు
కెడయుదు రని యొక • గడియలో జగములు, కలఁగునం చమరులు • తలఁగినారు
తాఁకినవారిలో • దర్పించి గెలిచిన, వారు నొప్పించిన • వారు లేరు

తే॥ కదనరంగంబునం గుంభ • కర్ణుఁ డదరి, యొక్కకపిజాతమైన చే • కుండఁజేసి
బట్టబయలున విహరించి • పౌరుషమునఁ, గీర్తికిం గ్రొత్తచనము గ • ల్గించె నాఁడు.

తే॥ దుర్దముండగు కపివీర • మర్దనుండు, కుంభకర్ణుండు తిరిగిన • గొప్పబయలు
మున్నగస్త్యుఁడు త్రావఁగాఁ • జెన్నుతఱిగి, యడఁగినట్టి పయోరాశి • ననుకరించె.

మ॥ యమరాట్కింకరుఁడైన దైత్యుడు మహా • హంకారుఁడై కీశ బృం
దము చావంగని రామలక్ష్మణుల యు • ద్ధక్రీడఁ గాంక్షించి రం
గమునందే కలరా ? యెచేగిరి ? మతొ • క్కడంకున్నదే లంక ? ద
ర్పమునన్ రాకొకొ? యంచుఁ దా భుజము లా • స్ఫాలించుచుంగ్రాలెన్.

## లక్ష్మణ కుంభకర్ణుల యుద్ధము

తే॥ తరులు గిరులును వాలును • తగ్గిపోయెఁ, గోఁతిమూఁకయు సగముపైఁ • గ్రుంగిపోయె
ననుచు ఖచరులు చింతింప • విని చిరాకు, గొనుచు సౌమిత్రి తన్నుఁ బే • ర్కొనుచుఁ దాఁకె

మ॥ రణరంగంబున నిల్చి లక్ష్మణుఁడు ధ • ర్మం బెక్కు గావించుచున్
గుణరావం బొనరించె నూడిపడ ర • క్షోదార కంఠస్థలీ
గుణ సంఘంబులు కర్ణభేరు లగలన్ • క్షోణీధరంబుల్ ప్రతి
క్వణముల్ సేయఁగ భూతజాలము మహో • త్కంపంబునం బొందఁగన్

చ॥ పరపిన లక్ష్మణ ప్రదర • వారము నింగిని భూమిఁ గప్పుచున్
దెలిపి యొకింతలేక కడు • తీవ్ర దురంత రుషా క్షుధార్తమై
యెలుకలతోఁద నోట పడి • నింగల ముమ్మొచుఁ బోయిపోయి య
మ్మొలకుల రక్తమున్ వెగటు • పుట్టఁగఁ ద్రావెను కెక్కి క్రక్కుచున్.

తే॥ తలలఁ ద్రెంచుచు నవ్వల • దాఁటెఁ గొన్ని, తలల నొందిన రీతిని • తనరికొన్ని
కడలకుం గొనిపోయెను • కరుల దూసి, యసురులం దూసి యవ్వలి • కరిగెఁ గొన్ని.

తే॥ మెఱుపుగుంపుల కైవడి • మెఱయు పైఁడి, మొనలతూపులు పఱచి య • మ్మొనను గలుగు
దనుజ ముఖ కంఠ భుజ భుజాం • తర మహోరు, జాను జంఘా చరణ పృష్ఠ • సమితి నఱికె.

సీ॥ మొదలనుండిన వారి • మోములఁ దూఱి వె, న్కలఁగలవారి వీఁ • పులను దూసి
భేరుల కన్నులఁ • దూఱి కాహళముల, నాళంబులం దాఁటి • కాళెపట్టు
వారి చేతులఁ ద్రుంచి • వారణ కంఠముల్, తఱిఁగి తేరులఁ గూల్చి • నఱికి హరులఁ
జూచిన కన్నులఁ • జొచ్చి యేచిన కంఠ, ములఁ ద్రెంచి కడుపులఁ • గలఁచి వ్రచ్చి

తే॥ దంతములు రాలనాం హ • స్తములు ద్రెళ్లఁ, గాళ్ళువిఱుగఁగన్నులు వోవఁ • గరులగిరుల
కరణి దొరలించి సౌమిత్రి • కాండచయము, లెల్లెడం దామయై యిట్టు • లేపుమీఱె.

ఉ॥ నేలను మింటిపై జరుగ • నేర్చిన వారువముల్ నిరంతర
జ్వాలలు గ్రక్కుచున్ వెడలు • బాణ పరంపర నాట బమ్మెరం
గూలెను కొన్ని పట్టికొని • కొన్ని మడంగెను చాఁపకట్టుగాఁ
దూలెను కొన్ని నెత్తుటను • దోఁగుచు వ్రాలెను కొన్ని ధాత్రిపై

ఉ॥ పెక్కు శిరోముఖమ్ము లొగిఁ • బెక్కు విధమ్ములఁ దాఁకి నొంపఁగా
ప్రక్కలు రథ్యపాళి రథ • చోదకు లీల్గిరి స్యందన స్థితుల్
ప్రక్కిరి రక్తవాహినులు • ప్రబ్బి రథమ్ములఁ ద్రోచుచుండఁగా
నొక్కటఁ బోపుఁ బోవ వాక • యొండయుఁ దెన్నును లేక యయ్యెడన్.

1 విధిని బోలిన నారాచ • వితతి గ్రుచ్చు, కొన్నవియుఁ ద్రెంచినవియును • కూల్చినవియు
రక్తఘటమువంటివి రక్త • సిక్తమైన, తలలు మస్తిష్క పంకంబు • పొలుపుదాల్చె.

॥ పొడిచి త్రోచిన • వడువునఁ బడిన తలలు, తుడుములం బడుఁ జల్లుల • తోయమొందె
సర్వ లోకనాయకుని వి • జయ మహోత్స, వమున కుంచిన మొలకల • పాలికలన.

। శరములఁ నొసఁగులఁ దగులం, గిరగిర వడిఁదిరిగి కరులు • గీపెట్టుచు వా
నర సైన్య మసుర సైన్యము, నరయక యరిగినదె పోక • యై యెదచొచ్చెన్.

ఉ॥ ఆమని మీనకేతనుని • యందము నొందిన సుందరుండు శ్రీ
రాముని తమ్ముఁడేయు ప్రద • రమ్ములు త్రుంపఁగ యామినీ చర
స్తోమము లేసినట్టి పలు • తోయము లందిన కైదువుల్ రజం
బై మహిరాలె రిక్కలు ర • యంబున రాలిన చెన్ను దోఁపఁగన్.

। కటకుటమ్ములు శ్రేణులై • కరుల హరుల, తలలఁ దూఱి తోఁకలడుస్సి • యిలనుగూల్చి
సిడము లూనిన దడములఁ • జెండి యరద, ములను దొలిచి జరీన న • వ్వలికినేగె.

మ॥ తలఁగించున్ సుఖదుఃఖ సంచితముఁ ద • త్త్వజ్ఞాన మంచాడు పే
ద్దల వాక్యంబునఁ బాపముం దొలఁచు శు • ద్ధస్ఫార వీరత్వమన్
లలితార్థం బుపలక్షణా విధిని సం • లక్షింపఁగా నయ్యె దై
త్యులకు న్నాక వరాంగనా సుఖ విభూ • తుల్ మించి చేకూరుటన్.

ఉ॥ పాపులు రక్కసుల్ భయద • వాత్యవలెం జెల రేఁగి రాఁగ నా
తూపులు వహ్నిగుచ్ఛముల • తోయమునం బురడించి పైఁబడం
గోపులుగాఁగఁ గూలిపడి • కుత్సితులెల్లరుఁ జేరుచుండఁగా
నేపున నిండకుండు దివి • కెప్పుగఁ బల్క నొకండు గల్గునే?

ఉ॥ ఒక్కరి పాదముల్ మఱియు • నొక్కరి చేతులు వేఱు పొట్ట లిం
కొక్కరి శీర్షముల్ దొరకు • నొక్కొక యంగము లక్ష్మణాస్త్రముల్
చిక్కిన యంతవ ట్టరులు • చిక్కని యొద్దడిచే వడిం గొనెన్
ఒక్కొకచోట యాచకుఁ డొ • కొక్క పదార్థముఁ గూర్చుకై వడిన్.

ఉ॥ కొందఱి ముక్కులన్ మఱియుఁ • గొందఱి వీనులఁ గొందఱంఘ్రులన్
గొందఱి దీర్ఘహస్తములఁ • గొందఱి కన్నులఁ గొన్న బాణముల్
పొందిక విద్యయన్ ధనము • భూస్థలిఁ బెంచు కవిప్రకాంత సం
క్రందన వాగ్విరాజిత ని • రంకుశ ధార విధాన వర్తిలెన్

చ॥ అనువుగ ధర్మదేవతకుఁ • బ్రాణముఁ బోలిన లక్ష్మణుండు గు
ప్పిన విశిఖాలిచే నసుర • వీరులు దాఁగి క్షణంబు నిల్చినన్
గనఁబడు బిత్తియే యని క • కావికలై పరుగెత్తి సంగ రా
వని విడిపోయి రవ్వలికి • వారని నెత్తురు టేఱులం బలెన్.

మ॥ సమరోర్విన్ మరణించినట్టి జనమున్ • సౌమిత్రి దోర్వీర్య దు
ర్దమ పాండిత్యముఁ గన్నులారఁ గని యం • తం గుంభకర్ణుండు లో

క్రమములం జెన్నఁ బరాంతకుం డయిన శ్రీ • కంఠుండు సౌమిత్రియే
సమతం బొందని మేటి ధన్వులని యి • చ్చం బల్కెఁ బల్తోయముల్.

తే॥ గాలియెడఁదలకంపె వే • గంబుగలది, జయ విలక్షణ సింహ ధ్వ • జంబుగలది
అన్నిదిక్కుల కేగున • ట్టైన తేరు, వడిగఁ దోలించి లక్ష్మణు • కడకువచ్చె.

క॥ అసురుఁడు రథ స్థితుండయి, కిసిమసఁగిన నేలనుండి • యయ్యెడు సేఁతల్
పొసఁగదని వాయుసూనుఁడు, కొసరి నిలిచి తనభుజములఁ గూర్చుండుమనన్.

తే॥ కొదమసింగము గిరినెక్కు • కొమరుదోఁప, నెక్కె సౌమిత్రి వానరు • లెలమి విజయ
నాదములుచేసి రమరులు • మోదపడిరి, హనుమ మూఁపు రథముకంటె • ననువుమీఱె

తే॥ వెండికొండపై బంగరు • కొండయట్లు, హనుమమూఁపుపై లక్ష్మణుఁ • డలరునంతఁ
గడిమికిం దగు విలు కుంథ • నిర్దు ణూని, యెక్కువెట్టి గుణధ్వని • యెసఁగఁజేసె.

ఉ॥ రాముని తమ్ముఁడీఁవు మఱి • రావణు తమ్ముఁడ నేను మింట సం
గ్రామము చూడ వేల్పులు • గొంతను వచ్చిరి ధర్మపద్ధతిన్
హామిక మీఱ గొంచ బ • లాతిశయంబులు వెల్లడించుచున్
భీమగతిం దురంబు జర • పింతము దివ్యులు మెచ్చునట్లుగన్.

ఉ॥ మా కులభూషణం బయిన • మానిని ముక్కును గోసినట్టి పే
రా ! కలుషాత్మ ! యాచెలి న • హంకృతిఁ గొప్పు గదింగు హస్తమున్
గాకులు మెక్కఁ ద్రుంచెద న • ఖండ పరాక్రమశాలి వైనచో
లోకులు మెచ్చఁ గాచికొను • లోపములేకని కాలుబాడఁగన్.

చం॥ బలమె శరీర మందె నన • భాసిలు లక్ష్మణుఁ డల్లనవ్వి నీ
పలుకులకున్ సదుత్తరము • బాణము లిచ్చునుగాక ప్రల్లదం
బులకు సుధీర్యసంపదలు • బ్రుంగఁగ నుత్తరమీదు మీనలెం
బలుకఁగ నేర్వలే వసుధ • దాఘ రుషా కలితాత్ముఁడై నడిన్.

ఉ॥ కన్నుల నిప్పుకల్ వొడఁగ • గాటముగాఁ బరికించి ఖేచరుల్
మిన్నగలెం బెడిల్లు మని • మేదిని కొండలు పిండియయ్యె నం
దన్ని కలంగ వింటఁ బదు • నెన్మిది తూపులు గూర్చి యేయఁగా
నన్నిటి నేసి కూల్చెఁ గమ • లాప్తకులుం డచలాభ ధీరుఁడై.

తే॥ అంతఁ గుంభకర్ణుఁడు నిర్జ • రాంతకంబు, బ్రహ్మదత్తంబు బహుళరూ • పకమునైన
ఘోరశర మభిమంత్రించి • కూర్చియేసెఁ, జతురుఁడవయైన మరలింపఁ • జాలుదనుచు.

తే॥ కన్ను మూర దూరంబడి • కాండవృష్టి. గురియఁ గాంచిన సౌమిత్రి • కాండొకవడి
నరసి యొక దివ్య శరమున • నడికిపైవఁ, బెక్కు రూపులతో నది • పుడమిఁబడియె

ఉ॥ వాఁడిమి వేగముం గలుగు • బాణములం బదిరెంట మారుతిం
బోఁడిమి తగ్గనేసి యిరు • ముల్కల లక్ష్మణు నొవ్వఁజేయుచున్

వేఁడిమిమీఱ నూఱులుగ • వేలుగ నొక్కొకసారి గూర్చి యా
తేఁడి మెలంకువం గనిన • దిట్టరి కప్పె క్షణంబునన్ దిశల్.

చ॥ దిశలను గప్పు బాణవిత • తిం బ్రతి బాణములేసి లక్ష్మణుం
డసమునఁ దూల్చి నెవ్వడి ర • థాంగములన్ విఱుగంగఁ గొట్టి క
ర్కశ విశిఖంబులం బరపి • రథ్యములైన పిశాచ వాజి సిం
హ శరభ వారముం జదిపి • యయ్యసురోత్తముఁ గొట్టె నొవ్వఁగన్.

మ॥ పరివేషంబు నశించి నట్టి తెఱఁగై • భగ్నంబుగాఁ గూలె న
య్యరదం బప్పుడ చచ్చె సారథియు ని • ష్వాసంబు నింద్రాయుధ
స్ఫురణంబుగా మదిఁ గొల్పి త్రుంగె విబుధుల్ • పూరించి రథ్యంబులన్
శరముల్ త్రుంచెనొ • మంత్ర మో? యనుచు నా • శంకించి రప్పట్టునన్.

మ॥ విరథుండై విగతాస్త్రచాపుఁడయి య • వ్వీడుండు దైత్యానుజుం
డురు కోపంబున రేఁగి లక్ష్మణు నను • వ్యూహంబు నేఁ డాని సం
గరముం బూర్తి యొనర్తునంచుఁ గొనియెన్ • దర్పించి ముల్లోకముల్
పరఁగన్ గెల్వఁగ నిల్పు చిహ్నమనఁగా • భాసిల్లు శూలంబొగిన్.

॥ వనధివలె [illegible] రేఁగి రావణు, ననుజుఁడు లంఘించె ధరణి • యదరఁగ వానిం
గని సౌమిత్రియు మారుతి, ఘన భుజములనుండి దిగియె • గరువం బెలయన్.

తే॥ తమ్మునకుఁ దోడుగా [illegible]న్ను • దశముఖుండు, పరిపు-సేనకు నినుమడి • పంపనపుడు
తత్పుత్రతన సాయుధంబయి • తరలివచ్చి, యల సుమిత్రా కుమారు ము • న్నలమికొనియె.

క॥ వానరులు కలఁగఁబాఱఁగ. దానవ చక్రంబు వచ్చి • తలపడఁ గని రా
మానుజుఁడు చొచ్చి కలఁచుచు, మానక యెసరేఁగె మారి • మసఁగిన కరణిన్.

ఉ॥ మోదుగువంటి కేశచయ • మున్ నయనంబులు నొప్పుచుండు క్ర
వ్యాదుల శీర్షముల్ కరుల • హస్తములున్ దురగాంఘ్రులున్ రథాం
గాదులు దొర్లుచుండ రుధి • రాపగలెల్ల శవంబు లడ్డుక
ట్టై దగులంగఁ ద్రెంచికొని • యంబుధిఁ జొచ్చెను వ[illegible]న్న మాఱఁగన్.

తే॥ చక్ర తోమర శూలాది • సాధనములు, యామినీచరుల్ వైవ రా • మానుజుండు
నడుమనే కూల్పఁ దున్కలై • పడిన వాన, విఱిగి కూలిన కైదుపుల్ • పెక్కులయ్యె.

తే॥ హార కుండల మకుట కే • యూర కటక, వితతి లక్ష్మణ సాయక • విద్ధమగుచు
ఖండ ఖండంబులై మింటి • కడకునెగసి, యినహిమాంశు బుక్షతతిమా • ర్కొనివెలింగె.

క॥ సిడములు వింజామరములు, గొడుగులు కేడెములు పీలి • గొడుగులు విందుల్
సుడిసెడు నెత్తురుటేఱులఁ, బడ నీఁదెదు భూతగణము • ప్రక్కలఁద్రోఁచెన్.

## సుగ్రీవ కుంభకర్ణుల యుద్ధము

తే॥ లక్ష్మణునకు దానవ సేన • లకును జగుల, యుమ్మరంబగు పోరిట్లు • మొనయుచుండఁ
గుంభకర్ణుండు గని కిన్కఁ • గొప్పరింప, భానుసుతుఁడు వానికి నడ్డు పడియెఁ గడిమి.

తే॥ అసురభుజములు విఱిగిన • వని తలంపఁ, దగిన తీరున ఘన పర్వ • తంబుపైవ
డానిసుఁడి ఘూమికి జాలు • నేనుఁగులను, సేనలోని యేనుఁగులు భం • జింపఁ దివిరె.

తే॥ కొండచిలువలు పెక్కులం • దుండి జాటి, మదకరులఁ గవ్వికొనె నట్టి • మలను పట్టి
కరతలంబున నక్కుంభ కర్ణుఁడుంచు, కొనియె దాన రాకాసుల • గుంపుమనియె.

తే॥ అలవిలేని బలుఁడు రావ • ణానుజుఁడు, కోఁతితేఁడ! నీపైచిన • కొండ యిదియె?
యనిపరిహసించి పిసికి యు • ప్పునుచునూఁదె, వేల్పు లదిగని మిక్కిలి • వెఱగొనంగ.

తే॥ భానుసూనుఁడు మఱియొక • పర్వతంబు, ఫైవకుచుండ రావణుతమ్ముఁ • డుమటుతోడఁ
జంపుమనఁ దపస్వుల శాప • సరణినడరు, తన త్రిశూలమ్ము గుఱిచూచి • తాఁకవైచె.

ఉ॥ కాంచిన వారలెల్లఁ గపి • కాంతుఁడు ద్రుంచెను ద్రుంచెఁ గావరే
యంచును మొట్టవెట్ట పడి • నాశుగపుత్త్రకుఁ డడ్డువచ్చి యే
తెంచు త్రిశూలముం దిగిచి • శేఁకువ జానువునూఁది వంచి కా
వించెను తుండ్లుగా; నిడుమ • ద్రీల్పని దాసుఁడు దాసుఁడే భువిన్?

తే॥ జానకీదేవి సౌందర్య • మాని రామ, విభుఁడు మిథిలలో శివువిల్లు విఱుచునాఁడు
పుటినట్టి రావమె నాఁడు • పుట్టె గాడ్పు, పట్టి దైత్యుని శూలంబు • పట్టి విఱువ.

మ॥ తన శూలంబు వృథావనంగ హనుమ • ద్దార్ఢ్యంబు చింతించి నీ
ఘన బాహాబల మన్ని చోటుల నమో • ఘంబై మహాకార్యముల్
పొనరించం దగియుండ నప్పటుఁడవై పొల్పారుచున్నావు నీ
కెన యెవ్వారలు? పోదుదేని విను నీ • యిష్టంబ కావించెదన్.

తే॥ అనిన కుంభకర్ణుని గని • హనుమ పలుకుఁ, గలఁకు గావింపనని తొల్తఁ • బలికి పిదపఁ
బోరు నీతోడఁ బూనుట • తీరుగాదు, నలదటంబుఁ దొలంగి యు • వ్వలికిఁ జనియె.

క॥ శూలము విఱుగఁగఁ బెర కర, వాలము లేకయును కలఁత • వదక నిలిచె హిం
సా లాలసుండు వానిం, దూలఁగఁ గపిరాజు వొడిచె • దోర్బల మెసఁగన్.

క॥ నొవ్వక దానవు తమ్ముఁడు, నవ్వి మదము నేఁటితో న • ణంగు ననుచుఁ దా
నువ్విళ్లఁ గేలం జాఁచుచు, నవ్వలికిం బోవనీక • యుద్ధముపట్టెన్.

క॥ ఇరువురు వలయాకృతిగాఁ, దిరుగుచు దొరకుచును దొలఁగఁ • ద్రిక్కుచును పర
స్పర ముష్టుల నోళ్ళను నె, త్తురు గ్రక్కుచు సొలపులేక • త్రుంగని కడిమిన్.

క॥ అదలించుచు హుంకృతులం, గదలించుచు బలిమిఁ బోరు • కదఁకం దనుజుం
డదిమెను సుగ్రీవు నటం, డెడ నొవ్వఁగ సొలసి సత్త్వ • హీనుండయ్యెన్.

ఆ॥ దురము ముగియు నేఁటి • తో నాయకుఁడు లేని, సేన చెదరు ననుచు • జింతచేసి
వైశ్రవసుఁడు ప్లవగ • వర్యుని గొని లంక, దెసకు నడచెఁ గపుల • దిగులువడఁగ.

తే॥ ఒకటఁ దల్లిసి దేగ త • న్నుకొనిపోవ, నడలు పక్షిపిల్లలవలె • హరిగణంబు
బెగ్గలించుచుఁ జేతుల • పిసికికొనుచు, నూర్పుపుచ్చుచు నేడ్చె దై • త్యులు చెలఁగ.

తే॥ చెమటవోసి నాలుక యెండ • నమరులెల్ల, విన్నఁబోయిరి మనసుల • విసిగికొనుచు
నెడఁద లెరియంగ నుత్సాహ • మడుగుపట్టఁ, గ్రుంగి తపియించి కుమిలెఁ బ్ల • వంగకులము.

తే॥ మనసు నుడికించు కోపంబు • గొనిన కుంభ, కర్ణు డప్పుడు రాహువు కరణి నుండె
భాస్కరసుతుండు గ్రసియింపఁ • బడిన చంద్రుఁ, బోనివాఁడయి తేజోవి • హీనుఁడయ్యె.

తే॥ దానవుని కఠిమేనిపై • భానుసూను, మేను తగ్గుచు హెచ్చుచు • మేషమఁదు
డాఁగుచును వెలివడుచును, డాలుచూపు, కలువతేని బింబంబనఁ • గానఁబడియె

క॥ తనతో దుర మొనరింపన, యవి పంతము లాడినట్టి • హనుమానుం డా
దనుజన్మఁ బ్రతిఘటింపక, వెనుచనియెను మనసు పెక్కు • విధములఁబోవన్.

క॥ వనచరవిభుఁ దనమూఁపు వ, యినుంచుకొని కుంభకర్ణుఁ • డేగుచునుండన్
మనకింకఁ బ్రభుఁ డెవండని, యినకులు పాదముల వ్రాలి • యేడ్చిరి ప్లవగుల్

తే॥ నీల నీరద శ్యాముఁడు • నిప్పుకంటె, నెఱ్ఱనైన కన్నులతోడ • నిషధిఁ దొడిగి
ధనువు సజ్యంబు గావించి • త్వరితగతిని, త్రుటిని పఱ తెంచి నగరి వా • కిటికివచ్చె.

క॥ నానెయ్యుని నా ప్రాణము, జానునఁగొని కోటదాఁటి • జరగిన మోసం
బౌనని రాఘవుఁ డమ్మల, వానం గుతియించి వాని • పథ మరికట్టెన్.

క॥ శరములు గగనము గప్పఁగ, మఱుఁగయ్యెను దిక్కు లెండ • మఱయదు లోనన్
జరుగఁగలేవయ్యె వియ, చ్చరములు సైతంబు దాఁటి • శర దుర్గమ్మున్.

తే॥ నెవ్వడిం జను నయ్యాశు • నీచరుండు, తెరువు విడువక కప్పులు • తిప్పలగుచుఁ
గడకు నిండిన బాణదు • ర్గంబు చూచి, దీని దాఁటంగ నవదని • తిరిగి కాంచె.

తే॥ కాంచి పద్మాకరము కాలుఁ • గేలు మొగము, కనులు కలుగఁ బూచి సొబగు • ధనువునూని
నడచి వచ్చెనా యన నొప్పు • నలువుకాని, బురుష మోహను శ్రీరాము • భూపుఁగాంచె.

ఆ॥ మూసియున్న నోరు • పొగల వెల్వఱచెను, పెదవు లదరెఁబొమలు • వికృతి నందెఁ
గనులు నిప్పు లుమి సె • గర్జనమునఁ గొండ, లగల మాఱుమ్రోఁగె • నవని వడఁకె.

ఉ॥ వాలి కబంధులం జెనయు • వాఁడని యెంచి కపీంద్రుఁ గావ గాఁ
బోలును నన్నెదిర్చితివి • వోడనఁ గీరితి రాదటంచు నే
మ్రాలుపలేదు నీయనుజు • మారుతి వానరనాథు; నిన్నె యీ
యాలమునం జయించి యశ • మందఁగ నారయుచుంటి నెల్లెడన్.

చ॥ వెదకుచునుండ నీబలము • నింగి దిగంతము దాఁకఁజాలె వే
యొదిఁగెను నీదు తమ్ముఁడు మ • హోద్ధతితో నెదిరించి వాయుజుం
డదలెను వాలిపుత్త్రుఁడు • సంకటినొందెను చేవదక్కి మూ
ర్ఛ దొరయు నీని నెత్తుకొని • పొఁగఁగ వచ్చితి నీవు దిట్టవై.

చ॥ వనచరుఁ గావఁగాఁ దలఁచి • వచ్చితివేమి? మదీయ భాగ్యమే
గొని యిటు తెచ్చెఁ గావలయు • గొబ్బగ నిన్ను నలంచి యన్నకుం
జెనకిన వేదనం దొలఁగఁ • జేసెద దివ్యులు చూచుచుండఁ గోఁ
తిని గొనియున్న పట్టు విడఁ • దీసిన సీతయు నీదు బంధముల్.

చ॥ అనవుడు రాఘవుండు దర • హాస వికాసిత సుందరాస్యుఁడై
యను దనుజాధమా! వినుము • పాణిహితుం గొనిపోవు బాహువుం
దునుకలు సేయనేని ఘన • దోర్బలమేటికిఁ? జాపమేటికిన్?
మొన వెనుదీయు వాఁడనయి • ముట్టను వార్ముక మింతయేటికిన్?

తే॥ అనుచుఁ గుంభకర్ణుండంప • యాఁకఁ ద్రోవఁ, బూన రెండమ్ములను నొసల్ • పొదువనేసె
నుదుటి యమ్ములతో నెట్టు • నొసలితోడ, దైత్యుఁ డరుణోదయముఁబోలి • తనరె నపుడు

తే॥ ఫాలమున శోణితమ్ము ప్ర • వాహమట్లు, కాటఁ దడిసి చల్లనగాఁగఁ • గపివరుండు
నిదుర మేల్కొన్న చందానఁ • గదలి లేచె, దిమ్మదిరుగంగ దైత్యుండు • సొమ్మసిల్లె.

మ॥ నొసట న్నాటి వెలుంగువాని రవి సూ • నుం డొప్పవీక్షించి యి
వ్యసమాస్త్రంబులు రామ సాయకము లం • చాత్మన్ విలోకించి చు
ట్టైసలారంగని సర్వలోకములకున్ • హేత్వర్థమై యున్న శ్రీ
వసుధాధీశ్వరుఁ గాంచి జేయనుచుఁ జే • వం బొంది యా వెంబడిన్,

తే॥ అసురమానంబు లజ్జయు • నడుగుతోడ, నూడ నాసికయును చెవి • నూడఁబీఁకి
కొనుచుఁ గపిరాజు మింటిత్రో • వను బిరాన, వచ్చి తనవారలకు మోద • మెచ్చఁజేసె.

క॥ రవణించెఁ గపి సమూహము, రవణించె మహాద్రులంబు • రాశియు మొగుళుల్
రవణించెను వేలుపుగమి, రవణించెను పాడివేల్పు • రంజిల్లు మదిన్.

క॥ వచ్చిన వానరనాథుని, హెచ్చిన మోదమున జాన • కీశుఁడు కాంచెన్
గ్రచ్చఱ మైథిలి చెఱవిడి, వచ్చిన తఱి నొందునంత • పండుగు నొందెన్.

తే॥ నొసలు పగిలించి ప్రక్కల • దుసికిలిచన, రాముఁడు శరంబులేయఁగ • రాక్షసుండు
చేవచెడఁగ సుగ్రీవుండు • చెవియు ముక్కు, నూడఁగొఱికి కొంచేగెఁ గా • కున్నఁ దరమె?

తే॥ దనుజ నను జుండు తెలివొంది • వనచరుండు, కరతలమున వాఁడవ్వలి • కరుగుటయును
చెవియు ముక్కువోవ్వ తెలింగి • చింతనొంది, చెలియలిఁ దలంచుకొని చాల సిగ్గునొందె

తే॥ నిర్ఝరమువోలె నొడల శో • ణితము వెడలఁ, గుంభకర్ణుండు ధాతుయు • క్కుధరమొండు
వృష్టి గురియంగ నీఁదతో • వెల్లువలను, బయలు పఱచిన చందానఁ • బరిఢవిల్లె.

తే॥ పరపతిని గోరి వంచన • పఱచినట్టి, చెల్లెలికి ముక్కు చెవు లూడె • సిగ్గుచెందఁ
బరసతిని గోరి వంచన • పఱచువాని, తోడులకు నట్టు లౌటలో • దోసమున్నె?

తే॥ తనకుఁ గలిగిన దుస్థితిఁ • దలఁచుకొనుచు, రోసి దైత్యుండు చెంతకురా • కాసులఁ గను
నిక్కుఖచరులఁగాంచును • ముక్కుఁగాంచు, మునుపుగొన్న వాసినిగాంచు • భూమిఁగాంచు

## రాముఁడు కుంభకర్ణుని గూల్చుట

చ॥ చెలియలి ముక్కువోయె నని • చింతిలు జ్యేష్ఠుఁడు కాంచుమున్నె నా
చెలియలు తగ్గ యన్నవని • సిగ్గఱి దగ్గఱి చూచుమున్నె నా
చెలువఱు మోము రాముఁడు హ • సించుచుఁ గాంచెడు మున్నె వారికిన్
జెలువఱఁ గర్ణనాసికలఁ • జెక్కెదఁ గాకని యాగ్రహోగ్రుఁడై.

చ॥ వడి నొక వాలు పల్కయును • వారక కైకొని చేగ చాల దం
చెడముగఁ బాఱవైవ నుడు • బృందము రాలెను ఖేచరాళి పే
రెడఁదల ప్రేవులుం గలఁగె • నేచిన యీసునఁ గర్ణ నాసికల్
వడవడ నెత్రు జార్చె బహు • భంగుల దైత్యులు పల్లటిల్లఁగన్.

తే॥ మూఁడువేల పిశాచముల్ • మోచితెచ్చు, వజ్ర ఖడ్గంబు వలకేల • వారుకొనియె
వేయి భూతముల్ మోచిన • విపులఖేట, కంబు నెడమచేతం గొనెఁ • గనలు తొనఁక.

తే॥ కొండఁబోలిన కుంభక • ర్ణుండు కేదె, మెలమి నంకించి వైచి చ • క్కలను రాల్చెఁ
గాల నేలను తాఁచి పా • తాళభోగి, శిరములను ధరణియుఁ గ్రుంగఁ • జేసెఁ బెలుచ.

క॥ వీచిన ఖేటక ముఖమున, లేచిన పెనుగాలి కపుల • లేపి దెసలకుం
ద్రోచిన లోఁతగు కడలియు, నేచిన మిట్టయ్యె ఖచర • బృందము పఱచెన్.

క॥ ఇతరు లెఱుఁగుటకు మున్నే, మతిమంతుఁడు రామవిభుఁడు • మరలంగొట్టెన్
శితశరమున నదియు మహా, ద్భుతముగఁ బలలాశి హస్త • మునకే మరలెన్.

క॥ డాలును నడుమనె క్రమ్మఱఁ, గాలుం బోల్దనుజవరుఁడు • కాలం దన్నన్
గాలికిఁ గంగిన జలనిధి, పోలికఁ గపిసేన కలఁగి • పొనుపడి చెదరెన్.

క॥ పోరున నెదురై పడు కపి, వారంబును ద్రుంచి రక్త • వాహిని నడరన్
గూరిచి తిరిగెడు డాలును, శ్రీరాముఁడు విఱుగఁగొట్టె • శిత భల్లమునన్.

ఆ॥ పాఁప జేని యుచ్చి • పంకంబు గావించు, డాలువోయె నదను • డాయదింక
వీని నిపుడ చంపు • విడువకుమని ప్రోత్స, హించె జాంబవంతుఁ • డినకులేశు.

క॥ వానర సేనానాశము, దానవ విజయంబు బలము • దర్పము భూజా
జాని గని యముని నేఁడే, వీనియెదుట నుంతు ననుచు • వీఁకం దాఁకెన్

తే॥ వాఁడివడిగల పదుమూఁడు • బాణములను, రాముఁడేసెను రణవిశా • రదుఁడు కుంభ
కర్ణుఁ దవ్వాని గ్రద్దయుఁ • గల విధమున, రాలి పడఁగొట్టె దన కర • వాలుచేత.

తే॥ బలిమిఁ దొరరిక వేసంగి • భానుఁబోలు, తీక్ష్ణ శరముల రాముఁడు • తివిరియేయ
నవియుఁ దునుకలై చెదరంగ • నసుర కొట్టెఁ, జేతివాలంపుఁ బిడితోడ • హేతులెసఁగ.

క॥ దరహసిత వదనుఁడై శ్రీ; వరుఁ డొక బాణమ్ము లాగి • బలిమిని వీడన్
గరుడుఁడు సర్పముఁ ద్రుంచిన, కరణిని ద్రుంచె నది • వాని కర ఖడ్గంబున్.

తే॥ విలయవహ్ని యాఱఁగ నూర్పు • విడుచు కుంభ, కర్ణుఁ డప్పుడు తనచేతి • ఖడ్గమల్లె
యున్నదన వేఱుఖడ్గంబు • నూని ముగిసె, ముగిసె రాఘవుఁడని యెదు • రుగను నడచె.

తే॥ చేతఁ బటి పటక మున్నె • శిత శరమున, నరిగ కరవాలు రెండును • విఱుగఁగొట్టి
కంకటము చొరఁగ్రూరాంబ • కంబులేసి, యొదలు చలియింపఁజేసె న • ప్పుడమి తేఁడు.

క॥ చారులచే జరుగు సమా, చార మెఱిఁగి రావణుండు • సత్వరమున దే
వారులఁ బెక్కురఁ బంపెను, వారక తమ్మునకుఁ దోడు • పడ నవ్వేళన్

తే॥ దానవుశి చంప నిదె మంచి • తరుణమనుచు, మదిని రాముఁడు తలఁచిన • యదనునందె
వచ్చె సేనయుఁ; జెదుగులు • వచ్చినపుడ, వచ్చి తోడ్పడు సత్కర్మ • ఫలములట్లు.

తే॥ నాల్గు విధములొందినపను • నాల్గుకోట్ల, బలమువచ్చి దానవుని కా • పాడఁ దొడఁగె
వడిగ రండని రాముడు • వారిఁ బిలిచి, తాఁకె మేను పూరింప ను • త్సాహగరిమ.

తే॥ కాలమితియుఁ గాలుఁడు బహు • కష్టములను, మూఁడు మూలహేతువులె • ము • మ్మొనలుగాఁగ
మూఁడులోకంబుల జయింప • మూలమైన, శూలమును కుంభకర్ణుఁ డ • చ్చుగ ధరించె.

సీ॥ మండలీకరణ కో • దండుఁడై రాముండు, ఖండనమున వీడు • భల్లములకు
ఆట్టలు నటియించు • టా కాదనుచు మ్రాని, మొద్దులనుచుఁ గొండ • బ్రద్దలనుచు
నమరులు తలఁపంగ • నాదెఁ గబంధముల్, శిరముల కుప్ప ల • చ్చెరువు నించె
వ్రయ్యంగబడనివి • రక్తంబుచే నీద్వఁ, బడనివి తలలతో • వెడలునవియు

తే॥ విరిచియున్న వియును తూలి • నిలుచునవియు, జీవములతోడ దురమునఁజెలగు • నవియుఁ
బాఱిపోవునవియుఁ గానఁ • బడవు వెదకి, చూచినను మందునకు రణ • క్షోణియందు.

తే॥ మొగము లగలంగఁ బ్రేవులు • దిగఁ బడంగ, రదనములు వ్రీలమావటీం • ద్రకునుమించి
సుడిసి కూలునవియె కాక • చూడఁజూడ, మదముతోఁబోవు హస్తుల • మ్మహినిలేవు.

తే॥ చక్రములు వ్రీలఁ దెక్కెముల్ • జాఱ నిరుసు, లూడ ముఖభాగములు సొంపు • వీడ హరులు
గూల రక్త మేదో మాంస • జాలమందు, మునిగినవి కాక తిరుగు స్యం • దనము లేదు.

చ॥ పదములు కంఠముల్ తునిసి వ్రస్సిన పొట్టలతోట హేషలుం
గుదివడ హత్తి పీనుఁగుల • కొండల కొమ్ములఁబట్టు నెత్రు పె

ల్లివముగఁ బాఱఁగా సుడుల • లీనములై పరుగాడుఁ గాక యు
ప్పిదముగ సంగరస్థలిని • వెఱ్ఱి తురంగము లేదు చూడఁగన్.

ఉ॥ రాముని యస్త్రనైపుణి శి • రంబు నిరూపణ చేయు కెట్లగున్
వేమముతో రణంబుగను • నిర్జరులన్ గలనం గనంగలే
కామెత సేయఁ జూచి రసు • రాలికి స్వర్గమునందు. ఛర్తలన్
ప్రేమను రోయ కాంతలు • పేసరి కాంచిరి నెత్రుపేళ్లనే.

మ॥ తపనుం గాంచిన మంచుపోల్కిఁ జెడియెన్ • దైకేయ సైన్యంబు వే
ఱపులన్ మిక్కిలి యుల్లసిల్లి రసురల్ • దుఃఖింపఁగన్ లోక సం
తపనుండౌ దనుజేంద్రు తమ్ముఁడొకఁడై • దర్పంబుతో నిల్వఁగాఁ
గృప యేపారఁగ రాఘవుండు గని ప • ల్కెం బెంపు దీపింపఁగన్

మ॥ వినుమా సాయుధసేన గూలె ననిలోఁ • బెంపేది యొక్కండవై
కను మేలున్నదె? మా విభీషణునకుం • గారంపుఁ దోఁబుట్టువౌ
టను గావించెద జీవదానమును వి • టం జేరెదో? క్రమ్మఱం
జనుదెంతో? మఱి యిప్పుడే రణమునం • జత్తో వివేచింపుమా:

ఉ॥ తక్కుఁ లు వీడలేక పిన • తమ్మునిచేఁ బిలిపింప రాక లోఁ
జిక్కుతి కాలు నానతికి • జీవితకాలము రాజ్యభోగముల్
దక్కునివయ్యెఁ దెల్పి ఫల • దంబగునే భువి మూఢబుద్ధికిన్
దక్కక నీమదిం గలఁగు • దానిని దెల్పుము రావణానుజా!

చ॥ అనవుడుఁ గుంభకర్ణుఁ డను • నర్కకులంబున నుద్భవించి పెం
పును జయ శీలముల్ నయము • పోఁడియుఁ బాడియుఁ గల్గు మీరు మా
యనుజకు ముక్కు గోసితిరి • యట్టులె నాకు నొనర్చినార లే
యనుమన నీ మొగంబు గొని • ప్రాణముతోడుత నుందుఁ జెప్పరే?

శా॥ మాచే వేల్పులు దుస్థితిం బొరయ దు • ర్మానంబు పాటించుచున్
నీచత్వంబిది సీత వీడుమనుచున్ • నీతుల్ ప్రసంగించియున్
నాచే నన్నకు నొవ్వికూడదను వి • న్నాణాంబుతో వచ్చియున్
మీచే నిట్లయి వెందియున్ మరలఁగా • నేరన్ త్రపాహీనతన్

శా॥ మీ మస్తంబుల దీర్ఘ బాహువుల భూ • మిం గూల్చి మాయన్నకుం
బ్రేమంబారఁగ సీత నిత్తు ననుచున్ • ధీరంబుతో వచ్చి సు
త్రామాదుల్ కని కేరడింప వినమ • ద్వక్త్రంబుతోఁ జెల్లెలిన్
సోమింపం దనుజేంద్రు సన్నిధిక న • క్రుల్ గాద్చుచుం బోదునే?

శా॥ ఈవిట్లాడఁగనేల? ధీరుఁడవు గా • వే? మానముం బొందవే?
సేవాధర్మ మెఱుంగవే? యలుపులుం • జిత్తంబునన్ మెత్తురే?

నావాక్యంబులు విన్మ మీశిరములన్ • ఖండించియుం బిమ్మటన్
దేవారాతి పురంబుఁ జేరఁదగునే • తేజో విహీనుండనై?

మ॥ అనుచున్ శూలము దా కరంబునకుఁ దా • నంకించుచున్ ధాత్రి క
ద్రువన్ బ్రేవుల్ పెకలింపలీల పలచే • భూధ్రంబుఁ గైకొంచు రా
మునకున్ సూటిగనైవ నాతఁడును దు • మ్ముం జిందనీకుండఁగాఁ
డునియల్ చేసి త్రిశూలమున్ సకల సం • దోహంబుగా బ్రీలిచెన్.

మ॥ కదలిం ద్రావఁగ మిన్నుగూల్ప ఘన ని • ర్ఘాతంబులం గాల్పగాఁ
బుడమిం జీల్పఁగ మేరువుం దొలువఁగా • భూలోకముం దాఁటఁగా
నదర న్నేర్చిన రామబాణతతి యా • ర్యానాయకుండిచ్చు మై
తొడుగున్ బ్రీల్పఁగఁ జాలదయ్యె మదికిం • దొడ్డయ్యెఁ దచ్చిత్రముల్

ఉ॥ రాము నమోఘ బాణములు • రాజ కిరీట నభేద్య వర్మమున్
ఘేమముచేతఁ దాఁకియును • చీల్పని హేతు వెఱింగి యంత సు
త్రామనుతుండు రాఘవుఁడు • రౌద్రమహాస్త్రము మంత్రయుక్తిమై
భీమబలంబునం దిగిచి • భేదిలనేసెఁ గవుల్ చెలంగఁగన్.

క॥ ఆ పగిది మఱుపు చెడఁగాఁ, గోపంబున నిమపకట్ల • గుదియంగొని యా
టోపమున రావణానుజుఁ, డేపడఁచెద నంచుఁ గాలి • నిలకుం దాఁచెన్

తే॥ పరవినవి వేయిపడునవి • పరఁగవేయి, తొలుచునవివేయి పొడుచుచుఁ • బొలుచ వేయి
యిషువు లీరీతి మునర తె • క్కొడక భీమ. బలుఁడు తిరిగెను తర్జన • భర్జనముల.

తే॥ వీనిచే దండముఁడిన • సేన బ్రదుక, దనుచు నొకపెట్టఁ బదియమ్ము • లంటనేసి
తుండములు సేయవాఁడు మా • ర్తండుడాలు, గలుగుడాలును కత్తియుఁ • గదఁకఁదాల్చి.

తే॥ జడియఁజేయఁగఁ గోఁతుల • దడముకలఁగి, పిక్కబలముచూపిన రామ • విభుఁడుకాంచి
దనుజు బాహాదండం బడి • దంబుతోడఁ, దెగిపడఁగనేసెఁ బ్లవగులు • త్నేకమొంద.

తే॥ తుదకుదుష్కర్మములు నించె • దుఃఖములను, ముదమునిండించె సత్కర్మ • ములు నిజంబు
లంకకును రావణునకు బ • లంబుపేరి, చేయితెగ రాక్షసులు కాంది • శీకులైరి

తే॥ తెగని చేతితోఁ దెగిన చే • తిని భరించి, గర్జనముతో నసురవైవఁ • గపులు దావి
క్రిందఁ బెక్కండ్రు మడిసిరి • కికురుమనక, దుష్టుచెంత నెట్లుండిన • దోసమె కద?

చ॥ కడఁకను రాముఁ డక్కపి ని • కాయముఁ గాచుచునుండఁ గాలుఁడే
కడిగొనఁ జూఱలాడుక్రియఁ • గ్రందుగఁ గూల్చుట గాంచి సైన్యముల్
మడియును వీనిచే నిమిష • మాత్రములోనని తుంగకుండఁబై
నదరిన చేతికంటెఁ దెగి • నట్టి కరంబున కల్కి రెల్లరున్.

ఉ॥ తక్కిన వానరుల్ చెదరి • తాఱఁగ దూఁకెడి రక్త నిర్ఘరుల్
మిక్కిలి పిన్నులం దిగువ • మింటఁ జరించు సురాళి భీతిమై

లంకఁగల • ధీరులఁ దక్కినవారు దిగ్భ్రమం
కసుండు రఘు • శేఖరుమీఁదికి దాఁటె గ్రద్దనన్.
యిగూడఁ దును • మందగు సంచు సురాళి కోరఁగా
మున్న జము • బిమ్మిటిదీఱ విజేత రాఘవుం
న్ దనుజు • హస్తముఁ ద్రుంచి పయోధిలోపలన్
వో యనెడు • మాడ్కిఁ బడం జనఁ గొట్టెదిట్టయై.

భుజమే కవ్వముగ వేలు • పులు మును జలధిన్
ొసు నా. రజమగు మల యనఁగఁ గలఁచి • రాయిడి చేసెన్.

క్షములతోడఁ, బరుగువాఱుటచే రాము • పంపు సేఁత
• చెనసెఁ గుంభకర్ణు భుజము మందరగిరి • కరణినొప్పె.

ఁ దొల్చి తమ్మటముగాఁ • గావించి మేఘంబుఁ గొ
ముండు కడఁకన్ • మ్రోఁగింపఁగా లేచు పెం
కర్ణుఁ డొగి మే • దోమాంస చర్మాస్థు లొ
ృగఁ జేయ వానర నికా • యంబుం గలంచె న్వడిన్.

వై యొక్కటఁ బంచభూతములు త్రుం • గంజేయఁగా రాని పె
న్నురువుం గైకొని ఘోరమై యమరి ప్రా • ణోత్క్షేపముం జేయు వాఁ
డురు కుప్య ద్యముఁ బోలువాఁడు రిపు దై • ర్యోత్సాహ సంహారి యా
సురవిద్వేషి పదంబొకండు తునిమెన్ • సూర్యాన్వయుం డయ్యెడన్.

తే॥ దంతములు రిక్కలంబోలెఁ • దనరి వెలుఁగఁ, గ్రొన్నెలంబోలి వెల్లనై • కోఱ లలర
నెత్తురున నెఱ్ఱనగు నోరు • నిగుడఁ దెఱచి, యొంటికాలను దాఁటెను • కుంటు చసుర.

తే॥ ఒంటికాలితో నాకస • మంటఁ బెరిఁగి, ప్రక్కవారిని నోటితోఁ • బట్టి మ్రింగి
వాత్యవలె సుడియుచుఁ బైకి • వచ్చువాని, రెండవపదంబు రఘువరే • ణ్యుండు నఱకె.

చ॥ కరములతోడఁ గాళ్లుతెగి • కాశ్యపి గ్రుంగఁగ దొడ్డకొండ వై
ఖరిఁ బడు కుంభకర్ణు ఘన • కాయమునందున రెండువేల యం
పఱ వడిఁ దూఱిపోవ నొక • మాత్ర చలింపక నోటనొక్క భూ
ధరముఁ బెకల్చి యూఁదె భయ • దంబుగ వానరసేన సీల్గఁగన్.

తే॥ పెద్దకొండను నాల్కతోఁ • దద్దయెత్తి, పొలికలను మాడఁగా శ్వాస • బలముచేత
విసరివైవ రాముఁడు కేలు • విదిరిచికొనె, వీని బలము మపారంబని • వింతనొంది.

మ॥ దనుజుం డంతటఁ జింతనొంది యవురా • దైత్యారి విద్విద్దె నే
ర్పునకున్ వేవురు రావణుల్ గలిగినన్ • బొందారఁగాఁ జాల రే
నును కాల్సేతులు కోలుపోయితిఁ దుదిం • దోడ్పాటు సూపంగ నే
యనువుం దోఁప దిఁకేమనంగ నగు దుష్టా • శా మహారోగమున్ ?

తే॥ అన్నకిఁకఁ దోడుపడు నాస • యడుగుపట్ట, దిక్కులరుఁ జాలు స్థరు • దిక్కుఁజూచి
ఎదుట నిలిచిన శ్రీరాము • నెసఁగఁ జూచి, కుంభకర్ణుఁ డిట్లని పల్కె • గోప ముడిగి.

మ॥ ఒక పారావత పక్షికై యొడలి మాం • సోత్కృష్ట భాగంబు ను
త్సుకతం గోసి శిబిరాజునంబిడు యశో • ధుర్యాన్వయంబున్ బొం
దిన నాప్పారిన రామచంద్ర! వినుమై • తేయాపధర్మంబుగా
వ్వక మీ పాదము లాశ్రయించు ననుజుం • బాలింపుఁడీ దేవ! కన్.

ఉ॥ క్షత్రియ రూపముం గొని జ • గంబున మ్రుక్కిన సత్యధర్మముల్
ధాత్రిని నిల్పఁబూనిన స • దాతనదేవ! మదీయ జాతికిం
బాత్రములౌ సధర్మములఁ • బాల్పడకుండిన నాదు తమ్ము నీ
పుత్తునిగాఁ గృపం దలఁచి • పోషణసేయఁగఁ గేలు మోడ్చెదన్

ఉ॥ నిన్ను జయింప నెంచు రజ • నీచరనాయకుఁ డీ విభీషణున్
బన్నుగఁ బెట్టఁగోరు పగ • వాఁడని యెంచినవాఁడు తమ్ముఁడం
చెన్నక చిక్కినేని వధి • యింపఁగలం డవధానబుద్ధి మై
దిన్నగఁ గాపుమంచు మఱి • తేపకు వేఁడి నమస్కరించెదన్.

తే॥ దుర్గుణుండు రావణునకు • దొరకనీక, వీదు తమ్ముని హనుమంతు • నియతిత డోఁకఁ
దోడుగానుంచి సతతంబు • వీడనీక, యుండునట్లుగఁ గృపసేయు • మో గుణాఢ్య!

మ॥ వినువీథిం గను దివ్యులుం దపసులుఁ • విగ్రుండు వీఁడంచు వే
డ్కను వీక్షింపకమున్నె నీశరమునన్ • గంఠంబు ఖండించి పృ
థ్విని త్రోపాడక సాగరంబునఁ బడన్ • నేయింపు మీ యిద్దియే
నిను నేఁగోరు పరం బటంచుఁ గరుణా • నిర్నిద్రుఁ బ్రార్థింపఁగన్.

మ॥ వరముం గోరఁగఁ ద్రోవరాదని యొకే • భల్లంబునం ద్రుంచి త
చ్ఛిరమున్ సంద్రమునందు ద్రోచి మునుఁగం • జేసెన్ రఘుస్వామి యా
శరధి న్నీరము నాల్గుదిక్కులకు హె • చ్చన్ లేచెఁ దర్వాత నా
చెరమల్నిండ మునింగి కాద్పుల చెనా • శీర్షంబు శైలంబు నాన్.

క॥ పాడిరి రంభాదులు సుర, లాడిరి వీడిరి భయంబు • నవనీ జనముల్
కూడిరి ప్లవగులు రాఘవు, వాడిరి రక్కసులు తోడు • పాడగు కతనన్.

## 16. మాయా జనక పటలము. (95)

మత్త॥ కుంభకర్ణుఁడు సంగరస్థలిఁ • గూరు సక్రమ పద్ధతిన్
రంభఁ గూడఁగఁబోయె నయ్యెర • రావణుం డొక వంచనా
రంభుఁడై కడు కావరంబున • రామ లోఁగొన నెంచి సం
రంభ మొప్పఁగఁ జేసె మాయల • రాశి యొక్కఁడు తోడ్పడన్.

తే॥ పంక్తిమస్తకుండు రహస్య • భవనమందు, కూరుచుండి మహోదరుఁ • గూర్మిఁ జూచి
నేఁడు సీతను పొందినా • నెగులు దీర్పు, కౌను నుపాయమొక్కటి దెల్పు • మనుచుఁ గోర.

ఉ॥ ఎంచి యుపాయమొండు వచి • యించెద జానకి తానుగాఁగ మ
న్నించి వరించునట్లు జత • నించెదఁ జూడు మరుత్తుఁ బిల్చి కా
వించెద వానికిన్ జనకు • వేషము వానిని కట్టి తెచ్చి చె
ప్పించెద నంతమీఁదఁ జెలి • తప్పక నిన్ను గ్రహింపదే ప్రభూ!

చ॥ అని యతఁ డాడఁ బంక్తిముఖుఁ • డాదట వానిఁ గవుంగిలించి నీ
వనినది లెస్స వాని వడి • నప్పటికిం గొని తెమ్మటంచుఁ దాఁ
జనియెఁ గుల ద్వయంబునకు • జానగు దివ్వె పతివ్రతామణిన్
జనకజ నిట్లు లోఁ గొనఁగఁ • జాలెదనంచు విమోహచిత్తుఁడై.

తే॥ మకుట పంక్తులు లేయెండ • మలసికాయ, నిరుపుఁదోలు నంగదముల • దరుల మెఱయు
సరులు కటిమల సెలయేటి • సరణిఁ దోఁప, మదగజంబు సిగ్గిలఁ బంక్తి • వదనుఁ డరిగె.

ఉ॥ దీపము వేఱుదీపమును • దెచ్చెడు లీలల నొప్పు చంచలన్
ద్రోపుడు సేసి మేఖలల • తోడఁ గృశత్వము నొందు మధ్యముల్
తేపకు సంచలింపఁగ మ • దించు పయోధర భారవేదనన్
దాపున దేవకన్యకలు • తత్పరతన్ వడిఁ దేర దీపముల్

ఉ॥ రాగముతోడ మాట లధ • రంబు ప్రవాళముతోడ స్త్రీల మే
ల్బాగులనెల్ల నొక్కయెడ • లాలితరీతిని దెచ్చి బ్రహ్మ సం
యోగము గూర్చె నా నలరు • నుర్విజ కొక్క జెడందగూర్ప ను
ద్యోగము సేసి దైత్యవిభుఁ • డుగ్మలిఁ గాంచి మనంబు చల్లఁగాన్.

చ॥ అట నొక పైఁడి పీఁట నల • రారి వెలందుల నొలకన్వి దో
స్తటములె లేమలంబలె నె • సంగఁగ డాపలి యూరు పీఠి మీఁ
దటఁ గుడికాలు సేర్చి యడి • దంబు నొఱం దగిలించి రావణుం
డిటులను వేఁడికో లెడఁద • నేచి మొగంబునఁ దొంగలింపగన్.

ఉ॥ ఎన్నడు నీకు లెంకపయి • నీడిత సత్కృప యుప్పతిల్లు నిం
కెన్నఁడు భానుతోఁ జనకి • యిందుఁడు వేఱయి యుల్లసిల్లు నిం
కెన్నఁడు మారబాణముల • యేపు లడంగు మదీయ భాగ్యమా!
మన్నన సేసి కావు మను • మానము మాను మనంబు లోపలన్.

ఉ॥ పంచితుఁడైన యేను చెలి • వాలకమై విష యుక్తమౌ సుధన్
బెంచి భుజింపఁ గోరితిని • మీదట నాఁటికి నాఁటికెంతొ క్షీ
ణించి మనస్సు సర్వమును • నీఁగెను నీపయిఁ జింతనంబు చా
లించి మరింప జంకెదఁ జ • లించెద మాటికిఁ దత్తఱించెదన్.

ఉ॥ సోలితి నోడితిన్ శరణు • నొచ్చితి వేఁడితిఁ గాపుమంచు నా
పాలిటి భాగధేయమయి • పంతలఁ గూర్పఁగనేల ? చల్లనౌ
గాలియె కాల్చెఁ బుష్పములు • కాటులు వైచెను చందనం,బహిం
బోలెను కష్టముల్ తెలిసెఁ • బోఁడిమి నెయ్యవి సేయఁజాలవో?

ఉ॥ కోరిన స్త్రీలనెల్ల నొర • కోపులఁజేసి యభిఖ్య లెల్ల నీ
పేరుగఁ జేసి నా కనుల • వేతౌరచోటికిఁ బోకచేసి యా
మారుని రేఁచి తన్నిశిత • మార్గణ ఘాతములెల్లఁ గూర్చి న
న్నారసి యేల కాల్పుబతు • వో శరణంబని వేఁడుచుండినన్.

ఉ॥ శంకరుఁ డాదిగాఁగలుగు • సర్వజనంబులు భీతినొంద న
ల్వంకల గెల్చి లోకములఁ • బాలనసేయు వలంతి నేను మీ
నాంకుని కగ్గమై యొకవ • రాంగి పయిం దలకొన్న ప్రేమయే
దింకఁగఁ జేయ నాదగు క • డింది మగంటిమి పొచ్చె మొందదే ?

ఉ॥ వాడి కృశించు జీవములు • బాధల నొందుచుఁ బెక్కు నాళ్లగా
నాడిక నొందఁ గుక్క బ్రదు • కంచు వంచింపదె లోకమెల్ల వె
న్నాడక? పండిత ప్రభుల • నంగడశల్ పదియంచుఁ జెప్పి రే
నోడక పల్కువాఁడ శత • మో వెయియో యని యంబుజాననా !

మ॥ పరఁగన్ ధర్మమె ప్రేమచే నొసఁగు సౌ • భాగ్యంబు! మజ్జన్మ సం
తరణీ! నాయభిమానముం జెఱుప నీ • కారుణ్య సంపత్తి యే
కొఱయున్ లేని శవంబుపోల్కినయితిఁ • గుంభస్తనీ యింక నీ
వరదివ్యౌషధసేవచే బ్రతుకఁగా • వాంఛించితిం బ్రోవవే.

మ॥ నిజమూహింతము దార పెన్ వలపుసన్ • రేరాయనిం బొంది భా
వజ సౌఖ్యంబులఁ దేలదే ? చెడియెనే ? • పాపాల పాలయ్యెనే ?
త్రిజగన్మోహిని ? నా మనోరుజల వే • తీర్పంగదే ! వేరు మం
దు జగంబందునలేదు నీవె గతి వా • దుల్మాని ప్రార్థించెదన్.

క॥ అనుచు దశాస్యుఁడు పక్షం, బను బాహువులిర్వది పది • ముకుటంబులు భూ
మినిచేరఁ జాఁగిలంబడి, యెను మడఁతుల కేరికేని • యెదలు ద్రవింపన్.

## సీత రావణుని దూషించుట

మ॥ మృదుశీలాత్మక సీత లేడి పులి బా • రింబడ్డ యట్లై కడుం
బెదరెం గంపము నొందె భ్రామనుపడియెం • బెగ్గిల్లె నట్లయ్యు వీఁ
డదయుండై నను చంప వచ్చిన సరే • యౌఁగాక మద్భావముల్
మది నే దాఁపగఁ జాలనంచుఁ దృణమున్ • మాటొడ్డి తానిట్లనున్.

శా॥ నీ చేష్టల్ కడునింద్యముల్ కృపణముల్ • నిక్కంబు దుష్టాత్మ! యీ
నీచోక్తుల్ వచియింపఁగాఁ దగవు దు • ర్నీతుల్ చెడం ద్రోచురా
నీ చుట్టాలును నీవు నేఁటిదనుకన్ • నిద్రాళుఁ నా నుండఁగా
నాచెన్నారు పతివ్రతాత్వ ఫల ము • న్నన్ మండనా? మాఁడనా?

మ॥ తరుణీ ధర్మము నేను కాచి ఫలమే? ధర్మంబు స్థాపింపఁగా
ధరణీభారము మాన్ప రామవిభుఁ డు • ద్దండించియున్ లాభమే?
పరివారం బదినోఁట్ల నీకుఁ గలుగన్ • విడ్డూరంపుం బల్కులన్
భరమయ్యున్ వినమండఁగాఁ బలుకవో! బాధింపవో? చంపవో?

మ॥ తపనున్ వెన్నుని కార్తికేయు శివు ధా • తన్ జిష్ణుఁ జండాంశు ని
ష్ప్రపులంజేసి జయించినాఁడనని ప్ర • జ్ఞ ల్పల్కుచున్నావు నా
తపముల్ పండిన పండుఁ శ్రీ రఘుకులో • త్తంసంబు దుర్వార బా
ణ పథి న్నిల్వఁగ లేక పాఱితివి మా • నంబొండు నీ కున్నదే?

శా॥ దన్నంబందుచుఁ బస్తులం బడి యశో • భావంబు వోనాడి నా
న న్నగ్గాడి నికృష్టనై నిలుచు దా • నంగాను నిర్దుష్ట భా
స్వన్నానాగుణ భూషణుండగు రఘు • స్వామిన్ మహా వాంఛతోఁ
గన్నారం గను భాగ్యమబ్బ నను వే • డ్కం దాల్చితిం బ్రాణముల్

శా॥ ధీరోదాత్తుఁడు లక్ష్మణుండు రణ ధా • త్రిన్ నిన్ను వెన్నిచ్చి యీ
సారిం బాఱఁగనీక యడ్డి నిలుపన్ • క్ష్మా భర్త నీ శీర్షముల్
వీరత్వంబునఁ గూల్చి నీయనుఁగులన్ • వేఁటాడి యేకైక దో
స్సారుండై వెలయంగఁ గాంచు ఘనకాం • క్ష న్నిల్పితిం బ్రాణముల్.

మ॥ కరుణాజీవము కంజనేత్రములు జో • కంగల్గి హస్తంబులన్
శరముల్ విల్లు ధరించి యెల్లర హృద • బ్జాతంబులన్ లాగు క
ర్బుర బృందారక వనాంతక ప్రబల జీ • మూతంబు గాకొండు గాం
చి రహింబొందదు మానసాంబుజమునన్ • సీతామయూరం బొగిన్

మ॥ కడఁకన్ జానకి యిట్లన న్నమలి గ్రుం • గందగ్గ కోపంబుతోఁ
పుడమిం దాఁచుముఁ బంక్తికంఠుఁ డను నో • పూఁబోఁడి! న్ గెల్చి నీ
బెడఁదల్ పాపిన మీఁద రాఘవునితోఁ • బ్రేమంపు జీవంబు లో
క్కఁడుగా వాదెదుగాక యంచు నగె ని • ర్ఘాతంబు చందంబునన్

చ॥ నరసుర నాగ తాపసులు • నా క్రుధకుం గుఱి యైన వార లె
వ్వరు మని వారు? వెన్నునిగ • భావన సేయుచు నీవు మోదముం
బొరయుచు నుండు మానవుఁడు • పూర్తిగ నీమది నాటియుండుచో
మురియలు చేసి తీరుదును • ముగ్ధవు నా బలమున్ గణింతువే?

ఉ॥ కోఁతులు వార్ధిఁ గట్టినవి • కోటను బట్టుగ ముట్టడించె దృ
గ్భ్రీతిగఁ బోరె రక్కసుల • గీటడఁచెం గొలు యేమి యంచు నీ
చేతములోన సమ్మదము • చెందెదవే? శలభంబు లగ్నిలోఁ
బాతము నెందు రీలఁ బడ • వా? మఱి నాదు ప్రతాప కీలలన్.

మ॥ చని సాకేతమునందు రాజకులమున్ • సంపూర్తిగాఁ బట్టి బం
ధనముల్ సేసియె తెండు తప్పినఁ దలల్ • దర్పించి ఖండించి తెం
డని యాదేశ మొసంగి పంపితిని దై • త్యవ్రాతమున్ దద్విధం
బున నీతండ్రి వసించుచుండు పురికిం • బుత్తెంచితిం గోమలీ!

చ॥ అని యసురేంద్రుఁ డాడ జన • కావని నాథుని పుత్త్రి సన్ను వం
చనమున నిట్లు సేయు గుణ • శాలికిఁ జేయఁగ రాని దుండునే?
జననిని చంపు పాపికిఁ బ్రి • జల్ సొరకాయలు గారె? యంచు న
గ్నిని పడి ద్రుంగి బ్రదుక్క కర • ణిం దపియించెను నిశ్వసించుచున్.

చ॥ సన్నిటులార్చి త్రిప్పు విధి • నమ్మిన బంట్లని మిమ్ము త్రిప్పఁగాఁ
బన్నగఁ గష్టజాలములఁ • బాల్పడఁ జేసెడు మీ రలంతులే?
అన్ని యధర్మముల్ మదికి • న్యాయముగాఁగనె మీకుఁ దోఁప నే
మెన్ని ఫలంబు సుంత వహి • యించునె? దుష్టుల కేవి ధర్మముల్,

తే॥ అన్ని కన్నులందు ని • రంతర ధారఁగా, బాష్పము లార్చుచుఁ • బరితపించు
నుగ్మలి యెదుట మ • హోదరుండు మరుత్తు, జనకునిగాఁ జేసి • వెనుక కీడ్చి
చేతు లిఱియఁగట్టి • చేర్పడఁ దెచ్చి ని, ల్పఁగఁ గాంచి సీత కే • లను విదిర్చె
నేత్రముల్ మోఁదికొ • నియె నిప్పు ద్రొక్కిన, విధిని పాదంబులు • విహ్వలించె

తే॥ మానసంబు శరీరంబు • మాడ్కి వేఁగె, నిలను పడియెను పొరలె గొం • తెత్తియేడ్చెఁ
బలవరించెను వడఁకెను • కళవళించె, నేమి సేయంగఁగలుగు న • య్యిగురుఁబోఁడి?.

ఉ॥ హాయను దైవమా యను మ • హాపద రాదగునా యనున్ వశం
బా యను ధర్మముం జెడియె • నా యను సత్యము మాఁడి బూది యౌ
నా యను మాయలే బలిసె • నా యను నాపద నుండి ముక్తి లే
దా యను లోకమెల్ల విల • యంబు భజింప శపింతునా యనున్.

మ॥ జనకా! నాకొఱకై యనేక దురవ • స్థల్ నీకుఁ బాటిల్లెనే?
నను గన్నందుల కిద్దియా ఫలము? ధ • న్యత్వంబు ప్రాప్తించె! నే
మనుదానన్ మనుదానఁ గాసు బహుదుః • ఖావాప్తి బంధువ్రజం
బునకుం గూర్చినదాన నాయభిజనం • బున్ మెచ్చవచ్చుం గదా?

ఉ॥ పెట్టి భుజించినాఁడవు వి • వేకముతోఁ గ్రమ ధర్మ పద్ధతుల్
నెట్టన యాచరించితివి • నేర్చితి శత్రుల రూపడంపఁగన్

బట్టుగఁ బెక్కు జన్మములు • పాపము మూట నొనర్చినాఁడ వీ
కిట్టని బాధలొందఁ బరి • కించితిఁ గన్నులు కాలిపోవమిన్

క॥ పలువిధముల నీరీతిం, బలవించుచు సౌమ్మసిల్లి • పడుమఁ బొరలుచున్
దలఁకుచుఁ దలరుచుఁ గుసరిం, బలెఁ గరుణంబుగను మరలఁ • బలచర మొందెన్.

తే॥ పాడి దప్పని పార్థివ • వంశమందు, బొడమఁ నీవు పుత్రికలకుఁ • బుట్టినింటి
వారు చేయంగఁదగు కార్య • పద్ధతులకా, రామిఁ జూడ గోపియె యిటు • రాక తండ్రి!

ఉ॥ మాయల మందిరంబగుచు • మ్రాల్చు చెఱఁబు బురుడించు సంస్కృతిం
బాయఁగలేక యార్తులయి • ప్రార్థన సేయఁగఁ గాచువాఁడు నా
రాయణుఁ డంద్రు విజ్ఞులు ద • రాస్థలి నా చెఱఁదీర్చి ప్రోచు వా
రేయెడలేరు నాకొఱకు • నెయ్యున నీ చెఱఁ దీర్చు చెవ్వరో?

చ॥ చెడుగులతోడఁ జేరమిని • చెందెను వైరము దీనికంచు నీ
కడిమిని వీరనాకమును • కాంచిన మేలగు; రాజులందు గా
ఁడి వను పేరుతో సడిని • మీఱితి వియ్యాది నన్ను పుత్రిగాఁ
బడయు ఫలమ్మె సుమ్మ! సుత • పట్టున నెవ్వచు మ్రందు రీగతిన్?

చ॥ పలుపులచేతఁ గట్టుపడి • భారము మోయుచు దున్ని మోఁదులం
బలువుగఁ బొంది పంకమున • మగ్నత నొందు వృషంబువోలె నే
సలయుచు నంటఁ బట్టుపడి • నప్పుడె చావమి విక్రయించితిన్
సలువుగ మిమ్మె నారకము • నం బడి క్రమ్మఱ నాకుఁ గల్గునే?

చ॥ చెఱపడి శత్రునాశమును • చేసి ముదంబును బొందుదాననా?
గుఱుతుగ రామపాదములఁ • గోరిక సేవ యొనర్చుదాననా?
చెఱపన చేటనై చెడుగు • చేసితిఁ దండ్రి కులంబుఁ గూల్చితిన్
గొఱవిగఁ గాల్చితిం బతి య • కుంఠిత వంశ విశేష కీర్తులన్.

చ॥ వనమున జీవికేశునకు • వాదని వైర మొకండు కూర్చితిన్
జనకుఁడు బంధితుం డయిన • జానుగఁ జూచుచునుంటెఁ బాతకం
బున విలయంబులే కలిగెఁ • బుట్టిన యింటికి మెట్టి నింటికిన్
బనుపడి జీవితంబు వెడఁ • బాయ! నిఁకెవ్వరి కొంపఁ గూల్పనో?

చ॥ క్రతువు లొనర్చి నన్నరుదు • గాఁ గని పెంచిన తండ్రి బాహువుల్
కుతిలపడంగఁ గట్ట భువిఁ • గూలి యవస్థలఁ బొందుచుండ ని
శ్చితమతిఁ జూచు నేను రఘు • శేఖరు జీవితనాథు నిట్టి దు
స్థితి గనకుండు మున్నుగనె • జీవములన్ విడఁజాల నేమొకో?.

సీ॥ జననులారా! వృద్ధ • జనులారా! సోదరు, లార! జనకు దుర్వి • చార మెఱుఁగ
రేమి? నావలె మీకు • నిడుమలు గల్గెనే? రా రేల? మరణించి • పారలేమి?

మేరువు నెక్కి స్వ • ర్మేదినిఁ బట్టిన, నంకించి యీలంక • యందు చొరఁగ
సుకరంబు గాదు త • ప్పక వారు చంపిన, పంచనల్ చేసిన • వార్తఁ దెలుపు

తే॥ వారలెవ్వరు గలరు మీ • వలన వేఱు, హనుమయొక్కఁడున్నాఁడె? య • లైనఁదెలియ
వచ్చుఁ దెలిసియుఁ జేయంగ • వచ్చునేమి? త్రిప్పి దుర్విధి యిట్లు వే • ధించు మంద

చ॥ జనకుని దెచ్చినట్టి నెల • జాణ తపంబున మేనువాడఁ ది
క్కిన సుగుణాఢ్యు నచ్చెరలుఁ • గీడ్పడఁ దెచ్చుటలోన శంకయుం
దనుకునె? యట్లులైన గుణ • ధాముఁడు రాముఁడు చాలకాల మె
ట్లును బ్రతుకంగఁటోఁ దనుజు • లుం బడిచత్తురు గుండె వ్రీలఁగన్.

ఉ॥ సేతువుగట్టి లంకఁ బరి • చేసి యనేకుల దుర్నిశాటులన్
ఘాతకులన్ వధించెనని • పల్కిన వార్తల నాలకించి నా
చేతమునం బ్రమోదమును • చెందితి దుర్విధి యిట్లుచేసె వి
ఖ్యాత తపోవ్రతంబులకుఁ • గల్గిన సత్ఫల మిద్దియే చుమీ!

చ॥ అని పలవించి రావణుఁ • డరిమిలి ప్రాణము సొమ్మసిల్ల రా
వణుఁడును లోన సంతసిలి • వారిజలోచన దుఃఖ మోర్వఁ జా
లనిదయి తండ్రి జీవితము • లం జెడనీయక కోరి కాచి తా
నును సుఖ మొందునంచు మది • నూల్కొన జానకిఁ గాంచి యిట్లనున్

ఉ॥ సుందరి! నిన్ను పొందఁదగు • చొప్పులకై తలఁపంగరాని యి
బ్బందుల నుంచినాఁడ మగు • వా! యవి యెల్ల క్షమించి నన్ను నీ
కుం దగు బంటుగాఁగఁ గయి • కొమ్ము విదేహ ధరాధినాథుఁ జం
పం దలపెట్ట నా భయము • మానుము నమ్ముము నా వచస్సులన్.

ఉ॥ వంతల పాలుసేయు వల • వంతలు బాపుదువేని చెప్పెదన్
చింతలఁ బాపి నీ జనకుఁ • జేర్చెద నింద్రుని సింహపీఠిపై
సంతసమొంచి కోరిన జ • యంబునఁ గొన్న సమస్తరాజ్య మొ
ప్పింతును కాలఁ జూపు పని • వేడ్క శిరంబునఁ జేయు చుండెదన్

చ॥ వలసిన లంక నిచ్చెదను • వారని సేవధులెల్ల నిచ్చెదన్
లలిత విమానమిచ్చెదఁ గ • లంగక యిచ్చెదఁ జంద్రహాసమున్
దలఁపునఁ గోరె దెయ్యెవి ము • దంబున నయ్యవి యెల్ల నిచ్చెదన్
గలికిరొ! డెంద మిచ్చెదను • కాదన నీదగు డెంద మిచ్చినన్

చ॥ పవడముఁ బోలు నోట నొక • పల్కు ప్రియంబుగఁ బల్కితేని నేఁ
దవిలి మహేంద్రు శిక్షక ము • దగ్రత దివ్యులు గొల్వఁ దెచ్చి శా
స్త్రవిధి విదేహనాయకు శి • రంబున నుంచెద సర్వ దిక్పతి
స్తవముల దేవ కామినుల • దాస్యముఁ గూర్చెద మేల్మి నించెదన్.

ఉ॥ తండిరిఁగన్న తండ్రికిని • తండ్రి విరించెయె వచ్చి కూర్మి నీ
తండిరి కోరు కోరికల • దాఁపక యిచ్చు యముండు దాస దా
సుండయి సేవసేయు సుధ • సోదరి లక్ష్మివి నీవి కానిచో
నిండు మనంబుతో సిరియె • నీకును దాస్యము సేయు నమ్ముమీ.

తే॥ తండ్రికిం గూతుఁరైన మా • త్రాన ఫలమెః పొందదగు మేల్మిజనకుండు • పొందవలెః
పరఁగఁ దైత్రిలోక్య రాజ్య సం • పదల నొసఁగి, యీవును సుఖింపుమనసీత • యీసడించి.

శా॥ ఈ సౌభాగ్యములెల్ల నొందఁగలవాఁ • డింద్రుండె నిక్కంబు లం
కా సామ్రాజ్యము నా విభీషణుఁడె వీఁ • కంబొందు విష్ణ్వంశమై
వాసిన్ భాసిలు రాము బాణముల నీ • వక్షంబు భేద్యంబు నా
కా సర్వేశుని పాదపద్మములె సే • వ్యంబుల్ జగన్నా శకా!

క॥ బెడిదములగు రామాస్త్రము, లదర యురముఁ జీల్చి యొడలి • నంతయుఁ బెను జ
ల్లెడగాఁ బొడుచుచు ధర్మముఁ, గడు నేర్పంగలవునీకుఁ • గర్కశ హృదయా!

తే॥ కాకములు చంచువులతోడఁ • గనులు పొడిచి, తోఁడగలవు; నీ వక్షమ్ము • దోయజాక్షు
శరము లగలింపఁగలవు పి • శాచ సమితి, తినఁగలదు నీ శవమ్మును • తృప్తితోడ.

తే॥ క్రూర దంష్ట్రాయుతంబైన • ఘోరమస్త, కములు కలనరాఘవసాయ • కములవలనఁ
ద్రుంపఁబడియె రమ్మనుచు మా • రుతి వచించు, వార్తనేఁట జేపట విన • వచ్చు నిజము.

ఉ॥ మాత సుమిత్ర వీర వర • మాతగఁ జేసిన లక్ష్మణాస్త్రముల్
నీ తనుజాతు ప్రాణముల • నీఱుగఁ జేయఁగ వాని మేను సం
ప్రీతిని కుక్కలీడ్వ ననిఁ • ద్రెళ్ళితె పుత్రకః యంచు నీవు దుః
ఖాతురుఁ డౌచు ఖోలుటయె • ఘర్మిలి నే విసఁదగ్గ పల్కగున్.

ఉ॥ క్రూరుఁడు రావణుం డటులు • కోమలి పల్కట లాలకించి పె
న్నీరసమెత్తి దంతముల • నీడిచి గీఁటుచు సీతపైఁ జడన్
దారున లేవఁగా నెమరు • దాసి మహోదరుఁ డీమె తండ్రియే
తూఱి వచింప సమ్మతిలుఁ • దొందర యేలని క్రమ్మఱించుడున్.

॥ చచ్చినట్టులుండిన మాయ • జనకుఁ డపుడు, మెల్లఁ దలమెత్తియిట్లను • తల్లి! వీరి
వేఁడికోలును త్రోపంగ • నాడి కేని, కులముతో నన్ను గూల్చిన • కొలయగుఁ జుమీ!

చ॥ సిరియును లోఁగి పెక్కురను • చెంచదె యమ్మడిగొడ్డు పోలికన్
వెరవిఁడి! నీకునై యసురు • వీడుచు నుంటివి బండవై వృథా
మరణము నొందనేలః మది • మన్ననచేసి సురేంద్రనాథుఁడై
పరఁగిన నీవిఁ జేకొనుము • పాలనసేయుము మమ్ము మేలుగన్.

చ॥ కరుణను నన్ను నారులము • గగ్గులకాడుగఁ జేయకుండ ని
బ్బరమునఁ బ్రోచి యగ్గలపు • భాగ్యములన్ సమకూర్చి నీచెలిన్
విరియఁగఁ జేసికొంచు ఘన • విశ్రుత సౌఖ్యము లెల్లవేళలం
బొరయుమ యంచు నయ్యలరుఁ • బోఁడి పదంబుల వ్రాలె గ్రక్కనన్.

చ॥ చెవులకు హస్తముల్ కదియఁ • జేరిచి జానకి విశ్వసించి యె
క్కువ దిగులూని దఃఖమును • కోపముఁ బైపయి నగ్గలింప మై
రవులఁగఁ దంద్రియేని తన • ప్రాణము లెచ్చుగ నిచ్చగించి యీ
పవిదిని పల్కఁ డియ్యది సు • బద్ధము గాదను నిశ్చయంబుతో.

సీత మాయాజనకుం ఒదరుట

చ॥ తగవు నశింప శీలము కొ • దంబడ క్షాత్రము కూలిపోవఁగా
జగతిని నిందమోప ఘన • సత్యము చావఁగ సచ్చరిత్రముల్
తెగులుగొనంగ గౌరవము • తీఱఁగ బుద్ధియు మాఁడఁగా నిటుల్
తగిలి వచించు నీవు నొక • తంద్రివె? ధూర్తుఁడ వౌదు దుర్మతీ!

చ॥ కులము నశించినన్ గతులు • గూలిన నాపద లెన్నివచ్చి త
న్నలఁచిన గుండె వ్రయ్యలయి • నం దలవోయినఁ బాడిపేరుముల్
వెలఁగ మానముం జెడఁగఁ • జేరును లోకులు తూరుపెత్త రా
జులు మనువారె? స్వీయకుల • సూదన! యారయ నీవుఁ దంద్రివే?

చ॥ జనకుని యట్లు తోఁప వొక • శ్వానము నీవీ నిజమ్ము తంద్రివై
నను రఘురాము నింటికి ఘ • నమ్ముగ దీవన లిచ్చి యాతఁడే
నిను విడిపించునేని చెఱ • నీఁగుము తక్కెనయేని చావు మ
న్య నియతి లేద యంచుఁ దగ • నాడక యీగతిఁ గాఱులాడెదే?

ఉ॥ నీవును నీదు చుట్టములు · నీ • సకలంబును మాఁడి బొగ్గులై
పోవునుగాక నీతి పథ • మున్ మతిఁదప్పి చరింపనేర్తునే?
శ్రీవరుఁడైన రామవిభు • సేవకురాలగు నేను నీచనై
జీవములుండ రావణుని • చెంగట మానముఁవోఁ జరింతునే

ఉ॥ రామ విభుండు దక్క నను • రాగముతో నను డాయువారు ర
క్షోవరులైన దీపశిఖఁ • జొచ్చిన కీలములట్లు మాఁడరే,
యేమని యెంచితో నను? మృ • గేంద్రుని గూడిన సింహి యెన్నఁడేఁ
బ్రేముడిఁ బాడుగుంటలఁ జ • రించెడు నక్కను గూడియుండునే?

ఉ॥ క్రూరబలుండు రావణుఁడు • కోమలి పల్క కఠోర వార్తలన్
దోసపుఁ గిన్కతోడ విని • తోయలి! నీవు తలంచినట్లె యొ

ప్పారుము కాఁగలట్టి దెస • లారకపోవదు వీనిఁబట్టి నీ
వారయుచుండఁ ద్రుంతునని • యత్తఱి ఖడ్గము వేగ యెత్తుడున్.

ఉ॥ చంపఁగ లేవు నన్నితనిఁ • జంపఁగఁజాలవు విన్ను నీవునుం
జంపుకొనంగలేవు భువ • నంబులఁ గూల్పఁగలేవు రాముఁడే
చంపెడువాఁడు నీకు మొగి • సాయపడంగల నీదుబంధులన్
ఱపటలెల్లఁ బూర్తిగఁ దొ • లంగఁగ నన్ గొనువాఁడు కీర్తితోన్.

చ॥ అని ధరజాత పల్కుతఱి • నద్దము వచ్చి మహోదరుండు పా
వనతర దేవభోగి యొక • పట్టున నీకయి వేఁడెఁగాక యీ
జనకుఁడు నీకొనర్చిన దొ • సంగొక యింతయు లేదు వీనిఁ జం
పిన వెనుకైన నీ తలప • వింపదె నీకు నధీనయౌ తఱిన్ ?

చ॥ అని మొన రామభద్రుఁ దెగ • టార్పుము సర్వము నీకుఁ జక్కనౌ
నని వచియింప దైత్యవిభుఁ • డప్పని మాని తొలంగె నంతలో
వనచరు లార్పుటల్ విబుధ • వర్యుల కేకలతోడి చప్పటల్
విని మదిలోఁ గలంగె రణ • వృత్తము తత్తఱపాటు గూర్పఁగన్.

తే॥ ఇన కులేశుల గుణరావ • మెక్కుఁడయ్యె, నమర వానర కలకల • మతిశయించెఁ
గుంభకర్ణుని సైన్యంబు • గూలనాతఁ, డొంటిమై యుండెనని దైత్యుఁ • డుమ్మలించె.

### రావణుఁడు కుంభకర్ణ మృతికై విలపించుట

ఉ॥ తెక్కలు గట్టికొంచు నెస • రేఁగి వడిన్ వడి వచ్చి దూత లా
రక్కసి తేని కర్ణ విభ • రంబుల డాసి మహా రణంబునన్
మొక్కలులైన వానరుల • మొత్తము మొత్తముగా వధించి పై
నుక్కఱి రామబాణముల • నుర్వరఁ దమ్ముఁడు కూలె గా! యనన్.

తే॥ పరిధి గల భాస్కరుంబలెఁ • బైఁడి సరుల, చే నలంకరింపఁబడిన • శీర్షకములు
జగతిఁ బడఁ బెల్లగిలిన వృ • క్షంబు పగిదిఁ, గూలె రావణుఁ డవ్వార్త • కుములఁజేయ.

తే॥ ఉర్విఁ బుట్టకఁదొట్టి వి • యోగ దుఃఖ, మెన్నఁ డెఱుఁగని లంకాధి • పేశ్వరుండు
తనకునై ఘోర రణమునఁ • దమ్ముఁ డిలిగె, నంచు వినినంత గొంతెత్తి • యంగలార్చె.

సీ॥ త్రిదశ పద్మాకర • మద గజేంద్రమ! యింద్ర, పరకీర్తి పూర్ణేందు • వారిదంబ!
అబ్జజపౌత్ర! శూ • లాయుధహస్త! యీ, చెడువార్త నే డు నా • చెవులు వ్రీల
విననయ్యె నిన్నంపి • వెనుక నా ప్రాణముల్, గాఁకోఁ దలంచిన • నీదు నేను
నీ స్థితి విన్నచో • నిర్జరనాథుఁ డై, రావణ మెక్కి స్వ • ర్గంబు చొరఁడె?

తే॥ విమతి నన్ను నీవే యిట్లు • విడిచి పోవ, నెవరెవరితోడఁ బుట్ట ర • హించువారు ?
యెదుటి కేతేర భీతిల్లి • యొదుఁగువారు, చూచి తొమ్మఁపైఁ జేతు లుం • చుకొని రారె ?

తే॥ స్నాన మాడెడి ఏటి నీరు • స్వర్ణశిఖరి, మడమ రుద్దికొనెడు చిన్న • పడికె యగును
అట్టి నిస్సీమ మనుజుని • యలుఁగు కూల్చె. ననెడి మాటయే నామది • కలఁత గూర్చె.

తే॥ శూల చక్ర వజ్రంబులు సోకి యొదలి, పైని రోమంబునేని రా • ల్పంగలేదు
అట్టి మనుజుని మృదుల సా • యకము త్రుంచెఁ, గుక్క సింగంబు నెదిరించి • కూల్చె నౌర!

సీ॥ తోడఁబుట్టువు ముక్కు • త్రుంగ మారీచుండు, బ్రుంగ లంకయుఁ బట్టు • గ్రుంగ భీమ
బలుఁడు తమ్ముఁడు గ్రుంగ • బ్రదుకుచు నొకచెలి, సౌందర్యమున కాసఁ • జెందినాఁడ
వినతులునైన నా • తని తమ్ములైన సే. నాని యైనను గపి • నాథునైన
సంగదునైన మ • హాబల సుతునైన, జాంబవంతుని నేని • చంపి తనువు

తే॥ విడఁగ నోచనైతి నిదేటి • వింతచావు. రాలు తేలెను బెండ్లు నీ • రమున మునిగెఁ
నేమి చెప్పంగఁగలదింకఁ • దామసింప. కరుగుదేరంగఁ దలఁతు ని • న్ననుసరించి.

చ॥ అతివలు కౌఁగిలొత్త మల • యానిల మెయ్యన వీవ సూన సం
గత తలిమంబున న్నిదుర • గాంచెడు సోదర! ప్రేత భూత సం
తతులు నటించుచుం గటు రు • తంబులు సేయు దురంబునన్ రజో
యుతమగు భూమి శయ్య నెటు • లొందితి నిద్దుర మేను వ్రాల్చఁగన్.

తే॥ దిక్కులందున నీవు కీ • ర్తిని రహింపఁ, జేయ మఘవాని భోగముల్ • చెందుచుంటి
నీవు పోవంగ నేనెట్లు • నిలుచువాఁడ? వత్తు నీవెంటఁ దామసిం • పను నిజమ్ము.

తే॥ అనుచు మిక్కిలి పలవించి • తనదు కీర్తి, కారణంబెల్ల రిట్లెలుఁ • గంగఁ జేసె
సీత తననోడు చలియింపఁ • జెంగలించి, మేనఁ బులకలు గ్రమ్మంగ • గ్లాని విడిచె.

తే॥ గాత్ర ముప్పొంగెఁ గార్శ్యంబు • కడకుఁ జనియె, మనసు తెలివొందె జీవముల్ • మరలివచ్చె
సిరియె సేవ సేయఁగఁదగు • శీలచరిత, సీత యెలమికిఁ బొలిమేర • క్షితిని గలదె?

తే॥ కొండు ఖలిత రూపము కుంభ • కర్ణు ఘోర, తనువుగాంచి భీతిల్లి త • త్తఱిలి యవలఁ
గెడసెఁ గుంభకర్ణుండను • నుడువు విన్న, సీత పూరించె వేఱొక • సీత యసఁగ.

తే॥ లోకములఁ గూల్తు లోకపా • లురను ద్రుంతుఁ, జావకున్నఁ ద్రిమూర్తులఁ • జావకుండు
మందు దిన్న గీర్వాణుల • బందివైతు, నని చిరాకు మిక్కిలి యొందె • దనుజవిభుఁడు.

మ॥ తనువున్ వీడిన నాదు తమ్మునకు ను • ద్దామక్రియన్ రామ ల
క్ష్మణ రక్తంబునఁ దర్పణంబు నొగి ము • మ్మాఱుల్ మనశ్శాంతికై
యొనరింపంగలవాఁడ నంచు సమరో • ద్యోగంబునం బోయె రా
వణుఁ డాచోటును వీడి మంత్రులు సఖుల్ • వంటించి వెన్నాడఁగన్.

తే॥ కాక కంక గృధ్రంబులు • కలయ దిరుగు, పొలికలనఁ గుంభకర్ణుండు • పొలిసె ననుచుఁ
గుంది యోజనకుని వేఁబు • బంది నుంచుఁ, దంచు నేగె మహోదరుఁ • డార్తి మెయిని.

తే॥ పూలు తావియు లేక దు • వ్వటలు లేక, యొంటి తిరియైన కేశంబు • లొప్పు సీత
కడకుఁ గడఁకతో ద్రిజటయన్ • కాంత వచ్చి, యూఱడించుచు నిట్లని • తేఱఁ బలికె.

తే॥ నీ జనకుఁడంచు నీదు స • న్నిధికి వచ్చి, మలసి నతఁడు మరుత్తుఁడన్ • మాయలాఁడు
నిక్కమది యని నమ్మకు • నీరజాక్షి! దనుజ మాయలు పెక్కులు • తలరనేల?

తే॥ త్రిజట పల్కులయందు మై • థిలికి నమ్మ, కంబు గల్గుట నామె దుః • ఖమ్ము వీడె
సందియము వీడె మనసునఁ • గుండు వీడె, నెప్ప టట్టుల రామాప్తి • యెదురుచూచె.

## 12. అతికాయ వధ పటలము. (276)

తే॥ ఉగ్రమై వెల్గ విలయాగ్ని • యుడుకునట్లు, మండుకోపంబుతో రావ • ణుండు కొలిచి
యిరుకెలంకులవచ్చు మం • తిరులఁజూచి, రౌద్రమూర్తియై యిట్లు వా • క్రువ్వఁ దొడఁగె.

తే॥ అనువుగలవారు పగఱయు • క్కడఁచువారు, బలియుఁడని పంప శాత్రవ • బలమడంచి
మరలి రాలేక యూరక • మరలివచ్చి, నిలుతురేల? సిగ్గిలరె? యా • వలికిఁ బొంతు.

చ॥ గతియొకయింత లేక ప్లవ • గంబుల డంబుగఁ గూర్చుకొన్న దు
ర్మతులను చంపివత్తుమని • మాటలు రుద్రులఁబోలె నేగి పెన్
జతనముతోడఁ దమ్మునకు • సాయము సేయక పాఱివత్తురే?
యతగులు మీరు ప్రాణముల • నంటి చరింతురె యెల్లకాలమున్?

చ॥ మునుపు జయించితిన్ జగము • మొత్తము నేలితి శౌర్యసంపదన్
గొనకొని మీరు నాదు మఱుఁ • గుం గొని గౌరవ సౌఖ్య కీర్తులం
గని చరియించినా రిపుడు • కార్యము గల్గిన మీబలంబు వం
చన మొనరింపకుండ నను • జాశము లిచ్చియుఁ జేయు టొప్పదే?

తే॥ అంతకర్థుల మేముకా • మందురేని, యట్లు చెప్పుదు నేనేగి • యముఁడు లేక
ప్రాణ మానఁదగిన శక్తిఁ • బరపి నరులు, వీఁపు చూపఁజేసెద భూత • వితతి యదర.

తే॥ మఱియునొకమాట యరుదైన • చురమునందు, గెలువ గోరిన నేగుఁడు • చలముమీఱ
నిలుగుచే నిజంబని మీరు • తలఁతురేని, ఫలీవ దెయ్యది మీకోర్కి • తెలుపుఁడనుడు.

తే॥ బ్రహ్మకోపించినను జయిం • పంగరాని, శూరు డతికాయుఁడపుడు ని • ష్ఠురతతోడఁ
గోపమును సిగ్గు మల్లడి • గొనఁగఁ బలికె, రావణునితోడఁ దన పరా • క్రమము మెఱయ.

ఉ॥ జంకిన జంకనీ నరులు • జంభ విభేదియు నిర్జరావళుల్
జంకిన జంకనీ యజుఁడు • చక్రియు రుద్రుఁడు తక్కువారలున్
జంకిన నీవు నీకయి వె • సన్ బిడియంబు వహింతుగాక నే
జంకితినంచు నెంచుటయుఁ • జక్కటికాదు భవన్మనంబునన్.

తే॥ దానవులయందు ఘనబల • దర్పితులను, గెలిచి గెలుపును నీకుఁ గ • ల్గింపలేదె?
నీవును వడంకఁ బోరిన • నిర్జరులను, ద్రుంచి సారెనాఁ ద్రిప్పి యా • డించలేదె?

ఉ॥ వైదుపు కేలసుండు ధర • గాఁ దలంపఁగఁబడ్డ యుష్టిఁ దం
డేవల సాయకంబులచె • బిట్టసగడ్డలి దుంగబెట్టఁడున్
దేవల సత్త్వకీర్తులను • దీసిని సమ్మన యా విభీషణుం
డో దనుజేంద్ర! నాదు నెమి • లో తలపోయుము నిమనంబునన్.

తే॥ నీదు తమ్ముని ప్రాణముల్ • నీఱు సేయు, వానితమ్ముని జీవముల్ • ద్రాఁతిదీసి
రాము వడఁకింపఁజాలిన • భీము రాముఁ. సేయ నేని నీ కొడుకనఁ • జెల్లుటెట్లు?

క॥ ముమ్మరముగఁ బోరి ప్లవం, గమ్ములఁ ద్రుంగించి దశము • ఖాంధ్ర నలఁచి వీ
రమ్మున నిడువురు నడులరు. రమ్మా లీలయఁగట్టి తెచ్చు • త్రాణం గనుమా.

క॥ బంటులతోఁ బొమ్మందువొ. యొంటరిపై బొమ్మటందు • వో నెలవిమ్మా
పంటింప కేగి వారల, దంటతిన మడంతు ననిన • దనుజేంద్రుండున్.

క॥ ముదమంది లెస్స పలికితి, వచనమ్మున లక్ష్మణాఖ్యు • ఖండించినచోఁ
బవపడి మఱునాఁడే నే, సదమద మొనరింతు రామ • చంద్రు దురమునన్.

ఆ॥ మూఁడుకోట్ల క్రొత్త • మొన రథ గజ తురం, గములు తోడరాఁగఁ • గదన తలము
సేరఁ బొమ్మటంచుఁ • జీరి దీవించుచు. నెలవ మతిశయింప • నెలవొసంగి.

తే॥ విర్జరుల కసాధ్యులు మహా • నిష్ఠుర బల, ఘనులు కుంభ నికుంభు ల • కంపనుండు
తేరి రక్షకులుగ వచ్చ • వారు పవన, జవన హయ శతాంగంబుపై • సరగఁ జనుము.

తే॥ తేరు లొకవేయి యొకకోటి • వారణములు, కోటి వారువములు తోడఁ • గూడి వచ్చఁ
గదలుమన నతికాయుండు • ముదమునంది, కార్ముకము పూనిపసిఁడి కం • కటము దొడిఁగె.

తే॥ కఠినరావముల్గల వీర • గణము బలయ, వివిధ సాధనముల కాంతి • వింత గొలుప
వీథులెల్లఁ గ్రిక్కిఱియంగ • వెడలె దండు, పాదరేణువుల్ రోదసిఁ • బరవి నిండ.

సీ॥ గిరిదరీ సుప్తకే • సరులు మేలుకొనంగ, గజ బృంహితంబు ల • గ్గలముగాఁగ
కపి నికాయంబుల • కర్ణభేరులు వ్రీల, భేరీ రవంబులు • బోరుకొనఁగ
జీవసంతతి గుండె • చెదరంగఁ బంచధా, రాగత హయహేష • లలమికొనఁగ
స్రుక్కి శేషు నొడలు • మిక్కిలి బడలంగ, స్యందన నేమిని • స్వనము లులియ

తే॥ కాలిబంటుల ఘనఘోర • గర్జనముల, దారణస్థితి గగనంబు • బూరటిల్లఁ
బాదవిక్షేపముల భూమి • పల్లటిల్ల, నడచె వడిగాఁగ దైత్య సై • న్యంబు లవిక.

తే॥ మున్ను మదగజంబులు వడిఁ • బోవుచుండ, వెంటఁబడి పోవుచుండెడు • పిడుగులనఁగ
ధ్వజము లొలయు శంపాయుత • వారిదములు, కదలుచుండెను వెనువెంట • గములు గట్టి.

తే॥ అంకుశము పోటుగొన్న సా • రంగములకుఁ, బ్రక్కలఁ మదతోయంబు • పాఱుకతన
దారి బురదయై దిగఁబడఁ • దత్తడములు, నేనుఁగులు నేగె నడ్డేట • నీఁదుపోల్కి.

తే॥ ఘనుతోడఁ బరిధి యేగు • పగిది నడచె, స్యందనంబులు తోయద • చయమువోలె
నడచె వారణములు నేల • నడవవయ్యె, బరుగు వాయువు నుండెడు • తురగసమితి.

క॥ గిరి సముదయములు నడచిన, తెఱఁగునఁ దఱుచగుచుఁ బెద్ద • కేరులు నడవన్
గరువంబున నతికాయుం, డిరవుగ నని సేయఁదగిన • యిక్కువ చేరెన్

క॥ శ్రీరామ మదగజేంద్రము, వీరవిహారంబు సలుపు • పృథివిని గని పె
వ్వేత్తై పదములు తునిఁగిన, వీరుని పినతండ్రిఁ గాంచి • విలపించెఁ గడున్.

క॥ ఇది యమ్ములచెఁ దిప్పయి, పొవలినయదిగాదు దిగిభ • ముల తనువు న్నీ
రదమును శరనిధియును గా, దిది తండ్రి శరీరమనుచు • నేడ్చెం బెలుచన్.

తే॥ అకట యిట్టి దుస్థితిఁ జూడ • నరుగుదెంచి, నాఁడ నుసులతో నున్న • నరుల మున్నె
తునుమ కుండుటచే నింత • దొసఁగువచ్చె, నూరకుండుట నాకింక • నొప్పుగాదు.

క॥ అని కినిసి యిట్లు కావిం, చిన రామునితమ్ము నిల్లె • చెలగి చెలగి రా
ముని దుఃఖము గనినం గద, మన యంగద నీఁగు ననుచు • మదిఁ జింతించెన్.

తే॥ మహిషుఁడను దూతఁ బిల్చినా • మాటగాఁగ, లక్ష్మణునికడ కేగి యీ • లలినిపలుకు
తమ్ముకై దురపిలు తన • తండ్రినెగులు, దీర్ప నతికాయుఁ డాజి కే • తెంచెననుము.

తే॥ చింతచే మదికలఁగి కృ • శించుచున్న, తండ్రి నిండుసభను రాము • తమ్ముఁ డాజిఁ
గాళ్లు తెగి యురలంగఁ బాఁ • గాంచునట్లు, శపథములు పల్కి వచ్చెను • సరగ ననుము.

క॥ దురిత మిదియని తలంపను, వరశూరుల కిదియె ధర్మ • పద్ధతి యనుచుం
దెఱఁగొప్పఁ బలికి యతనిని, దురమునకుం దెమ్ము పొమ్ము • తోరంపు వడిన్.

క॥ నరులును యుయుత్సువులు నగు, నిరువుర వడిఁజేరి కలన • నెదిరెంచెదు వా
రిరవుగ జము నోటంజొరఁ, బరుగిడు వారనుచుఁ దెలియఁ • బలుకుము మహిషా!

క॥ వానిఁ గొని తెచ్చి విడిచితి, వేని ముదమునంది నీకు • నిచ్చెదఁ బ్రతిగాఁ
జీనాంబరములు మేలగు, మాణిక్య విభూషణములు • మహియు నొసఁగెదన్.

క॥ సౌమిత్రిఁ దోడితెచ్చినఁ, క్షేమంబున ఖచర నాగ • విద్యాధర కాం
తామణుల నిత్తు నీవలు, కీమహిఁ ద్రావని సురాదు • లిచ్చెద నీకున్.

క॥ రవిమండలముంబోలిన, యవి వేల్పులు కొన్కవెట్టి • నవి యక్షేశుం
డవిరళముగ నిచ్చినయవి, తివిరి యొసఁగువాఁడ రత్న • దివ్యభూషల్.

సీ॥ దానధారలఁ దుమ్మె • దలు మూఁగు మదగజం, బులు నూఱువేలు నీ • కెలమినిత్తు
రత్న కాంచనమయ • రథములు పదివేలు వన్నెవన్నెల వారు • వముల నిత్తు
ధనరాశి నించిన • ఘనశకటంబులు, కోరికమీఱఁగాఁ • గొసరకిత్తు
దాసదాసీ జన • తండంబు లొకవేయి, వలసినచోటఁ గా • వలసినంత

తే॥ నేల యేలంగనిచ్చెద • నీవుపోయి, లక్ష్మణుని దోడితెమ్ము నీ • సూక్ష్మమతిని
దగిన చెలుగునఁ బలికి ర • క్తప్యమెట్లుఁ, జెదరయుండఁ జూడుము పొమ్ము • శీఘ్రగతిని.

తే॥ అనుడు మహిషుఁడొంటరియయి • యరిగియెదురు, వచ్చు రాముని గనినంత • వానరవరు
లలుక లేవ నుత్సాహంబు • గొలుపునర్థ, మొందు గలదని మహిషాసు • రుండుపలుక.

తే॥ రాయబారియై వచ్చె వి • రాయుధుండు, రేఁగవలదని వారి వా • రించి విభుఁడు
వానిఁగని నీవువచ్చిన • పని విశేష, మయ్యెనేని తెల్పుము యన • నసుర చూచి.

తే॥ మా ప్రభుఁడు చెప్పఁబంపిన • మాటయొందు, గలదు లక్ష్మణుతోఁ బల్క • వలయుననిన
వినెద వాక్రుప్పుమని రామ • విభునితమ్ముఁ, డనుడు మహిషాసురుండును • వినిచెనిట్లు.

శా॥ నిన్నే ఘోర రణంబునం జెనర న • న్వేషించుచున్ వచ్చి యిం
దున్నాఁడం బ్రతియొద్దు శౌర్యమది నీ • కున్నేని వే రమ్ము తం
డ్రిన్నొప్పించిన నొవ్విదీట నిను గం • డ్రింతుం దురంబందు మీ
యన్నం బిమ్మట నొంతుఁ బంతమిది ప్ర • త్యగ్రంబుగాఁ జేసితిన్.

మ॥ అనినన్ రాముఁడు నవ్వి యిట్టులను దై • త్యశ్రేణితోఁ బోర నా
యనుజుం డెప్పుడు సజ్జుఁడై యలరు ధై • ర్యస్ఫూర్తి శోభిల్ల నా
నినకా దాతని తండ్రి వచ్చినను మ • న్నింపన్ రణంబిచ్చు ర
మన్నుమా మానము శౌర్యమున్ భుజ వల • వ్యాపారము ల్గల్గినన్.

మ॥ అన నాతోఁ దనె పంపుఁడంచు మహిషుం • డాడంగ మేలంచు ల
క్ష్మణుఁ బ్రేమంబునఁ గౌఁగిలించికొని రా • మస్వామి పొమ్మన్న స
ద్గుణభూషుండు విభీషణుం డనియెఁ గా • కుత్స్థాన్వయా! యుత్తమున్
మనతోఁ గూడియె తమ్ముఁ డాదనుజుఁ జం • పం దగ్గ కార్యంబగున్.

సీ॥ సత్యవిక్రముఁడగు • సౌమిత్రితోన యు, ద్ధంబు సేయఁ బ్రతిజ్ఞఁ • దాల్చినాఁడు
తపమొనరించి వి • ధాతచే వరములు, గాంచి వేలుపుల జ • యించినాఁడు
కైలాసమెత్తిన • ఘనుఁడు మేరువునెత్తఁ, బ్రేమతో వీనిని • పెంచినాఁడు
వలయు సాధనములు • పనిలేక యే కేలఁ, బాలవెల్లిం జిల్కఁ • జాలినాఁడు

తే॥ విలయమునను నశింపక • వెలయుచుండు, ప్రథిత దిగ్గజములఁ ద్రోచు • బాహుబలము
తోడఁ జక్రవాళంబునే • త్రోవఁ జాలు, దోర్బలము సమానమె? దళ • త్తోయజాక్ష!

తే॥ చిరము పాలాక్షుతోడను • దుర మొనర్చి, శూల మతఁడు వైవఁగ దానిఁ • గేలఁబట్టి
యావు విడిచిన శూలమా • యిది? యటంచు, నుల్లసములాడె నెలుఁకుల • నుచ్చి పాఱ

తే॥ పగఱ లోకంబు వేల్పుల • నగరిఁగాల్చు, తఱిని విష్ణువు వైచు సు • దర్శనంబు
నిష్ఫలముగా నొనర్చిన • నేర్పులాఁడు, వీని సామాన్యుగాఁగ భా • వింపరాదు.

తే॥ అమరులేసిన వివిధ ది • వ్యాస్త్ర సమితి, పంబి రాకుండ నుగ్గునూ • చంబుచేసి
వారి సామర్థ్యముల వ్యర్థ • పఱచినట్టి, చండ కోదండ విద్యా వి • శారదుండు.

తే॥ శంకరుని శిష్యుఁడనితర • సాధ్యనవ్య, మహిత శస్త్రాస్త్ర విదుఁ డధ • ర్మంబు దక్క
వేఱెఱుంగఁ డశూరుల • వీఁక దాఁకఁ, డసమ కీర్తికాముఁ డు మాయ • లాజిఁ గొనఁడు.

సీ॥ మాయా విశారదుల్ • మధుకైటభులు తొల్లి, సురలోకమును చొచ్చి • చూఱలాడి
విబుధుల హింసించి • విధివశంబున నొక్క, దినమున శ్రీరమా • ధిపునిగాంచి
సమరమిమ్మనికోరి • సమ్మతింపఁగ వారు, బహురూపములఁ గొని • వచ్చిపోరఁ
జక్రియు వారితోఁ, జాలకాలంబు మ, ల్లాడంగ వారలు • హరినిగాంచి

తే॥ మమ్మెదిర్చి పోరివచ్చిన • మహితధైర్య, శాలి జగముల నీవలెఁ • జాలువాఁడు
లేఁడు మేమేడులోకాల • లీలఁద్రిమ్మంగి, క్రక్కఁగల బలియుర మాజి • కర్కశులము.

తే॥ ఇరువురను మమ్ము డీకొని • యిన్నినాళ్లు, పోరితివి మెచ్చితిమి నీవు • కోరు వరము
నొసఁగువారము కోరి మే • లొందు మనినఁ, జక్రి కోరె వారల గెల్చు • సరవిఁ దెలుప.

ఉ॥ సీతొదయందు చతుమని • నిర్జరవైరులు తెల్పునంతఁ గం
జాత విలోచనుండు భువ • నంబు సమస్తము నొక్క యూరువం
దే తెఱఁగొప్పఁ జేర్చి నసు • రేంద్రులు వేర్పడి లొంగినారు త
ద్వాత గదాప్రహారమున • ద్రుందిరి లోకము లల్లసిల్లఁగన్.

మ॥ మధు మేధస్సు ధరాతలంబు నెఱయం • బర్వంగ నిద్రాత్రి త
ద్విధిచే మేదినియయ్యె ధర్మపథమున్ • ద్రొక్కఁడకున్నట్టి య
మ్మధువే యప్పుడుఁ గుంభకర్ణుఁడగుచున్ • మాఁడెన్ భవత్సన్నిధిన్
మధుతమ్ముం డతికాయుఁడయ్యె రఘురా • మా! దీన చింతామణీ!

ఆ॥ తగ విభీషణుండు • దైత్యుల చరితంబు, తెలుప నిట్లు మోముఁ • దేటపఱచు
మోడ్చి నవ్వుతోడ • జలజాతనేత్రుండు, పలికె జుఁద నినద • భాషణముల.

సీ॥ కోటిరావణులైనఁ • గూడ సురాసురల్, వచ్చి లక్ష్మణుఁదాఁకి • బ్రదుకువారె?
యితఁడు కోపించిన • నేనేల • హరియేల? హరుఁడేల? యింద్రాదు • లాదులేల?
దివ్యాస్త్రములుఁ తప • స్తేజోబలంబులు, సౌమిత్రి కిసుమంతుఁ • జాలనవియె?
కేల విల్లందిన • నీలోకములనెల్ల, క్షణమున నిపుణుగఁ • జలుపఁగలఁడు

తే॥ మేదినీసుత మాటలు • మీఱలేక, తొలఁగిపోవుటచేఁగదా • దుష్టరాక్ష
సుండు నేటికి జీవించి • యుండువాఁడు, కాకయున్న నాఁడే జముఁ • గాంచువాఁడు.

చ॥ తొన కక పొమ్ము నీవితని • తో నతికాయు శిరంబు తూపుతోఁ
జని గగనంబుదాఁకి పడఁ • జయ్యన గ్రద్దలు కాకులుం దినం
గనియెదుగాక కంబువులఁ • గంబులతో నెదిరింపఁ బోలునే?
దనుజుల గెల్వవచ్చినది తక్కక యెవ్వరితో నెఱుంగవే?

మ॥ తలఁపఁగ రుద్రుఁడో చక్రపాణియొ సుమి • త్రానూనుఁడో కాక యి
య్యల నెవ్వా రతికాయుఁగూల్పఁగలవా • రెన్నంగ వేవేల సే

సలు దైత్యాసురులతోడ రాఁ బడిపె నిం • కం జంపువాఁ డీతఁడే
గెలుపుం గాంచెడు వాఁడు సితఁడగు శం • కింపంగ నీకేటికిన్ ॥

తే॥ కదలుమన రాఘవునకు ల • క్ష్మణుఁడు మ్రొక్కి. దీవనలుగొని తనతోడ • ధీరులైన
కపివరులు విభీషణుఁడును • కదఁర నడవఁ, గదలి యతికాయుఁడున్న రం • గంబుఁజేరె.

తే॥ దక్షిణపయోధిమీఁది దు • త్తరపయోధి. వచ్చి చొచ్చినతీరునఁ • బ్లవగ సేన
మోహరించిన సో.కుల • మొగ్గ:మును. చీల్చుకొని చొచ్చి యురవడిం • జెంగలించె.

తే॥ వచ్చినెత్రుచేఁ దేహమై • పంకమైన. తలము సింహనాదమ్ములు • చెలఁగ రేఁగు
సైన్యఘట్టన దుక్కియై • నరగలేము. రజమునింగి నెట్టినచేసి • ప్రబ్బుకొనియె.

తే॥ శంక కాహళ దుందుభి • స్వనము లెల్ల. వీర సింహనాదములతోఁ • జేరి యవల
శింజినీధ్వనితోడను • చెలఁగి జలధి. నోరుమూసికొనఁగఁజేసె • ఘోర కలఁగి.

ఆ॥ రక్కసులు నశింప • రక్తంబు సెలయేళ్ళ, మాడ్కిఁ బఱవ నాకు • మ్రాఁకులట్లు
కేతనములు త్రుంగఁ • గీఱుల కొండల. నెక్కుపోల్కిఁగరుల • నెక్కినారు.

తే॥ శాఖలనెడు దంతమ్ములు • క్షౌద్రమనెడు. మదజలంబును విలసిల్లు • క్ష్మాధరంబు
లనెడు నేన్గుల వైవఁగ • హస్తిహస్తి. పోరు చందమై మదకరుల్ • పుడమిఁగూలె.

తే॥ గట్టిగాఁబట్టెఁ బొడిచెను • కఱచెరక్కెఁ, ద్రుంచెఁ గపినికాయంబులు • తురగములను
రక్తపూరంబులో మెదల్ • వ్రాలఁ గాళ్ల. పైకిఁదిరుగఁ దన్నుకొనుచుఁ • బడియె హరుల

తే॥ వనచరాఖేటమున మద • వారణములు. వాత్యచేఁ దూలు వారిద • పంక్తులట్లు
తూలిప్రీలిన దంత సం • దోహమందు. ముత్యములు పటపట రాలి • పుడమిఁ జెదరె.

తే॥ వజ్రపుం గంబములఁబోలు • పాదహతులఁ, గేలఁ గాలపాశముఁబోలు • వాలహతుల
దానవగణంబు లురలెను • తత్కఠోర. కుంతఘాతంబులం గపి • కులము దొరలె.

తే॥ చేతులకుఁ జిక్కుమ్రాఁకులు • శిలలుపాము. లేనుఁగులు గుఱ్ఱములుగద • లీఁటెలు రథ
శకలములు విసరుటచేత • సాంద్రమగుచుఁ. బరవెఁ గాంతారమట్లు పై • భాగమెల్ల.

క॥ వనచరవీరులు వైచిన. పెనుగిరితరు లంబరమునఁ • బెల్లుచెవన రా
శిని దిగు మొగుళుల వడువున. దనుజబలముమీఁదఁబడి స • దమదము సేసెఁ.

తే॥ పాటి యీవలావలకును • జాటిపడిన. పాఱుఁబోతు రాకాసుల • పరశు ఖడ్గ
ముద్గరాదిసాధనముల • మురియఁజేసి. రుధిరపూరంబులం బడఁ • ద్రోచినారు.

తే॥ వీరులగు వానరులు రక్త • పూరమందు. యీఁదులాడుచుఁ దిప్పలై • యెలయుకరుల
నెక్కి రవియు నీద్వఁగఁబడి • యేటితేనిఁ, జేరి దరిగానలేక గా • సిల్లినారు.

తే॥ కాళ్ళు విఱవనీకీడ్చు ర • క్తప్రవాహ. మందు పొదుగుకోలల నూని • కొందఱేగ
వారిశోఁకలఁ దక్కిన • వనచరాళి. పట్టికొని యీఁదు చవ్వలి • పట్టుచేరె.

తే॥ సోఁకులను విజృంభించి మ • సుండి శూల, ముద్గరాదుల మోఁదంగ • మొగపు దక్కి
దిక్కులకుఁ బాఱ నడిగని • లక్ష్మణుఁడు, కనలుగొని వారి కుత్సాహ • గరిమఁ గూర్ప.

క॥ జము నుద్యోగంబునకుం, దమయత్నమ్మునకుఁదోఁడు • తనరిన తన చా
పము గుణమును బలువిడి లా, గి మహారావంబు లేపెఁ • గీడ్పడ జగముల్.

తే॥ పంచభూతముల్ తమ తొలి • ప్రకృతియందు, లీనమైనను బ్రహ్మయో • గ్గినను విలయ
కాలమందును నాశంబు • గానకుండు. ప్రణవముంబోలె నాధ్వని • పరిఢవిల్లె.

తే॥ వాఁడితూపులువిడువంగఁ • బడియెఁ బడిన, యమ్ములసురుల పెనుమేను • లందుమటిఁగెఁ
గుణపములు సందులేకుండఁ • గుప్పలుపడె, వానినుండి రక్తముపాటి • వార్ధిఁజేరె.

తే॥ కరుల కరముల ఖరువుల, కాళ్ళద్రెంచి, రథిక శిరములఁ ద్రుంచి వ • ర్గముల పెంచి
వివిధచిత్ర రూపంబులు • వెలయఁజేసె, లక్ష్మణాస్త్రముల్ విధిపోల్కి లాఘవమున.

తే॥ విండ్లు తుండించి శక్తుల • విఱుగఁ గొట్టి, గవచములఁ జీల్చి విపుల వ • క్షములఁ దొల్చి
గుజ్జముల వ్రాల్చి కేరులఁ • గూల్చిఁ యేనుఁ, గులను పీనుఁగులం జేసి • కోల లడరె.

తే॥ దంతిదంతముల్ తెగి నభోం • తరముచేరి, విదియచంద్రుల పగిదిని • వెలయుచుండెఁ
గరములూడినయవి రక్త • శరధినుండి, భూమిఁ బైకెత్తెడు వరాహ • మూర్తినెనసె.

తే॥ రెండు నెల రేకలను నోటఁ • ద్రెంచికొనుచుఁ, గుండలములను రిక్కల • గుంపుతోడ
గగనమండలమే దిగు • కరణిఁ దోఁచె, రక్కసుల తలల్ వడఁగ ధ • రాతలమున.

తే॥ రథికబృందంబు మరణింప • రథములరలి, పడియెఁ బదవి చెడం గర్మ • ఫలముచేత
మింటనుండి యొడ్డగిలంగ • మంటఁజాఱి, పడు విమాన సమూహంబు • పగిదిఁదోఁప.

తే॥ వీడఁగారాని సుఖదుఃఖ • వితతిఁద్రెంచి, యమరలోకంబు గైకొంటి • మని తలంచి
యధిక కౌతుకంబున నొడ • ల్లాడె ననఁగి, నట్టలాడెను రణభూమి • నిట్టలముగ.

తే॥ ఒక్కపదివేలు మరణింప • నొక కబంధ, మూడుగను శాస్త్రసూక్తి న • త్యంబమైన
నాఁడు కోటికి నెక్కుడై • నర్తనంబు, చేసె సౌమిత్రి చాతురి • చెప్పఁదరమె?

క॥ కరి భట తురగాదుల నె, త్తురు సెలయేళ్ళట్లుపాఱి • తోయధిఁజొచ్చెన్
అఱవఱలై యఱిముఱియై, పఱిపఱియై యున్న పరియుఁ • బలుచంబాఱెన్.

సీ॥ గొలుసులలోఁ దగు • ల్కొన్న కాళలతో ద్వి, పమ్ములఁదోలు క • బంధవితతి
తురగంబులు నటింప • నొరలక వానిపై, తీవినర్తించు మొం • డెముల గుంపు
తలలూడినను గుఱి • తప్పక యెప్పటిఁ, బ్రదరంబులను వీడు • రథిక చయము
పరుగులెత్తుచునుండ • శిరములు తెగిపోవఁ, బరుగు పీడని వీర • భటకులంబు

తే॥ సీత పేరిటిమృత్యువుఁ • జెడఁగఁగోరి, తెచ్చుకొన్న దైత్యులు తండ్రి • తెరలఁగొడుకు
మడియ నల్లుండు గూల హ • న్మందుచావ, నన్నదమ్ము లురలఁ • దాము నడఁగినారు.

క॥ శరములఁ దునుఁగుచుఁ ద్రుళ్ళెడు, శిరములఁ గవ్వికొనిపోవఁ • జేరినగ్రద్దల్
చర్గణాయుధములపోల్కిఁ, జరియించెం గొంచుఁబోవ • సాధ్యములేమిన్.

క॥ వేలై కోట్లై యగ్ని, జ్వాలయుమయు లక్ష్మణాఖ్య • శర సంచయ మా
భీలంబై పడుచుండఁగఁ, గాలభటుల రిపుడు వొడమెఁ • గాఁకల తీపుల్
క॥ మేరువుఁ గదలింపంగల, పిడుగులు జ్వాల దస్త్రములను • విగత ఘన తిసూ
భారులయి దివికి దుముకఁగ, వారలఁ గని పొంటినారు • ప్రమదంబు సురల్
సీ॥ దారుకుండనువాఁడు • దర్పించి తేటి పో, లించి లక్ష్మణు నెది • రించి నిలిచి
శరవృష్టి గురిసి యం • బరమెల్లఁ గప్పిన, వాని నన్నింటి నె • ప్వడిగఁ ద్రుంచి
సౌమిత్రి ఘోర ని • శాత శరంబున, వాని శిరము ద్రెంచి • వసుధఁ గూల్చె
కాలుండు కులిశుండు • కాలజంఘుఁడు మరు, త్తుండు మాలియను నైదుగురు రేఁగి
తే॥ పాశ శూల పరశు భిండి • పాల ముసల, ముద్గరాదుల వైప నా • పురుషపుంగ
వుండు వానినన్నిటిఁ దెగఁ • జెండి వారి, తలల నొక్కొక్క యమ్ముచేఁ • దఱిఁగివైచె.
సీ॥ అదిగని రోషించి • యతికాయు సేనాధి, పతులు వారణ కదం • బంబు రేఁచి
పరిగొని కైదువుల్ • పఱపి వానరతతి, నటునిటు పోనీక • యాఁచి నలఁప
వనచరుల్ చేతి క • ట్టెలవానిఁ గొని వైవఁ, దొలసుదిండులు లోనఁ • దూఁడినారు
సౌమిత్రి శరములు • సారంగ యూథంబు, నవలికిఁ జననీక • యలఁచి కొట్ట
తే॥ నంగములు పెక్కుతుండ్లుగాఁ • ద్రుంగిపడఁగఁ, జదికిలంబడెనొక కొన్ని • వచ్చెఁ గొన్ని
దిరిగె గిఱ్ఱునఁ గొన్ని మ • స్తిష్కపంక, మంద యొఱవలుగాఁ గూలి • యడఁగెఁ గొన్ని.
తే॥ ఒక్కతొడుగున వెడలు మ • హోగ్రశరము, లొక్కపెట్ట సామజముల • నుర్విఁ గూల్చె
మావతుల జేల్చెఁ జౌదోఁకు • మహిని దుల్చె, రక్షకుల మాల్చె బంట్ల వీ • రముల వ్రాల్చె.
తే॥ కైదువులు విఱిగెను యోధ • గణము తఱిఁగె, కంకగృధ్రజంబుకముల • కఱవు దీఱె
మావటీంద్రఁ గోల్పోయిన • మదగజములు, కలఁగి యొండొంటితోఁ బోరు • సలుపసాగె.

ఉ॥ కొన్నిటి పాదముల్ తునుఁగఁ • గొన్నిటి తుండము లైదు తుండ్లుగాఁ
గొన్నిటి వాలముల్ తెగఁగఁ • గొన్నిటి ప్రేవులు జాఱఁ గన్నులం
గొన్నిటి కీఁగఁ గొన్నిటికిఁ • గ్రొవ్వు దిగంబడ వచ్చు దంతులు
గ్రన్ననఁ జచ్చుదంతులను • గా బహు భీకరమయ్యెఁ జూడఁగన్.

తే॥ కరిఘటలు గూలుచుండ రా • క్షసబలమ్ము, లించుకయుఁ బయిలోఁ దక • యెదములేక
యాయుధంబుల వైచుచు • హస్తివితతి, ననువుగా నడ్డుగొనిపోరె • నగ్గలించి
తే॥ శరదములు భాస్కరుని గప్పు • చందమొంది, సామజంబులు లక్ష్మణు • సరవి ముట్టె
శక్రధనువుఁ బోలిన శరా • సనమునుండి, యతఁడు కురియించె బెడిదంపు • టంపవాన.
సీ॥ మోములు చీల వీఁ • పులు వ్రీలఁ దుండముల్, పఱియలై ధారణిఁ • బడియెఁ గొన్ని
పొరలుచు దొరలుచుఁ • జెరలుచు ఘీంకృతుల్, నెఱపుచు ధాత్రి పై • దెరలెఁ గొన్ని
అర్ధచంద్రాస్త్రంబు • లలమిన ఫాల భా, గములతో మేదినిఁ • గడచెఁ గొన్ని
వవధిలోఁ బడెఁ గొన్ని • వనమునఁ బడెఁ గొన్ని, పర్వతముల మీఁదఁ • బడియెఁ గొన్ని

తే॥ ఘోరశరములు కన్నుల • గ్రువ్వ స్వపర, భేదమెఱుఁగక తమవారి • విఱిచె గొన్ని
లక్ష్మణుఁడు దంతులంగూల్చు • లక్ష్యశుద్ధి, లాఘవము వేల్పులకును తె • ల్పంగఁగాదు.

తే॥ ఏనుఁగుల కళేబరముల • నెసఁగు నెత్రు, టేఱు లాపీన్గు తిప్పల • మీఱలేక
కరులవీరులఁ దేరుల • హరుల నెల్లఁ, ద్రోచికొనిపోయె నిలువక • తోయనిధికి.

తే॥ లక్ష్మణాస్త్ర చయంబుచే • లక్ష కరులు, గడియలోఁ గూలఁ దెలిసి లం • కా విభుండు
మిగిలియుండిన కోటి యే • నుగులఁ బంపె, నతనిమీఁదికి నీరస • మతిశయింప.

తే॥ ప్రాణములతోడఁ ద్రాణయు • నధికమదము, గలవి యగు సామజంబులు • కవిసియతని
మీఁది కుఱికిన దొకటియు • మిగులలేదు, డాయఁగాలేదు డాసియుఁ • బాయలేదు.

తే॥ ముప్పదాఱు యోజనములు • పొలసివచ్చు, కరిఘటలు రాఁగ లోకంబు • గజమయంబ
యయ్యెనని వేల్పులనిరి వి • హాయసంబు, ధూళిమయమయ్యె భూమి ని • ర్ధూళియయ్యె.

తే॥ శాకినీ ఢాకినీ భూత • సంచయంబు, తుదియు మొదలును గనరాని • మదగజేంద్ర
రాశిఁ గని మునుమిడక తూ • ఱంగ దొరకు, వానిఁగొనిపోయెఁ గొండల • పగిది మోచి.

క॥ ఒకశరమున కొక కరి లె, క్కకురాఁ బదివేల కరులఁ • గడిమిం ద్రుంపన్
గిరు లదరె మొగుల వడలెను, శరనిధులుం గలఁగె దిగ్గ • జములును వడఁకెన్.

తే॥ గుణ రవములేచెఁ బర్వత • గుహాలయందు, నిదుర నెందు సింగంబుల • యెదలు గలఁగఁ
బిడుగు లదరిన వడవున • విశిఖవితతి, పడియె వేదండ తండ కుం • భంబు లగల.

శా॥ ఆవేశన్ దనుజేంద్ర నందనుని సై • న్యంబెల్ల నొక్కుమ్మడిన్
వేవే కేకలువెట్టుచున్ మిగులు కుం • భివ్రాతమున్ రేఁప రా
ద్రావేశంబునఁగాంచి వీరవిహృతి • వ్యాపార లోలాత్మకుం
డై వచ్చెన్ వయిశంబ కేసరి సుతుం • డా లక్ష్మణాస్త్రంబనన్.

మ॥ నరసింహుం డితఁడంచు గాంచిన సురల్ • నక్తంచరుల్ భీతిలన్
హర కోదండ విభంజ నాంఘ్రియుగమున్ • హత్తించి చిత్తంబునన్
హరిదండంబును బోని తాళవిటపిన్ • హస్తంబునం దాల్చి హుం
కరణం బొప్పఁగ జేసె దానవుల కు • త్కంపంబు నిండారఁగన్.

మ॥ యముఁడున్ భూతములున్ మొగుళ్ళు నొకరూ • పై వచ్చెనా నొప్పి శై
లములం గూల్పఁగ వాలు వజ్రమును లీ • లన్ వాలి సంహార కా
లమునన్ రేఁగెడు రుద్రుమాడ్కి రిపు వి • క్రాంతి క్రమాభీలుఁడై
చమరెన్ గాలను గేలఁ దాళమున నా • సారంగ యూథంబులన్.

సీ॥ త్రొక్కుటచేఁ గొన్ని • యక్కుటచేఁ గొన్ని, కాలనుగొన్ని మోఁ • కాలఁగొన్ని
వాలమ్మునం గొన్ని • తాలమ్మునంగొన్ని, ఫాలమ్మునంగొన్ని • కేలఁ గొన్ని
నలఁచి కొన్నింటిని • మలఁచి కొన్నింటిని, విఱిచి కొన్నింటిని • కఱచి కొన్ని
యీడ్చి కొన్నింటిఁ దో • లూడ్చి కొన్నింటివే, చీల్చికొన్నింటి మై • నుల్చికొన్ని

తే॥ త్రుంచికొన్ని పంచుచుఁగొన్ని • ద్రుంచికొన్ని, యొక్కటొక్కటిపై నేసి • యొక్కకొన్ని
హుంకృతింగొన్ని సమయించి • యుత్సహించెఁ • గేసరిసుతాఖ్య సార్థక • మై సనంగ.

తే॥ నేలకుం దాఁచికొన్ని వా • ర్నిధినిగొన్ని. లంకలోఁగొన్ని దెసలకుఁ గ్రుంకఁగొన్ని
ద్రేపుద్రోపు లురలఁగొన్ని • ద్రిప్పికొన్ని. పదమదముసేసి యెన రేఁగె • శ్వసనసుతుఁడు.

తే॥ వాలమునుకొండ చిలుప నా • వంచుపంచి. మావటీంద్రతోఁగరుల నం • బరము సేర్చు
విలయకాల రుద్రుండను • పేఁకఁ దనరి. శవమయముచేసె నా రణ • స్థలముఁ ద్రుటిని.

తే॥ కలఁచిమాంసమేదోస్రపం • కంబునందు. పెక్కుగజములఁగడిమిమైఁ • ద్రొక్కివైచె
మిగత తన భాగమనుచు సౌ • మిత్రి వాని. ఘోరసాయక రాజిచేఁ • గొందివైచె.

తే॥ అన్ని దెసల నేస్తులు పీస్తు • లగుచు సురలఁ. జిక్కి రక్కసుల్ స్రుక్కిరి • స్రుక్కకుండు
వార లిఱుకుకొనిరి తక్క • వారు వెన్ను. చూపుచును చూచుచును పాఱఁ • జొచ్చినారు.

## దేవాంతకుండు హనుమచేఁ గూలుట

తే॥ అసురులట్లొటఁ గన్న దే • వాంతకుండు, తేరుఁ దోలించి కిన్కమై • మారుతిపయి
వాఁడి యమ్ము లురమ్మునఁ • గాఁడనేసి, సింహనాదంబు దనుజులు • చెలఁగఁజేసె

క॥ పావని యొకతరువుంగొని, వైవఁగ నసురుండు దానిఁ • బఱియ లొనర్చన్
దీవరముగ మఱియొక గిరి, పైవ నతఁడు దాని నడుమ • భగ్నము సేసెన్

తే॥ గరుడుపాడ్కినదాటున • నదరమునకు, దాఁటి మారుతి దైత్యుని • ధనువు నూడఁ
దీసికొని రెండుగాఁగ భే • దింప వాఁడు, మరల హనుమని గొట్టెఁదో • మరముతోడ.

తే॥ తివిరి యనుమఁ దొడిసి పట్టి • త్రిప్పివైవ, దానిచే సారథియుఁ దేరు • ధరణిదొరలె
యవల శూలంబుఁగొన్న దే • వాంతకు శిర, మూడఁబెఱికివైచెను కపు • లుల్లసిల్ల.

చ॥ అది తన కన్నులారఁగని • యా యతికాయుఁడు రౌద్రదృష్టితో
నదలిచి తేరుదోలుమని • యాముస మారుఁతిఁదాఁకె సేనలున్
జెదరినవెల్ల నిల్కడను • చెంది పదంపడి వచ్చె దైత్యుఁడుం
బదరుచు నాంజనేయుఁగని • పల్కె బయోధర భీషణధ్వనిన్.

మ॥ అసమాన ప్రతివీర నిర్మథన బా • హా దణ్డ మా యజ్ఞ ని
వ్వసుధన్ రాచి పయోధిదాఁటి చని నీ • ప్రాణంబు దక్కించుకొం
టి సమిద్ఘోరతలంబునన్ గడిమిమై • డీకొన్న దేవాంతకున్
వెసఁ దున్మాడితి వద్దిగాంచి యని గా • వింపంగ విచ్చేసితిన్.

శా॥ నేఁడే మృత్యువు దాపరించె వినుమా • నీపాలికిన్ నిక్కమీ
నాఁడే పూని వధింపకున్న మఱి యే • నాఁడున్ సమీపింపఁ బె
క్కేడాగోడము లాచరించితివి ని • న్నేడాటలాడింపకే
వీడంజాలను పాఱిపోక నిలుమా • వీరుండవే యైనచో,

ఉ॥ మేరు సమాన ధీరుడు స • మీరసుతుం డతికాయు వార్తకుం
గేరుచు నవ్వి వీరుఁడవు • క్రించుఁదనంబు లిఁకేల • నాయెడన్
గ్రూరత చూపఁగాఁ ద్రిశిరుఁ • గూడ సహాయత గోరుకొమ్ము నీ
యారసముల్ ఫలింపవని • యెల్లిదమాడఁ ద్రిశీర్షుఁడున్ వడిన్.

చ॥ తెరలక నిల్వుమం చడుగు • దెంచి రమత్తుఁదాఁక నాతఁడున్
దురమొనరింప మీరె వలఁ • తుల్ వెడఁగుల్ చపలాత్మలంచు సం
బరముగఁ బల్కి దానవుల • పాలి యముండగు వాయుసూతి భీ
కరగతి వచ్చెఁ దానరుగు • గాలికి వారల నాల్క లెండఁగన్.

ఆ॥ వచ్చి వాని తేరి • పైకి లంఘించి చే. వమెయి వానిఁబట్టి • వసుధఁద్రోచి
కాలరాచి ప్రతిన • పాలించి పడమటి, గవనుచేరె సేనఁ • గాచుకొఱకు.

మ॥ త్రుటిలో దాఁటె నిఁకేమిచేయనగు నీ • దుష్టాత్మ నంచార్త సం
కటుఁడై యయ్యతి కాయుఁ డస్త్రవులు వే • కాఱంగ నిశ్చేష్టుఁడై
కటముల్ కేలువడంక నిల్చి యితఁడు • గ్రక్రోధుఁడై నిల్వఁగా
నిటలాక్షుండు నెదుర్ప జాలఁడని ని • ర్ణీతిం బ్రశంసించుచున్.

మ॥ ఒకకార్యంబును పూని వేఁడెఁ దెదన్ • యోచించుచున్ నిల్కఁగా
ళ్ళకు మేల్చిన్నియగాదు లక్ష్మణు నన • ల్ప స్థైర్య శౌర్యాదులం
బ్రకటోగ్రాజిని గానఁగోరి యిటు లొ • ప్పన్ వచ్చితిం దేరు ని
ల్పక పోనిమ్మని తూణయుగ్మ మొకతే • వన్ దిద్దుచుం గ్రన్ననన్.

## అతికాయుఁడు లక్ష్మణుచేఁ గూలుట

శా॥ నేమిధ్వానము వార్ధి ఘోషమును గ్రే • ఱింపన్ ధనుర్నాదముల్
జీమూతధ్వనిఁ గ్రిందు సేయ దెసలుం • జేవ్రాటుగా శంఖ భే
రీముఖ్యస్వన మొత్తరింప బంధా • త్రి న్నిల్పు నక్తంచరున్
భీమప్రోద్ధతి లక్ష్మణుండు చెనకెన్ • వేల్పుల్ ప్రశంసింపఁగన్.

తే॥ త్వరితగతి వాసి వాలి పు • త్త్రకుఁడు దనుజుఁ, దరపమున నుండ నిల నిల్చి • టనువుగాదు
క్రించుఁదన మైన నాపైర • హించి యెక్కి, మనుచు వేఁడఁగ సౌమిత్రి • యనుమతించి

తే॥ వానిభుజములపైఁ దన • పదములుంచి, యెక్కినిల్చె; వెన్నుని మోయు • నెక్కిరింత
యీడితనికంచు వేలుపు • లిచ్చ మెచ్చి, విరులు కురియించి పొగడి దీ • వించినారు.

తే॥ వాలికొడుకు పెందేరేగు • వలని కేగుఁ, బెరుఁగఁ బెరుఁగు వింటికి నేగ • వింటికేగు
నడఁగ నడఁగు నెల్లేగిన • నట్టు లేగుఁ, బ్రభుని హృదయం బెఱింగి త • త్పద్ధతిఁ జను.

తే॥ అంగదుని నేర్పుఁగని వాన • రాధిపతులు, సంతసించియార్చిరి సమ • త్సాహ మెసఁగ
కరిఘటలమీఁద రథ తురం • గముల మీఁదఁ, గురిసె లక్ష్మణసాయక • కుంభవృష్టి.

తే॥ మురజములు మ్రోసెరథనేమి • మ్రోఁగెఁ దురగ, హేషలెసలారె శింజినీ • ఘోషమడరె
కరుల ఘీంకృతుల్ హెచ్చెశం • ఖములు మొరసెఁ, గ్రందెఁ దర్జన భర్జన • గర్జనములు.

ఉ॥ కూలెను వారణంబులును • కూలె రథంబులు కూలె నశ్వముల్
కూలెను కాల్బలంబులును • కుప్పలు తిప్పలుగాఁగఁ గాలుఁడున్
సోలెను తద్రణస్థలిని • చూడఁగలేక సుమిత్రపట్టి దృ
గ్జాలము పోవుచోటులరు • సాయకబృందము పోయి నాటఁగన్.

మ॥ అతికాయుం గని లక్ష్మణుండనియె వి • ల్లమ్ముల్ ధగంబూని ద
ర్పితబుద్ధిన్ సమరంబు సేయ నిటకున్ • వేవచ్చి యిట్లుంటకున్
గత మేదో తెలిపింపుమా యొకఁడవై • కయ్యంబు గావించెదో?
పృతనావారము గూడఁ దంత్రి పగిదిన్ • భీతుండవై పాటెదో?

మ॥ అన ధీరుం డతికాయుఁ డిట్టులను సై • న్యంబెల్ల నాకేల? నీ
వును నేనే యని సేయువార మిట పే • ల్పల్ తెక్కువారున్ రణం
బును వీక్షించుచునుండ నాకడిమి పెం • పున్ సొంపు శోభిల్లఁగా
నిను గూల్పంగలవాఁడ నందులకెగా • నేఁడిట్లు పిల్పించుటల్?

ఉ॥ రాముఁడె కావనిమ్ము రిపు • రద్విషుఁడే నిను కావనిమ్ము సు
త్రాముఁడె కావనిమ్ము సిరి • రాయనితోడుగ లోకసప్తకం
బో మగనిమ్ము నీయసువు • లుద్గతి నొందును నేఁడు ఘోర సం
గ్రామమునందు నిల్వమని • గర్వమయుండయి యొత్తె శంఖమున్

చ॥ అదివిని లక్ష్మణుండు దర • హాసము చేయుచు నీవు పల్కు బె
ట్టిదు లిటరారు గెల్చినను • డింపక నేనొకరుండనే చుమీ
పదరక నన్ను గెల్వఁ దెర • వారల గెల్చినవాఁడవౌదు నా
యెదురను నిల్వుము చూడు మ • హేషువు వక్షము నాటనేయఁగన్

చ॥ ఎదురయియున్న కాలుసకు • వేగ గుణంబు దగిల్చి దైత్యుఁ డా
ప్రదరము నంతరంబుననె • వ్రయ్యలుచేసి సహించి కాచుకొ
మ్మదరక యంచుఁ గ్రూర గర • ళాగ్నులు గ్రక్కు శిలీముఖంబులన్
బదియును నూఱుగాఁగఁ దన • వారలు సంతసమంద నేయుడున్.

తే॥ వాని శరముల నడుమనే • వ్రక్కలించి, లక్ష్మణుండేసె నాఱుకో • లలఁ గుబేరు
నోర్చి వెలసిన యతికాయుఁ • డుగ్రుఁడగుచు, నన్నితూపులతో వాని • నడఁచివైచె.

మ॥ పురుషశ్రేష్ఠుఁడు లక్ష్మణుండు గుణ మా • పూర్ణంబుగా లాగి రౌ
ద్ర రసావేశము మీఱి తోఁపఁ బదినా • రాచంబులం జొన్పి మై
మఱువుం జించి నిశాతసాయకములన్ • మైసోలఁగానేసి య
త్తఱిఁ దక్షీవల రూపుమాపె నొకఁడుం • దక్కంగ నీకుర్వడిన్.

ఉ॥ వెంటనె తేఱివాఁడు తన • వీరకదంబము రూపుమాయుటన్
గంటికి బర్వ్వఁగాంగ నెడ • గానక యమ్ములు పర్వి నిండుటల్
మంటలు గ్రక్కఁ గాంచి బహు • మాత్రముగా శరవృష్టి ముంచి ము
క్కంటి యుగాంతవేళ నెస • కంబుగ నేచినమాడ్కిఁ రేఁగఁగన్.

ఉ॥ ఆకసమెల్ల నమ్ములు ది • గంతము లమ్ములు భూమినమ్ము ల
మ్మూఁకలమేన నమ్ములు స • ముత్కటమై యెటఁజూడ నమ్ము ల
స్తోకముగాఁగ నిండి వడిఁ • గ్రోవఁగ సాగెఁ బరస్పరంబు ని
శ్శ్రీః ములయ్యె నగ్ను లద • రెన్ గగనంబు ధరిత్రి శైలముల్.

చ॥ మునిఁగిన తోకఁమూఁక తుది • ముట్టకయే తలయెత్తనేర్చునే?
కినిసిన లక్ష్మణుం డితని • గెల్చునె? యీయతికాయుఁ డంత్యకా
లునికడ నేర్చెనో కొల సి • లుంగులు కూర్చుట? వీని నేర్పు నే
మనఁదగు? నంచు భీతిలి వి • యచ్చరు లేగిరి దవ్వు దవ్వుగన్.

ఉ॥ అంగదు బాహులందు మెడ • యందును వక్షమునందు నంప పిం
జం గటి గానరా బహుళ • సాయకముల్ పడి నాటి లక్ష్మణున్
ముంగలి గాననీక శర • ముల్ నిగిడించి దరంబునొత్తి మిం
టంగల వేల్పుమూఁకలు వ • డంక నొనర్చె మృగేంద్ర నాదమున్.

తే॥ సెల యనంగ నంగదుమేన • సెలలు గ్రుచ్చి, సెలయుటలు లక్ష్మణుండు వీ • క్షించి రౌద్ర
మూర్తియై శరవర్షంబు • ముసర వాని, ధనువు విఱిచి సారథిని ర • థ్యములఁ జంపె.

ఉ॥ వేఱొక తేరిపై కుఱికి • వేఱొకవిల్లు ధరించి తాఁకు నా
కారి కుమారుపై రఘు వ • రానుజుఁ డగ్నిశరంబు వేయఁగా
మాఱుగఁ గర్బురుం డనల • మార్గణమేసి సహించుకొమ్ము పొం
గాఱఁగనీయకంపు దుర • హంకృతి నార్చెఁ గపు ల్గలంగఁగన్.

ఉ॥ హెచ్చును కుంద గానఁబడ • నీయక రెండును పోరుచుండఁగా
హెచ్చిన లక్ష్మణాస్త్రము ల • హీనజవంబున దైత్యు వక్షముం
గ్రుచ్చుచు వీఁపునవ్వెడలఁ • గుస్య దుదంచిత సింహమో యనన్
రెచ్చి సురారియున్ దిటవు • ప్రీలక మాఱొనరించెఁ జేపమై.

చ॥ మఱియును లక్ష్మణుండు శిత • మార్గణముల్ పెసనేసి వాని ముం
దఱ గలవారి వెన్కఁగల • దైత్యులు చూడఁగదగ్గయట్లు చిం
దఱలుగఁ జేయఁగా నసుర • ధైర్యము వీడక బాణవర్షముం
గురియుచునుండె వానరుల • కూటము దగ్గఱఁ జెంగకుండఁగన్.

॥ అపరిమితముగాఁగ • నస్త్రంబులను వారి, విడుచు రాముతమ్ముఁ • వీసులకతఁ
జేరి వీని శమనుఁ • జేర్పుము బ్రహ్మాస్త్ర, మునన యనుచు ననిలుఁ • డవిమె నల్ల

తే॥ మంచిదని సంతసించి ల • క్ష్మణుఁడు కడఁగి, తొడిగి మంత్రపూర్వకముగ • ద్రుహిణశరము
నేయ నది యుగ్రుఁడగునతి • కాయు శిరము. మింటఁగొనిపోయె నంతకు • నింటికడకు

క॥ శిష్టములు తొలఁగెనని సుర, లిష్టంబున విరులు గురిసి • యెసఁగిరి చింతన్
దుష్టులు దైత్యులు పాఱిరి. శిష్టులుఁ గీశవరు లుల్ల • సిల్లిరి మిగులన్

చ॥ జయము గడించి లక్ష్మణుఁడు • సమ్మతి నంగదునుండి క్రిందికిన్
రయమున డిగ్గె నాతని ప • రాక్రమలాభముఁ గాంచినట్టి ప్ర
త్యయమున నింద్రజిత్తు నిఁకఁ • దప్పక నాశమునొందు నన్న ని
శ్చయమున నవ్విభీషణుఁడు • చాలఁ బ్రశంస యొనర్చె నయ్యెడన్.

## నరాంతకుఁ డంగదుచేఁ జచ్చుట

ఉ॥ సుందరవక్షుఁడైన సుర • సూదన పుత్త్రకుఁ డీల్గెనంచు నీ
చందన గంధిలంబగు వి • శాల సువక్షముఁ జూచికొంచు వి
ల్లందముగాంచి పొంగుచు న • యంబున నెచ్చటికేగెదింక నీ
యందము చంపము న్నిలువ • వంచు నరాంతకుఁ డగ్గలించుచున్.

చ॥ మిడుగులు లక్షలఁదు మిఱు • మిట్టులు గొల్పుచు రాలఁ గిన్కయుం
దొడిఁబడి లేప ధారజికి • దూఁకి నరాజియు ఖేటకంబుఁ బెం
పడరఁగఁ దాల్చిరాఁ గవ ల • గొఘము వ్యోమము గప్పవైవఁ బు
ప్పొడివలె చూదిపింజలటు • పోఁడిమిఁ దూల్చుచు డాయవచ్చినన్

చ॥ కని యొక వృక్షరాజముఁ బె • కల్చి కరంబునఁ బూని వాలి నం
దనుఁ డెసరేఁగి రామ విభు • దారుణ సాయకమట్లు తాఁకెఁ దాఁ
కిన క్షణమంచె యంగదుని • కేలధరించిన వృక్షముఖ సరా
లునఁ దెగినేసె నొక్కత్రుటి • లోనఁ బరుల్ గనలేని నెవ్వడిన్.

తే॥ అంత రిక్తహస్తుండయి • యంగదుఁడు, వెనుక కేగుట పాడికా • దని తలంచి
పైకి లంఘించి చేరిచి • పట్టె వాని, కాలు గేలడిదంబును • కదలనీక.

ఉ॥ పట్టిసవాని సాహసము • పట్టుగ వేల్పులు కాంచి చేతులం
దట్టుచు నార్చి రంగదుఁడు • దారుణముష్టి వధింపకే వెసం
బట్టెము లాగి కొంచుఁ దెగ • వాఁడఁగ దేహము నిట్ట నిల్వునం
బట్టుగఁ జీల్చివై చెఁ గను • పట్ట సురారులు విహ్వలింపఁగన్.

## ఉన్మత్తుఁడు నీలునిచేఁ గూలుట

తే॥ పిడుగులనె మ్రోంగఁజాలిన • బెట్టిదుండు, పేర నున్మత్తుఁడను వాఁడు • పెలుచరేఁగి
తప్పఁద్రావి యుమ్మెతదిన్న • మెప్పె పగిది, మత్తుఁడై మత్తకరి నెక్కి • యొత్తరించె.

సీ॥ గాలిగాకున్న నీ • లీల వేగమ దేడ ?, జలధి గాకున్న నీ • శబ్దమేడ ?
శమనుండె గాకున్న • జనహింస యెటులగుఁ ?, పిడుగు గాకున్న నీ • చెడుగుగలదె ?
కోపమేరూపు గైకొనక యీ వడియేడ ?, జలదంబుఁ గాకున్న • స్తనిత మేడ ?
అల గజాసురుఁడె గాఁ • దైన భీకర మేడ ? నడగొండగాకున్న • నడచుటేడ ?

తే॥ అనుచుఁ గనుగొన్న వానరు • లడలి బడలి, జడిసి బెడిసి పడుచు లేచి • కదల దాఁకఁ
బరుగువారల విజృంభించి • తరుగఁ దొడఁగె, మత్తుఁ డున్మత్తుఁ డెక్కిన • మదగజంబు.

తే॥ వానరులువైచు పర్వత • పంక్తులెల్ల, మావఁతుల యొడి సెలలకు • మాఱుగావు
కపులువైచు పెండరుపు లీఁ • గలను దోలఁ, బనికిరావయ్యెఁ జెరకుగాఁ • బనికివచ్చె.

సీ॥ కాళ్ళక్రిందంబడి • కనకసమైనవి, వాలంపువ్రేటున • నీలిగినవి
తుండంపు విసరునఁ • గొండలఁబడినవి, కొమ్ముల క్రుమ్మునఁ • గూలినవియు
నై మలమనుకులు • సౌమిత్రిశరముల, దనుజు లొందినపాట్లు • తప్పకొందఁ
గాంచి నీలుఁడు పెను • కాంతారమున నొక, సాలవృక్షముగొని • లీలఁ ద్రిప్పి

తే॥ కొనుచురాఁగ నున్మత్తుఁడు • కోలలైదు, పరపి సాలమ్ము ఖండించి • వైవ వేఱు
కొండయొండు నీలుఁడు గుఱి • గూడ నేయఁ, దునుకలుగఁజేసెఁ బదునైదు • తూపులేసి.

తే॥ మరలనొక కొండవెదకంగ • మరలునంత, మరలనీయక నాగంబు • మందరమును
చుట్టినట్టులా నాగంబు • చుట్టెనీలు, నట్టు లిట్టులు కదలనీ • యక కడింది.

ఉ॥ సాహసమున్ బలంబు వ్యవ • సాయము కౌతుకమున్ దిటంబు ను
త్సాహము ధైర్యమున్ గడిమి • సర్వ మదెంగన యంచు సేన సం
దేహము నొందునంతఁ గపి • ధీరుఁడు దారుణముష్టి దేవ సం
దోహము మేలు మేలని ను • తుల్ పొనరింపఁగ వ్రచ్చె శీర్షమున్.

తే॥ నేలకుం దాటి నీలుండు • నిలుచునంతఁ, జొరలు నెత్తుట సేనుంగు • పూడిపోవ
మింటనిలిచి యున్మత్తుండు • మించి యర్ధ, చంద్రసాయకంబులను వ • క్షమున గుప్పె.

తే॥ నీలుఁ డూడఁదీసిన వజ్ర • నిభ రదముల, నసురసేయ నాతఁడు నొక • యమ్ముచేత
వానినడఁచి వేఱొకతూపు • తోన నీలు, నురము నాటఁగనేసి బి • ట్టఱచి యంత.

తే॥ వేఱు దంతిపై నెక్కి యొ • ప్పారవచ్చె, వచ్చినం గని నీలుఁడు • వానిమీఁది
కెగసి వింటితోఁ దను వానిఁ • దిగిచి యిభము, ముందునుంచె నుంచఁగ • నది • ముమ్మరించి.

తే॥ క్రుచ్చె కొమ్ములతోఁ గాలఁ • ద్రొక్కె కరము, తోడనెత్తి విసరివేయు • దుండగీఁడు
తప్పి చావక కోపంబు • తటమటింపఁ, దనగజంబును ఖాతె చిం • దులుగ చేసె.

తే॥ అంత నీలుఁడున్మత్తును • రోషతరమున, బలిమిఁ బొడుపంగ నెత్తును • దొడుకు దొడుకు
మనఁగఁ గ్రక్కుచు గ్రుడ్లు ముం • దునకునుఱుక, విలవిలందన్ని కొనుచును • పృథివినొఱఁగె.

## బలమిత్రుఁడు ఋషభునిచేఁ జచ్చుట

సీ॥ అన్నచావుంగని • యత్యాగ్రహంబున, బలమిత్రుఁడను మహా • బలుఁ డొకండు
మృత్యువె తన్నీడ్వ • మించి యసత్యంబు, ఠంబె ఘనంబైన • మొంటితోడ
సరభసమునఁ బిశా • చములు పూన్చిన తేరి, పైనెక్కి జగములు • భయమునొంద
నఱచుచుఁ బిడుగుల • తెఱఁగున వడిపడి, శరములేయుచు పవ • చరులఁ దఱుమ

తే॥ ఋషభుఁ డెదిరించి కపి హుంక • రించి నిలుపు, మనుచు నదలింప దైతేయుఁ • డాలిగొనుచు
నీవు పిన్న వాఁడవు చేవ • నిన్ను గెలిచి, కలుగు దొడ్డ పేరెయ్యది • తొలఁగుమనుచు.

తే॥ మంతుకెక్కిన యాహను • మంతుఁ బిలుపు, రాముతమ్ముని పిలుపుమా • రణజితులను
చంపు పిదప మీపైఁగోప • గింపఁదగును. బొమ్మబొమ్మన ఋషభుండు • బోలఁజూచి.

చ॥ పీనుఁగులన్ భుజించి మను • పీనుఁగులంగొని నోటి క్రొవ్వుతో
మానుగ గెల్వవచ్చితివె? మందుఁడ! రోగమునొంది మందు సుం
తేనియు రోయకుండు మతి • హీనుఁడ! లక్ష్మణుఁడేలరా? మరు
త్సూనుఁడు నేల? నన్గెలుచు • దోర్బలముండినఁ జూత మవ్వలన్.

ఉ॥ పాఱక నిల్వుమంచు వెఱ • పాఱక పల్కఁగఁగాంచి దైత్యుఁడున్
పాఱెదవంచు నెంచితిని • పాఱక ధీరునిమాడ్కిఁ గాఱులన్
మాఱుగఁ బల్కుచుండిన స • మానుషలీలల నాటలాడెదన్
మోఱకు! పోకుమంచు విలు • మోపును బొమ్మలు లీల వంచుచున్.

సీ॥ పది బొమ్మ నాటంగఁ • బరపి పదింట దే, హంబెల్ల రక్తమ • యంబుసేయ
ఋషభుఁడు కడుఁజెల • రేఁగి రక్కసు పేరు, బలిమిమై జలధిలోఁ • బడఁగవైవ
బలమిత్రుఁడును నీటఁ • బలక్రిందుగాఁబడె, యులుగక కలనికి • నెగసిరాఁగ
నెగడెదవే యని • నిశి నెదిరించిన, పగలు నా ఋషభుండు • వానిఁబట్టి

తే॥ బాహుబలమున నలఁపంగఁ • బచ్చిరక్త, మొదల నవరంధ్రముల వెలు • వడియె; వాఁడు
మిడుక కట్టలే జీవముల్ • వెడలఁ బడమిఁ, బడియె విల్లందిన నగంబు • పడిన పగిది.

## సుగ్రీవుఁడు కుంభుని చంపుట

మ॥ కినుకన్ వేఱొకచోటఁ జేవమెయి సు • గ్రీవుండు కుంభుండు త
ప్రౌ రంగమ్మునకే వినూతన మహా • ద్ధత్యంబు సేకూర్చుచున్
దనుజుల్ వేల్పులు వానరుల్గని ప్రమో • దంబుం భయంబొంద వీఁ
కను పైపై విజిగీషులై పెనఁగి రా • కంపింప భూభాగమున్.

క॥ కేసరులఁబోలి కిట్టుచు, మాసరముగ రుధిర మడర • మలయుచు గాసిన్
వేసరక వీరగుణములు, భాసురముగఁ బోరి రుగ్ర • బల దర్పములన్.

క॥ కుంభుఁడు దండము ద్రిప్పుచు, నంభోరుహ మిత్రసూను • నడిచె నళఁడు సం
రంభమున నొక్కతరువున, స్తంభింపఁగనేయ రెండు • ధర విఱిగిపడెన్.

క॥ సహియింపక చంపెదనని, మిహిరసుతుండదను పొంచి • మీఱి నిలువ వే
ని హితము కోరిన నీలుఁడు, మహీరుహము నొండు తెచ్చి • మానుగ నిచ్చెన్.

క॥ దానిఁగొని పూన్కితోడను, వానరనాయకుఁడు వాని • వక్షము పగులం
గానడిచె బలముకొలఁదిని, దానవతతి కలఁతచెంది • తడఁబడి పాఱన్.

క॥ దెబ్బదినిన కుంభుఁడగిని, గుబ్బతిఁన్ వజ్రహతిని • కూలు నగము నా
గొబ్బునఁ బడెనని వానరు, లుబ్బినతతి లేచి దనుజుఁ • డుడుకుచు నెఱలో.

క॥ భుజములపైఁ గొట్టిన నం, బుజమిత్ర సుతుండు నొచ్చి • పోఁడిమిమై బా
ణ జవంబునఁ బఱచుచుఁ గ్రతు, భుజువైరియురంబు ముష్టిఁ • బొడిచెం బెలుచన్.

క॥ అలపును సొలపును కానక, గెలుపోటము లేర్పఱించి • కించి త్తేనిం
దెలుప నశక్యంబగుక్రియఁ, జలమున విజయాభిలాష • జగడించి రొగిన్.

క॥ పిడికై మదగజములు రెం, డెదయక పోరెడి విధాన • నిరువురుఁ బెలుచన్
బొడుచుచుఁ బొడువుమనుచు నెడ, విడుపెంతయు లేకయుండ్రి • విజయశ్రీకై.

క॥ అమ్మాడ్కిని ముమ్మరముగఁ, గ్రమ్మిన సమరమ్ము జరుగఁ • గమ్మరి దిమ్మెన్
సమ్మెటపోటన దనుజు ను, దమ్మును కపిరాజు గ్రుమ్మె • వ్రయ్యలుగాఁగన్.

తే॥ అపుడునారక్కసుండు న • న్నాలిగొందు, వా యనుచునవ్వు సుగ్రీవు • నైదుతలల
పాముబోలిన హస్తమ్ము • వానినోటఁ, జొచ్చి యసువులెడల నాల్కఁ • బుచ్చివైచె.

## నికుంభుని హనుమంతుండు కూల్చుట

తే॥ అన్నగతిగాంచిన నికుంభుఁ • డాగ్రహించి, కదలె దెప్పటికని కపి • కాంతుఁ గదియ
నంతవానికి నంగదుఁ • డడ్డుపడియె, నిరువురకు ఘోరముగఁ బోరు • జరగె నపుడు.

క॥ శూలముగొన్న నికుంభుని, వాలిసుతుఁడు తాఁకెఁ దాల • పాదపకరుఁడై
నీలగిరిపైకిఁ గాంచన, శైల మ్మురవడిని దూఁకు • చందము దోఁపన్.

క॥ శూలము దనుజుండెత్తఁగ, నాలో నంగదుఁడు మడియు • నని జడియుచు వా
తూలసుతుఁ డేచి జ్వాలా, మాలా ఖీలాగ్ని కరణి • మండుచుఁ దాఁకెన్.

క॥ తాఁకి మరుత్సుతుఁ డమరా, నీక ప్రభు వజ్రమనఁగ • నెగడిన ముష్టిన్
రాకాసి నికుంభుని తల, జోకం గడుపునకు డిగ్గఁ • జొప్పించి చనెన్.

క॥ మిగిలిన దనుజులకుఁ గపులఁ, దగిలెడి సత్త్వంబులేమిఁ • దత్తఱపడుచున్
దిగులూని పఱవ వెనుకం, దగిలి కపీశ్వరులు సదమ • దము చేసిరొగిన్.

క॥ పరుగిడి గవని నరుగు తొం, దరచేఁ ద్రొక్కుళ్లవడుచు • దనుజులు పెక్కం
డ్రురలిరి శిబిరములకుఁ జని, కెరలిరి పెక్కండ్రు పుండ్లు • కెలయుట కతనన్.

క॥ నోరెండఁగ నిలుకడచెడి, సిరిందని పేఁడి యసువు • పిగినవారల్
దారి గనలేనిక్రియఁ గ, స్నిరొలుకఁగఁ బిట్టు యేమి • నీ సంచారుల్.

క॥ నింగికెగసి చని యసువులు, క్రుంగఁగ సటుసుండి మలల • కోపునఁబడు వా
రంగము లవియఁగఁ బ్రేవులు, తొంగ ధరను బ్రాలు నపర • దుఃఖ పెక్కండ్రున్.

క॥ పరిచితులఁగాంచి దయ నీ, శరములఁ దీయుఁడన వారు • సడలింప నసూ
త్కారము విడుచువారలు మం, దిరముల బంధుఁరు గుర్తు • తెలియనివారల్.

క॥ హరు లురలఁగఁ దడఁబడుచుం, గరులు దొరల ధరఁ జేఁబడుచు • గాలెడు మలల
ప్లెరిసెడు నరదంబులలోఁ, దిరుగుడుపడి చిచ్చపడుచుఁ • దెరలెడి వారల్.

సీ॥ గాయమ్ములొందిన • కాయమ్ముల బరువు, మోపఁగాఁజాలక • మూల్గువారు
వానరవేషులై • దానవు లరుదేరఁ, దమవారె మోఁదఁగా • సమయువారు
కనువిచ్చి యిండుల • కడ దిగువారు చు, ట్టల జల మిమ్మని • తెలుచువారు
త్రాగి చచ్చినవారు • త్రాగ నుంకించి య, ట్లే తేటిచూచుచు • నిలుగువారు

తే॥ పుత్త్రులను మోచికొని పడిఁ బోవువారు, ప్రాణములు త్రోవలో విడఁ • బాలువైచి
కనులు చెడ దారిదప్పి త్రో • క్కటము పడుచు, నడపలేక యట్టులె పడి • ముడుఁగువార

క॥ ఆ తెఱఁగుగాంచి పాఱిన, దూతలు తడఁబడుచు వడిగఁ • దోతెంచి సురా
రాతి పదంబులపైఁ బడి, యేతీరునఁ దెలుపుటనుచు • నేడ్చిరి పెలుచన్.

క॥ జరిగిన దేమని రాక్షస, వరుఁ డడుగన్ వారు మీరు • పంపిన సేనన్
మరలిరి కొంద ఱనంగా, తెఱఁగు వడదు నీదు సుతులు • తీఱిరి దేవా!

తే॥ అనుడు బాష్ప ప్రవాహ మ • నర్గళముగ, విడిచి దుఃఖంబు మానంబు • వీర మధిక
చింత కరుణ మదము కిన్క • చిక్కుగొనఁగ, రావణుఁడు భంగయుత వారి • రాశిఁబో

చ॥ కడలనుగాంచు వేలుపులఁ • గాంచును వచ్చిన నిందఁ గాంచుఁ జే
యడిచముఁ గాంచు నగ్గలిక • హస్తముల న్నల చున్ ముఖంబు చే
ద్పడ వడినూర్చు నేడ్చు నగు • వందురు సిగ్గిలుఁ గుందుఁ గూలు భ్రమా
న్పడు వెగడొందు బెండువడు • వావిడుచున్ వనరుం గుమారిలుఁ.

చ॥ పుడమిఁ బెకల్పఁగాఁ దలఁచు • వ్యోమముఁ గూల్పఁ దలంచుఁ బ్రాణులన్
బొడిపొడి సేయఁగాఁ దలఁచు • బోటుల నెల్లరఁ ద్రుంపనెంచుఁ బె
న్జడిముడిపాటుగాంచు మఱి • చేష్టలుదక్కను పుంటిమీఁద నీ
ప్పిడిన తెఱంగునఁ మది వ • హించును పొక్కను తోలు బెగ్గిలున్

## ధాన్యమాలిని రావణు నిష్ఠురోక్తులాడుట

ఉ॥ అప్పుట నున్న వారు పలు • కాడక యూర్పులుపుచ్చు కెద్దలో
ముచ్చిరుచుండ నచ్చటికి • మూర్తి వహించిన దుఃఖమో యనన్

వచ్చిన ధాన్యమాలిని స్వ • భర్తృపదంబుల వ్రాలె గ్రక్కునం
బొచ్చెములేని ప్రేమమయుఁ • బుత్త్రకుఁ గోల్పడు కుంద నోర్వమిన్

ఉ॥ గాజులు హారవల్లులును • కంకణముల్ మొరయంగ పుల్లపం
కేజ సుగంధి వక్షమును • కేలఁ దొడింబడ బాదుకొంచు ని
స్తేజపు మోముపైఁదుఱుము • శీర్ణతనొంది పడంగ జాలికే
భాజనమైతి నంచు ధర • పైఁ బొరలాడె భుజంగికైవడిన్.

చ॥ ఇతరులకేని దుఃఖమది • యెట్టిదొ నేరని కోమలాంగి దుః
ఖితయయి సర్వలోకములు • కీడ్పడఁ గ్రుంగినరీతి నెంచుచున్
బతి వదనంబు గాంచుఁ దన • పట్టిని ఁమ్రింగితివంచు నేడ్చు నా
వెత లుడుపంగ నేరు పృథి • విం గలరంచుఁ దపించు నార్తిమై.

మ॥ బలవద్వీరుల దోర్బలం బని నడం • పన్ లేవా ? నీ వీర్యమున్
జలధిం బూఁడెనొ ? నీబలంబు చెడెనో? నాపల్కు లింకేని వీ
నులఁ జొప్పింపవొ ? సమ్మతింపవొ వినకా ? గూయిన్ విచారింపవో ?
కలఁకంబాఱిన కంటిపాప మరలం • గాన్పింపవో ? కానవో ?

మ॥ పురుహూతుం బవరంబునం గెలుచు స • త్పుత్త్రం గనెన్ధన్య యీ
తరుణీరత్న మటంచు నెల్లరును స్తో • త్రం బొప్పగాఁజేయఁగా
గరువంబొందినదాన నాకొడుకు లో • కంబెల్ల హాహా యనన్
నరుఁ డొక్కండు వధించెనే ? విధియు దు • ర్న్యాయంబు పాటించెనే ?

చ॥ కడచెనె మున్నె యక్షుఁ డతి • కాయుఁడొ యిప్పు డడంగె వీరులున్
మడిసిరి కుంభకర్ణుఁడును • మ్రందెఁ గుమారులలో సజీవియౌ
కొడుకొక యింద్రజిత్తె యిఁకఁ • గూలును రేపట నంతమీఁద నొ
త్తిడి యొకరుండవే కడిమి • దిగ్విజయం బొనరింప కుందువే ?

తే॥ గిట్టినట్టి సోఁకుల బ్రతి • కింపఁగలవె ? బుద్దిచెడి కామివగు నీవు • పుడమిమీఁద
బట్టగట్టుక యింకను • బ్రదుకఁగలవె ? సీతవలన మిగిలియున్న • చెట్ట గలదె ?

చ॥ అనుపమ నీతిశాలి సుగు • ణాకరుఁడైన విభీషణుండు ప
ల్కిన పలుకుల్ గణింప కవ • గీర్ణ బలాఢ్యుని కుంభకర్ణు నా
తనయుని శత్రు శాత శర • తండము పాలొనరించి నెమ్మదిం
గని పయి రాజ్య మేలుదువే ? కాకులు గూబలు కూయుచుండఁగన్.

చ॥ అని పలురీతులం బలికి • యన్నివ పిట్టవిధంబునన్ విలా
పన మొనరించి క్రేపు నెడఁ • బాసిన ధేనువుభాతిఁ గుందుచున్
వనరెడు ధాన్యమాలినిని • నాక శుభాంగులు కేలమీఁద నొ
య్యనఁగొని రాణివాసమున • నాదటఁ జేర్చిరి కుస్తరించుచున్.

తే॥ లంకలోఁ గల యసురవె • ల్లయును స్త్రీలు, పుత్త్రుఁ డీల్గిన చందానఁ • బొగిలినారు
వేల్పు చెలులును నెసరున • వెక్కినారు. తపస్వివరుల చింత లె • త్తంగనేల?

తే॥ కోసలము వీడి కానకుఁ • గౌసలేయు, డేగుతఱి జనించిన దుఃఖ • మెసనె లంక
నగరమందు గల్గిన దుఃఖ • నావ మపుడు. పుష్పకము వార్ధి ఘోషంబు • పోల్కి నెగడె.

## 18. నాగపాశ పటలము. (300)

తే॥ తలకు నొక వేసముగ దైత్య • తరుణు లేవ్వఁ, గాంచి కావరు మెఱుఁగక • కళవళించి
యింద్రజితుఁడు శంకించి దై • త్యేంద్రుకడకు, నడచె సురపతి నళిని చం • దమున నపుడు.

మ॥ దెసలం గెల్చిన రావణుం డిపుడు కీ • ర్తిం బూర్తి గోల్పోయెనో?
అసువు ల్వీడెనొ? మున్నువచ్చి కర దా • హం బొప్పఁగాఁజేయు గా
డ్పు సుతుం డంబుధితోడ లంక నిపు డు • న్మూలింప యత్నించెనో?
అసమానంబగు దుఃఖ మొందుటకుఁ గా • ర్యంబేమి పాటిల్లెనో?

ఉ॥ ఏమి ఘటిల్లె నేడు వచి • యింపుఁడి యం చెదురైనవారలన్
వేమరు ప్రశ్న సేయఁ బల • వించి పడంకిరి కాని తెల్పమిన్
దామది సంకటం బడుచు • దారుణవేగముతోడఁ బోయి క
న్నామెతగాఁగఁ గాంచె మది • యంతట నెమ్మది చెంప రావణున్.

ఉ॥ కాంచి కలంక దేటి కర • కంజములన్ ముకుళించి యీ తట
స్థించిన దుఃఖ కారణము • తేటపడం దెలుపుండియన్న న
క్తంచరనాయకుం డనుఁ గృ • తాంతుఁడు నీయనుజుం గ్రహించె ని
ష్కుంచితులై కుంభుఁడు ని • కుంభుఁడు సయ్యతికాయుతోఁ జనన్.

మ॥ వర ధానుష్కుఁడు మేఘనాదుఁ డటఁ ద • ద్వార్తన్ వినం గన్నులం
గురు కోపాగ్నిని విస్ఫులింగములు గ్ర • క్కున్ వాతెఱన్ మాకొనున్
ధురపిల్లున్ పిడిలించు హస్తములఁ గుం • చున్ దూపిలున్ గర్జిలున్
సురుగం దిక్కులు చూచుఁ జంపె నెవఁ డం • చుం గాలఁ దాఁచున్ భువిన్.

ఉ॥ రాముని తమ్ముఁడుం బ్లవగ • రాజు మరుత్సుతుఁ డంచుఁ దెల్పఁగా
నేమని పంపినాఁడవు న • రేంద్రుల శక్తి యెఱింగియుండి యు
ద్దామ బలుండనైన నను • దాక్కొనఁ బంపక వారిఁ బంపి నీ
వే మరణంబు గూర్చితివి • ద్వేషులు చంపి రనంగఁ జెల్లునే?

మ॥ సమరాక్షేయుని నాదు తమ్ము ననిలోఁ • జక్కాడు క్రూరాత్ము ర
క్తము తద్రంగమునందు తద్ధరణియే • త్రావంగనీకున్నచో
సమరాధీశున కైదుమార్లు బల శౌ • ర్య స్థైర్యముల్ వీడి యు
[illegible] నాఁడ నగుదున్ • దైత్యేంద్ర చూడామణీ!

ఉ॥ క్రూర నగౌకసావళి న • కుంఠిత శూరతఁ గొందికొంది సా
మీరి శిరంబు వ్రచ్చి కసి • మీఱఁగ లక్ష్మణు కాలుసేతులం
గోరికఁ ద్రుంచి చిత్రవధఁ • గ్రొవ్వక తక్కిన సమ్ముఖంబునన్
మోరల నెత్త జంకు సుర • ముఖ్యులు మిక్కిలి నవ్వకుందురే ?

చ॥ కడలిని దాఁటి జానకిని • కాంచి వనంబును పాడుచేసి నీ
కొడుకును నేలరాచు నొక • కోఁతిని దూతయటంచుఁ జంపకే
వెడఁగరి పొచు వీడితివి • వీడుట యింతకుఁ దెచ్చె బంధులం
గొడుకులఁ గోలుపోయితివి • గోడివడెన్ సుఖ జీవితాయువుల్.

## ఇంద్రజితుఁడు శపథ వాక్యము లాడుట

మ॥ ఇఁకఁ జింతించియు లాభమేమి ? మఱి ని • న్నేమన్న మేలేది ? వా
రక యాలోచన చేసియున్ ఫలమె ? సంగ్రామంబునం దమ్మ నం
బక సంఘాతము పాలుచేసిన గుణ • భ్రష్టాత్ము సౌమిత్రిఁ జం
పక లంకాపురిఁ జేర నేబ్రదుకు సం • భావింపఁ జిత్తంబునన్.

శా॥ నాగాస్త్రంబును ఖడ్గ పాశుపతముల్ • నాణెంబుగాఁ గాచుచున్
భోగంబుల్ గొని కాలముం గడపు నా • ఘోరం దదస్త్రంబు లు
ద్యోగ ప్రోద్ధతి నాకుఁ గానిపయినన్ • దుర్మృత్యువుం గొందు నీ
రాగ ప్రక్రియ సర్వమున్ విడిచెదన్ • బ్రాయోపవిష్టుండనై.

మ॥ అతికాయ ప్రియజీవ హారకు సుప • ర్వాదు ల్గనన్ సంగర
క్షితిలోనుండి వియత్స్థాన యమరా • ద్గేహంబునం బ్రీతిమై
నతిథి ప్రక్రియ లందఁగాఁ బనుపకే • వ్యర్థుండనే యైన నీ
సుతుఁడం గానిఁక విల్లు మోఁతకొఱకో ? • శోభాకృతిం జూపనో ?

చ॥ అని శపథంబులాడు సుతు • నక్కునఁ జిక్కఁగఁ జేర్చి రావణుం
డనునయ మార విట్టులను • నయ్యవు నీకు నసాధ్య శౌర్యముల్
పనిగొని చూచినం గలవె ? • వారని పుత్త్రక చింత దీఱ నీ
వనిఁ బగఱన్ వధింపఁగల • వంచు హృదంతరమందు నమ్మితిన్.

తే॥ అనుచుఁ బలికిన తండ్రికిఁ • దనయుఁ డెఱఁగి, తూణములు నభేద్య కవచ • బాణ ఖడ్గ
దృఢ శరాసనాదికములు • తీరుగాఁగఁ, దాల్చి బయలుదేఱెను భయ • దంపు తీవి.

తే॥ కమలజుఁడు చింత యించుక • గలుగకుండ, వజ్రగిరిగొని కావించి • వజ్రి కిచ్చె
నాధనువు వాని గెల్చిన • యదనునందు, మేఘనాదుండు గొనియె న • మోఘగరిమ.

తే॥ ఇంద్రుఁ జెఱనుంచినప్పుడె • యింద్రజితుఁడు, కడఁకఁ గైకొన్న వేనిషం • గములుగూడఁ
దఱుఁగుఁగాక యంబుధి యవి • తఱిఁగిపోవు, యమునిగుహఁబోలి నట్టి వా • యంపదొనల

తే॥ తొల్లి యమరు లొనర్చిన • దురము వేళ, గొంద విలుకాఁడు సలుప త • ద్భంగ లట్టి
యధిరు లొసఁగిన పెక్కుది • వ్యాయుధముల, నపుడు గైకొనె రావణి • యనువుకొలకు.

తే॥ పొలుచు క్రొత్తలంకాపురిఁ • బోలినయది, శరధములువేయి వేయి రే • సరులుపూన్పఁ
బడినయది వేల్పులకు భంగ • పఱుపరా, దైన తేరెక్కె దైత్యేంద్రు • నగ్రసుతుఁడు.

తే॥ కనక రథమన్నఁ జాలునే? గరుడుననును, వృషభముననును భయదమై • వెంట నడచెఁ
గాక యొక్కనాఁడును ముట్ట • గంబులందు, ముందునడచిన యదికామ • పొడవు తేరు.

తే॥ చతురతం జూపి బవరంబు • సలిపి వజ్రి, బలము గ్రుంగ బంధించిన • వలఁచివచ్చె
వచ్చెనని పిశాచాదులు • వలచియాడు, గుఱుతుపడ్డ చెక్కంబుచేఁ • గొఱలు తేరు.

చ॥ బలయుత కాలకేయ వర • వాహిని గగ్గులకాడుగా వడిన్
స్ఖలఁచిన చక్రముల్ త్రివశ • నాయకు పృష్ఠము గాయమొందఁగాఁ
జలిపిన మొగ్గరం గరిగి • జానగు తేరది దిగ్గజంబులన్
గలఁచుచుఁ దాఁ బోలినది • గా వివరించుట గౌరవార్హమే?

తే॥ అఖిలసురుల వీఁపుల గాక • యాననములఁ, గనని యింద్రజిత్తట్టి స్యం • దనమునెక్కె
తేరు లొక వేయి చుట్టిరా • వీరసమర, దోహలత తేటమోమునఁ • దోఁప నరిగె.

తే॥ వానితో నడచిన సేన • వరుసలెక్క, పెట్టి తెలుపంగఁ దరమౌనె • వినుతచరిత
విదుఁడు వాల్మీకి నల్వది • వెల్వలనుచుఁ, దెలిపె వేవేరు లెక్కించి • తెలుపువారు?

సీ॥ ధూమ్రనేత్రుఁడు రణ • దోహలుండగు మహా, పార్శ్వుండు శిరి కా • వలియొనర్ప
ఛత్రంబు పైనొప్ప • శంఖాది రవములు, భూనభోంతరముల • బోరుకొనఁగ
లక్షతేరులు చుట్టి • రక్షయై రా వాని, కినుమడి గజములు • వెనుక నడవ
మోహరించిన గుఱ్ఱముల గుంపు వెంటరాఁ, గాలిబంటులు ముందు • గాఁగ నరుగ

తే॥ వీరవర్యుండు లంకాధి • విభుని కొడుకు, శస్త్ర విజ్ఞాని మాయా వి • శారదుండు
దురము లం దారితేఱిన • దోర్బలుండు, జిత దిగీశుండు సంగ్రామ • సీమఁ జేరె.

మ॥ అతికాయుండు వధింపఁగాఁ బడిన ప • ల్కాలించి కోపంబుతో
దితిజాధీశుఁడొ గోత్రభిజ్జితుఁడొ యే • తెంచెన్ రణ క్షోణికిన్
గృతహస్తుల్ రణకర్కశుల్ రిపులఁ గా • రింపగ నౌనంచెదం
గుతుకంబారఁగ లక్ష్మణుండు నిలిచెన్ • ఘోరాహవ క్ష్మాస్థలిన్.

శా॥ వీరశ్రేష్ఠుఁడు లక్ష్మణుండు కని దో • ర్వీర్యోద్ధతిన్ భూరి తూ
ర్యారావంబులతోడ వచ్చె నెవఁడా • హంవీరుఁడన్నన్ మహో
దారుండైన విభీషణుండను మహా • త్మా! ధీరమల్లుండు పా
కారిం గెల్చిన శూరుఁ డింద్రజితుఁడన్ • ఖ్యాతాభిధానుం డిలన్.

ఉ॥ వాహిని నాయకుల్ ప్లవగ • వారము రక్షణసేయ నెల్లరన్
వ్యూహముగాఁగ నిల్పి బల • యుక్తిని పోరుటమేలు నేఁడు సం

దేహములేదు విగ్రహము • తీవ్రతరంబగు నిర్ణయించి ని
ర్వాహక పద్ధతి న్నడప • భావ్యమగుం దలపోయు లక్ష్మణా:

సీ॥ కీర్తిభూషణ! మన • కీశ నాథుండును, జాంబవంతుండు కే • సరి సుతుండు
వాలిపుత్త్రుండును • నీలుండు తదితరుల్, సీతోడ నిలువంగ • నిర్ణయింపు
లెక్కలేని సురలు • ప్రక్కబలము గాఁగ, నిలిచిన యింద్రుండు • నిలువలేక
యమృత బలంబున • నసువుల దక్కించు, కొని బైటఁబడి బ్రది • కెను నిజమ్ము

తే॥ వాసవుని రెట్టలం గట్టు • వాఁతలిఁకను, మాయలేదు మాయవు హను • మంతుఁగూడఁ
గట్టినాతండు తగ వాని • కార్ముకంపు, విద్దె నేర్పును వర్ణింప • వీలుగలదె ?

తే॥ అనుచుఁబలుకంగ లక్ష్మణుఁ • డనుమతించె, నంతమతిమంతుఁడగు హను • మంతుఁడెదను
చింతచేసి సౌమిత్రిపై • జిష్ణుజితుఁడు, వచ్చెనని పదటంబున • బయలుదేఱె

తే॥ శమనుఁడును కనుల్మూయంగఁ • జాలియున్న, దనుజ సేనా భయంకర • త్వంబు గాంచి
యింద్రజితుని సాహసకార్య • మెఱిఁగి గాలి, పోలికనె వచ్చి చేరెను • గాలికొడుకు.

తే॥ అచ్చటనె మున్నె యుండినాఁ • డంగదుండు, తక్కు దళపతు లచటికి • దాసివారు
సేనలం ద్రిప్పఁ గపిరాజు • చేరినాఁడు, వరుసలుగఁదీర్చి నిలిచెను • వనచరాలి.

క॥ కోపావేశము పొంగఁగ, నేపారుచు నెదుర నెదుర • నేగెడి సేనల్
దీపించు రెండు జలధులు, కోపున యత్నించి తాఁకు • కొమరై తోఁచెన్.

క॥ కనులు మనను గలిగిన ఫల, మను సంపూర్తిగనె నేఁడు • పొందఁగనగు నం
చనువుగ స్వర్గము బీడుగ, వనితలతో నిండి రమర • వర్యులు నింగిన్.

తే॥ రెండువాఁగు లొండొంటితో • రెచ్చితాఁకు, నెడల వీరగర్జనలు ఘీం • కృతులు హేష
లబ్జఘోషముల్ వివిధ తూ • ర్యమ్ము లదరి, వేలుపుల మూసికొనఁజేసె • వీనుదోయి.

క॥ పట్టుఁడు కట్టుఁడు కొట్టుఁడు, తిట్టుఁడు నఱకుండు తినుఁడు • త్రెంపుఁడు పొడువుం
డిట్టలముగ నేయుం డను, గట్టి రవము శింజతో జ • గము వడఁకించెన్.

క॥ తగులుటచే నంగంబులు, పగులుటచే మేన నుచ్చి • పాఱుటచేతన్
నొగులుటచేఁ గూలుటచే, నెగులునఁ జలియించె ధాత్రి • నిలుకడ చెడఁగన్

తే॥ ముసల ముద్గరాదులచేత • మురియు తలలు, ఖర కరాసులచేఁ దెగిఁ • దొరలు తలలు
కదనరంగంబు నిండంగఁ • గపుల వపువు, ఉరలె నటియించె విలవిల ధరణిఁదన్నె.

క॥ పచ్చడియగు మస్తకములు, విచ్చిన మేనులను నెత్రు • వెల్లువలం దా
కచ్చుగ మండెడు నడవిని, పచ్చి విటపములను బోలి • పలుపైయుండెన్

తే॥ కఱకు రాకాసులంబట్టి • కాలఁదన్ని, కేలనెత్తి నేలకుమోఁది • తోఁక లొలిచి
మెదలు కొఱికి త్రోచియు రాచి • నడుము విఱిచి, యతిశయోత్సాహ మంది పె • ల్లార్చెఁ గపులు.

తే॥ తలలు ద్రెంచి రొమ్ములు ద్రుంచి • తొడలు నఱికి. యూఁపెలందూఁటిపోటుల • నెసరమడఁచి
కోఁతిమూఁకలఁ జెక్కుటఁ • గూలఁద్రోచి. పొలసుదిండులు తండముల్ చెలఁగియార్చె.

తే॥ కోఁతులనుపేరఁ బను చును • చూతలపుడు. వాలపాశంబు లురివైచి • వ్రేలనెత్తి
వ్రాలమోఁది దిర్దిరఁ ద్రిప్పి • నేల దాఁచి. పెక్కువిధముల వారి యూ • పిరులఁగొనిరి.

తే॥ కాంతి నిలయమ్మై నిప్పులు • గ్రక్కు నుల. కోఁతిమూఁకలు తమలతోఁ • జేతులు తెగ
మేన దాఁకులు తూఱంగ • మొదిసిపడియె. వారిసత్తువల్ గొలుకుచు • వారితోడ

తే॥ పడవసేయు రక్కసులు • పిడుగులట్లు. మెఱసి చని యేనుఁగులఁ జీల్చి • మెదడునాని
తృప్తిగా శోణితము ద్రావి • ప్రాప్తలాభ. మున ముదంబంది జఠరాగ్ని • నణఁచికొనియె.

తే॥ దూసమున బలమున విని • యూథనొందు. ప్లవగములు దొడ్డకేరుల • పైకి మత్త
కరులపైకి హయలపైకి • శరులపైకి. నాయుధములపైఁ దలలపై • నరసి దుమికె.

తే॥ పీనుఁగుల తిప్పలందుండి • నెవలు రుధిర. వాహినులు పీనుఁగులఁ గొని • వనధిఁ జేరి
యచటి జలచరములకు నా • హారమొసఁగెఁ. దెచ్చియిచ్చు నుదాపని • తెలుఁగునూని

తే॥ హనుమ శరములన్ గిరులచే • నలుపఱైన. యసుర సేనలోఁ దెక్కెముల్ • హరుబవిండ్లు
గదలు కుంతముల్ శేఁలు • కరులు మొక్క. మొగము గనరాని తీరున • మురిసిద్రవ్వె.

తే॥ అంగదుఁడు వృక్షముల మోఁద • నసురునందు. పూఁడుకరులను హరులును • పొలసుదిండ్లు
నైనయెడ యముఁ డింతియు • నదరులేక, తప్పెనా జీవులని కేఁలఁ • ద్రవ్వి చూచె.

తే॥ నాల్గు విధముల సేనలు • నలఁగి కుప్ప. గూరిన రణస్థలిం గని • గొప్పబుధులు
పూర్వదేవాసురాజితోఁ • బోల్చి చూచి. దీని కది సరిగాదని • తెలిపినారు.

చ॥ ఎడయక సోఁకుమూఁక తల • యెత్తెను వానరసేన పీఁపులం
దడవుచుఁ బాఱఁజొచ్చెఁ గపి • నాయకులడమువచ్చి పోరినం
జడిసినవారు క్రమ్మఱని • జాడను కాంచి హసించి దూఱినం
బెదమఱలేదు వెళ్ళినదె • వేడ్కఁగఁ బోయినతీరె పోకగన్.

## వానర సేనా నాయకుల సమరము

క॥ శూలము పరశువు చేకొని. వాలిన లయ రుద్రుఁబోలి • పాదప కరుఁడై
నీలుఁడు నిలిచిన చోటనె. కాలుఁడు పాశము గడించి • కడఁక న్నిలిచెన్.

మ॥ జముఁ డధికార కార్యమును • జాడగ వీడితినంచు భీతిలన్
గుముదుఁడు శత్రుసైన్యములఁ • గుప్పలుగూల్చె నతండు నాయువో
యమృతమొ యగ్నియో యనఁగ • నార్చెను ముంచెను మాడ్చె రెండు హ
స్తముల నొనర్చె నిట్టులన • సారెకు వర్ణన సేయ నెట్లగున్?

చ॥ ద్రుమముల రాముతూపు తొలి • తూపరముంచిన దేదుచెప్పె; లో
కమునఁ బ్రసిద్ధిచెందిన న • గమ్ములు నేఁడె; యడంచి మోఁదుటల్
తెమలక ఉప్పటల్ తలఁపు • తీపగు నా ఋషభుండు వైచు వృ
క్షములకుఁ బర్వతంబులకుఁ • గాంచఁగ లెక్కయెలేదు భూస్థలిన్.

చ॥ కరులను శేరులన్ హరులు • గల్గి భుజంగముఁబోలి క్రూరులై
వఱలిన రేయి ద్రిమ్మరుల • వర్గములెల్ల నశించు నేఁడనం
దరువులు త్రిప్పిత్రిప్పి బెడి • దంబుగఁ జంపెను జాంబవంతుఁ డ
ద్విరః ముదియొందియుం బలుసు • తింత్రిణిపీడునె? చేవ హెచ్చదే

మ॥ కరి పాఠీనములన్ దురంగమ తరం • గంబుల్ చలత్స్యందనో
త్కర నౌకల్ బహుళాయుధ ప్రకర ఫే • త్స్య గ్రాహముల్ గల్గు క
ర్బురవార్ధిన్ బనసాఖ్య మందర మొగిం • గ్రోధాహి పాశంబుతోఁ
దరువంజొచ్చె జయేందిరా వర సుధా • ద్రవ్యానుభోగాప్తికై.

సీ॥ వనదంబులం జీల్చి • కొని యూర్ధ్వలోకముల్, డాయు సంపాతి జ • టాయువులన
మైందుండు ద్వివిదుండు • మలసిరి డేగలు, పారువంబులఁ జంపు • పగిది దోఁప
గవయుండు కొలంకుసు • కలఁచు గజంబునా, దనుజసైన్యంబు ను • ద్రవడిఁ గలఁచె
నిల్చిన కాలు గ • దల్పక కేసరి, దైత్యేభ కుంభముల్ • త్రవ్వుచుండెఁ

తే॥ గపికులేంద్రులు కదన మీ • కరణిఁ జలుపఁ, బాజినట్టికోతుఁలు వచ్చి • పోరఁదొడఁగె
నిర్జరారుల సైన్యంబు • నిలుకడ చెడె, నింద్రజిత్తదిగని కోప • మినుమడింప.

## ఇంద్రజిత్తు వానరులపైఁ గనిమసఁగుట

తే॥ బాహులుప్పొంగ దిక్కులు • పర్వతములు, చెవుడుపడ నాస్త్రమోయించి • చింద మొత్తి
వేలుపులు జగములు కపుల్ • వెగడు పడఁగ, సింహనాదంబు సేసె ను • త్సేకమొప్ప.

తే॥ అశమలను సిగ్గిలఁగ మ్రోఁగు • నహి విషాభ, శరము లిన్ని యంచెన్నంగ • నెఱుకపడని
యట్లు మిఱిమీఱి పరపి వి • యత్తలంబు, నవనితలమును బాణమ • యంబు చేసె

క॥ కపివరు లేసిన తరువులు, నుసలంబులు విఱిగి పొడిగ • నుర్విని రాలెన్
గపుల తల లెగసి పడియెం, దపతపమని ధరణిమీఁద • దంపడి యగుచున్.

క॥ మితిమీఱి వెడలు శరములు, కుతికల నురముల నొడళ్ళఁ • గూరుచు డుయ్యన్
దత బలులగు వనచరపతు, లతిశ్రమము నొంది తూలి • రపనిం బడుచున్.

తే॥ ఒక ముహూర్తకాలములోన • నొక్క వెల్వ. చితికి చెవరి బీభత్సమై • చెడుట తోడఁ
గొండలందేరఁ బోయిన • కోఁతుల తల, లుసల పంబల పైచుప మేసు • లుర్వఁబడియె.

తే॥ తలలు త్రెంచిదాఁటిన బాణ • తతులు ఫణుల, కరణిఁ బాతాళమునఁజేరె • ధరణియెల్ల
మిట్టపల్లము సమమను • మేరలేక, బట్టబయలుగా రక్తంబు • పఱచె వడిని.

చ॥ తొలఁగని చూపుచోఁ గనులఁ • దూఱుచు నిల్వఁగ బొమ్మ గ్రుమ్మచుం
దొలఁగఁగఁ దాఁటుచోఁ బదులఁ • ద్రుంచు చదల్చిన నాల్క లూడ్చుచుం
దొలఁగిన వీఁపు గ్రుచ్చుచు వి • దుర్చు శరీరములెల్ల వ్రచ్చుచున్
దలఁచు నెడందపైఁ బడుచుఁ • దార్కొనె నింద్రజి బాణ సంహతుల్.

మ॥ శరవర్షంబున మధ్య నేర్పడిన దృ • శ్యశ్రేణి నొందైన ని
ర్జరులున్ రీతిగఁ జూడలేరయిరి నా • రాచంబులంగూర్చి యే
యు రుతుల్ దక్క విననంగలేరయిరి మృ • త్యు క్రూర భీతిన్ వనే
చరు లల్లాటముతోడఁ బాఱుటలె కాం • చంజాలి రంతంతటన్.

మ॥ ఎదురైనట్టి వనేచరుల్ తునుకలౌ • టీక్షించి యుత్సాహులై
యెదిరింపంగలవారు లేమిఁగని లం • కేశాగ్రసూనుండు దు
ర్మదుఁడై యూరక విల్చె దూరగతుఁడౌ • మార్తండపుత్రుండు బె
ట్టిదుఁడై సాలమొకందు చేకొనుచు మ • ట్టైన్ వానరుల్ మోదిలన్.

మ॥ తమసేనం జెదరించుచుం దొలఁగు నిం • ద్రద్వేషిఁ దా దాసి వ్ర
య్యని రక్షవిదిఁ జుట్టుఁ గ్రమ్ముకొను క్ర • వ్యాదుల్ భయభ్రాంతులై
వెనుకం ద్రొక్కఁగ సాలమున్ విసరెఁ ద • ద్వీర్యంబు మేలంచుఁ బా
ఱిన శాఖామృగ పూగముల్ మరలి పే • ర్చెన్ సంగరోద్వృత్తిమై.

మ॥ తన చుట్టుంగల సైన్యముల్ చెదరుటన్ • దైత్యేంద్ర పుత్రుండు రేఁ
గిన కిన్కంగని మేలుమేలనుచు నా • ల్గింటం బదింటం బలం
బున ఫాలంబును వక్షము న్నొగులఁగా • మూర్ఛిల్లఁ గా నేసి చే
తి నగంబున్ బలుముక్కలై యెగురఁ గ • త్రించెన్ బ్రకర్షమ్ముగన్.

ఉ॥ ఆయ్యెడ వాయునందనుఁడు • హాలహలంబు విధాన రేఁగుచున్
జయ్యన నప్పళించుచు భు • జంబుల నెట్టెదురం గడంగి యీ
కయ్యము దీనితో ముగియుఁ • గాః యని వేలుపు లార్వ రక్కసుల్
బ్రుయ్యఁగ నేసె నొక్కగిరి • భూతము లార్వఁగఁ గోఁతు లుబ్బఁగన్.

మ॥ ఇభజి ద్విక్రముఁ డింద్రజిత్తు నగి భూ • భృద్రాజమున్ దూల్చి యా
రభటిఁ మారుతిఁ గాంచి యిట్లను శర • వ్రాతంబుఁ బాటింపకే
రభసంబార శిలా ద్రుమంబుల సమి • త్రంగంబునం గెల్తువే
రః భళీః చంపకమాన విన్నన జగ • త్ప్రాణాత్మజుం డిట్లనున్.

మ॥ వెదఁగాః మాకడ నున్నవారలు ధను • ర్విద్యా ప్రవీణుల్; మలల్
పడుకుల్ మ్రాఁకులతోడఁ బోరుటకు నేఁ • బ్రాప్తించితి న్నీకు; నీ
కడు క్రౌర్యంబును నేఁట రేపట నడం • గంబాఱుఁ గ్రొవ్వేలరాః
కడఁక న్నేర్చిన కొన్ని పద్ధతు లిటం • గాన్పించెద న్నిల్వరా.

శా॥ నాతోఁ బోరెదొ? లక్ష్మణ ప్రభునితో • నాణెంబుగాఁ బోరెదో?
నీ తండ్రిం దలదన్న వచ్చిన జగ • న్నిత్యాత్ముతోఁ బోరెదో?
నీతంత్రమ్ములు సాగవింక ననిలో • నిర్విణ్ణత న్నిల్చి పైఁ
బ్రేతాధీశుని చూడఁబో మ్మిదియె ప్రా • ప్తించు న్నిజం బియ్యెడన్.

మ॥ అనుడున్ శక్రజితుండు రోషమున నౌ • రా! ప్రల్లదీఁడా? వృథా
చనఁ డీ రావణి నాదు తమ్ము ననిలోఁ • జక్కాడి దర్పించు ల
క్ష్మణు నాజిన్ వధియింతు నన్న ప్రతినన్ • సాధింపఁగాఁ బూనినాఁ
డను నాతో నెదిరించుటన్న నిలఁ జె • ట్లం గట్లఁ బారాడుఁగా?

మ॥ విలు చేఁబూని యొకండనే నిలిచి మీ • విర్వీరులన్ మిమ్ముఁ గా
కులకుం బారణ చేసెద న్నిజము మీ • కున్ శక్తి లేదేని వే
ల్పులఁ బాతాళ నివాసుల న్నరులఁ బ్రా • పుం గూర్చుకొం డాజి మీ
తలలం ద్రెంపక గెల్పుగైకొనక నా • తండ్రిం గనం బోదునే?

తే॥ అనుచు విలుగొని డెబ్బది • యమ్ములేయ, మేన గుత్తులుగా నవి • మేవుకొనఁగఁ
గొండవలెఁ జలింపక వాయు • జుండు నిల్చి, కేల నొకగిరి గొని పల్కె • గేలిగాఁగ.

చ॥ మదకరు లెన్నియేని యొక • మాత్రపు సింగముమ్రోల నిల్చునే?
పదరక లక్ష్మణుం డిటకు • వచ్చెడు దాఁకను వోరుదేని నీ
ప్రదరము రాకమున్నె యిది • వ్రచ్చును నీయురమున్ వలంతివే
నదరక కాచికొమ్మనుచు • నార్చుచు వైచె దళంబు మూర్తిలన్.

చ॥ అలవు జలంబు గల్గిన మ • హాబల నందనుఁ డేసినట్టి య
మ్మల పొలదిండి పక్షము న • మాంతముగా వడిఁసోఁకి వ్రయ్యలై
పలపల రాలె దిక్కులను • వహ్ని నిక్రాఁగిన యుక్కుదుంప దా
కలి పయి వ్రేయు సమ్మెట వి • ఘాతమునం బజీనోపు కైవడిన్.

తే॥ అత్తఱిని మాయియగు నింద్ర • జిత్తు రేఁగి, హనుమ తొమ్మన భుజముల • నంటిదూసి
పోవ విశలిప్తమైన తూ • పులను వేయి, పరపి డాయనీయక చలిం • పంగఁ గొట్టె.

తే॥ పవనుఁ డదరి కలంపఁగాఁ • బైఁడికొండ, లోపల నెకలగుండైన • కోపుదోఁప
వెడలి మేనిపై రక్తంబు • వెల్లిగాఁగ, వించుకంత సొమ్మిరి యో • చింపనంత.

తే॥ నీలుఁ డెదనొచ్చి జాల్వలు • నింగినంట, నురవడిని నూటిగా వైచె • నొక్కకొండ
నడుమనే దానిఁ దుండ్లుగా • నఱికివైచి, శక్ర విద్వేషి వికటహా • సంబు చేసె.

ఉ॥ ప్రాణముతోడనున్న పెర • వానరు లానలు వీడఁగా సుప
ర్వాణులు భీతినొందఁ గపి • వాహిని నాథుని దేహ మెల్లెడన్
బాణ విపాత ఘాతమున • వారక రక్తము గ్రమ్మ నాతఁడున్
ద్రాణ యొకింత లేక • ధర • వ్రాలె నడుంకుచు విహ్వలించుచున్.

ఉ॥ మేరువె యంటుఁ గానుము • మీఱి యెదింపఁగ దగ్గ కొండలన్
వారిధి దెచ్చి యుంగదుఁడు • వైచెను రావణసూనుపైఁ జేతి వి
ల్లూడియుఁ దునియె వెసను • నొప్పెను తుండులుగాని యుండునేఁ
తోరపు వింటిచే నదియు • దుగ్గయి నుగ్గయి పిండియై చనెన్.

ఉ॥ పుట్టలఁ జేరు నాగముల • వీలిఁ దీవ్రతరాస్త్ర సంతతుల్
గట్టిగ ఱొమ్మున న్నాటు • గాలులఁ జేతులఁ గాఁడఁ దత్తఱన్
బట్టుగఁ బండ్లు గిట్టికొని • బాధ సహింపఁగలేక యంగదుం
డట్టె ధరిత్రిపై సొలసి • నందఁగఁ గాంచి సురారి యంతటన్.

తే॥ తక్కువానర వీరుల • తనువులంట, బాణవర్షము గురియించి • పఱపఁ దోల
విఱచు నిలుపున వడఁకుచు • నిలిచినారు, తక్కువారలు దెసలలోఁ • దాఁగినారు.

## ఇంద్రజిల్లక్ష్మణ యుద్ధము

చ॥ అదిగని లక్ష్మణుండు కడు • నల్క విభీషణుఁ గాంచె వాహినుల్
సదమదమయ్యె నాయకులు • స్రుగ్గిరి కార్యము మించె యత్నమో
యదపదలయ్యె నింద్రజితు • నాజికిఁ జిచ్చి పడింపకున్నచో
నిదెపటుకైన పాట్లు పడి • యుంటిమె? వీసర పోవదే యనన్

ఉ॥ వీనిని తాఁకి వేలుపులు వీఁపులు చూపిరి కాని మొక్కలుం
బూని జయింపలేవి జగ • ముల్ కడు కష్టములొందె వీనిచే
మానక వీని నిప్పుడరి • మార్చి జగంబులఁ గాచి లోక స
మ్మానితకీర్తి నొందుమని • మాని విభీషణుఁ డాడు నంతటన్.

ఉ॥ ఇంద్రజితుండు లక్ష్మణుని • యెప్పెదుటం గని వాఁడె వీఁడు నేఁ
డింద్రపదంబు గోరె నిపు • డిచ్చెద వీనిని చుట్టు ముట్టుఁడీ
సాంద్రతరంబుగా ననుడు • సైన్యము వేఁగి ధరిత్రిఁ జుట్టు నా
సంద్రము పోల్కిఁ జుట్టె రథ • సంబున నార్చుచు నొక్క పెట్టునన్.

చ॥ బ్రదుకిఁక లేదు వీకని కృ • పారహితాత్ములు స్యందనంబులన్
మదకరులన్ గుఱాలను గ్ర • మంబున రేఁపుచు మీఱ నన్నిటిన్
జిదురుపలై పడంగ వెసఁ • జించుచు లక్ష్మణుఁ డస్త్రరాజి బె
ట్టిదముగ నేసి వారల స • టిష్ఠతఁ ద్రుంచె సుపర్వు లుబ్బఁగన్.

చ॥ వడఁకె జగంబు ధారణియు • బ్రద్దలువాఱె శర ప్రకర్షముల్
పిడుగులఁ గేరెఁ దీనుఁగుల • పెంటలు మీఱె నసృక్ప్రవాహముల్
జడవిధిఁ దూఱె రాక్షసుల • సత్త్వము తాఱె బలీముఖంబు ల
య్యెడ శ్రమ దేఱె నింద్రజితు • నెద్ద బిడెంబును కూఱె దండిగన్.

చ. ఎదపక లక్ష్మణుం డలుఁగు • లేయ నురంబుల నాటె డాకలన్
బుడమిని రాల్చె రక్తమున • ముంచె గజమ్ములఁ గ్రుచ్చె వాజులన్
గెడపెఁ బదాతి వర్గమును • కేలును కాళ్ళును ద్రుంచెఁ గాలుడై
వడి లయకాల రుద్రుపడిఁ • బార్థివ నందనుఁ డేచె నాజిలోన్.

చ. మితిచెడి కూలు పీనుఁగుల • మేకొని లెక్క యిడంగ నిర్జరుల్
మతిఁ దలపోసి కాదనుచు • మాని శిలీముఖ వృష్టిఁగాంచి యి
వ్వితమును చూడఁ గాదనుచు • వీరుని కార్ముకమందు సప్త మా
రుతములు సప్తమేఘములు • రూఢిఁ జెలంగు నటంచు నెంతగన్.

తే. ఒక్క యేనుఁగు మోమున • నొక్కకోల, యొక్క గుఱ్ఱము మోమున • నొక్క యలుఁగు
ఒక్క కాల్బంటు తొమ్మ్మున • నొక్క శరము, గాఁగఁ దెలిసె లక్ష్మణ వృష • త్కమ్ములవట

ఉ. పుట్టుకతోడ గొప్ప యురు • వున్ బొలదిండియుఁ గల్గి తెక్కలం
బుట్టినపాటఁ గంకముల • బోఁడిమి లక్ష్మణ బాణరాజముల్
నెట్టన యొక్క యొక్క రజ • నీచర సంస్థిత గాత్రమందు ము
క్కొట్టఁగ వ్రాలియుండె మఱి • యొక్క నిశాచరు బోల్కి యొందఁగన్.

తే. ఇంద్రజిత్తు రోషమునఁ బో • రెసఁగఁ జేయ, ముప్పదైమువేల్లు వల క • పులు మరించె
లక్ష్మణాస్త్ర జాలమున నా • లమునఁ గూలు, నసుర శవములలో నవి • యడఁగిపోయె.

ఉ. చేతులు త్రెవ్వి కాళ్ళు తెగి • చించలు వందలు యయ్యె బొంచవాల్
మూతులు వోయి యాంత్రములు • ముందట జాతి బలంబు లాజిక
కేతులు మాలి యాయుధ వి • హీనములై పడఁ దక్క నిర్జరా
రాతులు పాటి రానలకుఁ • బ్రాణము తీపను పల్కు నిల్పుచున్.

తే. నీరువట్టిన కడలిలో నిలిచినట్టి, మందరమువలె నొకఁడేని • మాట తోడు
లేని మేఘనాదుఁ డుత్త • రించి బొమలు, ముడిచి తేరిపై లక్ష్మణు • మొనయవచ్చె.

ఉ. మారుతి గాసి వీఁడు రథ • మధ్యగతుండయి యుండ నేల నీ
వారుట యొప్పు చూపదు మ • దంసగతుండవు గమ్ము నీవనం
గౌరవలీల లక్ష్మణుఁడు • గాడుపుపట్టి భుజంబు నెక్కె బ్రం
దారకు లుల్లసిల్ల జల • దద్వయమో యనఁ దాఁకి రిద్దఱున్.

ఉ. కాళికఁబోలి యొక్కరుఁడు • కాలుని బోలి యొకండు ఘోరి ఘో
గోళము దద్దరిల్లఁ గుల • గోత్రము లల్లలనాడఁ ఢంకృతుల్
మేళన మొందగా విశిఖ • మేదుర నాదము పిక్కటిల్లె న
వ్వేళ ముఖమ్ములం గొటికె • భీకర లీలల నమ్ము లమ్ములన్.

క. పిడుగులఁ బోలిన బెడిదపుఁ, దొడుగులు మఱి తొడుగు లేయ • దనుఁగుమూలలన్
దొడిఁబడి జగములు వడఁకుచుఁ, గడలి నడిమి నావవోలెఁ • గళమంచెన్

క॥ అకదంబును మారుతియును, వీరివీరి దిరుగంగ బంక • పూర్తిగ నదరెన్
శరములు క్రమ్మటచేఁ జెలి, యరు లక్ష్మణుఁ డింద్రజిత్తు • నమరుల కరయన్.

చ॥ కర శర లాఘవంబు లొక • కైవడి నందపు సేమమున్ మహో
ద్ధురమగుఁ బోరు తీరు బవులు • దుస్సహమౌఁ గనఁజాలమంచు ఖే
చరులు వచింప నేత్రగతి • చర్యడు సైతము శంకగూరె నే
కరణి వచింపనౌ బరుగు • కార్యము లిట్టివి యంచు గట్టిగన్

చ॥ జరిగిన దొక్కటే నెఱుఁగఁ • జాలక యేమి ఘటిల్లె నెవ్వరీ
కరణి దురంబు పూర్వము జ • గంబునఁ గాంచిరి మున్ను లే దనం
తరమును గల్గఁబోదు కను • దమ్ములు తెప్పలు లేనివయ్యెఁ గాం
చు రుటము గానమైతి మని • మ్రుక్కిరి వేల్పులు వారిఁ గానమిన్.

ఉ॥ వేలకొలంది భల్లములు • వీరుఁడు రావణి మీఱి యేయఁగా
వేలకొలంది భల్లముల • వేగమ లక్ష్మణుఁ డేసి త్రుంచెడున్
వేల ఫణీంద్ర బాణముల • వెంటనె రావణి యేసె మాఱుగా
వేల ఫణీంద్ర బాణములు • వీకను లక్ష్మణుఁ డేసి త్రుంచెడున్

తే॥ లక్ష యమ్ముల నింద్రారి • లాగి యేయ, లక్షతో వాని నడఁచెను • లక్ష్మణుండు
కోటి తూపుల రావణి • కూర్చి పరపఁ, గోటితో వాని సౌమిత్రి • కొట్టివైచె.

సీ॥ కంకపత్త్రమ్ములఁ • గలుకు రక్కసుఁ డేయఁ, గంక పత్త్రములె రా • ఘవుఁడు వైచె
నర్ధచంద్రాస్త్రమ్ము • లసుర యేయఁగ నర్ధ, చంద్రాస్త్రములనె ల • క్ష్మణుఁడు వైచెఁ
గోలలఁ బోలిన • కోలలతం డేయ, నీతండు నట్టివే • యేర్చి యేసెఁ
బాలల మొనలున్న • ప్రదరంబు లమరారి, యేయ నట్టివ యేసె • నృప సుతుండు
తే॥ తమ్మి మొగ్గలఁ బోలు న • స్త్రముల దైత్యుఁ, డేయ నట్టివ సౌమిత్రి • యేసి త్రుంచె
వజ్ర ముఖ బాణములను క్ర • వ్యాదుఁ డేయ, నట్టివే యేసి యడఁచె రా • మానుజుండు.

సీ॥ త్రిశిరశ్శరంబులొ • త్తిలి యిద్ద జేయంగ, నవి తాఁకి పొడియయ్యె • నంబరమున
నంజలి యనెడి సా • యకముల నిరువురు, వేనవే లేయంగ • విఱిగె నవియుఁ
గుంజర శ్రవములన్ • పింజకోలల నిర్వు, రేసి రయ్యవి తాఁకి • యిల నడంగె
రావియాకులఁ బోలి • రాజిల్లు తూపుల, నిరువు రేయఁగ నవి • యెదలి దొరలె
తే॥ నిట్టులేయుచు విఱుమచు • నెసక మెసఁగ, లోకములె యంపగములకు • లోనుగాఁగఁ
జేసి యార్చిరి పొంగిరి • చెలఁగి రుబ్బి, రడరి రఱి రొప్పిరి తని • వందరైరి.

ఉ॥ రావణి కల్ప మేఘములు • ప్రాదినులం గురియించు ముంచు నా
కైవడి నేసి వాఁడి గొర • కల్ వడిఁ గర్కటి ప్రీలునట్టు ల
ప్పావని మేను చేసి నర • వర్యుని కంకటమందు గ్రుచ్చె బా
ణావలి వేనవేలుగ వి • యచ్చరు లందఱు పిచ్చలింపఁగన్.

తే॥ హనుమ యొడలి రక్తముగాంచి • యమరులెల్ల, నింద్రజితు చేయి మించిన • దంచునెంచి
వదనములఁ ద్రిప్పికొని కేలు • విదిరిచికొని, వెగడుపడి రీతఁ దేక్రైక • వీరుఁ డనుచు.

మ॥ రణ పాండిత్యము మీఱఁ గ్రూర విశిఖ • వ్రాతంబులం గూర్చి ల
క్ష్మణుఁ డశ్వంబులఁ గూల్చి దైత్యు సిడమున్ • ఖండించి క్రేరించి రా
వణి మైమర్వును చించి సారథిని చం • పంగొట్టి వెన్వెంటనే
గణనాతీతములైన బాణములఁ ద ద్గాత్రంబు భంజించుడున్.

క॥ సారథి గూలినఁ డెక్కెము, వారువములు పడిన మేను • వ్రస్సిన రణ దు
ర్వారుండై లంకేశ కు, మారుఁడు చలియింప కిట్లు • మదియించె మదిన్
మ॥ నరుఁడే యీతని సాటి; కాదయినచో • నారాయణుండే యగున్
గిరిశుండో; బరమేష్ఠియో; దృఢమతిన్ • గీశాళితో డిగ్గి మా
పురిలో మమ్మెదిరించి నిల్చు మనుజున్ • మున్నెన్నఁడుం గాన మ
చ్చెరు వీసాహస మీచణత్వము రణ • స్థేయత్వ మీ బీరమున్.

తే॥ అనుచు వేఱొక తేరెక్కి • యసురవరుఁడు, నిప్పు లురలంగ నిట్టూర్చి • నేయి పోయు
నిప్పుగలె మండి మిక్కిలి • నెగడి క్రూర, విశిఖతతి దండడిగ గుప్పె • విన్నునిండ.

తే॥ శ్రేణులై కుప్పలై పాఱు • శితశరముల, లక్ష్మణుం దేసి వానిఁ దొ • లంచి వేయి
నారసము లింద్రజితు మేన • నాటనేయ, వాఁడు వడిఁ గ్రుచ్చె సౌమిత్రి • ఫాలమందు.

తే॥ నొవ్వ కించుకంతయు లక్ష్మ • ణుండు వాని, తొమ్మి రంధ్రమ్ములదర నూ • ఱమ్ములేసి
నొంప మేఘనాదుఁడు మేను • కంప మొందఁ, నొఱఁగెఁ దేరిపైనుంత వి • ల్లూఁతగాఁగ.

తే॥ కాలుఁడే యదాటునఁదూఁకు • కరణితోఁప, హనుమపురణించి యింద్రజి • త్తురద మవనిఁ
గ్రుంగ వారువఁబులు నలి • గులిగఁ గూలఁ దన్నెవాఁడును వేఱు స్యం • దనమునెక్కె.

తే॥ ఇంద్రజితుఁడు పెక్కగు తేరు • లెక్కుచువడిఁ, గూల్చుకొనుచుండెఁ గాని యొ • క్కొటియుఁగాచి
కొనిరణంబు సేయఁగ లేక • కష్టలుచుండె, గడియలో వేయిరథములు • మడఁగిపోయె.

క॥ దేవత లనుమని లక్ష్మణు, దీవించిరి విరులు గురిసి • తేట మొగములన్
ద్రోవయి రాదిరి పాడిరి, పైవస్త్రము లార్చి రధిక • పరితోషమునన్

తే॥ అంత నింద్రజిత్తునకు న • త్యంత హితులు, సమసుఘాన్నపానులు వెస • శత సహస్ర
సంఖ్యగల రక్కసులు మిత్తి • సరస కీడ్వ, వచ్చి చేరి రచ్చటికిఁ గా • వరముతోడ.

తే॥ హస్తిపకులును రథికులు • నాశ్వికులును, కాల్బలంబులు కేల ఖ • డ్గములు గదలు
దాల్చి గర్జలతోడ వా • ద్యములు నిగుడ, ఖడ్గదీప్తులు కెలఁకులఁ • గ్రమ్మవచ్చె.

తే॥ శరభసింహ వారణ పిశా • చముల ధ్వనులు, శింజినీ రవములు దెసల్ • చెలఁగ బరవెఁ
బుడమి శవముల మయమయి • యడరు కతన, స్యందనములచేఁ బెందూళి • క్రందుకొనదు

ఉ॥ జీవము గొందునంచు మొగి • సేయఁగఁ దక్కిన వానరావళుల్
రావణిఁ జుట్టుముట్టి బవ • రంబునఁ జచ్చిన వారి శీర్షముల్
వావురముల్ శతాంగములు • వారణ తుండము లందినట్టి వే
వేవియొ తెచ్చి వైచి శర • వృష్టి నడంచిరి మించి యార్చుచున్.

ఉ॥ అంతటఁ బ్రాభవ స్థితియు • హర్మ్య నివాసము నిద్రవీడు ధీ
మంతుఁడు పోరుచున్న చెడు • మానిసిదిండుల నొక్కఁడేని కా
న్పింతమ యన్నఁ గానికర • ణిం బరిమాఱుప నింద్రజిత్తు దు
ర్దాంత రుషా పరీతుఁడయి • తార్కొనె నోర్వఁగరాక గ్రక్కునన్.

తే॥ సేనలం జౌరకొని యంద • శిఖరమంటి, నట్టి రక్తజలధి యీద్వ • ననువు దప్పి
రక్షణము చేసికొను చక్ర • రక్షకులకు, ధూమ్రనేత్రు మహాపార్శ్వుఁ • దొడరి కాంచె.

తే॥ పీనుఁగులు కొండల బలెఁ • బెరిఁగియుండ, జలదములు దాఁటలేదు భా • స్కరరథంబు
దాఁటలేదు పక్షులుగూడ • దాఁటలేదు, నిలుచు నిల్వున వారలు • నిలిచిరల్లె.

తే॥ వారి మోములఁ గాంచి రా • వణియుఁ గదిసి, వింత! మన సేన నలువది • వెల్లువలను
లక్ష్మణుం డింతలోన న • గ్గలపుఁ గినుక, నాశ మొనరించుటలు కాంచి • నారె మీరు.

తే॥ అనుడు వార లింద్రారి! నీ • వంతకంచె, నెక్కుడగు కపిసేన మా • యింపలేదె?
సముఁద వట్టి సంగ్రామమే • సలిపితయ్య, చింతయేల యటంచు వ • చించునంత.

తే॥ ఇంద్రజి ల్లక్ష్మణులు పెండి • యేషుమీఱి, పోరఁదొడఁగిరి సౌమిత్రి • మేరమీఱి
వేలకొలఁది శరములేయ • విబుధవైరి, వేయుకొలఁదిఁ దున్మచునుండె • వివిధగతుల.

తే॥ ఐదుపది నూఱు వేయి ప • దాఱువేలు, ముమ్మరముగఁ గోలల నేసి • మూర్ఛదేలి
పోర వచ్చిన వానర • వీరవరుల, మరల దశకంఠ సూనుండు • ధరణిఁద్రోచె.

తే॥ వనచరేంద్రుండు మున్నగు • వారు సోలి, పడఁగ నెదుట నిల్చిన సుర • వైరి తూల
పెదురుటదవిఁగాల్చెడి జాత • వేదు కరణి, మండు శరముల గుప్పె ల • క్ష్మణుడు కదిమి.

తే॥ ఇంద్రజిత్తు మూర్ఛిల్లెస • హింపలేక, కొమ్మలంబలె నిల్చునో • కులు నిరువురు
దాఁగియుండిన రాకాసి • దళము కొంత, తోడుగాఁ బోరఁదొడఁగి రు • త్సుకతవిడక.

తే॥ రథగజాదికములు లేసి • రాక్షసాలి, మీఱి త్రుటి మాత్రలోన సౌ • మిత్రి కురియు
బాణవర్షంబున మునింగి • ప్రాణములను, విడిచినారు కొందఱు పాఱఁ • దొడఁగినారు.

తే॥ నీరుపట్టుచేఁ గొందఱు • నీరదముల, కెగసి నీర్ద్రావి వ్రణములఁ • దగిలి నీరు
చొరఁగఁ జచ్చిరి కొందఱు • దొరకకుండ, నాల్క లెండఁగఁ జచ్చిరి • నవసి నవసి.

మ॥ శరసంఘాత విదారితాంగులగు దో • షాచారులం గొంద ఱ
ప్సరముం జేరి వికీర్ణ కేశలయి సౌ • మ్ముల్ డాలఁ జింతార్తిమైఁ
బరిచర్యల్ పొనరించు కాంతలఁ బరి • ష్వంగమ్ము గావించి త
ద్వర జీవమ్ములతోడఁ జేరి రమల • స్వర్గీయ తల్పమ్ములన్.

మ॥ శర నిర్ఘాత విశీర్ణ పక్షులు నిశా • సందారులం గొంద ఱు
ద్ధుర వేగంబున నిండ్లు సేరి హితులన్ • దుఃఖంబుతోఁ గాంచి యీ
చరణాబ్జంబులఁ బట్టుగొన్న సుతులన్ • సాఁకుండి యంచాంద్ర బా
లుర మోముల్ కనివారఁ గాంచుకటిఁ గా • లుం గాంచి రంత్యస్థితిన్.

శా॥ ఈసౌమిత్రి విజృంభణంబు క్షణమి • ట్లేయున్న వెయ్యేల లం
కా సామ్రాజ్యము నాశమొందు నిజ మిం • కన్ మేఘనాదుండు వి
శ్వాసుండౌటకు మున్నె దాఁగుఁడు గిరి • ప్రాగ్భారమందంచు వి
శ్వాసాత్మీయుల కాది కొందఱు గత • శ్వాసాత్ములై రయ్యెడన్.

చ॥ నెఱఁకుల నాటియున్న శర • నిర్గత శోణిత దిగ్ధ దేహు లు
క్కఱఁటి యిలు సేర బంధులు స • యంబునఁ దూపుల నూర్పఁబూన వి
ల్లురివినఁ జత్తుమంచుఁ గదు • నూర్పులు పుచ్చుచు మార్పుచెంది చే
మిరి యిరుపాలఁ బోలె విర • మించిరి సర్వము మౌనులంబలెన్.

ఉ॥ పేరులపై వడిం జనక • తేజులమీఁదను పోక కాల్నడం
బాఱక దంతిమూఁపులను • పాఱక సిగ్గున లంకలోనికిం
జేరక యందు వెల్వల వ • సింపక ప్రాణములందు తీపిచేఁ
దాఁటిరి కొందఱా శవ వి • తానము క్రింద నొదింగి యూర్చుచున్.

చ॥ కురిసిన చోటనే కురియు • క్రొమ్మొగులుంబలె లక్ష్మణుండు దు
ర్భరముగ నాయముల్ నలఁచి • రావణి జంపుదు నంచుఁ గత్తళం
బరవరసేసి వాని వివ • శాత్ముఁగఁ జేయఁగఁ దేఱుదాఁక సం
గర మొనరింత మంచుఁ గలు • కావలి వారలు డాసి యుగ్రులై.

చ॥ అరదములన్ గడించి పౌలు • పారి ప్రభంజన సూను లక్ష్మణుం
గుఱిగొని బాణజాలముల • గుప్పఁగ లక్ష్మణుఁ డాగ్రహించి చి
చ్చుఱ పిడుగట్టి నారసము • లొక్కొట నూఱుల నేసి తేరులన్
ఖరువులఁ దేది చోదకుల • ఖండము ఖండము సేయు నంతటన్.

చ॥ విరథులు వారు పెన్ గదల • వీఁకను కైకొని మారుతాత్మజు
దరమిడి మోఁదఁబోవఁగ ను • దగ్రత నాతఁడు వాని లాగుడున్
వెరవున వీన వీఁడు కదు • వీఁగి వధించున యంచుఁ బాటి రి
ద్దఱుఁ దిను సన్నమేని యెడఁ • దం దలపోయక ప్రాణ రక్షకై.

ఉ॥ కాలము తెఱమిన్ మఱియుఁ • గాలున కింతయు జాడ తోఁపమిఁగా
గాలియుఁ జల్లఁగాఁగఁ దమ • కాయములం జెనకంగ నిద్దురం
దేలి శ్రమంబు నీఁగి మిహి • తేఁకువ చేవయు నొంది వాలముల్
పోలఁగఁ ద్రిప్పుచుం గపులు • మూర్ఛలఁదేఱిరి లేచి రుద్ధతిన్.

తే॥ గవయ గంధమాదన గజ • ద్వివిద మైంద, పనస జాంబవ దంగద • ప్రముఖులెల్ల
వేలుపులు భద్ర వాక్కుల • వినుతిసేయఁ, దరుల గిరుల మోచికొని తె • చ్చిరి కదంక.

తే॥ అంద తొక్క మొగినివైవ • నసురవరుఁడు, ప్లవగ వీరులఁ గని కోప ఖివశుఁడగుచు
నింతయే గద మీచేవ • లేవు లనుచు, నవ్వి ఖండఖండములుగఁ • ద్రెవ్వనేసె.

క॥ విసువక కోఁతులు తాలను, విసరుచు ముసరుటను కాంచి • విల్లును శరముల్
మసలని తోడఁగ నిలిచిన. యసురుని యెద సదయుపగిది • నడఁగె నినుండున్.

క॥ శ్రుతులును స్మృతులును సత్యము, తత ధర్మము లెవని మహిమఁ • దలపించునొ త
త్పతి నెఱుఁగని వెడఁగుల యెద, వితమున విరు లన్ని దెసల • విరివిగఁ గ్రమ్మెన్.

ఉ॥ పాతిక కాష్ఠలో నితని • ప్రాణము తీసినఁ దీఱువచ్చుఁ గా
కీతఁడె తప్ప దానవుల • కిమ్మగు కాలము వచ్చు వచ్చుచో
నాతఁడు మింట సంచరిలు • నట్లయినం గెలుపొందువాఁడు సు
మ్మీ! తద వేల యం చనుగ • మించి విభీషణుఁ డాడు నయ్యెడన్.

క॥ తనుచుట్టిన ప్లవగులపై, హనుమనిపై లెక్కలేని • యంప గముల నే
సిన రావణిఁ దునుమఁగ స్వం, దన మొక నారసముతోడ • ధర బడఁగొట్టెన్.

## ఇంద్రజిత్తు నాగపాశముచే లక్ష్మణాదుల బంధించుట

చ॥ రథమును లక్ష్మణుం డొక శ • రమ్మునఁ గూలుచు నంతలో వియ
త్పథమున కేగి వీరి నహి • పాశముచేఁ బడఁద్రోయ జీవముల్
వ్యథగొని వీడు వారలని • యారసి రావణి మబ్బుఁ జేరె దు
ష్ప్రథితునిచే నిఁకెయ్యది పొ • సంగునొ యంచమరుల్ వడంకఁగన్.

క॥ విల్లును తూణీరంబులు, పెల్లగు కోపంబు క్రౌర్య • విధులుం గల యా
ప్రల్లదుఁడు మింటఁ జీకటి, నల్లని మేఘములలోఁ గ • నంబడకుండెన్.

తే॥ పంక్తికంధరసుతుఁడు త • పఃఫలమున, వరబలంబునఁ గులగౌర • వంబువలన
మంత్రబలముచేత నణువు • మాడ్కి సూక్ష్మ, గాత్రుఁడై కానరాక మే • ఘముల నడఁగె.

తే॥ అబ్జభవునైన హరినైన, నభవునైనఁ, గట్టిత్రోచిగా కూరక • క్రమ్మతిలని
భుజగ పాశంబు నభిమంత్ర • పూర్వకముగఁ, గేలఁగైకొనె వంచనా • శీలుఁడంత.

తే॥ అచటి వానరులును మాయ • నరయలేక, కదనమున జంకి పాఱెన • కాఁదలంచి
యుబ్బియార్చి గంతులువైచి • యుత్సహించి, లక్ష్మణుఁడు నక్లెయెడఁదఁ ద • లంచి నవ్వె.

తే॥ జరుగునది కనలేక ల • క్ష్మణుఁడు హనుమ, మూఁపునుండి ధాత్రికి దిగి • చాప మంగ
దుని కరంబున నిడి మేనఁ • దూఱియున్న, శరము లూడఁగఁదీసి వి • శ్రాంతి గొనియె.

క॥ రావణి నాగాస్త్రంబును, దీపరమున వదలె వదల • దిశలెల్లను శే
షో విలసనము గఁ జేయుచు, నోపగ వడిఁ జుట్టె లక్ష్మ • ణ ని బాహువులన్

మ॥ సకల ప్రాణు లెదిర్చినన్ మనమునన్ • జంకింతయున్ లేని య
య్యకలంకాత్ముఁడు లక్ష్మణుం డిటియఁ ద్రో • యంగట్టు నిక్కట్టు వం
చకు మాయాబల మంచెఱుంగక యుదం • చ త్సత్త్వ హీనస్థితిన్
నికటా ధీల రణస్థలిన్ గగనమున్ • వీక్షించె వే పల్మఱుల్.

శా॥ ఏమాయల్ పొనరించు దొంగను త్రుటిన్ • హింసించి బంధింతు వాఁ
డే మార్గంబునఁ బోవువాఁడనుచు • సుగ్రీవుండు సామీరి వే
వ్యోమ ప్రేషణుఁడైన యంతట దశా • స్యుని వాలి వాలంబు ప్రో
ద్దామ ప్రక్రియఁ జుట్టినట్టులు తద • స్త్రం బంటి చుట్టెన్ వెసన్.

తే॥ క్రూరదంష్ట్రలుగల పృదా • కువులు తక్కు, వనచరులఁగూడ బంధించి • వైచునంత
బాహుబలమున్కి యేమియుఁ • బాలుపోక, భ్రాంతి నొందిరి సమర భూ • భాగమందు

ఉ॥ బంధితులైన కీశలోక • పట్టున లేచుచు వ్రాలు చుగ్రులై
రంధిని గాంచి కంధరముఁ • గాంచుచు వాలము నేలమోఁది పా
లింధమమేచఁ గాంచుచు గ • ణించుచు లక్ష్మణుతీరు దుఃఖులై
యంధుల పోలె నుండిరి ర • ణావని నేమియుఁ దోఁపకుండుటన్.

క॥ ముడుఁగుడురు సత్త్వహీనత, నడుగుడురు విభీషణుఁ గని • యరయఁ బ్రతికృతిన్
మడుఁగుడురు నడుము నిలువక, యుడుగుదు రసువుల్ చలింప • సుగ్రీవులై.

ఆ॥ సంకటంబు దీర్చు • చతురు లెవ్వరు గాలి, కన్న కొడుకు బ్రదికి • యున్న వాఁడె ?
యనుచుఁ గలఁగి మలఁగి • మనువంశ్యుఁ డీస్థితిఁ, గనిన నెంతచింత • గాంచునొక్కొ ?

ఆ॥ అనుచుఁ బనవుచుండ • సంబరమున నింద్ర, జత్తు నిలిచి చూచి • శిత శరముల
వైచి కట్టువడిన • వానరవీరుల, నొంచి కూల్చె నేమి • యెంచఁగలదు ?

ఆ॥ కరువపైన వ్రాలు • కరి మొగులను మహా, వాతమునను వ్రీలు • వైన మొప్పఁ
దూపులొడలఁ జొచ్చి • దూసిపోవఁ బ్లవంగు, లురలి సోలి నేల • దొరలి నారు

క॥ శరములు వేలకొలఁది తన, శిరమున నురమునను నాటఁ • జింతింపక యా
కరువలి కొడుకు సుమిత్రా, వరపుత్త్రుని స్థితికిఁ జాల • వగఁజెందె మదిన్.

క॥ తక్కినవీరులు బాణము, లుక్కఱ జేయంగఁ గూలి • యుర్విని గాత్రం
బొక్కెడ నమ్ములు మిక్కిలి, స్రుక్కించిన నంగదుండు • సోలకయుండెన్.

తే॥ గచ్చకాయలవలె మేను • గదుములైనఁ, గారుచిచ్చునఁ గాలు కాం • తారమట్లు
మనసు మేనును మండఁగా • మలసెఁ బ్లవగ, రాజు రక్తాబ్ధిఁ బొడము మా • ర్తండుఁడనఁగ.

చ॥ అసమ ఫణీంద్ర పాశమున • నర్దితుఁడై యొడలెల్ల దొడ్డ నా
రసములు గ్రువ్వ నొచ్చియు భ • రంబగు కష్టములోర్చి సంసృతిన్

విసివియుఁ ద్రోవఁజాలిన వి • వేకము దార్ఢ్యము గల్గి కర్మలన్
వసమయి యాత్మ చిక్కువడు • బాగున లక్ష్మణుఁ డుండె నయ్యెడన్.

సీ॥ శరములు కిరణ సం • చయముగా సోలు మై, యెదలఁ గాఱెడి నెత్తు • రెండగాఁగ
దెసలఁ బేరిచిన రా • క్షసులను చీఁకట్లఁ. జెలఁగిన లక్ష్మణ • జలజ హితుఁడు
ఉదయాచలేంద్రంబు • పదురున విలసిల్లు, సామీరి భుజ నభ • స్థలిని పొలిచి
విషధరాక్రాంత స • ద్బింబంబుతో మింటి, నుండి మంటఁ బడిన • యొఱపుదోఁచి

తే॥ సోలెఁ దక్కిన వీరులు • స్రుక్కిపడిరి; యిషువు లొడలెల్లఁగప్పిన • యింద్రజిత్తు
దుస్సహంబైన బాధతోఁ • దూలిపడుచు, నోట నెత్తురు గ్రక్కుచు • నొచ్చి క్రుస్సి.

ఉ॥ చెప్పిన యంతవట్టు పని • చేకుఱె నామది సంకటంబు వోఁ
జెప్పెడిదేమి రేపె యవ • శిష్టము పూర్తి యొనర్తు నేఁటితోఁ
దప్పకతీఱె లక్ష్మణుఁడు • తత్ప్రృతనావళి మాసెనంచు నిం
పొప్పఁగ గెల్పు దెల్పు బహు • ళోన్నత రావ మెసర్కొనం జనెన్.

ఉ॥ ఈనెలు క్రమ్మిన ట్లతిశ • యించిన యమ్ములవాన నించు రా
ట్పూన పయోదముం దఱిమి • చొక్కపు రావణియన్ విధుండు లం
కా నగరంబు సొచ్చి పుర • కాంతల మేటి కటాక్ష వీక్షణా
నూన పయోజ తోరణ వి • నూత్న కృతస్థలిఁ జేరె వెంబడిన్.

తే॥ రత్న దీపముల్ కైకొన్న • రాజముఖులు, స్వరయుతంబుగ విజయంబు • పాడుసఖులు
ముందు వెనుకల రా దశ • ముఖసుతుండు, తండ్రియున్న శుద్ధాంతసౌ • ధంబు సేరె.

తే॥ చేరికై మోడ్చి జరిగిన • తీరుదెలిపి, చింతవిడు మలసితి శ్రమ • కొంత దీఱఁ
బిదప వచ్చి విశదరీతి • విన్నవింతు, సెలవె యని వడివడిఁ దన • నెలవుసేరె.

## విభీషణుఁడు లక్ష్మణు నవస్థం గని దురపిల్లుట

మ॥ అటఁ జింతాకులుఁడై విభీషణుఁడు కా • ర్యాలోచనంబంది చి
క్కుటచే నైన వధింబలెం గలఁగి పో • ల్పుం దెల్వియుం దక్క య
క్కట క్రూరాత్ముఁడు చంపఁడయ్యె నను లో • కంబందు దుఃఖంబు లా
రటపెట్టం గడు నింద పాలయితి నౌ • రాయంచు దూపిల్లుచున్.

మ॥ చని కట్టంబడి యున్న లక్ష్మణుని రా • జ ద్రాజభక్తిన్ సమి
త్తున జీవంబుల నప్పగించు కపి సం • దోహంబులం గాంచి యే
మన లోకుల్నను నేమిగాఁ దలఁతురో • ప్రాణంబులన్ మేనఁ బూ
నిన పాపంబున నిందపాలయితిఁ జ • న్నే? యంచుఁ గుందె న్మదిన్.

శా॥ చెంతన్ వర్తిలి సంచుపొంచి వధముం • జేయించినాఁ డందురో?
వంతంగూర్పఁగఁ దోడితెచ్చి వధియిం • పంబూనెనా యందురో?

పొంతంబోవఁ బ్రకారణంబు నలుపజా • ముఖ్యుండుగా నందులోఁ,
చింతింపంగలవారు తోఁచు కరణిన్ • చిత్తంబులన్ మానవుల్.

శా॥ పోరం బొచ్చిన యింద్రజిత్తు నపుడే • పొంగెల్ల వే తూలఁగన్
దేరున్ సారథి గుఱ్ఱముల్ దొరలఁగాఁ • ఛిద్రించి మర్దించి మ
ద్వీరత్వంబును చూపనైతి నని మి • త్రిం బొందఁగా నైతి వే
సారం జింతిలి యేమి? నాకరణి ప • శ్చాద్బుద్ధియుం గల్గునే?

మ॥ దురమందీ కపిసేనతోడ గెలుపో • దుఃఖంబొ చావో ముదం
బొ రహిం బొందుదు నా తలంపు విశదీ • భూతంబు చేయింప కి
ట్లరికింగాక కరవ్యమైన పతిపేన్ • వ్యస్తుండనై ధాత్రిలోఁ
గొలువిం బోలిన వాఁడనైతి విరు వాఁ • గుర్ నష్టమై త్రుంగఁగన్.

మ॥ అనుమన్ వ్యాకులితాంతరంగుఁడయి శో • కాక్రాంతుఁడై దిక్కుతోఁ
పని దీనస్థితు నవ్విభీషణుని తా • పంబెంతయుం గాంచి వా
రని చింతం బరిహారపద్ధతుల నా • రంజేయ సాధ్యంబె? యం
చనలుం దేగి వచించె రామునకు నా • ద్యంతంబు వృత్తాంతమున్

చ॥ కుమిలి తపించి లోన మఱొ • కొంచు నెఱుంగక పల్క కషలన్
నిమిషము లేక చూడకయు • నీరును కార్పక కిన్కతోడ లో
కములను కాల్ప కాచ కలఁ • గం బలవింపక రాఘవుండు చి
త్తమునఁ దలంచె లక్ష్మణుఁడు • తప్పక జీవిమె యంచు ధీరతన్.

చ॥ కలఁగక రామచంద్రుఁ డిఁకఁ • గార్యము వేఱొకరుండు లేదటం
చలఘుమతిం దలంచుచు ర • యంబున లేచి గమించి వేగ రే
వెలఁదుక నీలిచీర తడి • వీడఁగఁ బిండఁగ నిండెనన్న యా
నలువునఁ గప్పు కప్పు కద • నస్థలి జేరె మనస్వి రీకృతిన్.

ఉ॥ చేరి యిరుల్ తొలంగి విల • సిల్ల ధనంజయ కాండ మేయ వే
దోరెను చీఁకటుల్ పగటి • తోయము నొందె రణస్థలంబు పెం
పార యుగాంతవేళ నిట • లాక్షునిచే భువనంబులెల్ల నే
తీరు భజించు నట్టి పగి • దిం గనుపట్టె సుదుస్సహంబుగన్

తే॥ దుర్గికావాస యోగ్యమై • దుష్టగంధ, మైన రణరంగమునఁ గుణ • పాద్రి పొంత
రుధిర పంకిలాంతర గతా • యుధ పరీత, దేహుఁ దమ్ముని కాంచె ధా • త్రీ విభుండు

తే॥ కాంచి పైఁబడి తనదు వ • క్షంబదంగఁ, గౌఁగిలింగొని నిట్టూర్చి • కనుల నీరు
గార్చి రవియొద్ద జలధార • గార్చు కారు, మొగులనఁగ నొప్పె రఘుకుల • పుంగవుండు.

ఉ॥ పుట్టియుఁ బుట్టు వొందని ప్ర • ఫుల్ల సరోజదళాక్షుఁ డూర్చు నీ
ర్వట్టఁగ నేడ్చుఁ గుందుఁ బ్రవ • రంబుల నూర్చును లక్ష్మణా యనున్

ముట్టును ముక్కురంధ్రముల • బుద్ధి కలంగఁగ నోలు దూపిలన్
గొట్టుచు నున్న విప్పుడును • గుండె లటంచు ముదం బెదం గనున్.

ఉ॥ మేచక దేహుఁ డక్కునకు • మేనొఱఁగించుచు దువ్వ వ్యోమముం
జూచును నేలఁజూచు విలుఁ • జూచు భుజంగమ పాశ బంధముం
జూచు సురేంద్రవైరి చను • చొప్పును చూచు జగంబుఁ గూల్పఁగాఁ
జూచుఁ గడింది నౌడు కఱ • చున్ మహనీయుల పల్కులం గొనున్.

తే॥ నెఱిఁ బ్రమాణంబులం దాఁటి • నిల్చినట్టి, రామవిభుఁడు వానర నిక • రమునుగాంచు
విధినిగాంచు నమ్మలఁ గాంచు • వింటిఁగాంచుఁ, దహతహంబొందుఁ జిత్తంబు • తత్తరింప.

ఉ॥ పిల్చి వచించియుండిన వి • భీషణ యప్పుడె నాగపాశముం
దాల్చిన చేతులన్ శిరము • ధారణి డుల్లఁగ నేయకుందునే?
కాల్చితి నామనంబు పని • గానక పాదొనరించి తివ్విధిన్
నిల్చఫలంబె ప్రాణములు • నీఁగిన పిమ్మట దేహ ముర్వరన్.

ఉ॥ రాముని పల్కులన్ విని క • రంబు వడంకు విభీషణుండు సం
గ్రామ భయంకరా విసుము • రావణి పోరొనరించువేళ నీ
ప్రేముడి తమ్ముగే గెలుపు • వేఁడెన కాఁ దలపోయుచుంటి మీ
బూమియ నాగపాశ బల • ముం గొని పుట్టినదయ్యః వింటివే.

సీ॥ అతికాయు మస్తక • మట్టకు నెడఁబాపి, నట్టి లక్ష్మణు డు ద • గాస్యుఁ డిటకు
పుత్రకారణ రోష • మున వచ్చువాఁడని, తలఁచి యుచ్చోటనే • నిలుచునంత
నలువది వెల్వల • దళముతో నింద్రజి, యే తెంచి రణమున • నేపు మీఱి
నలువది వెల్వల • బలిముఖ సైన్యంబు, గంద్రించి త్రోచి ల • లక్ష్మణుని గదియ

తే॥ నతఁడు నల్వదివెల్వల • పృతనఁగూల్చి, వేయి కీరుల విఱిచి త • ద్విక్రమంబు
చావు వఱకును తెచ్చి య • స్త్రము లసంఖ్య, ములుగ గుప్పించి శోణిత • మొలుకఁజేసె.

తే॥ దడము లవిసెను నొచ్చి యొ • క్కఁడుగ విలిచెఁ, దప్పెనేని మాయలు సేయు • దనుజుఁ డనుచుఁ
దమ్ము నెచ్చరించితి నంతఁ • దమ్మినంటు, చరమగిరిఁ జేరెననువుగా • నినుఁడుమీఱె.

తే॥ మాయియగు ఇంద్రజిత్తు వ్యో • మమున డాఁగి, నాగపాశంబుచేత సై • న్యములతోడ
లక్ష్మణుని కట్టివైచె జా • లంబుచేసి, బద్ధులైనారు వీరు చా • వంగలేదు.

తే॥ పెనచికొనియున్న పాశంబు • వీడునేని, వీరు లేవఁగలరు స్వల్ప • విశిఖములకు
జీవముల వీడువారె? రా • జీవనేత్ర! పాపములు ధర్మమును గెలు • వంగఁగలవె?

తే॥ అనుడు రాముఁడీ పాశంబు • నరుదుగాఁగ, నెవ్వఁడిచ్చె దీనికిఁ బ్రతి • కృతియుఁ గలదె?
తెలిసినంత తెల్పుమ యనఁ • బలుకు నా వి, భీషణుండు సద్గుణ గణ • భూషణుండు

తే॥ బ్రహ్మయాగ ఫలంబుగాఁ • బడసె దీని, శంకరుఁడు కొని జగమున • జయమునొందె
భవునిగూర్చి చేసిన తపః • ఫలముగాఁగ, నతఁడె వీనికి నొసఁగె నె • య్యంబుకతన.

తే॥ దీనిచేఁ దొల్లి యింద్రు బం • ధించివైచె, దీనిచేతనే మన హను • మానుఁగట్టె
నిర్జరులు స్వర్గపాలన • నీఁగినదియు, దీనివలనన సుమ్మి వై • దేహినాథ!

తే॥ పట్టినట్టి వారల ప్రాణ • వాయువులను, పీల్చికొనికాక యూరక • వీడిపోదు
అజ హరాదులకును ద్రోప • నలవికాదు, తక్కువారల సంగతి • తలఁపనేల?

మ॥ అన నైరాశ్యముచెంది రాఘవుఁడు రో • షాక్రాంత చేతస్కుఁడై
కని యీ పాశము నిచ్చి నాతని శిరః • ఖండంబు గావింతునా?
మును లోకంబులఁ గాల్చి బూది జలధిం • బూడ్పింతునా? లంక వీ
వనధిన్ ముంతున? యేమిచేసినను పా • పంబింత చేకూరునే?

చ॥ వరముల నిచ్చి యీభుజగ • పాశము నిచ్చిన వారె వచ్చి సం
బరమునఁ గాతురేని తగు • మన్ననఁ గొంతురు కావరేని శం
కరుఁడు పురంబు లేర్చిన తొ • గం ద్రిజగంబు లొనర్త్తు బూదిగాఁ
బురహరుఁ డడ్డమైన సుర • పూజ్యుఁడు ధాతయు నడ్డు నిల్చినన్.

శా॥ నా తమ్ముండె మృతిం భజించిన భువిన్ • మన్నింప నాకేది? వి
ఖ్యాతిం గూర్చునదేది? నిందయని ప • ల్కందగ్గదేదీ? జగ
త్పూతంబై తగు ధర్మ మేది? కన మ • ర్త్యుల్ దివ్యులున్ నాయెడన్
భ్రాంతిం జేరి భజించుచున్న ప్లవగ • వ్రాతంబుతో సాటియే?

మ॥ అని రోషాకులితాత్ముఁడై పలికి మా • యన్నిచుఁ దొక్కఁడు చిం
తను కల్గింపఁగ నాగ్రహించి జగముల్ • నాశంబు గావించుటల్
మను వంశేంద్రులకున్ హితంబె యని సం • భావించి నిట్టూర్చు ముం
దున నూయిన్ వెను గోయి యయ్యె ననుచుం • దూపిల్లు సందేహిలున్.

తే॥ రెండు తుండంబు లున్నవే • దండ మొండు, తోత్రమునకు భయంబంది • తూలి తలరు
సరణి రాముఁడు ధర్మపా • శమ్ముఁదడవి, నన్నుఁ జంపదో యిదియని • విన్ననొందె.

## గరుడుఁడు రాఁగా నాగపాశము వీడుట

తే॥ ఈస్థితి యిఁకెట్టి పరిణతి • నెనయునొక్కొ, యని వియచ్చరుల్ చింతించు • నవసునందు
ప్రక్కనే యున్న గరుడుండు • భ్రాంతివలనఁ, గరఁగి చీఁకటిలో నటఁ • గానవచ్చె.

సీ॥ కలఁగని హృదయంబు • కలఁగుటచేఁ జింత, తగని డెందంబున • నొగులువాఁడు
లంకేశుఁ గాంచిన • లలి జగంబులఁ గాంచు, వడువున కొరాట • పడెడువాఁడు
పక్ష మారుత వేగ • బలమున దిగ్దంతి, నేత్రముల్ మూయంగ • నెగడువాఁడు
తన మేనికాంతి భూ • తల వియత్తలములఁ, బట్ట పగలు చేయ • వఱలువాఁడు

తే॥ దూరదర్శిచక్షువులతోఁ • దోయజాక్ష, మేనుగాంచియుత్సాహంబు • మీఱువాఁడు
కడలి తరఁగలు చెదరఁ జేఁ • కటులు బెదర, వచ్చువాఁడు నభశ్చరుల్ • మెచ్చువాఁడు.

సీ॥ పాపజాతి కలంగఁ • బాఁపజాతి నలంగ, దర్శన స్పర్శనో • ద్ధతి గలాఁడు
అరులు గిరులఁ దూఱ • నిరులు దరులఁ జేర, బలువు చెఱువు మేనఁ • గలుగువాఁడు
అలరు లత్తుక మేను • వెలరు కుత్తుక జాను, గలుగు వెలుఁగుతోడఁ • జెలఁగువాఁడు
గుణ భూషణముల భా • షణ భూషణముల స, న్మణి భూషణమ్ముల • మలయువాఁడు

తే॥ ఒడలివలన వెన్నెల లెండ • లొలయుచుండఁ, గనకగిరిమీఁది భానుని • కరణి నొప్పి
శీర్షమున రత్నమకుటమ్మ • చెన్నుగులుక, నైన తీయుండు జానకీ • జాని దాసె

సీ॥ కాల మేఘములీలఁ • గ్రాలు మేనినిగాంచి, చిరము నమస్కృతుల్ • సేయకుంట
ధ్వజముపై నుండి స • ర్వ జగంబు లనువొందఁ, గావించు వినుతులు • గానకుంట
వాహనమై లోక • వంద్యత్వము చిరమ్ము, మఱచిపోవఁగఁజాలి • మలయుచుంట
తల్లిని పాసిన • పిల్లకై వడిఁ జాల, కాలంబు ప్రభుఁబాసి • క్రాఁగుచుంట

తే॥ తలఁచి తలఁచి మొత్తనగ జి • త్తంబుకరఁగ, లోక మూలకారణ రమా • లోల! వరద!
బ్రహ్మరుద్రాది దేవతా • వంద్యనామ! రామ! చింత యేలనుచుఁజే • రంగవచ్చె.

తే. మాయ జగమిది సర్వంబు • మాయ నీవు, మాయకాఁడవు నీదగు • మాయ నెఱుఁగ
నెవరు వలఁతు లీమాయ ని • న్నేమిసేయు? విశ్వజనక! విశ్వోదర! విశ్వసాక్షి!

సీ॥ ఆద్యమై కాంచి మ • ధ్యమ్మయి పోషించి, యంత్యమై పరిమార్తు • వరయ జగము
లన్నిట నుండ వి • ష్టాపి యొనర్తువు, నరుఁడవై యొరులచే • వరముగొందు
నీసములుగఁ గమ • లాసన రుద్రులఁ, జేసి వారలతోడఁ • జెలఁగుచుందు
తలఁపున సృష్టింతు • తలఁపున విలయంబు, నెసఁగింతు వీవు ల • యింపకుందు

తే॥ విట్టి పద్ధతి యిసుమంత • యెఱుఁగఁగోర, సంధులంజేసి చీఁకటి • యందు నిలుతు
వహహ! జాణతనంబొ? పి • న్నాటయేమొ? యరసి పలుకంగ నేరికి • నైతిగాదు.

సీ॥ జీవిత మొసఁగుదు • చెడక నైజస్థితి భావియం దుంచవు • వాంఛగొనవు
దొరకనిత్తువు కొన్ని • దొరకనీయవు కొన్ని, దొరకిన యవికూడ • నోఁతు కొన్ని
పసిబిడ్డ నేడ్పించి • పండిచ్చు కరణి దుః, ఖింపఁజేయుదువు సు • ఖింప నిత్తు
వాహారమగుదువు • ప్రాణంబు నగుదు దో, బూచులాటఁజునుందు • తోఁచకుండ

తే॥ కాన బహురూపుఁడనుచునే • కంబయనుచు, నందరానివాఁడంచుమా • యావియంచు
జ్యోతియంచు నానందమ • యుండవంచు, శ్రుతులు బహువిధంబులుగ వా • క్రుచ్చుచుండు.

సీ॥ ఆస్తికు లౌనన • నాస్తికుల్ లేదన, నెసఁగు నేర్పులకు దా • విత్తువేల?
బహుళశంకలకుఁ దా • వలమిత్తు వదియేల? మాయలతోడనే • మలయుచేఁ?

పలువిధ మతములఁ • బ్రబలనిచ్చుట యేల? జనులు తన్నురలాడఁ • గనుటయేల?
పాపంబులను తొల్తఁ • బండనిచ్చుట యేల? మొలకలో గిల్లుట • తెలియవేల?

ఆ॥ మొలవ నిచ్చుటేల? • ముదుర నిలుపుటేల? శ్రమలఁబొంది తుదకుఁ • జదుపనేల?
తెలిసి తెలియకుండు • నెరచాటు బ్రదుకేల? స్పష్టపఱుపకట్లు • వంపుటేల?

సీ॥ మఱచిన తెలఁగేలఁ • మఱవని వెరపేల? యెఱుగకుండుటయేల? • యెఱుఁగుటేల?
వదలియుండుటయేల? వదలకుండుటయేల? • యంటియుండుటయేల? యంటమేల?
ఒక్కరూపంబేల? పెక్కురూపములేల? తినుటేల తిండికై • తిరుగుటేల?
పుట్టించు టదియేల? పొలియించు టదియేల? నడుమఁ జిక్కులు పెట్టి • నలఁచుటేల?
తే॥ దేహమును పొందుటేల? యీ • త్రిప్పటేల? ధర్మ సంస్థాపనమునకో? ధరణి జనుల
కెల్ల నాదర్శనమునకో? యేమితెలియు? నీదుమాయలు కల్లలో, నిక్కువములొ?

సీ॥ కర్మఫలంబుల • కై జన్మ మొసఁగెదు, కర్మల సంటక • కదలువారి
కానంద మొసఁగి త • న్మానసంబుల నుందు, మునులకు మొదలి మ • మ్మూర్తులకును
జ్ఞానులో వారిక • జ్ఞానులో వారికి, నెల్ల వారికిఁ దెల్ల • మెఱుఁగఁబడవు
పెనఁగినవారు చ • చ్చినవారు కని దుఃఖ, మొందువారలయందు • నుందువనుట

తే॥ యిప్పు డిచ్చట నీయొద్ద • నెఱుఁగనయ్యె. వెదఁగు వెదఁగు వివేకి వి • వేకమీవు
నీది స్థిరగుణం బెయ్యదో? • నిశ్చయముగ, నెఱిఁగి కొలలేక యెఱిఁగింప • నెవరి తరము?

తే॥ కార్తికేయకందము నొల్వఁ • గడఁగునంత, లోన నేమియు లేకుండు • జానుదోఁప
నీ వవతరించియును నిజ • మెఱుఁగనీవు, నీదు మాయలఁ దెలియంగ • నేరమయ్య!

తే॥ అని నుతించుచు గరుడుండు • తనువుదీప్తిఁ, దమముఁ దోలుచురాఁగాంచి • దాశరథియు
వింతవాఁడెవఁడని చూచు • నంతలోన, వచ్చి చెంగట నిలిచె స • ద్భక్తి తొలఁక.

* చ॥ నిలిచినయంత నాగములు • షెమ్మదిగా ధనమున్ గుణంబు ని
ర్మల యశమున్ గలట్టి విభు • మన్ననఁ జెందిన వారి యంగదల్
తొలఁగిన చందమై కలప • తూఁటికి సన్నని దారమంతయుం
దెలియఁగరాక మాయమయి • తీఱె జగంబులు సంతసిల్లఁగన్.

క॥ ఎఱకల కరువలిచేఁ దమె, పఱపుటయేగాక మేనఁ • బ్రబ్బిన యలుఁగుల్
తొటఁగెను దద్దులతోడను, నెఱి వెలివరి కంటఁగట్టు • నింపయుఁ బోలెన్

తే॥ క్రూరకయ్మ లధర్మ లిం • ద్రాదులందు, మందునకు నొక్కఁడే నుసు • తొందలేదు
క్రొత్తసృష్టిలో జీవుల • కొమరుదాల్చి, వానరులు లేచి యుత్సాహ • వంతులైరి

---

* ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగములు తిరువెత్తైయ్ నెల్లూరున నుదారుండగు జటప్ప తమ్మని శరరాముని గాంచిన యాచకులయు బంధులయు ఆఁకలివలె తొలఁగినవి. అనిమూలము.

ఉ॥ నీతివిదుండు రాఘవుఁడు • నెమ్మది లేచి నమస్కరించు వి
ఖ్యాత చరిత్రు లక్ష్మణుని • గాఢముగాఁగఁ బరిష్వజించి యి
ట్లీతటి బాముగూర్చు విధి • యే తొలఁగించె నటంచు వానర
వ్రాతముఁ బ్రాణముం బలెఁ గ • రంబున దువ్వుచుఁ బల్కెఁ దార్క్ష్యతో.

మ॥ స్థిర దోషాకరు లీల నొప్పు నశరా • జింబొల్చు పుణ్యాత్మ! దు
ర్భర దుఃఖాంబుధినుండి కేల్చితి తపః • ప్రాప్తోత్థ పుణ్యంబు నాఁ
గరుణామూర్తివి నీకుఁ బ్రత్యుపకృతిం • గావింప నేముండు? స
త్పురుషుల్ ప్రత్యుపకారముం గొనఁగ సం • తోషింతురే యెయ్యెడన్?

శా॥ ఏమిం దోఁపక వేఁగుచున్న యిటకీ • వేతెంచి మా ప్రాణముల్
ప్రేమన్ వెండి యొసంగి కాచుటలతో • విజ్ఞోపచారోక్తులి
ట్లామోదంబుగఁ బల్కుచుంటివి మహా • త్మా! దీనికిన్ సాటిగా
మేమేకానుక లీయఁగాఁగలము? మా • మేరల్ మహాల్పంబులౌ.

శా॥ సందేహించుచునున్న ప్రాణములు ని • చ్చంగూర్చు పూజ్యాశయా!
ముందెన్నండును చూడలేదు చెలిమిం • బొల్పార దొక్కండు మా
యందుంగైకొనలేదు నీకుఁ గొఱయే • యందంబునన్ లేదు మా
చందంబారసి తెల్పు చేయఁదగు క • ర్జం బెద్దియే నున్నచో

మ॥ అను శ్రీరాముని ప్రేమపూర్ణ విమల • వ్యాహార మాలించి య
వ్వినతాపుత్త్రుఁడు కేలుమోడ్చి యనఘా! విద్విడ్వధానంతరం
బున వత్తున్ మన ప్రాఁత చుట్టఱికమున్ • మోదంబుతోఁ బూర్తిగా
విన వాక్రుచ్చెద వీడుకోలె యనుచున్ • విచ్చేయుడుం గాంచుచున్.

చ॥ పిలువక వచ్చి జీవములఁ • బ్రీతి నొసంగె నుదారుఁ డీతఁ డే
వలనను మాఱుమేలు మన • పాల గ్రహింపఁడు లోకమందు పు
ణ్యులు తమయంత వచ్చి జని • నొవ్వులఁ దీర్తురు గొప్పలాభముం
దలఁచియొ వారిదంబు జన • తా ఘన తాపము పావుచుండుటల్?

చ॥ అని రఘురాముఁ డాడఁగ మ • హాబల సూనుఁడు దేవ! లక్ష్మణుం
డని మరణించె నంచు మిథి • లాధిప నందన కుందు నొందుఁగా
వున విజయోద్ధతి న్నిదురఁ • బొందిన రక్కసిమూఁక భీతిలన్
గొనకొని సింహనాదము న • కుంఠిత రీతి నొనర్తమా యనన్.

మ॥ ధరణీజాపతి మంచిదే యనఁగ స • ప్తద్వీపముల్ సప్త సా
గరముల్ సప్త కులాచలంబులు కలం • గన్ సప్త మేఘంబులున్
బరపై తాళల రాల్ప దిక్కులగలన్ • బ్రహ్మాండ భాండంబు చం
దఱగా వానరవీర సంతతి మహా • ధ్వానంబు గావింపఁగన్.

మ॥ అకలంకాత్మ ధరాత్మజాత మదిలో • నారాటముం గూర్పఁ ద్ర్యం
బక పక్షంబునఁ గాఁడు మాయశరముల్ • పక్షంబుఁ దొల్వంగ స
జ్జర సెజ్జం బొరలాడు పంక్తిముఖుఁ డా • శబ్దంబు నాలించి యిం
చుక యోచించి నిజస్థితిం దెలియఁగాఁ • జూచెన్ విలోలాక్షుఁడై.

మ॥ జనకాజ్ఞన్ బడయాని ధర్మమును సం • స్థాపించి దుష్ప్రాప వ
ర్తనులం గూల్పఁగఁ గంకణంబు గొను శ్రీ • రామున్ మనంబందు చిం
తన గావించుచు నున్న సీతయును సీ • తాదేవిపైఁ బ్రేమ ని
ల్పిన మూఢుండును తక్క నిద్రిలని జీ • వింగాన మాలంకలో

మ॥ ఆ శబ్దంబును విన్న రావణుఁడు కో • పావిష్టుఁడై లేచి యా
కీశవ్రాతము లక్ష్మణుండు నవిలోఁ • గీడొంది రన్నట్టి పం
దేశం బెంతటి సత్యమో ? యనకులా • భీశాన శింజాన మా
కాశం బంటెను వాన రావళుల పె • న్గర్జా నినాదంబుతో.

తే॥ రామ కోదండ మొసఁగె ని • ర్ఘాతరవము, లక్ష్మణుని ధను వందగో • శముఁ బగిల్చె
హమును గర్జ శ్రవణభేరి • యగలఁజేసెఁ, దరణిసుతు గర్జనంబు రో • దసిని నించె.

తే॥ అంగదుం డార్చుచుండె నీ • లాది కేశు, లుత్సుకత్వంబుచేఁ జేయు • నుగ్ర రవము
బ్రహ్మగోళంబులోన వె • ల్పలను నిండెఁ, బాళమున నుండి వారు వీ • ధ్వడిరినిజము.

క॥ అనిలేచి పంక్తికంఠుఁడు, చనియెను వడి నింద్రజిత్తు • సదనంబునకున్
మునువెనుకల ఖడ్గలు దీ. ప నికరములు పట్టి దనుజ • వనితలు నడవన్.

తే॥ చేలములు జాఱుచుండఁగఁ • గేలఁబట్టి, నెఱి కురులుప్రేల మత్తెక్కు • నిదురకనులు
వ్రాలఁ దడఁబడు నడకతో • వచ్చినారు, మధ్యమధ్యఁదూఁగుచుఁదటి • న్మధ్యలపుడు.

తే॥ మద్యపానంబు కూర్కు నా • మధ్యఁ గలలు, కినుల బరువును తోఁచితోఁ • పనివిధమ్ము
పాట లందెల కొలఁది శ • బ్దమ్ముగలుగఁ, దడఁబడుచు నడచిరి దేవ • తరుణులపుడు.

తే॥ మొగులునకునల్పుగల్పించి • పొగలునించి, పూలుతుఱిమినట్లుండు కొ • ప్పులును నీల
నయనములును కెంజెవవులు • నౌదు గలుగు, పడఁతు లూఁగుచుఁ దూఁగుచుఁ • బడుచుఁ జనిరి

సీ॥ మధురసాలామృత • మాధుర్యములఁజేర్చి, కలుకుల పలుకులు • గాఁ గదించి
హరిణ నేత్రాబ్జంబు • లందలి సౌందర్య. ములఁ దీసి సోగ క • న్నుల నమర్చి
తక్కు సుందర వస్తు • తతినుండి కొన్నట్టి, మురువున నవయవ • ములు సృజించి
చిత్రసృష్టిగ బ్రహ్మ • చేసిన చెలువలు, దశముఖు నిరుదెస • దవిలి రాఁగఁ

తే॥ ప్లవగ భీకర రవములు • చెవులఁబడుడుఁ, బిడుగు రొద విన్న భుజగుల • వడువుగాఁగఁ
సింహ గర్జనమును విని • చిదగొదవడుఁ, వారణములు చందము దైత్య • వరులు పొంద

తే॥ త్వరగఁ జని పెద్దకొడుకు సౌ • ధంబుచేరి, గాయములనుండి పీచూరఁ • గ్లమము సెంది
సింహఘాతంబుచేఁ జేవ • చెడిన గజము, చెలువునను బెగ్గిలెడి యింద్ర • జితునిగాంచె.

ఉ॥ లేచి నమస్కరించు దిట • లేక కరంబులు శక్తిహీనతం
దోఁచు విధంబునన్ వినతి • తో మెలమెల్లన మ్రొక్కు పుత్రకున్
జూచి యిదేమి చాల శ్రమ • సుక్కితి? వేమి ఘటిల్లెఁ? జెప్పుమా
దాఁచక యంచుఁ బల్కులు లె • డంగొని వేఁడఁ గుమారుఁ డిట్లనున్.

చ॥ కవచము పట్టు వీడినది • గాటపు తొమ్మనఁ జెప్పరాని లా
ఘవమున దూసిపోయినవి • కాండచయమ్ములు షేరమేటి దా
నవకుల చంద్ర! మిక్కిలిగ • నల్లయు వెల్వదె మేనుసోలె మా
య వలన లక్ష్మణుండు మృతి • నందకయుండిన నేమియౌదునో?

చ॥ హరిహయుఁడున్ హరుండు హరి • యర్కుఁడు మున్నగువారు సేయు సం
గరముల నింతగా నలయి • కం గొనలే దిపు డాడునట్టి దీ
న రవము మున్నొకప్పుడుఁ గ • నంబడ దమ్మనుజేంద్రు బల్మి య
జ్జరే! వివరించి తెల్పనొక • చాపముతోడిది గాదు నాయనా!

చ॥ అనుజుని శక్తి యిట్టి దగు • నగ్రజు శక్తి తలంచి చూడఁగా
మనకది తెల్పఁగా వలఁతి • మాత్రము గాదు పయిన్ మతేమిగాఁ
జనునొ వచింపఁగాఁ దలఁపు • చాలదు చూచెదుగాక గెల్పమే
మనకగు నంచు నిక్కుటలు • మా పొరపాటగు మాను నాయనా!

ఉ॥ వానరవీరులం దునిమి • వారక లక్ష్మణుఁ గూల్చి గెల్పమున్
నేను గడించుటల్ వినుము • నిక్కము మాయను నాగపాశముం
బూనుటచేత నే; యిఁక ను • భూమిజభర్త యొకండ నిల్చెఁ బైఁ
గా నగు కార్యమెల్ల జరు • గందగు నంచు వచించు నంతటన్.

ఉ॥ రావణుఁ డిట్లనున్ గుణ వి • రావము లక్ష్మణు వింటినుండి పై
తావులు బ్రద్దలౌ నటులు • తార్కొనె వానర సింహనాదముల్
మేవుకొనెం దివంబు రణ • మేదినిఁ బుట్టిన గొప్ప ఘోషముల్
నీవు వినంగలేదొ యన • నివ్వెఱఁగొంది కుమారుఁ డిట్లనున్.

ఉ॥ వారలు నాగపాశమున • బంధితులైరి మొగంబులందు తే
జో రమ డిందెఁ జావక య • సుప్రజ మొందుట సత్యమౌనొకో?
యేరికి దానిఁ దప్పికొన • నిమ్మగుఁ? దప్పిన దైవశక్తికిం
దూఱు ఘటిల్లదే? యనుచుఁ • దూఱి తలంచుచు నుండు నంతటన్.

ఆ॥ వేగు లరుగుదెంచి • విభునకు మ్రొక్కంగ, నాతఁ డాత్రపడుచు • నడుగునంత
వారలిట్లు లర్థ • వంతమౌ వాక్కులఁ, బలికి రధిక నయము • భయము గదుర.

ఉ॥ పాశ విబద్ధులై శర వి • పాటిత దేహులునై రణంబునం
గీశులుఁ దమ్ముఁ డుండఁ బరి • కించి యలంగి తపించి యేడ్చి సీ
తేశుఁడు మిక్కిలిం గినిసి • యిత్తఱి లోకములెల్ల నొక్కటన్
నాశ మొనర్తునంచు జత • నం బొనరించుచు నుండుసంతటన్.

చ॥ గరుడుఁడువచ్చె వాని యెస • కంబగు రాకను గాంచి నాగముల్
తురతురఁ గట్లువీడి చిఱు • తున్కలుగా నశియించె వారి ము
మ్మరమగు మేనిగాయములు • మానెను మున్పటికంటెఁ దేటయున్
డిరము బలంబు గల్గి యటు • కేఁకువ నార్చిరి వార లయ్యెడన్.

ఉ॥ నావుడు రావణుం డనియె • నాదు కుమారుని నాగపాశ మీ
తేవను వైనతేయుఁడు ఘ • టిల్లఁగ నాశిలెనేమి? వానికిం
గావర మింతగల్గెనె? వి • కావిక లయ్యెను నా ప్రయత్నముల్
నా విధులిట్టులై వెఱఁగ • నా గరువంబును మంటఁ గల్పెనే?

సీ॥ పదునాల్గు లోకంబు • లుదరంబున నడంచి, వీడుచుండు ననెడి • వెడ్డుకీర్తి
పడసిన వెన్నుండు • బవరంబు నాతోడ, నొనరించు నాఁడు భీ • తిని వహించి
జగములన్నియుఁ బెక్కు • సార్లు చుట్టిననాఁడు, డాఁగురించి కదలి • డాఁగునాఁడు
అల్ల వైకుంఠంబు • కొల్లవెట్టిననాఁడు, నాశరమ్ము లురమ్ము • నాటునాఁడు
తే॥ జరియలను వీఁపు బాహువుల్ • నెఱఁకులంటఁ, గ్రుచ్చి తఱిమిననాఁడు నీ • గ్రుడ్డిగరుడి
చూడదో? శక్తిలేదో? పి • చ్చుకలమీఁది, కేగెనో! నాఁటి కడిమి నేఁ • డెఱుఁగదేమొ?

తే॥ కాఁగలది కాకమానదు • కడచి బ్రమకు. వారి నెట్లయినం జంప • వలయుఁగాదె?
యీవ తగుదు చేయుము తార్క్ష్యుఁ • డీలఁబొంద, ననుడు మేఘనాదుఁడు తండ్రి • కనియె నిట్లు

తే॥ నేఁడు మాత్రము శ్రమనీఁగ • నిలిచి యెల్లి, వెడలి బ్రహ్మాస్త్రమున మనో • వేదనంబు
నీకుఁ దొలఁగింతు ననిపల్కి • నిర్జరారి, మంచిదని చేరెఁ దన తల్ప • మందిరంబు.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ రా మ.

# కంబరామాయణము

## యుద్ధకాండము :: ఉత్తరభాగము

---

### 19. సేనానాయక వధ పటలము. (102)

తే॥ మిన్నలము పెడబొబ్బలు • విన్న దైత్యు. లదరి శంఖ భేర్యాది వా • ద్యములు చెలఁగ
సమర కౌతూహలంబు డెం • దములఁ బొడమ, నసురవిభుఁ జేరి యానతి • యడుగునంత.

తే॥ బవరమున కీవునమ్మహా • పార్శ్వతోడఁ. బొమ్ము ధూమ్రాక్షయను దశ • ముఖుని గాంచి
విన సహింపక దూతలు • వీరుచేయు. చేఁత లించుక వినుఁడని • చెప్పిరిట్లు.

చ॥ రథములు వోవ వారణ తు • రంగములెల్ల నశింప రాక్షసుల్
క్రుధగొని వీరునేసి యనిఁ • గూలఁగ నింద్రజి యొంటి నిల్చుచో
వ్యథగొని లక్ష్మణాస్త్రములు • వచ్చెనదో యిదో యంచుఁ గొంకుచున్
పథము దొలంగి వావిడిచి • పాఱినవారలు ధీరులే యనన్.

తే॥ క్రూరకర్మంబులను జంకు • కొంకు లేక, చేసి యలవాటు పడినట్టి • చేయిగాన
దశముఖుం డదివిని ఘోర • దావవహ్ని. కరణి మండుచు వారలఁ • గట్టఁబనిచి.

#### రావణుం డింద్రజితుని చక్రరక్షకుల ముక్కులుఁ గోయ నాజ్ఞాపించుట

తే॥ వీరి సేవ యిట్టిది యంచు • నూరివార, లెఱుఁగ నాసికఁ గోసి యూ • రెల్లఁ ద్రిప్పి
విఱువుఁ దంతియచాలును • వేఱువలదు, పొందనఁగఁ గింకరులు కోయఁ • బూనునంత.

ఆ॥ వలదు వలదటంచు • వారల కడ్డంబు, వచ్చి యాఁపి పంక్తి • వదనుఁ గాంచి
యేమిసేయఁ దలఁచి • తిది ధర్మమే? యంచు, మాల్యవంతుఁ డనియె • మఱియు నిట్లు.

చ॥ గెలిచినవార లోడుటయు • గెల్వనివారలు వెండి గెల్చుటల్
తలఁపఁగ నైజమై పొసఁగు • ధారుణియందు మఱంటిమిన్ సదా
చలనములేక నిల్చుకొనఁ • గాలినవాఁ డొకరుండు కల్గనే?
వలపులఁ గూర్చుచుండు జయ • పంకజగేహిని దాంతచిత్త మే?

తే॥ పరబలం బించుకేనియు • నరయవలదె?. తొల్లి నిర్జర సేనలు • వెల్లివిరిసి
వచ్చి యోడవె? యంతతో • వాసవుండు, జతనమును మానుకొనియెనే • జగమునందు?

చ॥ పరుఁడు కంపితాంగుఁడయి • పార్థివ పీరుని చేరవచ్చి తా
శరణమునొంది దీపముల • జానుగ విల్చుకొనంగఁజాలె నీ
పురువులు చూడ లెక్కకును • పోల్పఁగఁజాలినవారె? ఘోర సం
గరమున వారితో నెదురఁ • గా వశమే? యిది నీవెఱుంగవే.

క॥ పొలిసె నలువది వెల్లువల్ • కలనియందు. వీరు మువ్వురే ప్రాణమ్ముం • లార నిలువ
కొన్న వారు గావున వీరి • కన్న నెవరు. ప్రథన చాతుర్యమును బయ • ల్పఱచినారు?

చ॥ చెడియెను నాగపాశమును • చేర్పడి యర్ధముకంటె హెచ్చుగా
మడిసె బలంబు నీపు నని • మానవనాథుల నేర్పు పెంపు ను
గ్గడువుగఁ గాంచివచ్చితివి • గాదె కుమారునితోడ నుండమిన్
బెడుగుగ నెంచి ముక్కలను • చెక్కెడె? యియ్యది యుక్తకార్యమే?

తే॥ లక్ష్మణుని పేరుసెప్ప నీ • లంకలోని. జనులు తమతలపుల మూసి • కొనెడివారు
ఎవరినాసిక గోసెదో • యెంచిచూడు. జగము కలదాఁకఁ గోసిన • సమయునేమి?

తే॥ దూతయై వచ్చినట్టి వా • తూలసుతుని. ధాకకోడి మ్రొక్కినవారు • సోఁకులందు
పెక్కురున్నారు వారలు • ముక్కులొంది. యున్న వారలు కోయక • యుంటివేల?

ఉ॥ సీతను పీడమింగలుగు • చిక్కులచే మనవీరు లెందఱో
యీతల శత్రురాజి వధి • యింపఁ బ్రతిజ్ఞలు చేసిపోయి రా
రీతిగఁ జేసివచ్చు నొక • రిం గనమింతకు రామలక్ష్మణుల్
సీతలఁద్రొక్కి నిల్చి రిఁక • నెవ్వడి నెల్లర ముక్కులూడ్చెదే?

చ॥ అనవిని వారు దెందముల • సంటక యించుక మాని కేలు మో
డ్పును గడియించి దైత్యకుల • ముఖ్యుని గాంచి క్షమింపుదేవ! మా
మనముల నెందు రోసినను • మాయలు మోసము లేదు సంగరం
బున ఘటియించు దుస్థితులఁ • బూర్తిగఁ దెల్పెద మాలకింపుమా.

మ॥ విరథుండై శినయుండు శక్రజితుఁడే • విస్ఫీథి కేతెంచి శం
బర మాయల్ పచరించి ప్రాణములతో • బైల్పడ్డవాఁడయ్యె మా
తిరముల్ సెప్పఁగనేల? దేవ! యిఁక ధా • త్రీనాథ శిక్షంబులన్
జరణాబ్జంబులచెంత నుంచెదము ని • చ్చల్ నీవు మోదింపఁగన్.

ఉ॥ పంపుము పంపి తేని యన • వద్య రణంబున నేఁట రేపటన్
చంపిరి యంచొ చంపఁబడి • చచ్చిరి యంచునొ వింటుగాని వం
శంపు గురుత్వమే చెడఁగ • జాతిరి లాతిరి పాతిరంచు నీ
చంపు వచస్సులన్ వినఁగఁ • జాలవు మన్ననచేసి పంపవే.

చ॥ అని శపథంబు సేయుటయు • నాయుధపాణుల బంతి వెల్వలన్
దనుజ వరేణ్యుఁ డంపె రథ • దంతి తురంగము లన్నితోడుగా

సనుపుచు యజ్ఞశాత్రవున • హర్పతి శత్రుని మాల్యవంతుతో
ఘనుఁడగు వజ్రదంష్ట్రుని ని • కాయముఁ గాయఁగఁ బంపు నంతటన్.

ఆ॥ నింగి మ్రింగె ధూళి • నిర్జరేంద్రులు కనుల్, గప్పుసేన మేర • గాంచలేక
కనులు మూసికొనిరి • కరముల నెవరికి, నైతిగాక యుండె • నరసి తెలుప.

తే॥ కాళ్లు గలిగిన కొండల • కరణినొప్పు, హస్తిపటలపైఁ దెక్కెంబు • లలల వీవఁ
గైదువులు జలచరముల • గతిఁ జలింప, నేమి రవముతో సేన వా . ర్నిధిని బోలె.

క॥ శరనిధికై వడి భేరులు, మొరసెను కరు లిరులతో స • ముద్రముతో మ
చ్ఛరికముగొని గీపెట్టెను, హరులును సకిలించె మిత్తి • యరచినభంగిన్.

క॥ నడగంద్రు నడచు జడుమున, నడవక సిడి లెక్కగొనక . నాగంబులు పై
జడదముల జలముఁ జీల్చుచు, నడుగిడకయె నిలుచు నడచు • నామిక తోడన్.

తే॥ కైదువులకాంతి భూష • కాంతితోడఁ, దురగ వారణ స్యందన • స్తోమములకుఁ
గల యలంకార కాంతితోఁ • గలిసి పరవి, దసదిశల నున్న యిరులను • తఱిమి చంపె.

తే॥ వచ్చు సేననుగని ధరా • వరుఁడు కినిసి, దనుజచమువుతో వచ్చెడు • ఘనుఁడు శక్ర
జితుఁడో కాఁడో తెల్పుమ యన • శిష్టగుణ వి, భూషణుఁడు విభీషణుఁడు రా • మునకు నని

మ॥ గుహలోనుండి జఠాగ్ని రేఁపఁ జెలుచన్ • ఘోషించుచున్ దుష్ప్రయా
వహ రోషంబున నిప్పులం గురియుచున్ • బాలేందు రేఖా సమో
న్మహ దంష్ట్రా రుచులొప్పఁ దూణములు క్ర • న్నందాల్చి కైవింటితో
బహుశాఖీలత వచ్చునాతఁడు మహా , పార్శ్వుండు రాజోత్తమా !

క॥ జ్వాలాభీలములగు క్రూ . రాంస నేత్రములతోడ . నలరారుచుఁ జె
న్నాలుక నార్చుచు వడి వా, తూలగతిన్ వచ్చువాఁడు • ధూమ్రాక్షుఁడగున్.

ఆ॥ వదరుబోతు బాల • పాణిః యీతల నీది, యా యటంచు డాయ • నరుగువాఁడు
కాళలొప్పు కొండ . కరణి వచ్చెడువాఁడు, వజ్రదంష్ట్రుఁ డనఁగఁ • బరఁగువాఁడు.

క॥ పెదవులఁ గొఱికెడు నాతఁడు, నెద గాలిని గెలుచు తురగ • మెక్కినవాఁడు
న్మదుఁడు రణభయద రూపుఁడు, సదసద్జ్ఞ విహీనుఁడగు పి • శాచుఁడు రాజా !

ఆ॥ వనధికంటె రవము • వహ్నికంటెను వేఁడి, గలుగువాఁడు రథము • గలుగువాఁడు
సూర్యశత్రు వనఁగ • శోభిల్లువాఁడు త, ల్ప్రాంతగతుఁడు యజ్ఞ • వైరి యధిప !

ఉ॥ ఎఱ్ఱని శాలి సస్యముల • యెన్నులఁబోలు తురంగ సంఘముల్
బిఱ్ఱుగఁ గల్గువాఁడు రణ • భీకర కర్ముఁడు నెట్టి కార్యముల్
వఱ్ఱుగఁ జేయఁగాఁ దగు త • పః ఫలయుక్తుఁడు దూరదర్శియున్
గొఱ్ఱున కూలినె త్తెడి య • కుంఠిత సత్త్వుఁడు మాల్యవంతుఁడౌ.

ఆ॥ అనుచుఁ దెలుపుచుండ • నసురుల పరుసను. జయము జయ మటంచు • సవ్వడించి
ప్లవగవరులు దనుజ • బలములప్పై రాలు. తరులు గొనుచుఁ బోరఁ • దలఁచినారు.

ఆ॥ ప్రళయజలధినుండి • వడగండ్లు రాలిన. వివిధ వింట్లనుండి • శరచయమ్ము
వెడలుచుండ శిరము • వెడలి కోటులు పెద, పులును కొలుకుచచ్చె • యిలుపవోలె.

ఆ॥ తరులు గిరులుపైవఁ • గరులును తురగంబు, లరదములును వీర • వరుల శిరము
లాదిశేష పడఁగ • లడఁగంగఁ గుప్పలు. గూలిపడియెఁ గదన • కువలయమున.

తే॥ అమరవైరులు వైచు చ • క్రములు ద్రెంప, బాహువులు పావకులు పెను • వాలములును
విఱిగి మోచిన గిరులతోఁ • దరులతోడ. నడఁగి గ్రుక్కుమిక్కురనక • పడియె హరులు.

తే॥ పరువడిం దెసలకు దాఁటు • పాటవంబు, మెఱయు ఘోటకరాజి నా • శ్వికులు రేఁచి
వీచినట్టి తోమరములు • వీరవర శ, రీరములఁ గ్రొచ్చి పుడమిని • ద్రెంచి చొచ్చె.

తే॥ బిఱ్ఱుబిఱ్ఱున వనచరుల్ • వీచు శిలలు, పడగ లురలంగ రథముల • పంట్లురాలఁ
దలలు వ్రీలఁ బాతకుల గొం • డులును తునుఁగ, చేనుఁగులు పీనుగులుగాఁగ • నిలను గూల్చె.

తే॥ కరక లురలంగ గుహలకుఁ బరుగులిడెప్డు, బిలువలంబోలియాశ్వికుల్ • చెలఁగవైచు
శూలములు కుంతములు వాసఁ • రాలి యొదళు. లందుచొచ్చి యున్నను సొమ్ము • యలఁత యెసఁగ.

తే॥ వారణములు తోఁకలమోఁదు • వానరులను, దొలఁగివారలుకాళులఁ • ద్రుంత్రువాని
కొండ ఱవ్వానినెత్తిర • క్షోగణంబు, చదియవైచి యార్తురు రణ • క్ష్మాతలమున.

తే॥ ముందునకుఁ ద్రోచికొని వచ్చి • పొందనేయు, కపుల రాలచే నసురలు • కలనఁబడిరి
వారి వింట్లనుండి వెడలు • నారసములఁ, దునిసి పండ్లిగిలించి కోఁ • తులును కూలె.

మ॥ ధర నౌత్సుక్యముఁగూల్ప హేతువగు దు • ర్దారిద్ర్య చింతార్తి యం
తరమం దెక్కుడుగల్గ వేదనను వం • తంగుందు ఖిన్నాత్మము
క్కారయంబట్టగ నూపి రూడునను లో • కోక్తి క్రమంబంది వా
నర శైలంబుల స్యందనాశ్వములు భి • న్నంబొంద నిల్చెన్ హయల్.

తే॥ మరణమొంద నాధోరణుల్ • మత్తకరులు, రక్తనదములఁ దెక్కెముల్ • రాజిలంగఁ
దిరిగె మాలుము లందఱుఁ • ద్రెళ్ళనంతఁ, గడలి స్వేచ్ఛతోఁ దిరుగాడు • కలములట్లు.

క॥ పోఁడిమి చెడి యాశ్వికతతి. పాదలఁ బంకమునఁ బడుచు • వాంతుల రక్తం
బోడిగిలఁ గ్రక్కుచుండెదు, బాడబములు బాడబమ్ము • పగిదిందోఁచెన్.

తే॥ వానరులు వైచు కొండల • వలన నలఁగి. రూపుమాసిన దనుజుల • కోపుచూడఁ
జిరము కూడిమాడిన వారి • చెలులె వచ్చి. చూచి గుర్తింపరానట్లి • చొప్పు గలిగె.

తే॥ హనుమ యెదిరించె ధూమ్రాక్షు • నంగదుండు, మాఱుకొనియె మహాపార్శ్వు • మాల్యవంతుఁ
జెనకె నీలుండు పనసుండు • మొనసితాఁకె, మాయియగు పిశాచుని రణ • క్ష్మాతలమున.

తే॥ సూర్యశత్రుని మార్కొనె • సూర్యసుతుఁడు యజ్ఞశత్రుఁ డీడాడె రా • మానుజన్మ
వీరుఁడగు వజ్రదంష్ట్రుండు • బారిసమరు, చన్న ఋషభుని ఢీకొనె • నుత్సహించి.

ఆ॥ దనుజ నాయకులును • వనచర నాయకుల్, కదనమందు దాఁకి • కసిమసంగి
యొకరి నొకరు గెలువ • నుత్సహించుచుఁ బోరి, రుగ్రగతుల వేల్పు • లదరి బెదర.

ఆ॥ అట్లు పోరుచున్న • యయ్యెడఁబడిలోన, నాఱువెల్లువలను • హరిచయంబు
నఱఁచె మిగిలినట్టి • నాలుగు వెల్వల, వెదకి లక్ష్మణుండు • వేఁటలాడె.

తే॥ కలిసినట్టి చందంబునఁ • యుదధి, రక్తజలధియే యుదియను • రాణనొప్పె
ముత్తెములు గురిగింజలు • పొలుపువాల్చె, మత్స్యములు పగడంబులు • మాక్కినలరె.

తే॥ జలధియెల్లను రక్తమై • వెలుఁగుచుండ, పలువిధంబుల రత్నముల్ • పద్మరాగ
సరణిఁ గనుపట్టఁ గుంభిమ • స్తముల శుక్తు లందుగల ముత్తెములునొక్క • యంగమయ్యె.

తే॥ ముమ్మరంబగు పోరిట్లు • మొనయుతఱిని, మాఱుకొన్న చీఁకటులను • మదగజములఁ
దునిమి నెత్తుటఁదోఁగి యె • ఱ్ఱనయి లేచె, ననఁగ భానుండు తోఁచె బూర్వాద్రిమీఁద.

తే॥ రాక్షసాంధకారముఁదోలి • రామరవియు, నిరులఁ దోలిన తరణియు • నిరువు రొప్ప
జగము తమమను పేరు నా • శంబు నొంద, నుల్లసిల్లిన గతిఁ గాంతి • యొప్పమీఱె.

తే॥ తమము తొలఁగ రుధిర సాగ • రమును కరులు, తెప్పఁదేలిన జలధియుఁ • గుప్పలైన
కుణప గణములు క్షితిమీఁదె • రణతలమున, నచ్చెరువుగఁ దోఁచెను భీతి • పిచ్చలింప.

చ॥ ఉదయ గిరీంద్రమందు రవి • యొప్పఁగ నెత్తురు వెంచలంమునన్
మెదడుల పంకియం దొదిఁగి • నిక్కిలి చుక్కలు తెక్కలున్న యా
ప్రదరములన్ శిలీముఖ వి • వారము వ్రాలఁగఁ జచ్చు వారిపా
వదనములన్ జలేజములు • వారక పూచిన చంద మేర్పడెన్.

తే॥ కరులు హరులును తేరులు • కలిసిపడిన, తలము విలయవాయువు వీవఁ • గలఁగఁబాఱి
యంబుదములు నక్షత్రంబు • లమరపథము, లురలి ధరణిని కూలిన • యొప్పుదోఁచె.

తే॥ విరియు కురులతోదనుజసుం • దరులువచ్చి, యలమికొనఁ దమపతుల మే • నులు పడ్డోర్వి
వల్లు లలమిన పెను వృక్ష • వాటి కూలి, యున్న తెఱఁగునఁ గానంగ • నొప్పెనప్డు.

తే॥ తమకు కౌనులు పీన స్త • నములు రక్త, దీర్ఘ కుంతలములు గల • తెఱవలు తమ
వరుల మస్తముల్ గొన కటఁ • దిరుగుచుండు, భూతములఁబట్టి పీల్చెరి • పొదము కినుక.

తే॥ ప్రియుని యవయవములఁ గూర్చి • పెట్టి యొకతె. గుండెలను ప్రేప్పలను నక్క • గొనుచుఁబోవఁ
దఱుము త్రాణయులేక సం • తాపమంది, కూలి జీవంబులను పాసి • కూడెఁ బతిని.

చ॥ పతుల భుజంబులం గొనుచుఁ • దాపెడు నక్కలఁ గాంచి దీన వా
క్ప్రతతుల వేఁడియున్ విడక • పక్షిగ వెంబడినేగి కైదువుల్
పతికిలఁగూలునట్లు పడిఁ • గ్రుచ్చుకొనం గడునొచ్చి యేడ్చుచున్
వెతగొని ప్రాణముల్ తమకి • వీడిరి చేడెలు కొంద ఱయ్యెడన్.

తే॥ కుణపరాసులలోఁ దగు • లొక్కన్న పతుల, గాత్రముల వెదకుచునుండు • కలువకంటు
లడవులం దమనంటులు • విడిచిచనఁగఁ, దిరుగులాడు నాఁడునెమిళ్ల • కరణి నుండ్రి.

తే॥ మడిచియున్న యోధులతోడఁ • గెడసియున్న, చెలువులంగనిజారత్వ • చిహ్నములను
మఱుఁగుపఱుచుచున్నారను • మౌగ్ధ్యబుద్ధిఁ, గినుకగొనిరి కొందఱు గోల • వనితలచట.

తే॥ పతులమేనుల గుఱుతిడ • వలనుగాక, జీర్ణ కవచంబులం దీసి • చెటలపఱుఁ
దమ నఖక్షతములఁ గని • తలరి తలరి, పనవి కొందఱు జీవముల్ • పాసినారు.

తే॥ అశ్రుపూరిత నయనలై • యంబుజాస్య, లొక్క కొందఱుపతుల రో • యుచుఁగడంకఁ
దీనుఁగులనుండి వెలువడు • వెల్లులందు, పడి మునింగి జీవంబులఁ • బాసినారు.

-: ధూమ్రాక్షుండు హనుమంతునిచేఁ గూలుట :-

క॥ హనుమయు ధూమ్రాక్షుఁడు ముం, దునకువెనుక కదరి యడఁగి • తూఁకొనుచును పై
కొనుచును సములై పోరిరి, వినుద్రిష్మరు లెల్లఁగాంచి • విస్మయపడఁగన్.

క॥ అసురయు నిరువది తూపుల, వెస మారుతి ఱొమ్మునాఁట • వీడిన నతఁడున్
విసిగి కసిమసఁగి పైఁబడి, పసచెడ నద్దనుజు తేరు • భగ్నము చేసెన్.

క॥ తేరవియ వింగి కెగసిన, వీరుని కైనున్న విల్లు • విఱిచెను రామ
స్మరమణు తమ్ముఁ డురవడి, మారుతియును వాని నీడ్చి • మహికిం దార్చెన్.

తే॥ ఈడ్చి కదలి దాఁటినకాల • నెగసి తన్ని, నిప్పు లుమిసెడు శిరమును • త్రిప్పిత్రిప్పి
యీడ్చి కదలిలోఁబడనూకి • యుబ్బరించి, యార్చె వానరావళులు మే • లనుచుఁబొగడ.

-: మహాపార్శ్వుఁ డంగదునిచేఁ జచ్చుట :-

క॥ కోపము కన్నుల మిక్కలి, దీపములవిధాన మండఁ • దివిరిన పొగలున్
ధూపములఁబోల నొదవిన, తాపములను లెక్కగొనక • దర్పితమతులై.

క॥ సాహసముమీఱ విజయో, త్సాహంబున నొకరికొకరు • తగ్గక శర సం
దోహమున గిరుల నమర, ద్రోహి మహాపార్శ్వుఁ డంగ • దుండును పోరన్.

క॥ కరిపై నుండ విసరుగతి, వింశతి నంగదుని భు • జము నాట నిశా
చరుఁ డేయ రేఁగి రాక్షసు, నరదముఁ బైకెత్తి తిరుగ • నవనికి వైచెన్.

తే॥ విరథుఁడై వింటి నావల • విసరివైచి, మొనసి కుప్పించి దైత్యుఁ డ • మోఘమైన
శూలముం గొని ప్లవగరా • ట్సూను వక్ష, మునకు సూటిగా గుఱిచూచి • పూనియేసె.

క॥ మది సాధారణ శూలం, బది గాదని యెంచి రామనృపవరుఁడు మహా
ప్రదరంబునఁ దుత్తుమురై, చెదరిపడఁగ నేసె సురలచిత్తము లలరన్

తే॥ శ్రీరఘుప్రవరునకు జేజే యటంచు, నంగదుండు మహాపార్శ్వునడఁచి త్రొక్కి
పదములంబట్టి మిక్కిలి పంగటింపఁ, జెలఁగి నడిమికి రెండుగాఁ జీల్చివైచె.

## నీల మాల్యవంతుల యుద్ధము

తే॥ మాల్యవంతుండు నీలుండు మాఱుపడక, కదన మొనరించుచుండంగఁ గాంచిసురలు
తొల్లి యింద్రుఁడు పంక్తివ క్త్రుండు పోరు, సరణి నున్నది యని విరుల్ చల్లినారు.

తే॥ నీలుఁ డొక్కశైలము వైవ మాలియన్న, విల్లు విఱిగె వాఁడును విల్లు విడిచి వాలు
పలక గొని యదలించుచు నిలువుమనుచు, నేలకుం దాఁటి యుక్కున నీలుఁ దాఁకె.

ఆ॥ వారలట్లు పోరు వడిఁగాంచి యెదసొచ్చి, ఈధర మొక్కఁడెత్తి కుముదుఁడేసె
నుగ్గునూచ మగుచు భగ్గున మండుచు, నసుర శిరు గూలె నంతమీద.

తే॥ వృక్ష మొక్కండు నీలుండు విసర దాని, మాల్యవంతుండు వాలున మాల్చివైచి
నీలు తలఁద్రెంప నెత్త నా కేలుతునిఁగి, నేలఁబడఁగూల్చె సౌమిత్రి నిశితశరము.

తే॥ శంపవంటి ఖడ్గముతో భుజంబు తెగియుఁ, గ్రమముచెడక దురము సేయు కఱకుసోఁకుఁ
గాంచి యిది యర్ధరథుతోడి కయ్యమనుచు, నవల బోరక సౌమిత్రి యవలికేగె.

తే॥ ఘనభుజుని రామునొద్దకుఁ జనుచునున్న, లచ్చుమనుఁ గాంచి యమరులు మెచ్చిపొగడి
రెవ్వ రీరీతి వీరత్వ మెసఁగియున్న, సమరధర్మంబు పాటించు చతురులనుచు.

తే॥ యజ్ఞశత్రుండు వచ్చిరా మానుజన్ము, నిలిపి పాఱకుమని శర నికరమేయ
నాతఁడొక వాఁడియమ్ముచే నక్కువగుల, నేసి, కూల్చి యవ్వల రామ నృపుని చేరె.

తే॥ యజ్ఞశత్రుఁడు విలుబ్రీల నవనిఁ గూలె, గండుమీఱి కాలంగేలఁ గ్రతువులందు
జార్చుశిలలు లేవయ్యె వై శ్వానరుండు, స్వేచ్ఛగాఁ గుండములయందు వెలుఁగసాగె.

తే॥ తనదు జనకుని మున్నొక తడవ యడ్డ, గించి పేరొందు రవిశత్రు గీఁటడంచి
తండ్రికిం దగు పుత్త్రుఁడన్ తరము గాంచె, సూర్యపుత్త్రికుఁ డారణ క్షోణియందు.

## ఋషభ వజ్రదంష్ట్రల సమరము

తే॥ అగ్గలంబుగఁ దనతోడ ననిమొనర్చు, వజ్రదంష్ట్రుని పెనుతేరు వసుధఁగూల
హరులు సారథియును చది యంగ నొక్క, భూధరేంద్రమ్ముగొని ఋష భుండు వైచె.

తే॥ తెరు చదియఁ గార్ముకమును పాఱవైచి, దండముంగొని నేలకు దాఁటి పిడుగు
కరణి వజ్రదంష్ట్రుఁడు వాని శిరము మోఁదెఁ, జచ్చెఁ జచ్చెన యని కపుల్ పిచ్చలింప

తే॥ వ్రేటుగొన్నట్టి ఋషభుఁడు • పీఁచ మెడఁగ, మరణవేదన నొందుచు • మఱుఁగుచుండ
హనుమఁ డెదనొచ్చి యార్తుఁడై • యసురులంటఁ, బొడువవాఁడునుదంష్ట్రునఁ • బొదివికొనియె.

తే॥ కొట్టి చను వజ్రదంష్ట్రుని • గూల్చిపట్టి, దండమును లాగికొని వాని • పండ్లు లూడఁ
గొట్టి శిరమును మోఁది యా • క్రూరుపేరు, వ్యర్థముగఁ జేసి శమనుని • పాలికనిపె.

## పిశాచుని యుద్ధము

తే॥ పనసుఁ డేయఁగ నిప్పునఁ • బలురుబాలు, మేనఁజేటుఁ బిశాచుండు • మిగులఁ గినిసి
తోమరముగొని పైపను • త్తుంగభుజుఁడు, నెత్తు రొలుకుచుఁ బనసుండు • నేలఁ బొరలె.

సీ॥ జలదమం దున్నాఁడొ? జలధిపై నున్నాఁడొ?, నేలపైనున్నాఁడొ? నింగిఁగలఁడొ?
వేలకొలందిగు • ర్రాలు పాటెడి నన్న, వడుపున వాని త • త్తడియు పరిగె
నేలఁ గాలూనక • తేలికఁ దిరుగాడుఁ, గంటిచూపులకంటెఁ • గ్రన్న నేగు
నెదకంటె వడినేగు • నెచటనో గనదను, నంతలో డాయుచుఁ • జెంత నిలుచు

తే॥ గరుడుకన్నను వడినేగు • తురగముపయిఁ, దిరుగుచున్న పిశాచుని • తీవ్రశక్తి
నొఱగిరూలెఁగుప్పగఁ బ్లవం • గోత్కరంబు, తత్కృతముగాంచి యటసుమి • త్రాసుతుండు

ఉ॥ చండతరోగ్రుఁడై యనల • సాయకమున్ బలువింటఁ గూర్చి యు
ద్దండ భుజాబలంబు తెగఁ • దార్చి పిశాచుని ఘోర శీర్షముం
జెండిన యంతఁ జేష్టదక • చేఁగల శూలము వీడకుండ నా
మొండెము మున్నుచేయు కొలఁ • బూని నటించెను కొంత సేపటన్.

తే॥ క్షేమవార్తలు సీతకుఁ • జెప్పకరణిఁ, దుమ్మెదలు రొదచేసెను • దిమ్మపుట్ట
ధర్మదూతలు చేరిరి • దక్షిణమున, నసుర దూతలు లంకకు • నరిగినారు

ఆ॥ అరిగి విభుని చేరి • యంజలి ఘటియించి, విజయవార్త దెలుపు • పీలులేమిఁ
జింతతోడ జవము • చేవయుఁ గల మన, సేన మడిసె ననుచుఁ • జెప్పినారు.

## 20 మకరాక్ష వధ పటలము (38)

క॥ చారుల వార్తలు విని లం, కా రమణుఁడు సంతపించి • కాలాహి క్రియన్
దోరంపు టూర్పు పుచ్చఁగ. నారసి మకరాక్షుఁ డిట్టు • లనియెం గడిమిన్.

మ॥ అనిలోఁ దండ్రి ఖరున్ వధించిన మహా • హంకారులం ద్రుంపఁగా
నను పంపం దలపోయ కుంటివి తగ • న్నా శౌర్యముం గాంచవో?
యనుపంగాఁ గలవంచు నోర్చితిని చిం • తావాప్తి నీకేల? భూ
జనులా నన్నెదిరించువారు? సుమన • స్సంఘంబులున్ లెక్కయే?

ఉ॥ కన్నుల నీరు ధారలుగఁ • గార్చుచు నేడ్చుచుఁ గన్నతల్లి దా
ఖిన్నత నొంది భర్త నడఁ • గించిన వాని శిరమ్ము ద్రొక్కఁగా

కెన్నఁగ సూత్రముం దొఱఁగ • నేనని పంతము పూనియున్న దా
జన్నియ పూర్తిగావలదె • సాద్వికి పీరకుమారుఁ డుండియున్

చ॥ పసుపుమ నన్ను పోరి కని • ప్రాంజలియై మకరాక్షుఁ గాంచి యా
దనుజ వరేణ్యుఁ డిట్టులను • ధైర్యమె తోడగుఁగాక నీచిరం
తనమగు వైరముం దొలఁగ • దానవవైరుల మస్తకంబులం
గొని యిటు తెమ్ము పొమ్మనుడుఁ • గోరికమీఱఁగ వా డు పొంగుచున్.

చ॥ విలుగొని తేరునెక్కి కడు • వేడుక వాహిను లైదుకోట్లు చం
డ లలిత రీతిఁ దన్వెలయ • డంబుగ దానవనాథుఁ డంపు వె
ల్వలు మఱి యిర్వదిం గడిసి • వారిధి పొంగిన భంగి దోఁపఁ గా
హళములు దుందుభుల్ చెలఁగ • నమ్మకరాక్షుఁడు పోయె నుద్ధతిన్.

శా॥ రాజద్రీతిని చక్రరక్షకులుగా • రక్తాక్షుఁడున్ శంఖుఁడున్
దేజోవంతులు తోడరా నుడుగణా • దీశుంబలెన్ వాహినీ
రాజిం దన్మకరాక్షుఁ డొప్పెను రజో • రాగంబు వర్ధిల్లె ది
గ్రాజు ల్గన్నులుమూయ వేలుపుల మా • ర్గంబు న్నిరోధించుచున్.

తే॥ ధ్వజపటంబులు రవి కర • ప్రతతిఁ గప్ప, మదకరుల శీకరంబులు • మలయుచుండఁ
గదలు దానవసేనచేఁ • గపిచయంబు, శ్రమము పూర్తిగాఁ దొలఁగె నా • సమయమందు.

తే॥ గీఁకలును సకిలింపులు • కేకలొలయఁ, బణవ కాహళ దుందుభి • స్వనము లలియ
సింహనాదంబు లెల్లెడఁ • జెలఁగి యండ, గోళములు నిండ జీవులు • గొవరువోయె.

ఉ॥ వాఁడియు వేఁడియుం దొగడు • పాడియుఁ బోఁడియుఁ గల్గు సైన్యముల్
వేడుక వాడుకల్ విడిచి • బీరము చూపుచుఁ బోరు సేయుచున్
వీడక వాడుకన్ బఱపు • విండ్లనుకండ్లను పూని యేయఁగా
నీడువ సాగె రక్తనదు లీడిగిలంబడు వారణంబులన్.

ఉ॥ వానరులేయు శైలముల • వారక చేతులఁబట్టి వెండియున్
దానవులేయ మేఘములు • తారకలున్ భువిరాల భూతముల్
పీనుఁగులన్ భుజించు పెను • వీఁకను గేకలువెట్ట భూమిపై
వానర సైన్యముల్ తలలు • వ్రయ్యఁగఁ గూలెను కుప్పతిప్పలై.

చ॥ దనుజుల కేలనున్న యడి • దంబులు లాగి తదీయ శీర్షముల్
తునుమఁగ వారికేలఁగల • తోరపు మ్రాఁకులఁ బర్వతంబులన్
దనుజులు లాగికొంచు బెడి • దంబుగ జిష్ణునఁ బోపవైచుచున్
వనచర వార వక్షముల • భగ్నము సేయుచుఁ బోరుచుండఁగన్.

## మకరాక్షుఁడు రామునితోఁబోరి మడియుట

మ॥ మకరాక్షుం డెదురైన వానరతతిన్ • మాయించి తత్సైన్య నా
యక గాత్రంబుల యంత్ర నిర్గళిత ఘో • రాశ్మంబులంబోలు సా
యక రాజంబుల దుల్చుచున్ బహుళ క్రో • పాటోప మేపారఁ బా
వకలీలన్ రఘుచంద్రముం గదిసి గ • ర్వస్ఫూర్తిమై నిట్లనున్.

చ॥ సమరమునందు నాజనకుఁ • జంపిన యప్పటినుండి నీతలన్
దుమురుగఁ జేసి నాకుఁగల • దుర్దమకోప మడంపనుంటి; మా
నము చెడునంచు భీతిగొని • నాయెడ వైరము పూనరైరి యా
సుమనసులుం ద్రిమూర్తులును • సూటిగఁ బూనితి వీవు మానవా!

చ॥ అనపుడు మందహాసరుచి • యాననమందునఁ దోఁప రాఘవుం
డనుఁ గసిదీర్చుకోఁ గడఁగి • యక్కఱతోడను వచ్చినాఁడవా!
జననముతోడ వీరులకు • క్షాత్త్రము వచ్చుట సాజమేకదా!
మొనసితి యుక్తవాక్తతులఁ • బూర్వవిరోధము మాన్చుకొమ్మనన్.

మ॥ అనలజ్వాలలు కన్నులం బొడవ నీ • హంకారమున్ మాన్తుఁబొ
మ్మని యంతన్ మకరాక్షుఁ డుగ్రుఁడగుచున్ • జ్యారావముంజేసి క్రొ
న్నన నిస్సాక్కనిఁద్రుంచి కాక కసి మా • నంబోవదంచున్ మహా
శని కల్పాహగ వర్షముం గురిసె ర • క్షఃపాళి యగ్గింపఁగన్.

మ॥ జలజాతేక్షణుపై మరుత్సుతునిపై • సౌమిత్రిపై మార్గణం
బులు నూఱాఱుల నేసి దుస్సహ తర • ప్రోత్తేజుఁడై సంగర
స్థలి నారాచ మయంబుగాఁ బఱపి గ • ర్జానాద గంభీరుఁడై
జవముం జేవయుఁ జూప రాముఁడు శరా • సారంబుచే మాన్పుచున్.

చ॥ ఒక విశిఖమ్మ రాక్షసుని • యుక్కఱ నక్కున నాటనేయఁగాఁ
దపపికలాడి వాఁడు కను • దమ్ముల నిప్పులు రాల్చి లోక పో
షక యశు రామచంద్రు కవ • చమ్మునఁ దూఱఁగఁ బెక్కు వాఁడి సా
యకముల నేసి యార్చెను వి • యత్తలమందలి వేల్పు లల్కఁగన్.

ఉ॥ రాముఁడు మందహాస రుచి • రస్థితి మోమునఁదోఁప సంగరో
ద్దామ కరంబునం దిగిచి • దారుణ బాణము లేసి సారథిన్
నామ మడంచి రథ్య చర • ణస్థ ఖురంబులఁ ద్రెంచి చాపమున్
సాముగఁజేసి వక్షమునఁ • జయ్యన నాఁటగఁ జొన్పు నంతటన్.

చ॥ అరదము చాపముం • జెడఁగ నమ్మకరాక్షుఁడు సౌమ్యవోక నె
త్తురు వడి గ్రక్కుచున్ ధరణి • దూకక మింటికినేగి మేఘ సం

వరణ శరీరుఁడై విలయ • వర్షము దాపురమయ్యెనో యనన్
విరివిగ రాల్చెఁ జిచ్చులుకు • పిడ్గులు ఱాలును గాలి వానగన్.

చ॥ పిడుగులు లెక్కలేక పడ • భీకర వాయువు వీవ మేఘముల్
మిడుకులఁ జిందఁగా సమర • మేదినిలోఁ గల వానరావళుల్
మిడుకుచుఁ బోరలేక తమ • మేనులు చిందఱ వందతై పడన్
మడిసిరి తక్కువార లని • మాని పలాయితులైరి భీతులై.

ఉ॥ పాఱిన దిక్కులం బొగలు • వాఱి కనుంగవ గానరామి ను
క్కాఱఁగ మేఘముల్ గవిసి • యంతట నిప్పులవాన ఱాలతో
మీఱఁగ వానరుల్ మడియ • మేద్పడ రాముఁడు కాంచి పీని కీ
తీరు వరమ్ముచేనొ? మఱి • తెక్కలిమాయనొ గల్గెఁ జెప్పవే!

చ॥ అనుడు విభీషణుండు కరు • ణాకరు రాముని గాంచి దేవ! యీ
దనుజున కీ బలంబు ఫల • దంబుగ వాయు సముద్రరాజు లి
చ్చినయది యన్న రాఘవుఁడు • చేద్పడ దానిఁ దదస్త్రపాళిచేఁ
బొనుపడఁజేయ మాయలును • పోయెను వార్ధిని వైచు నింగువై.

క॥ అదిగని మకరాక్షుడు తో, యదము నెనయు రూపుగొని వి • యత్పథమందే
యొదిఁగి వనచర కదంబము, గుది గ్రువ్వఁగ శూలములను • గుములుగ నేసెన్.

చ॥ అగపడకుండ డాఁగు మక • రాక్షుఁ గనుంగొను చొప్పుగాన కే
వగఁ దెలియ్యంగ వచ్చునని • వారిజనేత్రుఁడు చింతతో మదా
శుగ హతి నొల్కు నెత్తు రొక • చోఁ గనుపడ్డది యిద్ది మాయచే
గగనమునందు దానవుఁడు • గల్గిన తావని నిశ్చయించుచున్.

ఆ॥ ఒక్క వాఁడియమ్ము • నొగిఁగూర్చి పఱపఁగా, వాని శిరము తునిఁగి • వసుధఁ బడియె
నొడలు పుడమి దొరలు • చుండిన యంత న, మ్మాయ స్వప్నమట్లు • మాసిపోయె.

## రక్తాక్షుఁడు శంఖుఁడు నల పనసులచే నంత మొందుట

తే॥ మకర నేత్రుండు తెగిపడి • మడియఁగాంచి, రథముపై గ్రీష్మభానుని • రాజనొప్పి
శరదముంబలె శరములఁ • గురిసి గాలి, పేఁకవచ్చు రక్తాక్షుని • వాఁకె నలుఁడు.

ఉ॥ తాఁకి శరోత్కరంబులు వి • తావితయై చన సాలసాలముం
గైకొనివీచి త్రోచుచునా • గ్రక్కున నేపఁగుఁ గాంచి యుర్వపెం
బైకొను సింగమో యనఁగ • భాసిలి దూఁకఁగ దైత్యుఁ డుగ్రుఁడై
పేఁకను తుండ్లుచేసి పెను • పీకున నార్వ నలుం డదాటునన్.

ఉ॥ బొమ్మను వంచి నక్కి తల • త్రుంచి గుభాలున రక్తనేత్రు శీ
ర్షమ్మున దూఁకి నాసికను • వక్షఃస్థలం జెవులందు వేఁడి ర

త్రమ్మను క్రొవ్వు బైలుపడఁ • గాఁ బెనుముష్టిని దాఁచి కాలితో
గ్రమ్మన ద్రొబ్బె నేలకుఁ బు • రందర ముఖ్యులు మెచ్చి యుబ్బఁగన్.

ఆ॥ కొండమీఁదఁ బడిన • కొరడు విధంబున, నలుఁడు రక్తనేత్రు • తలను దుమికి
చదియఁ బొడువఁగన్న • శంఖుండు లయకాల, రుద్రుభంగిఁ బొంగి • క్రుద్ధుఁడగుచు.

చ॥ నిలునిలుమం చదిల్చి నలు • నిక్కఁగఁ దాఁకఁగ నేగఁ గాంచి పే
రలుకను దాఁటుచుం బనసుఁ • డా సురవిద్విషు నడ్డగించెఁ జే
యులుఁగులు తొమ్మిదింట సుడి • యన్ వడి శంఖుఁడు గొట్ట నేతిచే
వెలిఁగెడి యగ్నిఁబోలెఁ గపి • వీరుఁడు మండి చనెం గుభాలునన్.

చ॥ పరువిడి కేరితో నసుర • బాధ బలంబున నెత్తె నెత్తినన్
సురుఁగక శంఖుఁ డిమ్మొగి వ • సుంధరకుం దిగుసంత వానిపై
నరదముపైవ వాని యెద • లయ్యెడ ఫట్టని వ్రచ్చి క్రొత్త నె
త్తురు ప్రవహింపఁగా నసులు • దోరెను వేలుపు లుబ్బి యార్వఁగన్.

ఆ॥ చక్రవర్తి సుతుల • శరములచేతను, హరుల నఖర శైల • • తరులవలన
నసురబలము చెడ ని • రాయుధులగు దూత, లరిగి రమరవైరి • కంత దెలుప.

## 21. బ్రహ్మాస్త్ర పటలము, (231)

మ॥ అనిలోనన్ ఖరపుత్త్రిఁ డీల్గుటయు ర • క్తాక్షుండు శంఖాఖ్యుఁడున్
దనుజానీకముతోడఁ గూలుటయు నా • దైత్యేంద్రుఁ డాలించి యిం
ద్రుని గర్వం బడఁగించు పుత్త్రి నిటకుం • దోడ్తెండనన్ లెంక లు
వ్వున నేతెంచి తదాజ్ఞఁ దెల్ప నతఁడున్ • బుద్ధిన్ విచారించుచున్

ఉ॥ పోయినవార లాగతినె • పోయిరొకో యనఁ జారు లో ప్రభూ!
పోయిన వారలెల్ల మఱి • పోయిన వారలె గాక నీపలెన్
గాయముతోడ లంకకును • క్రమ్మఱి నట్టిఁ లేరు సుమ్మనన్
హా యని లేచి యింద్రజితుఁ • డంతకుపోలిక వచ్చె నుగ్రుఁడై.

ఉ॥ వచ్చి దశాస్యుఁ జేరి గరు • వంబున వందన మాచరించి నీ
చెచ్చెర నంపు సేనలు న • శించెన కాయని విన్నవాఁడ నా
మచ్చరులైన రాఘవుల • మస్తకముల్ ప్లవగాళి శీర్షముల్
గ్రచ్చుఱఁ దెత్తు మోదమును • గాంచెద నీవును సీత ముండటన్.

చ॥ అమరుల కోర్కులెల్లను హ • తాశలు గావుత నేఁడు పోయెదన్
దపుకక యుండుమా యనుచుఁ • దండిరి యాజ్ఞను పూని వేయి సిం
గములు వహించు తేరిపయిఁ • గ్రాలుచు వెల్వడె వెంబడిం దురం
గమ రథ దంతి సద్భట ని • కాయము లర్వది వెల్వ లేగఁగన్.

జేవిధి గెల్పుగూర్చు? నని • నేతురో? నిల్తురో? చత్తురో? వడిం
జేవ దొలంగి పాఱుదురొ? • చిందఱ నేఁ గొనుసట్టి వేళకున్.

చ॥ నిలువుఁడు విల్వ్రాఁడం ఎదరి • నిప్పులు రాలఁగఁ జూచి కంకటం
బొలయ ధరించి తూపుముల • నొప్పుగఁ దాలిచి వీరకంకణం
బులు గల కేలఁ గార్ముకము • పూని శతాంగమునెక్కి శింజినిం
బలువుగఁ గూర్చి టంకృతి సు • పర్వ భయంకర లీలఁ జేయుచున్.

ఉ॥ చిందము నొత్త ఖేచరులు • చిత్తములన్ జడుపొంది గొప్పయా
క్రందు దురంబు నేఁటికి భ • రంబుగఁ గ్రెలెను వేల్మి విఘ్న ముం
బొందుటచేత లక్ష్మణుని • భూరి శరంబున నింద్రజిత్తు నేఁ
డొందును చావు నంచు మది • నుబ్బుచునుండిరి చూచువేడుకన్.

ఉ॥ వాని గుణధ్వనిన్ విని ప్ల • వంగులు లావును విస్మరించి చే
నూనిన పర్వతంబులు త • రూత్కరముల్ దిగజాఱఁ దాలిమిన్
లేని కతంబునం బడుచు • లేచుచుఁ బాఱిరి కల్పవేళ ఝం
ఝూనిల వేగ ఘాతమున • నంబుధి నీరము విచ్చుచందమై.

ఉ॥ కాలుని జీవితంబునకుఁ • గాలుఁడు రావణి లేచి యొరి వా
తూలసుతా ప్రతాపవిధి • తోఁపఁగ నాడుచు దొడ్డచేతులన్
జాలు ధరించి నిల్చితి దు • ర • బొనరింపఁగ మేలు మేలు నీ
చాలిక సాహసంబును ప్ర • శంస్యము లోడక నిల్వుమీ వెసన్.

ఉ॥ పీరుఁ డిటుల్ వచించి బలు • విల్లు ధరించి యెసంగ సజ్జనీ
దారకుఁ డూనియున్న వసు • ధాధరమున్ వడిఁ ద్రిప్పివైచె నిం
ద్రారి మహోజవంబున వి • యత్ స్థలి జివ్వున వచ్చు శైలమున్
దూరముననే విశీర్ణమయి • తూలఁగఁ గొట్టెను వాఁడి కోలలన్.

చ॥ మఱియొక శైలముం గొని య • మానుష సత్త్వము పెల్లడించుచున్
గిరగిరఁ ద్రిప్పి మారుతిని • కేలు పదంబు లురమ్ము కంఠమున్
శిరము శిలీముఖ ప్రతతి • చే నొగిలించె వియచ్చరుల్ నిశా
చరు కర లాఘవంబు గనఁ • జాలక యద్భుతమంద నయ్యెడన్.

క॥ ధరణీధర నికటంబున, నిరులం దొలఁగించు నెత్రు • టెఱుపున బాణో
త్కర కిరణంబుల మారుతి, తరుణారుణ తరణి సరణిఁ • దద్దయు వెలసెన్.

క॥ హనుమంతుఁడు సోలఁగఁ గిమకం, గొని యంగదముఖ్యు లెదురు • కొనిరి వివస్వ
త్తనయుం డపటికిరా వ, చ్చిన వారలఁ గాంచి యసుర • చిడిముడిపడుచున్.

ఉ॥ శక్రజితుండు పల్కనొగిఁ • జావఁ దలంచి యెదిర్చె సేనియున్
విక్రమధామమైన హరి • వీరత దంతుఁగఁ గూల్చఁగాని దు

క॥ బలిముఖ సేనావీరులు, మలలు తరులు గొనుచు మాఱు • మలయఁగ దారిం
దిలకించి రాఘవుఁడు వెను, కల నుండఁగఁగోరి పలికెఁ • గారణఫణితిన్.

ఆ॥ క్రూరుఁ డింద్రజిత్తు • ఘోరాస్త్రములు వీడ, సాగునేని మీర • లాఁగలేరు
చోటు మాఁడ విడిచి • చూచుచుండుఁడు, విమతు లొందుమార్పు • వింటినేర్పు.

ఆ॥ అనిన రాము పలుకు • లాలించి కపివరు, లల్లనిలిచి రంత • నధిపసుతులు
నిశిత విశిఖ నిచయ • నిర్ఘాత వర్షంబు, కురిసి రమరవైరి • కోటిమీఁద.

మ॥ త్రుటిలోఁ దమ్ము గవించు నా దనుజ సందోహమ్ము నాశమ్ము సెం
దుటకై చూపిన రామ లక్ష్మణ ధను • ర్దోర్దండ పాండిత్య సం
ఘటనం బేమని చెప్పవచ్చుఁ గనక • క్ష్మాభృ ద్ధనుర్ముక్త ధూ
ర్జటి బాణ త్రిపురాసురాళిక్రియ నా • శంబయ్యెఁ దత్సైన్యముల్.

-: తన సైన్యముపాటు నింద్రజితుఁడు కాంచుట :-

చ॥ శవములు కుప్పలై పడెడు • చందముఁ దెల్పఁగవచ్చుఁగాని వీ
రు వడిరి వారు కూలిరని • రూఢిగఁ జెప్ప నశక్యమైన రా
ఘవుల పరాక్రమ క్రమము • కంటికిఱెప్పలు పెట్టకుండ నా
హవమునఁ గాంచుచుండె నమ•రారి శరాసన మూని కిరిపై.

చ॥ కటులు మరించె నంచుఁ దుర • గంబులు గూలినవంచు స్యందనో
త్కరములు నుగ్గులయ్యెనని • కర్బురవర్గము నీల్గెనంచు నా
యపదము పోవఁ ద్రోవ గన • దంచు నభస్స్థలి నంటు ప్రేత భూ
ధరములఁగాంచి హా యని వి • లాకుఁ గడించుఁ దపించు చూపిలున్.

చ॥ సమరము సేయుచున్న నెఱ • జాణలొ యిద్దఱె చచ్చువారలొ ని
క్కముగ వచింప నాయపది • కాఁదగు వెల్వాలు; శాపశక్తిచే
నమరవిరోధి సేనల ల • యంబొనరించిరి చాపశక్తిచేఁ
దుముఁబొనరింపలేద యిది • దోర్బలమో? మఱి యింద్రజాలమో?

మ॥ శరవర్షమ్మను గాంపు రక్తనదులం • జక్కంగఁ జూచుం గశే
బర శైలమ్ములఁ గాంచుఁ గూలిన కరి • వ్రాతంబు నీక్షించు నా
ద్రాఅకంబై పడు వాజిరాజిఁగని ని • ట్టూర్చున్ రఘుస్వామి సుం
దర బాహు ద్వయిఁ గాంచు దానవ మహాం • తంబున్ విలోకించుచున్.

చ॥ శిరముల కొండలం గనును • చెండిన ముండములన్ గణించుచున్
గొఱప్రలపోల్కి నొక్కలిడు • కోలలఁగాంచు పరించువారలం
బొరిపొరి గాంచుఁ దేరుల స • ముద్ధత దంతుల వాజులన్ భటో
త్కరముల వేయిటం దొలిచి • దాఁటు శరాళిగ పద్ధతిం గనున్.

చ॥ అఱువది వెల్లువల్ వయిచు • నమ్ములు చక్ర గదాసి కుంత తో
మరములు ఫెళ్లఫెళ్లమని • మ్రగ్గుచు వేణువనంబు గాలు వై
ఖరిగొని తారసిల్లకయె • కాడ్పడుచుండుట దైత్య సైన్యముల్
ధరణిని వ్రాలుచుండుటయుఁ • దక్కక రావణి కాంచె నాజిలో.

చ॥ కడుపులు మోఁదికొంచుఁ జని • కాంతులపైఁ బడి దానవాంగనల్
తడఁబడ నేడ్చుచుండు నిన • దంబు వినెన్ రదపంక్తి గీఁటుచున్
బుడమి శిరంబు లూడిపడ • మొండెములాడుచు నుఁటఁజేసి య
క్కడ దిగ వీలులేమిఁ బయిఁ • గ్రాలు ఖగంబులఁ గాంచె నయ్యెడన్.

ఉ॥ సింగము లెట్టు లట్టడరి • చెచ్చెర నాజిఁ జరించుచుండు నా
యంగద మారుతాత్మజుల • యాఱుగపద్ధతిఁ గాంచలేమి నిం
దంగద వాయుజుల్ బహు స • హస్రగణంబులు క్రుమ్మరంగ ని
ల్వంగను చోటులేదు నరు • లం గన నిద్దఱొకో కలారనున్.

ఉ॥ మోదరవంబు సేయు సుర • ముఖ్యులఁ గాంచును వారికేల నిం
పాఁడిగనున్న పుష్పముల • నారయు స్వీయ భుజంబులం గనున్
జాదుగఁ జూచుమేర గనఁ • జాలిన పీనుఁగు తిప్పలం గనున్
వేమఱుగన్న వానిక్రియ • వీక్షణసేయును దిక్కు లన్నిటిన్.

తే॥ లెక్కకును మీఱి కూలిన • రక్కసులను, కోరి కాంచియుఁ బాఱిన • కోఁతిమూఁక
శక్రజిద్భీతి కలఁకయు • జాఱకునికి, దురము పొనరించు నాసతో • మరలదయ్యె.

## -: హనుమని సింహనాదము :-

ఉ॥ బృందములైన యాఱువది • వెల్వలు నాల్గువిధాల సైన్యముల్
క్రిందఁగ రాఘవేంద్రుల ప • రాక్రమ పద్ధతిఁ గాంచి యంజనా
నందనుఁ డుల్లసిల్లి జత • నంబున బాహువు లప్పళించి యా
నందముతోడ భీకర ని • నాదమొనర్చె రిపుల్ దిగుల్గొనన్.

ఉ॥ కొందఱు గుండియల్ వగులఁ • కొందఱు గూబలు వ్రీల ధాత్రికిన్
స్యందనమందునుండి దిగఁ జాఱిరి కొందఱు కేలఁ గైదువుల్
క్రిందికి జాఱ విహ్వలతఁ గీడ్పడి వ్రాలిరి లంకలోని వా
రెందఱొ నెత్రుగ్రక్కి గతి • యించిరి మారుతి సింహ గర్జనన్.

ఉ॥ కోఁతి యొకం డొనర్చు పెను • కూఁతకు జంకిన పందలార ! మీ
చేఁతలు తెల్లమయ్యె నికఁ • జెప్పెడిదేమి ? నశించినారలే;
ఱాఁతకు మించి లోఁతుగల • దే ? యని రావణి ముందువోవఁగా
బ్రాఁతిగలట్టి కొందఱొగిఁ • బ్రాపుగ వచ్చిరి ధీరచిత్తులై.

-: లక్ష్మణుఁడు రాము ననుజ్ఞ గొని యింద్రజిత్తునితోఁ బోరుట :-

శా॥ కేలన్ సజ్య శరాసనంబు వెలయం • గీలించి సౌమిత్రి య
వ్వేళన్ రాముని గాంచి మ్రొక్కి పలికెన్ • ధీరుండు ఘోరాహవా
కాలిం గట్టుడు సత్త్వహీనతను సై • న్యశ్రేణిఁ గాపంగలే
కాలంబందున నోడినాఁడనను పే • రయ్యెం ద్రిలోకంబులన్.

శా॥ ఈపే రన్నానుచుండ నాకరముచే • నీదైత్యు మస్తంబు నీ
దేవవ్రాతము మెచ్చఁ ద్రుంచి పెను ధా • త్రిం జేర్పకున్నన్ భవ
త్సేవాకార్య మదెట్లు సార్థకమగున్ ? దివ్యగ్గతుల్ దక్కునే ?
నా వంశం గల నింద యుం దొలఁగునే ? నావెంబు సిద్ధించునే ?

క॥ ఈ సోఁకుఁ జంపనేనిన్, నీ సేవాఫలము నాకు • నెగడదు నరకా
వాసంబు చెందువాఁడను, నీపదముల పదములాన • నిక్కము రామా.

తే॥ అనిన పల్కులు విని సుర • లలరినారు. జగములెల్లను మిక్కిలి • సంతసిల్లె
ధర్మదేవత మోదించె • ధర్మరాజు, పొంచి మించి యదను పరీ • క్షించుచుండె.

చ॥ అనఘుఁడు సుందరస్మిత ము • ఖాంబుజుఁడై తన తమ్ముఁ గాంచి యీ
దనుజ వరేణ్య సూనుని వ • ధంబునకుం బొరకొన్న వాఁడ వి
ప్పుడి కనువైన బుద్ధి బల • భాగ్యము లందితి రక్షణంబు శి
క్షణ మొనరించు విష్ణువును • శంభుఁడు నీకిల సాటి యేమరే ?

తే॥ నయము మీఁగునట్ల యొ • నర్చు మనుచుఁ, బెలఁగి సౌమిత్రి కదఁకతోఁ • జిందము త్తె
నంగదుఁడు రథ్య సింహంబు లదలిబెదల, బొబ్బవెట్టె శంఖమ్ము రా • ముందునూదె.

తే॥ శూల కుంత గదా భిండి • పాల ముసల, ముద్గరాదిక సాధన • ములను వాన
కరణిఁ గురిసి దైత్యులు ఘూటు • కళవళింప, ముసరికొని లక్ష్మణుని చుట్టు • ముట్టినారు,

తే॥ లక్ష్మణుని శిత ఘోర భ • ల్లములు పఱన, నింగినుండి రాలెడి చుక్క • నికరమట్లు
వలవలన రాలి తునియలై • పడ వికస్త్ర, లంబు సాధన ఖండ ము • లంబ యయ్యె.

తే॥ ఒక్క తొడుగున నేయు శ • రోత్కరమున. వేయి యరదంబు లిరుసులు • విఱిగి కూలు
తురగములు చచ్చి సారథు • లురలు చుండ్రు, రథికశిరములు నెవయు వా • రణములేయు.

తే॥ విఱుగుఁ జట్టుముల్ చక్రముల్ • విఱుగు విండ్లు. విఱుగు సైంధవములకాళ్లు • విఱుగు నాళ్లు
విఱుగు గొడుగులు బొమిడికల్ • విఱుగు మురజ, భేరి కాహళాదికములు • విఱుగు చుండు.

తే॥ ఇట్టి యరదంబు లివి వీరు • లిట్టివారు, వాజులిట్టివి యిట్టివి • వారణమ్మ
లనుచు నేర్పఱుపఁగరాక • యవని ఛిన్న, భిన్నములుగఁ దార్మాఱయి • విఱిగి కూలె.

తే॥ తెగి శరంబులతో నింగి • కెగసి చన్న, యువక శిరములు తత్క్రమం • యొదలయందు
పడియె జనకుల శిరములు • కొడుకులున్న, యరదములయందు విస్మయ • మందఁ బడియె.

శరాసన యుత హస్త • సముదయంబు, త్రెవ్వి రక్త హ్రదంబులఁ • దేలియాడ
ములతో జలధి సంచ • రించుచుండు, చొఱమీలు ప్రకాశించు • చొప్పుదోఁచె.

నారాచములు త్రుంచి • త్రోయుచుండఁ, గెరలి పడు గొడుగులును వె • క్కొమ్ము లడిద
ం రక్తవాహినిలోన • మునుఁగుచుండు, పలు వగల జల పక్షుల • పగిదిఁదోఁచె.

మ్ము లమ్ములు విండ్లు • కైదువులును, సిడము లింధనములుగాఁగఁ • బడసి వీర
షా దృశాగ్ని నుడికి • పక్వమైన, ప్రేతములఁ బ్రీతితోఁ దినె • భూత గణము.

చక్రముల్ విఱుగంగఁ • గూలెఁగొన్ని, త్రాళ్లు తెగ గుఱ్ఱములుజాఱి • రక్త పంక
మునిఁగెను సారథుల్ • ద్రుంపఁ గొన్ని, పయిగులిడె నరదము లిచ్చ • వచ్చు పగిది.

చుండు మణుల కాంతి • నెనసి రక్త, పంకమునఁ బూఁడి యెఱ్ఱని • ప్రభలుచిమ్మ
కాయముల్ మారుతి • రాఁజఁబెట్ట, మండు లంకలో భర్మ హ • ర్మ్యములఁబోలె.

ండు హనుమంతుని, ప్రేరేఁచు నపుడు బాణ • వృష్టిం గురియన్
పొడిపొడియై భువిఁ, దీఱఁగ రావణికి నొక్క తేరే మిగిలెన్

ంకములఁ బూన్చిన రథ, ములు రథికులతోడఁ గూడఁ • బుయిలోడిన వా
ని కుత్సించు నో, టిలక దనుజ విభు సుతుండు • టెక్కునఁ బలికెన్

ఇరువురు కూడి పోరెదరొ ? యెప్పన నొక్కరె వత్తురో ? చమూ
త్కరములతోడుతం దొడరి • కాలుని ప్రోలికిఁ బోవఁజూతురో ?
యిరవుగ నిచ్చగించినది • యేదియొ తెల్పిన నట్టి తీరునన్
మర మొనరింతు నంచలుక • తో నన లక్ష్మణుఁ డంత నిట్లనున్.

అడిదమొ కార్ముకమ్మొ మఱి • యాయుధ మెయ్యది యిమ్మొ వానినే
వడిఁగొనిరమ్ము నిన్నెదిరి • ప్రాణము తీయఁ బ్రతిజ్ఞ చేసితిన్
జెడు తెరువైన మాయలిఁకఁ • జెల్లవు నిక్కపు వీరమున్నచో
బడిబడి డాఁగ కెచ్చటికిఁ • బాఱక నిల్వుము నీచ ! నావుడున్.

జనకుని తమ్ములం దొలుతఁ • జంపిన రాముని వెన్కఁ జంపెదన్
మనిమెద నిన్ను మున్నగనె • దోర్బల సంపద మీఱ నట్టు లేఁ
కెనకి వధింపనేని దశ • శీర్షుని పుత్త్రుఁడ నైతినన్న యా
మనతయు నాకుఁ దక్కునె ? జ • గంబులు దీనికి నమ్మఁతించునే ?.

నా శరములకున్, లక్ష్మణముగఁ జేసి నిన్ను • లలిఁ గూల్చినిపో
రించునె నన్నున్, లక్ష్మణ నామంబు సార్థ • లక్ష్మం బగునే ?.

వెల్వల సైన్యము, లటిమటి గావించు మీర • లడలుచుఁ జూడన్
దెబ్బది వెల్వలఁ, గొఱవడు మీ జీవములను • గ్రోలెద నవలన్.

ఉ॥ కాను ఖరుండ దూషణుఁడఁ • గాను త్రిశీర్షుఁడఁ గుంభకర్ణుఁడన్
గాను జగంబు గెల్చు దశ • కంఠుని పుత్త్రుఁడ వీరసింహుఁడన్
మానవులార! తమ్ములకు • మా పినతండ్రులకున్ ద్వదీయమౌ
శోణితమందు తర్పణము • సుద్దిగఁ జేయఁగఁ బూని వచ్చితిన్.

ఉ॥ నావుడు లక్ష్మణుం డను మ • నంబునఁ దక్షిణ చింత మానికే ?
చావఁగనున్నవారికిని • వచ్చినవారికి నెల్లవారికిన్
నీవొనరించు వారలకు • నీకు విభీషణుఁ డున్న వాఁడిటన్
జీవన తర్పణంబు దయ • సేయగఁ దద్వ్యసనంబు మానుమా.

సీ॥ అనుడు మనసు మండ • నసురేంద్ర సూనుండు, పాలకడలిఁబోలి • పరవియున్న
యగచర వరులపై • సంగదుపై మారు, తాత్మజుపై లెక్క • రదఁగరాక
చిటచిటఁ బెటపెటఁ • జిటిలఁచుఁ బోవు మా, ర్గణముల నేసి సం • గ్రామ భూమి
శరమయంబుగఁ జేసి • సౌమిత్రిపై రాము, విభునిపై బెడిదంపు • విశిఖ తతుల

తే॥ నాటనేసి గర్జించె న • ప్పాట వాని, కార్ముకము మండలాకృతిఁ • గాంచియుండెఁ
గేలుదోయి వడింగాంచి • ఖేచరులును, అనిమిషాక్షంబులం గేల • నదిమికొనిరి.

తే॥ లక్ష్మణుండు ప్రత్యస్త్ర బ • లంబువలన, వాని శరవర్ష మడఁగించి • వ్యర్థపరచె
వెడఁగువాని యసత్యవా • గ్బృందములను, ప్రాడ్వివాకుండు నేర్పున • బ్రాల్చు పగిది.

ఉ॥ ధర్మము కాని హేతువు ను • దారుఁడు రాముఁడు గౌరవించుచున్
గార్ముక మెత్తఁడయ్యె దశ • కంఠకుమారుని పైని; లక్ష్మణున్
వర్మముఁబోల్కిఁ గావ నెడఁ • బాయక ప్రక్కన నిల్చియుండె దు
ష్కర్మము సాధుకర్మమును • సంగరరంగము నాక్రమింప గన్.

ఉ॥ వాఁడి శరంబు లొండొకటి • వారక తాఁకి జ్వలించుచుండుటన్
మాఁడెను శైలవర్గములు • మాఁడెను జాల్పగఁ గైడి మేదినిన్
మాఁడెను సాగరంబులును • మాఁడెఁ జరాచర జీవరాసులున్
మాఁడెను దానవావళులు • మాఁడెను వానర సైన్య సంతతుల్.

మ॥ శరవర్షంబు నడంచి లక్ష్మణుఁడు పం • చాస్యంబులన్ దెక్కెమున్
ముఱియల్ సేయఁ గళావిహీన రవినాఁ • బొల్పొంది యింద్రారి య
య్యాసంబందున నిల్చి శత్రు బల సం • హారంబు గావించుచున్
మొరయించెం చన చింద ఘంగదు మపు • త్పుత్రున్ వెతారించుచున్.

శా॥ చించంబో త్రిస వాని కంకటము వి • చ్ఛేదంబు గావించుచున్
జంచం బొప్పఁగ లక్ష్మణుండును ధను • ష్టంకారముం జేయ నా
నందాస్త్రుల్ తొలఁకాడఁ జిర్నగవునన్ • గాకుత్స్థవర్యుండు సైఁ
గం చెల్పన్ భువనంబు లెల్లఁ బగులం • గర్జించి రవ్వానరుల్.

శా॥ జీమూతంబుల డాఁగి రావణి కడున్ • శీఘ్రంబునన్ రాఘవ
స్వామిం గాంచి సుమిత్రపట్టి యితనిం • జక్కాడకే వీడినన్
వేమం బింతయులేక వానరతతిన్ • నిర్మూలమే సేయు నీ
పాముం బోలిన క్రూరుఁ ద్రుంచెదను నా • బ్రహ్మాస్త్ర యోగంబునన్.

మ॥ అని పల్కన్ రఘురాముఁ డిట్టులను బ్ర • హ్మాస్త్రంబు సంధించి యే
సిన లక్ష్యం బెదిలేమి లోకముల ని • శ్శేషంబు గావించుఁ గా
వున నట్లేయుట పాడిగా దొకనికై • పూనికన్ జగన్నాశమున్
బొనరింపం దగునయ్య? మానుమన నా • పుణ్యాత్ముఁడున్ మానుడున్.

చ॥ మొఱఁగిన మేఘనాదుఁడును • భూపతి పుత్త్రుల భావనంబు లో
నెఱిఁగి విరించనాస్త్రమునె • యేయఁదలంచి యధర్మయుక్తిఁ బా
గఱ యొనరింప నీకరణి • కాదని యచ్చటు వీడి లంకకున్
వెఱచిన చందమొంది కపి • వీరులు చూడఁగఁ బాఱె నెవ్వడిన్.

చ॥ చదలఁ బురంబుతోవ వెస • జాఱిన రావణిఁ గాంచి వానరుల్
కదనము సేయజంకి తన • కాళ్ళకు బుద్ధి వచించెనంచు స
మ్మదమునఁ గేక వెట్టి రప • మార్గము వట్టిన కీశవర్గమున్
బదపడి వచ్చి యాడుచును • పాడుచు గెల్పు వహించె నుద్ధతిన్.

చ॥ చిలికిన పాలసంద్రము • చెన్నునఁ జాలఁ గలంక నొంది కీ
శుల రఘువర్యులన్ దునుమఁ • జూచి విధాతృశరంబు మున్నుగాఁ
దలపడి వీడ గాఁ దలఁచి • దైత్యుఁడు పోవు టెఱుంగలేక యా
జలజ హితాన్వయుల్ దనుజ • సంగతి యేమని సంగరస్థలిన్.

తే॥ వాహనంబులపైనుండి • వసుధకు దిగి, తూణ కార్ముక కవచముల్ • తొలఁగి విశ్ర
మంబు గొనిరి వారల విక్ర • మంబు మెచ్చి, చదలనుండి వేల్పులు పూలు • చల్లినారు.

తే॥ కపుల కోలాహలము వింటిఁ • గలఁతపెట్ట. నచట నుండుటకును నిర్జ • రారి తొడఁగి
నలువశర మేయుటకు సహ • నంబు సేయ, లేనివానికై వడిఁ గ్రుంకె • భానుఁడపుడు.

తే॥ అగ్గలిక బవరము నేసి • యలసియున్న. దడములకు వలసిన యంత • కుడుపులేదు
కణఁకఁ దెప్పింపుమా విభీ • షణ? యటంచు. జానకీజాని చేసె నా • జ్ఞాపనంబు.

తే॥ చిత్తమని తగువారలఁ • జేర్చికొనుచుఁ, గదలి దాఁటిచనియె నొక్క • గడియలోన
ధాతృకుల కలశాబ్ధి చం • ద్రముఁడు; పిదప, రామచంద్రుండు లక్ష్మణ • స్వామిఁ గాంచి.

తే॥ ఒనర దివ్యాస్త్రములను వి • ధ్యుక్తవిధుల, నర్చనము సేసి యేయుట • యంచితమగు
నరిగి వచ్చెదఁ బూజకు • నంతదనుక, సైన్యములఁ గావుమని రణ • స్థలిని వీడె.

తే॥ జనకుఁగని యింద్రజిత్తాజి • జరగుటయును, వారు బ్రహ్మాస్త్రమును విడు • వంగమంట
దెలుప నిశ్చేష్టుఁడై చేయ • దలఁచినట్టి, కార్యమెదియని తనుఁబరి • కంతుఁ దడుగ.

తే॥ చంపనెంచిన శత్రులఁ • జంప వలను, గలుగ మానిరుమంచు వి • జ్ఞులు వచింత్రు
అట్లుచేయుట మానవు • లరయరాక, నలువశర మేయఁబూనితి • నయముతోడ.

ఆ॥ వార లెఱిఁగిరేని • ప్రత్యస్త్రమున నడఁ, గింత్రు చంప నిచ్చ • గింత్రు వేల్మి
చేసి మఱుఁగునుండి • చెడు తపోబలముల టీ, వముల క్షణములోనఁ • బాపు టరవు.

క॥ నను వారు మఱచునట్లుగ, దనుజ నికర మంపుదేవి • తరువాతనె నా
పని తడలేక ముగియునన, సనియె మహోదరునితో ద • శాస్యుండు వెసన్.

క॥ ఘోరాకారులు త్రిశూల, ధారు లకంపనుని దొట్టి • దైత్యగణముతోఁ
బోరికిఁజని నర వానర, వీరుల జీవములఁ గొల్ల • పెట్టుము కడిమిన్.

తే॥ గొప్పమాయలు పన్ని ర • క్షోగణమున, కిమ్మగాఁగ గాఢాంధకా • రమ్ముగూర్చి
సంగరస్థలి రామల • క్ష్మణులఁ గూల్చి, నాకుఁ దోడ్పడి పెక్కుమ • న్నలఁగొనుము.

తే॥ అనుడుఁ దన్నెప్పుడంపునా • యనుచునుత్స, హించుచున్న మహోదరుఁ • డెక్కెఁ దేరు
కొండఁజుట్టిన గౌరుల • కొమరు దాల్చి, సోఁకుమూఁక దైత్యాన్వయుఁ • జుట్టి వెడలె.

## మహోదరుని యుద్ధము

తే॥ కన్నుమేర దూరము కరి • ఘటలుపోయెఁ, బరుగువాఱెఁ దేరులు లెక్క • పక్కలేక
త్రోప యశ్వమయంబయి • తోఁచె సుభట, పద్గమా నేలయీనిన • పగిది నుండె.

తే॥ సాధనములును నిశితదం • ష్ట్రిలును భూష, ణములు వెన్నెల లెండలు • క్రమము చెడక
కాయఁ గోడెల గుంపుల • కరణి నడచె, దైత్యగణములు కలనికి • ధాత్రి యదర.

తే॥ క్రిక్కిఱిసిన టెక్కెంబులు • నిక్కి గగన, మెల్లఁగప్పుచు గాలికి • మెల్లఁ గదలి
జలదములు పలపల రాలఁ • గలఁచివైచె, నజుని కన్నులఁ గప్పెను • రజము రేఁగి.

తే॥ ద్విరదపర్వతములనుండి • దిగుచునుండు, మదయురంబులుహయ ఫేన • సహితములయి
వెడలి యడవుల తరుశిలా • వితతిఁ ద్రోచి, కొనుచుఁ బాఱి కలసిపోయె • వనధియందు.

క॥ మెఱపుల మెఱసెను పెదవులు, గొఱుకు కఱకు సోఁకుమూఁక • కుడిచేతులలో
నెఱసిన యాయుధములు నెఱిఁ, గఱకఱ మిడుఁగుఱుల రాల్చి • క్రందుకొనంగన్.

తే॥ అసురవిభుఁడు పంపిన చతు • రంగ బలగ, ణంబు లంకాపురంబు ద్వా • రంబుమెల్ల
వెలివిడుట చూడఁ దొల్లిన • బ్ధిజలమెల్లఁ, ద్రావి తఱిచూచి వీడిన • తపసిఁబోలె.

తే॥ శంఖ కాహళ భేరికా • స్వనము వీర, నినదమును గుణరుతి రథ • నేమిరవము
గీఁకలును సకిలింపులు • కెరలి లోక, గర్భువలె నదంచికొనె జ • గంబునెల్ల.

ఉ॥ సేనముమ్మరముగఁ గలను • చేరెఁ బ్లవగబృందమున్
బూని యతిశయించి డాసెఁ • బోరుసేయ దైత్య సం
తానమేయు నంపగములంఁ • దరుల గిరుల సద్దుచున్
వానరాలి కినిసి కెరలి • వారి కడఁక మానిచెన్.

ఉత్సా॥ శిలలను గుఱిచూచి వైచి • చెలఁగు కపుల జాతికిన్
నలుగు రైదుగురుగ నలఁగి • నాశమైరి రక్కసుల్
కలభములు గుఱ్ఱాలు గూలెఁ • గఱకుసోఁకు కైదువుల్
మలయదాఁకఁ గీశచయము • మడిసి పడియెఁ గుప్పలై.

ఉత్సా॥ పరశు శూల ముసల భిండి • పాల దండ వలయము
ద్గర ముసుండి కుంత ఘన గ • దా పృషత్క పాశ తో
మర నికాయములును మించి • మర్కటములు వైచు పెం
దరుల గిరుల నుగ్గుచేసి • దనుజుఁ ద్రోచెఁ గీశులన్.

ఉత్సా॥ మెఱుఁగు టాయుధముల నొడుపు • మీఱ వైవఁ బ్లవగముల్
కఱకు సోఁకు మూఁక యెదుటఁ • గడఁగి నిలువ నోపమిన్
వెఱచి పాఱె రక్త నదుల • పీన్గు తెప్ప లడ్డమై
తఱుమ వీలు గాకపోయె • దైత్య జనుల కయ్యెడన్.

తే॥ సమర భూమిని మరణించి • యమరభూమిఁ, జొచ్చి వేలుపులైన కీ • శులను గూడి
చిర మభిలషించు కోర్కులు • చల్లెననుచు, నలమికొని తిరిగిరి మేన • కాదు తెలమి

తే॥ క్రూర హింసయే నైజమౌ • గుణము గాఁగ, ధర్మమార్గంబు ద్రొక్కని • దనుజవరుల
మేటి సురలుగఁ జేయు సౌ • మిత్రిశరము, కంటెఁ బావన వస్తు వౌ • క్కండు కలదె?

తే॥ విక్రమంబున నూర్మిళా • విభుఁడు దురము, సలిపి యామ్యాస్త్రమున దైత్య • సంఘములను
స్వర్గమున కంపె నచ్చట • స్థలములేక, నింగియెల్లను వారలై • నిండినారు.

## ఆంజనేయుండు కుంభకర్ణుని వజ్రదండము గొని దైత్యుల నుఱుమాడుట

క॥ అమరులఁ దఱిమిన యది లో. కముల నలఁచినదియుఁ గుంభ • కర్ణునిచేతన్
సమరముల వెలయునది యగు. సుమహిత దండమును వాయు • సూనుఁడు గొనియెన్.

ఉ॥ మేరు సమానధీరుఁడు స • మీర కుమారుఁడు వజ్ర దండమున్
దీరుగ హస్తమందున గ • దించి మహోద్ధతి విక్రమించె దు
ర్వార కృశాను రేతుఁడో ప్ర • భంజనుఁడో లయకాల రుద్రుఁడో
వారని కోప భీకరత • వచ్చిన కాలుఁడో యన్న కైవడిన్.

క॥ వీరుల శీర్షంబులపై, వారణ కుంభముల మీఁద • వారువములపైఁ
దేరులపైఁ జెలరేఁగెను, మారుతి యెల్లెడలఁ దాన • మలసి హరిక్రియన్.

క॥ అదరిన వారల నగ్గము, పడువారల నలఁచి త్రొక్కి • బవరపునేలన్
గడు బీభత్సం బొనరిచి, పొదవడఁచెఁ ద్రివిక్రమేశు • పోల్కిఁ జెలఁగుచున్.

చ॥ కనుల శిరంబులం జెదరి • కాంతులు చిందిన మౌక్తికంబులన్
దిరమగు మేని కఱ్ఱ వడి • డేర నభంబును దాఁకు నున్నతిన్

బరఁగె మదుత్పరుండు లయ • వాయువు వీవఁగ ఋషజాలముల్
తరణి విధుండు సంతతము • తారెడి మేరుపుమాడ్కి నొప్పుచున్.

చ॥ బలితపుఁగేల దండమును • బాధముగా ధరియించి మేదినిన్
బలముగ మోఁదు చాద్పునను • బాఁదుచు దైత్యులు చాఁపకట్టుగన్
నలఁగి ధరిత్రిఁ దాఁటఁగ గ • జంబులుగా రథ దంతి వాజులన్
నలినలి నట్టు నట్టుగ నొ • నర్పి చలం బెసలార గర్జిలెన్.

క॥ నదులైన శోణితంబున, మద గజముల బురదచేసి • మారుతి కాలన్
మదయుతులం దాటించుచు, మదమెత్తిన దిగ్గజంబు • మాడ్కిం దిరిగెన్.

ఉ॥ కోదెల చంద మొంది రథ • కుంజర వాజుల మీఁద వచ్చుచున్
బోఁడిమి చూపి పెక్కురణ • ముల్ పొనరించి జయేందిరా సతిం
గూడిన వారలన్ దనుజ • కోటుల దండముతోడ మోఁది యిం
కేడది లంక లంకె యని • యెత్తెఱఁ బంపెను స్వర్గసీమకున్.

తే॥ భానుపుత్త్ర కుముద నీల • పనస జాంబ, వద్గజాంగ దాములు రణా • వనిని చొచ్చి
దైత్య సేనాపయోధిలోఁ • దవిలి యీఁదు, చుండి రెఱుఁగక తమలోన • నొకరి నొకరు.

తే॥ లెక్కలేని రక్కసులను • చిక్కినంత, వఱకు దుక్కడుమారంబు • నెఱయఁజేసి
యుగ్ర నరసింహు క్రియ రేఁగి • యున్న గాలి, పట్టి యారజస్థలి నకం • పనుని గాంచె.

### హనుమంతుఁ డకంపనుం జంపుట

తే॥ గాడిదలు వేయిపూన్చిన కనకరథము, పైని విలుపూని పెలుఁగొందు • దానవుండ
కంపనుఁడు పూర్వమున జగ • త్కంటకుండు, తారకుండు కుమారుచే • దోరినటఁడు.

తే॥ ముగురు మూర్తులు మఘవుండు • మొనసివచ్చి, తాఁకినను ప్రాణములఁగొను • దంట తనము
గలుగు నీకోఁతి కనుచు న • కంపనుండు, వీనిఁ దెగటార్పఁగా నేది • వెరవటంచు.

తే॥ అడ్డుపడకున్నచో రాక్ష • సాంతకుఁడయి, వసుమతి నదైత్యముగఁ జేయు • వాఁడు వీఁడు
చంపవలయున యనుచు న • కంపనుండు, దర్పమున నంపవానతోఁ • దారసిల్లె.

తే॥ మొగులుతో నగ్గియును గాలి • తగులుపగిది, బలముతో నకంపనుఁడు త • న్నలమునంత
వజ్రబాహుండు మారుతి • వజ్రదండ, మమరఁద్రిప్పెను దనుజ మ • ధ్యంబునందు.

ఆ॥ అసురు లేచి యేసి • విసరి పొడిచి త్రెంచు, వీరసాధనములు • విఱిగిరాల
దనుజ తనువు లురల • దండంబు ద్రిప్పుట, హనుమ కపుడు చాల • నలవుపడియె.

ఆ॥ విలయ పవన హతికి • వీఁగని మేరువు, కరణి నిలుచు హనుమ • కలుకుసోఁకు
మూఁక చూచుచుండఁ • బోకార్చెఁ దుంగమా, తంగ తురగ రథ క • దంబకములు.

ఆ॥ నేఁడు వీని సురల • నెలవున కనిపి రా, ఘవుల నోర్చి పంక్తి • కంధరునకు
జయము గూర్చి యమర • జాల కష్టమ్ములు, విలుపువాఁడ ననుచు • నిక్కె యసుర.

ఆ॥ కటము లదరఁ బండ్లు • పటపటఁ గొఱుకుచుఁ, గనులఁ బొగలు నగ్ని • కణము లురల
రథము తోలఁ బంచి • రాక్షస వీరుండు, హనుమఁ జేరుచుండ • నతఁడు డాసె.

ఆ॥ పిడుగు గముల యట్లు • మిడుఁగుఱుల్ కెలఁకుల, రాల్చునవి సురారి • రక్తములను
చవి యెఱింగి నట్టి • శరరాజముల నకం, పనుఁడు హనుమ యురము • వగులనేసె.

ఆ॥ వాతనెత్తు • రొలుక వాయుపుత్త్రుఁడు సొమ్మ, సిల్లి యించుకంత • సేపులోనఁ
దేఱి తేరితోడ • సారథిఁ జదిపెఁగా, డిదలఁ ద్రొక్కి త్రొక్కి • ప్రిదుల నలఁచె.

ఆ॥ వీనితోడఁ బెనఁగి • వింటితో గెలుపుట, కడిఁది యనుచు నయ్య • కంపనుండు
విశ్వకర్మ యొసఁగు • వీరదండము కేలఁ, గొనుచు దూఁకి డాసె • హనుమపైకి.

క॥ ఇరువురుఁ గుడియెడమలుగాఁ, దిరుగుచు డాయుచును పొంచి • తెగువగు వెరవుం
బరికించుచుఁ బాయుచు బడిఁ, దఱియుచు దండములతోడఁ • దాఁకిరి పెలుచన్.

క॥ తడవిరి తట్టిరి నిక్కిరి, యడఁగిరి వ్రేసిరి తొలంగి • రార్చిరి భుజముల్
మడిచిరి విడిచిరి పొడిచిరి, కడిమిని ప్రకటించి సమము • గాఁ బోరిరొగిన్.

తే॥ కల్లతో వైరముంగొన్న • గాడ్పుపట్టి, యంజనాద్రితోఁ బగగొన్న • యసురయురముఁ
దాఁప దండంబుతో దానిఁ • దట్టివైచెఁ, గాని వల కేలు తునిఁగి రం • గమునఁబడియె.

తే॥ తలరియును పిఱుతివియక • దైత్యుఁడంత, నెడమచేతఁ బావనిఱొముఁ • బొడిచెఁ బొడువఁ
బోటు వజ్రగిరిం దాఁకు • వాటమగుచు, దనుజు కేల్నొచ్చె మారుతి • కినిసి రేఁగె.

ఉ॥ దండధరాభుఁడౌ హనుమ • దండధరుండయి విస్ఫుర ద్భుజా
దండ విహీనుఁడై కరము • దండ విహీనత నుంటఁ జూచి యు
ద్దండ భుజాంతరంబు భుజ • దండముచే వడి మోఁద దైత్యుఁడున్
గండలతోడ శోణితము • గ్రక్కను త్రాగుచుఁ గ్రక్కుకై వడిన్,

తే॥ పిదప నాచేతితో గూబ • లదర మోఁది, వాని వీరనాకమునకుఁ • బంపునంత
హనుమనిం గని సింగముం • గనిన హరిణ, వితతి యట్టు లసుర సేన • విరియఁబాఱె.

పంచ॥ అకంపనుండు గూలఁగా సు • రారి సేన వ్రాలఁగా
అకంపితాంగులై ప్లవంగు • లార్చిపేర్చి యాడఁగా
నకాలకాలుఁ బోలి లక్ష్మ • ణాఖ్యుఁ డేయు తూపులన్
వికావికల్ గడించిపాఱె • వీరదైత్య సంఘముల్.

## మారుతి లక్ష్మణుని వెదకుచుఁబోవుట

తే॥ ధీరుఁడగు లక్ష్మణుని వింటి • నారి మ్రోఁత, వినని కతన నెవ్వరి కేమి • హీనరెనొక్కొ
కదనరంగంబునం దవి • కరువలి సుతుఁ, డెడఁదఁ దలఁచి కొండలమందె • వింత్రపడియె.

తే॥ దితిజసేనలో నాగ్నేయ • దిక్కునుండి యంగదుం డేడు యోజనా • లరిగియుండె
వాని కవ్వల నుండెను • భానుసూనుఁ డతని కావల లక్ష్మణుఁ • డరుగుచుండె.

తే॥ ఒకరికొకరికి నాలేసి • యోజనములు దూరమయ్యెను కపులకు • దూరమునందు
నీటిపైఁ బాఁచిన సేన • నెగడ లక్ష్మ ణునకు హనుమకు మూఁడు యో • జనములుండె

తే॥ లక్ష్మణాఖ్యుని గను నభి • లాషి తన్ను పురికొల్పఁ జండమారుత • స్ఫురణిఁ జనుచుఁ
జింత వీడంగఁ దగు యుద్ధ • చిహ్నములను గొన్నిటినిఁ గాంచి మారుతి • కొంత తనిసె.

తే॥ దంతి దంతముల్ ఛత్రధ్వజం • దములు రత్న హారములు ఫుల్లవల్లెఁ బ్రభృ • త్యాయుధముల
కలిసి పరువిడుచుండు రక్త • ప్రవాహ ములఁ గాంచెను హనుమ య • స్థలములందు.

ఆ॥ ముట్టి పోరుపగఱ • మూఁకపైఁ వైచిన • శరచయంబు శీర్ష • సమితితోడఁ
జడలఁ జేరి మరలఁ • జెదరి శిలావృష్టి • పగిదిఁ బడుచు నుండు • వానిఁ గాంచె.

ఆ॥ దనుజులేయు నాయు • ధములు లక్ష్మణశర • తతివలన విఱిగి • ప్రతతదర్పనము
తోడ ఋక్షచయము • దొరల్లిన చందానఁ • బ్రభలతోడ నుర్వి • పడుటఁ గాంచె.

తే॥ ఎదపడక సుమిత్రాసుతుఁ • డేయు విశిఖ బృందమెల్లెడఁ దామ్రమై • బేసికంటి
ఘన జటామండలంబనఁ • గ్రాలువాని నంజనాసూనుఁ డయ్యెడ • నలరి కాంచె.

తే॥ మేనిపై రక్తధారలు • మేపుకొనఁగ నంధతమసంబ రేయిరా • జని యెఱింగి
కాలమెత్తిన దీపపుఁ • గంబములనఁ దనరి తిరుగుచున్న కబంధ • వనముఁ గాంచె

ఆ॥ వీరవరులు మడియఁ • దేరులు కరులును హరులుఁ గాళ్లు నొవ్వఁ • బరుగువాటి
రక్షలేని రాజ • రాజ్యమందలి ప్రజ వలె నశించుచుండు • వానిఁ గాంచె.

తే॥ అతిశయంబుగ లక్ష్మణుఁ • డదరి పోరఁ గలనఁ గూలిన క్రూరరా • క్షసుల రక్త
సాధన శరీర తతులను • సాగరవన పర్వతంబులఁ బావని • పరఁగఁ గాంచె.

తే॥ విలయవాయువువలె నేగి • వెదకి రుధిర వాహినుల దాఁటియందక • టాహ మగటె
నగటె నన దగు సౌమిత్రి • యల్లెనాఁడు విని ముదంబున హనుమ గ • ర్జనము సేసె

ఆ॥ ఎల్లవారి సేమ • మెఱుఁగంగ నగునని హనుమ డాసి వినతుఁ • డై నయంత
విజయశీలి రాజ • వీరుండు సౌమిత్రి, యెలమిఁ గౌఁగిలించి • యిట్టులనియె.

ఉ॥ ఎక్కడ నున్నవారు కపు • లెక్కడ నుండె దినేశ పుత్రకుం
దెక్కడ వాలి ముద్దుకొడు • కెక్కడ తక్కినవారు సేనలో
నొక్కటియేని యేనెఱుఁగ • నొయ్యన మారుతి! తెల్పుమయ్య యె
య్యెక్కడ నేమియేమి ఘటి • యించె వినంగఁ దలంతు నెవ్వడిన్

తే॥ రణముఁ బోలెనైంద్ర వ్యాక • రణము దనుజ గణముఖావరణము మేర • గాంచు హనుమ
యతని పలుకులు విని యట్టు • లను దురాన నొక్కరి నొక్కరు గానరు సుంత • యనునిజమ్ము.

తే॥ తెలియఁదగును పాయంబొండు • గలదునీవు, చేయఁదగుదురక్కసి మాయ • చేతలెల్ల
దొడరి పాశుపతమ్మునఁ • దొలఁగఁదోలఁ, నీదు సేవకు లెల్లరు • విన్నుఁ గాంత్రు.

తే॥ అనుడు సౌమిత్రి లెస్సయౌ • ననుచు శ్రీరామ విభునిమదిఁ బ్రొక్కి శరమ్మునందు • వింటఁ గూర్చి
పాశుపత మంత్రము పఠించి • పాపులపయి, నేయ నయ్యస్త్రరాజము • జేయమగుచు.

తే॥ అదరి యెదురుటదవిఁ గాల్చు • నగ్గివోలె, నెదురఁబడువస్తువులతోడ • నెల్ల దనుజ
గణము వీడక క్షణములోనఁ • గాల్చివైచెఁ, దొలఁగ్రొ నిరిఁయెను కపులకుఁ • గలఁకవడఁగ.

తే॥ పాశుపతముచేఁ బెనుమాయ • నాశమందు, బెడఁగి యమ్మహోదరుఁడవి • మఱుఁగుపడయె
భ్రమము తొలఁగంగ సకలప్ల • వంగు లలరి, పాడుచాడుచు లక్ష్మణుఁ • గూడినారు.

తే॥ కపులలో నెవ్వరును నొవ్వి • గాంచకునికి, శంకవీడి సౌమిత్రి హ • ర్షమ్మునొందెఁ
జుట్టి యార్చిరి ప్లవగులు • తుష్టకతమీఱ, సురలు విరులను కురిసిరి • పొరపులేక.

క॥ దూతలు దశకంఠునకున్ వి • నీతులగుచుఁ దెలుప నతఁడు • నిజమ్మగ్గయిన వి
ఖ్యాతమగు పాశుపతమున నా • తెఱఁగయ్యెనని పలుక • నగుఁగా కనుచున్

క॥ తనయునకుఁ దెలుపఁదన వే • చనివారలు తెలుప నతఁడు • చకితుండగుచున్
హనుమఁడు విభీషణుఁడు రవి • తనయుం డినకులజు లెచటఁ • దగిలి రనంగన్.

ఉ॥ రాముఁడు సంగరస్థలికి • రాఁదొకకొండను చేరినాఁడు మా
యా మహిముండు నీదు పిన • యయ్య వనాటుల కోగిరంబుకై
యీమహి దాఁటిపోయెఁ బర • మేశ్వరు నస్త్రము వీడు మున్నుగా
వ్యోమమునందు డాఁగెను మ • హోదరుఁ డియ్యది వార్త నాపుడున్

చ॥ ఇది యదనంచు నెంచి దను • జేంద్రసుతుం డొకమఱ్ఱిఁ జేరి యా
పదపడి బ్రహ్మరక్షసులు • పట్టఁగ దోడ్పడఁ బూని వేలిమిన్
జదగులు నేయి నూవులును • చియ్యయు నల్లని మేఁక నెత్తురుం
జిదుముచు శాస్త్రయుక్తముగఁ • జేసి ముగించెను శ్రద్ధపెంపునన్.

తే॥ దహనకీలలు మంచిగం • ధంబుతోడ, వలదిరిగి శుభసూచన • వఱలఁజేయ
సహజదుర్గుణనిధి యగు • శక్రజిత్తు, జయము మనదని కడు సంత • సమున లేచె.

క॥ మాయావిమేటి శంబర, మాయం బచరించి గగన • మార్గమ్మున దై
తేయులె కనరాకుండఁగఁ, బోయి యడఁగె మొగుళులందు • పొంచి యదనుకై.

క॥ అత్తఱి మహోదరుం డొక, క్రొత్త మతక మూని యింద్రు • కోలము గొని యు
న్మత్త చతుర్దంతి పయిన్, మొత్తము వేలుపులఁగూడి • మొనసెనుపోరన్

క॥ దనుజు లమర వేషంబుల, మనుజులతో వనచరేంద్ర • మండలములతో
ననిసేయఁ దొడఁగ భీతిలి, కనుకని సైన్యంబులెల్ల • గడగడ వడఁకెన్.

క॥ వెలిగౌరు నెక్కి యింద్రుఁడు, వెలలెరణముసేయ మునులు • వేల్పులు మనతోఁ
జలమూన హేతువేమని, మఱఁగిరి వానరులు దిగ్భ్రమంబునఁ గలఁకన్

క॥ రాముని తమ్ముఁడు హనుమని, మోముంగని మునులు సురలు • మోహరమున రా
నేమి కొఱగామి జరగెనొ, సామీరీ! తెలుపఁగలవె • శక్యంబేనిన్.

## ఇంద్రజిత్తు లక్ష్మణాదులపై బ్రహ్మాస్త్ర మేయుట

క॥ అని యడుగుచుండు తటి రా, వణి నిర్మానుషము నిష్ప్ల • వంగం బగుఁ గా
కని బ్రహ్మాస్త్రం బేసెను, దివి వేల్పులు మనములందు • కళవళపడఁగన్.

తే॥ పులుఁగులట్టులు వెలుఁగుల • యలుఁగుగములు, లక్ష్మణుని మేననాట ని • ల్వరముతప్పి
తెలివి తొలఁగంగ మత్తేభ • మిలను పడిన, చందమున సొమ్మసిల్లి ఘా • స్థలినివ్రాలె.

తే॥ ఇంద్రుఁడిట్టి యకార్యంబు • నేలచేసె, వీని నేనుఁగుతో నెత్తి • విసరివైతు
ననుచు లేచిన హనుమపై • నలుఁగు లడర, నలుగులంపడి యాతండు • నవనివ్రాలె.

తే॥ కనకగిరియందు మోదుగు • ననిచినట్లు, నెత్తు రొడలెల్లఁ బరవంగ • నిశిత సాయ
కములు నాటుటచేఁ దెల్వి • కలఁకవాఱ, నెలవు దప్పి భాస్కరసూతి • నేలవ్రాలె.

తే॥ పిడుగుపాటుచే మగసింగ • ముడిగినట్లు, పొలుపుచెడి వాలిసూనుండు • పుడమివ్రాలె
జాంబవంతుని కనుల వ • క్షమునఁ బెక్కు, కోలలంట నాతఁడు రణ • క్షోణినొఱఁగె.

తే॥ వేయిశరము లురముచొచ్చి • దూయునంత, నలుఁడు సమవర్తి ముఖదర్శ • నంబుచేసె
ముదితుఁడై వచ్చి యనుఁడు కు • ముదుని పిల్వ, నాతఁ డాతని వెనువెంట • నరిగినాఁడు.

సీ॥ ఋషభుండు స్వర్గపు • రింజేరె నీలుండు, రంభతోఁగూడంగ • రాజనేగెఁ
బెద్దనిద్దురచెందె • వినతుండు మైంద ద్వి. విదులు నాకముచూడ • వెడలినారు
కేసరి యిహమును • వేసరి వీడెను, గవయుండు భూమిని • కౌఁగిలించె
శతబలి శతమఖు • సన్నిధి కరిగె సు, షేణుండు కైలాస • శిఖరిఁజేరె

తే॥ గంధమాదనుఁ డూర్వశిఁ • గలయనేగెఁ, దక్కు వానరులెల్ల న • స్త్రములు గ్రువ్వఁ
బ్రజ్ఞచెడఁగఁ బ్రాణంబులఁ • బాసినారు. వజ్రివైరి బ్రహ్మాస్త్రంబు • వైచుకతన

తే॥ దేవసుందరుల్ వ్రాలి ని • ద్రించుపోల్కి, భూమిపైఁబడ్డ ప్లవగ స • మూహమపుడు
క్రమ్మి రక్తమెల్లెడలఁబ • ర్వఁగఁ బ్రవాళ, వనముగల క్షీర వారాశి • పగిదిఁదోఁచె.

తే॥ కపులు స్వర్గంబుచేర వే • లుపులు గాంచి, యతిథిపూజ లొనర్చి య • నామయంబు
లడిగి యలరించి పదపడి • యవని కిపుడ, పదఁడనుచు వేగ బలవంత • పఱచినారు.

తే॥ అర్చనంబు చేసితిరి బ్ర • హ్మాస్త్రమునకు, మీరు మరణింపఁదగినట్టి • వారుకారు
రామదాస దాసులును క • ర్మములఁగట్టు, పడక స్థిరముక్తి వరియించు • వారు నిజము.

శా॥ మాకార్యం బొనరించుపొంటె భువి జ • న్మంబందియున్నారు మీ
రా కాకుత్థ్సుని తోడు వీడకుఁడు మీ • ప్రాణంబె మాప్రాణమున్

మీకే హానియులేదు రాముకొఱకై • మీ జీవముల్ వీడుటన్
మాకు న్నాయకులైతి రాకతన మా • మర్యాదలం బొందుఁడీ.

మ॥ అనివారల్ పరిచర్యచేసి రిట జ • న్యక్షోణి సౌమిత్రి కా
నన సంచారులతోడ నీల్గె ధరజా • నాథుండు రాఁడయ్యెఁ దా
మనఁగా నేర్పునెయంచు నింద్రజితుఁ డు • న్మత్త ప్రలాపంబుతోఁ
జని లంకేశున కంతయుం దెలుప నా • శంకించి వాఁడిట్లనున్.

ఉ॥ రాముఁడు చావలేదు గద • రా జయమెట్లగు నీకు నన్న ను
ద్దాముఁడు మేఘనాదుఁ డనుఁ • దండ్రి! భయంబున రాఘవుండు సం
గ్రామధరిత్రి వీడె నెటు • గాంచినఁ దమ్ముఁడు మిత్రవర్గమున్
భూమిని కూలియుండఁ గని • పోఁడిమి నిల్వఁగలాఁడె దిట్టయై?

తే॥ అని సమాధానపఱచి లం • కాధిపతిని, తనగృహంబునకేగె రా • వణి మహోద
రుండు తన యింటికేగె నీ • రుండు రామ, భూవరుఁడు వేఱుచోఁ బని • పూనియుండి

## శ్రీరాముఁడు మరలివచ్చి పొలికలనిం గాంచుట

మ॥ కరపంకేజము లెత్తువాఱ నిఱుకన్ • గల్పోక్తరీతిన్ మహ
శరజాలంబులఁ బూజసేసి యవలన్ • సంగ్రామ రంగంబు గాం
చ రహిన్ జీఁకటిఁ దోలఁ జేకొఱవిగా • శోభిల్లు నాగ్నేయమౌ
శరముం గైకొని వచ్చి కాంచెఁ గలనన్ • సైన్యస్థితిం దత్తఱన్.

చ॥ శవమయమైన రంగమును • సంశయ రోష విషాద విగ్రహముల్
మివులఁగ నొక్కటొక్కటిగ • మీఱఁగఁ గాంచుచు రక్షణంబునం
దవులక యప్రమత్తులయి • తారియుఁ దాటిన కీశరాజి రా
ఘవుఁడట నొక్క నొక్కనిగఁ • గాంచె మహాకులి కేశవస్థితిన్.

శా॥ సుగ్రీవుం దన కన్ను దామరల న • శ్రుల్ గాఱ వీక్షించి యీ
ప్రగ్రీవంబిటు వ్రాలఁగాఁ దగినదే • భావింపఁగా నంచు న
వ్యగ్ర స్వాంతముతోడ నవ్వలన వి • ద్వద్వంద్య భక్తావన
ప్రాగ్రీయున్ శ్వసనాత్మజుం గనియె నే • త్రంబుల్ కుమారిల్లఁగన్.

మ॥ వనధిం దాఁటి నిశాచరావళుల గ • ర్వక్షోభముంజేసి యా
జనక క్ష్మావిభు పుత్త్రి సేమమును వి • జ్ఞాపించి నాప్రాణముల్
తనియంజేయుట యిట్టులౌటకో? మహా • ధన్యాత్మ! నీవక్షమున్
దనుజ క్రూర శరంబు దూసి చనియెం • ద్రాఁ చోర్చె నాగాంతకున్.

మ॥ మును బ్రహ్మాద్యమరుల్ మునీశ్వరులు స • మ్మోదంబుతో నిచ్చు దీ
వనలున్ జానకి యిచ్చు దీవనలు ని • ర్వ్యర్థంబులై బీటఁ బో

సిన బీజంబుల చందమె చెడియె నన్ • సేవించి నాకొందు విం
దను పాపంగలవాఁడనై పడితె నా • దౌర్భాగ్య సంపత్తిచే ?

శా॥ రాజ్యాంతే నరకం ధ్రువమ్మనెడి వా • ర్తన్నెగ్గియున్ లోభినై
రాజ్యాకాంక్షను దండ్రిఁ జంపుకొని యా • రణ్యంబులం ద్రొచ్చియున్
బూజ్యుండైన జటాయు జీవముల న్నేఁ • బోకార్చితిన్ బ్రాభవ
ప్రాజ్యశ్రీ నను బొందునే ? యధిక దౌ • ర్భాగ్యుండ వికల్పంబుగన్

ఉ॥ అన్నను జంపి తమ్మునకు • నా కపిరాజ్య మొసంగినట్టి యే
నెన్న సమస్తముం దెలుప • నెంచిన వాఁడన యైతి మీకిలన్
బన్నము గూర్చితిన్ భువన • భారముగా బ్రదుకంగఁ బుట్టితిన్
బన్నుగ నంచు నవ్వలికిఁ • బాఱఁగఁ జూచె మనంబు కందఁగన్.

మ॥ వృషవరంబునఁ గోడెమూఁపుఁ దనుపై • వీక్షింప నొప్పారు హ
ర్యృషభున్ వాలికుమారుఁ జూచి కడు స • ర్వేచించి డెందంబునన్
విషముం దిన్న విధిం దపించి యిఁక నే • విల్లంది నిల్చుండి యి
వ్విషమావస్థను మాన్పలేనయితి నా • విక్రాంతులం గాల్పనే ?

-:శ్రీరాముఁడు లక్ష్మణుంగని పరితపించుట:-

ఆ॥ అనుచు నవలి కేగి • యట సంపశయ్యపై, నీఁగ గములు మేన • మూఁగు కరణి
విశిఖతతులు గ్రువ్వఁ • వశమతి యహిశాయి, పగిదినున్న తమ్ము • నొగిలికాంచె.

ఆ॥ ఎడఁద యుడికెనొడలు • వడఁకెఁ బిడుగుపాటు, వలనఁగూలు తరువు • పగిదిఁ బడియె
గడియదాఁక నూర్పు • విడువఁ దేమెఱుఁగఁడు, కాలుచేయి తనువు • కదలలేమ.

ఉ॥ తమ్ముని కౌఁగిలించికొని • ధారణి వ్రాలిన తన్ను నెమ్మదిం
గొమ్మని పల్కువారలును • కొందఱమందకు మన్న వారలున్
లెమ్మని పల్కువారలును • లేరొక మిత్రుఁడుఁ బ్రాణయుక్తుఁడై
యమ్మహి లేఁడ యొంటి జని • యంగద నెవ్వఁడు తీర్చువాఁడొకో ?

ఆ॥ మొండెములు పిశాచ • ములు భూతములును న, క్కలును పతుల వెదకు • కామినులును
మిగిలియుండెఁ గాని • మేనఁ బ్రాణముఁ గన్న, వాఁడొకండుఁ గాన • రాఁడు కలన.

ఆ॥ అమరసతులు వగచి • రమరులు వెగచిరి, మహితజగము విష్ణు • మయముగాన
రాము చింత గని చ • రాచర తతియేడ్చె, నేడ్వకుండు నెద్ది • యిహమునందు ?

ఆ॥ నలువ మోము వాడెఁ • దలవ్రాల్చెఁ బశుపతి, బంధుచింత దెలిపి • ఫలముగలదె ?
పగయు వెక్కియేడ్చెఁ • బాపదేవత యేడ్చె, దుఃఖమయముగాఁగఁ • దోఁచె జగము.

ఆ॥ ఇంచుకంత తెలివి • నెనసి శ్రీరాముండు, కనులు తెఱచి యనుజుఁ • గాంచి కాంచి
దివముఁజేరె నింకఁ • దిరుగఁ డనుచు నెదఁ, బొగిలె నొగిలెఁ గ్రుంగె • బ్రుంగె గ్రుంగె.

చ॥ ధరణిఁ దృణంబుగాఁ దలఁచి • తమ్మున కిచ్చితిఁ దండ్రి మాలుచోఁ
దెరలకయుంటి జానకియు • దెప్పరమందఁగ నోర్చియుంటి నా
క్కరుఁడవు నీవుగల్గిన సు • ఖమ్ము సమ సముఁ గల్గనంచు నీ
కరణిని నన్ను వీడి చనలే గనొదగవే నిను వీడియుందునే యర్ధ ॥౮

ఉ॥ తల్లియుఁ దండ్రియుం దపముఁ • దమ్ముఁడుఁ బుత్రుఁడు నెంపదాల్చి నా
కెల్లను నీవకావె యెది • యేగిన నీవు కలాఁడవంచు నా
యుల్లమునం గుమారిలక • యుంటి సమ సము నేఁడువోయె న
న్నొల్లవ యేమి కాదు కడు • నుగ్ర శిలా కఠినాత్మ దేనకో

చ॥ వ్రణమయమైన కాయమునఁ • బ్రాణముఁ గానము చావకుంటి నా
కణఁక యదెట్టిదైన నగుఁ • గానల నన్ను భజించె కష్టముల్
తొణఁకక యోర్చి యోగిరము • తూఁగును మావిన దీరచిత్త యీ
రణభువి నేటికిట్టు నిదు • రం గొన నేటికి లెమ్మ నాయనా

ఉ॥ ఎండకు వానకోర్చి శ్రమ • యింతయు లెక్క యొనర్పకుండఁ గో
దండము నూని కాచు గుణ • ధాము రణస్థలి నేఁటివిధి తె
న్నుండుట నాయమేమి నను • నూల్కొని యెవ్వరు కాచువారు నా
గుండియ లెట్టివంచుఁ గనఁ • గోరితె పంతములేల నాయనా

చ॥ హృదయము జీవ మొక్కటని • యెంచిన పల్కు నిరర్థమైనచో
నెద నెనరున్నదంట నిజ • మే యగునేమి విశుద్ధమూర్తి నీ
పదపను జీవముల్ విడక • వెక్కుచు నుంటిని నీకుఁ జుట్టమై
వదలకయున్నదీ తనువా ప్రాణములో కనరాదు నాయనా

ఉ॥ యాగముగాచి శంకర శ • రాసన మెక్కిడి ప్రీత్రి యచ్చటన్
భోగములొంద నౌనను కు • బుద్ధిని గొంటిని కాలకూటమున్
రాగము దానిపై నునిచి • రాజును బంధులనెల్లఁ గాల్చితిన్
ద్యాగము లేమిచేసితిని • తక్కక మృత్యువు మీకుఁ గూర్చితిన్.

ఉ॥ భూమిపయిన్ వహించు పెను • మోహముచే ననలంబు పుంటిపైఁ
బ్రామినరీతిఁ దల్లికొక • బాధను కూర్చితి నంతమాత్రమా
రామపయిన్ వహించు ఘన • రాగముచే నిటువంటి చెడ్డ వో
రాములు మీకుఁ గూర్చితిఁ గ • రంబుగ నెట్లరబోఁటి వాఁడనే

చ॥ మరణము నొందితీవు కను • మాటపు మేనును నేను వీడెదన్
భరతుఁడు రాజ్యమేలఁ డిఁక • బంధులు తల్లులు దుఃఖవారిధిన్
దరలి నశించువార లొక • ధర్మముకై వెతపొంది వీఁగఁగా
జరగిన దింత యొదౌటవ • జన్మము నాయది యెంత ధన్యమో

క॥ జననీ జనకుల బంధుల, ననుఁగుల నాకొఱకు విడిచి • యడవుల వెంటన్
వను పీడకుండు తండ్రీ! విను పాసియు నిలువఁగలనె • నిముసంబేనిన్.

ఉ॥ ఉత్తమ రామివిం బలిమి • నొక్క దురాత్ముఁడు కారవైవఁగా
సత్తమ సన్నుతంబయిన • చక్కటి వాని వశంబుచేరుచో
విత్తఱి మూరకుంట తగ • వే? త్రిజగంబుల వ్రాల్పకున్న నే
నెత్తిన జన్మమేల? ధరి • యించిన చాపమునేల? కాల్పనే?

క॥ ఖరునకుఁ గాకాసురునకు, విరాధునకు సప్తసాల • వృక్షమ్ములకున్
శరధికి వాలికి మాత్రమె, సరగున నా శరము తూఱి • చనఁజాలినదో?

చ॥ ప్రతినను నిర్వహింపుమని • పంపితిఁ దోడుగ నుండనైతి నీ
జత విడకుందునేని దను • జప్రభుత్తుని మేని రక్తమున్
క్షితిపయిఁ జిందఁజేసి నిను • చేకొని రక్షణసేయకుందునే?
గతజల సేతుబంధనము • గాఁ దలపోసిన నేమి యబ్బెడిన్?

ఉ॥ తమ్ములు బంధులుం బ్రజలుఁ • దల్లులు నేగతి నున్నవారొ యం
చమ్మలికించుచుందురు మ • హోత్సుకతం గనఁబోదమయ్య లే
లెమ్మ యయోధ్యయందు బహు • లీలల మన్మకుటాభిషేక మి
ష్టమ్మునఁ జేయువార లది • సమ్మతమే కద రమ్ము చూడఁగన్.

తే॥ నాగపాశఁబుచేఁ గట్టి • నలఁచినపుడు, ప్రాణముం దీసినపుడు నీ • పజ్జలేక
హా! సుహృద్ద్రోహ పద్ధతి • ననుసరించు, నన్నుగని లోకులెల్లరు • నవ్వకుంద్రె?

శా॥ లంకారాజ్య రమన్ విభీషణుని కు • ల్లాసంబుతో నిచ్చి ని
శ్శంకం దచ్ఛపథంబు దీర్ప కిపుడే • చావంగనున్నాఁడ నే
వంకం గల్పితి నాదుకీర్తి మఱియున్ • వంశంపు సత్కీర్తికే
యంకంబొందు గడించినాఁడ జను లా • హా యంచు నిందింపఁగన్.

క॥ అని పరిపరి విధముల వా, కొనుచు లోనఁ గుమిలి కుమిలి • క్రుంగుచు నాలిం
గన మొనరిచి తను మఱచుచు, మునిఁగెన్ మైథిలి విభుండు • మూర్ఛానిద్రన్.

## వేలుపుల విలాపము

క॥ ఇనకులుని గాంచి ఖచరులు, కనుఁగవఁ గరములఁ గదించి • కళవళపడుచున్
గొనకేమి పరిణమించునొ? యని చింతాకులితు లగుచు • నారటపడుచున్.

సీ॥ సుఖదుఃఖరహిత! నీ • శుద్ధస్వరూపంబు, దెలియంగ శక్తిమం • తులము గాము
నీ యుదరంబున • నిఖిల జగంబులు, నమరియున్న తెఱంగు • నరయలేము
జరిగిన యదియును • జరుగుచున్నదియును • జరుగనున్నది సుంత • యెఱుఁగలేము
విను వినుతించి నీ • నిర్దేశపద్ధతి, మెలఁగుట దక్కొండు • తెలియలేము

తే॥ దితిజవధచేసి దుఃఖముల్ • తీర్పమనుచు, వేఁడఁ గరుణించి యీరీతి • వెలసితీవు
ధర్మమును కాచు పూన్కిని • దాఁగి నిలిచి, మాయనాటక మాడుచు • మమ్ముకఱఁతె ?

ఉ॥ క్రందులమైన మాకొనరు • కష్ట పరంపర దీర్తువంచు నా
నందము గూర్తువంచుఁ గదు • నమ్మికతోడను గంపెఁడాసతో
సుందరరూప ! నిన్నెపుడుఁ • జూచుచునుందు మదేమి మాయ ? నీ
చందము విస్మరింపఁ బెడ • జాడలఁ ద్రిప్పఁగ నుత్సహించెదే ?

మ॥ పరమేష్ఠీ ! బహుళాండముల్ నిఖిల జీ • వస్తోమముం జేసి యం
దిరవారన్ వెలి లోపల న్నిలిచి లో • నిందించుచున్ పీడుచున్
బరిపోషించుచు వేఱుగా నిలుచుచున్ • భావింప సాలీఁడు మై
నురవౌ నూలున గూఁడు గట్టు క్రియ సం • యోజింతు సర్వేశ్వరా !

మ॥ ఇది దుఃఖంబులఁ గూర్చు లీల లనుచో • నేచింత నిన్నంటు ? వి
య్యది సమ్మోదనలీలలే యగును చు • మ్మట్లంటకుం జాల మా
పద మేముందిన నీదు ప్రేమయు దయా • భాగ్యంబు నిండారు ధీ
మొదలు న్నీవయి తేఱకున్న నిట ని • న్నోదార్పఁగా నేర్తుమే ?

చ॥ కనఁబడుపోల్కిఁ దోఁచి • మఱి కానకయుండు నమేయరూప ! మే
ఱని నవతారమొందితని • తెఁకువ నుంటిమి నీవు దుఃఖమున్
మనమున నొందఁ దాళఁగల • మా ? జగదీశ్వర ! నీవ మానఁగా
మొనయుదుగాక మేమొకట • మోతుమొ ? విత్తుమొ ? నీదు మాయలన్.

మ॥ అజసూనుణ ఘన నంబరీషు భవుఁ బ్ర • హ్లాదుం దశాస్యానుజున్
గజరాజుం గని కాచినట్టి కరుణా • కల్యాణ వీక్ష రుచుల్
నిజ మీపాటికిఁ జూప కిట్టు లడలన్ • నిశ్చింతమై నుందుమే ?
భజనానందులమైన మాకు విమల • ప్రజ్ఞాన మీయంగదే !

క॥ పలువిధుల నిట్లు వేల్పులు, పలవించిరి మనుజభావ • బంధురగుణుఁ డ
బ్జలజాక్షుఁడు తమ్మునిపైఁ, గలప్రేమమువలన మూర్ఛ • గని యట్లుండన్.

ఉ॥ చారులు గాంచి రావణుని • సన్నిధికేగి యెఱింగి శక్రజి
త్క్రూరశరాలిచేఁ బ్లవగ • కోటిమొఁ దమ్ముఁడుఁ గూలియుండుట
వారకచూచి శోక వన • వహ్ని దహింప గతించె రాఘవుం
డా రణభూమియందె పగ • యాఱెను సంతసమందుమా యనన్.

## 22. మూర్ఛిత రామలక్ష్మణ సందర్శన పటలము. (32)

ఉ॥ దూతలు కల్లలాడరని • దుష్ట నిశాటుఁడు రావణుండు మో
దాతిశయంబుచేఁ బురము • నందు జయంబును చాటఁబంపుచున్

నేలి వసంత మాడు౹దని • విచ్చలు ద్రవ్యముచల్లి దూతలం
బ్రీతుల౹జేసి వేగ పిలి • పించి మరుత్తుని గాంచి యిట్లనున్.

తే॥ కలన౹ జచ్చిన దనుజుల • గాత్రములను, త్వరగ సంబుధి౹ బడవైచి • మరల దీవి
వారు లెఱింగిన సీతల • నుత్తరింతు, ననుడు వా౹డట్లు కావించె • నాక్షణమున.

చ॥ దురమున రామలక్ష్మణుల • దుస్థితి మైథిలి కన్నులార౹గా
స్థిరముగ౹ గాంచి రాక తన • చిత్తము మార్చదు నమ్మదంచు నా
సుర వనితావళిం బనుప౹ • బుష్పకయానమునందు జేరిచేయుచున్
దురితముగా విమానమున౹ • దోడ్కొనిపోయిరి వారు జానకిన్.

మ॥ పతి సౌందర్యనుదర్కొ నొందఁగ దైవం బందు నెక్కాల్ప కీ
క్షితముం జేయని ధాత్రిజాత పతిని • స్త్రీమస్థితిన్ సంగర
క్షితి౹ దార్మాఖగ నుండ౹ గాంచి తనువు • జిత్తంబు విజ్ఞాన జీ
వితముల్ స్రుక్క జలేజ మగ్ని౹బడు న • ప్పాటం గుమారిల్లుచున్.

సీ॥ విలపింప వేల్పుల , వెలందులేడ్చిరి హరు, సామేననున్న యీ • శ్వరియునేడ్చె౹
గమలవాసిని యేడ్చె • గంగ బోరున నేడ్చె, బ్రాహ్మి యేడ్చెను ముని • పత్నులేడ్చి
రదయలౌ నో౹కుల • యతివలు నేడ్చిరి, జనకజ జనని పే • దినియునేడ్చె
శ్రుతులేడ్చె ధర్మదే • వత యేడ్చె౹ బాపంబు, నెల్లవారలకంటె • నెక్కుడేడ్చె౹

తే॥ దక్కువారల యేడ్పుల౹ • దడవనేల? ఎచటనుండిన వారచ్చ • టచట నిలిచి
యేడ్చినారలు వైదేహి • యేడ్చి యేడ్చి, యుల్ల మెరియ నిల్వక సొమ్మ • సిల్లి వ్రాలె.

ఉ॥ చేరువనున్న యద్దనుజ • చేటిక లత్తఱి లేవనెత్తి ప
న్నీరు మొగంబునం జిలికి • నేర్పుమెయిం జలిసేవ సేయ౹గా
ధారణిజాత కన్దెఱచి • తల్లడమందుచు౹ గంపమొందుచున్
నీరద దేహు౹ గాంచి తన • నేత్ర యుగంబును మో౹దె౹ బల్మఱుల్.

తే॥ వహ్ని౹బడిన వల్లికవలె • వాడు నుదుకు, వడ౹కు విహ్వలించును పెక్కు • నడ౹గు మడ౹గు,
ద్రుళ్లు గద్గదకంఠయై రోదనంబు, సేయు జీవంబు లురియాడ౹ • జిక్కి స్రుక్కి

తే॥ పదును పొరలు౹జెమర్చు బె • గ్గడిలు నపలు౹, దెలివిదప్పను లేచు వి • దిప్పు౹ గేలు
దీనదృష్టుల దిక్కులు • తేఱిచూచు౹ దలరు; దపియించు మొఱపెట్టు౹ • బలపరించు.

ఉ॥ నీయెడ౹ బ్రేమగల్గి విను • నిత్యము గొల్చెడువారి౹ గాచుచున్
నీయెడ వైరమూను రజ • నిచరపాళుల౹ ద్రుంచుచుండు మ
న్నాయకు నందనుదకిటు • నాశము గోరినవారి౹ జేరితే,
నీ యవలక్షణంబు గమ • నింప౹గ నిట్టిదె? ధర్మదేవతా!

తే॥ ధర్మ పద్ధతులం గాక • తక్కుత్రోవ. లందు పోని యుత్తముల క • డింధినేగి
చూడ నిచ్చగించితె? యిది • వేడు కేమి? దుర్విధీ! నీవు దీనిచే • దొడ్డవగుదె?

ఉ॥ పాపినినైన యేను నిటు • వంటి పరిస్థితిఁ గాంచి సైఁపఁగా
నోపను ధర్మరాజ! దయ • యుంచి ననుం గొని పొమ్ము పుణ్యమౌ
నాపతి నన్నుఁ బాపుటయు న్యాయమె? రావణుతోడఁ జేరికే?
పాపఫలంబు నాకుఁ గుడు • పంగఁ దలంచిన త్రోవ యిద్ధియే?

చ॥ తొలఁగని యంధకారమునఁ • ద్రోచుట న్యాయమె? నాథ! యోకృపా
జలనిధి! నాతపఃఫలమ! సత్యదయాపర! యిన్నినాళు లీ
సిలుగు సహించియుండినది • చెన్నఱు నీస్థితి గాంచు కోసమా?
తలఁగని నా దురాగతమె • తార్చెను నీకు నకాలమృత్యువున్

మ॥ అమర ప్రార్థితజన్మ! ఆగమ సువే • ద్యా! దేవ దేవేశ: జ
న్నము గావం జనుదెంచి యంత మిథిలా • నాథానుదేశంబునన్
ప్రమథాధీశ్వరు చాపమున్ విఱిచి నా • పాపాలపుట్టైన హ
స్తముఁ జేపట్టుట యిట్టి యాపదకు ల • క్ష్యంచౌటకా? రాఘవా!

మ॥ కడుపుం గాల్చెడువార్తకన్న కడుపౌ • కౌసల్య విన్నంతనే
విడుచుం బ్రాణము లంత నాయనుజులున్ • వీక్షింతురే జీవికన్?
చెడుగుల్గోరిన కైక యియ్యదియె తాఁ • జింతించి కావించెనో?
చెడితిన్ సర్వవిధంబులం జెడితి ని • న్నీ! నా భవం బెట్టిదో?

మ॥ వలదన్నన్ వెనువెంట వచ్చితిని క్ర • వ్యాదాలితో నూదు నా
వలనం గల్గెఁ బసిండి లేడికయి ని • ర్బంధించి నిన్నంపితిన్
గెలన న్నిల్చిన లక్ష్మణుం గఠిన వా • గ్దిగ్గంబులం గ్రుచ్చి యా
వలికిం బంపితి సర్వ మాపదలకే • పాల్సేయనే యయ్యెఁగా?

ఉ॥ పాపఫలంబుచే నడవ • భావ్యముగాని యరణ్యసీమకే
మోపిక నేగునాఁడు ప్రియ • మొందగఁ బిల్చి కుమార! రాఘవుం
డాపద నొందునే నతని • కన్నను మున్నె మరింపుమంచు నా
జ్ఞాపనసేయు తల్లి నుడి • జాడనె కూలితె? తండ్రి! లక్ష్మణా!

చ॥ చివురుల పువ్వులం బఱపి • చెన్నరు తల్పమునందు నిద్దురం
దవిలి త్యజించినట్టి గుణ • ధన్యుఁడ! లక్ష్మణ! నిత్యశీల. దా
నవ ధను రుగ్ర ముక్త శర • నవ్య సుతల్పమునందు చల్లనన్
మిపులఁగఁ గూర్కి సెంద మది • మేకొని వ్రాలితి వేమి? నాయనా!

తే॥ మఖము లొనరించి సద్ధర్మ మార్గమునను, ధరణిపాలన మొనరింపఁ • దగిన నీవు
నన్ను చేపట్టి సత్యవా • క్యమయము ధర్మ. ఫలము కృశియింప వగలఁ బా • ల్పడితి నాథ!

తే॥ కులిశమునకైనఁ బగులని • గుండె గలిగి, పసవి ఫలమేమి ఖేదంబు • పాయునట్లు
నీరజాక్షిపైఁబడి మర • ణింతుఁగాక, యనుచుఁ బడఁబోవఁ ద్రిజట తా • నడ్డువచ్చె.

## త్రిజట సీత నూఱడించుట

తే॥ తన తపఃఫల రూపమై • తనరు త్రిజట, సాంత్వనంబులు పలుకంగ • సాహసించి
సకుల నవలికిఁ ద్రోసి జా • నకిని డాసి, కౌఁగిలి నెపంబునం జెవి • గఱచి పలికె.
తే॥ మాయజింకను పంపుట • మాయ జనకు, నమ్ముటయు నాగపాశ బం • ధనవిముక్తి
యించుకేని విచారింప • కిట్లు జీవ, ములను వీడఁ దలంచితే? ముద్దుతల్లి!.

ఉ॥ గణ్య తపఃఫలంబు కల • గన్న ఫలంబును మీరు దండకా
రణ్యమునం జరించుతఱి • రాజిలు చేఁతలు ధర్మదేవతా
పుణ్య ఫలంబునం బొందము • పూరుషవర్యుని రాము వీర్య సా
ద్గుణ్యములం దలంప నొక • దుర్మరణం బతనిన్ జయించునే?.

మ॥ ముగుదా! రాముని మేన నొక్క విశిఖం • బున్నాట కున్నట్టి యా
పగిదిం గానవొ? నీ మఱంది మొగమున్ • భావింప మార్తాండు రీ
తిగ భాసిల్లుచునుండె లక్ష్మణుఁడు మి • త్తిం బొందలేదమ్మ! రి
త్తగ దుఃఖమ్ముల నొందకమ్మ! యిది స • త్యం; బేల సందేహముల్?

మ॥ మరణంబే భజించునేని త్రిజగ • న్మాన్యుండు రాముండు దు
ర్భరమై లోకము లన్నియుం జెడవె? భా • స్వచ్చంద్ర బింబంబులున్
ధరణిన్ వ్రాలవె పట్టుదప్పి? పురజి • ద్ధాత్రాదులు న్నిల్తురే?
స్థిరమై ధర్మము లోకముల్ నిలువఁగాఁ • జింతింప నీకేటికిన్?

ఉ॥ నీవర శక్తిచే హనుమ • నీరసజీవుఁడు గాఁడు వ్యర్థమై
పోవదు నీసతీత్వమున • పోఁడిమి యూరక చింత సేఁతయున్
భావుకరీతిగాదు సుర • వర్యుల కోర్కులు రిత్తగావు రా
జీవ భవాస్త్ర పీడయు వి • శీర్ణము కాఁగలదమ్మ! జానకీ!

చ॥ మునుల నిలింపులం గనఁ ద్రి • మూర్తులఁ గాంచిన పోల్కి రామ ల
క్ష్మణులను గాంచి హస్తముల • మస్తములం దొదవించి మోద భా
వనముల నున్నవారు భయ • పద్ధతి మానుము సాగరంబు నూ
తను వడిఁ జొచ్చి నీరములఁ • ద్రావుట చూడము మేదినీసుతా?

చ॥ పతి మరణింప సూత్రమును • పాయఁగనున్న సతీ మతల్లికన్
హితమతి! యీ విమానము వ • హింపదు జార్చును తారకాణ లి
వ్రితమునఁ బెక్కు లున్నయవి • వేఱొఁడి చందము నొందకమ్మ! నీ
పతి సుఖియయ్యెఁ గొందలము • పాయుము నమ్ముము నన్ను తల్లిరో!

చ॥ అనుడు ధరాత్మజాత హృద • యంబున నించుక తేఱి యాసతిం
గని నిను తల్లిగాఁ దలఁచి • కాలము ద్రోచితి నీదుపల్కు నె
ప్పుడు వృథగావు నేఁటి నిసి • పోయెడుదాఁక భరింతు జీవముల్
నిను మది తెప్పగాఁ దలఁచి • నిల్చితినమ్మ! శుభమ్మె నీకగున్.

చ॥ సతులకు భూషణంబు లగు • సాధుగుణంబుల నీటఁ గల్పియున్
బతి ముఖదర్శ నాశ నను • బాధలఁ బెట్టఁగ జీవముల్ భరిం
చితి నెటులెట్టులో గురుత • చెడ శరీరము వీడుచున్నఁ గ
ష్టతరముగాదు తల్లి! తిరిగి • టా! యని మైథిలి నెమ్మదిం గనెన్.

చ॥ స్థిరుఁడగు జీవ నివ్వసుమ • తిన్ విడిపించి బలంబుచేత న
స్థిరమగు దేహమున్ గ్రసము • చేఁగొని యంబరవీథిఁ గాల కిం
కరులు గమించులీల జన • కప్రభు పుత్రిని రాక్షసాంగనల్
కరముల మీఁద నుంచికొని • క్రమ్మఱినారు బిరాన లంకకున్.

## 23. సంజీవన శైల పటలము. 117.

క॥ ఇనకులుని యాజ్ఞ వనులకుఁ. జనిన విభీషణుఁడు భోజ్య • సామగ్రులు చే
కొని మరలి పాళెమునకుం, బెరిచి యవల వచ్చి సమర • వసుధం గాంచెన్.

తే॥ బ్రహ్మశాపంబుచే మ్మృతిఁ • బడసినట్లు. వనచరావలి యెల్లను • వ్రాలి నేలఁ
జాఁపకట్టుగఁ బడియుండు • సరణిఁ గాంచి. హా! యనుచు నేమిఁ దోఁచక • యట్టె నిలిచె.

క॥ జరిగిన సంగతి నంతయు, నరయని దనుజేంద్రుఁ డంత • నటమట పడుచున్
బరుగునఁ జని లక్ష్మణుతో, ధరణిని వ్రాలిన నృపాల • తనయుని గాంచెన్.

ఉ॥ పేరిమకుఁ బ్రాణ మిస్తులు శ • రీరము ముఖ్యములంచుఁ గాదటం
చీ మహిఁ బల్కువచ్చు రహి • యుంచు పదావలిఁ గూర్చి నేర్పుచేఁ
బ్రేమకు సాటియైన దొక • పేర్మిగుణంబు జగానఁ గలునే?
ప్రేమగుణమ్మె మేర గని • పెట్టిరె వేల్పులు నేఁటికేవియున్?

ఉ॥ ఓరువలేని సంకటము • నొంది తపించియు నెమ్మనంబునన్
వీరికిఁ జేటు లేదను వి • వేకము నమ్మక మంటఁజేసియే
యూరక ప్రాణముల్ విడక • యొప్పుగ శీలన మాచరించి కం
గారుపడంగఁ దగ్గ దొక • కాఱియ లేదని నిమ్మళించుమన్.

తే॥ అజ శరంబుచేఁ గలిగిన • దనియు నదియు. నింద్రజిత్తుచే సౌమిత్రి • కెనసె ననియు
నతనికై రాముఁ డీరీతి • నడలి సోలె. ననియుఁ దలపోసి ప్రతికృతి • యరయసాగె.

ఉ॥ శోక నిపీడితాంగుఁడయి • శోషిలు రాముఁడు తేఱువెన్కన
స్తోకమతిం దలంతమనఁ • దోడగు తమ్ముఁడు చావఁ బిమ్మటన్

దాక సహించి నిల్వఁ డటు • సాఁగిన ధూర్తులకే జయంబిలన్
బేరుయినంచుఁ గన్నుఁగవ • చిత్తడి నొందఁగ వించె నశ్రువుల్.

మ॥ ఫణిపాశంబు తొలంగినట్టి కరణిన్ • బ్రహ్మాస్త్రమున్ వీడు ల
క్ష్మణ నాశంబును లేమ త్రెళ్ళపడు నీ • శాఖామృగ వ్రాతమున్
బ్రణుతిన్ జీవము లొందు ధర్మము స్థిరన్ • వర్ధిల్లు మాయావి రా
వణ దుర్మానికి రాషసాలికి జయ • ప్రాశస్త్యముం గూడునే ?

క॥ కేలుటకు మున్నె యీపవ. తీఱఁగఁ దోడ్పడెడి వారు • త్రెళ్లక యెవ రు
న్నారో వెదకెదఁగాకని. కోరికతో నెమకెఁ జేతఁ • గొలవిం గొనుచున్.

ఆ॥ పెదవి మడచి కేలు • పెనవైచికొని వేఁడి. వాఁడిచూపు జంకె • వోఁడి మెఱయ
వారణముల కుప్ప • పైఁబడియున్న సా. మీరిఁ గాంచి కనుల • నీయినించి.

ఆ॥ అసువు లున్న వనుచు • నరసి రక్తమువెల్చు. వ్రణములందు గ్రుచ్చు • కొన్న శరము
లొక్కటొకటిగాఁగ • నొయ్యన వెదలించి. మొగులు జలము చల్లె • మొగముమీఁద.

ఆ॥ ఒడలు గగురు వొడచె • వెడవెడ నావియు. వచ్చె నావులింత • వచ్చెఁగనులు
విచ్చెఁ దెలివివచ్చె • నుచ్చరించెను రామ. రామ యనుచు మంత్ర • రాజ మతఁడు.

చ॥ అలరును దుఃఖముం బెనఁగు • లాడ విభీషణుఁ డంజనా సుతుం
జెలువుగఁ గౌఁగిలించికొన • శ్రీరఘువీరుని యవ్యయంబు నిం
పెలయఁగఁ బ్రశ్న సేసి సుఖి • యే యను వాక్యము వీనుదోయికిన్
గెలివిడి గూర్ప జే యనుచుఁ • గేలు మొగిడ్చె మరుత్సుతుం డటన్.

ఉ॥ తమ్మునిమీఁది ప్రేమ బలి • తమ్మగు చింతఁ దపించి సోలినాఁ
డిమ్ముగఁ దేఱ రామవిభుఁ • డేమగునో యని సంశయించెదం
జుమ్మని దైత్యనేత యనఁ • జూచుచు మారుతి భల్లుకేశ్వరుం
డిమ్ముల నున్నవాఁడె యతఁ • డెచ్చటనుండు వచింపవే యనన్.

చ॥ అతనిని కాంచలేదు మృతి • నందెనొ యేమొ యెఱుంగ జానకీ
పతి విషయంబు చూడుమనఁ • బావని భల్లుకరాజు నిత్య జీ
వితుఁడు వివేకి మేలు నొద • వింపను సేగిఁదొలంప దక్షుఁడౌ
బ్రతికితిమయ్యొ పోదమన • వైలమ యిర్వురు చేరి రోయుచున్.

తే॥ పోవుచుండఁగ నొకచోట • ముసలితనము. వలన నెలలునాటిన నొప్పి • వలనఁగలఁక
వలన మైకమొందియు జాంబ • వంతుఁ డిరువు. రరుగు దెంచుచుండుట నడి • యరసియెటిఁగె

తే॥ రాముఁడో హనుమంతుఁడొ • రాక్షసుండొ. సురలొ మునులొ పగలు వోయి • తిరిగిరాదు
కాన వచ్చువారలు కావఁ • గదఁగువారె. కావఱయునని నెమ్మది • గాంచె నతఁడు.

తే॥ వచ్చిచేరువ నిలిచిన • వారిఁగనుఁలు, తెఱచి కనలేక యెవ్వరో • తెలుపుఁ డీర
లనుడు బ్రతికితిమను విభీ • షణుని పలుకు, సవ్వడింబట్టి యారసి • సంతసించి.

తే॥ అవలివాఁ డెవఁడని మారు • తాత్మజుఁడను, నుత్తరము విని జయము మ • రుత్తనూజ।
మంటిమిఁకఁ బునర్జన్మంబు • గొంటిమయ్య, యనుచు మెల్లనఁ గనువిచ్చి • యతనిఁగాంచి.

చ॥ ఒడలి శరంబు లూడ్చికొని • యుబ్బి యెలుంగులఱేఁడు పావనిం
గడుకొని కౌఁగిలించికొని • కంజ భవాస్త్రమయర్ఘ్య రాఘవుం
దొడరి కలంపఁజాల డని • దొడ్డగ నమ్మిఁగ గద్దునాకు నా
పుడమి కుమారిభర్త పని • పూని యొనర్చినదేమి చెప్పుమా ॥

చ॥ అనుడు మరుత్సుతుం డనుమ • హాత్ముఁడు లక్ష్మణు పాటుగాంచి మూ
ర్ఛను మునిఁగెన్ స్మృతింగొనినఁ • గ్రమ్మఱ నేమగునో యెఱుంగఁజా
ల ననిన జాంబవంతుఁ డను • లక్ష్మణుఁ దేర్పఁగ నే వచింతు త్రో
వ మచని మందు తెమ్ము కపి • వర్గమె కాదు జగమ్ము నూల్కొనున్.

సీ॥ ఉదధిని దాఁటి తొ • మ్మిదివేల యామడ, లరిగినఁ గాంతు హి • మాచలమ్ము
నొగి నది ద్విసహస్ర • యోజనాయతినొప్పు, నదిదాఁటి యోజన • మరుగునంత
హేమకూటము వచ్చు • శ్రీ మహితంబది, వెసదాఁటి తొమ్మిది • వేల యోజ
నము లేగ నిషధశై • లము గల్గు దానిని, కడచి యవ్వల నంత • నడవ చనిన

తే॥ కనకశైలంబుఁ గానంగఁ • గలవు దాని, విరివియుండు ముప్పదిరెండు • వేలయోజ
నాలు పిమ్మటఁ దొమ్మిది • వేల యోజ, నములు కడఁచిన నీలశై • లమును గాంతు.

సీ॥ అమల రెండువే • లామడల పొడవు, విలసిల్లు దాని క • వ్వలను నాల్గు
వేల యామడలేగ • లీలను గాంతువు, మందులుగల నల్ల • మలను నీవు
కాంచినంతనె మన • కడగండ్ల కడలికిఁ బారంబు గాంతువు • వాయుపుత్త్ర ।
అందు ప్రాణము లిచ్చు • మందొండు మఱియొండు, చెదరు నంగంబుల • జేర్చునొండు

తే॥ చెడిన రూపంబుఁ గ్రొత్తగాఁ • జేర్చునొండు, వికలమగు నస్థులతుకు మూ • లికయు ననఁగ
దనరు సంజీవకరణి సం • ధానకరణి, శస్త్రసౌవర్ణ కరణి వి • శల్యకరణి

చ॥ త్రిదశులు క్షీరవారిధి మ • థించిన యత్తఱిఁ బుట్టె నోషధుల్
పదిలము గాఁగ నుంచి రట, వారలు విష్ణువు మున్ త్రిలోకముల్
పదములఁ గొల్చునాఁడు కడు • భక్తిఁ బ్రదక్షిణ మేను సేయు న
య్యదనున దాని తత్త్వము మ • హర్షులు తెల్ప నెఱింగితిన్ సఖా ।

ఉ॥ వానిని కాచువారు సుర • వర్యులు పెక్కురు వారిఁ జక్రముం
బూనికఁ గాచు నీవరిఁగి • ప్రొద్దుదయింపక మున్నె తెచ్చుచో
భానుకులేశులుం ప్లవగ • వర్గము జీవములొందు ధర్మమున్
మానుగ నూల్కొనున్ జగతి • మాఁడును దైత్యకులంబు నావుడున్.

## ఆంజనేయుఁడు సంజీవనిం దేఁబోవుట

మ॥ ఇది విస్తృష్యను యుంతలో రఘుకులా • ధీశుండు తద్విద్యు సం
గదయుం బొందనియుండఁ జేరుపుఁ డుష • కాలంబు గాకుండఁ దె
చ్చెద దివ్యౌషధు లెట్టులేని యని పెం • చెన్ దేహ మాకాశ మొ
ప్పదమౌ శ్రీఘ్రగతి దోఁచఁగ బగ • ధీరుండు సామీరి తాన్.

మ॥ గ్రహ ఋక్షంబులు తారహారముల పెఁ • రిందోఁచెఁ గ్రుంగారెఁ గా
దిహాతిం మీఁది ఋణాంతర ప్రథమ సా • ధ్యంబే ప్రమాణింపఁగన్?
గ్రహియింపందగె బాహువుల్ విశాలం • కాద్వీప మందింక నె
వ్వహిఁ దా రెండప పాదముంపఁ దల మే • పాటిం గనన్ లేమిగా.

ఉత్సా॥ వాలువంచి కేలుసాచి • వాయి మడిచి పాదమున్
నేలనూని తొమ్మి విఱిచి • నిక్కఁబొడువ రోమముల్
లీల మెడను ద్రుంచి రాము • లీల సంస్తుతించుచున్
గాలి కొడుకు నింగి కెగసె • గామచారియై చనన్.

ఉ॥ లంక పయోధి మున్గి ... • ... బన నొప్పఁగ నుప్పరంబునన్
వంకలు చిన్న తిప్పలును • పాదపముల్ ఎడితోడ లేచె ని
ర్వంకలఁ దూలి సంభ్రమునఁ • బడ్డది దేవ విమాన పంక్తి య
భ్రంకషమై మహాబ్ధి దిగ • భంబుల బోదకులాప్పె నత్తఱిన్.

చ॥ ఒఱగిన పూరువేగమున • నుత్తర దిక్కునకున్ మహీధ్రముల్
ఎరదఘులం గలంగెఁ దరు • జాలము కానల మందె రాపిడిన్
గరుపలియుం బయోధి పెను • కిం బడిఁ జిత్తములున్ వెనుంబడన్
గురుగతి వాయుసూతి చనఁ • గోయని యార్చిరి వేల్పు లబ్బురన్.

మ॥ జలదుబ్బుండలి దాఁటి చంద్రపథమున్ • సందించి యుగ్రాంశు మం
డలమున్ మీఱి తరించి ఋక్షపథమున్ • దాకొంచు దద్భృగ భూ
ములతో నబ్జజ లోకముం గడచి చూ • పుల్ బోవఁగారాని య
గ్గలికన్ మారుత నందనుండు చనియెన్ • గాకుత్స్థ కార్యార్థియై.

సీ॥ వైనతేయుఁడు వడి • వైకుంఠమునకేగు, వాఁడని కొందఱు • పలికినారు
తెలిపిట్టపై నెక్కి • నలువ స్వలోకంబు, నందువాఁడని కొంద • ఱాడినారు
శూలిగాకున్న నీ • లీల నెవ్వఁడు చనఁ, గలఁడని కొందఱు • తలఁచినారు
తలఁచిన రూపంబు • దాల్చి లీలలు సల్పు, వెన్నుఁడె యని కొంద • ఱెన్నినారు

తే॥ బాగుగాఁ జాతమని కొంద • ఱేగి వెంట, ననుసరింపఁజాలక వృథా • యాసమంది
రమణఁ జని పునరావృత్తి • రహితమైన, మోక్షపద మందువాఁడని • మ్రొక్కినారు.

తే॥ రూపమున్నది యని జ్యోతి • రూపమనుచు, జ్ఞానరూపుఁడనుచుఁ బర • మానరూపుఁ
డనుచు సర్వకారణుఁడగు • హరియటంచుఁ, బలువిధంబుల విజ్ఞులె • తలఁచినాడు

తే॥ పరవి బ్రహ్మాండమెల్ల నం • బరముగప్పి, నట్టి హనుమని పదచేత • నదరినట్టి
శబ్దయుత వాతమున దిగీ • శాన శిరము, లల్లలాడె సజాండఁబు • తల్లడిల్లె.

క॥ బలి ధారవోయ జగముల, గొలువఁగ హరి గొప్పరూపు • గొన మునులును వే
ల్పులు సంతసిలిన తెఱఁగున, నఱరిరి హనుమని మహోద • యాకృతివలనన్

క॥ సుర సిద్ధ కింపురుష కి, న్నర విద్యాధరులు చల్లు • ననలును గందం
బిరవార నెఱయవిరిసిన, హరిచందన మట్టుకొప్పె • హనుమంతుఁ డటన్

క॥ హిమవంతముఁ జేరఁగ నం, దమరిన తపసులును విబుధు • లలరుచు నీకా
ర్యము ఫలియించుత మని రటఁ, బ్రమథవరుని నగముఁ గాంచి • పావని యుబ్బెన్

క॥ ఈశాన్యాధీశుఁడు కై, లాసంబును గని కరంబు • లను మొగిచిన యా
కీశవరుఁ గాంచి ప్రేమా, వేశంబున నుమకుఁ జూపె • వేడుకపడుచున్.

క॥ ఇతఁ డెగు బేల యను నా, సతికి హరుఁడు రామ దూత • సంజీవనికై
హితమతిఁ జనియెడు లంకా, పతి నాశము రేపుచూడఁ • బదమా యనియెన్.

క॥ హరిచక్రమువలెఁ జనియెడి, కరువలికొడుకు కచటు కడచి • క్షణికంబగు కా
మ రతులఁ దనిసెడు సురగణ, మిరవుకొనిన హేమకూట • శృంగము గాంచెన్.

క॥ మనమునకు జ్ఞాననేత్రం, బునకు విధికి నందకుండు • పొలమునఁ జను పా
వని కనియెఁ బైని భువనము, లను కొలిచెడి కట్టనా న • లరు కనకాద్రిన్

క॥ అనిమిషులేమియుఁ దోఁపక, కనుచుండఁగఁ గీశవరుఁడు • కాంచనగిరిపైఁ
జని కనె నీదీవికిఁ బే, ర్నయించిన జంబువును స • మీప్సితమతియై

ఆ॥ మేరుశిఖరమందు • సౌరైన యజపురిఁ, గాంచి దాని నడుమఁ • గనక పీఠి
నలరు నలువఁ గాంచి • యలవారు మనముతో, వందనంబు సేసె • వాయు సుతుఁడు.

క॥ సురతరు వనమున భక్తులు, పరవశులై వినుతిసేయఁ • బ్రణవ రవమునన్
హరి శ్రీభూ తరుణులతోఁ, బరుఁడయి వేంచేయఁ గని ను • తించుచు నవలన్.

తే॥ అంచ యీశాన్యభాగంబు • నందుకోటి, భానుసంకాశ ఘృణిభాస • మానుఁడగుచు
భక్తు లర్చించు పూలకు • ప్పలకు నడుమఁ, గ్రాలు భవ భవానులఁ గాంచి • కేలుమోడ్చె.

తే॥ చంద్రువలె వెలిగొడుగు శి • రమ్ముమీఁద, వెలయ సుందరుల్ చామరల్ • వీచుచుండఁ
ద్రిదశు లలరి కొల్వఁగ నొప్పు • దేవ విభుని, గాంచి ముదమంది కేల్మోడ్చి • కదలిచనియె.

తే॥ విరిసియున్న కల్పకతరుల్ • వెలయ రుచిర, కాంతు లొప్పారు నిర్జరా • గారమైన
కనకగిరి శిఖరమున ది • క్పతులఁ గన్ను, లలరఁ గని యాంజనేయుండు • హర్షమందె

ఉ॥ మేరువుదాఁటి వైళమ స • మీర కుమారుఁడు దుత్తరస్థలిన్
జేరి దినేశుఁ డస్తగతిఁ • జెందమి నొక్కక్షణంబయేని రే
వారక యుంటఁజేసి యది • భానుఁడు పుట్టెనకాఁ దలంచి దై
వారిన చింత మున్గెఁ దన • పట్టిన కార్యము భంగమౌటకున్.

ఉ॥ భూపతి మూర్ఛదేఱుటకు • మున్నుగ నోషధు లిచ్చి లక్ష్మణున్
లేపఁగ నెంచి వచ్చితి మ • రీమఱ బుద్ధిని పాడుచేసితిన్
రేపడు మున్నె మారుతి జ • రీలున వచ్చున యంచుఁ గాచువా
రేపగిదిం జరింతు? రిఁక • నెయ్యది కార్యము? సర్వముం జెడెన్.

చ॥ అతుల వివేకశాలి యగు • నాహనుమానుఁడు మానసంబునం
దతితర చింతనొందియు ర • యంబునఁ దేఱి యుదీచియం దహ
ర్పతి యుదయించునే? కనక • పర్వతమున్ రవి చుట్టునంచుఁ బం
డితులు వచించు వారలని • డెందము కుందు తొలంచె నత్తఱిన్.

చ॥ మరణములేక చింతయను • మాటయులేక సతంబు భోగమే
యురవుగనొప్పి యాలుమగ • లొక్కశరీరమ యొంపె ప్రేమ మో
గిరముగ నిష్టగోష్ఠిఁ దిల • కించుచు జీవులు సంచరించు న
త్తర కురు భూములం గనుచు • దాఁటె మరుత్సుతుఁ డుగ్రవేగుఁడై.

తే॥ అటఁగపర్దియు హరి కమ • లాసనుండు, నెలవుకొన యోగ్యమై త్యాగి • నిశ్చలుండు
నైన ధర్మప్రభుని రాజ • ధాని పోలు, పట్టనములఁ గాంచుచుఁబోయెఁ • బవనసుతుఁడు.

తే॥ మేరువునకంటెఁ బొడవుగ • మీఱి యజుని, పట్టముం గొనువాఁడును • భవములేని
వాఁడు నగు కపివీరుండు • పోఁడిమిని త్రి. విక్రమునిపోలు నీలాద్రి • వెలయఁగాంచె.

తే॥ ఇరులఁజోతులు జిమ్మ న • గ్గిరినిదాఁటి. జాంబవంతుఁడు తెలిపిన • శైలమును మ
హౌషధీ దీప్తులను మింటి • నధికకాంతి. మంతముగఁ జేయు చిన్నియం • బట్టికాంచె

తే॥ కాంచిదిగె దిగినంత న • క్కురువక్రుంగె, దానిఁగాచు దేవతలును • కటమటపడి
నిలుకఁజెంది సన్నిధి నిల్చి • నీవెవండ, విటకు వచ్చిన కారియ • మేది? యనుడు.

ఉ॥ వచ్చిన కార్యముం త్రిదశ • వంద్యుఁడు మారుతి సొలుమూల వా
క్రుచ్చిన వారలన్ మదిని • కొంకక గైకొనిపోయి పిమ్మటన్
దెచ్చి యథాస్థితి న్నిలుపు • ధీవర! యంచు నదృశ్యులౌ తఱిన్
దిచ్చు మొగంబు చెందెఁ బొడ • తెంచి సుదర్శనమున్ రయంబునన్.

చ॥ ఉడుగక యోషధుల్ వెదకు • చుండినఁ గాలముమీఱుఁ గార్యమున్
జెడు నటుగాన నీశిఖరిఁ • జేకొని పోవుట యుక్తమంచు నె
వ్వడిఁ బెకలించి యెత్తికొని • వాయుకుమారకుఁ డంబరస్థలిన్
బెడిదపు దమ్మువోలెఁ గడు • వేగమ జివ్వున వచ్చుచుండఁగన్.

## జాంబవద్విభీషణులఁ గాంచి రాముఁడు పరితపించుట

చ॥ వెరవరి జాంబవంతుఁడు వి • వేకి విభీషణు దేగుదెంచి దా
శరధి పదాంబుజంబు లెల • సంబున నొత్తె నెలర్చె భాసుసీ
వర హృదయాంబుజాత మధు • పమ్ములు సత్కరుణా స్వరూపముల్
వరదములుం బవిత్రములు • పంకజసామ్యములైన నేత్రముల్.

చ॥ కనుగవ నీరునించుచు వ • గర్చెదు వారలఁ గాంచి నీవు పో
యిన పనిమేలె? జీవము వ • హింతె? విభీషణ! బ్రహ్మపుత్త్ర! నీ
కును శుభమేకదా? సమసి • కూలె సమస్తజలంబు తమ్ముతో
నొనరుపఁ దగ్గపొందు తెరు • వున్న వచింపుఁడు మీరు క్రచ్ఛఱన్.

చ॥ పుడమికుమారి వల్ల మతి • పోయిన నాస్థితి చెప్పనేల? యీ
పుడమి కలంతకాలమును • పోవని నిందను మోచినాఁడఁ ద
మ్ముఁడు నను మాయజింక యిది • పోవలదన్నను నాఁడు వాని ప
ల్కెడపక పోవుటం గద వ • హించితిఁ గూర్చితి నిన్ని చెట్టలున్.

ఉ॥ రావణుఁగాంచి చేపను దు • రం బొనరించితిఁ జంపనైతి నా
జీవములైన యిందఱకుఁ • జేటొనఁగూర్చితి చొప్పుతూపుచే
రావణిఁ గూల్తునన్న సమ • రస్థలి ధర్మముగాని పద్ధతిం
బోవకుమంచుఁ దమ్మునకుఁ • బోయితి నష్టము కీడు దెచ్చితిన్.

ఉ॥ తమ్మునితోడ నుండక పె • తారము దుర్విధి గూర్పఁబోలు న
న్నమ్ముల పూజసేయ నెడ • కంపెను సోదరులెల్ల రాజిరం
గమ్మునఁ గూలి రింద్రజితు • గండడఁగింపక లక్ష్మణుఁడు నా
కమ్మను చేరె నావెడఁగు • కష్టము కూర్చె మహార్తి వీరికిన్.

ఉ॥ ఇప్పటి నిట్టి పల్కు వచి • యించుచు నిల్చుటపేక్షజేయమే?
మ్రుచ్చుల రావణాదులను • పోర వధించి సురాలికిన్ ముదం
బచ్చుగఁ గూర్చి వారుకొను • నయ్యది యెయ్యది లేమ వీరలన్
హెచ్చిన ప్రేమఁగూడ దివి • కేగుటయే తగుత్రోవ నాకగున్.

ఉ॥ ఏటికి సీత? రాజ్యరమ • యేటికి? నేఁటికిగీర్తి? ధర్మ మిం
కేటికి? బంధు లేమిటికి? నేటికి • శౌర్యము? సత్య మేటి కి
ల్లేటికి? వాకి లేమిటికి? నేటిక • సత్కృతు? లేల వైరముల్?
సాటి యొకింత లేని యను • జన్ముఁడు స్వర్గము చేరు పిమ్మటన్.

చ॥ నెనరు వినిష్ఫలంబు గన • నెయ్యపుఁ దమ్ముఁడు లేని పిమ్మటన్
దనుజులనెల్లఁ బోకడచి • దర్పము చూపుదునేని శౌర్య వం

చనములు గల్గువాఁడనె వి • జం బగుదున్ మఱికాదయేని బ
చ్చెనటొమనొదు నిత్తఱిని • జీవము పీడువె యుక్తకార్యమా.

ఉ॥ తిండిరిఁ గోలుపోయి పెద • తండ్రి యనందగు నజ్జటాయువున్
దండక యందు కోలుపడి • తమ్ముని మిత్రుల నక్కవాతికిం
గండగ నిచ్చి సౌఖ్యములఁ • గామినితోఁ గొనెనంచుఁ గర్ణముల్
పండయి పుచ్చి విచ్చి పురు • పుల్ వదఁ దిట్టదె సాధులోకమున్.

ఉ॥ తమ్ముఁడు లేక సీతఁ గొని • ధారణిసేల నయోధ్యకేగుచోఁ
దమ్ముని వీడివచ్చి తె సు • తా! యనుతల్లి సుమిత్ర మోము నే
నెమ్మెయిఁగాంచి యేమి వచి • యింతును? రక్కసివాత! బెట్టితిం
బొమ్మని పల్కకుంటె నను • పుల్ విడుటెంతయు మేల కాదొకో?

తే॥ అనుచుఁ బలువిధంబుల నిట్టు • లడలుచున్న. పుండరీకాక్షు జాంబవం • తుండు గాంచి
దేవ! విలపించుచుండినఁ • దెలివి మాయుఁ, దెన్నుదోఁపదు వినుమొక్క • విన్నపంబు.

## జాంబవంతుఁడు రాముని తేర్చుట

తే॥ అరిది సద్గుణాపణలకు • నాటపట్టు వైన నీవు విన్నెఱుఁగవు • గాని నేను
విన్న మున్నె యెఱుంగుదుఁ • దెన్నదప్పి. సంభ్రమించిన సురల యా • సలు నశించు.

ఆ॥ కదనమందు కీశ • గణములఁ దమ్ముని. ప్రాణములను కొన్న • ప్రవర మత్య
మోహమైన యజుని • ముఖ్యాస్త్రమనియెడు, నాతలంపు నిజము • నలిననేత్ర!

తే॥ పరఁగ బ్రహ్మాస్త్రమే యేయఁ • బడునయేని. సమరమున దేవదానవ • సమితినేని
చెలగియే తీరు విన్నెమి • చేయలేక, వదలినది యింతకంటె మో • దదము గలదె?

తే॥ ధీరుఁడగు హనుమానుండు • తెలివినంది. పనవుచో నది తగదని • పంపినాఁడ
నోషధులు గొని తెచ్చుట • కుత్తరమున, కాతఁడిప్పుడ వచ్చు నీ • లాబ్దదేహ:

తే॥ హిమగిరిని మేరువుం దాఁటి • యేగియున్న. యాంజనేయుండు వచ్చిన • యాక్షణమున
నీ మనశ్చింత లెల్లను • నీఁగు నిజము. నిముస మూఱడుమా! జగ • న్నియతచరిత!

ఉ॥ మార జితాంగ! యేను నజ • మాధవ శంభులు తక్క నెవ్వరున్
దీరుగ నోషధి స్థితులఁ • దెల్పఁగలేరు సుపర్వ దానవుల్
క్షీరపయోధిఁ ద్రచ్చునటిఁ • జిక్కిన వానిని విష్ణుచక్రమే
వారక కాచుచుండు నవి • వర్ధిలు నక్కరుభూమి కవ్వలన్.

తే॥ ఇందనుక నేరిచే నవ్వి • యింపఁబడవు, నలువకైనఁ బ్రాణము లీయఁ • గలిగినయవి
పరఁగు సంజీవకరణి సా • వర్ణకరణి, యన విశల్య సంధాన క • రణు లనంగ.

తే॥ ఓషధుల నిక్కముగ వచ్చు • నమ్మలికము. వదలు ధర్మమే త్రోవచూ • పంగ హనుమ
వచ్చుఁ దేఁగలఁ దతనికి • వలనుపడని, పనియుఁ గలదె? యోచింపుమా! భవవినాశ!

తే॥ అనుడు శ్రీరామభూపతి • యతని పలుకు. విని ముదంబందుచుండునం • తనె మహార
వం బుదీచిని పుట్టె సం • భ్రంబు పొరలెఁ. జండమారుతమేతెంచె • జవము మెఱయ.

తే॥ ఉడుగణంబులు వడిదప్పి • యురలె సూర్య. మండలము పోయి ద్విజరాజ • మండలమును
చేర సందలి జింక క్రి • శించె దగను. మొగుళులొండొంటిఁ దెఁటుల • మొగిని తాఁకె

తే॥ వేళ్ల పూగుత్తులును విను • వీథి కెగసె. భూధరమ్ములు గ్రమ్మఁకులు • మునుపటివలెఁ
గదలి లోఁబడె మారుతి గర్జనంబు. చెసె రామాదుల యెడంద • చింత దొలఁగ.

ఆ॥ భువియు దివియు మేఘ • ములు సాగరంబులు. తక్కినవియు నొక్క • తరుణమందె
గొప్ప రవము చేయు • కొమరున నుండెను. గాడ్పుపట్టి సేయు గర్జనంబు.

ఆ॥ పాలవెల్లిఁ జిలుక • వైకుంఠు నాజ్ఞమం. దరముఁ దెచ్చుచున్న • గరుడుకరణి
నొప్పె నురుజవమున • నోషధీశైలంబుఁ. బరఁగఁ దెచ్చుచున్న • వాయుసుతుఁడు.

ఆ॥ పవనుఁడా త్రికూట • పర్వతంబుఁ బెకల్చి. తెచ్చుకరణి హనుమ • తెచ్చెఁ దెచ్చె
ననుచునుండ నతఁడు • నవనికి దిగియె న. మ్మల సభంబునందు • నిలిచె దిగక.

ఆ॥ మంద మారుతమ్ము • మందులతో వీచి. యెల్ల వారియెదలు • పల్లవింప
భానుసుతునితోడ • వానరావళి యార్చె. నట్లుచేసె విబుధు • లలరుచుండ.

ఆ॥ విబుధ వినుతు లగుచు • విందులై యుంకిన. కపులు మందుగాలి • కలయ వీవ
సొగసు చేవ దిటవు • నెగడఁ గాలు జయించి. నక్కవాత మట్టి • గ్రుక్కినారు.

ఆ॥ అసుర తనువు లెల్ల • నంబుధిఁబడుటచే. బ్రదుకవయ్యెఁ దక్కు • పడవలును చి
గిర్చి ప్రాణమొందఁ • గీశుల విషయంబు. విప్పి చెప్పవలెనె • విశద ఫణితి॥

ఆ॥ అలుఁగు లూడె గాయ • ములు చల్లనై పూఁడెఁ. గలయనేత్రతార • కలు చలించె
జగము వినుతిసేయ • సౌమిత్రి తెలివందెఁ. గూర్కునుండి మేలు • కొన్నమాడ్కి.

ఆ॥ సప్త సాగరములు • సంక్షోభ మందంగఁ. గపులు సేయు వీర • గర్జనముల
లేచె లక్ష్మణుండు • లేఖుల భద్రగి. తముల లేచు శేష • తల్పుభంగి.

ఆ॥ లేచినట్టి యనుజు • లేఁచిన భుజములఁ. గౌఁగిలించుకొన్న • కంజ నయను
చింతతోడ సురల • చింతయు జగముల. చింత తఱిగి విరిచి • చెదరిపోయె.

క॥ చెన్నుగ నాడిరి వేలుపు. టన్నులు కిన్నరుల గీతి • కా రవ మింపై
మిన్నులమె మునులు నిగమపుఁ. బన్నములు పఠించి రపని • పండువు సేసెన్.

క॥ వేదంబులు ఘోషించెను. వేదవిదుల విజ్ఞతయును • వికసించెను స
మ్మోదము నొందె జగము నం. భోదము లంభోధు లుఱిమి • బొలుపుం బొందెన్

క॥ కొల తొలఁగిన యాపిమ్మట. నలువ హరము జానకీ ప • న స్పదసునకున్
వలగొని కరుణించితవని. పలికి వినతిమై నదృశ్య • భావమునందెన్

చ॥ ఎడఁద దురంత చింత నశి • యింప ముదశ్రు పరీత నేత్రుఁడై
పుడమికుమారి భర్త కపి • ముఖ్యుని వాయుతనూజుఁ గౌఁగిటన్
దడవి మదీయ వంశమును • ధారుణిలో యశమంద నిల్పి నా
మొదలిని విక్రయించికొని • యుంటివి వేఱొకఁ డున్నె చేయఁగన్.

ఉ॥ మా కుల పూర్వులెల్లరు క్ర • మంబునఁ బెంచిన ధర్మపద్ధతుల్
నాకతన న్నశింప మర • ణంబె భజించితి మేము నీవ యి
క్ష్వాకుకులంబు నిల్పితివి • ప్రాక్తన ధర్మములెల్ల నెక్కొనెన్
నీ కరుణం బదంపడి జ • నించిన వారము సుమ్ము పావనీ!

ఉ॥ ప్రాణము పోవువేళ నొచ • వంగల పుణ్యులు తా మొసంగు నా
ప్రాణముతోడ వారలకుఁ • బ్రత్యుపకారము చేఁత సామ్యమే?
ప్రాణము లిచ్చు మాత్ర మన • భావ్యమె యిప్పని? ముందటన్ జగ
త్ప్రాణ కుమారకా! యరుల • ప్రాణము లూడ్చితి దూఱు వోవఁగన్

ఉ॥ సోదరుమీఁది ప్రేమమున • స్రుక్కితి లోక మెఱుంగ నిట్టి యా
మోదము నీవు గూర్చుటను • ముందటి దుఃఖము మిక్కిలిన్ సుఖ
శ్రీదముగాఁ దలంతుఁ జిర • జీవివి సాయము యుక్తవేళ నా
కాడటఁ గూర్చినాఁడ వటు • లౌటనె నిల్చె జగంబు మేలిమిన్.

ఉ॥ ఎల్లరు ప్రాణముల్ విడక • యిమ్మగు సౌఖ్యము లందునట్లు మే
ల్లల్లసిలంగఁ జేసి రౌత • యుమ్మల మందక శాశ్వతుండవై
చెల్లుమ యంచుఁ బల్కఁ గపి • శేఖరు లుత్కట వీరనాద సో
ద్యల్లసి తాస్యులైరి పవ • నాత్మజుఁ డుబ్బున మ్రొక్కి యిట్లనున్.

ఉ॥ తమ్ముల వైరిఁ బిక్కి యమృ • తమ్మును తమ్మున కీయఁజాలనే?
క్రుమ్మి దివమ్ము నందమృత • కుంభము దెచ్చి యొసంగఁజాలనే?
యిమ్ముగఁ బాలవెల్లి మథి • యించి సుధం గొనితేరఁజాలనే?
బమ్మను పట్టి తెచ్చి తల • వ్రాఁతనె మార్పఁగఁజాలనే? ప్రభూ!

చ॥ గురుతరమైన పీరుణ • గూడిన నియ్యది కార్యమే? యనన్
నిరవధి సత్త్వసంయుత వ • నేచర సింహమ! యెంతకెంతకే
సరుహం డవైన నీవు కల • యంతకు నాపద మమ్ము చేరునే?
పెరసితి మేము సౌఖ్యములు • పేరిమితోనని రాముఁ డాడఁగన్.

చ॥ అతులిత శౌర్యశాలి: పవ • నాత్మజ! యిమ్మల యింద యుండినన్.
దితిజకులంబు చావదు వ • ధింపనుపాలము కావునన్ యథా
స్థితి నట దీనినుంచి చను • దేరుమ వైళమ యంచు భల్లుక
క్షితిపతి పల్కఁ బావని వి • శిష్టమతిం గొనియేగె శైలమున్.

## 24. హాపాలాన నటన పటలము (21)

క॥ ఇట నిట్లు జరుగుచుండఁగ, నట రావణుఁ డుబ్బి కుతుక • మంది వినోద
స్ఫుట హేలా జనిత విశం, కట యువతీ నటన లీలఁ • గాంచుచు నుండెన్

తే॥ అమరకాంతలు విద్యాధ • రాంగనలును, దైత్య వనితలు నాగ సుం • దరులు యక్ష
మధురవాణులు సిద్ధ బిం • భర సువేణు, లెల్లఁ దెందేఁపరై వచ్చి • యుల్లసిల్లి.

తే॥ రంభయును తిలోత్తమయు నూ • ర్వశియు మేన, కయు ఘృతాచియు బహువిధ • క్రమ వినత
వాద్యములతోడ లయరాగ • భావ సరణి. చెడక పాడుచు నాట్యంబు • చేసినారు.

చ॥ ప్రచలిత కుండలంబులు ప్ర • భా తిలకంబులు లోలనేత్రముల్
విచికిల దంతముల్ మధుర • పేశల క్రమ సుధాధరంబులున్
ప్రచుర మనోహరాలక వి • భాసిత తన్ముఖ చంద్రబింబముల్
రుచిరముగా వెలింగె ముఖ • రోచులు రాగము నొందుచుండఁగన్.

ఉ॥ తేటలు వాలు చిర్నగవు • తెల్పును భూషల లేఁతయెందయున్
మూటలుగట్టు దీప గణ • ముల్ వెలిఁగింపఁగఁ జాలు మేని డా
ల్పాటులు జీరువాఁ గను • వారల తెల్వి ని బోలి మీటుచున్
బాటలుగా నిరుల్ మరుల • పాలయి క్రుంగఁగసాగె నయ్యెడన్.

చ॥ చదువులచేత సత్పథిని • బాఁగుచు భావి నెఱుంగు పెద్దలన్
ముదమున నాశ్రయింప గుణ • మున్ దెలివిం గడు విస్తరించు న
ప్పదురున మీఁదు గాన కిల • బ్రికట్లెఁబైఁ బ్రసరింపఁజేయు దు
ర్మదుల పరాక్రమంబు వలె • మైకము నెవ్వడిఁ బర్వె నెల్లెడన్.

ఉ॥ నవ్వులు మించె దంతముల • నాణెము వెల్వడె స్వేదబిందువుల్
మవ్వముగా నెలర్చె ఁఘి • మంబుగ వాతెఱలుం జలించె వే
నివ్వటిలెం గనుంగొనల • నీటగు రక్తిమ నిక్కెఁ గన్బొమల్
కవ్వికొనెన్ మొగంబులను • గాటపుఁ దెల్లఁదనంబు వారికిన్.

చ॥ తలముడులెల్ల వీడుచు ని • తంబములం దగదాఁటె వ్రేల పే
ఖలలు పటాలితోడుత ది • గంబడ మానముఁగాచెఁ గేశముల్
తులువలు దుండగంబులకుఁ • దూకొన నుత్తము లడ్డువచ్చి దీ
నుల కగు బన్నముల్ తొలఁగ • నూకఁదలంచుట యుక్తమే కదా?.

తే॥ మదన మృగయుండు పొదినుంచు • ప్రదరమనఁగఁ, దగిన కన్నులతో నున్న • మగువలపుడు
శ్రుతిని కలియక పెత్రీప • దములతోడఁ, బాడి రవ లయతో నప • స్వరముతోడ.

తే॥ వేణునాదంబును జయించు • వివులరవము, గలుగు చెలువల పాటల • గతులు దప్పి
కాకి యఱపుతో సుధయుంచు • కల్లుకేర్పు, తీరు తోఁపంగఁ దాదిరి • తెలివిచెడఁగ.

తే॥ కాంచ నింద్రజాలమె యను • కరణిఁ దోఁచ, భావ విస్ఫూర్తి సభినయ • పద్ధతులను
తెలుపు జాణలు నోటితో • ద్విపసుఁ బలికి, చేయి కరములతోఁ జూపు • వారలైరి

తే॥ ఆడుదురు పాడుదురు నవ్వి • యేడుతురును, తూలుదురు సోలుదురు వాల ప్రేలుదురును
సోలుగుదురు తూఁగుదురును • మూలుగుదురు, మొక్కుదురు సుక్కుదురు మీఱి • నిక్కుదురును.

తే॥ మదిని గలదాని సుంతయు • మఱుఁగుపఱుప, లేక వెలిఁగ్రక్కునారలు • లేమ లట్టి
తెఱఁగుఁగాంచి నిల్చిన జితేం • ద్రియుల రోమ, కూపముల • కోరులదరె.

చ॥ భ్రమరములంబలెం జలన • భావము నొందెడు కన్నులెట్టిచై
యమరెను రక్తిమంబగు ము • ఖాంబుజముల్ తెలుపొంద దైత్య వం
శమునకు భావినాశమును • జాడఁగఁ దెల్పెడిపోల్కిఁ గన్పడెన్
ద్రుమ మొకటైనఁ బుష్పనిక • రుంబము వేఁబగఁ బూచెనో యనన్.

తే॥ యమునికుంతంబు మదనుని • యలుఁగు నుపమ, గాఁగఁజెప్పిన నొప్పవి • కన్నులుగల
చెలులు హారంబులను రశ • నలను వస్త్ర, ములను కొప్పులలోపల • ముడిచికొనిరి

తే॥ మందహాసరుచుల్ గల • మందగమన, లిట్టి గతులొందఁ గని మోద • మెనయుచున్న
రావణాసుర శ్రవణరం • ధ్రములఁ జొచ్చెఁ, గపిసమూహంబు చేసిన కలకలంబు.

తే॥ పాటలాటలు కేకలు • వావ్యరవము, లలుక లూఱటల్ కౌతుక మూ • టలు కటాక్ష
ములను తక్కుచేష్టలు బలి • ముఖుల గుట్ట, పలన వేఁడికిఁ బుపులట్లు • వాడిముడిఁగె

తే॥ కట్టుఁగంబములందె నా • గములు సోల, వాజులుం దూల నసుపుల • పసిమి మాల
రామలక్ష్మణ శింజినీ • రావ మడరె, వార్ధిఁ ద్రచ్చిన నాఁటి ర • వంబుకరణి.

చ॥ తరుణుల కూటముల్ విపిక • దంబమువోలెఁ గనంబడంగ మం
దరము కలంప నొప్పు భయ • దంబగు నంద్రమునాఁగ మానసం
బఱిముఱి నెంద నత్తఱి ని • శాంతమ యయ్యె దశాస్యమోము చం
దురునకుఁ ద్రోవరానిదయి • తోఁచెను పట్టపగ ల్విధంబునన్.

చ॥ వినవిన బంభరాకృతిని • వేగులు వచ్చి దశాస్య కంఠ పు
ష్ప సరము లందుచేరి పగ • వారలు ప్రాణములొంది చాల సం
తసమున నున్నవారన నె • దం దిగులొంది లతాంత శయ్యపై
మసలుట మాని తత్తఱను • మంత్ర నిశాంతము చేరె గ్రక్కునన్.

## 25. మాయాసీతా పటలము (97)

తే॥ చేరి వృద్ధులాప్తులు నింద్ర • జితుఁడు సైన్య, పతులు విన జరిగినదెల్లఁ • బలుకునంత
మాల్యవంతుండు చింతమై • మనసువాడఁ, దెలిపె నిట్లు రావణునకు • ధీరమతిని.

చ॥ చెడు తలఁపూని దానవులఁ • జెచ్చెర నంబుధి వైపకున్న ని
య్యెడ నసువుల్ నిజంబుగ వ • హించియె యుందురు తప్పె నీదు దుం
దుడుకునఁ బంకజాసనుని • తూపె నిరర్థకమౌట వానరుల్
కడుకొని పైపయిం దొడరఁ • గా నొకయడును లేదు రావణా!

చ॥ కలఁక యొకింత గానని జ • గత్కరిపాలు కటాక్షదృష్టిచేఁ
జెలంగి క్షణంబులోనఁ జని • చేవ మహౌషధి భూధరేంద్రమున్
బలిమిఁ బెకల్చి తెచ్చిన య • వార్యబలుఁడు మరుత్సుతుండె కా
వలయున తక్కువారలకుఁ • బల్కఁ దలంప నొనప్ప శక్యమే?

చ॥ మలఁగొని పోయినట్టి యల • మారుతి మేరు ధరాధరంబు ని
ట్టలముగఁ దెచ్చి వైచిన న • దంగమొ? లంకను కెల్లగించి భూ
స్థలిఁ దిరుగంగ వైచిన ని • శాచర వర్గము నిల్వనేర్చునే?
ములు చందనంబు మాని తల • పోయుట కార్యము నిర్జరాంతకా!

చ॥ జగముల నెల్ల నొక్కపరి • చావఁగ మోఁదఁగఁ జాలువాఁడు సా
ధుగుణమునం ద్రిమూర్తులకుఁ • దోడుగ నాల్గవమూర్తియంచు నెం
చఁగఁ దగువాఁడు మారుతి ని • జంబిఁకఁ జావకయున్న వారలన్
నెగడఁగఁ జూచుటల్ తగవు • నెమ్మది నీవ తలంచిచూడుమా.

శా॥ వాలిం గూలఁగనేసి గొప్ప జలధిన్ • బంధించి లంకాపురిన్
గాలుంబోలిన కుంభకర్ణు ననిలో • ఖండించు శ్రీరామ భూ
పాలున్ బుద్బుద సన్నిభుల్ దనుజు • లా? బాధించి పక్కాఁడు వా
రేలా యీ యడియాసః రాఘవునకుం • బృథ్వీజ నర్పింపుమా.

చ॥ పొలిసిరి వార్ధిఁద్రావి దిది • భూమిని పేర్చి వహింపఁజాలు ధీ
రులు; రణధాత్రినుండి యసు • రుల్ చనుదెంచినవారు నీవు నీ
యెలమి సుతుండు దక్క మఱి • యెవ్వరు? గెల్చుట సున్న! పట్టి యా
సలఁబడి ప్రాణముల్ విడువఁ • జాఁగుట యెన్నఁగ మూఢకార్యమే?

చ॥ అనుటయుఁ బంక్తికంఠుఁడు భ • యంకరరీతి నవ్వి నీదు వి
న్నపములు మేలుమేలు పలు • కాడకు రాక్షసులెల్లఁ గూలినన్
బసుపడకుండఁ గైదువులు • వ్యర్థములైనను నాసికాగ్రమం
పనుపుగ నాపి యున్న పటు • కంబుజనేత్ర నొసంగ నెట్టులున్.

ఉ॥ జీవితముల్ వినాశమొగిఁ • జేసికొనన్ ధరణీతనూజ న
త్యావిలబుద్ధిఁ దేను మది • నవ్యయ సౌఖ్యము లందఁగోరియే
యీవగఁ దెచ్చితిన్ బ్రదుక • నిచ్చయె యున్న నిరర్థకంబులౌ
జీవితముల్ భరించుచు వ • సింపుఁడు నేన జయింతు నెల్లరన్.

చ॥ అనుడుఁ గుమారుఁ డిట్టులను • నబ్జభవాన్వయ వార్ధిచంద్రమా!
విను మొకమాట యేను రఘు • వీరుఁడు తక్కఁగఁ దక్కువారిపై
వనజభవాస్త్రమున్ విడుచు • వాఁడను కానది వాని దేహమున్
జనకజయే తొలంగినది • చిత్రము దీనిఁ దలంపఁగా నగున్.

ఉ॥ తీరుగఁ జర్చసేయ విది • తేలికగాదు రఘుప్రభుం డసా
ధారణ మానవుండు పిన • తండ్రి వచించిన గర్వ మోహ ని
స్తారులు యోగు లెల్లపుడు • ధ్యానముసేయుచునుండు నా జగ
త్కారకుఁడే యటంచుఁ గౌతు • కం బనిలేక యెఱుంగనయ్యెడిన్.

చ॥ అది యటులుండని ష్మరుగ • నైనది యైనది చింతయేం? నీ
మది ప్రమదంబు నొంద నొక • మార్గము చూతు నికుంభిలాస్థలిన్
గుదిరిక నొక్క వేలిమిని • కూరిచి పూర్తి యొనర్తు దుర్గుణా
స్పదుఁడు విభీషణుం డెఱుఁగ • భంగము సేయున యంచుఁ గుందెదన్.

సీ॥ అన విభీషణుఁ • డరయకుండెడు భంగి. సీత యాకృతి యొండు • సృష్టిచేసి
యువతీస్థితిం గాంచి • యున్నతి నందిన. హనుమంతు నెదుట దా • నిని వధించి
పరఁగ నయోధ్యకై • కరుగుచుంటిన యని. పలుక వారలు భ్రమను • పడి యలంగు
వారు జానకి చచ్చె • ఫలమేమి యిందని. తమ్ములు హితులు బాం • ధవులు పురము

తే॥ తెరలి నాశమొందున యని • మరలువారు. మరలకున్నను హనుమంతుఁ • బురికిఁ బంపి
యెఱుఁగుదాఁక దుఃఖముఁ ధరి • యింపలేర. యంతలో నాము వేలిమి • నట ముగింతు.

చ॥ ముగిసినయంత వచ్చి కపి • ముఖ్యుల రాఘవులన్ వధించి నీ
కు గెలుపు గూర్తునంచుఁ దన • కూరిమి పుత్త్రుఁడు పల్క సంతసం
బు గలుగఁ బంక్తికంఠుఁ దను • మోదము చూపెను మేఘనాదుఁడున్
జిగమిష మాయసీతను సృ • జింపఁగ నుత్తరువందె నంతటన్.

## వానరులు లంకం గాల్చుట

మ॥ అట సుగ్రీవుఁడు రాఘవుం గని మహా • త్మా! దైత్యు లున్నట్టి యీ
పుటభేదంబు దహింపఁగావలయు నా • మోదంబు చూపింపవే
యటులైనన్ రిపురాజి వచ్చుననఁ గం • జాక్షుండు యోచించి కా
ల్చుటయే యొప్పని యాజ్ఞయీయఁ బ్లవగుల్ • కోలాహలోత్సాహులై.

మ॥ కొఱవుల్ చేకొని తన్మయంబుగ రణ • క్షోణి తలం బెల్ల నా
త్తరమై కన్పరనేగి దైత్యనగర • ద్వారంబున న్నిల్చి పే
చిరి శంపాలతపోల్కి నుల్కలటు లం • చ్ఛిద్రంబులై యెల్లచో
వఱలెన్ దైత్య వినాశసూచకముగా • వారింపరాకుండఁగన్.

ఉ॥ లంకను కీలలేసిన య • లాతము లెల్లెఱఁబర్వ మున్న నా
యంకుడు వార్ధిపైఁ బఱపు • నగ్ని శరంబు విధాన రేఁగిన
ల్వంకలఁ గాల్చెఁ బక్షిల ర • వంబులు దానవకోటి కూకలున్
సంకటపాటులుం దెలుప • శక్యమె? కోఁతులు పెక్కులై చనన్.

మ॥ ఒక మార్విద్రిమ్మరి మున్నువచ్చి యొగిని • య్యూరెల్ల దుర్వార వ
హ్నికి నాహారము సేసిపోయె నిపుడో • యున్నంచుఁ దెల్పంగ లె
క్కకు రానట్టి వలీముఖావళులు లం • కం జొచ్చె నింకెట్లు చా
వక జీవించెదు వారమంచు భయ ది • గ్భ్రాంతాత్ము లై రందఱున్.

ఆ॥ లోక వినుతుఁడైన • కాకుత్స్థ తిలకుఁడు, వహ్ని యుమియు బాణ • వర్గమేయ
గోపురంబు విఱిగి • కూలి త్రికూటంబు, పైనిఁబడియెఁ గపులు • ప్రమదమంద.

తే॥ మందు మలఁ గొనిపోయిన • మారుతి వడి, వచ్చి కంఠీరవ రవంబు • వఱలఁజేయ
విన్న లంక గరుడపక్ష • భీషణరుతి, వినిన నాగలోకస్థితి • నెనసె నపుడు.

శా॥ మాయాకార్య విశారదుండు జముతో • మాటాడి గెల్వొందుడై
కేయేంద్రాత్మజుఁ డుద్ధతుండయి మరు • ద్వీథిన్ మహారంభుఁడై
మాయాజానకి కొప్పు వట్టికొని భీ • మప్రౌఢి ఖడ్గంబుచే
వ్యాయామంబు వెలుఁగఁ దిప్పుచు జగ • త్ప్రాణాత్మజున్ డాయుచున్.

శా॥ మీరీ జానకికై దురంబు కడుఁబే • ర్మిం జేయుచున్నారు ర
క్షోరాజన్యుఁ డుపేక్షచే విడిన నీ • క్రూరాత్మ నేఁ జంపెదన్
దీరున్ సర్వము మీకు మాకు నన భీ • తిన్ వాయుపుత్రుండు మా
యారంభంబులు సర్వముం జెడియె నేఁ • డంచున్ మదిన్ స్రుక్కుచున్.

శా॥ తప్పింపంగ నుపాయమేదియును చి • త్తంబందు కన్పట్టమిన్
నిప్పుం ద్రొక్కిన రీతిఁ దత్తఱిలి స • న్నీతిం బ్రశంసించుచే
యొప్పంబోలు నటంచు నిట్టులను గ • ణ్యోదార! యాపద్గతుల్
మెప్పో! నీతియొ? యోగ్యమో? తగవొ? మే • ల్మింగూర్చునో? తెల్పుమా?

మ॥ అరవిందాసన వంశ్యుఁడై సకల శా • స్త్రార్థంబుల న్నేర్చి యీ
కరణిన్ స్త్రీని వధించుటల్ పరమ దు • ష్కార్యంబుగా నేర్వవో?
ధరణీ వ్యోమములే పడంకునవి చి • త్తంబందు భావింపవో,
కరుణన్ దీనిని మాని తేని కని లో • కంబెల్లఁ గీర్తింపదే?

మ॥ కరుణాదూరత యేల? వంశ గురుతల్ • కాలుష్యముం జెందు దు
ర్భరమౌ నింద వహించు నైచ్య మబలన్ • బాధించి చక్కాడుటల్
స్థిరమౌ కీర్తి నశించు రౌరవము ప్రా • ప్తించున్ మహాపాతకం
బరవే సేయఁగ రాచపుట్టువునకున్ • యోచింపుమా రావణీ!

త్కరముల నాజిలోఁ దునుమఁ • గాఁ జనుదెంచిన వాఁడఁగాను దు
ర్మరణము తల్లి యొంద బవ • రంబున కిందఱుఁ బోడితెచ్చితిన్.

ఉ॥ జానకిఁ గానలందు కనఁ • జాలక చింతిలుచున్న రామ భూ
జానికి లంకలో జనక • జాతను జూచితినంచుఁ బల్కి స
మ్మానము నొందు నోటనె కు • మార్గుఁడు రావణి చంపఁజచ్చె నం
చేనె వచింపఁగా వలసె • నేటికిఁ గాల్పనె నాదు జన్మమున్?.

చ॥ కడలిని దాఁటి లంక నొగిఁ • గాలిచి సేతువుగట్టి మేరువుం
గడచి మహౌషధీ శిఖరి • గారవమారఁగఁ దెచ్చి నీసముల్
పుడమిని లేరు లేరనెడి • భూరి యశంబు గడించినట్టి నా
యుడిగము బీఱు వోయెను ప • యోనిధి వింగువ గల్పు కైవడిన్.

ఉ॥ సీతను కత్తిచేఁ దునుము • చెన్నటి నప్పుడ చంపనైతి న
బ్జాతముఖిన్ సమక్షమునఁ • జంపుచునుండఁగఁ జూచుచుంటి నీ
పాతక జీవితంబు నెడఁ • బాయఁగ జంకుచు నుంటి నింక నా
నీతకముల్ జగంబులు గ • ణించి హసింపకయున్నె? యక్కటా!.

మ॥ అని చింతించుచు రావణాత్మజుఁ డయో • ధ్యాపట్టణం బేర్పఁగాఁ
జనియెన్ వానిని వెంబడించిన రఘు • క్ష్మాభర్త నాజాడ యే
మిని కాన్పింపమి నేమిగా వగచునో? మీఁదేమి కానున్నదో?
కనకున్నాఁడను తెల్పఁగాఁజనుటె యో • గ్యంబైన కార్యంబగున్.

చ॥ జరిగినదెల్లఁ దెల్పెదను • జానకిభర్తకు నాతఁ డయ్యెడన్
మరణము నొందునేని యట • మాఁదెడ నట్టులు కాక యాతఁడే
కరణి వచించు నాసరణిఁ • గార్య మొనర్చెద రిత్తచింత నే
నొరయుట యేఁ? యంచిన-కు • లోత్తము చెంగట వ్రాలె గ్రక్కునన్.

ఉ॥ వార్త విని తపించి మానసము • ప్రాణము దేహము వాడ నూర్చుచున్
సోలుచుఁ దూలుచున్ మిగుల • గ్రుక్కుచు వెక్కుచు నేలఁగూల సం
శీలుఁడు రాముఁ డాతనిని • చేరఁగఁజీరి వచింపుమయ్యా! యి
ట్లేల తపింప? హేతువది • యెయ్యదొ? గొప్పది యుండు మారుతీ!

చ॥ నుడువుమ యన్న నాతఁడు క • నుంగవ నశ్రులు గ్రమ్మ మేఘ నా
దుఁడు జనకాత్మజ న్నెఱకి • త్రోచెన యంచు వచించి యాపయిన్
నుడువ కొడల్ గదల్పక క • నుంగవ యార్పక యూర్పుపుచ్చ కు
గ్గడుపగు చింతనొంది యొక • కైవడి మ్రాన్పడి యుండెనత్తఱిన్.

ఉ॥ ఆ పలుకుల్ చెవింబడిన • యంతనె కీశవరేణ్యు లెల్లరున్
రాపడి వాతఘాతమున • మ్రాఁకులు గూలియనట్లు రామ రా

మా ! పరమాత్మ ! యేదిగతి • మాకని రాముని పాదసన్నిధిన్
దాపముచేత బెగ్గిలి వి • తాడనఁ గూలిరి దారణీస్థలిన్

ఉ॥ చిత్రమువోలె సూర్యకుల • శేఖరుఁ డొక్క క్షణంబు నిల్చి సౌ
మిత్రికి మాయపల్కు దర • మిత్రులఁ జూడక మత్తుఁదేనియున్
ధాత్రిని సుంతియైన మదిఁ • దాఁగలే నధిమాన మక్కునం
దోత్రము మూడ్కిఁగుప్పు నసి • దూలి ధరాస్థలి వ్రాలె గ్రక్కునన్.

ఉ॥ అగ్రజు చింతఁగాంచి తమ • కైన సుమస్థితిఁ గాంచి కార్యమ
వ్యగ్రతనుండి యిమ్మపడి • వచ్చియు నాశము చెందఁగాంచి వీ
రాగ్రణి లక్ష్మణుండు హృద • యంబును మేనును వాడఁ దల్లి ప్ర
త్యగ్రత పీడు ద్రేపువలె • నారటమందుచు వ్రాలె మేదినిన్

చ॥ మదిని విమర్శపైఁ బ్రతి పి • మర్శ యొనర్చు విభీషణుండు త
న్నెద కవియింప నార్తిగొని • యేమియుఁ దోఁపక గెల్వలేమి దు
ర్మదుఁడగు మేఘనాదుఁడు ధ • రాసుతచే దనుజాళితెల్ల నా
పద ఘటియించె నంచుఁ గర • వాలునఁ ద్రుంచెనొ యంచు జంకుచున్.

చ॥ చల్లనినీరు మోముపయిఁ • జల్లి పనంబులు మేను నొత్తఁగా
మెల్లనఁ గన్ను విచ్చి రఘు • మేదినినాథుఁడు చూచె లక్ష్మణుం
డుల్లము సంచలింప గను • నొయ్యనఁ గాంచి యితండు జీవముల్
తెల్లము పీడువాఁ డనుచుఁ • దేర్పఁదలంచి సహించి యిట్లనున్.

ఉ॥ అల్పులు చెప్పరంబు తఱి • నార్తిని క్రుంగి కృశించువార ల
య్యల్పవిధంబు నీకుఁ దగు • నా? పగవారలు నవ్వఁ జిత్త సం
కల్పము మాని యన్వయపు • గౌరవముం దిగనాడి ధర్మవుం
బొల్పును వీడి యిట్లు దిట • ముం జెడఁ జింతిలఁగామ రాఘవా!.

మ॥ అసహాయన్ బతిదేవతన్ సుజన లో • కారాధ్య వైదేహి నొ
క్కసురుం డంటి వధించె నంచు నిటు శో • కాక్రాంత చిత్తుండవై
మసలం జెల్లునె? యక్ష నాగ మఖభు • గ్మౌనీంద్రు లై రేనియున్
వసుధన్ సజ్జన హింససేయ వడి న • వ్వారిన్ వధింపం దగున్.

మ॥ జగముల్ చేర్పడకుండుటా? దనుజ దౌ • ర్జన్యంబు లిట్లేమిటా?
నిగమ వ్యాపృతి సాగుటా? తగవు వు • న్నెంబుల్ ధర న్నిల్చుటా?
తెగి సాధుల్ నశియించుటా? మనము నా • ర్తింగుంది శోకించుటా?
పగవారల్ బ్రదుకొందఁగా మన ధను • ష్పాండిత్య మక్కాఱుటా?

మ॥ త్రుటిలో లంకను బూదిచేసి దనుజుల్ • త్రోఁద్రోపుతోఁ బోవు ది
క్తటముల్ గాల్చి దివంబు గూల్చి మది శాం • తం బందుటల్ మాని త్రా

క్కటపాటొంది శిరంబు వ్రాల్చికొని దుః • ఖంబందుచుం దేవి య
క్కట! యీపేదతనంబు వీరజగ ము • ద్ఘాటించి యగ్గించువే!

చ॥ పురమున నిట్టి ధర్మమును • పూనియె రాజ్యముపీడి కానలం
జొరఁబడి దేవిఁ గోలుపడి • స్రుక్కుచు లంకకుఁ జేరి యిందు దు
ర్భరమగు దుఃఖమొంది పసి • వాడుమ ధర్మము ధర్మమంచు ని
బ్బరికము గొఁదుమేని యుకి • వంబున కీద్వరె కట్టి శాత్రవుల్

చ॥ వగపు భరింపలేక మన • ప్రాణము వీడితివేని లోకముల్
పగతుఁడు పట్టి తెచ్చి తన • భార్యను మ్రోల వధింప రాముఁడా
పగతుని కొంది కొంచి కసి • వాయఁగఁ జంపెడి శక్తిలేక సి
గ్గు గొని మరించె నంచు విను • గుప్వకరింగొని నిందసేయవే!

మ॥ తగ నీవైఖరి పీఁదధర్మము సుమి • త్రా పుత్రకుం డాడుచో
వగలో మున్గిన సూర్యసూతి యొక స్వ • ప్నంబంది మేల్కన్న నో
యగమై లేచి పరాకులేల వడి దీ • పాగ్నిం బతంగక్రియన్
నెగయం జూచు దశాస్య తొమ్మసయి లం • ఘింపంగ రందో వెసన్.

శా॥ లంకా పట్టణముం బెకిల్చి వడి నే • లంగూల్చి యిల్లాంద్రతోఁ
జంకం బిడ్డలతో సుహృజ్జనులతోఁ • జక్కాడి యన్యాయ మీ
పొంకంబంచు నిలింపు లడ్డుపడినం • బొంగార్చి లోకం బద్దై
త్యాంకంబై చనఁజేసి తీఱవలెఁ గా • ర్యంబిద్ది రందో వెసన్.

శా॥ ధర్మంబే యగుఁగాక యారసిన దు • ర్ధర్మంబె యౌఁగాక దు
ష్కర్మారంభుల దుంపద్రెంప కిటు శో • కస్వాంతులై యుంట స
త్కర్మం బెట్లును కాదు రండనుచు మా • ర్తండాత్మజుం డాడఁగా
నిర్ముక్తంబులఁ బోలి లేచి రతనిన్ • పెన్నంటి శాఖాచరుల్.

శా॥ ఉత్సేకించుచు లేచు వానరుల యు • ద్యోగంబు వీక్షించి సం
విత్సంయుక్తుఁడు వాయుసూతి యిఁక మీ • విన్నాణముల్ చాలు దు
ర్మాత్సర్యంబునఁ గోసలంబు పయి కిం • ద్రద్వేషి దండెత్తె మీ
యుత్సాహంబులు వ్యర్థమయ్యె నవి దై • త్యోద్దేశముం దెల్పుదున్.

### ఇంద్రజిత్తయోధ్య కేగెనని విని రాముఁడు చింతించుట

తే॥ తల్లులను తమ్ములు మహార్తి • దపముచేయు, చున్నకోసలంబునకు దై • త్యుఁడుపోయె
వనెడు వార్త చెవింజొర • సనఘు మనము, కలఁగినది మఱి మిక్కిలి • కలఁగఁబాఱె.

శా॥ క్షీరాంభోనిధి యోగనిద్ర విడి వ • చ్చెన్నాఁగఁ జింతా మహా
పారావారము తీర మొంది త్రుటియుం • బంటింప కూటాడు సీ

తా రామా రమణుఁడు చిత్తమునఁ గాం • తాశంబు సంపంబు దు
ర్వారంబై చన నిల్చె సంక్షుభిత వా • రాశిక్రియన్ గాసిమై.

శా॥ నాయీ దుర్విధి సీతతోఁ గడచి యం • తం దీఱదయ్యెం గదా?
మాయం జేయఁగఁ బూనె మాటలము ని • మ్మాత్రాన శాంతించునే?
యేయెవ్వారలఁ జేరి యింకను మహిన్ • హింసింపఁగా నున్నదో?
యీయార్తిం దొలఁగించు త్రోవ గనదే? యేమౌదురో తమ్ములున్?

శా॥ చేతో వేగ విమాన మెక్కి చను నా • చెన్నంటి మొక్కింత కా
లాతీతం బొనరింపకుండ సవలీ • లన్ సర్వ నాశంబుగా
భూతిం గల్పను దుష్టగుండ నగు నా • భూభార జన్మంబుచే
సీతం గోల్పడి యిందునందు జన వి • శ్లేషంబు గావించితిన్.

మ॥ మరణం బింకను నాకు రాదుగద నన్ • మన్నించు నా తండ్రులున్
ధరణీజాతయు రాక్షసాళివలనం • దల్లుల్ సుహృద్బాంధవుల్
పురవాసుల్ మరణింపఁ జూచినది యీ • పుణ్యంపు జన్మంబు నా
కరణిన్ మున్నెవఁ డుద్భవించె కుల ని • ర్ఘాతంబుగా మేదినిన్.

మ॥ ఇట నర్తిల్లిన దేవియుం దెలియలే • కింద్రంబుఁ బొందంగ వా
రట నాతమ్ము లెటేంగి తారసిలినన్ • యామ్యాటుఁ దేహారి యు
త్కట దర్వీకర పాశబద్ధులనుగాఁ • గావింపఁ బక్షీంద్రుఁడా
దట నేతెంచునె? మంచుఁ జేయఁగ జగ • త్ప్రాణాత్మజుం డుండునే?

మ॥ అనఘా! వ్యోమమునన్ వడిన్ జను నుపా • యం బున్నచోఁ దెల్పుమా
కన నీయుస్రువి యుండనీ వదలనీ • క్రవ్యాదయుద్ధంబు గం
గనె పోనిమ్ము దురాత్ముఁ డింద్రజితు న • క్షంబుల్ చిరంజీవు లి
చ్చను చంచూపుటిఁ దోఁడి తిన్న యవలన్ • సాధింతు నన్యేచ్ఛలన్.

మ॥ అన సౌమిత్రి నిరోధియై పలుకు నా • ర్యా! సంగరం బండు మా
ర్గాని కైకేయి తనూజుఁ గట్టుటకు నా • క్రూరాత్ముఁడౌ మేఘ గ
ర్జనుఁడే కాదు త్రిలోకముల్ చెనకినన్ • జాకుండఁగా నిల్చునే?
ననుగా నెంచితివేమి యాభరతు? న • న్నా! బుద్ధి తార్మాఱుగన్.

మ॥ యము నా రావణి తానె ప్రేమమున నా • హ్వానించి కొంపోయి సై
న్యముతో ధారణిఁ ద్రెళ్ళియుండుటయె నీ • వచ్చోట వీక్షింతు వి
క్రమ సందేహములేల చింత విడుమా • కానున్న కార్యంబు పం
క్తిముఖున్ వాని కళత్రముల్ మిగుల దుః • ఖింపంగఁ జెండాడుటే.

మ॥ అవి సౌమిత్రి వచింప వాయుసుతుఁ డా • హాపోహముల్ సేయఁగాఁ
బనియే? మద్భుజ పీఠినెక్కుఁడు మనో • భావంబుతోఁ జేరెగన్

బనుపన్ శాస్త్రవులన్ వధించి త్రుటిలో • వత్తున్ మహాసేనతో
దనె ధాత్రిం బెకలించికొంచుఁ జనువాఁ • డం దెల్పుఁ దేదిష్టమో ?

శా॥ చంపన్ వచ్చిన మేఘనాదునకు భూ • సంజాత గిట్టింపు ద
ప్పింప న్నీతులు పల్కుచుంటి నవలన్ • బిర్వీకునన్ గెల్చి బా
ధింపన్ మూర్ఛిలినాడఁ గాఁ యినచో • దేవిన్ దురాత్ముండు దాఁ
జంపన్నేర్చునె? చంపి జీవచ్ఛలతో • సాగంగ వాఁడోపునే ?

మ॥ కదఁకన్ వాలము మనో జవంబుల కలం • కం బొంద వెన్నంటి యా
దురుకం డీల్గఁగ నెత్తిపై దుమికెదన్ • దుర్దాంత నిర్ఘాతమున్
వడి ముందేగి యయోధ్యఁ జేరెదను సం • భావింపుఁ దేదర్హ మో
తదయన్ లాభమె? యన్న దాశరథు లు • ద్దామక్రియన్ లేవఁగన్

మ॥ కని దైత్యేశ్వరుఁ డొక్క విన్నపము ని • ల్కం బొందుఁడీ దుఃఖినై
మన పేమాత్ర వశంబుగాక యపుడ • మ్మాదిక్కున్ భ్రమం బొందితిన్
దనుజుం డా ధరణీజఁ జంపుట యస • త్యంబందు నూహించెదన్
జనసంస్తుత్యను తాఁకి వాఁడు బ్రతుకం • జాలండు నిక్కంబుగన్.

## విభీషణుఁడు తుమ్మెదయై జానకిం గాంచి వచ్చుట

చ॥ పరమ పతివ్రతం జనక • భస్మము గాదె జగత్త్రయంబు? ని
బ్బరమున నట్లయైన నొక • పాట నయోధ్యకుఁ బోక చూడ న
చ్చెరువగు నన్నియుం జిటిక • వేసున సత్య మెఱింగివత్తుఁ జె
చ్చెరవులు మాని యుండుఁడని • చిప్పుచుఁ దుమ్మెద రూపుతోఁ జనెన్.

ఉ॥ తుమ్మెద రూపుగొంచు గుణ • ధుర్యుని రాఘవవర్యు ధీర చి
త్తమ్మువలెన్ వెసం బఱచి • తాల్మి నశోక వనంబుఁ జేరి చి
త్రమ్ము బలేఁగ వినిశ్చలతఁ • దాల్చి తపించెడు రాముదేవి నా
త్రిమ్మునఁ గాంచెఁ గాంచఁ గను • దమ్ములు హృజ్జలజమ్ము శాంతిలెన్.

శా॥ నా దుఃఖమ్ములు మేనితోడనె తొలం • గంబోలు నంచూర్చు రా
మా దీపాభము నోర్చుమై త్రిజట స • మ్మానోక్తుల దేర్పఁ జిం
తా దాహంబును మాని వానర మృగేం • ద్ర ధ్యాన మాలించి స
మ్మోదం బందుచు జీవముల్ నిలుపు న • మ్ముగ్ధం గనె భక్తిమై

తే॥ మాయయని దిగులును చింత • మానియవ్వి. భీషణుండు రావణి నికుం • భిలకుఁ గ్రతువు
పేయఁ జనెనని బహుళ దైఁ • తీయ సేన. లరుగుచుండుటయును మది • నరసి కాంచె.

చ॥ క్రతువున యజ్ఞియంబులు క • రంబుగఁ దృప్తి యొసంగు మాఱుగాఁ
గుటిల యొసంగఁ జేయునని • కూర్చు సధోగతి నంచుఁ గుందుచున్

గ్రతుధ్వజులెల్ల గాసిలుట • గాంచి విభీషణుఁ డింద్రజిత్తు క
ల్పితమది దొడ్డదంచుఁ జను • దెంచి రఘూత్తముఁ గాంచి యిట్లనున్.

ఉ॥ దేవి సుఖాన నున్నయది • తెచ్చెడు వారలు నున్నవారు ని
ర్జీవిత గాదు ధ్రాత్తదికిఁ • జేటును గల్గనె; మాయచేసి యా
రావణి శత్రు దుర్జయ క • రంబగు వేలిమి సేయఁబోయినాఁ
డావిధిఁ బూర్తిచేసి మన యందఱఁ జంపఁ దలంచె రాఘవా!

తే॥ అని విభీషణుఁ డాడిన • యంత నేడు, జగము లేడుదీవులు నేడు • సాగరములు
చేరి ఘోషించు చందాన • నారవంబు, చేసి రాదిరి పాడిరి • చెలఁగి కపులు.

## 26. నికుంభిలా యాగ పటలము. (183)

శా॥ శ్రీరాముండు విభీషణుం దదవి యా • శ్లేషించి మిత్రంబ! యీ
మారాముల్ వివరించి కష్టముల నా • నం గాన్స [illegible] టి ధీ
రాయుం డంజని పుత్త్రిఁ డుండెఁ బరమే • శుం డుండె గావించు పు
ణ్యారంభంబును రద్దు తక్కు బల దై • ర్య స్ఫూర్తి యిప్పట్టివే.

చ॥ అని వినుతింపఁగా శిరము • నాతఁడు వంచి మహీశ! యాగ సి
ద్ధిని గొనునేని వానిని వ • ధించుట దుష్కరమౌను గెల్వియున్
దనుజులకే లభించు నట • దక్షత లక్ష్మణుతోడ నేగి పే
ర్మిని చెడఁజేసి దైత్యు నప • లీల వధింతు మనుజ్ఞ యిమ్మనన్.

ఉ॥ మంచిది యట్లె చేయుఁడని • మన్నన చేసి సుమిత్ర పుత్త్రి వీ
క్షించి గరాసు కైతపము • చేసి విరించి శరంబు నేయఁ గో
పించి తొలంతు గాని ప్రతి • భీషణభంగిఁ దదస్త్రమే ప్రయో
గించిన లోకజాలములు • గీడ్పడు నవ్విధి చేయఁబోకుమా.

ఉ॥ పాశుపతంబు వైష్ణవము • పాయక యేయుననేని వానితో
నే శమియింపఁజేయు మరి • నేర్చిన మాయలు పన్నునేని త
న్నాశము ధర్మపద్ధతి నొ • నర్పుము ముమ్మరమైన పోరునన్
గ్లేశము దైత్యుఁ డొందఁ బరి • కించి వధింపుము లావు పెంపునన్.

శా॥ రోసం బారఁగ బాణవృష్టి నొగి శ • త్రుం డొప్పఁ గుప్పింప బా
ణాసారంబునఁ ద్రోవఁజేసి యరి హ • స్తాధిక్యముల్ తగ్గుచో
గాసిం బొరిద నెఱంకు లంట నిశితో • గ్ర స్ఫార నారాచముల్
చేసుద్దిం జతగూర్చి యేసి శమనుం • జేర్పింపుమా లక్ష్మణా!

తే॥ ఎదిరి విడుచు దివ్యాస్త్రంబు • లెఱిఁగి వాఁడు, విడుచునంతలోఁ బ్రత్యస్త్ర • వితతి నేసి
యడ్డపెట్టుము వాని యా • హవముల నాస్య, చిహ్నములచేఁ బరీక్షించి • చేయు పోరు.

తే॥ అనుచుఁ బెక్కుపాయములు వ్యూ • హములమర్మ, ములను దెల్పిజగద్భర్త • సులభుఁడైన
విష్ణుచేతి కార్ముకమిది వేడ్కఁ దీనిఁ, గొనుము శత్రులఁ గూల్పుమ • యనుచు నొసఁగె.

తే॥ దీనిఘనమహిమ మగస్త్య • మౌనిమున్న, తెలుపమనసున నాటంగఁ • దెలియుదుకద!
ఈ సహస్రశీర్షుని యంబ • కాసనము వి, రించనుఁడు తొల్లి వేల్మి కా • వించిపొందె.

తే॥ తోయజాక్షుండు దాల్చిన • తూణయుగ్మె, యక్షయ శరంబు గొనుమని • యలరనిచ్చి
యలమి యుత్సాహవాక్యంబు • లెలమినాడి, సెల వొసంగెను జానకీ • చిత్తహారి

తే॥ మునులు ఖేచరులుబ్బిదీ • వనలు సేయ, సంగరోత్సాహుఁడగుచు ల • క్ష్మణుఁడు త్రిపుర
ముల దహింపవెడలు రుద్ర • మూర్తివోలెఁ, బ్లవగబలములతో నప్పు • పయనమయ్యె.

తే॥ పవనసూతి ప్రభృతి వీర • వరులతోడ, వెడలు మనుచుండు శ్రీరామ • విభునిపాద
జలజములు మదిలోన వె • ల్పలను దోఁపఁ, దలను దాల్చి నడచె వీర • ధర్మధనుఁడు.

ఉ॥ రాముఁ బ్రదక్షిణించి సమ • రంబునకుం జను లక్ష్మణుండు ప్రో
ద్దామక వామహస్తమున • దార్ఢ్య శరాసనమున్ ధరించి సు
త్రామ భయాపహారియగు • దక్షిణహస్తమునన్ శరంబు సౌ
రై మెఱయంగఁ బట్టి పగ • యొదలఁ దెచ్చెద నంచు వెల్వడెన్

ఉ॥ తన్నెడఁబాయకుండు తన • తమ్ముఁడు వీడి చనంగఁ గాంచుచున్
మున్ను మునీంద్రుతోడ మఖ • ముం బరిరక్షణసేయ నేగుచోఁ
దన్నను తమ్ముఁ జో విడిచి • తాటక తండ్రి వహించు తల్లడన్
గ్రన్ననొందె జీవములు • కాయము వీడఁగ లేని కైవడిన్.

ఉ॥ కేల నలాతముల్ గొనుచుఁ • గిరులు కొండలు కోనలున్ వడిన్
జాలుగ దాఁటి లోకముల • జానుగఁ గడ్వనఁ దాల్చుచుండు సం
శీలుఁడు మట్టియాకుపయిఁ • జేరె యడంగిన వైనమొంది దై
త్యాలి రవంతచోట నడఁ • గారు నికుంభిలఁ గాంచి రెల్లరున్.

సీ॥ ఆ మేఘనాదుని • హోమాగ్నికుండముఁ, జక్రాయుధము వరు • సలుగఁ జుట్టి
కాపాడుచున్నట్టి • యేపున బడబాగ్నిఁ, గడలిచుట్టిన యెస • కమున సైన్య
సమితి వ్యూహమువన్ని • చక్రవాళమునంటి, జగమెల్లఁ జుట్టంగఁ • జాలియుండెఁ
బొడవైన నల్లని • యొడళులపై నెట్టి, వెంద్రుకల్ మిన్నంది • వెలుఁగుచుండ

తే॥ రామవిభుఁడు కోపమున వా • రాశిమీఁద, వహ్నిసాయకమేయ నం • బరమునంటి
కదలి మండుచుండిన మాడ్కి • గాసఁబడుచు, నుండె దానవబలములు • గండుమెఱిసి.

తే॥ గుణరవములేని వింట్లింద్ర • ధనువుఁబోలెఁ, జిందములు సంభ్రముననుండు • చెన్నదోఁచె
భేరు లులియని మబ్బుల • తీరుదాల్చె, హరులుఁ గరులును చాంచల్య • మరయకుండె.

క॥ చలియింపని జలధివలెఁ, న్నిలిచి మొరయకుండు యామి • నీచర సేనం
దిలకించి వనచరావళి, తులకించి, రవించె మిన్ను • తూండ్లు పడంగన్.

క॥ గర్జించిన కపులసుఁ బ్రతి, గర్జన మొనరించె దనుజ • గణములు భేరుల్
గర్జించె రెండు మొయిళులు, గర్జలతో జాల సంబ • కంబులఁ గురిసెన్.

క॥ కొలఁకున హంసలు వ్రాలెడు, పొలుపునఁ దళతళల కైదు • వులు వనచర సే
నలపైఁ బడెను ధరపైఁ, బలపలమని తలలుఁ గేయఁ • బలములు రాలెన్.

క॥ వానరులు జాలు బ్రమాఁకులు, నూనముగా ముసర విసర • నొత్తుగఁ దలలున్
మేనులు పండ్లును కైదువు, లానకములు తునిఁగి విఱిగి • యవనిని రాలెన్

క॥ పరిఘ కరవాల తోమర, శర కుంత గదా ముసుండి • సాధనముల ని
ర్జరవైరు లేయ వనచర, శిరములు కడుపులును బ్రస్సి • చిందెను ధరపై.

తే॥ ఎప్పుడీసేన సమయుటః • యెపుడు వేల్మిఁ, జెలుచుః టిప్పని యెద సేయఁ • జెడుసమస్త
మని విభీషణుఁ దారాము • సనుజుఁ గాంచి, పలికి లెమ్మని తొందర • పఱచె నపుడు.

తే॥ అచటి కింద్రాదులును చతు • రాననుండు, యక్ష కిన్నర కింపురు • షాదులెల్ల
వచ్చి వింగి నిండిరి రాని • వాదులేప, లక్ష్మణేంద్రజిత్తుల నేర్పు • లావు చూడ.

చ॥ రథముల గుంపు వారణ వ • రంబుల పెంపు జ్వలించు దంష్ట్రికా
యుధముల వంపు వాజిముల • యుద్ధతిసొంపును సోఁకు లెంపు సం
గ్రథితములైన భంగి మొగ • రంబున నిల్చిన జంపు సంగర
ప్రధనము సంపు వాద్యముల • అంపును తెల్ప నశక్య మయ్యెడన్.

శా॥ సేనంజొచ్చి సుమిత్రపటి శర వ • ష్టింగూర్చి యేపారఁగా
నానానేకప యూథముల్ రథ విమా • న వ్రాతముల్ సుందరా
జానేయంబులు దానవ ప్రకరముల్ • సంఘంబులై కూలి లం
కా నీవృత్ప్రథమంద యేగి యమ లో • కంబందె నొక్కుమ్మడిన్.

చ॥ శరములచేఁ దునింగిన గ • జంబుల దేహ మహోదరంబు లా
దురమునఁ గొండలం దొనల • తోయము తోఁపఁగఁజేసె రాక్షసో
త్కర శిరముల్ మదేభములు • త్రవ్విన పల్లము లందు గూలి ని
ర్జర రిపు యజ్ఞ కుండమున • రాఁజిన ద్రవ్యములట్లు రాజిలెన్.

శా॥ ధూళిం బ్రుంగిన హారి సన్నకుట సం • దోహంబు భల్లూక దం
తాళుల్ క్రుమ్మఁగ మిన్ను మిన్నుమని రం • గై వెల్గ వల్మీకముం
బోలెన్ గ్రుచ్చిన బాణజాలములతోఁ • బొల్పారె రక్తాపగల్
వేలన్ మీఱి పయోధిఁ జేరెఁ గుణపా • ళీల ప్రపంచంబుతో.

క॥ గొడుగులు కాఁడలు విఱుగం, బుడమిని రక్తప్రవాహ • మున మునుఁగుటచే
పుడుపతి విధుంతుదునిచే, వడి మ్రింగంబడి వెలుంగు • పగిదిం దోఁచెన్.

క॥ తుండంబులతో మదగజ, కండంబులు త్రుంగి రుధిర • తటినిం బడి యు
ద్దండగతి నడచు నౌకా, కాండంబుల పగిదిఁ దరలి • కదలిం జేరెన్.

తే॥ కుణపములఁ దినగోమాయు • గణము నిండెఁ, గాకులును గ్రద్దలునుచేరెఁ • గడుపునింప
బోరువలు వచ్చె రాబందు • పులుఁగు లడరె, లక్ష్మణుని విలువిద్దియ • లావుమెచ్చి.

తే॥ చిచ్చులుమియు శరంబులు • విచ్చిమండఁ, జేయఁ గప్పుడుకొంతలు • చేర్చి కాల్ప
వెదురుటడవులు మండిన • విధము దనర, మండిచెడెఁ గొంత వేదండ • తండమపుడు.

క॥ భల్లూక నఖములు రాక్షస, మల్లుర శిరములను గ్రొచ్చి • మలయించుట పె
న్గొల్లం బుట్టలి గములం, జెల్లగిలం ద్రోచు పగిది • విలసిల్లె నటన్.

తే॥ సింహ విక్రములగు నింద్ర • జితుని భటులు, రథికు లాధోరణులును తౌ • రంగికులును
గ్రీష్మ వర్షమ్మవోలె నా • యమ్ములందు, కుప్పమ్మనమ్ములతోడనే • గూలె హరులు.

క॥ అటనటఁ దునిఁగిన యంగము, లటనటఁ దినఁగోరి పులుఁగు • లటనట జెరయం
జొటజొటమని కాఱిన నె, త్తుటఁ బుటుకున మునిఁగి కడిగెఁ • మటుముల శిరముల్

క॥ ఒకటి వెనుక నొకటిగ నట, నకటావికటముగ వ్యూహ • మమరిన సేనా
నికటమునఁ బెటిలఁ దేరులఁ, బ్రకటంబుగఁ గూల్చె రాఘ • వశ్రేష్ఠుఁ డొగిన్.

క॥ విలయానిల హతిచేఁ గొం, డలు మొయిళులు పాటవము చె • డం దుల్లిన యా
పొలుపునఁ దలలును మేనులు, గులగులలై వెగసి హోమ • కుండమునఁ బడెన్.

క॥ నక్తంచర శిరములు తను, ముక్తములై సంతతంబు • మోఁదుటచే శా
స్త్రోక్తముగ నిలుపు కుంభ మ, లక్తక ఘటమట్లు మురిసి • లవలవ యయ్యెన్

క॥ కరి తురగ భట శిరంబుల, నరుదారఁగ నీడ్చికొని ర • యంబునఁ జని నె
త్తురుజేళ్లు యాగశాలం, బరవి మఖానలము చల్లఁ • బడి చెద మించెన్.

క॥ అడిదములతోడి కరములు, పిడుగులవడువునఁ బడంగఁ • భీముఁగు లయ్యెన్
దడఁబడి యెనుములు మేఁకలు, కడు నాహుతికొఱకుఁ గట్టు • కంబంబులతో.

క॥ తమ మదగజములు గూలఁగఁ, దమ మేనులు చినుఁగకున్న • దాశరథి మహా
స్త్రములకు జడిసి నిరుత్సా, హమున రుధిర తటినులంచ • యడఁగిరి సోఁకుల్.

క॥ పదములు శిరములు నొవ్వఁగఁ, బ్రసరంబుల గ్రుప్వ నిలిచి • వడఁ కెడువారున్
పిదపిద ప్రేవులు వెలివడ, నదవదలై సోలువారు • నైరి సురారుల్.

క॥ కినుకగొని రణము సలుపుచుఁ, దనువులు ప్రీలంగ సోలు • తనుజుల స్కంధం
బున మోచుచుఁ బ్రేవులు పైఁ, పున వెలివడఁ ద్రోచికొనుచుఁ • బోయిరి దనుజుల్

క॥ జన్నపుఁ బాత్రంబులు వి, చ్ఛిన్నములై వస్తువితతి • చెదరఁగ నట్టల్
పన్నగ నాదెమ ద్రవ్యో, త్పన్నంబై యజ్ఞశాల • సదమదమయ్యెన్.

క॥ గాలివలె విసము క్రైవడి, సాలింద్రుర కదురుగతి రు • జా సన్నిభమై
పాలంబడు చేమిరివలె, నాలంబునఁ గలఁగి దాన • వావలి సమసెన్.

ఆ॥ గొప్పగాలి వలనఁ • గూలిన వృక్షణా, లంబు గల వనంబు • దంబు వంబి
కూలియున్న సైన్య • కోటిని రావణి, పొగిలి పొగిలి విస్సుఁ • దగుచుఁ గాంచె

ఆ॥ కరుల హరుల విఱిచి • గిరులను విచ్చిన్న, శకటచయంబు దనుజ • రక్తనదులు
మృతభటాళి తెప్ప • మీఱిన వెలుఁగొందు, బయలు గనుఁడు పంక్తి • వదన సుతుఁడు.

ఆ॥ వేలకొలఁది దనుజ • పీనుఁగు నొక మూస, పుని శరాలి పేఁచ • మడఁచి త్రుంపఁ
గుప్పలైన పీన్గు • లిప్పలు గారుచు, యూనియున్న మొకనిఁ • గానఁడయ్యె.

ఆ॥ నాల్కలెండ మేను • వడఁకంగ నేతెంచి, కొంత యసుర లతనిఁ • గూడినారు
నడవలేక తోడు • వడియుచు కొందఱు, త్రోవలందె కూలి • దొరలినారు.

ఆ॥ కుండమారిపోవఁ • గుండెలు పగులంగ, నాటుచుంచ ధూమ • ముదరు నగ్ని
చెన్నునంది యింద్ర • జితుఁడు జపించు చుం, ద్రమ్ము మఱచివచ్చె • రంగమునకు.

ఆ॥ అట్టివేళయందు • హతశేషులైన రా, క్షసులు భీతుఁగుచు • శక్రజితుని
డాయ వెంట మిత్తి • వాసినపగిది వా, నరులు వెంబడించి • యరిగినారు.

ఆ॥ శతసహస్ర పద్మ • సంఖ్యయౌ సైన్యంబు, నిమిషమాత్ర నీల్గి • సమయునంత
లక్ష్మణుని ధనుర్వి • లాసంబు చింతరాయి, సఱచి యతని మదిని • కలఁతపఱచె.

ఆ॥ భూమి యొదలు వదలఁ • మోగుచు చంపంబైన, రణ పరాక్రమంబు • రాక్షస వ్రతి
కనిన సురలు మునులు • శిరములు తట్టుచు, నవ్వుచుంట గాంచి • నానయొందె.

క॥ మానముచెడ యజ్ఞమ్మున, హీనముచెడ మంత్రగతియు • హా దగ సేనా
మానముచెడ వంశము పస, మ్మానముచెడఁ గుంది పంక్తి • మస్తకసుతుఁడున్.

క॥ సేనలు పొలిసెను మిగిలిన, దానవులుం బొలియ శంక • దగులఁగనేలా?
పూనిక చెడె యాగము నిఁక, మానక సెలపెత్తి పనుల • మాంద్యమె కాదా?

ఆ॥ వేల్మికుండమందు • వేల్చిన యగ్నియుఁ, బొగలతోడ సడఁగె • బోరు సేయ
వచ్చి యరులు దనుజ • వరులను చంపిరి, తల్లమయ్యెఁ జెడుగుఁ • దెలుపు సన్న.

ఉ॥ ఎన్నఁగ వైరి దాపునను • యిట్టు మగంటిమి క్రుంగనేల? కా
నున్నది కాకమాన దిది • యోధుల పద్ధతి గాదు తొప్పకా
నిన్నర వానరావళుల • నెక్కటి గెల్వఁగలేని దోర్బల
స్కన్నుఁడ నైతినే పగఱఁ • జంపఁ గడంగక క్రుంగి యుందునే?

ఉ॥ పేరిమి కోలుపోయె నని • వేఁగుచు నూఁగుచు నుండ ఖేచరుల్
మేలిమి దూల్చి నీబలము • మించుట యింద్రునియొద్దనే సుమీ!
మాలెనె యింపటంచు నవ • మానవిధంబున గేలిసేయరే?
జాలిఖుఁన్ వధింతునని • పట్టుగ రావణి లేచనంతలో

క॥ మడిసిన కరి తురగంబులు, విరిసిన సైన్యములు నగుచు విటతాటముగా
ధరఁగూల్చి రగచరులు త, న్నారసిన దనుజులను భీతి • నొంది వదంకన్.

క॥ తాఱుచు నొదుఁగుచుఁ గ్రిందికిఁ, దూఱుచు నడఁగిన సురారి • తుటుములు వాఁడిం
దేఱిన లక్ష్మణశరముల, నాఱెన్ జఠరములు వ్రస్సి • యాంత్రము లురలన్.

క॥ నరవరు శరములతో వా, నరు లేసిన తరులు గిరులు • నక్తంచర సా
గరమున గాలియు నుఱుములు, మెఱుములతో దిగిన మొగులు • మెయివడిఁ దోఁచెన్.

క॥ చెల్లాచెదరై సేనలు, త్రుళ్ళఁగఁ దరువాండు వీచి • దుష్టుల యసువుల్
కొల్లగొను పవనసూనుం, డుల్లసమున నింద్రజితున • కొగి నిట్లనియెన్.

## హనుమంతుఁ డింద్రజితు నుపాలంభించుట

ఉ॥ మాయ ఁసత్యముల్ పెరుఁగ • మాగిలియైన దురాత్మ! నీచ! నీ
మాయలు చెల్లనేమి? జన • మాన్యను చంపకు మన్నతోడనే
కోయుదువే శిరంబు? మఱి • కోసలదేశము కొల్లలాడఁగాఁ
బోయితె పుష్పకంబుపయి? బొంకులమారి! నరాశనాధమా!

శా॥ చక్రవ్యూహముతో నికుంభిలను నీ • చా! చొచ్చుటల్ కాంతుమే?
వక్రక్రూరతఁ గోసలంబునకుఁ జా • వం బోయికే? వారటన్
విక్రాంతిం జరిమార్చి వచ్చితివె? నీ • వేల్మల్ కొనల్ సాగనే?
యక్రోధంబున బుద్ధిసెప్ప విను నా • యంబేని లేదయ్యెనే.

మ॥ ఉరగాధీశుని మించి భూభరము ను • ద్యోగించు సద్ధర్మియౌ
భరతుం గాంచి బలంబు చూపి యతనిన్ • బంధించితే? శంబరా
సురు నిర్జించిన చక్రవర్తి తనయున్ • సుజ్ఞాని శత్రుఘ్ను ని
ర్భర ధైర్యంబునఁ జేరి సీదగుటను • ష్పాండిత్యముం జూపితే?

మ॥ అనల జ్వాలలఁ జిమ్ము చష్టదిశలన్ • వ్యాపించు సౌమిత్రి మా
ర్గణముల్ నీయురమున్ శిరంబు బసులం • గంఠంబు నంఘ్రుల్ కటిన్
దునుమంగా నవరంధ్రముల్ రుధిర మే • దో మాంసముల్ గ్రక్కు లం
కను డాకొంచు నొనర్చు జాలములు ని • క్కం బేగెడి న్నేఁటితో.

మ॥ ఫణిపాశంబొ యమోఘ పాశుపతమో • బ్రహ్మాస్త్రమో మాయలన్
గనియౌ వెన్నుని చక్రమో యెదియొ మీ • గౌరవ్య మద్దానిఁ గై
కొని వేంచేయుఁడి చేయుఁడీ యముఁడు మీ • కోసంబు తా వేచియుం
డెను తట్టాడుచుఁ దాపసించుటలు నాఁ • డెంటౌనె మీపోఁటికిన్?

చ॥ వరములు మాయలందు నెఱ • వాదితనంబు బలాత్కరించి ని
ర్జరులకడం గ్రహించిన శ • రమ్ములు దేహబలమ్ములున్ యథా
స్థిరముగ నున్నవేకద? గ్ర • సింతుము గ్రుంగుడు మన్న మాత్ర ని
వ్వెరగొని పాఱినారమె? క • వింపక గ్రుక్కడి పక్కి యేఁటరా?

మ॥ నిటలాక్షుండు త్రిపురమందు హరియున్ • నిర్భీతులై దాసి యొ
క్కటవిస్ గాచినవైనఁ జచ్చుటయె ని • క్కంబయ్యె నీనాఁడు దా
పటి ప్రక్కల్ చలియింపకున్నవియె ? మీ • ప్రాణాలకున్ ముప్పు సం
ఘటపాటుం గొని తెచ్చుకొంటి రిఁకఁ ద • క్కం జూచినం దప్పునే ?

మ॥ నినుచంపన్ శపథంబు చేసె నిట ము • న్నే లక్ష్మణార్యుండు దా
నెను నీసేనల వేఁటలాడె నిను పి • ల్చెం గాచియున్నాఁడు నీ
హాసరింపంగల వేల్మికిన్ గుణరవం • బోంకార మంత్రంబుగా
వినిపించెం దదవేల రమ్ము బలి గా • వించుం దదీయాగ్నికై.

మ॥ జగదీశుం దొరసించు ఘోర రణ య • జ్ఞంబందు కేల్మోంగ బా
గుగ యోచించియె నిన్ను పాకృతముగాఁ • గొంపోవ సౌమిత్రి యా
శుగుఁడై యాశుగపాణియై వెడలె న • స్తోకానుమోదాత్ములై
నెగడం బర్వెరి నిర్నిమేషులును మౌ • నిశ్రేష్ఠులున్ మింటిపై.

## మేఘనాదుఁడు హనుమనికిం బ్రత్యుత్తర మిచ్చుట

మ॥ అని సామీరి వచింప మండిపడి దై • త్యాధీశ సూనుం డనున్
హనుమా! నాకడ నిట్లు చప్పిడిగ వ్య • ర్థాలాపముల్ సేయఁగాఁ
జనునే? సంగరమందు చచ్చి మరలన్ • సాధించి ప్రాణంబులన్
మును చావొందుట విస్మరించితిరె? మీ • ముగ్ధత్వ మిట్లుండునే?

శా॥ ఆ సౌమిత్రియె వచ్చుఁగాక ధరజా • తాధీశుఁడే వచ్చుఁగా
కే సంజీవనియేని మీకమరుఁ గా • కేమైన నౌఁగాక నా
చే సంగ్రామమునందు వానర నర • శ్రేణుల్ నిరుత్సాహులై
వేసారం బడుపాటులెల్ల నమరుల్ • వీక్షింపకే యుందురే?

శా॥ చేతం గార్ముక మొప్పఁ సుందరభుజ • స్తేమంబు పొల్పార నీ
కోఁతుల్ మానవులున్ మనోగతులు సం • క్షోభింప నాకంబు దు
ర్భీతిం జొచ్చిన వెంబడించి బహుళా • ర్తిం గూర్చి హింసింతునై
పూఁతల్ మందులు మాంత్రికులున్ వితగఁ • బోవున్ జావు నిక్కంబగున్.

మ॥ క్రతువిఘ్నం బొనరించి వీరజయముం • గైకొంటిమం చుబ్బుచున్
బ్రతుకుం బొందితిమంచుఁ బ్రేలు ఘన వీ • రమ్మన్యులారా! వృథా
మతి గర్జల్ వదురాడుచుండుఁ డిదె మీ • మస్తంబులీ సంగర
క్షితిపై దొల్లఁగఁజేయు నా శరము లా • క్షేపించు వాక్యమ్ములై.

ఉ॥ మీపలె నోటితో వదరి • మించి జయించెడు వాఁడు గాఁడుసూ!
రావణి రెండు మాటలు డు • రంబున నోడితి రింత సంభ్రమం

తే॥ పటహ కుంభికామురజ త • మ్మట హుడుక్క, దుందుభులునుతుత్తుంభికల్ • తుడుముఢక్క
కొమ్ములును తిమిలలును సం కులును కలిసి, చెలఁక నెల్లవారి చెవులఁ • జెవుడు చేసె.

ఉత్సా॥ ద్విరద చయము మీఁద నులియు • భేరిరవముతోడుతన్
బరఁగె వాని ఘీంకృతులును • పట్టెడలను ఘంటికల్
తురగ హేషతోడ మొరసెఁ • దోలుపట్టె గజ్జియల్
విరిసె నేమి రవముతోడ • వీర కటక రావముల్.

సీ॥ శంఖ కాహళ తూర్య • శబ్దముల్ జలద ని, స్వనముతో ఢీకొని • జయము నొందె
కరి హయ రథ సింహ • గర్జనములు పిడు, గుల ఘోషమును మీఱి • గెలుపునొందె
శ్రావ్యవాద్య ధ్వనుల్ • సంగీత రవములు, పీయూష రుచులపై • విజయమందె
నారి రవంబులు • నవ్వు లదలుప్పలు. కదలి మ్రోఁతను క్రిందు • పడఁగఁజేసె

తే॥ నాల్గు సంభ్రంబులంబోలి • నాల్గు తెగల, యెట్టపోగు లేపిన ధూళి • యూడుకడచి
సైన్యవారాశిఁ గను సుర • చంద్రముఖుల, యశ్రువారాశి నొక్కట • నడఁచివైచె.

తే॥ ఇంద్ర సౌధము లనఁదగి • యెసక మెసఁగు, నరదములు వేలకొలఁది త • న్నలమిరాఁగ
గ్రహము లెల్లనుకొలువసా • గరముమీఁదఁ, జెలఁగుగ్రహరాజునానింద్ర • జితుఁడుమెలసె.

తే॥ మెడయు ముక్కును కన్నులు • కడుపు కాళ్లు, ఱెక్కలును గోళ్ల తోఁకయుఁ • జొక్కపడఁగ
గొంచ మొగ్గరముం దీర్చి • మించి ప్లవగ, సేన నొరయ రావణియు సం • సిద్ధుఁ డయ్యె.

తే॥ జంభభేది యిచ్చిన కల్ప • జలదరవము, నెనయు వలమురి చిందంబు • దనుజవిభుని
తనయుఁ దొత్తె సుపర్వులు • తల్లడిల్లఁ, గాలఁ కనొంది ప్రాణులు ౩కా • వికలు గాఁగ.

తే॥ తద్రవము చెవిఁబడ నువ • ద్రవమువొంది, సింహ గర్జన మాలించి • చెవరి పాఱు
వారణంబులక్రియ ఱాత • వైచినట్టి, కుండ పెంచిక లట్లయ్యెఁ • గోఁతిమూఁక.

తే॥ శింజినీరవమున వాని • చెవులుప్రీలె. మనసు కలఁగె నుత్సాహంబు • మంటఁ గలిసెఁ
బరుగులిడఁ గాళ్లు తడఁబడెఁ • గరములందు, పొదలు సాధనములు జాఱెఁ • బెదపురెండె.

తే॥ పవన సుతుఁ డంగదుఁడు రా, ఘవులు విభీషణుఁడు సైన్య • గణ నాయకులున్
రవిసుతుఁడు తక్కఁ దక్కిన, ప్లవగులు త త్తఱిలి విఱుగఁ • బాఱిరి భీతిన్.

క॥ సేనాపతులును రాక్షస, సేనలు ముందునకు సాఁగి • జీమూతంబుల్
పూనిక నలమిన యనువున, వానరులం జుట్టెఁ గడఁక • వర్ధిల్లంగన్.

క॥ హనుమని భుజములపై శ్రీ, వనజదళాక్షుండు వాలి • వరతనయునిపైఁ
గొనకొని లక్ష్మణుఁ డెక్కెను, ఘన సమరోత్సాహ విధము • కడలుకొనంగన్.

క॥ వారల భుజములపై న, వ్వీరవరులు విండ్లుదాల్చి • విశ్రుత ఖగరా
డ్గోరాజులపై రాజిలు, నారాయణ రుద్రులనఁ ద • నర్చిరి కలనన్.

ఉ॥ పిచ్చుక పిండులట్లు మొగి • వెల్వడు తూపుల లక్ష్మణుండు తాఁ
జెచ్చెరనేసి వాని నిర • సించుచుఁ ద్రుంచె; శిలల్ పలల్ తరుల్
పచ్చడిగాఁగఁ ద్రొక్కి లయ • వాయువుఁబోలిన బాసవాళ్ల పె
న్మచ్చరి స్యందనమ్మును స • మంచిత మారుతి పాదయుగ్మమున్.

క॥ ఇరువురు తమయెడఁ గొఱఁతల, సరయంగాలేక సమత • నందుచుఁ బోరన్
బెరలేదు లేరు వీరికి, సౌర యని నిర్జరులు వెఱఁగు • దొరసిరి తమలో.

మ॥ శర సందోహము లంబర స్థలమునన్ • జన్చున్నవో లేవొ ని
ర్జర నేత్రంబులు చూడవయ్యె మనసుల్ • జడయ్యె లెక్కింపఁగా
బరిమాణంబున కందవయ్యె నడుమన్ • భంగించి యీఁదేరియున్
జొరదయ్యెన్ వ్రణరాజి దక్కి నెదియుం • జూపట్ట దమ్మేనులన్.

తే॥ నెఱసి శింజినీధ్వని నిండు • నింగియందు, పిడుగులంబలె నెగడిన • వేఁడివాఁడి
సెలలు దెసలెల్లఁ బొగగ్రమ్మఁ • జిమ్మరేఁగ, జుక్కలును మింట నల్లనై • సురిఁగి పోవ.

చ॥ విపుల దిశాంతరంబుల వి • దీర్ణ మొనర్చుచు శింజినీ రుతం
బశనుల కైవడిన్ మొరసె • నంచులుచేరిన విండ్లనుండి క
ర్కశ విశిఖమ్ము లుగ్రగతిఁ • గ్రమ్మెడు నెవ్వడి వ్యోమభూమియున్
వశమటుఁగా పిడుగులును • వర్తిలఁజేసె భయంకర స్థితిన్.

చ॥ శరధియు పట్టి తున్గిపడు • సాయక బృందము నిండ వెండియున్
శరధియ యయ్యెఁ బ్రొద్దు శశి • చందముతోఁచెను రక్తముం జెడెన్
తరువులు బొగ్గులయ్యె జల • దంబులు మాఁడెను మండు కంపు ము
ర్భరముగఁ బిక్కటిల్లె నిరు • వాఁగుల సేనలు పాతె భీతిమై.

ఉ॥ పీనుఁగులయ్యె నేనుఁగులు • ప్రేతములయ్యెఁ దురంగ జాతముల్
జానుతొఱంగి యంగములు • స్రగ్గి మడంగె శతాంగ జాలముల్
మానము తగ్గఁ దగ్గ సను • మానము వర్ధిల మానవాద సం
తానము వ్రాల్చె సాయక వి • తాన మరుల్ విసుమాన మొందఁగన్

సీ॥ కొన్ని వంగుచుఁబోయెఁ • గొన్నిపొంగుచుఁబోయెఁ, గొన్ని కూడుచుఁబోయెఁ • గొన్ని మాఁడెఁ
గొన్ని వ్రాలుచుఁబోయెఁ • గొన్ని వ్రేలుచుఁబోయెఁ, గొన్ని సౌరిసిపోయెఁ • గొన్ని విరిసెఁ
గొన్ని కుడికినేగెఁ • గొన్ని యెడమకేగె, సౌమిత్రి యేసిన • శరచయములు
కొన్ని యనిలుఁ బోలెఁ • గొన్ని యనలుఁ బోలెఁ, బిడుగులఁ బోలెను • జకరిఁబోలె

తే॥ కొన్ని ధారాధరంబును • కొని ధరాధ, రంబుఁ గొన్ని రుద్రాట్టహా • సంబుఁగొన్ని
స్వేదజలమును పోలెఁ గ్ర • వ్యాద సుతుఁడు, వైచు తూపులు రణభూమిఁ • బరపువేళ.

ఉ॥ మాన్యత మీఁగు దాల్చినది • మాదవువిల్లొ ? గిరీశువిల్లొ ? సా
మాన్యుఁడు గాఁడు కర్తశము • మ్రోలదు వీనిని గెల్వశక్యమే
జన్యమునందు నాకని వి • శంకితుఁడై దనుజేంద్రసూతి చై
తన్యము దక్క • విల్చుట యె • దం దలపోసి విభీషణుం డనున్.

చ॥ హరిహయు గెల్చి పొల్చిన ద • శాస్య కుమారుని గెల్చితీవు చి
త్తరువుగ నిల్చెవాఁడు మఱి • తల్లడమందె నిమేషమేని జా
పిర మొనరింప కియ్యెదన • పెంపరలాడుము యంచుఁబల్కి హె
చ్చరిక యొనర్ప లక్ష్మణుఁడు • సమ్మతి జూపుచు నుండు నంతలో.

కాలునిలీలఁ గాం • తాళంబు గొనిరేఁగి, యసురపుత్త్రుం డని • లాస్త్ర మేసె
లక్ష్మణాఖ్యుండు చె • లంగి నవ్వుచు వాయు, దేవతాక శరాన • దిగిచె దాని
ననలాస్త్రమును దైత్యుఁ • డరివోసి పరసంగ, దాని నాతండు న • ద్దాన నడఁచె
వారుణాస్త్రంబు బ • లారిజితుం డేయఁ, దచ్చరంబున దాని • త్రాణ నణఁచె

భాస్కరాస్త్రంబు రావణు • పట్టి విడువ, మిత్రశరముతో దాని సౌ • మిత్రి క్రుంచె
చచ్చితివ చచ్చితివ యని • మచ్చరించి, దనుజసుతుఁడు బ్రహ్మాస్త్రంబు • మొనసియేసె

భవుఁడు మఘవుఁడు నలువతా • పసులుసురలు, తలరిసౌమిత్రికి జి రాము • వాలయుఁగాత
మంచుఁ బలుక నాతఁడు విజృ • భించిమిడుఁగు, లడరఁగుప్పుచువచ్చున • య్యస్త్రముఁగవి

ఉ॥ చేవ తొలంగి వీఁడు మును • చేసిన పోరునఁ గంజజాస్త్రమున్
ద్రోవఁ దొలంగియేయఁ గడ • ద్రోవఁగలేక యడంగె నంచు నీ
కైవడిఁ నిప్పుడుం దొడఁగెఁ • గావున నూరకయుంట పాడి గా
దీ వనజాస నాస్త్రమున • నే యుపసంహరణంబు చేసెదన్.

చ॥ జగము సుఖించుఁగాక యెల • సంబునఁ బోరొనరించు రావణిన్
దిగువకయుండుఁ గా కితని • దివ్య శరం బుపశాంతి నొందుఁగా
కగుత జయంబు ధర్మమున • కంచు నజాస్త్రము వీడె వేల్పులా
సుగుణ గణంబులం గుఱిచి • శూరుని లక్ష్మణు సన్నుతించుచున్.

చ॥ జగము సుఖించుఁగాక యని • చాటి వచించె దురాత్మ రావణిన్
దెగ వచియింపఁడయ్యె రణ • ధీరుఁ డితండు విరించనాస్త్రమున్
దగ నుపసంహరింపు మనెఁ • దక్కఁ బుద్ధిని చూపఁడయ్యె నీ
సుగుణ గణంబు లెయ్యెడలఁ • జూడమ యంచు నుతించుచుండఁగన్.

చ॥ అనలముతోర డీకొనఁగ • ప్రోదిని వచ్చినభంగి వచ్చి ల
క్ష్మణుని శరంబు దైత్యు విశి • ఖంబు నడంచి నభంబు సర్వమున్
బొనుపడ నొక్క జ్వాలగ స • ముద్ధతి నేచిన వేలుతూపుచే
నణఁచె నిషాత్తవేదన వి • షాంతరయుక్తి నడంచు కైవడిన్.

ఉ॥ లక్ష్మణు శౌర్య సాహస బ • లంబులఁ గాంచి విలింపు లప్డు దీ
లక్ష్మి యెలర్చు రామపుల • లావు దలంప నశక్యముల్ భువిన్
లక్ష్మము పాటియేని గల • వా ? యన శంభుఁడు పల్కె మీరలున్
సూక్ష్మమతిన్ గణింప కిటు • స్థూలమతిం దలపోయఁ జెల్లునే ?

మ॥ నర నారాయణు లీ నరాకృతులు వి • జ్ఞానేశ్వరుల్ దుష్ట సం
హరణార్థం బవతారమందిరి జగ • ద్వ్యాపారు లాద్యుల్ జగ
ద్భరణ ప్రాభవు లవ్యయాత్ములు జగ • త్కల్యాణ సంధాయకుల్
కరుణాపూర్ణులు వీరలం గలఁచునే • కంజాసనా ద్యస్త్రముల్ ?

శా॥ సామాన్యాకృతులొందియుం బ్రకృతి సం • సర్గంబు లేకుండి మా
యామేయావరణాంతరస్థులయి పూ • ర్వాకారముల్ తోఁప సీ
కీమాద్కృం జరియించు వారఖిల భూ • శీశాను లీయర్థమున్
మీమీ చిత్తములంద యుంచుకొనుఁడీ • మీకయ్యెడున్ భద్రము

ఉ॥ చేమిరి పాలలోఁ గలియు • చెల్వున జీవులయందు భక్త హృ
త్తామరసంబులే యవస • థంబుగఁ గొన్న మృణాలభోజి సు
శ్యామల పూర్ణతత్త్వము ధ • రాత్మజభర్త నిజమ్ము ధర్మమున్
భూమిని కాచువాంచెటు నిటు • పుట్టె మహాత్ముల వేఁడికోలున

చ॥ అని శశిమౌళి పల్కఁగ వి • యచ్చరు లచ్చెరువంది శం [illegible]
విని కని యుంటి మయ్యు నవి • వేకమునం దన మాయచే [illegible]ఖుం
గని వహ నందియంబుగొని • కాసటఁ బీసట నొందుచుండు [illegible]
త్మను గల శంక లెల్లఁ గడు • దవ్వుగఁ బోయిన వందు సుంతఁగన్.

శా॥ మాయాశీలుఁడు రావణాత్మజుఁడు దు • ర్మానంబు [illegible] సి
యారాచుష్కాలము [illegible] నా • య్యం బ్రోద[illegible] మైనచో
నాయీ యేటును కాచికొమ్ము యనుచున్ • నారాయణాస్త్రంబు [illegible]
త్రాయ స్త్రంబుగఁ జేసి యేసె జగ మా • హాకారముల్ సేయఁగన్.

చ॥ శిరములమీఁదఁ గేల్మోగిచి • సిద్ధ మునీంద్ర సురాసు లెల్ల [illegible]
హరి హరి యంచుఁ గాచికొన • నారవముం బొనరించి [illegible]
శరము కరమ్ములన్ మొగుచు • జంతు కదంబము [illegible] శ్రీ
దరసిన లక్ష్మణుం డెదుర • నచ్యుతుఁ డేనని నిల్చె [illegible].

మ॥ జ్వలన జ్వాలల వెల్వరించుచు జగ • జ్జాలంబులం గాల్చు [illegible]
దట నేతెంచు మహాస్త్రముం దొలఁగి పోఁ • దప్పించుకో [illegible]
చల నున్నట్టి సుమిత్ర పుత్త్రుఁగని వై • ష్ణవ్యాంబకం బంటకే
తలఁగం బాటి ప్రదక్షిణంబు గొని యం • తర్ధాన మందెం ద్వరన్.

చ॥ వనచరు లుల్లసిల్లిరి త • పస్వులు లోకము గాచితంచు మో
దనమున గంతులేసిరి ము • దంబున వేల్పులు దేవ సుందరుల్
మనమున నుబ్బి గొబ్బున సు • మంబులు చల్లిరి బ్రహ్మయున్ భవుం
డును వినుతించి రాడిరి క • డుంగడు సంతసమంది రెల్లరున్

మ॥ బలహీనంబయి వైష్ణవాస్త్ర మడఁగెన్ • భావింప వీఁడెవ్వఁడో ?
జలజాక్షుండొకొ ? యెవ్వఁడేని యగుతన్ • శంకింపనేలా ? జగ
ద్విలయంబుం గలిగించు పాశుపతమున్ • వేకూర్చి యీబాలిశున్
జలమాఱన్ వధియించువాఁడ నని యెం • చం జిత్తమం దుద్ధతిన్

ఉ॥ రావణి నిశ్చయంబును స • రాలున దివ్యులెఱింగి యేడిరా
త్రోవ ? జగంబు జీవ నికు • రుంబముతో నశియించునేమొ నేఁ
డీవహి వీనిచేత ? నెదు • రెయ్యది ? దీనిసహించు వారలీ
దేవతలందు గల్గరని • దీనత నొంది కలంగుచుండఁగన్

చ॥ ఇతరు లెఱుంగకుండినది • యీడును లేనిది మున్నువానికిన్
జితమదనుండు సత్తపము • సేయఁగ మెచ్చి యొసంగు నయ్యమో
ఘ తర మహాస్త్రమున్ మది న • ఖండితభక్తి భజించి లక్ష్మణున్
మృతునిగఁ జేసి క్రమ్మఱుమ • మేవడి నంచు వచించి యేయుడున్.

సీ॥ అయ్యస్త్ర మంత గ • దాసి తోమర కుంత, పరశు ముద్గర శూల • వాల నాగ
గరళ భూత ప్రేత • కాల నిర్ఘాతాది, బహుళ రూపంబులఁ • బరఁగి విలయ
కాలాగ్ని సప్త సా • గరములు చండ మా, రుతమును తోడరా • క్షితి మునుంగు
తఱిఁ గప్పు చీఁకట్లు • నెఱసిన వననొప్పె, సౌమిత్రి యురము ల • క్ష్యంబుగాఁగఁ
తే॥ గెరలిలోకత్రయము గిర • గిరనఁ దిరుగు, కరణిఁ దోఁపంగ సుడియుచుఁ • గడఁగిరాఁగ
వానరులు వేలుపులు మని • వరులు జడిసి, మొగిసి కనలేక కన్నులు • మూసికొనిరి.

సీ॥ గడగడ వడఁకుచు • నొడలు చెమర్పంగఁ, గని విభీషణుఁడు ల • క్ష్మణ ! యిదేమి ?
దీనిఁ దొలంగించు • తెరువెయ్యదియు లేదె ? యన నుత్తరముగ హా • సంబొనర్చె
వానర వీరులు • పాదసన్నిధి డాసి, యభయ మభయ మంచు • నఱచునంత
నలుకకుఁ దలుకకుఁ • డని చేయి వీచుచు, జగము లల్లలనాడు • చందముగని
తే॥ పాశుపతమును ధ్యానించి • భావమందు, దీని నడఁపుము వేఱొండు • తెగువ వలవ
దనుచు నొకశర మరివోసి • మొనసి విడిచి, త్రుటిని తన్మహాస్త్రము బలో • ద్యోగమడఁచె.

మ॥ దివిఁ గోలాహలముల్ చెలంగె మొరసెన్ • దివ్యానక స్తోమముల్
భువి శాఖామృగముల్ మదించె వెస నం • భోరాశు లుప్పొంగె నా
ర్ణవ ఘోషంబులు మించె మేఘములు ధ • ర్మం బుబ్బె మోదించి రా
ఘవుఁ గాంచెన్ జయలక్ష్మి శిక్షిత కటా • క్ష శ్రీల హేలాగతిన్.

మ॥ లయకాలంబున సర్వలోకములు వై • కల్యంబుగా జీవ సం
దయము న్నాశము సేయు రుద్రుని మహా • స్త్ర క్రూర వేగంబు నీ
రయమై వ్యర్థముగా నొనర్చిన సుమి • త్రాపుత్త్రిక స్థైర్యమున్
దయివాఱం గని దిగ్భ్రమించి నిలిచెన్ • దైత్యేంద్ర సూనుండటన్.

శా॥ దివ్యాస్త్రం బిదివోయె నంచు మది సం • దేహంబు గైకొన్క యా
త్రవ్యామందు ప్రయోగ చాతురిమ ము • గ్రంబై ప్రకాశింపఁగా
నే వ్యాపన్నత నొందనేల యని కై • నేర్పొప్ప సౌమిత్త్రిపై
నవ్య స్థేమము మీఱనేసె నిభజి • న్నాదంబు గావించుచున్.

శా॥ సుగ్రీవాదులు వేసరిల్లక మహా • క్షోణీధ్రముల్ దెచ్చి సం
వ్యగ్ర ప్రక్రియ నున్న రావణిపయిన్ • వైవన్ విజృంభించి పం
క్తిగ్రీవాత్మజుఁ డంపఱం గురిసి త • ద్వేగంబు వారించి య
త్యుగ్రుండై కని తత్పితృవ్యుఁ బలుకున్ • సోత్ప్రాస వాక్యంబులన్.

## మేఘనాదుఁడు విభీషణు నిందించుట

శా॥ జాతి భ్రష్టునిమాడ్కి నన్వయ యశ • స్సౌశీల్యముల్ జార్చి దు
ర్నీతి ప్రీతిని మర్త్యమాత్రుల తదం • ఘ్రుల్ వట్టి సేవించుచున్
ఖ్యాతిం దోఁచి వారి పాటలకు వె • న్కం దాశముల్ వైచుచున్
నీతిన్ మాలి చరించు నీదుశిరమున్ • నేలం బడం గూల్చెదన్.

శా॥ వీక్షామాత్రన కంపమొందు క్రతుభు • గ్బృందంబు సేవించినన్
నిక్షేపంబులు కూడినన్ భువన ని • ర్ణేతృత్వ మే యబ్బినన్
శిక్షమాన పరాక్రమ స్థిరగుణుల్ • సీత్కారములేయు నీ
కుక్షిక్షిప్రవ నీచ జీవితము నో • క్రూరాత్మ! వాంఛింతురే ?

మ॥ జలముల్ గల్గినచోటనే గలుగు మ • త్స్యశ్రేణి దైత్యేశ్వరుం
డెలమిన్ భాసిలుచోటనే దనుజులున్ • దృష్టింపఁగా నుందురు వా
రలు చేటొందిన వేళలన్ బ్రభునకై • ప్రాణంబు లర్పింత్రు నీ
వలెఁ గాఁజాలరు; లంక నే యసురులం • బాలింతువో మీఁదటన్ ?

ఉ॥ పూర్వము వేల్పుపెద్దఁ దన • బొడ్డునఁ గాంచిన మాయి కేశవున్
గర్వము సర్వముం జెడ వ • గర్చుచుఁ బాఱఁగఁదోలి యొక్కచే
శర్వుని పర్వతంబు గొనఁ • జాలిన మత్పిత రాజ్యభారమున్
నిర్వహణంబు సేయుటలు • నీవిటు కోరుటకా ? కులాధమా ?

మ॥ అరవిందాసన వంశమందు జననం • బందంబుగా నందుటన్
సురలు న్నిన్ను భజింత్రు పుణ్యజన దూ • ష్యుండైన నీవిప్పుడో

నరులం గొల్చుచు నన్న సంపదల భ్రమి • గం జూచుచున్నావు నీ
కరయన్ మానమనంగ నున్నదియె ? మా • యంబౌను మాతోడనే.

శా॥ నిందం గూరిచి వింతచేసి కులమున్ ? నీ చెల్లెలిం బట్టి యా
క్రందింపం దయమాలి ముక్కుసెవులన్ • ఖండించు దుష్టాత్మలన్
సందేహింపక తెచ్చినాడ విక జ్యే • ష్ఠభ్రాతఁ జంపించి లం
కం దైవాఱఁగ నేలుకొందువు గదా ? కష్టాత్మ ! వంశాదనా !

చ॥ గురుహిత బంధుమిత్రులను • కూలిచి కైకొను మేల్మికంటెఁ బే
దఱికమె మేలుకాదె ? రణ • ధారుణిఁ గూలిన యన్నతోడనే
పొరలుచు నేడ్తువో ? ముదము • బొంది బలే ! యని కేకవెట్టెదో ?
నరు గెలుపు న్నుతించెదవొ ? • నారక మందెదొ ? వంశదూషణా ?

మ॥ పసుగుల్ వాజిన కాలకింకరుల గె • ల్వంజేయువారా నరుల్ ?
తెరలన్ మందులచేత జీవములు సం • ధిల్లంగ నిల్చుందు వా
రరయన్ గెల్తురె ? యన్న సంపదల నీ • వందంగ నర్హుండవే ?
శిరముం ద్రుంపక విడితిన్ జగము నన్ • నెగ్గించునన్ శంకమై.

శా॥ భ్రాతృద్రోహివి నీ మొగంబు గనినం • బాపంబు సిద్ధించు నీ
నేతృత్వంబు సహించునే జగము ? నీ నీ • తంబు లాలించునే ?
రోఁతల్ చేఁత లటంచు దూఱు ప్రభుపు • త్త్రిం గాంచి చిర్నవ్వునన్
నీతి ప్రౌఢి విభీషణుండు పలికెన్ • నిర్భీత చిత్తస్థితిన్.

ఉ॥ ధర్మమె తోడగున్ మహిని • ధర్మము తోడుగఁ గొంచుఁ బెక్కు దు
ష్కర్మము లాచరించి నర • కంబునఁ గూలఁగ జాలకుంటి స
త్కర్మముఁ జిక్కఁబట్టితిని కల్లయు వీడితిఁ బంక్తిమస్తకుం
డర్మిలి నిందితంబులకు • నాస వహించిన దాఁకఁ దమ్ముఁడన్.

మ॥ కలుద్రావన్ బరదారగోరఁ గిలుబున్ • గ్రవ్యంబు నాశింప మూ
ర్ఖులఁ జేరన్ బెరసొత్తులం బలిమిఁ గై • కోఁబోవ సత్కర్మలన్
గలహింపన్ బరనిందనంబు తలఁపన్ • గావింప నింద్యమ్ములన్
ఖలులన్ దుర్వ్యభిచారులన్ విడచుటల్ • కారాని కార్యంబొకో ?

మ॥ త్రిజగంబుల్ వినుతించు తత్త్వమగు నా • దేవేశు సర్వాంగి పూ
త జగన్మాత పతివ్రతా తిలకమున్ • ధర్షించి బాధించుటల్
త్యజియింపం దగునంటి దీనవగు నా • తప్పేమి ? నీ తండ్రి య
ల్క జనింపన్ననుఁ వెళ్ళఁగొట్టనట ని • ల్వంబోలునే తెల్పుమా ?

ఉ॥ క్రొవ్వున ధర్మముం గనక • కోపము కామము వేల్పుగా మదిన్
నివ్వటిలం దలంచు మిము • నిత్య సుఖంబులె యొందనిమ్ము మ

మ్మవ్విధిసేని నింద యెల • యిఁకఁగ రౌరవ మందవిమ్మిఁకన్
ద్రివ్వలు సాగు దుష్కృతము • త్రెవ్వక యుండునె ? ధర్మమోడునే ?

ఉ॥ జ్ఞానులకున్ సుగమ్యుఁడగు • సత్యవిహారుని రాముఁ జేరితిన్
మానుగ సర్వలోకములు • మన్నన సేసెదుఁ గాక నిందయే
హాని యొనర్చుఁ గాక భువిఁ • బొందుఁదు మీరలు మేలునేని కీ
డేనియు నంచు మాలమిడి • యిట్టటు నార్చుచుఁ బల్కి పిమ్మటన్.

ఉ॥ రావణి వల్కి నీతలఁచు • రాజ్యము వేలములెల్ల నిల్చునే ?
నా పల కేలనున్న యొక • నారసమంటినఁ దీఱుఁగాక నేఁ
డావలి కెట్టులేగె దని • యల్కను తార్క్ష్యని పోలు బాణమున్
జాపుమ యంచు వీడెఁ దన • చాపముఁ జక్రముఁ బోల [illegible].

తే॥ కీలయనఁ బరుగన భువు • కూలమనఁగ. వచ్చుటను కాంచి మిత్రుండు • వచ్చెఁ బచ్చె
ననుచుఁ బ్లవగు లాక్రోశింప • నమరులెన్న. మించి సౌమిత్రి నడుమనే • త్రుంచె దాని

క॥ తన విశిఖము తునియఁగ రా. వణి వెండియు భల్ల మొంకు • వడినేయ విభీ
షణుఁ డాఁకనీక నడుమనె. తునుకలుగా లక్ష్మణుండు • తుండించె వెసన్.

శా॥ తన్నుం జంపఁగ నుద్యమించె నను కాం • తాళంబునన్ సత్య సం
పన్నుండైన విభీషణుండు ఘన భా • స్వ ద్దండముం బూని యా
పన్నుండైన బలారి జిద్రథము న • శ్వశ్రేణితో సారథిన్
ఛిన్నాభిన్నము చేసి యార్చెఁ బ్లవగ • శ్రేష్ఠుల్ ప్రమోదింపఁగన్.

చ॥ చెడిన రథంబుపై నిలిచి • చిందఱగొన్న దశాస్యసూతి నె
వ్వడిని సుమిత్రపట్టి పయి • వానరపాళిపయిం బితృవ్యుపై
జడిగొను పోల్కి శాత శర • సంఘములేసి రణస్థలంబు నె
య్యెడఁగన రక్తసిక్తముగ • నేర్తెఱఁజేసి మదించి యార్చుచున్.

చ॥ మురియని వేరులేక వెస • ముమ్మరమైన దుఃఖంబు సేయఁగా
నరిది యటంచు మానసము • నందు దలంచి క్షణంబులోన నం
బరతల వీథికేగె నను • వార్త కపీశ్వర వర్గమందు తీ
వరపడి పర్వఁ బంక్తిముఖ • ధర్మ గృహంబున కేగె నత్తఱిన్.

## 27. ఇంద్రజి ద్వధ పటలము (71)

మ॥ గగనంబందు మొయిళ్ళ డాఁగె నను శం • కంబొంది మున్నోలెఁ బె
ల్లిగ మాయల్ పచరించు నంచుఁ బ్లవగుల్ • మోమోడి కన్పించ నా
శగ వేగంబున మేను రక్తమయమై • స్రుక్కింపఁగా వచ్చు మె
చ్చగు పుత్త్రింగని రావణుండు చలిత • వ్యాపారుఁడై యిట్లనున్.

ఉ॥ పూనిన నీమఖంబు పరి • పూర్తి వహించి యొసంగదంచు నీ
మేని వ్రణంబులే తెలిపె • మిక్కిలి క్లాంతిని పొంది కంపముం
బూని ఖగేంద్రుఁ గన్న యహి • పోలిక నుంటివి కారణంబు నా
వీనులు మానసంబు విన • వేగిరపాటు వహించెఁ దెల్పవే.

చ॥ అనవుడు నిట్లనున్ దశము • ఖాత్మజుఁ డూనిన మాయలెల్ల నీ
యనుజుఁడు దెల్ప వారలొగి • యజ్ఞము విఘ్నము సేసి రంత నేఁ
గనలి పరాక్రమంబు నొడి • కంబును తెంపును చూపి పోరితిన్
వనజజ విష్ణు రుద్ర శర • వారము లక్ష్మణుఁ డోర్చె నేమనన్ ।

చ॥ అతులిత వైష్ణవాస్త్ర మొగి • నా రఘువర్యుఁ బ్రదక్షిణించి కుం
చితగతి నేగెనన్న విర • చింపఁగ వెండి మహాస్త్ర మొక్క దం
చితముగ నున్నదేమి ? కడు • చేటు మనంబునఁ గోరి కోరి యీ
వితమునఁ దెచ్చికొంటి విది • వీడునె యెన్నివిధాలఁ జూచినన్ ?

చ॥ కడఁగి విరించినాస్త్రము జ • గమ్ము నశించున యన్న భీతిచేఁ
దొడఁగఁడు దాన నే గెలువు • తోఁ జనుదెంచితి మున్ను నేఁడు నా
కడఁకలు సాగవయ్యెఁ జులు • కన్ స్వబలంబున నన్ను గూల్పఁగాఁ
దొడఁగె జగంబు లొక్కరుఁడె • దోరుప శక్తుఁడు లక్ష్మణుండనా ?

చ॥ జంకితినంచు నెంచకుము • జానకిపైఁ గల యాస వీడినన్
గింకను వీడి శాంతి నవ • గీర్ణ చరిత్రులు రాఘవప్రభుల్
లంకను వీడువారు మన • లన్ క్షమియించెడు వారు నీ సుహృ
త్కింకర పుత్త్రబంధు బల • కీర్తులు మాయక నిల్చు నావుడున్.

చ॥ భుజములు సంచలింప క్రొద • ముల్ నవచంద్రికలన్ వెలార్చ బే
రజముగ నవ్వి రావణుఁడు • రాజస మొప్పఁగ నింక నీవు భూ
భుజుల పయిన్ దురంబునకుఁ • బోవవు భీతియుఁ జింత యేల ? య
క్కజముగ నేన యేగి యొస • కంబున వారలఁ జంపి వచ్చెదన్.

ఉ॥ ఉండినవారు గెల్తురని • యుండెడువారు జయింతురంచు నీ
దండిత నంబు నాకు నుచి • తంబుగఁ దోఁచుడు నెంచు నమ్మ యీ
కొండిక యొంటరమ్మ మది • గోరి పొసంగ వహింప లేదు మ
చ్చండ భుజాబలంబు నెల • సంబున నమ్మియె కొంటి నీపగన్.

ఉ॥ పేదతనంబు తెల్పితివి • పేరిమి వింశతి చండబాహు సం
పాదిత కీర్తి గేయములు • పాడ కొనన్ జగమందు నిర్జరుల్
మోదిలి చూచుచుంద నని • బుద్బుద దేహము పాతుఁగాక యా
పైదలి వీడువాఁడ నను • వార్తయుఁ బుట్టునె నోట ? బాలకా ।

చ॥ ఇలను జయంబు నేను గడి • యింపక పోయిన రామ నామమున్
నిలుచునయేని నాయధిప • నిల్వకపోపునె ? యిాల్గు పెన్నఁడేఁ
గలదియ రాదె ? యెల్లరను • కాలము మ్రింగుచు నున్నదే కదా ?
కలుము లయంబు జీవులకుఁ • గల్గదు కీర్తికి నాశ మెన్నఁడున్.

చ॥ విడిచితి సీతనన్న నుడి • వీనులఁ బడ్డ క్షణంబులోపలం
బొడవునఁ గిట్టి కట్టి కొని • పోదురుగాక నిలింపు లింతయున్
జడియుదురే ? జగంబులఁ బ్రి • శస్త బలంబున గెల్చి కీర్తిం
బడసిన యేను నప్పటికి • పందలు పొందెడు చావు చత్తునే ?

ఉ॥ పెక్కు లిఁకేల ? నీవరిగి • వేశ్మముచేరి శరీర మెల్లెడం
దక్కక గ్రుచ్చుకొన్న నిశి • త ప్రదరంబులఁ బుచ్చివైచి నీ
త్రొక్కటపాటు దీర్చికొని • దుఃఖము వోవఁగ నిద్రసేయు మే
నొక్కఁడ నేగువాఁడ నని • యుగ్రత లేమయుఁ దేను కెమ్మరన్.

చ॥ జనకుని పాదపద్మములఁ • జాఁగిలి చేతులు మోడ్చి నాపయిం
గనలకుమీ క్షమింపుమి జ • గజ్జన విశ్రుత గేయ ! యిప్పుడే
చనియెద సంగరంబునకు • శాంతిలు మే మరణించు పెక్కునై
నను కలయింపు నాదు • వచనంబుల నీకు నెఱుంగ నయ్యెడున్

చ॥ అని రథమెక్కి పద్మజ వ • వాదు లొసంగిన యాయుధంబులం
గొని తగ నర్చి కోటులకుఁ • గోరికలెల్ల నొసంగి బాష్పవాః
కణములు నిండినట్టి కడ • కన్నులఁ దండ్రిని చూచి చూచి నె
మ్మనము దృఢంబు చేసికొని • మార్తుర మీఁదికిఁ బోప వెల్వడెన్.

ఉ॥ లంకను గల్గు దైత్యులు క • లంగుచు నిన్నెడఁ బాయలేము మ
మ్మింకిలి సేయఁబోకు మిదె • యందనె వత్తుము వత్తుమంచు న
ల్వంకలఁ జుట్టిరా జనకు • వారిక కిన్నిడి కావుఁడీరు నా
యంకులతోడ శాత్రవుల • నంతకు ప్రోలికి నంపి వచ్చెదన్.

మ॥ అని యూరార్పఁగ దైత్యకామినులు చిం • తాక్రాంతలై కాంచి నా
యన! నీముద్దు మొగంబు చూడకెటులీ • ప్రాణాలతో నుందుమో
చనుదెంచెం గదె కాళరాత్రియయి యా • క్ష్మాపుత్రి యీలంకకున్
జనువారల్ చనువారలే గద ! వినా • శం బిట్లు రాఁగూడునే ?

చ॥ అని విలపింప వారల క • టాక్ష పరంపర దాఁటిపోయె; మా
యను గొని దాఁగి యింద్రజితుఁ • డావలికేగెనొ ? మోసచేయఁడే
మనెదు విభీషణా ! యనుచు • నాడుచు లక్ష్మణుఁడుండ వాని స్వం
దన విరవం బకాండ జల • ద ధ్వనినాఁ గవిసెన్ శ్రవంబులన్.

సీ॥ పసిఁడి కంబములతో • వలలు పెక్కెంబులు, పిడుగులఁ బోలిన • బిట్టు రవము
వరరత్న ఖచితమై • మెఱుపుల కిల్లయి, ముల్లోకముల కేగ • మొనయునదియు
జలధులు గలఁగంగ • జగములు వడఁకంగ, దిగ్గజంబులు తెల్వి • ద్రగ్గి క్రగ్గఁ
ప్లవగబలము గుండె • లవియఁ గులాద్రులూఁ, టాడ ధూళియు రేగ • నవని వీఁగ
తే॥ శేషు శిరములు చలియింపఁ • జేరెరథము, రాక్షసులగర్జనంబు ఘో • రముగఁ జెలఁగె
నింద్రజితుఁడు క్రూరాస్త్రంబు • లేసి యార్చె, లక్ష్మణుండు ప్రత్యస్త్రంబు • లంగవించె.

ఉ॥ మాయలు దుస్తరంబు లతి • మానుషముల్ గల వీని నిప్పుడే
మాయఁగఁ జేయవేని జయ • మార్గము నవ్వలఁ గాంచలేవు సు
మ్మీ యను నవ్విభీషణుని • మేలి వచస్సుల నాదరించి దై
తేయునిమీఁద లక్ష్మణుఁడు • తేపలుగాఁ గురియించె బాణముల్.

చ॥ ఇరువురు నెచ్చుకుందు కన • నేర్పడకుండ గ దూపులేయఁగా
శరమయమయ్యె బెట్టిదపు • శబ్దముతో రణరంగమెల్ల వా
నరులును దానవుల్ చెదరి • నక్కురి పల్లములందు మట్టు లి
ట్లిరువురు మీఱి మీఱి కురి • యించిరి దొడ్డగ బాణవర్షమున్.

చ॥ నడుమనె దానవాస్త్రములు • నాశము నెందఁగ రాఘవాస్త్రముల్
తొడరి యతిక్రమించి కొని • తూఱుచు రావణి మేనిరక్తముం
గుడిచెను దానవాస్త్రములు • కొన్ని మరుత్సుతు మేనఁ బుట్టలో
నిడుపని పోల్కెఁ దూఱి గమ • నింప నుపేక్ష యొనర్చె నాతఁడున్.

మ॥ విషముం బోలిన తూపులం బలపి పృ • థ్వీనాథపుత్త్రుండు రా
క్షసనాథాత్మజు కోదండంబు సురలెం • చం ద్రుంచె దైతేయు నా
రసముల్ లక్ష్యము దప్పించున్ గుఱికిఁ జే • రంబోక క్రుంగారుచున్
బసమాలెం గ్రథనక్రియల్ చలుపు త్రో • వన్ సత్త్వహీనంబులై.

మ॥ విలువిద్దెం దన నేరుపుం బలము గా • న్పింపంగ వీలుండమిన్
బలభిద్ద్వేషి పులస్త్యమౌని తనకున్ • వాత్సల్య సంపూర్ణుఁడై
కలనం దోడని యిచ్చు కుంతమును వీ • కన్ వైవ మౌనీంద్ర వా
గ్బల సంకాశ శిలీముఖంబున నడం • గం ద్రుంచె సౌమిత్రియున్.

ఆ॥ మేకు లూన్చినట్లు • మేన లక్ష్మణ శరా, వళులు పొడువ నింద్ర • వైరి పురల
నలుఁగు లేయుచుండ • నాతని తూణంబు, తునిఁగిపడఁగ రాము • ననుజుఁ డేసె

ఆ॥ తేరు గలుగ వీఁడు • తెరలఁడు లొంగఁడు, ననుచు హయుల నేసి • యతఁ గకునికిఁ
బగ్గములను తెగమి • పరికించి సారథి, శిరము ద్రుంచి వైచెఁ • జిత్రగతుల.

ఆ॥ ఇంద్రియములు కలఁచి • యేఁపఁ దపించు త, పస్వి మనముపోలెఁ • బడుపుఁ జెలి ప
తిప్రతాత్వ సరణిఁ • దీండ్రించి స్వేచ్ఛను, పూనెఁ జోదకుండు • లేని తేరు.

తే॥ పరుగువాఱుహరులఁ బట్టి • పఱపి తానె, తనయురంబె తూణముగఁ గ్రుచ్చినశరముల
వారివారి లక్ష్మణుపయి • మారుతిపయిఁ, బెరలపై నేసి చేసెను • వీర రవము.

శా॥ వీరాగ్రేసరుఁ డీతఁ డీతని మహా • వీరత్వ మెందేనియుం
బేరుం గాంచిన ఘోరవార విలస • ద్వీరత్వ మాత్రంబొకో?
వీనిన్ మృత్యువు దాసినన్ గడఁకయుం • గ్రోద్ధత్వమున్ వీడ రె
వ్వారో వారలె ఘోరులంచు విరులన్ • వర్షించి రాఖేచరుల్.

శా॥ నాయమ్ముల్ తనమేనఁ దీసి పఱపెన్ • నామీఁదనే చెల్లరే!
యాయమ్ముల్ మనమున్ గలంగువడి నా • యమ్ముల్ ప్రసారించినన్
గాయమ్ముల్ గణియింపఁడున్ సురుఁగఁడు • త్కంపింపఁడున్ సోలఁడున్
మాయమ్మో గద వీనితోఁ గడిమి సా • మర్థ్యమ్ము లిబ్భూమిపై.

మ॥ అని సౌమిత్రియు మెచ్చి యాడఁ గని వీఁ • డాకాశము జేరునో
ఘనమాయల్ పచరించునో పగటనే • ఖండింపు మీదైత్యు దం
డన సల్లంచు విభీషణుండు పలుకన్ • దర్పంబు గ్రుంగారు నీ
దనుజుం డెక్కడి కేగువాఁడని సుమి • త్రాసూతి మందస్మితిన్.

చ॥ ఎచ్చటికేగినన్ విడక • యేగి మదీయ శిలీముఖంబు లీ
మ్రుచ్చును గ్రుచ్చి చంపు; బల • మున్ జలమున్ దిగఁజాఱె వీఁడికన్
జచ్చెడువాఁడ కాక మఱి • చావక తప్పి చనంగ నేర్చునే?
చిచ్చుల పిడ్గులట్టి కడు • చేవ చెఱంగు సలుంగు లుండఁగన్.

తే॥ అనెడు సంతతరక్తకా • యంబుతోడ, రథమునను వేయి కరములు • పరపుచుండఁ
గనకరథముపై నభమున • జనఁగలేచు, నింద్రజితుమాడ్కి రవియుద • యించె మింట.

తే॥ తెల్లవాఱె ననుచు వెల్గె • దినకరుండు, రక్కసులఁబోలు చీఁకటుల్ • స్రుక్కి సమసె
వంచనములెల్లఁ దొలియ రా • పణియుఁ గూలె, ననుచు నఱచిరి వేలుపు • లంబరమున.

తే॥ కీర్తికర భుజబలశూర! కృత్తివాసుఁ, డొసఁగు శిరుండఁ గేల వి • ల్లెసఁగు చుండ
వీఁడు చావఁడయ్య! యని వి • భీషణుండు, లక్ష్మణుని హెచ్చరించె నా • లంబునందు.

మ॥ శర సంధాన చతుర్ముఖుండయిన యా • సౌమిత్రి యా పచ్చనౌ
ఖపువుల్ చావపు పళ్లెమట్లుగల చ • క్రంబుల్ తునాతునకలై
మఱియుంబోవని నిశ్చయించి చటులన్ • మూలంబు గుర్తించుచున్
విరియంగాఁ గడచీలలన్ విఱిచె వె • వ్వేత్తై పడం జక్రముల్.

తే॥ చీలలూడఁ జక్రంబులు • చెదరి వేఱు, పడగ నరదంబు చదె వారు • వములు తరువు
గొడ్డటం బడఁగొట్టఁ బ • క్షులు కలంగు, వరణి సత్త్వహీనంబులై • ధరణిఁ ద్రాలె.

కం॥ రథ మవియఁగ నందలి యా, యుధములు నొండొండ పైపై • యుడిపోవ వియ
త్పథి కిరిగె యసుర జగములు, నిధన భయం బంది కలఁగు • నెఱి గరించెన్.

క॥ మేఘనిభ దేహుఁడగు నా. మేఘరవుఁ డు వొంచి దొడ్డ • మేఘములందే
మేఘముకై వడి శిలల న. మోఘముగా గురిసె వరము • వో౯డిమి వలనన్.

తే॥ దిక్కు చోఁపక వానరుల్ • క్రుక్కి శిరము. లురము లగలంగ ధరణి • నురలఁ గాంచి
లక్ష్మణుఁడు త్రివిక్రము మేని • లలి నభంబు. విశిఖ కాయమానంబు గా • వించివైచె.

తే॥ వైశ్రవణి యెదిరించు స • త్త్వము కృశించె. సల్లనైన యాకాశంబు • నడుమ నొక్క
యెట్టి మొగులునా నుండిన • యింద్రజితుని. మేనిజాడ లక్షించె సౌ • మిత్రి యపుడు.

క॥ ధనువు తునుంగకుండిన నా. ధనువుగొను కరంబు తునింగి • ధరణిం బడదే
యని తలఁచి త్రెవ్వనేసెను. మనకరమున్ గంకణాది • కముతో నురలన్

ఆ॥ విలయ మారుతంబు • వీవ మేఘంబింద్ర. ధనువుతోడఁ బడిన • యనువుదోఁప
వానిచేయి వడియె • నూనిన ధనువుతో. మణి విభూషణములు • మలసి వెలుఁగ.

తే॥ బాలచంద్రు శేషుఁడు పట్టు • పగిది నొప్ప. వ్రేళ్ళతోఁ జుట్టి పట్టిన • వింటితోడఁ
దరుబు శిలబు కపులు నల్గ • దనుజుకరము. ధాత్రిఁ బడి తకపికలాడి • తల్లడిల్లె.

తే॥ సూర్యుఁ డురలక చంద్రుఁడు • స్రుక్కకుండఁ. మేరుగిరి దొరలక శక్ర • వైరి కరము
పడుటగవి యంత్రముంబోలు • బ్రతుకునందు. మోహమేలని విబుధ స • మూహమనియె.

ఉ॥ అంచిత పుణ్యు లక్ష్మణుని • యస్త్రముచేత నసత్య మల్పమౌ
నంచుఁ దలంచు రావణుని • యగ్రసుతుండు కలంకచిత్తుఁడున్
పంచకుఁడైన యింద్రజితు • బాహువు త్రెవ్వి ధరిత్రిఁగూల రా
త్రించరులెల్లఁ గాంచి తల • ద్రెవ్విన తీరునఁ గుంది రయ్యెడన్.

ఉ॥ వానరనాయకుల్ చెలఁగి • వారక సింహరవంబుసేయుచున్
దానవసేనలం దఱిమి • దంత నఖావలిచేఁ బదాహతిన్
బీనుఁగు పెంటచేసి యల • వేల్పుల లోకము క్రొత్త సంపృతుల్
జానుగ నిండి మెండుకొను • చక్కటి తక్కక చేసి రత్తఱిన్.

ఉ॥ నీలగళుండు మున్ను కరు • ణించి యొసంగిన గొప్ప శూలమున్
గేల ధరించి శత్రు నవ • గీర్ణచరిత్ర మెఱుంగలేని నిన్
నేలకుఁ ద్రోచికాక మఱి • నీలుగనంచు మహానటుండనన్
గాలియనంగఁ జిప్పఁగఁ • గ్రాలి దశాస్యకుమారుఁ డేఁచఁగన్.

మ॥ పరమార్థం బగునేని రాఘవుఁ డు స • త్త్వం బూఁదియున్నేని యు
ర్వర ధర్మంబు జయించునేని బలభి • త్ప్రత్యర్థి శీర్షం బిలన్
దొరలుంగాకని లక్ష్మణుండు విలస • ద్దోస్సార మేపారఁగా
శర మాకర్ణము లాగి వీచె జగముల్ • సంతోషముం బొందఁగన్.

తే॥ చక్రశూలబ్రహ్మాస్త్ర వ • జ్రములు సిగ్గు. నొందనమ్మహాశర మగ్ను • లుమియుచుఁ జని
యింద్రజితుని శిరము ద్రుంచి • యిలను కూల్చి. వేలుపుల పూఁవానలో • వెలసిమలసె.

సీ॥ తెగిన శిరంబు పై • కెగిరి పగరమున్నె, విజయ మారుతముచే • విఱిగి పడిన
పిడుగులు మెఱుపులు • బెడిదంబులగు రాల, మేఘమ్ము క్రైవడి • మేఘనాదు
నొడలు శూలముతోడఁ • బొడుచుకొన్నట్టియు, మ్ములతోడ బరువయి • పుడమిఁబడియె
దంష్ట్రలనెడు విధు • ద్వయముతో గురు శుక్రు, లను మండలములతో • ఘన విశిష్ట

తే॥ కేశ పాశమనెడి రక్త • కిరణవితతి, తోడ రవిమండలము కాల • ధూతమగుచు
ధరణి కొఱఁగిన తెఱఁగునఁ • దనరి వాని, తలయు దబ్బునఁ బడియె ను • ద్దండభంగి.

ఉ॥ జీవుఁడు దేహ సంస్థితిని • చెందక యవ్వలి కేగినంత నా
త్రోవనె యంతరింద్రియ త • తుల్ చనుకైవడి రాక్షసావళుల్
రావణి కూలునంత సమ • రస్థలి నాయుధరాజి వీడుచున్
ద్రోవ యెఱుంగ రాక పలు • త్రోవలఁబోయెను దిక్కు తోఁపమిన్.

శా॥ అస్త్రాభ్యాస విశారదుండయిన హ • ర్యశ్వారి యుక్కాఱఁగా
నిస్త్రింశంబగు దైత్యపాలనము వ • న్నెల్ మాసె నంచార్చుచున్
వస్త్రంబుల్ వెస వీచుచున్ సురలు పై • పశ్యంబునన్ బ్రేమమన్
శస్త్రం బూనిన జైనదేవతల యో • జం బూని రప్పట్టునన్.

మ॥ అరవిందాసనుఁడున్ మహేశ్వరుఁడు కం • జాక్షుండు నింద్రాది ని
ర్జరులున్ దివ్య మొగంబుగాక పెరవ • ర్గంబుల్ వనాటావళుల్
పెరిమం జూడఁగఁ జాలకాలము నభో • వీథిన్ మనోమోద సం
భరిత ప్రేమను నిల్చినారలు మహా • పర్వంబు సంధించుచున్.

మ॥ అనిలో రావణిచే నిశాచరులచే • సంత్యస్థితిం బొంది మా
లిన కీశావలులెల్ల జీవముల నో • లిం గాంచి పూర్వంబు కం
టెను సత్త్వం బొదవంగలేచిర విరా • ద్గేయాను కంపాప్తి స
ద్గుణులం బీడ లంపనన్న సుజనో • క్తుల్ కల్లలౌనే ధరన్ ?

తే॥ అసుర తలగొని ముందుగ • నంగదుండు, జరగె వేలుపు లొత్తుగఁ • జల్లుచున్న
విరుల పందిరిక్రింద వా • నరుల నడుమ, హనుమపైఁ జనె సౌమిత్రి • యన్నకడకు.

క॥ పొనుపడు ఖేదంబును మఱి, పెనుపడు మోదంబు గలుగు • పృథ్వీపతి సం
తసపడఁ గేలం దలఁగొని, మునువడ నపుడెంచు వాలి • పుత్త్రుఁ గనియెన్

క॥ చందురు కలఁకంబదె నా, కుం దనరిన నింద తొలఁగ • గురుతర కీర్తిం
జెందితి ధర్మము కఱచెన్, పం దలఁగని కీడు రాని , భాగ్యముఁ గలదే ?

క॥ లంకాధిపతి కుమారు వి, శంకటగతి లక్ష్మణుండు • చంపఁగఁ గనుమం
దంకించి శిరము దెచ్చితి, వింకే నెత్తితిని శిరము • నెనసితి జయమున్

సీ॥ వేలుపుల్ దలయెత్త • వేదముల్ తలయెత్త, ధర్మంబు తలయెత్తఁ • దపములెత్త
మఘవుండు తలయెత్త • మౌనులు తలయెత్త, సత్యంబు తలయెత్త • సత్త్వమెత్త
జగములు తలయెత్త • జనములు తలయెత్త, దయయును తలయెత్త • నయమునెత్తఁ
బ్రేమంబు తలయెత్త • నేమంబు తలయెత్త, శాంతియుఁ దలయెత్త • దాంతి యెత్త

తే॥ సత్పథంబులు తలయెత్తఁ, సాధులెత్త, ముక్తిచింతయుఁ దలయెత్తఁ బుణ్యమెత్త
నంగదా! తలదెచ్చితి • వధిక ముదము, హత్తినాఁడవు నేఁ దల • యెత్తననుచు.

ఉ॥ ఏమగునో యటంచును జ • యింపదె ధర్మమె యంచు లక్ష్మణ
స్వామియె గెల్చునంచు విసు • వాసముతోఁ దనరాక సంతత
ప్రేమను వేచు నాభరతు • పేఁకను తమ్ముని రాక వేచు నా
రాముఁడు కన్నులార నెదు • రం గనె డాయుచునున్న లక్ష్మణున్.

మ॥ పగవానిం దెగటార్చి వచ్చిన ప్రియ • భ్రాతన్ బ్రతీక్షించుచో
మిగులం గన్నుల రాలు నశ్రువులు నె • మ్మిన్ వచ్చెనో? నెమ్మదిం
బొగులన్ వచ్చెనొ? మోదధారలొకొ? యె • మ్ముల్ పీరుగాఁజేయు జా
లి గదింపన్ వెలివడ్డ ధారలొకొ? శీ • ఖింపన్ సుసాధ్యంబొకో?

శా॥ సంతోషామృతధారలున్ బ్రవిమలో • త్సాహంబు నుత్కంఠ వి
క్రాంత స్ఫూర్తి వెలుంగ సన్నిహితుఁడౌ • రామాంఘ్రి సాన్నిధ్యమం
దంత! ప్రీతి సమర్పణంబు సలిపెన్ • బ్రాణాంతమందైన ని
క్లాంతిం బొందని వీర లక్షణ విధా • క్రాంత ద్విష న్మర్దమున్.

మ॥ తిలఁజూచున్ జయలక్ష్మిఁ దాల్చిన భుజా • స్తంభంబుఁ జూచున్ మహా
బలసూనుం బరికించు లక్ష్మణ ధను • ర్బాణంబులన్ గాంచు వే
ల్పుల చేష్టల్ దిలకించు లక్ష్మణుని తెం • పుం దేటి చూచున్ ముదా
కలనన్ మీఱిన రాముఁ డేమియు నెఱుం • గన్ లేక మౌగ్ధ్యంబునన్.

సీ॥ అనవృశుఁడును సుగు • ణాంభోధి రాముఁడు, తనపాదములకు వం • దన మొనర్చు
తమ్ముని కాలాంబు • దమును సంధ్యారాగ, మెనసిన చందాన • నిమ్ము మెఱయ
నీలాచలముమీఁద • బాలభాను మయూఖ, ములు ప్రసరించిన • పొలుపు వెలయ
తొమ్మున భుజమునఁ • గ్రమ్మిన రుధిర క, ణమ్ములు తనమేనఁ • బమ్ముకొనగ

తే॥ గాటముగఁ గౌఁగిలించి నా • కడకు జనక, పుత్త్రి వచ్చి చేరినదని • ముదము గాంటి
ధరణిఁ దమ్ములఁ గలుగు వా • డరుల కలుకఁ, దనెడు వాక్యంబు నెలకొల్పి • తయ్య నేఁడు.

తే॥ అనుచుఁ దమ్మునిక్లిష్టభుజముల • నలయుచున్న, తూణములఁ దీసిఘుజ తను • త్రాణములను
విడిచి వ్రణముల మెల్లనఁ • దుడిచియొత్తి, శ్రమమువోకార్చి తాను మో • దము వహించె.

తే॥ పురుషపుంగవ! యీగెల్పు • పౌరయుటరయ, నీవలనఁగాదు హనుమంతు • నేప్పవలనఁ
గాదు దైవంబుచేఁ గాదు • కాదు నిజము, మన విభీషణుచే నని • వినుతిచేసె.

## 28. రావణ శోక పటలము (61)

తే॥ దరులు గిల రక్త జలధిని • దాఁటి దైత్య. దుఃఖసాగరమును దాఁటి • దూత లప్డు
గుహను చొచ్చు పుచ్చునఁ జెను • గోపురంపు. ద్వారమునఁ జొచ్చి రావణు • దరికిఁజను

క॥ ముంగిళ్ళను నిలిచిన దై. త్యాంగన లతిదుఃఖజలధి • యడుగునఁబడి క్రుం
గంగని నేఁటికి లంకయె. గ్రుంగె మహాంభోధి ననుచుఁ • బోయిరి దూతల్.

ఆ॥ పండ్లు నోరు మనసు • ప్రాణంబులును కాలుఁ. గేలు వడఁకుచుండ • గిలి కుదింప
నీకుమారకుండు • నేఁటికి లేఁడయ్యె. ననిరి చారు లాద • శాస్యుఁజేరి.

ఆ॥ అచట నుండినట్టి • యమరులు నమర మా. నినులుఁ దిక్కువారు • నేఁడు జగమె
నాశమందు ననుచు • నడుఁకుచు దెసలకుఁ. బరుగులిడిరి పంక్తి • వదనుఁ జూసి.

ఆ॥ కినుకఁ గనులనుండి • కిత్తి కణంబులు. రాల నుఱిమిచూచి • రావణుండు
కత్తిదూసి చరుల • కంఠముల్ తెగనేసి. కేలు వడఁక నేలఁ • గూలినాఁడు.

ఆ॥ పుత్త్రశోకవహ్ని • ముఖములఁ బుట్టి ని. శ్వాసమునఁ బెరింగి • చక్షులందు
వెలిఁగి దెసలఁ బరవి • విలయాగ్ని యే దశ. వదనుఁ జేరె ననఁగఁ • బ్రజ్వరిల్లె.

ఆ॥ ఒడలు వడఁకఁ బుడమిఁ • బడి యడలుటచేత, నవని శేషుఁ దదరి • యలుగులపడ
వెలలు కోపవహ్ని • వలన బాడబమె పై. కుబుక జలధి యుడుకు • నోజ నుడికె.

తే॥ తాపవహ్నియుఁ • బైపయిఁ • దనరు ప్రేమ, వనట యదరఁగ నియవది • కనులనుండి
యురలు బాష్పప్రవాహంబు • కరఁగి యుబికి. పరవి పరుగిడు తామ్రద్ర • వంబుఁబోలె

క॥ కటకటపడి రదనంబుల . బటపట గీఁటుచును పిడుగు • వలె బెడిదముగా
నటమటపడ నిం మో దెను. తటపటమని జీవకతి మె • దల్ సుడివడఁగన్.

ఉ॥ కాలిన పుంటిపైఁ గదఁగఁ • గాఁచిన శూలముఁ దూర్చినట్లుగాఁ
దాళఁగలేక క్రుక్కి వసు • ధంబడు సోలును లేచుఁ గ్రుంగుఁ జిం
తాజ్వరుఁడై కలంగుఁ దన • యా ! యను హా ! యను విహ్వలించు నిం
కేల జగంబు జీవధన • మేగిన పిమ్మట దేహ మేలనుఁ.

ఉ॥ నాయన ! యింత చెట్ట యగు • నా యను నింద్ర విరోధ యింతయే
నాయను నన్ను పీడఁచగు • నాయను వేల్పులు సంతసింపఁ జ
న్నాయను నేను పిల్వఁగల • నాయను శౌర్యము మంటిపాలు గా
నాయనుఁ బౌరుషం బడఁగె • నాయను జీవము పాసెనాయనున్.

క॥ శూలియుఁ గీలియు నవ్వన. మాలియు నెదిరింపలేక • మలఁగినవారల్
లీలగ హేలగ గేలిగ. మేలుగ విహరించువారు • మీఁద సువమునన్

క॥ ఖేచరుల విమానంబులు. గోచరమే కాకయుండు • గోటి కొకండున్
నీచుల రణ విజయంబున. నేచెల ! యీలంకమీఁద • నెగయవె యింకన్ •

క॥ దూతలు పలికిన తీరున, నాతుఁడవ యొకండు తునుమ • నడఁగితివే ? నీ
చేఁతలనే తలపోయు కి, రాతులు యమదూత లెగచి • రా నిన్నలమన్ ?

తే॥ అనుచు లేచును నాయనా • యనుచుఁ బిలుచుఁ. బడును పలవించుఁ దూలును • పుడమిఁ బొరలు
నుడుకుఁ బరితపించుఁ జెమర్చు • నుటిమిచూచుఁ. గనులుమూయును లోఁకోఁచఁ • గళవళించు.

క॥ ఒక శిరము పుత్త్రికా ! యను, నొకశిర మిఁక రాజ్యభార • మోపుదునె కటా !
యకటా వికటంబగు నను, నొకశిర మరినోట నిన్ను • నుంచితినె ? యనున్.

క॥ ఒక శిరము పోయితే ! యను, మెకమొకటి మృగేంద్రుఁ జంపి • మించెనె యను వే
తొక శిరము రాఁగదే యను, సుకముగ నను తడవకున్న • స్రుక్కురుగ దనున్.

క॥ ఒకశిరము హరి గిరీశ. స్వకరాయుధములకు నపయ • శముగూర్చి వికా
విక నవ్వు నీ మొగము చూ, పక పోయితె యింకఁ జూడఁ • బనుపదునె ? యనున్

క॥ ఒకశిరము నీవు చన్నఁ, గకవికయగు నామనంబు • కష్టించుచుఁ దో
డొకయింతలేక మలఁగును, సుకుమారా ! తండ్రిఁ దేర్చఁ • జూడవొకో ? యనున్

క॥ ఒక శిరము నిర్జరేంద్రుని, మకుటముఁ దివియంగ నంరి • మగువలు సుమముల్
ప్రకటించి చల్ల వెలసిన, మొకమును పొలికలనిఁ గాంతు • మో యని పొగులున్

క॥ ఒక శిరము యక్షవనితలు, వికట భవద్ఘోర రవంబు • విని తమతను కు
త్తుకలఁ గల సూత్రములఁ దడ, వికొనుట నిఁకమీఁద లేక • విహరింతు రనున్

క॥ ఒకశిర మపార బలద, ర్పక ! నీ సన్నిధికి వచ్చి • వైవస్వతుఁ డం
దిక నసువులు గొనఁజాలం, డిఁక నసువిడి యేజగమున • కేగితివో ! యనున్

క॥ అని యిటు పనవుచు రావణుఁ, డనిలజవంబునను సంజ • యాంస మనఁగాఁ
జను పొలికలనికిఁ జని తన, తనయు కళేబరము నచటఁ • దడపంజొచ్చెన్.

క॥ సేవకులగు సుర లసురలు, రావణుతోఁ బరుగులిడిరి • రణరంగమునన్
భూవలయంబుఁ జరాభర, జీవనితతితోడ నేమి • సేయునో ? యనుచున్.

ఉ॥ కన్నునఁ బంక్తికంఠుఁ గని • వంక పిశాచ గణంబు లయ్యెడన్
ఖిన్నతనొందినట్లు పరి • కించి ప్రలాపముసేసెఁ గొన్ని పెన్
విన్ననమొందెఁ గొన్ని పల • వించి పదంబులవ్రాలెఁ గొన్ని యా
పన్నతఁ గొన్నిచేరె శవ • వారణ కాయ నికాయ మధ్యమున్.

చ॥ కొడుకు కళేబరంబుఁ గనఁ • గోట్లకొలందిగఁ జచ్చి కుప్పలై
పడిన తురంగ సంఘముల • వారణవారములన్ భటాలి సం
గడముల శీర్ణమైన ఘన • గాంగ శతాంగములందు నంతటన్
గడఁకను త్రోచిత్రోచి వెద • కఁదొడఁగెన్ దినమెల్ల నయ్యెడన్.

మ॥ హృదయావేగము నేయిచే సరయు వ • హ్నింబోరి వర్ధిల్ల నం
గదచేఁ గన్నుల సిరుపొంగి పారలన్ • గ్రవ్యాదలోకేశుఁ డా
కదనక్షోణి బలిష్ఠ బాహ్వర యుతో • గ్ర స్ఫార హీర ప్రభాం
గద విభ్రాజిత ఖండ దీప్త శిరముం గాంచె న్నెగుల్ డగ్గనన్

క॥ తూణీరము కేయూరము, బాణములును రాలిపడఁగ • బన్నగమువలెన్
రాణించు కరము స్వకర, శ్రేణిం గీలించుకొనియె • చిత్తము తరలన్.

క॥ తుది నిశ్వాసము గల దశ, వదనుఁడు కంఠమునఁ గనుల • వక్షంబున నం
గదగాని యొత్తును మూర్కొను, బెదవులు చలియింప నేడ్చు • విలవిలపోవున్.

చ॥ పదపడి వాని మేనుగని • పట్టఁగరాని యలంత పెంపునన్
బెదవులమీఁది వక్షమునఁ • దీనుఁగుప్పెఁ బడ బాష్పవాహినుల్
పదరి శిరంబులేని తుద • పంబును పట్టి పరిష్వజించి మై
యదరఁగ వెక్కి వెక్కి యల • యన్ విలపించు సురుంగు దూపిలున్.

చ॥ కొడుకు సురంబు నాటిన ల • కోరుల నూడ్చి యలంతి తుండ్లుగాఁ
జిడిముడి దీలు గా విఱుచుఁ • జింతిలు మూర్చిలు మేను మూర్కొనున్
దడవుఁ జలించు లేచు భువ • నంబుల నొక్కట గ్రుంగ నెంచు న
ప్పడమిని గూలు వంత తల • మున్కలుగాఁ దపియించు గ్రాన్పడున్.

శా॥ ఈదైత్యేంద్రుని యల్క రాఘవులతో • నే తీఱునో ? బ్రహ్మరు
ద్రాదిత్యావలితోడఁ బోవునొకొ ? లో • కాంతంబె కావించునో ?
యేదారిం జనువారమంచు సుర మా • సీంద్రామిలెల్లన్ మనః
ఖేదోన్మాద విచేష్టితాంగులగుచున్ • గీన్పాటుమై నుండఁగన్

మ॥ దశకంఠుండు కుమారు శీర్షము సదా • ధాత్రిన్ బరీక్షించి య
ప్పశువుల్ డైకొనిపోయిరంచు వెగచున్ • వక్షంబునం జేర్చుఁ బు
త్రశయంబున్ మదిఁదెచ్చి పాయము వెలా • రన్ మండుచున్ మాఁడుచున్
దిశలొక్కుమ్మడి బ్రద్దలై పగుల రో • దించుం భువిం దొల్లుచున్.

ఉ॥ దిక్కరులన్ గలంచి కదుఁ • దేలిక శంకర శైలమెత్తి పెం
పెక్క జగంబులం గెలిచి • యేప్రవహించిన యేను నానుతుం
డిక్కడ నేఁడు క్రించు నరుఁ • డెక్కటి కయ్యమునందు కూల్పఁగా
నుక్కటి దీనతం గలఁగు • చుంటిని దిక్కటి బిక్కరించుచున్.

చ॥ అలకను కాల్చి యింద్రిపురి • యందము గ్రాలఁగ బొగ్గుచేసి యి
య్యల నెదురెందు లేక చరి • యించి జగంబుల నేలు నేరణ
స్థలిఁ దలఁ గోల్పడన్ దనువు • జంబుకముల్ గ్రసియింపఁ గూలు గా
దిలి సుతుఁ గాంచి యాపిదపఁ • దిన్నది కుక్కలకూడు నానాకో ?

చ॥ కొమరునితోడ వచ్చిన య । కుంఠిత విక్రమశాలు లాజి దు
ర్దములగు రాక్షసుల్ సమర । రంగము నం దొకరేని లేక జీ
వములఁ ద్యజించినారు కపి । వర్గమునం దొకఁడేని చావఁడీ
క్రమము విచిత్రమయ్యె నని । కాంచుచు నూరకయుంటిఁ, జెల్ల రే!

మ॥ సుర గంధర్వ భుజంగ యక్ష హరిణా । క్షుల్ సిద్ధ సాధ్యాంగనల్
వర విద్యాధర కీరవాణులగు నీ । భార్యల్ ప్రలాపించుచున్
వరుఁడేడీ శివమేది చూపు డనుచుం । బ్రశ్నింపఁగా నంతకున్
దురమందోర్చిన యేను వారి నెటు గాం । తున్? బల్కు నోరాడునే?

మ॥ జయలక్ష్మిం గొని యింద్రసంపదల ని । చ్చం గోరినట్లెల్ల ని
శ్చయలీలం గొనిపొందితిం దుది మను । ష్యస్త్రీకి నొక్కర్తుకై
యయయో! నీవొనరింపఁగాఁ దగిన యం । త్యప్రక్రియల్ నీకు నే
నయి కావింపఁగఁ జేసికొంటిఁగద క । ష్టాత్మంద దౌర్భాగ్యుఁడన్.

చ॥ అని బహుభంగులం బనవి । యాత్మజు దేహము నెత్తి నెత్తిపైఁ
గొని దనుజాంగనల్ గదిసి । కొందలమందుచు నేడ్చుచుండ లం
కను వడిఁ జేరెఁ గాంచిన ఖ । గంబులు నేడ్వఁగఁ బత్తనంబె నె
క్కొనినది యాలగోడుగను । గోలల గోడుగ బాల గోడుగన్.

చ॥ కనులఁ బెకల్చికొంచుఁ దమ । కంఠములన్ వడిఁ ద్రెంచికొంచుఁ గ్ర
న్నన హృదయంబుఁ జీల్చికొని । నాలుక లూడిచికొంచు శీర్షముల్
మొనసి పగిల్చికొంచు నసుర । పుత్త్రుని భార్యలు పఱ్ఱు రయ్యెడన్
మనసులు పుండ్లుగా సయిఁపు । మాలి త్యజించిరి ప్రాణవర్గమున్.

శా॥ తండ్రీ! యంచును దానవాంగనలు నా । థా! యంచు దైత్యేంద్రుకో
డండ్రుం గుంపులుగూడి కట్టుకొని యే । డ్వం దక్కు చెల్లెండ్రు ని
ల్లాండ్రుం బిడ్డలు జీవితాశలను రో । యన్ గుంపులై వచ్చి రె
వ్వాండ్రుం జూడగఁ దెచ్చె నంతిపురికిం । బౌలస్త్యుఁ డమ్మొండెమున్.

సీ॥ పుట్టకోపలఁ బద్మ । ములె మోఁదుపగిది ను. రమ్ముఁ గరమ్ములఁ । గ్రుమ్మికొనుచు
రశనను మోవనే । రని సన్న కౌను పా. లిండ్ల భారమ్మున । నింట్రపడఁగ
ముడివీడి వేనలి । మడమలఁ దడవంగఁ, గన్నీరు మున్నీరు । గాఁగ నలమ
విప్పు ద్రొక్కినగతి । నేలఁ బదములానఁ, బుత్త్రదుఃఖము పొంగి । పొరలి ముంప
తే॥ మృగయుశరభిన్న హృదయయై । మేదినీధ్ర. మందుపొరలు మయూరినాఁ । గొందలించి
కొడుకు మేనిపైఁ బ్రాణముల్ । కుతిలపడఁగ. వ్రాలి మందోదరి మనంబు । తూలసోలె.

తే॥ కొంత సేపు వెలివిదక్కు । కూలియుండెఁ. గొంత సేపు నిశ్చేష్టయై । కూడుచుండెఁ
గొంత సేపు మౌనంబునఁ । గుందుచుండెఁ. గొంత సేపు వెక్కుచుఁ బల్కు । కుదురకుండె

చ॥ తరుణ శశాంకుఁ బోలెఁ బ్రతి • దినంబుగ వర్ధిలునాఁడె వాసవున్
గరువమడంచి తెచ్చుటను • గాంచఁగ నోచిన యేను మొందెమున్
బరువుగఁ జూడఁ జాల్పడితిఁ • బాప కళంకిత చిత్తఁ గావునన్
మురువగు నీదు మోము గను • పుణ్యము నింతయు నోఁచనైతిగా

ఉ॥ చక్రిని శంకరుం బెనకి • సంకట పెట్టితి వల్లనాఁడె దో
ర్విక్రమపర్వ! నీయెడరు • విన్ననువొప్పు మొగంబుఁ జూడకే
శక్రభయంకరా! మసఁగఁ • జాలుదినయ్య! యనంగరూప! నే
నీక్రియ నీదుమాత నని • మేదిని నొంచుట దీనిఁ జూడనే?

ఉ॥ కాళుల గల్లుగల్లుమని • గజ్జెలు మ్రోయఁ జరించునాఁడె సిం
గాలను పట్టి యాడ్చికొని • కాటియవెట్టుచు మేడ ముంగిటన్
లీలగఁ గట్టివైచి పలు • లీలలఁ దేలుచు నుంటఁ జూడఁగా
జాలుదునయ్య! యింక మరు • జన్మము నెత్తిన నోము నోచినన్.

ఉ॥ హస్తముచాఁచి పిల్వఁగ శ • శాంకుఁడు భీతిలి వచ్చి నిల్వ నీ
శస్త్రకరంబుతో నతనిఁ • జల్లగ దువ్వుచు భీతి మాన్చి సం
ప్రస్తుతమౌ కళంకముఁ గు • రంగముఁగాఁ దలపోసి పట్టఁగా
నిస్తుల హస్తముం బఱపు • నీటు గనుంగొన నెంతు రాఁగదే!

చ॥ స్కందునిఁబోలు సుందరుఁడ! ని • శాచర పన్నగ యక్ష దేవ శీ
తేందుముఖుల్ విలాసముల • హేలల లోఁగొననెంచి పుష్పశ
య్యం దటివేచి విశ్రమ • మంది సుఖంబుగ నిద్రసెందితో?
క్రందగు శయ్యమం దొనరు • క్లాంతి తొలంగఁగ విశ్రమించితో?

క॥ ముల్లోకంబుల గెలిచిన, బల్లిదుఁడగు సుతుఁడు నేఁడు • బవరంబున ని
ల్లిదుఁడగు నొక మానవు, భల్లంబునఁ దెగియె నకట! పాపపు విధిచే.

ఉ॥ దూది హుతాశిలో వలెనె • దుర్దమ మానవ బాణ వహ్నిఁ గ్రు
వ్యాదులు చన్నవారు చని • నట్టుల చచ్చెదువార క్రమ్మఱన్
లేదొకప్రాణియైనఁ గల • శించె దశాస్యుఁడు ధాత్రిజాత యన్
స్వాదు విషంబు రేపటికి • సాధ్యమె యిట్టులు కాక తక్కఁగన్?

మ॥ మది సంతాపము విల్లు వెల్వఱచు న • మ్మందోదరిం గ్రవ్యభు
క్సుదతుల్ చేతులమీఁద నెత్తుకొనుచున్ • శుద్ధాంతమున్ జేర నం
గన వర్తిల్లఁగ రాతిగుండెగల యా • క్ష్మాజాతయే హేతువౌఁ
గదయం చుగ్రగతి న్వధింపఁ జనె లం • కానాథుఁ డత్యార్భటిన్

మ॥ పరుగుల్ వాఱుచునున్న రావణుని భా • వంబుల్ విమర్శించి ని
ల్వరమౌ కీర్తి నశించునే యనుచుఁ బ్రో • వన్ దెంపు తోడన్ మహో

దరుఁ దద్దంబయి చాఁగిలంబడి యనున్ • దైత్యేంద్ర ! కోపంబుచే
స్థిర కీర్తిం గొనిపోయి గంగఁ గలపం • జింతించెదే తొందరన్ ?

ఉ॥ కీరితి మొత్తముం భువన • గేయముగాఁ గొను రాక్షసేశ్వరా !
కోరితి లోకనాయకత • గొంటివి కోరిన కోర్కె చెల్లఁగన్
జేరితి చెంపరాని సుర • సిద్ధ పదంబులఁ బల్మి పెంపునన్
మీఱితి వెల్ల భోగముల • మేకొనెదేలఁ స్థిరాపనిందకున్ ?

మ॥ సురసంఘంబులపై దిగీశ్వరులపై • సుత్రాముపై వాలిపై
వర దిగ్వారణరాజిపై ధనదుపై • వర్తిల్లు యుష్మచ్ఛరా
చర భీతిప్రద చంద్రహాస మెుక కం • జాతాక్షిఁ దుండింపఁగాఁ
బరపన్ సిగ్గిలి క్రుంగుఁగాక పనితా • ప్రాణంబులం గ్రోలునే ?

మ॥ అబలన్ గోల లతాంతకోమల ససూ • ర్యంపశ్య వైదేహిఁ గో
ప బల స్ఫూర్తి గడల్కొనం దునుముచో • బ్రహ్మాదు లింద్రాదు ల
ల్పబలుం డల్పగుణుండు నీచకులుఁడున్ • వ్రాత్యుండు భీతుండు మా
న బల స్థైర్య విహీనుఁడం చనరు లం • టం గేలి గావింపరే ?

ఉ॥ కాదిది రాజనీతియును • కాదు సురావళి ధర్మరీతియున్
గాదిది సాధుపద్ధతియుఁ • గాదు జయాంకము కాదు మోక్షమున్
గాదిది యిష్టసిద్ధియును • కాదిది మేలియు విక్రమస్థితిం
గాదు పులస్త్యవంశ్య ! కొలు • గాని యపప్రథఁ దెచ్చికొందువే ?

ఉ॥ రాముని కత్తితో నటకి • రాముని వెండి జయించి లంకకున్
రా మతియించెదో ? చెలువ • ప్రమందిన, వారలు చింతతోడ సం
గ్రామము మానువారలను • కారణమో ? యది వీరధర్మమో ?
రాముని గెల్వలేకుడిగె • రాక్షసరాజను గోసు మోసెకో ?.

ఉ॥ నావుడు రావణుం డలల • నన్ వధియించుట మాని రోసి వా
లావలఁ బాఱపైచి తన • యక్కలి పుత్తుఁ శిరంబుతోడ రా
జీవవినోది వంశజుల • శీర్షములన్ గొని కాక క్రమ్మఱన్
రావణి గాత్ర మందనుక • రంగజు కుంచుఁడి తెలసుం డనెన్.

## 29. సేనా సందర్శన పటలము. (72)

చ॥ కొదుకు శవంబుఁ దైలమున • గుప్తి యొనర్చిరి దైత్యవైద్యుల
య్యెద దెసలెల్ల నిండి వసి • యుంచుచు నుండిన రాక్షసావలిఁ
గడుకొని పిల్వఁగాఁ జనిన • కర్బురదూతలు వచ్చి లంకలో
నెద మొకయింత నిల్చుటకు • నేని కనంబడ దయ్యె నాఘదున్.

ఉ॥ ఎచ్చటనున్నదంచు దను • వేఱుఁడు ప్రశ్నయొనర్ప దేవరా!
అచ్చుపడంగ నింతె కల • దంచు వచించుట కెట్లుచెల్లు? వా
తోచ్ఛలి తాంబుధిప్రచుర • ముల్బణమంద జగంబు చాల కు
న్న చ్చున్న నెల్లెడం బరవి • యార్చుచునున్నది సేన మత్ప్రభూ!

క॥ పదరజము నిండి యంబర, పదమునఁ గాలూని విబుధ • పఙ్క్తులు నడవన్
గదిరిచి మిఱిమీఱిన మన. చదలము గన నరుదుగాఁగఁ • జనుదెంచె విభూ!

సీ॥ కత్తులు మెఱుపుల • కరణిఁ బ్రకాశింప. మేఘసందోహంబు • మెఱయమానె
భేరీ రవమునకు • మాఱొడ్డి జలదముల్. చెలఁగి యెక్కడను గ • ర్జింపవయ్యె
నా సేనవలె నెల్ల • నై యుండలేమి జీ. మూతముల్ వెల్లనై • ముడిఁగి మొదిఁగెఁ
జతురంగ బలమెల్ల • జలధిపై నడతెంచె. నన నొక యుపమాన • మరయఁగలదె?

తే॥ బలము మిఱిమీఱి పైపయిఁ • బరవుచుండ. నూర్వజగము లొండొంటిలో • నొదిఁగితూఁగెఁ
జంద్ర తారకల్ నెలవుల • జాఱ విడిచెఁ. దరణి పథిలేక తినత్రోవ • దాఁటి చనియె.

చ॥ గగనము ముట్టి మేరుగిరి • కైవడి వెగ్గుచుఁ దీసియున్న నా
ల్గు గవఁకుఱందు చొచ్చిన య • కుంఠిత సైన్యముచూడఁ గాలుఁదే
జగము ధరింపఁజాలదని • సాగరసప్తకమున్ మఱొక్కచో
మొగపడి చేర్చుచుండె నన • బొల్చు వహించి రహించె నయ్యెడన్.

చ॥ గవఁకులయంచ యిక్కటము • గాఁ జొరఁగాఁ దడవౌన యంచు దా
నవ బలముల్ విజృంభణ మెు • నర్చుచుఁ గోటను దాఁటె నన్నుఁ దాఁ
దవిలి పయోధి సప్తకము • ధారణి నొక్కటఁ జూడఁగోరు మా
నవువలె నెల్ల సేనలు గ • నంబడ గోపురమెక్కెఁ జూడఁగన్.

మ॥ పరమార్థంబును విస్తరించి నిగమ • వ్రాతంబు భాషించు పై
ఖరి దూతల్ విభజించి పల్కె రొక ది • గ్భాగంబునందుండి యే
డ్తెఱ వేఱొక్క పలంకుదాఁకఁ బరిపూ • ర్తిం బొందు సంద్రంబునాఁ
బఱపైనట్టి చమూ సమూహముల నా • పౌలస్త్యుతో నిమ్ముగన్.

ఉత్సా॥ వీరు పేఁకుదీవివారు • వేల్మిఁ బుట్టినారు బృం
దారకులను మోహజలధిఁ • దార్చి ముంచినారు పై
వారిదములఁ దాఁకు నంత • వారు మేని పొడవునం
దారి తేటినారు మాయ • నార్చు సంగరంబులన్.

ఉత్సా॥ వీరు దర్భదీవివారు • విక్రమమున నంతకుం
గేరువారు విజయలక్ష్మిఁ • గేలఁబట్టువార లీ

వీరివలన స్వర్గలక్ష్మి • వీడినారు వేలుపుల్
శూరవరులు సమరమందు • శూలికేని యోడరున్.

ఉత్సా॥ వీరు బూరుగనెడు దీవి • వెలయువారు వాసవున్
బోరఁ గెలిచి పాకవైరి • పురము కొల్లగొట్టినా
రార భవుని వరబలమున • నధిక సత్త్వ గౌరవుల్
కారుచిచ్చువంటి కినుక • కిసలు గల్గు వారలున్.

ఉత్సా॥ వీరు క్రౌంచదీవివారు • పేల్చి రాజయాచియా
మేరువును సముద్రమందు • ముంచి త్రోయఁబూనఁ బా
కారి మొదలుగాఁగ నమరు • లదరి బెదరి వీరలం
జేరి వేఁడికొనుచు నట్టి • చేఁత మాన్పి రొక్కెడన్.

తే॥ వీరలు ప్రవాళగిరి నుండు • వారు శుక్రు, నికి నిశాచరాంగనకు జ • నించినారు
కలశ వారాశి వరటివోఁ • గలఁచినారు, బలము పదికోట్లు లెక్కకుఁ • గలుగువారు.

తే॥ వీరు చిఱుగాలి సతతంబు • వీచుచుండు, గంధమాదన వాసంబు • గలుగువారు
హాలహలమున కిరులకు • నన్నలనఁగ, నొప్పువారు లెక్కకు మీఱి • యుండువారు.

తే॥ మలయమను గొప్ప మల జల • మధ్యమందు, గలదు వీరలందలివారు • నలువ వీరి
వలన జగములు నశియింపఁ • గలవటంచుఁ, దలఁచి ప్రార్థించి యచ్చోట • నిలిపినాఁడు.

తే॥ వీరు సప్తాంబుధుల కధి • కారులైన, పుష్కరదీప్వవాసులు • భూరి బలులు
సమ్మెటలు శూలములు గదల్ • చక్రములు ము, సుండులును విండ్లు ధరియించి • యుండువారు

తే॥ వీరు జువ్విదీని కల • వారలు తమ, తల్లి పనుపున ధారణి • దాఁటి చక్ర
వాళగిరియందు జముగెల్చి • బంధనమున, వైచి నలువ కోరికపయి • వదలినారు.

తే॥ మీరు పసియింప నపని పి • శాచపైన, చోటులేదు పాతాళంబుఁ • జొరుఁడి యని వి
రించి పంపఁగ నందుండి • ప్రేమచేత, వచ్చు బేతాళహస్తులౌ • వారు వీరు.

తే॥ నిర్మలిమంచు జూల్ వీరలు • నీకు హితులు, సురలతో నుండి త్రావనె • త్తురులు లేమి
విసిగి వచ్చిరి సత్తప్ర • ధీధరముల, నెత్తువారంబుధులఁ ద్రా • వనెసఁగువారు.

ఉ॥ వీరలు తొల్లి క్రోధమయి • వెన్నుఁడు కోఱల నెత్తునంత నీ
ధరణి మోహముంగొను క • తంబున జాఱిన శోణితంబు బం
గారముగాఁగ దానిఁగొని • క్రచ్చఱఁజేసిన వీరఘంటికల్
సౌరుగఁ దాల్చి రష్టదిశ • లన్ దమ గౌరుల నిల్పినారలున్.

క॥ ఈ క్రవ్యాదులు భూరి ప, రాక్రమమునఁ గొఱఁతలేక • రాజిలుదురు పా
దక్రాంత శేషుఁడును ని, ద్రాక్రమమును వీడి యయ్యుగ్ర • గ్రాలెడువారల్.

ఉ॥ కాళిక యోడునట్లు కఱ • కంఠుఁడు నృత్యము సేయుచుండఁ గాం
కాళమునొందు నామె కను • దమ్ముల వెల్వడు కోపవహ్నిలోఁ
గాలతరాకృతుల్ భవము • గాంచి రపార బలాఢ్యులెన్న బే
తాళ సహోదరాళి యనఁ • దగ్గ నికాయులు వీరు రావణా!

చ॥ ఉరవడి విండ్లు కేలఁ గొని • యుత్తరదిక్కునఁ జేరుచున్న యీ
వరబల శౌర్యవర్తనులు • పాపము పుట్టిననాడె పుట్టి నా
రరయఁగ దివ్వె లుంచిన గు • హా ద్వితయంబన నొప్పు కన్నులం
బెరసిన వార లగ్గునెడ • వీరలు చంపక తల్లినేనియున్.

తే॥ వీర లుగ్ర నిటలనేత్ర • వీతిహోత్రు నుండి పుట్టినవారు మ • హోగ్రగుణులు
వార లూఁతగా మృత్యు దే • వతకు ముందు పుట్టినట్టివారలు • చంక ఘోరబలులు

ఉ॥ శూలములం ధరించి మును • చొప్పడ నిల్చిన యామినీచరుల్
శూలి పదమ్ము వక్షమున • సోకఁ గృతాంతుఁడు క్రక్కు నెత్తుటన్
బోలఁగఁ బుట్టినారలు స • ముగ్ర బలాఢ్యులు వీర లబ్ధిలో
హాలహలంబు పుట్టుతటి • నన్నలుగా జనియించు రాక్షసుల్.

ఉ॥ వారలు వార్ధిఁ ద్రచ్చుతటి • వాసుకి క్రక్కు విసంబు నెత్తి నే
ర్పారఁగ నుంచు బాడబము • నం దుదయించిన ఘోర దేహకుల్
వారిద ఘంటు నగ్నిశిఖ • వంటి శిఖల్ గల వీరు శర్వ దు
ర్వార శరాగ్నికీలఁ ద్రిపు • రంబులు గాలఁ జనించి రందఱన్.

ఉత్సా॥ ఇందఱని గణించి తెలుప • నిట్టి వార లనుటకున్
డెందమునకు నూహయే క • డింది యగును మాయలున్
బొందు వర బలంబులున్ ద • పోబలంబు లెల్లఁ దె
ల్పం దలంప యుగములెన్ని • పట్టునో? ప్రభూత్తమా!

ఉ॥ ఒక్కఁడొకండె వానరుల • నుర్వరనాథకుమారు లిర్వురన్
జక్కఁగఁ జేయఁజాలుదురు • సంఖ్య వచింపఁగఁబూనువారలున్
గ్రక్కున వేయివెల్వలన • గట్టిగ నవ్వరె విన్న వారలున్
లెక్కయొనర్ప మానమును • లేదు జగంబున రాక్షసేశ్వరా!

మ॥ అని దూతల్ వచియింప రావణుఁడు నే • త్రానంద సంపూర్ణుఁడై
కని నాదీవనలన్ వచించి తగు స • త్కారంబులంజేసి యా
దనుజాధీశులఁ దోడితెందనఁగ దూ • తల్దెల్పు సేనాను ల
త్యనురాగంబునఁ బూలు సల్లుచు తదీ • యాంఘ్రిద్వయిన్ మ్రొక్కఁగన్.

మ॥ అసురాధీశ శిరస్తతీ మకుట ర • త్నాంకూర రాగప్రభా
ప్రసర ద్దివ్య పదారవిందుఁడగు క్ర • వ్యాద ప్రభుం దంతటం

గుళలప్రశ్నముచేసి ఛీకతన మా • కోర్కుల్ ఫలంబందె స్నం
తసమయ్యెన్ భవదాగమంబు విజయో • దర్కంబుగా నెంచెదన్.

మ॥ అని వాక్రువ్వఁగ వారలున్ దనుజ నా • థా! మాకు నీవుండఁగా
ఘన దోఃస్థైర్య తపోబలంబులును గ • ర్గం బొందు దుస్సాధ మెం
దు నొకండేదియుఁలేదు మీరలను దై • త్యుల్ దార మిత్రాదులున్
మనముల్ వాడి తపింప నేసొనఁగు సం • ప్రాప్తించెనో తెల్పరే.

మ॥ అన ధాత్రీజ నిమిత్తమై తన కయో • ధ్యాధీశుతో వైరమున్
బెను కర్యంబును తత్ఫలంబు తెలుపన్ • బీభత్సగావించిరా
వనచారుల్ ? పదచారులైన మనుజుల్ • భంజించిరా ? కుంభక
ర్ణుని వీరోత్తము నింద్రజిత్తు ననుజన్ • రోషోద్ధతిన్ నవ్వుచున్.

మ॥ మము పిల్పించుట శేషునుండి ధరణిన్ • మార్పింపఁ గా దబ్ధి నీ
రములం ద్రావఁగఁగాదు సప్తకుల భూ • ధ్రంబుల్ విపాటించి హ
స్తములం దోర్వఁగఁగాదు కాయ గసరుల్ • సాపాటుగాఁ గానలన్
దమి వర్తించు ప్లవంగకోటి దునుమన్ • దైత్యేంద్ర ! రప్పించితే ?

ఉ॥ నీవు విషణ్ణయేల యని • యేచి కరంబులు తట్టి మేలు మే
లీపని మెచ్చువచ్చె నని • హేలగ దైత్యులు నవ్వఁ బుష్కర
ద్వీప నిశాచరేంద్రుఁ డతి • వీరుఁడు వహ్ని కరంబులెత్తి మీ
కైపులు కూడవం చదఁచి • కర్బురనాథుని కాంచి నమ్రుఁడై

చ॥ దనుజవరేణ్య ! వీరల వి • ధంబును సైఁపుము శాంతమూను మా
మనుజ వరేణ్యులొంచు బల • మానములం దెలియంగ వేఁడెదన్
ఘనవునఁ దెల్పుఁడీ యనుడు • జక్కటి యంతయు మాల్యవంతుఁడి
ట్లని వచియించెఁ దేటపడ • నర్కకులేంద్రుల విక్రమంబులన్

మాల్యవంతుఁడు సేనాపతులకు రామ విక్రమాదులు తెలుపుట

చ॥ మిగిలిన విక్రమాఢ్యులగు • మీరలు వాలి నెఱింగియున్న వా
రు గద కులాచలంబుల ని • రోధముగాఁ దనకాలఁ దన్ను న
న్నగచరు రామమార్గణ గ • ణంబున నొక్కఁ డురంబుఁ జీల్చి యా
ఖగగతి జీవవాయువుల • జాఱుట యచ్చెరువందురే కదా ?

మ॥ మదిసెంగానఁ విరాధుఁడున్ గడచనెన్ • మారీచుఁడున్ బేరుమా
ల్పడ సందే ఖరదూషణ త్రిశిరులున్ • స్వర్గంబుఁ బ్రాపించి రొ
క్కఁడ యొక్కండగు వింటితోఁ గెడపె ర • క్షస్సైన్య సంతానమున్
గడెలోనన్ రఘువర్యు బాహుబల ము • ద్ఘాటింపఁగా నేటికిన్ ?

చ॥ ఇచటికి వచ్చి మీరరుగ • నేల ? మహోదధి మండి మాఁడియుం
టచటనె త్రోవలోఁ గనరొ ? • యారయరో ? వినియుండరో ? వృథా
వచనము లేల ? పిన్నపుడె • భర్గునిచాపము ద్రుంపఁ బుట్టు నా
ప్రచుర రవంబు మీచెవుల • వ్రాలదొ ? నిద్దుర వోయి యుంటిరో ?

తే॥ లంకయెల్లలో దైత్యబ • లంబు వేయి, వెల్ల యుండిన వా సేన • వీరవరుల
రెండు వింద్లై సంయమనిని • నిండునట్లు, చేసినవి వివరంబుగఁ • జెప్పనేల ?

తే॥ కుంభకర్ణుండు మీ ప్రభు • కొడుకులును ప్ర. హస్త ముఖ్యనాయకులు మా • యావియింద్ర
జితుఁడు తక్కువీరులు మృతిఁ • జెందినారు, నేఁటిదనుక నుంటి మిచట • నేను వితఁడు.

ఆ॥ మూలబలము గలదు • మున్నూఱు వెల్లవల్, దానివంతు నేఁడు • తనరుచుండెఁ
గాలవశత మీరుఁ • గదలివచ్చితి రిఁక, వారి వీరవరుల • బలము విఱుఁడు.

ఆ॥ ఒక్కకోఁతి వచ్చి • యొగి లంకఁగాల్చి దా, నవుల దునిమి యక్షు • నవని రాచి
ధరణివిభుఁడు పంపు • దౌత్యంబు నెఱవేర్చి, దంటయగుచు జలధి • దాఁటి పోయె.

చ॥ కరువలఁ బేర్చి వారినిధిఁ • గట్టి దశాస్యుని ప్రోవుపొచ్చి దు
ర్భరముగఁ బోరు సేయు కపి • వారము గట్టిన కట్ట త్రోవలో.
నరయరొ ? మేరుశైలమున • కవ్వల నొప్పెడు మందుకొండఁ జె
చ్చెర నొకకోఁతి తెచ్చెఁ ద్రుటి • సేపున నట్టివి వారిసైన్యముల్

ఆ॥ ఈ దురంబు గలుగు • హేతువు సీతనాఁ, బరఁగు గరితయగును • పరమసాధ్వి
మీరె గెలిచి రండు • వారె గెల్వఁగనిండు, వినిచినాఁడఁ గన్న విన్న • తెఱఁగు.

తే॥ అనుడు వహ్ని దశాస్యుని • గని బలముల, మడియుచుండ నాజికిఁ బోవ • మానుచేల ?
యనఁగ నది యెల్లిదంబని • యరుగకుంటి, ననుచు దైత్యుఁ డాడంగ • నతఁడు మఱియు.

మ॥ అది మాపాలికి నుంచినారలొకొ ? వృ ? ద్ధాచార సంవేదియున్
ముదుకండౌ మన మాల్యవంతు పలుకుల్ • ముఖ్యంబుగా నెంచి యొ
ప్పిదమౌ తద్విధి సంధిచేసికొనుచో • బింకంబుగా నుండు న
య్యది మించెన్ జులుకందనం బగును చే • యంబోవ నీమీఁదటన్.

ఉ॥ జానకి వీడినంత నవిఁ • బచ్చిన యక్షుఁడు మేఘనాదుఁడున్
దానవవీరులున్ మనకు • దక్కెడువారలె ? యట్టిచేఁతయున్
మాన విహీనకార్యమగు • మానక యుద్ధముచేసి యుద్ధతిన్
మానవవీరులం బిఱకు • మార్చుట యుత్తమకార్య మిమ్మెడన్.

చ॥ అవి వచియించి వహ్ని కల • యం గని లేవఁగ రాక్షసాలి నీ
వవికిఁ జనంగనేల? చని • యల్పుల రక్తము గ్రోలి క్రమ్మఱన్
గవియెదమయ్య మి మ్మటుల • గాక దురంబున నోటగాంచుచోఁ
బిమఁగు కులంబునం బొదము • పిన్నలమే యని బాస లాడఁగన్.

## 30. మూల బలవధ పటలము (235)

తే॥ నేను నొకప్రక్క నేగి యా • నీచ కపుల, యావిద్రావెద మీర లా • యర్కకులుల
నొక్క మొగిఁగ్రమ్మి జీవవా • యువులఁ గ్రోలి, శిరములం దెండనుచు దశ • శీర్షుఁడనియె.

క॥ మొనగాండ్రు మొనలతో వెసఁ, జనుఁడంగని ముందుగాఁగఁ • జనుఁడీ యనుచున్
దన మూలబలము నంపుచు, దనుజాధీశుండు లేచెఁ • దమి మదిఁ బొదలన్.

క॥ పరికరములు నిండిన తన, యరదమ్మున నెక్కి మునులు • నమరులు కలఁగన్
వనచరులమీఁది కొకది, క్కున నేగెను యాతుధాన • కుంజరుఁ డలుకన్.

తే॥ వీరవర్యులు ప్రస్థాన • భేరి వ్రేయఁ, బనిచి కేకలువెట్ట ఘం • టను ధరిత్రి
దెసల నిండారియున్న య • ద్దితిజ బలము, కలఁగి రేఁగిన జలనిధి • కరణి నేగె.

క॥ పరమేష్ఠియండమున సా, గర భూ భూధర పయోద • గగనచర చరా
చరకోటిఁబోలె సైన్యము, పురి యొప్పెను పొట్టివడుగు • పోఁడిమివోలెన్.

తే॥ పాడిఁగదలించి కరుణను • పంటఁగలచి, క్రౌర్యమునఁ బాపముల నొడి • గట్టుకొన్న
వారు రంగుచే నెడఁదచే వారిదములఁ, గేశములచేతఁ గీలలఁ గేరువారు.

తే॥ జలధి జలము పొలఁగఁ జల్లి • జలధరముల, బ్రుంగి పిడుగులఁ గుండలా • కృతిగఁదాల్చి
కంధరములొల్చి వలువలు • గా ధరించి, తిరుగుక్రూరులు యమభయం • కరులు వారు.

ఉ॥ కొండలు దమ్మ దాఁటుటకుఁ • గ్రుక్కిన కాలుగ నొప్పు వారిమ
త్తుండము కాలియందెలుగ • గజ్జెలుగాఁగ భుజంగబృంద ము
ద్దండతఁ జుట్టి వాయువును • తార్క్ష్యుని నేరిచి కట్టికొంచు భే
రుండ పదప్రపంబు పదు • రుంగొని యేగెడువారు దీరతన్.

సీ॥ ఆఁకలివేళ కా • హారంబు లేనిచోఁ, గ్రుంగ కేసుంగుల • గ్రుంగువారు
వేళకు నీరు ల • భింపదేని మొయిళ్ళఁ, బిసిచి జలంబులఁ • గుడుచువారు
కొండ లెగురవైచి • దండంబుతోఁ గొట్టి, యలపున గడిదేఱి • నట్టివారు
జిల యెత్తెనేని క్రొ • న్నెలఁ బట్టి తమమేని, దురద వోవంగ రు • ద్దుకొనువారు

తే॥ శిలలఁ బొడిచి చేశక్తి పీ • క్షించువారు, చెలఁగి పిడుగులఁబోలె గ • ర్జించువారు
చక్రశూల దండ ప్రాస • సాధనముల, హరిహరాంతకగుహులఁ గె • ల్వందువారు.

తే॥ ఒక్కరొక్కరు జగముల • నొడుచువారు, కలిసిరేని జగంబులఁ • గలఁచువారు
తిరిగిరేనియు జగములు • తిరుగుఁబోవ, నడతురేనియు జలములు • నడచుఁబోవ.

తే॥ ఎన్ని మొగుళులు గలవన్ని • యేన్గులుండు, నెన్నియేన్గులుండు రథమ్ము • లన్నియుండు
నెన్ని తేరులో గుఱ్ఱంబు • లన్నియుండు, నెన్నిగుఱ్ఱాలొ భటసంఖ్య • యంతయుండు.

తే॥ గజ తురగ సేన మణిగణ • ఖచిత కనక, భూష ణాలంకృతంబులై • పొలుపుమీఱఁ
గాని కైసేయకున్న వాం • డేని లేదు, స్యందనములఁ దెల్పఁగ నవ • సరమె లేదు.

తే॥ ఎల్లదిశల యాకాశంబు • నెల్లఁగప్పి, నీరదంబుల నల్పు గా • న్పింపదయ్యె
కరుల మదజలధారలు • గలిసె యుకతన, జలధులందలి యుప్పన • సమసిపోయె.

ఉ॥ మూలబలంబు నొక్కపరి • పూన్కి వెలార్చెడు కోట వాకిటల్
వీలబగంబు లెల్లఁ దన • బొట్ట నడంచి యనంతర స్థితిన్
గోళములోలి వెల్వడుచు • కొండిక యా వటపత్త్రశాయి లీ
లానసితాస్య పద్ధతిఁ జె • లంగె మహాద్భుతరీతి నత్తఱిన్.

ఉ॥ ఆ చతురంగ సైన్యముల • హావడి సైఁపఁగ లేక శేషుఁడుఁ
మోచు ధరంబు దొడ్డగుడు • మ్రొగ్గెను వానరబృంద మప్డు దృ
గ్గోచరమైన సేనఁ గని • కోయని భీతి నుదీచి వార్ధి వే
లాచల సీమఁ జేరె హల • హాలము గన్న సురాలికైవడిన్.

తే॥ చక్రవాళ మెల్లగఁ గల • జలధి తీర, భూమి వదిగాఁగ దుష్కర్మ • ములను విధియుఁ
గాలుఁడును వేఁటరులుగ దై • త్యాలి మృగమ, యంబుగా నొక వేఁట య • య్యవని జరిగె.

ఉ॥ వీరుల సింహనాదములు • వీరణముల్ రథనేమి రావముల్
వారణ ఘీంకృతుల్ తురగ • వారము హేషలు విండ్ల ఘోషలున్
భేరుల ధాంకృతుల్ చెలఁగి • భీకరలీల జగ ల్లయంబు వే
కారపుటల్లు పెంపెసఁగెఁ • బ్రాణులు తల్లడమంది కుందఁగన్.

ఉ॥ ఆయుధ మత్స్యముల్ మద గ • జాయత నక్రము లశ్వవీచికల్
ప్రేయఁగ నూఁదఁగా నలవ • వెల్వడు ఘోషము కోప దృష్టులన్
ప్రాయపుఁ బొట్టుమీలు రథ • రాజి నగంబులు సౌరుమీఱె దై
తేయ గభీర మూల బల • తీవ్ర మహాంబుధి లోక భీతిగన్.

చ॥ అసురబలంబు పచ్చిక బ • యళ్ళను త్రొక్కుటచేత వారణ
ప్రసర మదాంబుపూరమున • బురదగఁ బంకము గాఁగ లంక వె
క్కసముగ గ్రుంగుఁగాని యెస • కంబునఁ బల్వురు నింగిమీఁద నొ
ప్పెసఁగఁ జరించుచేఁత నెల • యింపక క్రుంగక నిల్చె నత్తఱిన్.

వేలుపు లసురబలముఁ గాంచి శంకించుట

ఉ॥ కాంచిరి వేలుపుల్ ధరణిఁ • గాంచిరి వారిధి మింటి యుచ్చియుం
గాంచిరి దిక్కు లెన్మిదియుఁ • గాంచిరి పెల్లుగ నిండు టెక్కెముల్
గాంచిరి యెల్లచోటులను • గాంచరు బీడుగ నున్న కందువన్
గొంచెమయేని భీతిలిరి • కుందిరి కంపము నొంది రక్కజన్.

చ॥ జగములనున్న యెల్లరు ని • శాచర రూపములంది కైదువుల్
మిగులఁగఁ దాల్చి సంగరము • మేకొని వచ్చిరొ ? సాగరంబులే.

యగణిత యాపధారణము • నంది పితామహు నాజ్ఞచేత నీ
పగిది గడించెనో యని సు • పర్వులు భావనసేసి జంకుచున్.

ఉ॥ భర్గునిచేరి మేమొదుఁగఁ • బాటుచు నిల్వఁగఁ జోటులేదయో
నిర్గమనంబుసేయుటకు • నేరము ప్రాణము లింక నుండునే?
స్వర్గమునున్నె? యాభువన • జాలము నిల్వఁగలేదు మాకు నీ
దుర్గతి వీడదేమి? కన • దుర్భరమయ్యెడి నోర్పు చెట్టులో?

ఉ॥ వేవురు రాము లొక్కటయి • వేయి సమల్ సమరంబుసేసినన్
రావణసేన చావ దొక • రాముఁ డనిం బొనరింప నేమగున్?
వావిరిఁ గాంచినంతఁ దమ • ప్రాణము లిక్కఁగఁ బట్టికొంచుఁ గీ
శావలి పాఱఁగాఁదొడఁగె • నక్కట! తండ్రి! యిఁకేది త్రోవయో?

తే॥ అనుడు శర్వుండు మీరించు • కైన శంక, నొందఁబనిలేదు వీరల • నిందఱ విధి
యిటకుఁ దెచ్చె నాశంబు సే • యించుకొఱకు, నని సమాధానపఱచె న • య్యమర వరుల.

## వానరులు మూలబలముఁ గాంచి పాఱుట

ఉ॥ పుట్టలనుండి త్రాఁచుల స • మూహము వెల్వడఁగాంచి భీతిమైఁ
దిట్టలు దిట్టలై పఱవు • దేఱెడి మూషికరాజి కైవడిన్
ఘిట్టి బలీముఖంబులు త • ఱిన్ నృపవర్యుల లెక్కసేయ కె
ట్టెట్టులు దోఁచె నట్టుల • హీన భయంబునఁ బాఱె నెవ్వడిన్.

ఉ॥ కొన్ని పయోధిలోఁ బడియెఁ • గొన్ని ప్లవంబుల రోసె సేతువున్
గొన్ని తరించెఁ గందరలఁ • గొన్ని యడంగెను కొన్ని యూఁదెఁ ది
మ్మన్నలు కొన్ని మ్రాఁకులకు • హావడి దాఁటెను కొన్ని నింగిపైఁ
బన్నుగ నేగెఁ గొన్ని వెసఁ • బాఱఁగలేక యలంగి చేద్పడెన్.

ఉ॥ కట్టనసేతువే మనకు • గఁడము దెచ్చును వెంబడింతు రి
క్కట్టుగ యామినీచరులు • గావున దీనిని త్రెంచిపోవ మి
ప్పట్టున నంచుఁ గొన్నియనె • వారలు మింటను కూడ వత్తు రిం
కెట్టని కొన్నిపల్కెఁ గొని • యెల్లెడ నిండిరి సోఁకులే యనెన్.

తే॥ అర్కసుతుఁ డాంజనేయుండు • నంగదుఁడును, రాము వీడకుండిరి తక్క • రాణువెల్ల
పఱవసాగెఁ బయోధియుఁ • బల్లటిల్లె, సరసె నంతయు రామభూ • వరుఁడు కనుల.

సీ॥ ఈగొప్ప కూటువ • లింతకాలం బెట, నుండె నెప్పుడు వచ్చె • నొదుఁగుబడిగ
వినిపింపుమని రామ • విభుఁడు ప్రశ్నింప వి, భీషణుఁ డిట్లను • పెరవుతోడ
నన్నిదిక్కులయందు • నన్నిదీవులయందుఁ గ్రిందిలోకములందుఁ • గ్రిక్కిఱించి
నెలకొన్న దానవా • నీకంబు దూతలు, చని తోడి తెచ్చి రీ • సైన్యమందు

తే॥ ముందువచ్చెడు మూఁకయే • మూలబలము. వెనుక రాక్షసబృంద మ • వ్వీటలేదు
దుష్కృతము మందరికిఁ బ్రోవఁ • దొడరివచ్చె. విధియుఁగాలంబునొనరించు • ప్రేరణమున

మ॥ అని నాచిత్తము తెల్పుచున్న దన న • జ్ఞాతుండు చిర్నవ్వుతో
గనలుం గన్నుల కెంపు దోఁపఁ బ్రుటిలోఁ • గ్రవ్యాద సందోహముల్
గను నప్పాటులఁ జూచుచుండుఁడు మఱే • కార్యంబు చింతింపకుం
డని కీశాలికిఁ జెప్పి తోడుకొని రి • మ్మా యంగదా! నావుడున్

మ॥ అతఁడున్ వారలఁ జేరి యో గిరసలా • రా! నిల్చి నాపల్కులన్
శ్రుతులం జేర్పుఁడు వెండి పొందనినఁ గీ • ర్తుల్ కొందఱాలింప స
మ్మతి గాన్పింపక పాఱి రవ్వలకు స • మ్మానించుచుం గొంద ఱే
మతి బోధించెదు వాఁడవంచు నిలువన్ • మన్నించుమ న్నువ్వుచున్

ఉ॥ దేనికి జంకిపాఱెదరు • తీఁకువ మీరలు దెల్పుఁడన్న న
మ్మానితుఁ గాంచి వారలును • మన్నెఁడ! చూడవొ? సోఁకుమూఁకలన్
బూనికఁ బోరి చచ్చు మఱి • పొందెడి దెయ్యది? యింద్రజిత్తుచే
నైన యవాంత్రముల్ తలఁప • నైనను చాలుదుమేమి చెప్పుమా?

ఉ॥ వెన్నుఁడు గట్టువిల్తుఁడును • వేల్పులు నోడిరి సోఁకుఱేని చు
ప్పన్నని చేత నాతనికి • వీఁగినవారలె వీరు! వీరలన్
మన్నియ లిద్దఱేఁచి యని • మార్కొని గెల్చెదువార లౌదురే?
తిన్నఁగఁ జూడుమీ యుసుఱు • తీసని మున్వినవేమి? యంగదా!

తే॥ చిలువతాలుపుతోఁ బట్టి • పలువతాల్పు. నలువతో నింతికొపుంజు • గలిసి దురము
సలిపి పెక్కువేలేండ్లొక్క • పొలసుదిండి. గెలువలేనైరి వీరలా • గెలుచువారు?

తే॥ కోఁతిగుంపు లన్నిటి నొక్క • కూళ యెఱచి. దిండి మ్రింగుటకుం జాల • కుందు వీరి
కూటువుల నొకబ్రొద్దెల్లఁ • గూడియేని. పలుకుపెలఁది మగండేని • తెలుపఁగలఁడె?

తే॥ తలలు పది చేతు లిరువది • కలవు పొలసు. దిండి యొకిమీనికని వెఱ • తివుచుచుండె
నిచటఁ గల పసి మగవారె • కేటి వేయి, తలలు రెండువేల్చేతులు • గలవె చెపుమ?

తే॥ కుంభకర్ణుని చేవిల్లు • హూదియెత్తఁ, జేవ లేకుంటి మాతని • చేఁత లీవు
నెఱుఁగుదువుకద పసివాఁడ • విట్లువచ్చి. యంటి విసుద్రిమ్మరులకంటె • నోపఁగలమె?

తే॥ హనుమ బలిమియు సుగ్రీవు • నలవు రాము, లక్ష్మణుల వింటినేర్పు త • లంచి చూడఁ
దమ్ము తము • గాచుకొనునంత • తరముగావు. మనలఁగాచు టెక్కడిమాట? మఱవఁదగును

ఉ॥ రాముఁడె యేలనేమి? మఱి • రావణుఁ డేలిననేమి లోకముల్
రాము నిట్టు కున్నఁగన • దక్కినపెల్లఁ; భుజించి దాఁగఁగా
భూమిధరంబులందు పల • మల్ జలముల్ గుహలుండె నమ్మ నీ
వేమిటి కింకఁ బిల్చెద వ • హీనగుణాకర! యాజ్ఞ యీఁగదే!

చ॥ విరవిరవోయి వాఁ లిటు • వేఁడఁగ నంగదుఁ డాలకించి య
చ్చెరువున జాంబవంతుఁగని • చెల్వుగ నిట్లను సూర్యునొద్ద వ్యా
కరణము నేర్చినట్టిఁడగు • గాడుషపట్టికి నుద్దియైన నీ
వరయఁగ నిట్టులైన మతి • యజ్ఞుల సంగతి చెప్పనేటికిన్ ?

ఉ॥ పన్నగతల్పుఁడే భువన • పావనుఁడౌ రఘురాముఁడంచు మా
కెన్నఁగ బోధచేసి వెల • యించితి మున్నిపు డిట్టి మూర్ఖులన్
దిన్నఁగఁ జెల్పి పోఁడిమిని • దెల్పక భీతిలి కేని కీర్తిమున్
విన్ననువేమగున్ ? గుదిసి • బీరము మానుట వీరధర్మమే ?

చ॥ అవరునఁ గీర్తి వోవిడిచి • యాఱడిపాలయి యెందువోయినన్
బ్రదుకఁగనౌనె : రాజుఁ దెమ • రక్షిణులవన్ ? సుదయంచు నంజుడున్
విదితముగాఁగ నిచ్చినవ్ర • వీణుల మౌదుము నమ్మినున్న స
ద్విదులను మోసపుచ్చి యని • వీడిన నింతకుఁ జావమేలగా ?

తే॥ దేవదానవుల్ చేరి మ • థింపలేని, పాలవెల్లిని చిలికిన • వాలి యొక్క
కోలనేసిన బలము ల • కోరివలనఁ, గదలిఁ గాల్చుట మఱచితో ? • కానవొక్కొ ?

చ॥ దనుజ బలంబు లెన్నయిన • ధర్మములేమిట ధర్మ మున్న చెం
తనె జయముండు నిశ్చయ మ • ధర్మము ధర్మము నెంమగెల్వ లే
దనుట వినంగలేవొ ? యిది • యా మతిమంతునిరీతి ? పిచ్చివా
నినిబలెఁ బందలం గలిసి • రీవును పాఱుట యుక్తకార్యమే ?

చ॥ అనుటయు సిగ్గుచే సవన • తాననుఁడై యసు జాంబవంతుఁ డీ
పను టుపితఁబయైన నిపు • డప్పుటఁజేరిన సోఁకుమూఁకలం
గనుటకునేని యాత్మ ధృతి • గాంచుటకేని పినాకికేనియున్
జనునొకొ ? యప్పు వానరుల • సంగతి నెంచఁగ బోసమున్నదే ?

ఉ॥ కాంచితి దేవదానవుల • కయ్యము మాలిని మాల్యవంతు మున్
గాంచితిఁ గాలనేమి మధు • కైటభులన్ గనకాక్ష సోదరుం
గాంచితి హాలహాలమును • కాంచఁగలే దిటువంటివారలన్
ఓంచి యముండునే నధిగ • బొంచి విరోధము గొన్నె వీరితో ?

సీ॥ బలముకంటెను వర • బలము గల్గినవారు, మాయల గడిదేఱి • మలయువారు
కదలి యిసుకకంటెఁ • గడులెక్క గలవారు, కలికంటె నెద చెడ్డ • గలుగువారు
కృతహస్తులతితరా • కృతులు వీరంగన్న, యమరవర్గమె భయ • మందుచుండ
మనకు దిట్టతనంబు • మఱివచ్చునేమి ? యి ట్లున్న నెట్లున్నఁ జా • వున్ననైన

తే॥ పోరునకు జంకిపాఱుట • మేరగాదు, యశము తొలఁగును రౌరవ • మబ్బు నిక్క
మైన నొకమాట శ్రీరాము • నాననంబు, నెమట నిల్చుట యెట్లు ? మో • మెత్తుటెట్లు ?

తే॥ భల్లుకేంద్రుఁ డిట్లాడంగ • వజ్రధిష్ణు, శైలవక్షుండు శ్వేతాద్రి • వ్రాలినట్టి
కారుమబ్బునాఁ దెల్లని • గౌరు మీఁద, వెలయువజ్రికి మనుమండు • పలికెనిట్లు.

తే॥ జయము నోటమి యెదిరించు • టయును చంపు, టరయ వీరుల కెన్నండు • జరుగునదియ
నిలిచినార లిచ్చటనాదు • పలుకుల విని, కాన మీరలను విస్మృశ్య • కారులెమమి.

చ॥ పదటికుఁడీ ఘియంబు మదిఁ • బాయుఁడి యెల్లర మొక్కటయ్యు నె
య్యదియు నొనర్పలేము మన • యజ్ఞతలెల్ల క్షమించు రాముఁడే
యెదిరిచి గెల్చెనేని జయ • మే డ్తెలఁ గాంతము కాదయేని పా
యుచ మనుపుల్ రణంబున ర • ఘూద్వహు తోడనె రండు లెండనన్.

ఉ॥ పాఱినవారమైతిమి య • ప్రథమోడి జగంబు దూఱఁగాఁ
బాఱిన వారలెల్లరు ని • పత్తిలనిండని భల్లుకేశ్వరుం
డూఱటలాడ నెల్లఁ గపు • లొయ్యన వచ్చిరి రామచంద్రుఁడున్
వారిన గొబ్బ సేనఁగని • తమ్ముని మోమును గాంచి యిట్లనున్.

చ॥ అసురబలంబు లెన్న యున • నంజిక లేదవి మచ్ఛవాగ్నులన్
దస తుసఁ గాలిపోవునవి • దూపివలెం బనిచేటులేదు నీ
వసమునఁ గాచుచుండుము వ • నాటులనెల్లర నెచ్చరంబుగన్
దెసలకుఁ బాఱినారు గద • దిక్కొకయింతయు లేని వీరతన్.

శా॥ ఈ సేనన్ మనమీఁదికంపి యసురా • ధీశుండు వెన్నాటుగన్
మోసన్ సేసి ప్లవంగులం దొపరి యే • ష్యం జూపి వేఁటాడునో
నీసామర్థ్యము చూపి వానిబలము • న్నిర్జేసి యీసేనలన్
గాసిం బొందఁగనీక కావఁదగు నా • కర్తింపు మీ ప్రార్థనన్.

ఉ॥ వీరల గూర్చి నాపది త • పించుమనుష్యుఁడ వెచ్చరించితో
మారుతితోడఁ గీశకుల • మాన్యునితో నటనుండుఁ దండు నా
కేరును తోడు లేమనుచు • నెంచి తపించిన మోసమబ్బు నా
ర్వేరము నోటముం గలుగు • వెన్కసమూహ నగ లక్ష్మణుండనున్.

మ॥ అదియే యుత్తమమౌక నీకడస మే • మర్పించి నిల్చున్నచో
నిసి రక్షోబల మిద్ది కార్ముకబలః • బిల్లుండెనంచున్ వియ
త్పాదులంబోలెను చూచుచుం దమ ధను • ష్పాండిత్యమున్ మెచ్చి మే
లదిరా యంటలు దక్క నీకగు సహా • యత్వంబు వేఱుండునే?

సీ॥ అనిపక్క సౌమిత్రి • యాటనుండిలేవ మా, రుతిపచ్చి జానకి • పతికి మ్రొక్కి
యీ సేవవానరు • నెగ్గాడ కీభుజ, ములమీఁదఁ గూర్చుండి • కలను సేఁత
యుక్తంబు; కాదేని • యొగివెన్క నిల్చిన, నాసేవ ఫలించు • వాని సనుదు
నీకసాధ్యంబయి • లోకసాధ్యంబైన, పనియొంటఁ గలుగునే • పవనపుత్త్ర!

తే॥ రావణుఁడు దాపునకు వచ్చి • రణముచేసె, నేని యూర్మిళావిభునకు • నీవుతోడు
పడకయున్న విజయమెట్లు • పడయ గలము ? వనచరుల నెట్లు దక్కించు • కొనఁగఁగలము

తే॥ ఇంద్రజితుపైకి లక్ష్మణు • నెచ్చరించి, పంపినదియు నీతోడనే • వాని నతఁడు
గెలిచినదియు నీవల్లనే • గెలువవలసి యున్నదింకను తోడు నీ • వున్నకతన.

మ॥ అతులోత్సాహముతో స్వధర్మముగ సౌ • ఖ్యంబుల్ విసర్జించి స
మ్మతి నాతోడనవచ్చు లక్ష్మణుని ప్రే • మంగాచి సుగ్రీవు సం
గతి నీవుండి చరాచరప్రతతి దుః • ఖంబుల్ తొలగించి స
న్మతి ధర్మంబును నిల్పుమా యని రఘు • క్ష్మావల్లభుం డవ్వలన్.

మ॥ నీవును తమ్ముతో నిలిచి • నిర్జరవైరు లొనర్చు నీచ మా
యావిధులెల్ల నారసి ర • యంబునఁ దెల్పకయున్న సాగునే ?
రావణమర్దనంబు సమ • రంబున నీవకదా విభీషణా !
భావి శుభప్రవృత్తి కిల • బంధుర శక్తియు జీవగఱ్ఱయున్.

తే॥ అనిన రాముని వాక్యంబు • లాదరించి, పావనియు విభీషణుఁడు సు • గ్రీవుఁ డధిక
మోదమంది వానరసైన్య • ములను కావ, సమ్మతించిరి చనిరి ల • క్ష్మణునితోడ.

మ॥ దనుజధ్వంసి నమస్క్రియల్ సలిపి కో • దండమ్ము చేనంది శిం
జిని నెక్కించి విశాలవక్షమున ప • క్షిహాతమౌ కంకటం
బును లీలన్ ధరియించి యక్షయ శర • ప్రోద్దీప్త తూణీరమున్
వెనుకం దాల్చి రణాగ్రమందు నిలిచెన్ • విక్రాంతి గంభీరుఁడై.

ఆ॥ నూఱుయోజనముల • దూరంబు నిండిన, సేన ముందు నిలుచు • మానిమీఁద
నసురసేనపైచు • నాయుధ వితతు లా, కసముగప్పు సురలు • గాంచి భీతి.

శా॥ రామా ! భక్తభయాపహారక తను • త్రాణంబ ! నీలాంబుద
శ్యామా ! రాక్షసభీమ ! ధార్మిక జగ • త్సంస్థాపనా ! నీవు గా
కీమానంబగు దైత్యసేన కెదురై • యెవ్వాఁడు నిల్వంగ ని
చ్ఛామోదంబున నోపు ? మా హృదయ వాం • ఛాపూర్తి గావింపవే !

మ॥ అని ప్రార్థింపఁగ మౌనులున్ సకల ధ • ర్మాచార సంపన్నులున్
దనుజాధిక్యము రాము నొంటియు మహా • సైన్యంబుతోఁ గాంచుచున్
గనుఁగన్ బాష్పము లొడ్చుచున్ మనము వై • క్లబ్యంబు నొందంగ రా
మునకున్ మంగళ మబ్బుఁగాతమని ప్రా • ర్థంగోరి దీవింపఁగన్.

తే॥ తక్కు సిద్ధసాధ్యాదులు • దాశరథికి, విజయమగుఁగాత దైత్యాలి • విఱుగుఁగాత
నేఁటితోడఁ బాపమ్ములు • నీఁగుఁగాత, మనిరి దనుజవీరులు గాంచి • యచ్చెరువున.

చ॥ నిలుకడ తప్పి వానరులు • నిల్వక పాఱిన శత్రుసేనలో
విలిచి శరాసనంబుగొని • నిశ్చలుఁడై మనమీఁది కెక్కుటన్

గెలుపఁగ నెంచిగాక తన • గెల్పునకంపెను దొడ్డకాదె? యి
ట్టులముగ మాల్యవంతుఁడు వి • డంబన సేయునే? బొంకులాడునే?

మ॥ మును దేవాలి పురారితో రథికులై • మున్నాడిరాఁ దార్క్ష్యుపై
మన సద్వంశ వినాశకుండయిన య • మ్మాయావి వైకుంఠుఁడున్
ఘనుఁడై వచ్చి యెదిర్చెఁ: బీఁడొక ధను • ష్కాండంబుతోఁ గాల్చెదన్
మనపై నెత్తిఁ జలంబు సాహసము సా • మర్థ్యంబు మెచ్చొఁగదా!

మ॥ హరులన్ దేరులు గౌరుఁజన్ శరభ సింహవ్రాతముల్ ఖడ్గ సా
గర సంకాశములై యెలర్పఁ గనుచున్ • గౌతూహల స్వాంతుఁడై
త్వరితోత్కంఠత రండురండనుచు నా • హ్వానించుచున్నాఁడుగా!
ధర నిల్లెవ్వఁడు నిల్చి పిల్చి మరలెన్ • దర్పించు ప్రాణాలతో.

## శ్రీరాముఁడు రాక్షస బలముల నుఱుమాడుట.

మ॥ అనిగర్జించు చతుర్వ్యగర్వమునఁ గు • వ్యద్ఘోర సింహంబు వా
రణ యూథంబులు చుట్టినట్లు బలద • ర్పాక్రాంతులై రాక్షసుల్
తను ముట్టంగని మేలుమేలనుచుఁ గో • దండంబునన్ శింజినీ
నినదంబుం బరఁగించె రాముఁడు లస • న్నిర్ఘాత ఘోషక్రియన్.

శా॥ మాటెన్ సాగర ధారలొక్క మొగి న • మ్మాతంగ యూథంబులన్
దాటెన్ వేగము వారువంబులకుఁ గ్రో • ధంబుల్ దిగంబాఱఁగాఁ
దీటెన్ వీరుల శౌర్యధైర్యములు భీ • తిం బ్రాంతి నిండారుటన్
ఓటెన్ దాహము నోళులెండె మనముల్ • మేండ్రించె దైత్యాలికిన్.

చ॥ తురగ పిశాచ సింహములు • దుర్భ్రమచే నడ తారుమాఱుగాఁ
బరుగులువాఱి కీడఁను • పాడుగఁ గూల్చె మతంగజంబులున్
వెఱగొని మావటీంద్రుఁ దమ • భీకర హస్తముతోడ నీడ్చి యు
ర్వరఁ గొని మోఁది యిచ్చువడిఁ • బాటెను క్షోభము పుట్టె సేనలో.

చ॥ ఖచరులు దుర్నిమిత్తములఁ • గాంచి నిశాచర నాశ సూచక
ప్రచరములంచు నంతసిలి • పాడిరి యాడిరి క్రూరరాక్షసుల్
విచలితులయ్యు రోషమున • వీఁగక పైకొన రామభద్రుఁడున్
గుచయులమీఁద బాణముల • గుప్పెను లెక్కకు మిక్కుటంబుగన్.

సీ॥ హరులపైఁ గరులపై • శరభ సింహములపై, వీరులపై వారి • తేరులపయి
శరషులపై శరా • సనములపై ఛట, శిరములపై వారి • యురములపయిఁ
గరములపైఁ బరం • పరలుగా శరములు, గురియింప నుడిలెను • కుంజరములు
దొరలెను వీరుల • శిరముల కరిణిని, తురగోత్కరంబులు • దురమునందు

తే॥ విఱిగి యఱిముఱియైపడు • విండ్లవలెనె, సిడములనుపొడిపొడి యయి • పుడమిఁబడియె
చంద్ర రేఖలవలె నిశా • చరుల కోఱ, దంతములు పలపలరాలి • ధరణిఁగూలె.

సీ॥ సుడిగాలితో జడి • వడియైన చందాన, రామ నిశాత మా • ర్గణము లొలయఁ
దుంగ మాతంగ తు • రంగ శతాంగ భ, టాంగ సంఘంబులు • త్రుంగి పడియె
నోష్ఠంబు గొఱుకుచు • నుండు దంతంబులు, కోపంపుఁ జూపులఁ • గొఱలు కనులు
కరవాలు వీడని • కరములు గర్జిల్లు, మూర్ధముల్ పరుగిడు • మొండెములును
తే॥ పాఱురక్తప్రవాహముల్ • మీఱితునిఁగి, పడెడి యవయవంబులతోడఁ • బ్రధనభూమి
చూడ బీభత్సమయ్యె ర • క్షోగణముల, యాయుధము లొక పనియేని • చేయవయ్యె.

సీ॥ అమ్ములతోఁ [illegible]ర్మ • కమ్ములు తెగుమున్నె, కత్తులూనిన కేలు • కత్తిరిల్లఁ
గేలకు మున్నుగాఁ • గాళులు తెగుచుండ, నొకటిపై నూఱు సా • యకము లరుగుఁ
దురగంబులకు మున్న • ఖురములు తెగుచుండు, ఖురములతోడఁ జ • జీవులు వోవుఁ
జజీవులకు మున్న, పక్షముల్ వ్రీలును, పక్షాలతోఁ జీలు • వదనములును
తే॥ తప్పిపాఱినదొక్క త • త్తడియు లేదు, శ్వాసమార్చుటకేని రా • క్షసుల కెడము
లేమిఁదబ్బిబ్బులై వారు • రాముఁ నొంచు. వెరవు దొరకక యూరక • యురలుచుండ్రి.

సీ॥ చనఁ దలఁపకమున్నె • చచ్చి పడుచునున్న, శవ నివహము దాఁటి • చనఁగలేక
చన్న వేలకువేలు • శరములు తాకఁ నొ, క్కరథంబు నూఱు ము • క్కలుగ విఱుగు
నంబకంబులు పంచి, యనరు లంటఁగ మున్న, చచ్చినపోల్కి గ • జంబు లురలు
నెనిమిది దిక్కుల • నెనసి యొక్కుమ్మడిఁ, బమ్మిన వీరులా • వలికిటోరు
తే॥ అరదములు బార దూరంబు • నరుగలేదు, వారణంబు లూరక మ్రాలి • వసుధఁగూలె
తురగ సంఘంబులును పని • తోఁచ కుడిగె. భటులు బలియైరి మిత్తికి • బరువు తగ్గి.

మ॥ జలజాక్షుం డొకయప్రమేయ శతమై • సాహస్రమై నూఱు కో
టుల ప్రాణంబులఁ దీయునన్న నుడి నాఁ • డు న్నేఁడు సత్యంబుగాఁ.
గలనం జచ్చినవారి నెంచి విధి లె • క్కల్ తప్పు గావించెఁ బ్రా
ణులఁ గొంపోయెడి కాలుఁడెంతపడెనో? • నోపెంత దానొందెనో?

శా॥ నీరంధ్రక్రియ వారిదౌఘ విగళ • న్నిర్ఘాత సందోహముల్
జాఱం గాలు నరణ్యలీల శర సం • జాతానల జ్వాలలన్
సారంగంబులపై శతాంగములపై • జాల్వారు పెక్కంబు లే
దారింబోయెనొ? బూదియై శ్వసనుఁ డు • ద్దండించి కొంపోవఁగన్.

చా॥ తునిఁగిన శూల కుంత శర • తోమర సంఘము తూపుత్రోపుచే
వననిధిఁ జొచ్చి చుట్టును ర • వంబునఁ ద్రావఁగ నీరు వట్టి జీ
వనచరరాశి చచ్చె నట • వండలిగట్టి పయోధి యెండఁగన్
వనజ హితాన్వయప్రభు స • వారిః బాః జవంబు నేమనన్?

చ॥ అని మన భంజనుం డయిన • యర్కకులేశు నిశాత సాయకో
త్కరము పురత్రయంబు పడి • దాహ మొనర్చిన వైష్ణవాస్త్రమున్
కిరిటిని వీయి దానవ ని • కాయ శిరః పద హస్త సంఘమున్
జాలములఁ జూడఁ జేసినది • సుందర హేమ శతాంగపాళితో.

చ॥ స్థిరవచయంబుమీఁది భట • తీవ్రతరాయుధ శస్త్ర హస్తముల్
ధరణిని రాఁచు దామముల వి • ధంబునఁ గూలుచుఁ ద్రుళ్లె నోష్ఠముం
గఱచిన శిష్టపర్ణము ల • కొంద పయోద హుతాశనాశనుల్
పలుచిన తీరుగాఁ బడియె • దాశ్కరవంశ్య శరాసనోద్భవిన్.

చ॥ విజయ పయోదముల్ గురియఁ • బేర్చిన వారిధియట్లు సంగర
స్థలము రహింప రక్తమునఁ • దాటెను కేయలు మాపటీం ద్రపోఁ
బొలుచు మతంగజంబులును • పూఁడెఁ బదాతిచయంబు పూఁడెఁ దే
జులు పడి పూఁడెఁ గొన్ని సుడి • చుట్టి భ్రమించెను చిక్కదోఁపమున్.

కం॥ తెగి పైకెగిరిన శిరములు, తగులు ననెడి భీతి సురలు • తలఁగిరి దరికిన్
దిగుతలలు శిలలపోలికిఁ, దగులునను చు భూజనములు • తాఁకిరి దెసలన్.

చ॥ ప్రళయ పయోదధారల తె • ఱంగున రామ శరాళి పర్వ నా
కలఁకునఁ దైవ్యు మస్తములు • వ్రాఁగిన కన్నులతోడ ఖేచరా
వళిఁగని మేఘమాలిక ల • వంగిని నింగిని నిండుచున్ మహా
నిల హతిచే విమానములు • నేలను కూలు విధంబుసం బడున్.

సీ॥ కొందఱు దివ్యాస్త్ర • బృందంబుఁ గొందఱు, గదలను గొందఱు • ఖడ్గములను
గొందఱు ప్రాసముల్ • కొందఱు తోమరాల్, కొందఱు ముద్గరాల్ • కూడిపైవఁ
గొందఱు తాఁకిరి • కొందఱు దుమికిరి, కొందఱు తిట్టిరి • కొట్టినారు
కొందఱు పొడిచిరి • కొందఱు విడిచిరి, కొందఱు విసరిరి • కొంద ఱుగ్ర

తే॥ దృష్టిఁ జూచిరి కొందఱు • తెరలినారు, కొంద ఱార్చిరి డాఁగిరి • కొంద ఱుక్కఁ
గ్రమ్మ కారుమబ్బులవలెఁ • గ్రమ్మి తుదకుఁ, బడిరి సమరస్థలము బట్ట • బయలుగాఁగ.

సీ॥ ఏసిన వేసిన • యెత్తిన పట్టిన, యాయుధముల రామ సాయకములు
విఱుచుచుఁ బైపయి • బెరసి గజావలి, నురలఁ ద్రోచు గుఱ్ఱాల • దొరలఁ దాఁచు
శిరములఁ గోయును • శరములఁ ద్రోయును, విండ్లు విఱుచు మేలు • గండ్లు పఱుచుఁ
గవచముల్ భేదించుఁ • గరముల ఛేదించు, స్థైర్యంబుఁ బోకార్చు • శ్రమముఁ గూర్చు

తే॥ బలముఁ బొలగించు శిలలను • నలఁగ దంచుఁ, దరువులం ద్రుంచు పైచిన • గిరులఁ ద్రెంచు
అహహ ! యేమందు రాఘవు • నస్త్రలీల, బట్టబయలయ్యె రాక్షస • ప్రధనభూమి.

లయగ్రాహి॥
కాలుతెగి కేలుతెగి • వ్రేలుతెగి వాలుతెగి • మేలు తెగి రాక్షస శ • రాలి తెగిపోవన్
గూలెఁ గరితండములు • వ్రాలె ఖరసంఘములు • తూలె భటబృందములు • వ్రీలె రథపాళుల్
వేలకొలఁదిన్ విశిఖ • జాలములు తక్కుఁగల • కీల లెగఁజిమ్మెడి క • రాళ పరిఘాదుల్
లీల నొకకేల ఘన • ఖేల గొనునోలి బల • శాలి వనమాలి తన • కోలలఁ గవించెన్.

తే॥ లెక్కలేని దోషాచరు • లొక్కపెట్టి, నొక్క నరుపైన శరవృష్టి • మిక్కుటముగఁ
గురిసి రామభాణములచేఁ • గొండలట్లు, దొరలి పొరలిరి దురమున • శిరములూడ.

తే॥ వేయికరుల చేవగలదై • తేయుల కొక. శరమువంతున శ్రీరాము • చంద్రుదేసె
రక్తవాహినిఁ గూలితి • రములఁజేర. లేక పెక్కేనుఁగులు వార్ధి • లీనమయ్యె.

తే॥ తెగునుకొండలు వలయముల్ • తెగును గదలు. విఱుగుఁ గుంతముల్ దంతముల్•విఱుఁగు గరులు
హరులుఁ దేరులు విఱుగు ఢ • క్కార్థమందు. రామబాణ మొకొంటిచే • రణమునందు.

తే॥ జగము లేకకాలంబునఁ • జంపజాలు. జముఁడు మంత్రులు దూతల • చరణయుగము
గలుగువారొటఁ బఱగిడి • యలసినారు. పొలియు నసురుల యుసుఱుల • మోవలేక.

ఉ॥ కుప్పలు కుప్పలై కలనఁ • గూలిన దంతులు తేరు లశ్వముల్
తిప్పలు తిప్పలై పెరిఁగి • దివ్యలమార్గము నంటుచుండినన్
దెప్పలు బీనట్లు లట్టలొగిఁ • దేలి నటింపఁగఁ బచ్చుపీనుగుల్
తెప్పునఁ బ్రాణమొందెనని • దిగ్భ్రమఁబాఱెను జీవసంఘముల్.

ఉ॥ నల్లనిభాను బోలి కిర • ణంబులు చిందెడు రాఘవుండు పైఁ
జల్లినయట్లు రక్తకణ • జాలము పర్వ యుగాంతవేళ భా
సిల్లెడు భానుమూర్తియనఁ • జిందిన శాత్రవరక్తమందు రం
జిల్ల మునింగి లేచు ముని • సేవ్యుని భార్గవుఁబోలె శోభిలెన్.

ఉ॥ చిప్పలు పిడ్గులట్టి రఘు • శేఖరు తూపులు క్రమ్మ మస్తముల్
వ్రచ్చి నశించుచుండఁ దమ • వారలు చచ్చుట చూడలేక వి
వ్వచ్చము నోర్చి రౌత్సుకత • వ్రాల్పిరి మూఁగిన సోఁకుమూఁకలున్
గ్రచ్చలు నీఁగలట్లయిరి • రాముఁడు కల్లునుపోలె నయ్యెడన్.

ఉ॥ క్రమ్మిన దానవావళుల • కంఠములం దెగనేసి వ్యోమ మం
గమ్ముల యాటలాడెఁ దగ • నచ్చనగండ్లను గ్రచ్చకాయలన్
జిమ్మెడిలీల శీర్షములఁ • జిమ్ముచు నస్త్ర విధాన నైపుణిన్
బమ్మిన కేరులం గసుల • భగ్నమొనర్చెను నుగ్గునుగ్గుగన్.

చ॥ పలుపురు ప్రాణముల్ విడిరి • పల్వురు పాఱిరి సూటి తప్పఁగాఁ
బలుపురు దాఁటుచుం బొరలి • బన్నము నొందిరి కుంది కంది లోఁ
గలఁగిరి మంది మూఁదిరి హి • కాలిరి నిక్కిరి బ్రుక్కి రాంత్రముల్
వలనుగఁ జెక్కి రేడిచిరి • వండి రెదిర్చిరి పోరి చచ్చిరిన్.

తే॥ కవచ కుండల కేయూర • కటక మకుట, కంఠికా హారవితతులు • కలనఁ దునిఁగి
దొరలు వారిమేనులనుండి • ద్రుంగి యురలి, మొగులు గములందు మించుల • పగిది మెఱసె.

సీ॥ వెనుకనున్నాఁడు ముం • దున నున్న వాఁడొగి, వదనమందున్నాఁడు • హృదివిగలఁడు
తలలపై నున్నాడు • మలలపై నున్నాఁడు, కెలఁకుల నున్నాఁడు • క్రిందగలఁడు
మింటిపై నున్నాఁడు • మంటిపై నున్నాడు, కత్తుల నున్నాఁడు • కరులమీఁద
ఖరువులమీఁదను • తరువుల మీఁద న్యం, దనములమీఁద నం • తటను గలఁడు

తే॥ నాయెదుట నాయెదుట నిల్చి • నాఁడు నీడు. కనులనున్నాఁడు కోదండ • కరుఁడటంచు
కటకుసోఁకులె భ్రమసి వా • చఱచునట్లు, మించి యెల్లయెడల సంచ • రించె నతఁడు.

చ॥ జలధులయందు లోకముల • శత్రుసమూహములందు పెక్కు మా
యలఁగొని కామరూపముల • నందు నిశాచరరాజి చింతనం
బుల నెదలందు వెల్గెను • పొల్పుగ నిల్చినవాఁడు మెల్పునన్
బలిబలియంచుఁ బల్కుఁదగు • పద్ధతినొప్పెను రాముఁ డెల్లెడన్.

శా॥ నానానూన విధాన ... రముల వి • న్నాణంబుతో నుండె నీ •
భూనాథుండను బుద్ధిలేక మఱుఁగై • పోయెంగదాయంచు వి
జ్ఞానానంద మయాత్ముఁడై మఱచెఁ గ • ర్వంబంచు గీర్వాణు ల
జ్ఞానావస్థ భజించి దిగ్భ్రమల నా • శంకించి రప్పట్టునన్

క॥ చండాషిల వేగంబున, ఖండిత తరుకాండమట్లు • కర్బుర గణముల్
తుండములై దెసలం బడ, భండనమునఁ దిరిగె రామ • భద్రుఁడు పెలుచన్.

క॥ హయులు కరులు వీరభటులు, సరథంబులు గిరులఁబోలె • సపవిం బెరుఁగన్
గిరినుండి గిరికి దాఁటెడు, కరణిం దిరుగంగవలసెఁ • గాకుత్స్థుఁ డటన్.

క॥ అంబరమంటెడు ధ్వజ చీ, నాంబరములతోడ గొప్ప • యంబారులతో
డం బూఁడి మునిఁగె గురు ర, క్తాంబుధిలోఁ గరి ఘటలు ప్ల • వావలి కరణిన్.

క॥ తెగిన సురారుల శిరములు, నెగసి మరలఁ బడమిఁ బడెడి • వియతిం జూడన్
దగ విజయలక్ష్మి చేకొని, యెగురవయిచు జలజ వితతి • కెనయై యుండెన్.

క॥ వాలమ్ములఁ గరములతో, వాలమ్ములు గరము విఱిగె • వాలెమ్ముగ జీ
వాలమ్ములుపల కెరయై, వాలమ్ములఁ బోలు • దైత్యవర్గము సమసెన్.

క॥ ఖేటకములు తునిఁగిపడెన్, ఘోటకముల తలలతోడఁ • గూటువ లగుచున్
బూటకముల కిమ్మయి చను, హాటక కోటీర మస్త • కావలితోడన్.

క॥ క్రూరుల దంష్ట్రలు తెగి తమ, గౌరుల మేనులను చొచ్చి • కారు మొగులనం
దూఱ లసద్బాల శశిం, గేరు లలిని తోఁచెఁ జూచు • గీర్వాణులకున్.

క॥ అక్కిటిలుల పెనుకోఱలు, మిక్కుటమగు కరి రదములు • మేదిని నిండన్
బెక్కురు కల్పంబులఁ గల, పెక్కురు నెల లొకటఁ జేరు • పేరిమినొప్పెన్.

క॥ అసురుల తనుగిరులందున, విసరముగాఁ బొడమి దెసల • విరిసిన రక్త
ప్రసరమున నచటి జనములు, పసరములును చనియె నెక్క • పర్వతములకున్.

క॥ నిండె దివి జీవతతిచే, నిండెం భువి దానవ శవ • నివహముచేతన్
నిండె శరధి రక్తముచే, నిండె సురల కనులు రామ • నిపుణత్వముచే.

క॥ కయిదువులు రక్త నదముల, పయి వడివడిఁ బోయి బహుళ • వనచర వితతిన్
బయి దవిలి పరగఁ ద్రుంపఁగఁ గెయిదంబులు తఱుఁగ విఱిగి • చేడ్పడి చచ్చెన్.

మ॥ బలహీనుండగు నొక్కమానవుఁడు పై • పైఁ బేర్చి దోషాచరా
వలి కావించిన వ్యూహముం జెఱచి త • త్పాండిత్యముం జూపి దై
త్యుల ఖండింపఁగఁ బండ్లు గీఁటుచును వ్య • ర్థుం బోలె నిల్తుండుటా ?
యలుచుం జంపెదనంచు వహ్ని కడు రో • షాయత్తుఁడై లేచుచున్.

## వహ్ని దానవసేవలఁ బ్రోత్సహించుట

చ॥ ములుకులు వచ్చి పైఁబడక • మున్నె నిశాచరు లంద ఱొక్కపై
యలుగులపాటు నొంద కొగి • నాతనిపైఁ బడ నగ్గి చావఁడే ?
జలధులపోల్కిఁ గానఁబడి • చప్పిడి చేఁతలఁ జేయుచుందురే ?
మలకలు మాని పైఁబడుఁడు • మ్రాల్పుఁడు లెండని ప్రోత్సహింపఁగన్.

పంచచా॥ చలంబుతోడఁ గర్బురుల్ వి • చారదూరులై వెసన్
బలంబు చూపి యొక్కకొండ • పైని పెక్కు మేఘముల్
జలంబు చిందు భాతి నైక • సాయకంబు లేసి తా
వలంబు తూలఁ దర్జనంబు • ఖర్జనంబు సేయఁగన్

ఉ॥ తివ్వన రామబాణములు • రేఁగుచు శీర్షము లెన్నొ చెందుచున్
ద్రెవ్వఁగఁ జేయ రాక్షసులు • తీఱిరి కూలిరి చాఁపకట్టుగా
నువ్వున నాడిపాడెను మ • హోద్ధతి నార్చెఁ బిశాచ సంఘముల్
కవ్విన నోటిలోఁ గొఱవి • కట్టులు నావల దివ్వెలట్లుగాన్

॥ రక్తపంకిల వార్ధి వ • స్త్రముగఁ దాల్చి, రక్తచందన మలఁది ధ • రా పురంధ్రి
పెద్దపెండ్లిఁ జూడఁగ వచ్చు • పేరఁటాలి, కరణి నొప్పారె నారణ • క్ష్మాస్థలమున.

॥ ఘృత సురాక్షీర దధిలవ • ణేక్షుశుద్ధ, వసనిధులు రక్తమయమయి • పరఁగు కతన
సప్తవారిధులను పేరు • జాఱవిడి, యొక్క రక్తతోయధి యన • నొప్పె నపుడు.

క॥ తొడుగుట యొకపరియైనను, వెడలు టెఱిఁగుటము లెన్న • వేలకు వేలె
వ్వాడు వధము పూర్తియగు న, వ్వాడు లేనెంచఁబోలు విల్లు • పొడవయి నిలుమన్

సీ॥ ఎత్తినవారలు • నేసిన వారు గ, ట్టించిన వా రెది • రించువారు
వడిగొను వా రోడి • పాఱినవారు కో, పించినవారు మ • దించు వారు
తొఱఁగిరి యదరిరి • తొదఁకిరి పదఁకిరి, మదఁగిరి బెదిసిరి • మడిసినారు
చూడ్కులు మనసులు • చూడ నూహింపఁగఁ, దగిన యంతటి సమ • ర్థములు కావు

తే॥ తొడగినవివేయియలుగులు • వడిగఁబోయి, చంపుటయొకసహస్రముకాదు • శతసహస్ర
మట్టిదే వడి యుద్దేశ మట్టిదె యగు, దానవ శరాళి తమ గావ • లేనివయ్యె.

సీ॥ ముందుభాగమ్మున • మొగమును రెండు ప, క్షములును పృష్ఠమ • ధ్యములు గలుగు
ఘనశరవ్యూహమ్ము • కాకుత్స్థకుఁ డుండు: నూదియుఁ జొరలేని • చొప్ప పన్ని
నాయమ్ము లొగినేగి • యాయమ్ములం గ్రుచ్చు, వలఁకుల దుస్సి య • వ్వలికి నేగు
నాయమ్ములకుగుఱి • యైనరక్కసులు చ, చ్చుటగాక యెఱిరి గె • ల్చుటయుఁ గలదె?

తే॥ విలయకాలానలముఁబోలి • యలుఁగు లదర, నెండుటడవులఁ బోలిరి • మెండె యసుర
వరులు; రామబాణములు వా • గురనుపోల, దనుజగణములు తగులు మ • త్స్యములఁబోలె.

తే॥ చండ మారుత మట్లు దా • శరథి యొప్పఁ, జెదరు మలలకై పడి శుక్ర • శిష్యు లంద్రి
విలయ కాలసాగరమట్లు • వీర రామ భద్రుఁ డుండఁ గ్రాణులబోలి • వారలుంద్రి

మ॥ మొదలై సృష్టియై స్థితి మధ్యమగుచున్ • పోషించి యంతంబునై
తుది గావించు పరాత్పరుండు దనుజస్తోమంబుకై కల్పమై
పొదలన్ దారు చరాచరంబుల విధం • బుం బొందిరి రాఘవుం
డుదధి ప్రోత్థ విషంబు గాఁ జనిరి మ • త్స్యోఘంబుగా రాక్షసుల్.

ఉ॥ వంచనఁ గూటసాక్ష్యము స • భం బలుకాడి ధనంబు గూర్చు నా
కుంచిత పీఠవర్తనుని • కుంఠిత వంశముఁ బోలి రాక్షసుల్
ప్రాంచిత ధర్మముం జెనపె • రాముడు; తాను విషాంబువై చనన్
గ్రంచర ధావి ఝామమునఁ • ద్రావిన బీదలయ్యెరి దానవుల్

చ॥ ఒక శతవాహినుల్ ముగిసి • యున్నతటిన్ జలరాశి లంకయున్
సకలము నొక్కఁటై సమర • సంబుగఁ గన్పడ దానవాంగనల్
కకవికనొంది యేదియును • కానక చిత్త కలంకమొందిరి కా
ళ్లు కుదియ నెట్లుపోక డిగు • లుం గొని కూలిరి మున్గి రందులన్.

తే॥ దాసిన సురారు లసువులఁ • బాసినారు, కుప్పలై నింగి నంటెను • కుణప చయము
ఎడిరి నెత్తురు పోలేక • యెవరు తిరిగె, వెనుకనున్న సైన్యంబు ముం • దునకు వచ్చె.

క॥ రేఁచిరి కరి శరభాదుల, వీచిరి తోమర గదాది • వివిధాయుధముల్
త్రోచిరి సేవల ముందున, కేచిరి ప్రాణంబు తీపి • యెఱుఁగక వారల్

ఆ॥ రండిరండి మీవ • రంబుల బలములఁ, దెండితెండి తెచ్చి • యిండియిండి
వాశరముల కనుచు • దాశరథి వచించి, పేర్చి శితశరంబు • లేర్చి యేసె.

చ॥ తమతమ సేన లవ్వలికిఁ • దారఁగనీయక సైన్యనాథులే
తమకముతోడ నడ్డుపడి • తార్చుచుఁ జచ్చినవారి దాఁటుచున్
దుముల రణంబుకై యటిమి • త్రోయుట డాయుట గాంచి నిర్జరుల్
కుమిలి త్రినేత్రుఁగాంచి యెద • కూరిమితో వచియించి రివ్విధిన్.

ఉ॥ రాణువలోన నొక్కొక్కరు • రావణుకంటెను ముమ్మడుంగు వి
న్నాణులు వారిలెక్క గణ • నంబునకందదు వంచి మించుచున్
జాణతనాన డాసి రిఁక • జానకినాథుఁడొ యొక్కరుండు మా
పోటిమి మాల్చివట్టి బల • పూర్ణులు దానవు లేమి మూఁడునో ?

ఉ॥ రాఘవుఁ డేయునట్టి ప్రద • రమ్ముల నంతరమంద త్రుంచుచున్
మేఘము లట్లు క్రమ్ముకొని • మించిరి ముంచిరి వీరలన్ మహా
మోఘముగా శపించి యసు • పుంజము తీసినఁ దీయవచ్చు బా
ణౌఘముచే జయింపఁ దర • మా మముబోఁటికి మీకుఁ దక్కఁగన్ ?

చ॥ అని వచియింప శూలి భయ • మందకుఁడయ్య సురారు లెందఱై
న నగిని దూదిఁగాల్చు వయి • నంబున రామశరాగ్ని కాల్చు నే
మనుపె వచింపనే ? యమృత • మున్ గరళం బపపాడి చక్కటిన్
గొనకొని గెల్చెనేనియును • క్రూరులు రాఘవు గెల్వనేర్తురే ?

చ॥ తలఁచినచో విభీషణుఁడు • తక్క జగంబున జీవయుక్తుఁడై
యలుచు నిశాటుఁడున్నె యొకఁ • డాదట సత్కృపగల్గ ధర్మమున్
బొలచును మీరు దాఁగుటకు • భూధర కందర లింక రోయఁగా
వలవదు నేఁటితో దనుజ • వంశము మాయు నిబద్ధి నానుడుల్..

చ॥ అని హరుఁడాడ బ్రహ్మయు య • థార్థమ యంచు వచింప వేల్పుల్
మనమున నెమ్మదిం గొనిరి • మానవనాథుఁడు మండలీకృత
స్వవిత ధనుఃపయోదమున • శాత శిలీముఖ వృష్టిగూర్చి వా
లిన దనుజోత్తమాంగక శి • లింధ్ర సమూహము సృష్టిచేయఁగన్.

చ॥ అనఘుని చుట్టుకొన్న దను • జావళి స్వర్గముచేరి యచ్చటన్
మనుటకుఁ జోటులే కలయ • మ్రాలిన మేనులు తత్తశింపఁగన్
దునిఁగిన యాశ్విక ప్రతతి • తోడన దివ్య శరీరమంది మే
దినిఁ దమ గుట్టముల్ పొరలి • త్రెళ్లుట గాంతురు మింట నిల్చుచున్.

ఉ॥ అంబుధులందు శైలముల • యందు వనంబుల యందెదారులన్
బంబిన నాక్షమందు ఘను • పాతెదు పేరకుఁ దేటిచూచినన్

దంబుగ నట్టనఁ దలల • దాఁచుచుఁ దేల్చుచుఁ గొంచుఁబోవు ర
క్తాంబు నదీనదంబు లిర • పై కనుపట్టెను తొల్కరిం బలెన్.

చ॥ ఎదిరిచినట్టి యోధవరు • లేర్దైబ మారి నశింప వాహినుల్
సదమదమంద వెన్కఁగల • సైన్యము పాఱెను త్రోవఁజూడ నం
గదగోవి వారినాయకులు • కాంచి వివేక విహీనులార ! పా
ఱెదరె ? బిరెఁబిలేదె ! యని • రేఁవఁగ వే చులపోల్కి వారలున్.

చ॥ చెవుదు పడంగ లోకము వి • శీర్ణతనొంద మొయిళ్లు దేవతా
నివహ శిరంబు లూఁగ నవ • నీధరముల్ చలియింప వైచు కై
దువులు మెఱుంగుపిడ్గు లను • తోయముగొల్పఁ దమన్నమూహముల్
దవిలి యెదిర్చెనాఁగ బల • దర్పములన్ దనుజాలి క్రమ్మఁగన్.

ఉ॥ రాముఁడు రండురండని స • రాగముతో నతిధి ప్రకాండమున్
ధామమునం దెదుర్కొను వి • ధంబున నేగి పృషత్క వృష్టి గా
రాములు చూపఁ దెక్కములు • రాలె దిశాంతను లందు వార్వముల్
భూమిని మ్రొగ్గెఁ గూలె రథ • ముల్ పవి భిన్న మహాద్రులోయనన్.

సీ॥ శకలంబులై పడు • స్యందనాంతరములఁ, దనియక కంకగృ • ధ్రములు తూటి
బలితంబుగా నేఁ • బరసుల లాగంగ, భానుబింబము మాఱు • పాటునొంద
గ్రహగతుల్ దప్పంగఁ • గడలియు సుడియంగ, సారెకై వడి భూమి • సరగఁ దిరుగ
ధర్మంబు సమవర్తి • ధనువు పిశాచము, లట్టలు గదిసి నా • ట్యంబు సేయ

తే॥ భవుదు నింద్రుండు పద్మసం • భవుఁడు మునులు, విబుధులును దిక్పతులు మోద • వివశులుగుచు
బిల్లగంతులువైచి యా • వింటినేర్పు, దిట్టతనము సాహసము ను • తించినారు.

తే॥ సమసి చతురంగ బలములు • సాగరములఁ, జెనరుచుండ దుగ్గాంబుధి • బిలుకు దేవ
దానవుల చేతులంబలెఁ దబిమిపాఱు, కిలుకు నొకుల కాశలు • గతులు దప్పె

తే॥ రథగజాశ్వ భటాది వ • ర్గములయందు, గాయములఁ గలిగించు రా • ఘవ కఠోర
సాయకంబు లాసేన నెం • చంగఁజొక్క, బంచు కరణీనిచొచ్చె న • త్యుత్కటముగ.

తే॥ సమసెరాణువల్ మిగిలిన • స్వల్పబలము, స్రుక్కి ప్రక్కకొదుఁగుచూఁగని • దక్కనసుచు
వారి నవలికిఁ బోవీక • బాణచయము, వలన నొకకోట గట్టె పై • థిలి విభుండు.

తే॥ బలియురైన మాలివి మాల్య • వంతునిమదు, కైటభులఁబోలి జగములఁ • గలఁచినట్టి
కవచధారులు రాముఁడు • కట్టిన శర, దుర్గమును దాఁటఁ జాలక • త్రొక్కువడిరి.

తే॥ చచ్చినట్టివార లెదుటఁ • జమ్పుచుండ, రేఁపఁబడిన వారింబలె • రేఁగి బడబ
క్రాఁచఁదెరలిన శరనిధి • కరణినొక్క, ప్రక్కకేతెంచి వహ్నితోఁ • బలికిరిట్లు.

తే॥ త్రిపురవైరి జనార్దన • త్రిదశవిభులు, మనబలము త్రుంచలేకయే • మరలినారు
ఒక్కమానవుఁ డీవేళ • నుక్కుమీఱి కలచుచున్నాఁడు రాక్షస • గణమునెల్ల.

తే॥ ఒక్కఁడే జగముల గెల్వ • నోపువాఁడు, వేయివెల్వల తుటుముక్క • వ్రేలుమీఁదిని
గెలిచెనేమనఁగాఁడింక • జెలఁగి యీఁగ, గరుడ వితతి జయించిన • కరణియయ్యె

తే॥ బ్రహ్మతోడ శివుండు గీ • ర్వాణపతియును, వచ్చి పింగిని కనఁబడు • వారుగాని
కానరాఁడు వెన్నుండఁదు • గానఁజూడ. నతఁడె యితఁడగు సను సంశ • యంబు పుట్టె

తే॥ పద్మసంఖ్య బలంబిప్పు • పాడుపడియె, నొక్కవెల్లువ శేషించె • యున్నదింక
నేమి చింతించి రాఁగల • దేమిఫలము?, తలఁపుఁడన్న వహ్నియు నిట్లు • పలుకఁదొడఁగె

చ॥ మృతికిఁ గలంగి క్రమ్ముఱుదు • మేని దశాననునాస్యపద్మ మే
గతిఁ దిలకించువారము? జ • గంబున నెట్లపకీర్తి మోచి జీ
వితమును త్రోచువార మది • వీడి యశస్కర మార్గమందు స
ద్గతి యొదవంగ నీభవము • ధన్యముగా విడువంగ మేలగున్.

ఉ॥ సంకటపాటునం దవల • జాఁగి మెలంకువతో మెలంగఁగా
లంకను వీడిపోవఁగఁ ద • లంచినఁ గోలలకోట దాఁటలే
ముంకున నెల్ల రేకమతి • నొక్కట రాముని చుట్టుముట్టుచున్
జంకెనతోడఁ జంపుదము • చత్తము యోగ్యత యియ్యదేయనన్.

తే॥ అన్నినదులు సముద్రంబు • నందు లీల, శలభములు దీపమునఁబడు • చందమునను
విధియె పిగఁబట్టి యీడ్వ వి • ద్విడ్గణంబు, దాసి రాముని చుట్టెఁ గ • డంకతోడ

తే॥ గోగణంబు నడుమునున్న • క్రోలుపులిని, బోలు రాఘవుపై సోఁకు • మూఁకలపుడు
పరశు తోమర కుంత ము • ద్గర ముసుండి, వాల శ త్ర్యాదులను పట్టి • వైచినారు.

## రాముండు గాంధర్వాస్త్రము సంధించి విడుచుట

క॥ గాంధర్వాస్త్రము రాముఁడు సంధించెఁ దదీయ దివ్య • శరము ఫణీంద్రున్
గంధిని గరుడుని పావకు. గంధవహుని బోలి యదరి • కడుపడి నరిగెన్.

ఉ॥ అక్షిలుమూఁడు మోము లయి • దగ్నిశరీరము గల్గుకోల పా
లాక్షుని మేనిఁబోలి యొక • పైదయి యేఁబది నూఱు వేలనై
లక్షలు కోటులై పర బ • లంబున నొక్కని కొక్క రాము రూ
పక్షిగతంబుగా సదరి • యందఱఁ గూలిచె నొక్కవ్రేల్మిడిన్.

సీ॥ ఏడుదీవులయందు నెనిమిది • దిక్కులఁ, బాతాళమందును • పర్వతములఁ
బంక్తికంధరునకు • బ్రతినిధులై ప్రేమ, పాత్రులై దిన నిశా • పతులఁ గూర్చి
హారంబుగాఁ జేసి • యక్కున ధరియింపఁ, జాలు సమర్థుల • చ్చటికి వచ్చి
మనలోన నొకని నీ • మనుజుండు గెలిచిన, రావణుసైత మో • ర్వంగఁగలఁడు

ఆ॥ కాననొక్కఁడొకఁడె • కాకుత్స్థుతోడఁ గ, య్యంబుసేఁత మేలొ? యందఱొక్క
మొగినిక్రమ్మి వాని • ముంచుకొనుట మేలొ? యనుచు వహ్ని నడుగ • నాతఁడనియె.

ఉ॥ ఒక్కఁడొకండుగాఁ జని ర • ణోత్కటు రాముని గెల్వలేము మీ
రెక్కడి వార్తలాడెదరొ? యిప్పటి సంస్థితిఁజూడరో? యనన్
రక్కసులెల్లఁ గూడి బవ • రం బొనరించుటె యుక్తమంచు విం
ద్లెక్కిడి సంకులార్తి దెస • లెల్లను బీఁటలువాఱ నార్చుచున్.

చ॥ భుజములు దట్టుచు న్నిలువ • భూరి భయంకర లీల రాక్షస
వ్రజములఁ జంపియున్ దనివి • వారని రాముఁడు వారిఁగాంచి య
క్కజముగ శింజినీధ్వని జ • గద్భయదంబుగఁ జేసె లోకముల్
ఓజపడిఁ గొల్చు సూర్యశశి • నేత్రుని శంఖవిరావమో యనన్.

ఉ॥ పెక్కురు శాస్త్రవిద్వరులు • భీకర సత్క్రమ యుద్ధకోవిదుల్
పెక్కురులై దివౌకసుల • వెంటఁ జరించిన దైత్యబంధులన్
ముక్కులఁ గోసినారలు ప్ర • మోద మనస్కులు కాలకాలనే
లెక్కయొనర్పనట్టి మద • లీలలఁ దేలెడివారు రాక్షసుల్.

చ॥ పిడుగులు రేఁగినట్లు మద • భీషణ వారణరాజి యేచిన
ట్లడరి సమీకనైపుణి బ • యల్పడఁ బెక్కువిధాల నయ్యెడన్
నడచిరి వారి యాయుధ గ • ణంబుల నేత్రములందు పెల్లుగా
మిడుఁగుఱు లుప్పతిల్లి గిలి • మిక్కిలి కూర్చెను ఖేచరాలికిన్.

తే॥ నేమిరావంబు కింకిణీ • నినదములును, సింహనాదంబు ఘీంకృతి • శింజిని రుతి
హేషలును భుజాస్ఫాలన • హేల లాయు, ధముల రవము లేచెను బెడి • దంబుగాఁగ.

తే॥ వారు రావణుఁబోలిన • వారు తాము, లీల గెలువని లోకంబు • లేదు తత బ
లిష్ఠు లాదైత్యులను రణ • నిష్ఠతోడ, జానకీజాని యెదిరించె • సంగరమున.

సీ॥ వారలు పెల్లేచి • వైచు చక్రాది సా, ధనముల నడుమనే • తునియఁజేసి
వారి తొమ్ము లగల్చి • తేరులతోడఁ బ, రిధి బింబములు నాధ • రిత్రిఁగూల్చెఁ
గైదువుల్ వట్టిన • కరములు మేనులు, మెఱుఁగులతోఁ బొల్చు • మేఘములన
భువిఁ వ్రాలెఁ దెగి శర • ములతోడఁ బడు రేలు, ఫణులు కొమ్మలతోడఁ • బడుటఁ బోలె

తే॥ వార్ధిఁ జేరె నెత్తుటియేట • వారణములు, కొండలంబలె గుఱ్ఱముల్ • కొఱలుచుండె
నాయుధంబులు చోఱమీ • లనఁ జలించె, ఖేటకంబులు తాఁబేళ్ళ • క్రియను పొరలె.

తే॥ వాతహతిచేతఁ దెరల కం • బములతోడఁ, గూలు పడవలవలె నేనుఁ • గులు సిడంపుఁ
గంబములతోడ రుధిరాప • గాప్రవాహ, మందు మునిఁగె హాహాకార • మతిశయింప.

తే॥ తునిఁగి రక్తవాహిని యందు • దొరలుచున్న, కరములందు శరము • లుట్టి • కవ్వియుండఁ
గమలనాళంబులను నోటఁ • గవ్వికొన్న, పావురంబు కూటంబుల • పగిదిఁ దోఁచె.

తే॥ పటికరాలతోఁ జేయంగఁ • బడి విఱిగిన, కేరిచక్రంబులు పయోధి • తెరల నడుమ
నురలఁబడు పూర్ణచంద్రబింబోత్కరంబు, నాఁగ నలరారె. గనులకు • నాకెమగుచు.

శా॥ మాయలచే జయంబుగొను • ధూర్తర ధర్మ విముక్తిఁ జంపఁగా
నాయితపడ్డ రాఘవు శ • రాసన మొక్కట వంగునంత దై
తేయ శిరోమహీధ్రములు • తెట్టువలై గొనయమ్ము పంగఁగా
నీయక వచ్చివచ్చి పడి • యిట్టటు లాడఁగనీయ వింతయున్.

తే॥ వక్షములఁ జొచ్చి రుధిరంబు • వట్టఁ ద్రావు, పక్షయుతశిలీముఖములు • ప్రసవములను
పక్షములు వెలినుండంగఁ • గుక్షినిండ, మధువుగొను శిలీముఖముల • మాడ్కినొప్పె.

తే॥ యోజనాయతమగు సమ • రాంగణమున, రమణ లోకైకవీరుఁడౌ • రాముఁడొంటి
మెయిని పాదచారి యగుచు • మృథము సేయు, చొక్కటాములోఁదిరుగంగ • నోపెనతఁడు.

చ॥ నిలిచిన వారి యెట్టెదుట • నిల్చుచుఁ బోయెడు వారి ముంగలం
బొలుచుచు నెందుచొచ్చినను • పొందుగ నడ్డముపోయి రాక్షసుల్
బెఱకుఱ నిల్చుచున్ విసుగు • వేసటలేక • వధించుచుండ దై
త్యులు వెఱఁగంది కంబమునఁ • దోఁచు నృసింహుఁడె యంచు నెంచుచున్.

ఉ॥ ఇచ్చటనుండె నిందుగలఁ • డిచ్చటఁ దోఁచె మలంగె నాకడన్
వచ్చెను వీఁడెయంచు భ్రమ • వాఱి శరంబులు కూర్చి యేరిపై
నెచ్చటనేని వైచి మఱి • యెద్దుచు దైత్యులు తమ్ముదామె పె
న్మచ్చరమూని చంపుకొని • మాఁడిరి పెక్కురు తత్ప్రణస్థలిన్.

ఉ॥ ఒక్కఁడు రాముఁడంట యది • యొప్పునె? నూర్గురు కల్గి వేవురున్
నిక్కముకాదు లక్షయన • నేరము కోటియనంగ వచ్చునో
పెక్కురు పెక్కుకోట్లు రఘు • వీరులు గల్గుదురంట సత్యమా
నిక్కడనంచు నేలయన? • నెల్లెడ దానయి నిండెఁ జెల్లరే!

ఉ॥ అంతట వీరరామమయ • మై కనుపట్టు నిశాచరాలి ది
గ్భ్రాంతి వహించి యొక్కొకరు • రాముఁడు నాకడఁ జిక్కెనంచు దా
వంతము లీఁగె నంచెదురు • పడ్డ సురారులఁ జంపుకొంటచేఁ
గొంత యలంత తగ్గెను క • కుత్స్థ కులాబ్ధి సుధాంశుమూర్తికిన్.

చ॥ అరదములం గుఱాలపయి • హస్తులపై వనరాశిమీఁద నం
బరమున నున్నవాఁడనుచు • భ్రాంతిని యెందును పోవలేక ని
వ్వెరగొని నిల్చి చుట్టుదును • ప్రేయుచు మించి పరాక్రమించు కం
ధర నిభ దేహ వేగ బల • దర్పములం గనుచుండ్రి రక్కసుల్.

ఉ॥ నిండిన భండనస్థలిని • నీరజనేత్రు బలిష్ఠ చండ కో
దండ విలగ్న ఘంటికలు • దంధణ మ్రోఁగిన యప్పుడెల్ల వే

దండ తురంగ సంఘములు • దారణిఁ గుప్పలు కూలుచుండు బ్ర
హ్మాండము దద్దఱిల్లు దను • డాంగన పాశికి రాలు నశ్రువుల్.

ఉ॥ చచ్చినవారి కేడలను • చావక పోరెడి వారి కేడలం
దచ్చుగలాగి వచ్చిన • దానముతో వడిఁగానవచ్చుటఁ
గ్రచ్చుఁ బోరుసేయు నొగి • కంబున రాఘవుఁ డొక్కతేరిపై
వచ్చిన చందమొందె కను • వారికిఁ దోఁచె రణాంగణంబునన్

మ॥ ఒకకోదండము యున్నఁ దూణమొకఁడై • యున్నన్ శరస్తోమమా ?
తుకమున్ మీఱుచు వర్షబిందువుల సం • దోహంబుకంటెన్ విశే
షకమయ్యెం దసకేలు వేయికరముల్ • సాగించు కార్యంబు త
క్కక కావించె సహస్రహస్తములు పేఁ • కన్ రెండుగా నయ్యెనో ?

మ॥ ఒకమోమై మనుజాకృతిం బొలుచు నీ • యుగ్రంపు దృశ్యం బన
త్యకమౌ నిక్కడ నిక్కమేర్పడె నసం • ఖ్యాకంబులౌ దైత్యసై
నిక సంఘాతము చేసినట్టి దురమున్ • నేర్పార సంపూర్తిగా
నొకమో మేవిధి గాంచఁగల్గుఁ ? దలచె • నో పద్మ సంఖ్యేయముల్ :

మ॥ నిటలాక్షుండు చతుర్ముఖుండు శరముల్ • నిర్ణీతి లెక్కించి యు
త్కటమౌటన్ గణియింపలేక యిది శ • క్యంబౌనె ? యంచున్ విశం
కట మోదాత్మకులై నిశాచరుల సం ఖ్యంగాంచి యీలెక్క వే
యుటయుం బోలద యంచు మానుకొని రా • యుద్దేశ మప్పట్టునన్.

ఉ॥ సేనలు వేయి వెల్లువలు • చెందిన దొక్కని కొక్క బాణ మం
చూని వచింప నైతియగు • నో ? యొకటొక్కటి నూఱు తున్కలై
మేనులు కూలియుంట గన • మిక్కిలి పెక్కులు వాని జానకీ
జానియె యేసెనే ? యని ప్రశంస యొనర్చిరి వాసవామరుల్.

చ॥ గొడుగుల నాయుధమ్ములను • గుఱ్ఱము లేన్గులు రాక్షసావళుల్
పిడములు తేరులుం దెగి న • శింపఁగ వైచిన బాణరాజి లె
క్కడఁ దరమౌనె ? యేటిపని ? యీతని లాఘవలీల గాంచుటల్
విడిచి మఱొక్కచేఁత తగ • వే ? యని పల్కిరి తాపసోత్తముల్.

తే॥ కదనతలమెల్ల నవయవ • ఖండసమితి, చెదరిపడియుంట యొప్పెను • సృష్టికర్త
జగములను సృష్టిసేయఁగా • జతనుపఱచి, వేఱువేఱ యుంచిన యంగ • బృందమనఁగ.

తే॥ వీరవర్యులు వదికోట్లు • ఘోరరీతి, నిధనమొంద సాధారణా • యుధము లేసి
చాపనేల దివ్యాస్త్రసం • చయము విడిచి, కూర్తమని తక్కురక్కసుల్, కూడినారు.

తే॥ మొనసినారాయణాస్త్రంబు • మొదలుచేసి, యజుని యస్త్రంబుదనుకఁ గ • లట్టిదివ్య
శరములేసిరి వారు దా • శరథిమీఁద, నతఁడు వానితోడన వాని • నణఁచివైచె.

మ॥ కొని దివ్యాస్త్రము లేయుచో జగము సం • క్షోభించి పుష్పంబు ల
గ్నిని పడ్డట్టులు నాశమై చనును వా • నిం ద్రిప్పలే రీఖలుల్
కనుకన్ శాత శిలీముఖంబులనె యీ • క్రవ్యాదులం గూల్తుఁ గా
కని సీతాపతి యట్టులే పలికి మా • యంజేసె నాదైత్యులన్.

తే॥ వేయివెల్లువలైన వి • ద్వేషి సేన, మొత్తముగ రణమున జీవ • ములను పాసె
బరువు తొలఁగ వసుంధర • శిరదినుండి, సరగఁ బైకుబ్బిలేచెను • చాలపలుకు.

సీ॥ వారణంబులు వేయి • తేరులు పదివేలు, వారువంబులు కోటి • వాహినీశు
లొకవేవురు నశింప • నొక కబంధములేచి, రణరంగమందు న • ర్తనము సేయు
వేయికోట్ల కబంధ • వితతి యాడిన రామ, కార్ముకమున నున్న • గంట మొరయు
నాగంట యొక యేడు • నఱగడియలసేపు, ముగియక గణగణ • మ్రోఁగుచుండె

తే॥ తలఁపు నెఱవేఱెనని సురల్ • కలఁక విడిచి, నిశ్చలిత నందె ధర్మంబు • నిశ్వసించెఁ
దలలు పైకెత్తె శేషుండు • తాపసులును, మఘవుఁడును గుండెబరువును • మాన్చికొనిరి.

ఉ॥ పొందిన కల్మి తమ్మునకుఁ • బొల్పుగ నిమ్మని నిచ్చి వేలుపుల్
చెందిన పూర్వపుణ్యమునఁ • జెచ్చెరఁ గానకు వచ్చి యందు వి
ల్లందు సమస్తజీవులకు • నబ్బిన యాపద దీర్చినట్టి రా
జేందుని గాంచి నోరుగల • యెల్లరు మ్రొక్కిరి జే యొనర్చుచున్.

తే॥ వేలుపులు పూలు సల్లుచు • వినుతిసేయ, రాముఁ డొప్పారె నా రణ • రంగమందు
భూతములు నిండినక్కలు • బొలయుచుండు, మసనమందొంటినిల్చు త్ర్యం • బకునిపోల్కి.

మ॥ కదనక్షోణి విరించనాండముగ ర • క్షశ్శ్రేణి జీవాలిగాఁ
దుదికాలంబున నెల్లజీవులను సం • తుష్టిం బునస్సృష్టికై
యుదరంబందున నుంచుకొన్న తన పూ • ర్వోదార రూపంబునే
మదనాకారుఁడు పోలెనంచు వినుతిం • పం బూని రింద్రామరుల్.

మ॥ కలఁకన్ వీడి సురాలి చల్లిన దళత్ • కల్ప ప్రసూనంబులన్
గలతావుల్ తన పేదదీర్పఁ బ్రబల • క్రవ్యాద సంఘంబులన్
బొలియంజేసిన రామభద్రుఁడు సమి • ద్భూభాగమున్ వీడి ని
ర్మలుఁడా ప్రేముడి తమ్ముఁజూచు తమి యా • త్మం దన్ను ప్రేరేఁపఁగన్

తే॥ ఇచటవిల్లయ్యె నచటనా • యనుజుతోడఁ, గపులతో రావణుఁడు వచ్చి • కదఁకరణము
సేసెనేమొ? లక్ష్మణుఁడేమి • చేయఁగలిగె?, ననుచుఁబొందరగా రాముఁ • డరిగెనటకు.

ఉ॥ మర్కటనాయకుల్ రణము • మానరు మిన్నక తక్కువారలా
యర్కజు నాజ్ఞమీఱి యిటు • లాఱడి నొందుట భావ్యమే? సమి
త్కర్కశులై విరోధితతిఁ • ద్రత్తమ చత్తముగాక యూరకే
తర్కములేల యంచు వడిఁ • దాఁకొని వచ్చిరి పోరొనర్పఁగన్.

## 31. రావణ శక్తి పటలము (50)

తే॥ వేయి తురగంబులం బూన్చి • వేవెలుంగు, మండలముఁగేరఁ దేరెక్కి • ఖండసమున
సురలగెల్చిన విల్లును • కరధిఁ దాల్చి, రావణుఁడు చేరె వడి సమ • రస్థలంబు.

తే॥ మనుజులం బట్టి వధియింపఁ • దనుచు వేయి, వెల్లువల కాన్గ యిడి కపి • మల్లురపయిఁ
దాన వోప నిచ్చించి యా • సేననంపి, వేయి క్రేవకు నరిగె న • వ్వీరవరుఁడు

తే॥ నూఱుకోట్ల రథంబు లి • న్నూఱుకోట్ల, తురగములు పదికోటుల • కరులఘటలు
నంత కినుమడియగు సుభ • టాలితోడ, నాఁడు రావణుఁ డేగె ర • ణంబు సేయ

తే॥ త్రిజగములయందు నపలి ప్ర • దేశములను, కలఁకుసకు రండురండని • పిలుచునట్టి
భేరి కాహళ శంఖాది • భీషణరుతి, మాఱుమ్రోఁగఁగ జెలరేఁగె • మహితరీతి.

తే॥ వంచితాసుర విధి పరి • పాక మూపుఁ దసురనాథుఁడు దశకంఠుఁ • డమిత చమువు
తోడ ధాత్రి యుపరి నప • ద్రోహుఁడయి, వచ్చుచుండుట గాంచెను • వానరాళి.

ఉ॥ కాంచి దురంబులోఁ దను ని • కాయము వీడఁ బెవీరధర్మమా
నంబుఁ గృతాంతుఁడున్ వడఁకు • నట్లు భుజంబుల నప్పళించి గ
ర్జించుచు మ్రాఁకులన్ గిరులఁ • జేకొని వ్యూహము తీర్చి పేర్చి లం
ఘించుచు రండి రండనుచుఁ • గేరుచుఁ గేకలు వైచె నుద్ధతిన్.

తే॥ ఉసుఱు తీయఁ గాఁబోలు న • య్యసురసేన, వడివడిగ వచ్చి తాఁకెను • వానరులను
ఉభయులకు మధ్య నిప్పుర • లుప్పతిల్లె, వాని నడుమునె రక్త ప్ర • వాహ మడరె.

తే॥ తుండులైన మొండెంబుల • నుండిలేచి, తలలు నింగికి నెగసె నా • తలలనుండి
నెగయు నెత్తురు చుక్కలా • నింగిఁ బరవ, సంబరంబెల్ల రణరంగ • మట్లు తోఁచె.

చ॥ అవపదయైన రాక్షస బ • లాంబుధి నంబులనెత్తు చేతులన్
మదజల మానవచ్చిన ప్ర • మత్త శిలీముఖ కోటి క్రమ్మఁగన్
సదమదమంది భద్రగజ • సంహననంబులు ప్రస్స్రవస్సి పె
ల్లివమగు నెత్రుటేళ్లఁ బడి • లియ్యము లయ్యె మునింగి తేలుచున్.

చ॥ మగువలు తొల్లి నవ్వులను • మన్ననలన్ సురతంపుఁ జిన్నెలన్
దెగువయు దుఃఖముం దొడరఁ • దేఱక యెన్నవ చేసి పాడుచున్
దగవుగఁ గంకణ ధ్వనులు • లాళము వైవఁగ నేడ్చియేడ్చి యా
పగ వలదంచుఁ బ్రాణములఁ • బాసిరి భర్తలఁ జేరి రయ్యెడన్.

క॥ నాశము నొందెడు తుది తఱి, నాశిల్లు జగంబులట్లు • నాక్షణచే
నాశము నందని సేనకు, నాశ మొదవె ననుచు దైత్య • నాయకుఁ డదలెన్

క॥ తరువులు శిలలే యసి ము, ద్గర తూలాసికము పఱిచి • వనుజుల తలలన్
దొరలించెఁ దాళ ఫలముల, కరణిని రావణుఁడు కాంచి • కళవళమందన్.

క॥ పావనియును సౌమిత్రియుఁ, గ్రోవియుఁ గండెయునుబోలెఁ • గొఱలుచుఁ దునుమన్
బ్రేవుల ప్రోవులు వెలువడ, మావులు రథపాళితోడ • మ్రగ్గుచుఁ బడియెన్.

క॥ విలుదాల్చిన కాలునివలె, విలసిల్లుచు లక్ష్మణుండు • విరివిగఁ బదిపెన్
బలయుత బలిముఖ నఖ రద, ములఁ వాఁడిమి దనుజసేన • పోఁడిమి వీడెన్.

క॥ ఇఁక నొక క్షణ మిల్లే యూ, రక చూచుచు నుంటినేని ? రాక్షస తతి నం
తకుఁడెల్లఁ గొల్లగొని పో, వక యుండునె యనుచు బంక్తి • వదనుఁడు కినుకన్.

చ॥ శ్వసనుని వేగముం బిడుగు • వంటి బలంబును పర్వతంబులన్
బసయఱఁ దొల్చు శక్తియును • పద్మభవాండము దాఁటు చేవయున్
బెసలను కొల్చు నేర్పు గడి • దేఱిన యంతక కింకరత్వమున్
బొసఁగిన శాత సాయక స • మూహ పరంపర లేసె గ్రక్కునన్.

ఆ॥ కినుక నేఁగి పోయి • దనుజవిభుఁడు నడు, రేయి యడరు కాళి • రీతినుండె
నెగచి వీచు గాలి • కెగసిన దూది పిం, జల విధానఁ బ్లవగ • చయము లయ్యె.

ఆ॥ పాఱుచున్న కపుల • భయమును సౌమిత్రి, తెలిసి భీతి నొంద • వలదు వలదు
నిలువుఁ డనుచు నాఁ నేయుని భుజముల, నెక్కి పంక్తివదను • నెదుటికేగె.

ఆ॥ ఎదిరి నిలువ దాన • వేంద్రుండు వందలు, వేలుగాఁగ వాఁడి • కోలలేసెఁ
బతిశరంబు లేసి • రామానుజుఁడు వాని, నడుమఁ బొడిగఁ జేసి • పుడమిరాల్చె.

తే॥ రాల్చు సౌమిత్రి భుజము లు • రంబు నాటు, నట్లు దశవదనుండు పె • క్కమ్ములేసె
కొన్ని దాసి మేనిని గ్రుచ్చెఁ • గొన్ని దూసె, లక్ష్మణుండు కినిసి శర • లాఘవమున.

ఆ॥ వానిఁ గలఁత వఱుప • వైశ్రవసుండును, వీని గెలువ సరిది • వింటిచేత
వీని విడిచి చూపు • వీరత్వ మదియేది, వీడరాదు వీని వీదరాదు.

శా॥ దివ్యాస్త్రంబుల నేయ వ్రాల్చి సమవ • ర్తిం బిల్చి చూపింపఁ గ
ర్తవ్యంబేది • తదగ్రజుండిలె జగ • త్సర్వంబు బాణాగ్నికిన్
హవ్యప్రాయముగా నొనర్పఁ గలవాఁ • డర్ధక్షణంబందె ని
ష్క్రవ్యాదంబుగ భూమిఁ జేయఁ దలఁచెన్ • సాధించు టెచందమో ?

ఆ॥ మున్ను బ్రహ్మ పడయు • మోహనాస్త్రం బొందు, కలదు భవునినేని • గెలువఁగలది
దానివైచి సమర • ధాత్రిని వీనిని, కూలఁ ద్రోతు ననుచుఁ • గోరి తొడిగె.

మ॥ విడువం గాంచి విభీషణుండు రణహం • వీరా ! మహాస్త్రంబుచే
నడుఁకం జేసెడి లోకమెల్ల నిది నీ • నారాయణాస్త్రంబుచే
నడఁపం జొప్పడు నప్పు లక్ష్మణుడు త • ద్వ్యావృత్తిఁ దద్రీతిగా
నడఁపం గాంచి దశాననుం డనుజు వి • న్నాణంబుకై మందుచున్.

మ॥ ఒగి వీఁడుండి నిశాచరావళుల మా • యోపాయముల్ దెల్పెడున్
దగురీతి న్నడపింపగా మనకు నే • తన్నాశ మిట్లబ్బె దు

ర్పగు దుష్టాత్ముఁ గులాపకారకుఁ గుల • భ్రష్టుఁ జెవిశంసించి యిం
టగ మద్వంశ కళంకిముం దుడిచెదం • బో యంచుఁ గోపాత్ముఁడై.

చ॥ మయుఁడు టమార్తై నిచ్చితటి • మాన్యత నిచ్చిన శక్తిఁ గిన్కతో
రయమున వైచె నద్దియొకి • ప్రాణి నెదిర్చిన ధాతనేని చం
పియె మరలంగఁ జాలినది • భీకరమై యరుదేరఁ గాంచి దు
ర్భయమునఁ దప్పికో నొక యు • పాయము లేదను నవ్విభీషణున్.

చ॥ వెఱవకు మంచు లక్ష్మణుఁడు • వేగమ యడ్డమువచ్చి వాఁడి యం
పఱ పఱపన్ మునీంద్రుసకుఁ • బాపి యొసంగిన శాపమట్లు వీ
సరవర వేలపుల్ మునులు • చచ్చెను చచ్చె విభీషణుండు దు
ర్భరమని పల్కుచుండ విని • రాముని తమ్ముఁ డుదగ్ర వేగుఁడై.

చ॥ మరణము నొందినన్ యశము • మాఁడదు ధర్మము నిల్చు నుత్తముల్
గురుసుఖ మందువారు తన • కున్ శరణంబని వచ్చువాని దె
ప్పరమున పీడరాదనుచు • వక్షముఁ జూపుచు వచ్చె నడ్డుగన్
వెఱగొని వానరుల్ విబుధ • బృందము హాః యని పిచ్చలింపఁగన్.

మ॥ అతనిం దాఁటి విభీషణుండు చనఁగా • నయ్యుర్వరన్ మీఱి వా
లి తనూజుండు దృఢాత్ముఁడై యెదుట ని • ల్చెన్ వానిఁ ద్రోపాడి స
న్మతి సుగ్రీవుఁడు పోయె నాతనికి ము • న్వాతాత్మజుం డేగె ని
యతిశాయిత్వ మహత్త్వముం దెలుప శ • క్యంబౌనె యెవ్వారికిన్.

## రావణ శక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట

ఉ॥ అందఱకంటె ముందునకు • నార్యుఁడు లక్ష్మణుఁ డేగి దీని నేఁ
గొండెద నుండుఁ డుండుఁ డని • కూరిమి మిత్రుల మాన్చి శక్తియున్
డెందము గ్రుచ్చి దూయ గురు • ధీరత వక్షము చూపి నిల్చె నా
చందము గాంచి వేల్పులును • చయ్యనఁ గన్నులు మూసి రయ్యెడన్.

తే॥ పదరి యెచటికేగెదవని • పట్టరాని, చండకోపాన మండుచు • దండము గొని
రావణుని రథ రథ్య సా • రథులఁ జదియ, భీషణంబుగ మోఁదె వి • భీషణుండు.

క॥ రోషమున రావణుండు వి, భీషణుపై మారుతిపయి • వేఁడి యలుఁగు లా
ఘోషగతి నేసి బహుసం, తోషముతో మరలె విజయ • దూర్వహమతియై.

క॥ నే శరపొందిన యీ జగ. దీశుని తమ్ముండు సోల • నీవెటకు ముదా
వేశమునఁ బోయెదని యా. క్రోశించి విభీషణుండు • కోపమునఁ జనన్.

మ॥ వశమయ్యెన్ జయలక్ష్మి మోద భరత • స్వాంతుండనై మీఁద నీ
పశువుం జంపిన నేమిలాభమని సం • భావించి పౌలస్త్యు. డ

ద్దిశ క్షన్నెత్తియుఁ జూడ కయ్యనుజు వి • ద్వేషంబు లెక్కించి క
ర్కశతం జూపక వ్యోమ మార్గమున లం • కంజొచ్చె సంరంభియై.

తే॥ పట్టరాని దుఃఖంబున • వాయివిడిచి, పనవి లక్ష్మణు పదముల • పైని వ్రాలి
ఘోషణం బొనరించె వి • భీషణుండు. వనచరులు దుఃఖ జలనిధి • మునిఁగినారు.

తే॥ ఇతఁడు మరణింప జీవించి • యేమిఫలము? విభుఁడు రాఘవుఁ డింక జీ • వింపలేఁడు
అనుచు నెద నుడివడ నేడ్చు • దనుజరాజుఁ, గాంచి భల్లూకనాథుఁ డీ • కరణిఁబలికె.

చ॥ తలఁచిన యంతలో సకల • తామరసాండము చుట్టి యోషధుల్
నొలవక తెచ్చి యియ్యఁదగు • శుద్ధమనస్కుఁడు మారుతాత్మజుం
డిల మనపాలనుండ నిటు • లేడువ నేటికి? చూడు లక్ష్మణుం
డిలుగఁడు వంత యేటికి వ • హింపుఁడు ధైర్యము మేలుగల్గెడున్.

చ॥ అని యనిలాత్మజాతు నుర • మందలి తూపుల నూడ్చివైచి యీ
యనుజుఁడు మూర్ఛ మున్గినఁ ద . దగ్రజుఁ డోర్చునె? కాంచికాంచి నె
మ్మనమున వ్రాని త్రిమ్మరులు • వ్రగ్గుచునుండుట చూచిచూచి యీ
యనువున నూరకుంట తగు • నా? సకలంబును మాకు నీవెకా?

చ॥ అని వచియింప వాయుసుతుఁ • డాతని యిచ్ఛ యెఱింగి యాక్షణం
బున గగనస్థలి న్నెగసి • పోయెను వారల చూపుదాఁటి యా
పనియును బోవు మార్గమును • ప్రాఁతవియౌటఁ జనంగ నోషధుల్
గొని చనుదేర నాతనికిఁ • గూరునె తామసమున్ శ్రమంబులున్.

చ॥ హనుమయు మందుదెచ్చె నొక • యాటగ నోషధిమీఁది వాయువుల్
పనుపడఁ బాఱునంత స్మృతి • వచ్చెను చచ్చినవారి జీవముల్
నునుపుగ నిచ్చుమందునకు • నొచ్చిన వారల నొప్పి తీర్చుటల్
ఘనమగు కార్యమౌనె? ప్లవ • గ వ్రజమెల్లను లేచె నెమ్మదిన్.

చ॥ అమరులు వానరుల్ ముదము • నందఁగ లక్ష్మణమూర్తి లేచి వే
గమున సమీరపుత్త్రకుని • కౌఁగిలిఁ జేర్చి విభీషణుండు నే
మము భజియించునే యనుచు • మన్నన నాతనిఁగాంచి మోద బా
ష్పము లురలంగ రావణుఁడు • చచ్చె వధూనిక కబ్బె ముక్తియున్.

చ॥ బ్రదికితి మెల్లవారమును • పాడియె యాచరణీయమంచు నొ
ప్పిదమగు తారకాణఁ గపి • వీరుఁడు మారుతి చూపె నన్న కె
య్యది యిఁక దుర్ఘటంబగు? ని • హంబు పరంబును కూర్చు కర్మలం
దెదఁ దలపంగ ధర్మమె సు • మీ జయమున్ సకలంబు నిచ్చెడిన్.

మ॥ అని భాషించుచు నందఱుం గలిసి నం • యద్భాగముం దాఁటి రా
ముని చేరం జని తత్పవిత్ర చరణాంభోజాతముల్ సోఁక మ్రొ

క్కిన వారలందును సంతసించి యటనా • కృత్యంబుఁ బ్రశ్నింపఁగా
వినిచెం బూర్తిగ జాంబవంతుఁడు వినెన్ • వీరుండు చోద్యంబుగన్.

ఉ॥ పావనిఁ జేరి గాఢముగ • బ్రాఁతిఁ గపుంగిలిఁ జేర్చి నాయనా!
యీవొకఁ డుండఁ గానిపని • యేదియు మేదిని లేదు వీరిలో
రావణుఁడున్ గృతాంతుని పు • రంబును చేరినవాఁడె నీదు మో
దాహవ జీవితంబును చి • రాయు రుదంచిత కీర్తు లబ్బెడున్.

శా॥ మోదముతోడ బాష్ప జల • ముల్ ప్రవహింపఁగ జీవుఁజేరు మై
చైదముతోడ దుఃఖము నొ • సంగి దివింగను తండ్రిరాఁగ సు
శ్వాదిజనంత సంతసము • భావము చెందఁగ మ్రొక్కుతమ్ముఁ న
శ్యాదర మారఁగా నలమి • యంగము దువ్వుచు రాముఁ పిల్లనున్.

చ॥ శరణమునొందు ప్రాణికగు • చావును మానిచి కాచుపొంకె సం
గరమున నీదు ప్రాణములఁ • గాంక్ష యొనర్చక యిచ్చినందుచేఁ
బరమ పవిత్రమైన రవి • వంశ గురుత్వము నిల్పితయ్య! యా
తరుణమునందు నీకదియ • తప్పని కష్టము వత్స! లక్ష్మణా!

చ॥ కలఁగక పావురంబునయి • కాయము కోసి యొసంగినట్టి ని
ర్మలగుణి తాతయౌ శిబిఁ గ • రం బుపమింపఁగ నొప్పితయ్య! యు
ద్వరఁ గిరుణామయాశ్మకులు • స్వాశ్రితపాళికిఁ జెట్ట యబ్బుచోఁ
గరఁగుదు రార్తి క్రేపునకుఁ • గల్గిన ధేను వలంగుకై వడిన్.

చ॥ అని వినుతించి సమ్మదము • నంది రణంబునకై ధరించియుం
డిన కవచాదు లొక్కొ టొక • టిం గడుమెల్లనఁ దీసి యాంజనే
యుని కరమందు వెట్టి యొక • యున్నత శైలమునందు విక్లమం
బును తొలఁగించు కొంచుమును • వోక ఈ ముచ్చట లాడుచుండఁగన్.

## 32. వానర రణరంగ దర్శన పటలము (36)

ఉ॥ సేనలతోఁ గపీంద్రుఁడును • చేరిక నిల్చి భజించుచుండఁగా
వానరు లాదటన్ సమర • భాగముఁ దక్కక కాంచి దిగ్భ్రమం
బూని వడంకుచున్ బిడెము • నొందిరి కీశ కులేశుఁ డీవ యీ
దానవ సైన్య మంతయు వి • దారణ చేసితె యంచుఁ బల్కఁగన్.

ఉ॥ రాఘవుఁడున్ విభీషణుని • బ్రాఁతిగఁ గాంచి దురంబునందు దై
త్యౌఘముఁ జూపుమన్నఁ గడు • నుత్సుకులై ప్లవగాధ్యులెల్ల లెం
డో ఘనులార! చూతమని • లయుబ్బుచు లేచిరి రాముతోడ్య ధీ
లాఘవ లక్ష్యశుద్ధుల కొ • లంది గనుంగొను వేడ్క సందిలన్.

ఉ॥ కాంచిరి బెగ్గడిల్లిరి వ । గర్చిరి తూలిరి బెగ్గలించి రా
కుంచితులైరి గుండియలు । కొట్టుకొనెన్ దడియాఱె నోష్ఠముల్
మించిన భీతి మెల్లనన । మేను లధీనములయ్యె నంత మో
దించిరి పొంగి రుబ్బిరి మ । ధించిరి తత్ స్థితిఁ జెప్ప శక్యమే ?

ఉ॥ వీరశవ స్థితుల్ గనఁగ । భీతికి సంఖ్యకుఁ జూచు సేఁతకున్
మేరకు మీఱి యున్న దిట । మీఁద విభీషణ ! యగ్రగామివై
వీరల పుట్టు పూర్వములు । విస్తరరీతి వచింపు మేము పెం
పారఁగ విన్చుఁ గాంచు చర । యంగలవారము నా నతండనున్.

తే॥ కాకములు పందిరింబోలెఁ । గ్రమ్మియున్న. రక్తపంకమౌ రణమున । రామ బాణ
నిహతిఁ గుప్పలు తిప్పలై । నీల్గియున్న. వారణంబులఁ జూడుఁడ । వారణగతి.

క॥ వడిగల రామశరంబుల, బెడిదుల ప్రాణముల వీడి । పెంటలఁ గునుకం
బడిన వడువయ్యెఁ గనుఁడీ, పుడమిధరము మీఁది నాగ । పుంజములక్రియన్.

క॥ కూలిన దనుజుల ముఖములు, వేలా పులినమ్ములందు । విరిసిన రాజీ
వాలిం బోలుం గనుఁడీ, యేలా వర్ణింప రాఘ । వేష్వాస విధుల్ ?

క॥ శరసంఘాతముచేఁ జె, న్నరదంబులు విఱిగి శోణి । తాపగలబడిన్
శరనిధుల కలములం బలె, జరగుచు నుండుటలు గనుఁడి సంతస మెసఁగన్.

క॥ వారణములు ప్రాణంబుల, తో రుధిరాపగలఁ జిక్కి । దొంగలుచుఁ బారా
వారమునఁ దిమింగిలముల, తీరునఁ దేలాడుచుంట । కీటగఁ గనుఁడీ

క॥ నయగతుల నట్టలాడఁగ, లయగతులం దాళముల నె । లర్చు పిశాచో
చ్చయగతులఁ జూడ నటనో, భయగతులం జెనయఁబోలు । భరతాచార్యున్.

క॥ అరివీర సముదయంబుల, సరములు యంత్రములఁ బోలె । నడచెడు కాళ్ళం
బిరిగొని తగులం ద్రోచుచు, తిరుగు పిశాచములఁ గనులు । తెఱచి కనుండీ.

తే॥ నగము తెగిన మేనులతోడ । సామజమ్ము, లొఱవలై పడియుండొంటి నొంటి కొనఁగఁ
గొన్ని పెనుగుండ్లపలెఁ దోఁచెఁ । గొన్ని యెన్న, విరుదలల గౌరులం బలె । మెఱసెఁగనుఁడీ

తే॥ చండకోపము వికటహాసమునఁ జూపు, మొగములెల్లను పొగలతో । సెగలు నెగయు
హోమకుండంబులం బోలి । యొప్పుచుంట, కాంచినారలె శాఖామృ । గంబులార !

తే॥ సమదగజములపై నుండి । జాఱిపడిన, చామరంబులు వీరాస్య । సరసిజముల
నొఱగి నిద్రనొందెడు మరా । ళోత్కరంబు, బొలుపు చెన్నారు వానిఁ గాం । చితిరె చెప్పుఁడ

క॥ దంతంబులు రుధిరోద, న్వంతంబులఁ దడిసి సాంధ్య । నభమునఁ దేజో
వంతములగు బాల కళా, వంతుని రేఖా చయంబు । వడువునఁ దోఁచెన్.

చ॥ శర ధనురాది సాధన వి • శాలములైన రథోత్కరంబుపై
ద్విరదచయంబుపై విలిగి • త్రెళ్ళిన వీరుల కన్నుదోయి యం
బురలిన నిప్పుచే నుడికి • యున్న పలాలము మెక్కి భూతముల్
హరుపుగఁ ద్రేన్చుచున్ మురిసి • యాడుచునుండుట తేటి కాంచుఁడీ.

చ॥ దిగఁబడి పాఱి సంభ్రమునఁ • దెల్లిన యాతితజ ప్రపంచిలో
నెగఁబడి చొట్టుమీలు తమ • యిచ్చకొలందిని పచ్చి యాఱి నే
నుఁగుఁ దను కాంచి యెందును క • నుంగొన లేదివి క్రొత్తయయ్యె నే
మృగములొ యంచుఁ గ్రమ్మఱి గ • మించుచు నుండుట కాంచినారలే.

క॥ మింటం జచ్చిన శవములు, మంటం బరియించు వారి • మస్తకములపై
నొంటించి పడఁగ నోలుచు, వింటరపడు సతులఁ గంటి • వే శిష్పులారా.

తే॥ నింగియందు సారంగ తు • రంగచయ శ, తాంగములయందు చచ్చిన • యసురవరుల
యొడలి నల్లచుక్కలుపడ • నడిమిమింట, భానుఁడున్నను లేఁ బ్రొద్దు • పగిదిఁదోచె.

తే॥ వాయు జవమునఁ జనిన దై • తేయులు తెగు, కతన మింటనంటిన రక్త • కణములెల్ల
వెల్లువంబోలెఁ దోఁపంగఁ • దెల్లనైన, విధుఁడు సూర్యునిపోలెఁగ • న్పించుఁగనుఁడి.

క॥ దివి భువి జలనిధి దిక్కులు, పువులును మధుపములు కర్ద • ములు మాఱఁగ భూ
జ వితతి దళంబు లన్నియుఁ. జివుళులవలెఁ దోఁచుచున్న • చిత్రము గనుఁడీ:

మ॥ కెరటంబుల్ గజదంత మౌక్తికములన్ • గ్రేఁదొట్టి త్రోవంగఁ బెం
దరువుల్ గూలఁగఁ బక్షి సంఘములు సం • తాపించి కూయంగఁ జా
మరముల్ పెక్కుము లాతపత్త్రములు క్ర • మ్మన్ ఫేన బృందంబుగా
దరులై పీనుఁగు లొప్పఁగాఁ బఱచు ర • క్తప్రాదినుల్ గాంచుఁడీ.

మ॥ కరి యూథంబులు తీరభూములు భుజా • స్కంధాలు సర్పాలుగాఁ
దురగశ్రేణి తరంగపాళి కర సం • దోహంబు నక్రాలిగా
నరి వీరాస్యము లంబుజాతములుగా • నాంత్రంబులే నాచుగాఁ
బెరసుల్ వండలియైన నల్లమడువుల్ • వీక్షింపుఁ డిప్పట్టునన్.

తరువోజ॥

కరవాలములను వా • గళ్ళుగాదున్ని, కరమొప్పఁ బలల పం • కమ్మున నల్ల
విరవారు సీదను • వేదండ మహిష, వితతి పొరలుచుండ • వీరులన్ కృషిక
వరులు మస్తములను • పద్మముల్ మొలవ, వరుసఁ గలుపు దీసి • వైచిన పగిదిఁ
గెరలిన యీరణ • క్షేత్రంబు గనుఁడి, కీశవర్గములార. క్రేఁగంటనైన

తే॥ రాక్షసుల పెనుమేనులు • రాలుచుండ, రామ కోదండ శింజినీ • రావమొప్ప
నవనిఁ బీటలు వాఱఁగా • నందు చొచ్చు, శోణితాపగలం బుట్టు • సుడులఁ గనుఁడు.

మ॥ భుజముల్ గ్రీవ లురంబులున్ గవునులున్ • ముంగాళ్లు ముంజేతులున్
గిజులున్ నజ్జుగ దంచి త్రుంచి యట ది • గ్వీథుల్ విదారించి య
క్కజమై చొచ్చె రసాతలంబనుచుఁ బ • ల్కన్ వచ్చు గాకీ మతం
గజ వాహాదుల రామ మార్గణము నొ • క్కండేని వీక్షింతురే।

సీ॥ అమృతంబుతో నుద • యంబందు గజములు, పదికోట్లు మేఘముల్ • వారివిధులు
వట్టినను మదంబు • వట్టని వజహోమ, కుండజ కరులు పం • డ్రెండుకోట్లు
ప్రాణముల్ పోయిన • రక్తంబు వట్టిన, బొగరు మాననివియుఁ • బూర్వదంతి
వంశంబు గలయవి • పదునాల్గు కోట్లును, బ్రహ్మకకుబ్బార • వహనకార్య

తే॥ మునుపకుండటచే నూర • కున్న యవియు, నపర దిక్కరి వంశంబు • నందు పొడము
పద్మసంఖ్య యింద్రుండిచ్చు • వానితోడ, వేయికోట్లు లెక్కకురావు • పెరల యీవి.

సీ॥ కలశ వారాశిలోఁ • గలిగిన వేలకొ, లందు లీగుట్టంబు • లందు గలవి
వరుణుని గెల్చిచి • తరుణమందునఁ గొన్న, యవి నిధీశుఁడు పోవు • నపుడు విడి
పోయిన యవి కోటి • పొసర విద్యాధర, ప్రభుఁడొసంగిన యవి • పద్మ సంఖ్య
తక్కువార లొసంగు • తత్తడులకు లెక్క, లేవు సైంధవముల • ప్రోవు లివ్వి

తే॥ యెల్ల లోకంబులందుండి • యెల్ల దీవు, లందునుండి వచ్చినయది • యసుర సేన
మూలబలము వచ్చినయది • ముగిసినదియు, నని విభీషణుఁ డనఁ బ్లవ • గాలిచూచి.

ఉ॥ మిత్రవరేణ్య ! యిట్టు లని • మేషవిరోధి బలంబు చూపినన్
జిత్రముగాఁగఁ జూచితిని • చెందదు దీనికి నంతవెన్నఁడున్
గోత్రవిభుం గనుంగొనెడి • కోపుననున్నది చాలనిప్పు సౌ
మిత్రి ధరాత్మజావిభు స • మీపము చేరఁగఁ బోదమా యనన్.

చ॥ సరియన నందఱుం గలిసి • సారసనేత్రుని చెంతఁజేరి య
త్యురుతరభక్తి మ్రొక్కి సమ • కోర్విని రాముఁడు చూపు సాహస
స్ఫురదతి విక్రమంబులను • చోద్యముగాఁ బలుమాఱు లెంచుచున్
జరుగగనున్న కారియము • చక్కటి యారయుచుండి రచ్చటన్.

## 33. రావణ రణరంగ దర్శన పటలము. (27)

తే॥ సురలు కష్టంబులొంద వా • నరులబలము, క్రుంగఁద జిమిలక్ష్మణుఁగూల్చి • పొంగివచ్చు
మోదమున రావణుఁడు తన • పురము చేరి, యుత్సవముచేయ మదిలోన నుత్సహించె.

క॥ తనమీఁది ప్రేమచేతం, జనుదెంచి దురంబు సేయు • సంగడికాండ్రం
దనుపఁగ వివిధ పదార్థము, లనువొందఁగ వండుఁడనుచు • నాజ్ఞాపించెన్.

క॥ వేలుపుల పడిగ రండని, మీలోకమునందు గలుగు • మేలి సుఖములన్
గీలింపుం డీ లంకను, జాలము పలపనుచుఁ బండ • శాసన మొసఁగెన్.

ఆ॥ మంచి కల్లు మంచి • మాంసంబులును వస్త్ర, ములును చందనంబు • పుష్ప వితతి
స్నానమునకు నీరు • తల్పంబులును దళ, వదను నగరు చేర • వచ్చి నిండె.

తే॥ తావి సంపెంగ తైలంబు • తలలకంటి, తావినీట బోర్కాడించి • తనియ భోజ్య
వస్తువులవిడి తల్పముల్ • వలసినట్లు, సవరణలు సేయ వచ్చి ర • ప్సరస లటకు.

క॥ పాడిరి కొందఱు వొలుపుగ, నాడిరి కొందఱు వలంతు • లరుదని పొగడన్
గూడిరి కొందఱు సెజ్జల, వేడిన సిద్ధులకుఁ బోలె • వెలసిన వెల్లన్.

ఆ॥ రాజసుతులు మొదలు • రాక్షసాపతీదారకుఁ, గొలువు సేయుచున్న • కోడెకాంద్ర
కింద్రభోగ మప్పు • డింపారఁ గలుగుట, వలనఁ గలుగు గెలివి • కలవిలేమ.

తే॥ ఇట్టు లుల్లాసమున నున్న • యింద్రవైరి, విభుని యెదుటికి వచ్చిన • వేగులవుడు
కేలుమోడిచి చెవిదాసి • మూలబలము, నమసిన విధంబు వాక్రువ్వ • సాగినారు.

ఆ॥ వదఁకుచున్న మేలు • వరటిన నాల్కలు, బెదరు చూపులెడఁద • పిదపిదమనఁ
దక్క లాటి నత్తిఁ • దడఁబడు పలుకులు, తొలఁక దూతలిట్లు • పలికినారు

ఆ॥ విజయశీల! చనిన • వేయి వెల్లువలును, రణమునందు నిలిచి • రాము నేక
కార్ముకమున నేరు • గడియలలో బ్రమాసె. నింద కుడుచు నిందు • లెవ్వరింక?

చ॥ బలిమిని దేవభోగముల • బ్రాఁతిగ దైత్యుల కిందు కూర్పఁగాఁ
దలఁచితి నీతలంపులు వృ • థాచనె లంకను గల్గువార లి
య్యిలఁ గల వార లౌదురు మ • ఱెందును లేరెవరింక వీన నీ
బలముల కంతిపక్రియలు • పాయక యీయెడఁ జేయఁగాఁ దగున్.

చ॥ మితి యొనరింపరాక యను • మేయ మునంబును పొందియున్న యా
దితిజవరేణ్యుఁ డా చరులు • తెల్పిన పల్కులు విన్నయంతనే
యతిభయ దుఃఖ కోపముల • నంది ప్రచండ తరోగ్ర దృష్టులన్
బ్రతిమనుబోలి నిల్చి వెఱ • పాఱఁగఁ గాంచుచు నుండి యప్పలన్.

క॥ బలవంతులు నాకంటెను, పలువురు నరు నొకని ధనువు • వలన నొకండున్
గలికమునకైన మిగులక, నలఁగిరె యిది నమ్మఁజాల • నమ్మంజాలన్.

చ॥ అనవిని మాల్యవంతుఁడను • నయ్యెది సంశయమందఁ దగ్గదే?
పవిచిన దూతలే తసుకు • పల్కెదురే? నరుఁడొక్కఁ డిందఱన్
దనుజుల నేలఁగూల్చె టది • దబ్బఱగాదు సమస్త జీవులన్
బవిగొని కల్పవేళ బలి • వారెడు రుద్రుఁడు నొక్కఁడే కదా?.

శా॥ సంకల్పంబున సృష్టిచేసి జగముల్ • సంరక్షయున్ నాశమున్
బొంకం బారఁగఁ జేయువాఁడు గుణ సం • పూర్ణుండు సర్వేశ్వరుం
డింకన్ సందియ మేల యాతఁడగుఁ జా • మీమ్మ యందు సీతమ్మఁ దా
తంకం బేమియులేక పల్కిన దస • త్యంబౌనె? లంకేశ్వరా!

ఉ॥ ప్రాణులు భోజ్యమైన యొక • వస్తువు గైకొను నైజరీతి; వి
ర్వాణము గూర్చి యన్నిటిని • వహ్ని భుజించును మీఱుచో జగ
త్ప్రాణుడు కొండలం దృణము • మ్రాఁకుల బ్రాణులఁ గూలఁద్రోచు నా
త్రాణకు నొక్క మేరగల • దా వచియింపఁగ? రాక్షసేశ్వరా!

చ॥ చెలఁగుచు నింద్రభోగములఁ • జెందిన కాలము కద్దు తత్థితుల్
తొలఁగినదంట విక్రమున • దూరముగాదు ప్రతిక్రియా విధుల్
గలుగవు నీకునై లయము • గాంచిరి బంధులు శిష్టవర్గముల్
మెలఁగెడి త్రోవఁ బొమ్మనుడు • మిక్కిలి కిన్క నిశాటరాజునున్.

శా॥ సౌమిత్రిం దెగటార్చుటం గలన నా • శక్తిం బ్రయోగించి దు
ర్వ్యామోహంబున మగ్నుఁడై సమసెడున్ • రాముండు శాఖామృగ
స్తోమంబుల్ నశియించు మూలబలముల్ • ఋష్యింపనీ యూడనీ
యేమైనం బనియేమి? గెల్పు తుది నా • దే యయ్యె నిన్నాళ్లకున్

ఉ॥ తోషితదైత్య హృచ్చశి వి • ధుంతుదు నట్టులు చారుఁడొక్కఁడు
ద్ఘోషముతోడ మోఁకరిలి • కొంకుచు వాయు కుమారకుండు ది
వ్యౌషధులొలిఁ దెచ్చి పొలు • పొందఁగ నీయఁగ లక్ష్మణుండు త
ద్భేషజశక్తి లేచెఁ దెలి • విం గొనినారలు వానరోత్తముల్

తే॥ అనుడు నమ్మక పెనునంది • యంబు కలఁప, గోపురము మీదికిం జని • దాషరించు
సైన్యనాశంబు సత్యంబు • సరగఁ గాంచె, వాడు కన్నులతో మది • మాఁడుచుండ.

క॥ పోరున మరణించిన యా, వీరుల వనితలు సబాష్ప • వీక్షణ లగుచున్
బోరున విలపించెడు దీ, నా రావము శ్రవము లగల • నాతఁడు వినియెన్.

తే॥ ద్విరదముల నీడ్చుకొని పెను • దరుల నొంపి, యేగు రక్తనదులలోన • నీఁదులాడు
చుండు శాకినీ డాకినీ • మండలులను, గుండె లగలంగ దశకంధ • రుండు గాంచె.

తే॥ జంబుకంబుల రవము లా • గంబుగాఁగ, భూత కరతలధ్వని తాళ • ములుగ రామ
బాణ నిహత కబంధముల్ • ప్రాణమున్న, నటుల పోల్కి నటించుచుం • డుటనుగాంచె..

చ॥ కవిసి పిశాచముల్ పతుల • గాయములం దమకేలు చొన్పి క్రొం
గవ్వచును పెల్కి నీడ్చుటను • గాంచి రుషాభర చిత్తలై సతుల్
దివిభువి దిక్కులం దటిమి • దెత్తుల గ్రుడ్లను తీయుచుంట దా
నవకుల సార్వభౌముఁడు మ • నంబు దిగాలనఁ గాంచెఁగన్నులన్.

శా॥ జాతీయంబులఁ బోలి లెక్కకును మో • చ్చై యొప్పు రామాస్త్ర సం
జాత ప్రస్ఫుట దైత్య రక్తముఁ బిశా • చశ్రేణి యుప్పొంగి యా
బూతిం ద్రావుచుఁ గ్రక్కుపోల్కిఁ దనకున్ • మ్రొగ్గైన వీచీముఖ
స్ఫీతిన్ ముందుగఁ ద్రోచు నాజలధిఁ గాం • చెన్ రావణుం డయ్యెడన్.

సీ॥ వెనలు వీఁటలు వాఱఁ • దివిరి మహోగ్రస, దము సేయు కపిసము • దయము గాంచెఁ
గువలయ మదఁగఁద్రొ • క్కుచు నర్తనము సేయు, దైత్య కబంధ బృం • దంబుఁ జూచెఁ
దనభీతి వీలివోపఁ • గనులు పెద్దవి చేసి, కొన్న నిలింపుల • గుంపు గనియె
గుండెలు పగుల నా • క్రోశించి గోపుర, మందుండి వివశులై • క్రిందఁ బడియెఁ
తే॥ వివప నట్టహాసంబుతోఁ, బెవవులెండఁ, గినుకతో మిడుంగుఱు లేచు • కనులతోడ
కలుష హృదయంబుతో వచ్చి • కొలువుచేరె, రావణుండు సంగర జితై • రావణుండు.

## 34. రావణ రథారోహణ పటలము (35)

తే॥ చేరి లంకయందిఁక నున్న • సేనయెంత, యంత మొత్తమాయితము సే • యంగఁ దనుష
వేగ మ్రోయింపు ప్రస్థాన • భేరి యిపుడ, యని మహోదరు వీక్షించి • యాజ్ఞయిడియె.
తే॥ భేరి విన్న వెంటనె రణ • శూరులైన, సేన పసురాల్గు కోటులు • చేర నొకట
విజనమై • శూన్యమై • పేదపడియెఁ, గాఁపురము లేని పగిది లం • కాపురమ్ము.
తే॥ ఐహికాముష్మిక ఫలంబు • లందఁజేయు, పూజనము పర మేశున • కోజఁ జేసి
కోరువారల కర్థముల్ • కోరినంత, యిచ్చి రావణు డనికి నా • యిత్తపడియె.

చ॥ ఖురములతోడి నీలగిరి • సంగతి వేపురు భాస్వరుల్ వెలుం
గు రహిని దాల్చె బ్రహ్మ మును • కోరిన యింద్రున కీయఁ దాను సం
గరమునఁ దన్ను గెలుతటి • గాన్కఁగఁ బుత్త్రున కిచ్చినట్టి వ
జ్ర రుచిరమై యభేద్యమయి • రాజిలు కత్తళ ముద్ధతంబుగన్.

తే॥ మందరమ్మున వాసుకి • మలసినట్లు, పొలుచు దట్టిపై నడిదంబు • వెలయఁ జెరివి
కనకగిరి జుట్టి వచ్చెడు • గ్రహములట్లు, పొనరు రతనాల కటిసూత్ర • మును ధరించి.
తే॥ గరుడి తెక్కలు విరిసిన • కరణినొప్పు, గులకుఁ గుచ్చెళ్ల సవరించి • మెలికపడక
పట్టువస్త్రంబు విచ్చిన • పగిదిఁ దనరు, రజత ఫణినాఁగఁ జను కాసె • రమణఁ జుట్టి.
తే॥ మెఱపులం బట్టి కూర్చిన • తెఱఁగు సింహ, సముదయంబులు గర్జించు • చందమునను
రవళి సేయుచు శత్రుల • చెవులు వ్రచ్చు, గజ్జెలం గూర్చు నంబెల • గాళ్లఁ దాల్చి.
ఆ॥ పిడుగు నులివు విన్న • బెదరు సర్పంబుల, కరణి విన్న యంత • నరులు సురలు
వెఱచి పాఱునట్టి • భీషణ రవమొప్పు, వీరమద్దియలను • వెలయఁ దాల్చి.
తే॥ నాలుకలు చాఁచు పాములఁ • బోలియున్న, చేతు లిరువదింటికి నఱ • చేతులకును
వ్రేళులకును గోధాచర్మ • విస్ఫుటంబు, లైన కవచంబులను పొలు • పందఁ దొడిగి.
తే॥ పాఁపరాజును పోలిన • పాశములను, భుజములం దాల్చి కరసాన • పొనరఁ బట్టు
తళివి రవినుండి రాలిన • కిరణరాశి, లలిని కాంతు లొలుకు కుండ • లములఁ దాల్చి.
తే॥ బాలభానుని కిరణముల్ • ప్రాగ్గిరిపయి, వ్రాలు తెఱఁగున నొప్పారు • రక్తగంధ
మలఁదినట్టి బాహులమీఁద • నర్కుఁ బోలు, కుండలంబుల కాంతులు • విండి పరవ.

సీ॥ చంద్రునితోడి ఋ • క్షముల చందంబునఁ, దారహారంబు కం • ధరను గ్రాల
ద్వాదశాదిత్యులు • వనధిపైఁ • దోఁచిన, పగిది రత్నకిరీట • పంక్తి తనరఁ
బెక్కు చంద్రుల పోల్కి • విలసిల్లు ముత్యాల, గొడుగులు తలలపై • బెడఁగుసూప
సంజ పాలికలందు • శశుల నుంచినలీల, గుహవంటి నోళులఁ • గోఱలొప్ప
తే॥ ముత్తెములు కూర్చుటం జేసి • మురువు తెలుపు, నుదుటి వీరపట్టంబులు • మదము లొలుకు
దిగ్గజమ్ముల పట్టంబు • తెఱఁగు దాల్చి, ముందఱికిఁ బ్రక్కలకుఁ గాంతి • మొనయుచుండ.
తే॥ పొలయలుక వహియించిన • పూవుఁబోండ్ల, పదములకు మ్రొక్కని కిరీట • పంక్తి కాంతి
భాస్కరుని గెల్చి మించిన • పగిది నిరుల, తోరపుం గుంపులను వెలి • దోలుచుండ.
తే॥ స్వర్గ మర్త్య పాతాళముల్ • సరవిగెలిచి, లీలఁదాల్చిన విజయమా • లికలతోడ
చెలుల దృష్టులచేఁ జాల • చెలువుగులుకు, తుమ్మి పూమాల యురమున • నెమ్మిఁదాల్చి.
తే॥ పురికి సగడితగా నున్న • శరధి యిసుక, కాలమును మీనములు విద్య • కలిమి యుడుమ
పడవు పంచభూతమ్ములు • చెడినఁ జెడని, యశముఁ బోలిన తూణీర • మమరఁదాల్చి.
తే॥ ఒక్క మొగిమూఁడు లోకంబు • లెక్కనసువ, హింపఁగలయదితురగ రా • హిత్యమయ్యు
తలఁపు మాత్రానఁ బోవంగఁ • దగిన తేరు, రమ్మనిన యంతవచ్చి య • గ్రమున నిలిచె.

చ॥ అమృతముతోడఁ బుట్టినవి • యక్క జవాశ్వ కులంబులోని వం
గముగ మరుత్తుచే బడబ • గర్భమునం జనియించినట్టి వ
భ్రమున జలంబునం దనలి • వాయు పథంబులఁ బోవునట్టి వా
చ్చెము గనరాని యశ్వములు • చెల్వుగవేయి రథంబు లాగఁగన్.

సీ॥ కనక దిగ్గజ కంఠ • ఘంటికా నిభములో, గంటలు వేకోట్లు • గలిగినయది
అందంబులను వ్రి • యమునకుఁ గొనఁజాలు, వెలలేని మణులచే • వెలసినయది
మునులు సురలు స్తుత్య • మున నోడువారలో, సంగు కైదువుల నె • సంగినయది
శూలి శూలంబు వి • ష్ణుని చుట్టుకైదువు, విఱిగిన విలుగని • యోజపుగలది
తే॥ విబుధులేనియు నూహించి • విస్తరింప, లేని శిల్ప నైపుణిచే నె • లింగినయది
సత్యముంబోలె మహిమకుఁ • జాలినయది, విజయలక్ష్మికి నిలయ మా • విభుని తేరు
తే॥ అట్టితేరిని వలగొని • యసుర విభుఁడు, శాస్త్రరీతి నర్చించి యా • చక కదంబ
మునకుఁ దృప్తి యాత్రాదాన • మొనరఁజేసి, వంది మాగధుల్ సేవింప • నందుచేరె.
తే॥ ఎదల దార్ఢ్యంబుగొనియున్న • యింద్రముఖ్యు, లప్పుడవిగని చాంచల్య • మందినారు
ఇంద్రియముల గెల్చిన తాప • సేంద్రులును స, మస్త జీవులు భీతిల్లి • మలఁగినారు.

చ॥ సమరము సేయఁబూనితని • సర్వజగంబులు మెచ్చ నేటి కు
త్క్రమణము తప్పదింక రఘు • రామునకో మఱి నాకొ ? ధారణిన్
కుమిలి నశించు చెల్వ ఖవి • కూఁతురొ ? యమ్మయుకూఁతురో ? యటం
చమలిన మేఘభీషణ ము • హాధ్వని రావణుఁ డాడె నత్తఱిన్.

సీ॥ పదిగుత్తుకల మీఁద • బదితలల్ బొమిడిక, ములతోడ రవుల చౌ • ప్పున వెలుంగ
ఇరువది హస్తంబు • లిరువది కైదువు, లలరంగఁ దాల్చి వి • శ్చలత నెసఁగ
భూజనంబులు స్వర్గ • ముసవారు భీతిలఁ, బెకలి నభంబు చీ • లికలుగాఁగ
శైలముల్ పగులంగ • నేల బీఁటలు వాఱ సూర్యుండు తన గతి • సూటిదప్పఁ

తే॥ చంద్రుఁడమృతంబు చిందించి • స్రగ్గి యుండ, వేలుపుల విమానంబులు • వ్రీలి కూల
సింహనాదంబు గావించె • సిద్ధ, సాధ్య గణము బెదరంగ నా జగ • త్కంటకుండు.

క॥ ఘోర రణము గలిగినదను, ధీరతతో శింజినీ ర • వం గావించెన్
మీఱిన భయమున ఖేచర, దారలు దమ సూత్రములను • తడవికొనంగన్.

సీ॥ ఇన శశాంకులు చలి • యించెడు తెఱఁగు చూ, పించు పాథోరాశి • మించిపొంగఁ
గల చరాచరములు • గందరగోళంబు, నొంద ననంతుండు • కుంది కుమిలి
శిరములు వే విడి • ర్చికొని భూమికి లేచి, వచ్చెనా నసురారి • వచ్చె ననికిఁ
గన్నులు బడబాగ్ని • కంటె మిక్కిలి గ్రాల, వచ్చిన రావణు • వైనమునకు

తే॥ ప్రాణివర్గంబు కలఁత వి • ద్యాధరుల చింత, పర్వతావనీ గగన వి • భ్రమణ రీతి
జలధి చలనంబు రవిసుతా • దులు గ్రహించి, యేమి కారణమని శంక • నెనసినారు.

తే॥ అండగోళమే పగిలిన • దనఁగఁ దోఁచు, గొప్ప శబ్దంబు తదఁబాటు • కొంప లెరియ
కాలమునఁ బుట్టు కలఁతయుఁ • గలిగెననుచుఁ, గతము నెఱుఁగక లేచెన • క్కపిచయంబు.

తే॥ సాగరములును శైలముల్ • జలదములును, స్వర్ణగిరియును సభమున • జరుగు కరణిఁ
దోఁపఁ దేరెక్కి బంటి కు • త్తుకల వాఁడు, బలముతో వచ్చు నాకల • కలము గనిరి.

మ॥ కని భూనాయక లెమ్ము లెమ్ము దనుజ • క్ష్మాపాలపర్యంకు తా
ననిసేయం దమకించి వచ్చెఁ దన సై • న్యాగ్రీయ భాగంబు వా
సెను శాఖామృగముల్ భయంబునఁ జలిం • చెన్ వేలుపుల్ తెల్వి మా
లిన వారైరని యవ్విభీషణుఁడు తె • ల్పెన్ రామ భూజానికిన్.

## ౩౯. రామ రథారోహణ పటలము. (27)

మ॥ కరముల్ మోడిచి నోళులెండఁ దనువుల్ • కంపింప బెగ్గిల్లుచున్
వెరఁ దబ్బిబ్బును బొందు కౌశికనుమున్ • వీక్షించి రాముండిఁకన్
వెరఁపుం బొందకుఁడంచు లేచె విబుధుల్ • వేఁడంగ దుగ్ధాబ్ధిపై
నురగేశానుని శెజ్జ వీడు తటి ను • ద్యోతించు చందంబునన్.

ఉ॥ లేచి కృతాంత వాలమును • లీల్గఁ జెల్వు నరాజిఁ జెక్కె నా
ఖేచరపాళికిన్ భువన • కీర్తిత పూతకు సీతకున్ సదా
యేచు మహార్తియన్ జలధి • నీఁదఁగఁ జెప్ప లభించె నేఁటికిన్
జూచుచు నుండుఁడీ రణము • శోభిలు పద్ధతి యంచుఁ బల్కుచున్.

ఉ॥ రాముని దేహమున్ గవచ • రాజము గప్పినదంచుఁ జెప్పఁగా
నేమిఫలంబు? భావమున • నెంచిన మాత్ర సమస్త వస్తువుల్
రామునిచేరు వేఱొకటి • రాముఁడు లేనిది లేదు సర్వమున్
రాముఁడె కాఁగఁ గంకటము • రాముఁడు కాదొకా మాటలేటికిన్?

తే॥ హస్తములకు నంగుళులకు • నమరఁ గవచ, ములను తొడిగి జగమ్ములఁ • గలుగు ద్రవ్య
ముల విధంబున మితిలేని • యలుఁగులు గల, శరధి వీఁపునఁ దాల్చె దా • శరథి యపుడు.

ఉ॥ విజ్వరులార! సంగరము • నేఁటికిఁ బూర్తిని చెందు మీకు నా
దుర్జనుచే భయంబు నిఁక • దోరెను రాక్షసు నోర్వఁ గయ్యపుం
గర్జమునందు రాముఁ డెన • కంబున నుండఁగ మీరథంబు నిం
దూర్జిత సత్త్వఁ జాతనికి • నొప్పగ నంచు భవుండు తెల్పఁగన్.

చ॥ సురలను సమ్మతింప బలి • సూదనుఁ డయ్యెడ నారథంబు శ్రీ
వరునకు నాలయంబుగను • భక్తి నొనర్చెదనంచు మాతలిన్
బరఁగ నలంకృతుల్ నలిపి • వైశమ తెమ్మనఁ దెచ్చె నాతఁడున్
బరమ శిక్షండు బ్రహ్మయును • బానములం బ్రమదంబు నొందఁగన్.

సీ॥ చందురు బింబంబు • క్రింది పలుపుగాఁగ, నున్న చందంబున • నుల్లసిల్లి
కులపర్వతముల యు • క్కును గల శిఖరంబు, తక్కు నంగంబులు • ద్రఢిమగలిగి
వర్షర్తు మాస ది • వారాత్ర భూత భ, విష్య త్కృతాంగ సం • వితతినొప్పి
తారకాహార య • క్తంబయి యష్ట మహా నాగ పాశ సం • దానితమయి

తే॥ దెసలె ప్రక్కలుగా మేఘ • విసరమేప, తాకలుగఁ బంచభూత స • త్త్వంబు నమరి
ప్రళయ జలధి ఘోషమె నేమి • రవముగాఁగ, నదరు నింద్రుని తేరు పు • ణ్యములసౌరు.

సీ॥ నలువ పుట్టిన విష్ణు • నాభి పద్మంబును, బోలిన నాదెంపు • మొగ్గ లమరి
జగదుదరుని శేష • శయ్య యంతటి పఱ, పంది వేదంబులు • యజ్ఞములును
సాగరంబులు కుల • శైలముల్ భువనముల్, త్రేతాగ్నులును పంచ • భూతములును
తపము లింద్రియములు • దశదిశన్ రేయియుఁ, బగలు గుఱ్ఱాలుగాఁ • బరిఢవిల్లి

తే॥ నిలుచు తేరిని కని మ్రొక్కి • విజ్వరాలి, ప్రభుని యాజ్ఞను వచ్చితి • రామ విభున
కని జయము గూర్చి మమ్మను • మనుపు మనుచుఁ, బ్రసవములు చల్లి పూజించి • పంపిరంత.

చ॥ మాతలి చోదితంబయి వి • మాన పథంబున నుండి కర్మ సం
ఘాత విరోధి జ్ఞానమునఁ • గ్రాలుచుఁ జిత్తముఁబోలి వేగ వి
ఖ్యాతి యొసంగు తేరు వడి • గాఁ బఱతెంచి మహీజ చిత్త కం
జాత దినేశు సన్నిధిని • చయ్యన వ్రాలె ఖగేంద్రు క్రైవడిన్.

ఉ॥ అర్యము తేరుగాదు విల • యానల కాంతియు గాదు ధూమకే
ద్వర్యము గాదజాదుల న • వారణ మోయు విమానమేమొ? మే

కార్యమువిూఁదఁజె నేరు కడఁ • కం • దగ నంపి రెవండవీవు ? ప్రా
పర్యము గాఁగఁ దెల్పుమనఁ • జోదకుఁ డార్యున కంత నిట్లనున్.

ఉ॥ ఓమహనీయ భాస్కర కు • లోదధి సోమ ! గుణాభిరామ ! శ్రీ
రామ ! నిశాచరాన్వయ వి • రామ ! పురారియు ధాత తొల్లి సు
త్రాముని కిచ్చి రీ రథము • దార్ఢ్యముచే జగమెల్ల మోచు ను
ద్దాము జవంబు నొందినది • దాశరథీ ! విహరింపు దీనిపై.

సీ॥ కామ యానంబును • కామ సంచారంబు, గలయది వెన్ను ని • కడుపువంటి
పలుపయి సితూపు • పదిగళ్లె యెద గాలి, తనులను మ్రింగఁ జా • లినది దివియు
భువి యను • భేదంబు • బొరయని దగ్నిని, జలమునందును బోవఁ • జాలినయది
సాగరంబులు భూమి • జగములు స్థితులలో, మార్పొందు నట్లిది • మాఱకుండు
తే॥ నిలువ చిలువ తాలుపు వేలు • పులును మునులు, శ్రద్ధమెయిఁ దెప్ప మహవుండు • సాంద్రభక్తి
బంపె నింబెక్కి నీ పగ • వాని గెలుపు, యనుమ నశ్వ హృదయ ఘణుఁ • డౌనరఁ బలుక

మ॥ దనుజాధీశ్వరు మాయయో యనుచుఁ జి • త్తంబందు నేతీశ్వరుం
డనుమానింపఁగ రథ్యముల్ నిగమ వా • క్యశ్రేణిఁ బ్రార్థించి యా
తని వాక్యంబుల నమ్మఁడీ యితఁడు వృ • త్రద్వేషి వోధృండు నీ
యనుజన్ముంబలె నుండు మాతలిచుమీ • యంచుం బ్రశంసింపఁగన్.

మ॥ అనుజుండున్ హనుమద్విభీషణులు స • త్యంబద్ది నిశ్శంక మౌ
నని దుష్కర్మము లెంచ సత్కృతులు స • మ్యగ్రీతి మిట్టాడఁ బొ
ల్పున నవ్వేల్పుల కేలుమోడ్పు లెసఁగన్ • భూదాయఁ దాశేరు మె
ల్పున నారోహణ మాచరించె జగముల్ • మోదంబునం బొందఁగన్.

## 36. రావణ వధ పటలము. (253)

భుజంగ ప్రయాతము॥

జగద్వీరుఁడౌ రామ • చంద్రుండు ప్రీతిన్, నగారాతి తేరెక్కి • నం గాంచి దివ్యుల్
ఖగాధీశ్వరు న్మాని • కాకుత్స్థుపై నా, కుగాత్మాంబు పైనింబ్ర • సూనాలి చల్లన్.

ఆ॥ తేరు నడచుఁగాక • దివ్యుల జయములు, రాముఁ డెందుఁగాక • రావణుండు
చచ్చుఁగాక దనుజ • జాయ లేడ్తురుగాక, యనుచు నమరవర్య • లాడుచుండ

ఉ॥ రాముఁడు తేరిపైఁ గదలె • రావణుఁ డయ్యది గాంచి మండి సు
త్రాముని మీఁది కిన్క సుర • వంబులు గీటుచుఁ దేరు సంగరో
ద్దాముని మీఁదికిం జన న • దల్పుచు సారథి దేపి పోరి సం
గ్రామము సేయు కోర్కి తన • రన్ బుజపించెను గాలితై వడిన్.

ఉ॥ ఇచ్చిరి తేరు వేల్పులు ది • నేశకులేశున కింక రాముఁడే
వ్రచ్చు దశాస్యునంచు మును • పాఱిన కీశులు ధీరచిత్తులై
వచ్చి గిరీంద్రముల్ శిలలు • వైచిరి రావణుమీఁద నాతఁడున్
జెచ్చెర వానిఁ ద్రుంచి యొక • సింహరవం బొనరించు నంతటన్

చ॥ చెవులను చిల్లులేర్పడఁగ • శింజినిరావము సింహనాదముల్
దవులఁగ శంఖ దుందుభి మృ • దంగ రవంబులు కాహళ ధ్వనుల్
వివిధములైన గర్జనలు • వెల్వడ దిక్కులతో నజాండమే
పవిలిన చందమై స్వనము • పర్వె జగంబులు చేష్ట దక్కఁగన్.

తే॥ మాతలిం గాంచి రాముండు • మహిత చరిత! యుత్సహించి శాత్రవో • ద్యోగవిధము
నదను నాయభిప్రాయంబు • నల్లనెఱిఁగి, తేరు నడపుము గాఁని తెలుప నతఁడు.

ఉ॥ నీతలఁపున్ దురంగముల • నేర్పును శత్రుల చిత్తమున్ రణ
స్ఫూర్తియుఁ దారతమ్యమును • సంకటపాటనుకూలపాటు మీ
నీతియుఁ బట్టుపట్టు గమ • నించి చరించినఁగాక నాదు వి
ద్యాతిశయంబు సార్థమగు • నా? యని తృప్తుని చేసె రాఘవున్.

తే॥ ఇంద్ర రథముపై రాఘవుఁ • డేగుదెంచె, నిరువురకు మీకు ఘోరసం • గరము జరగు
నేను సాక్షినై యుండంగ • నేలః యేమి, యాజ్ఞయని మహోదరుఁడు ద • శాస్యు నడిగె.

ఉ॥ సింగము దంతిపై కుఱుకు • పెల్లున దూఁకెద రాము మీఁదికిన్
బొంగడఁగించెదన్ సురల • పొంగును గ్రుంగఁగ నీవు లక్ష్మణుం
సంగరమం దెదిర్చిన ని • జంబుగ నాకు జయం బొసంగు దా
యంగునఁ జెంగనీఁక తెగ • టార్పుము వాని ననంగ నాతఁడున్.

## రామునిచే మహోదరుండు కూలుట

చ॥ మరలి మహోదరుండు చను • మార్గమునం దెదురైన రామ భూ
వరుఁగని యానృపాలకుని • పైకి రథంబును పోవనిమ్మనన్
వెరవరియైన సారథియు • వీఱిఁడియై చననేల? పంక్తి కం
ధరు లోక వేవురై చనిన • దాశరథిం జెనకంగ నేర్తురే?

ఉ॥ వాని గభీర ధైర్యమును • వాని ముఖస్థితి సుంత కాంచుచో
వానిఁ దొలంగిపోవుటయె • వారని క్షేమ పథంబు నావుడున్
వాని మహోదరుండు గని • ప్రల్లద మాడెద వోరి నాదు కో
పానకుఁ బాత్రమై బ్రదికి • బట్టయుఁ గట్టెదవే దురాత్మకా!

ఉ॥ నీదగు కత్తుకం గొటికి • నెత్తురు ద్రావిన దోసముప్పదే?
పైదలిఁ బోలవాఁడవని • పల్కిన వాఁడుఁ గినుకన్ నాక

గా దయితుం గుఱించి యర • దంబును తోలెను వారికయ్యెడన్
మోదన భేదనమ్ములుగ • ముమ్మరమైన దురంబు సంధిలెన్.

తే॥ వారుషంబులు తేరులు • వారణములు, వీరభటులను గలసైన్య • వారిరాశి
రామశర బడబా వహ్ని • ద్రావివైచె, ద్రుటి మహోదరుఁడొంటియై • దొరయనిలిచె

తే॥ ధ్వజముపైఁ దేరిపై వాగె • పట్టియున్న, వోధపై వాఁడు సాయక • పూరమొదవఁ
జేసి దిక్కులు ద్రీల గ • ర్జించె రాము, విభుఁడు మందహాసంబు గా • వించె నరవి.

చ॥ ఖవ సముఁడొక్క బాణమున • వాని శరాసముఁ ద్రుంచి రెంటిచేఁ
గవచముఁ జించి వెంట భుజ • గంబులఁ బోలిన కేలుఁద్రెంచి దొ
డవులఁ బడంగఁ దచ్ఛిరము • దారుణరీతిగ నుత్తరించె దా
నవుని తలంపు లొండయిన • నాశిల వేఱొకటయ్యె నయ్యెడన్.

పంచచా॥ మహోదరుండు ద్రెవ్వఁ గాంచి • మానవాదుఁ డుగ్రుడై
యహోయటంచుఁ దేరు దోల • నాజ్ఞచేయ రాఘవుం
డొహో సమస్తసేన చావ • కున్న వాఁడు లొంగడం
చుహూత్కృతిం భజించునంత • నుత్తరించె వారలన్.

సీ॥ అత్తఱిఁ గలిగె లం • కాధినాథునకు దు, శ్శకునముల్ గొన్నియు • త్సాహమడఁగ
నందంబులను ముందు • నట్టు లుప్పొంగెడు, వననిధు లెల్లను • వట్టిపోవఁ
జండవాయుప్రవీఁ • జలియించు పర్వత, సరణి నా నెడమభు • జంబు లదరెఁ
బిడుగులు రాలెను • భీకరంబుగ రక్త, వర్షంబు గురిసె వా • ర్వములు వడఁకె

తే॥ ప్రభలు దక్కిన సూర్యుని • పరిధి చుట్టె, నాల్క లెండెను వింటికో • నలును విఱిగెఁ
బుష్పమాలిక లందుండి • పొలచు వీచె, గృధ్రములు ద్రాలె వీజె చె • క్కియముమీఁద.

తే॥ తురగముల కన్నులందుండి • తొఱఁగె నీరు, కరులు బురదలో దిగఁబడు • కరణి నొంటె
మనుజులా గెల్చు వారని • దనుజ పతిఁడు, వాని లెక్కింపఁడయ్యె గ • ర్వంబు కలిమి.

తే॥ విలయ వాయువుచే జగ • ద్వీథియందు, గలుగు వస్తువుల్ చెదరిన • కరణి దనుజ
విరుని రథవేగమునకు వా • నరులు చెదరి, విమతులై భీతిగొని త్రోవ • విడిచినారు.

సీ॥ కర్మంబు జ్ఞానంబు • కరణి నవిద్యయు, విద్యయు శేషుండు • విహగరాజు
రాత్రియుఁ బవలు హి • రణ్యకశిపు నృసిం, హులఁబోలె దిగ్గజ • యుగళి యట్లు
ఎవఁ డాదిదేవుఁ డం • చెదిరించి పోరిన, రుద్రాచ్యుతుల లేవ • రోషమదర
దశకంఠరుండును • దశరథసూనుండు, రణరంగమున మహా • రంభులైరి.

తే॥ దాంచుమన్నట్టి సాధ్వ వి • రించులకును, కరతలంబులు పిక్కిలి • కంపమొంద
రావణుఁడు శంఖమొత్తెని • ర్ఘటులు జెగడ, రాముఁడును పాంచజన్యంబు • రమణనూఁదె.

తె॥ శ్రీశు పంచాయుధంబులు • సేవసేయఁ, గోరి రాముని సన్నిధిఁ • గొలిచి నిలిచె
వేదములు తన్నెఱుంగని • విధిని రామ, చంద్రవిభుఁడును వానిఁగాం • చకయ యుండె.

తే॥ దిక్కులును జలధులు ధరి • త్రియునభంబు, కు .హీంద్రముల్ బ్రహ్మాండ • గోళమదర
దాశరథికి సారథియయి • తనరుచున్న, మాతలియు నింద్రు చింద మి • మ్మడిగనొత్తె

తే॥ రావణుండు వడినేయు నా • రాచ వితతి, సోకుటకు మున్నె ఖేచర • శ్రీకటాక్ష
చయ మనంతమై శ్రీరామ • చంద్ర విభుని, భుజయుగళి సోకె నేమి కా • బోవు ననుచు.

క॥ ఇరు రథములందు పూన్చిన, తురగములు పరస్పరంబు • తూఁకొని లోకో
త్కరముల మ్రింగం జాలిన, సరభస కోపమునఁ జూచె • సకిలింతలతోన్.

క॥ దానవ నాథుని వీణా, గాన చణతఁ దెలుపు క్రమ • కలిత ధ్వజమున్
మానవనాథుని తేరునఁ, బూనుచు నింద్రధ్వజంబుఁ • బోరిపోరి మోఁదెన్.

క॥ దనుజవిభు శింజనీధ్వని, వననిధి సప్తకముఁ గలఁచి • వైచినయది య
మ్మనుజ విభుని జ్యానినదము, వనజభవాండములఁ గలఁచి • వైచెను తోడ్తోన్.

క॥ హనుమంతుఁ డాదిగాఁ గల, వనచరు లెదిసేయుటకును • పాల్పోవక నె
క్కొని యూరక నిశ్చేష్టత, గొని చూచుచునుండ్రి వారి • ఘోర రణంబున్.

క॥ వెరఁగంది విబుధ వరులె, వ్వరు గెల్తురో యనుచు నెఱుఁగ • వలను పడక ని
బ్బరము చెడి యిందు నందుం, దిరుగుచు మీఁదెఱుఁగలేక • తెరలిరి భీతిన్.

తే॥ రామ శరము లంబరమున • రాణనిండ, వేఁపులు చల్లుచుండిన • విరులచే న
లంకృతంబులై రాజిల్లు • లలినితోఁచె, దుష్టులకుఁ దోడుపడునట్టి • తుచ్ఛు లెవరు ?

తే॥ వీర శేఖరుఁడగు రామ • విభుని ధనువు, పరులు తాఁకఁగ లేని రా • వణుని ధనువు
మింట నింద్ర చాపద్వయి • మెఱసి యెదిరి, నిలుచు చందాన మిఱుమిట్లు • గొలుపుచుండె.

తే॥ నాఁడు లంకాధినాథుం డొ • నర్చినట్టి, శింజినీ రావమును గొప్ప • సింహరవము
నేఁటికిం దెల్పుఁబోయను • నియతినొంది, జలధములును జలధుల ఘో • షణము నించు.

తే॥ దనుజనాథుని తీక్ష్ణంపుఁ • గనులనుండి, చెదరి వెలువడి మిడుఁగుఱుల్ • చిటపటమని
నింగి కెగయంగ నందుండు నీరదములు, కరఁగి షలపల రాలెను • ధరణిమీఁద

తే॥ కలఁగె దిక్కులు జలధులు • కలఁగె సురల, కొలుగేలును కలఁగె లం • కయుఁ గలంగె
కలఁగ దయ్యెను రాముని • కదఁక సుంత, రావణుని యట్టహాస దు • ర్లలితచేష్ట

తే॥ ధరణియందును మెఱపులు • పరవునట్లు, జలదములనుండి పిడుగులు • జాఱునట్లు
కదనమున వైచు కైదువుల్ • కాంతి చయము, ప్రక్కలం జొరఁ బలపల • రాలుచుండె.

## రామ రావణ సమరము

తే॥ విల్లుగొని చంప గోరక • తల్లడిల్ల, రాము రథముతోఁ బైకెత్తి • భ్రమయఁ ద్రిప్పి
భూమిపై మోఁదిమోఁది చం • పుదునటంచు, దలఁచుచదరు విదానించు • దశముఖుండు.

క॥ మెఱుపులవలె దశ దిశలన్, మెఱయుచు వడినేగు సెలల • మెలపునఁ దేరిం
బరియలుగఁ జేసి వీనిం, జెఱగొందున యని తలంచుఁ • జిత్తములోనన్.

తే॥ పదరుచున్న పవనసూను • కొదరుచున్న, కనలు మిడుఁగుఱుల్లేచెడు • కనుల చూపు
లోఁలయ దనుజనాథుని విల్లు • వెలయ వంచి, పెక్కు మార్గణముల నేసి • విన్నుగప్పె.

క॥ ఉలుముల నిప్పు పటజము, నెఱకుల నాటినవి సురల • నియమంబులఁ బెం
పెఱఁ జేసినవి ఫణీంద్రుని, యొడలుం బోలిన శరమ్ము • లుక్కఱ నేసెన్.

క॥ పేరుఘను తొలిచి యంతన్, వారక యండములఁ జీల్చి • పైకొను నంచా
ధోరణి సరలనకొన్నవి, శ్రీ రాముఁడు చెంగలీక • చెలగె న్నడుమన్.

తే॥ బలయుతుని పని దుష్కర్మ • ఫలముచేత, నడుమఁ జెడినట్లు లంకాధి • నాథు విశిఖ
వితతి నడుమన విఱుగంగ • విసుగులేక. విలయ జలదంబు లలి శర • వృష్టి గురిసె.

తే॥ కప్పె మింటిని దిక్కులఁ • గప్పె గిరులఁ, గప్పెఁ గన్నులఁ గప్పెను • కడలిఁ గప్పె
బుడమిఁ గప్పె విజ్ఞానుల • బుద్ధిఁగప్పె. నిరులు గప్పె ఖేచరులకు • మరులు గప్పె

తే॥ కాలగళుడు దక్కఁగఁ బెరల్ • కనులుమూసి. కొనిరి వజ్రభిన్నములగు • కుధర సమితి
ప్రేలి చెదరికై పడి వాన • రాలి చెదరె. నవని విభుఁడు వారల భీతి • నడఁపనెంచె.

క॥ రామ ధనుర్ముక్త శర, స్తోమమ్ములు పరఁగు టీవి • తోయము పెరిగెన్
గామి దనుజు శరములు దు, ష్కామ కృతఫలంబు వోలెఁ • గడపడి సమసెన్.

క॥ త్రుటిలో లక్షః కోటిఁబిగ, బటుతర శరములను విడిచెఁ • బలలాశి యటం
దటుకున నడుమన విఱిచెను, చటులోద్ధత విశిఖ తతుల • జలజాక్షుండున్.

క॥ చండ సమర పక్షుండగు, గండఁడు రావణుఁడు ముసల • ఖడ్గ ఘనగదా
దండ పరిఘ శూలాదుల, దండంబులు గాఁగఁ బఱపె • దాశరథిపయిన్.

క॥ మేఘ శ్యామల దేహున, మోఘ శరము లొక్కటొకటి • మొన వేయింటిన్
బ్రాఘోష మొనర విఱిచెను, శ్లాఘించుచు సురలు కరత • లంబులఁ జఱవన్.

ఆ॥ ఇట్లు పోరు సమత • నెనయుచుండఁగ రేఁగి, యీఁటె పోటు గొన్న • యేన్గు భంగిఁ
బంక్తిముఖుఁడు పట్టి • పదికేలఁ బది విండ్లు, పదులు పదులుగాఁగఁ • బఱపె సెలలు.

ఆ॥ రామ విశిఖ తతులు • రావణ సాయక, తండ మెల్లయెడల • ఖండితతనఁ
బోరుగాంచు పంచ • భూతంబు లాదిగాఁ, బ్రమదపాటు గగురు • పాటు మానె.

తే॥ అత్తఱిని దశకంఠుని • స్యందనంబు, మందరమ్మొ మారుతి తెచ్చు • మందు మలయొ
మొగిఁ ద్రిశిఖరములో గంధర్వ • నగరమొక్కొ, యనఁగ వ్యోమ పథంబున • నలరినిలిచె

తే॥ దేరిపై మింట దనుజుండు • తెఱపిలేని, బాణవర్షము గురియింపఁ • బద్మమిత్ర
కులుఁడు చూచుచుండంగనే • కోఁతిమూఁక, చచ్చి చావక తెరలు ది • శం భజించె

తే॥ రాముఁ దదిగని మనసేన • ప్రాలుచుండె, నింక నాలసించినఁ గార్య • మిమ్ముదప్పు
వాలి మకుట మస్తకముల • వసుధఁ గూల్తుఁ, దేరు మింటి కరుగనిమ్ము • సారథి! యన.

తే॥ చిత్రమని మాతలియు నట్ల • చేయునంత, నలఘు రథమును చంద్ర మం • డలముపైకి
వచ్చు నినమండలము వోలె • వచ్చినిలిచెఁ, దేరు తేరెదురై చుట్టె • దిక్కులందు.

తే॥ వారిదంబులు దెసలకుఁ • బాఱిపోయె, రిక్కలును పలపల మని • యుక్కిరాలె
శైలశిఖరము ల్విఱిగె దా • శరథి రథము, రావణ రథంబుఁ జుట్టు నా • రథనమందు.

తే॥ తిరుగు నిలుచుఁబైకెక్కును • దిగును తగ్గు, దాపలించి వలపలించి • దాఁటుచుండ
నద్రి కూటముల్ జలధుల • నంతతంత, ములను కుమ్మరిసారె చొ • ప్పునను దిరిగె.

తే॥ క్షణములో నెటకేనియు • జరుగుచున్న, రథములం గాంచి సుర లది • రాము నరద
మిద్ది రావణు రథమని • యెఱుఁగలేక, యొనరఁ దిరుగుచున్నవి తాఁకు • చున్న వనిరి.

తే॥ చక్రములు తాఁకఁ, బడని బు • కములు విన్వ, చిందఁ గాలని శైలముల్ • చీలకుండు
దిశలు నెత్తురు గ్రక్కని • దేహిచయము, కానరాకుండె నా యుద్ధ • కాలమందు.

సీ॥ చూచుచున్నట్టి • ఖేచరులను వారు, నాకలోకమున ను • న్నార లంద్రు
చంద్రలోకంబునఁ • జరియించు వారంద్రు, మందర శైలంబు • నంది రంద్రు
పాలసంద్రము మీఁదఁ • బరఁగు వారందురు, జలధుల కవ్వల • జరగి రంద్రు
ఉత్తర వనరాశి • నున్న వా రందురు, ప్రాగ్దిశఁ జేరిన • వార లంద్రు

తే॥ వారిదంబులయందున్న • వారలంద్రు, నేఁడు లోక సంహారంబె • నెగడునంద్రు
భ్రమ్మతెనె తేరు లంద్రు తు • రంగ తతులు, కావు నిక్కంబు కదనాఁటి • గాడ్పులంద్రు.

క॥ సప్త ద్వీపములందును, సప్తగిరులయందు సప్త • జలధులయందున్
సప్త జగంబులయందును, తృప్తి గొనక యనిలుఁబోలె • దిరిగెం దేరుల్.

క॥ పుడమికి వలువగ నొప్పిన, కడలులలో దీవులన్ జ • గముల గిరుల ని
ల్లడ సొత్తులవలెఁ గైదువు, లడరిపడి మె వానపోల్కి • నసురుండేయన్.

తే॥ అవియు జగముల నలయించు • నలవు గలిగి, మలసి రామసాయకముల • వలననడుమఁ
దునిఁగి తునియలై ధరణిపై • దొరలెఁ గాక, వేఱుకార్యంబు గావింప • నేరవయ్యె.

క॥ గిరులపయి శరనిధులపయి, శరదంబులపయుని సకల • జగములలోనన్
దిరిగిన యరదంబులు పడిఁ, దిరిగి యరిగె లంకపైకి • దితిజులు బెగడన్.

క॥ సారథులు రేఁచి నడపిన, వారువములు సేదగొనవు • వాడవు శ్రాంతిం
గూరవు నిలువవు మేఁతయు, గోరవు చెమరింప వడఁగి • క్రుంగవు త్రుటియున్.

తే॥ భిదురకటుఁ దంపు తేరి న • భేద్యగరిమ, వజలు నశని కేతనమును • పంక్తిముఖుఁడు
నిప్పు లురలెడి కన్నుల • నెగడఁ జూచి, యర్ధ చంద్ర భల్లంబున • నవనిఁ గూల్చె.

తే॥ అధ్వజంబు పిడుగువోలె • నంబుధిఁ బడి, మునుఁగఁ గాఁచిన యినుపక • డ్డిని జలమున
నద్ద నుడికిన వడువున • నంబురాశి, యుడికి యింకి వట్టినయది • యుత్కటముగ.

శా॥ నారద బ్రహ్మముఖైపడిన్ సతతము న్నాశంబు లేకుండు శ్రీ
వైదేహీ విభుశేరి సారథి చద • శ్వ వ్రాతమున్ గ్రవ్యభు
గ్భృదారుండు నిశాత సాయకములన్ • గుప్పించి నొప్పింపఁగా
నాదిత్యాన్వయ వార్ధి సోముఁ డెద న • త్యంతాగ్రహోదగ్రుఁడై.

ఉ॥ తమ్ముని పక్షమందు నిశి తమ్మగు నమ్మలు నాటునాటి కం
పెమ్మది దాపమొందెను ప • టిష్ఠత దైత్యుఁడు విల్లు వంచి కూ
రమ్ముగ నారసమ్ములను • క్రమ్మఁగ నేయఁగ రామచంద్రు చం
దమ్మను గానలేమి భ్రమ • దమ్మను వీడిరి వేల్పులయ్యెడన్

ఉ॥ గ్రుంచెను గొంతు లగ్నులును • కుంభిని సంచలనంబునందె స్తం
భించెను గాలి యెండినవి • మేఘసమూహము లార్చిరెల్ల గా
త్రించరు లర్కచంద్రులకుఁ • దెర్వులు దప్పెను దిగ్గజంబులున్
వంచెను శీర్షముల్ జగము • వాడెను ఘోషము మానె నంబుధుల్.

ఉ॥ మేరువు సంచలించెను † ని • మిత్తము దెల్ప విశాఖరిక్క నం
గారకు డాక్రమించెఁ బ్లవ • గ ప్రభు చంద్రుఁడు లక్ష్మణుండు సే
తారమణున్ రహించి కను • దమ్ములఁ గానమి జొచ్చ యూథపున్
జేరని దంతులట్లు వెతఁ • జెందిరి క్రందిరి యుమ్మలించుచున్.

చ॥ వనచర వర్గముం దరిరి • వారధి వారిధిఁ గూర్చి కట్టుచో
వనచర బృందముల్ దిటగు • వైనము నొందిరి రాముఁడంత హె
చ్చిన కినుకన్ నిశాత శర • చిత్ర మహోత్కట వృష్టిఁ జేసి యా
దనుజుని సాయకంబుల వి • దారణ చేసి వెలింగి యయ్యెడన్.

చ॥ అసురులు నుగ్గుసిల్లఁ బ్లవ • గావలి మోదిల జ్ఞానతత్త్వ వి
త్తమగు ధరాత్మజా విభుఁడు • దానవనాథుని కేలనున్న చా
పములఁ బదింటిఁ దున్కలు స • భంబున కేగఁగఁ ద్రుంచె శాత భ
ల్లములు పదింబదిం బఱపి • లస్త్రకముల్ మిగులంగఁ జేతులన్.

తే॥ కదలిపోల్క గంభీరుఁడౌ • గరుడుఁడపుడు, దనుజవిభుని కార్ముకములు • తునుఁగుచుండ
నిర్జరుల దుఃఖ నికరముల్ • నీఁగవచ్చి, తనరె వినవంశ్యు తేరి కే • తనముగాఁగ.

చ॥ క్షణమున లోకముల్ దిరుగఁ • జాలిన తార్క్ష్యుఁడు రాము తేరిపైఁ
గణఁక వహించి కేతనము • గా వెలయంగ నిఁకేల చింత లా

---

†కోసలానాంచ నక్షత్రం వ్యక్త మింద్రాగ్ని దైవతం
ఆక్రమ్యాంగారక స్తస్థౌ విశాఖామపి చాంబరే.
కోసలుల నక్షత్రము ఇంద్రాగ్ని దైవతము అగు విశాఖను అంగారకుఁ డాక్రమించెను.
కోసలుల కశిష్ట దాయకము. (వాల్మీ. యుద్ధ. 103 సర్గము 33 శ్లో॥)

చణు(డె యపేక్షమై నిలుచు • చందమె చాలదె? యంచు నిర్జరుల్
ప్రణుతి యొనర్చి సూనములు • వర్షముగాఁ గురియించి రొప్పుగన్.

క॥ పటుశరముల పీతా హృ. త్పుటవాసి సురారి కవచ • మున నచటచటం
బెటబెటఁ బెటులఁగ రక్తము. జొటజొట వెలువడఁగఁ గొట్టె • సూటి శరములన్.

తే॥ దిశలఁ దాఁకుచు మేఘ పం • క్తిని చెదరు. శిఖర మొప్పు దైత్యుని పీఱ • సిడము రెండు
సాయకంబుల జానకీ • జాని యేసి. నేల గూల్చెను నిర్జరుల్ • నెగడి పొగడ.

ఉ॥ రావణుఁ డత్తఱిం గడిసి • రాముఁడు తచ్ఛరరాజి నొవ్వమిన్
భావన సేసి యూరకొన • భావ్యము గాదని యెంచి యంధకా
రావహమైన దివ్యశర • మాత్మఁ దలంచి భజించి యెత్తి ధా
త్రీపరుపై వడిం బరపె • దివ్యులు కాంచి వెఱం గలంగఁగన్.

సీ॥ అందుండి వెలువడి • నట్టి కొన్నిటి మొగం, బులు తీంద్ర చంద్ర ని • ప్పులను గ్రక్కఁ
గొన్నిటి మోములు • క్రొన్నెత్తురు వెలార్చె. సురముఖములు మహా • సుర ముఖములు
శూల ముఖంబులు • భుజగ ముఖంబులు. విషములు నించు ది • గ్విభులందు
తరణి చంద్రులఁగప్పఁ • దమమును కల్పించు, నొకచోట నెండయు • నొనరఁగూర్చుఁ

తే॥ జండమారుత మొక్కచో • సరగవీచు. వర్షమొక్కచోఁ గురియించు • వఱదలొక్క
దెసనుగల్పించుఁ బిడుగులఁ • దివినిరాల్చు. భ్రాంతిగలిగించిముంచు సం • గ్రామభూమి.

చ॥ ఇరులు సమస్తముం బొదువ • నెల్లరు పాపఫలంబుఁ బొందువై
ఖరిని కలంకనొంద జన • కాంతుఁడు పాశుపతంబు వేయ నా
యిపలు తొలంగె లోకముల • కెల్లను స్వప్నమువో మెలఁకువల్
పొరసిన చందమై వెలసెఁ • బుణ్యఫలం బనుభూతియౌ గతిన్

ఉ॥ సత్యము సన్నిధిం జెడు న • సత్యముకైవడి నమ్మహాస్త్ర మా
దిత్య కులేశుచే జెడఁ బ్ర • దీప్త రుషాప్తిని పండ్లు గీఁటుచున్
దైత్యవిభుండు రాముపయి • దారుణ బాణము లేసి చేసె నా
దిత్యులు బెగ్గడిల్ల జల • ధి ప్రతిమాన మృగేంద్ర నాదమున్.

తే॥ నింగి వారల కీర్తుల • మ్రింగినదియు. జముని కడుపు నింపినది వా • సవున కదలు
గూర్చినదియు విద్విడ్భృశా • ఘోరతరము. నైన యాసురాస్త్రము నేసె • దానవుండు.

శా॥ ఆయస్త్రంబు మహోగ్ర రూపమునఁ ద • న్నంకించు బాణౌఘముం
బాయం ద్రోచుచు రామసన్నిధికిఁ బో • వం జూచి గీర్వాణు లె
ట్లో యంచుం దపియింప రాఘవుఁడు సం • యోజించి నిర్భీతి నా
గ్నేయాస్త్రంబున నాసురాస్త్రమును గ్రుం • గించెం గపుల్ హోయనన్.

చ॥ శమనుఁడు జంకినన్ గడిమి • జంకక వార్ధులఁ గ్రోలఁజాలి భూ
ధ్రములను నుగ్గుసేయుచు స • దాగతి గెల్వఁగఁ జాలు నస్త్ర బృం

చములను దైత్యవల్లభుఁడు • దాశరథిన్ వడిఁ గప్పివైచె నా
క్రమమును గాంచి వేల్పులు భ • రమ్మగు భీతి భజించి రొక్కటన్.

ఉ॥ కొందఱు హస్తలాఘవముఁ • గొందఱు మాయబలంబు స్థైర్యమున్
గొందఱు దైత్యకోపమును • గోరి నుతింపఁగఁ గొందఱింక మా
యం దులకింప వీలు గల • దా యని కొందఱు పూర్వమెన్నఁడున్
గ్రందగు నిట్టి కయ్యమును • గానమ యంచు వచించుచుండఁగన్.

క॥ ఇన కులజుఁడు గగనము గ. ప్పిన క్రూరాస్త్రంబులెల్ల • భేదిల్ల వెసన్
ఘన శరములఁ దునిమి వెలిం. గెను తమ మడఁచిన ప్రచండ • కిరణునిపోలెన్.

క॥ అధిక తపో బలయుత సుర. మథనుఁడు బహుసంగరముల • మఱసిన యాపర
ప్రధనమున గెలుపు నొసఁగిన. క్రథ యాద్భుత శిలమయ శ • రంబును వఱపెన్.

క॥ స్రుక్కిరి త్రిదశులు లోకము. లుక్కఱెనని చచ్చితిమని • యూర్పుచుఁ బ్లవగుల్
మిక్కిలి దెసలకుం బరుగిడి. ర క్కాకుత్స్థుఁడును దాని • యంతర మెఱిఁగెన్.

క॥ భూమిని రాముని జీవిత. మే మునిఁగిన దన్న పగిది • నెసఁగిన శరమున్
రాముఁడు గాంధర్వాస్త్రము. చేమాలిచి నడుమఁ జీల్చి • చిందఱవేసెన్.

క॥ వికటించిన మధుఁడు హిర. ణ్యకశిపుఁడు జగత్త్రియం బ • ణంచినయది పూ
నిక నలువ యొసఁగినది యగు. ప్రకృష్ట దండంబు నెత్తి • రావణుఁ డేసెన్.

తే॥ మనుపు తారకాసురుఁడు చే • ల్పుల మొగములఁ, గుతిలపడదానిచేతనే • చితుకఁగొట్టెఁ
గల్పకాలంబు దనుజ జ • గంబులెల్లఁ, జేరి దొరలింప దొరలని • చేవగలది.

క॥ అండము జలఘటముం బలె. ఖండములై కూలునని జ • గంబులు కలఁగన్
దండము చండగతిని కో. దండధరుని సన్నిధికిని • దాయఁగవచ్చెన్.

క॥ కమలాక్షుఁడు కని యా వం. డము నింద్రుని పేగనుల క • డంగక శత ప
త్త్రము మొగ్గను పోలిన య. స్త్రము వైచి యొనర్చె వేయి • శకలంబులుగన్.

క॥ చండతరంబుగఁ గార్ముక. పాండిత్యముఁ జూపు రాముఁ • బరిమార్పని యీ
దండాట లేల యని పౌర. దిండియు మాయాస్త్రమున వ • ధింపఁ దలంచెన్.

దండకము॥

పూజించి యుగ్రాక్షుఁ గీర్తించి చందంబు న్యాసంబు విధ్యుక్తధర్మంబుతో సేవగా
వించి మాయాస్త్రమున్ వింట సంధించి శ్రీరాముపై నేయ నాయస్త్ర మాయా
విధిం జేసి పూర్వంబు శ్రీరామ సౌమిత్రి బాణంబులన్ ధారణిం గూలియున్నట్టి
దైతేయులన్ లేచి హర్యక్ష నాదంబు గావించి రాయింద్ర జిత్తు న్నికుంభుండు
కుంభుండు సేనానులున్ మిన్నుమున్నున్ వెసంగప్పి రా కుంభకర్ణుండు గావ్పించి
బిట్టార్చె సంగ్రామ రంగంబునందుం దురంగ వ్రజంబున్ శతాంగోచ్చయ శ్రేణి.

సారంగ సంఘంబులుం జేరి వేవెల్లువల్ శంభుచేతన్ వరంబంది ప్రాణంబులం బొంది యింబారఁగాలేచు చందంబునౝ లేచి బృందారక వ్రాతముల్ చూడ దిగ్భ్రాంతి గల్గించి ముౝగెల్చు నవ్వీరులం బిల్చి మాశక్తిఁ జూడుండు మమ్మేద యోడించి నారంచుఁ బేరెత్తి రారండు ఖండాలుగాఁ గోసి పిండాలుగాఁ జేసి వేమ్రింగకే పోదుమే యంచు నిటార్భటింపంగ నాగంబులా భోగి లోకంబు నందుండి ధాత్రిన్ విదారించు కొంచిట్టు లేతెంచె నా నొప్పి భూతంబులన్ శాకినీ డాకిని ప్రేతరాసుల్ జనించెన్ దమంబందు జన్మించిధర్మంబులన్ మ్రాల్చుసత్త్వాఢ్యులున్ ధామసత్త్రింబులా నాయుధ స్తోమముం బట్టి చిత్రింబుగాఁ గ్రాల దంష్ట్రారుచుల్ బాలచంద్రాకృతిౝ వ్రాల దిగ్దేశముల్ నిండి సింగంబులం బోలి గర్జించి చౌగంటులం బోలి వావిప్పి నానావిధాక్షిల జాజ్వల్య మానానల జ్వాలలం జింద వీక్షించుచున్ దూషణ ద్వేషణోద్భీషణ స్ఫార దుర్భాషణంబుల్ ప్రవంచించుచుండన్ రఘు స్వామి వీక్షించి యేమాయయో నీకు భావంబునం దోఁచునేనిన్ విచారించి వాక్రుత్తువే యన్న నవ్వేధయున్ దేవదేవేశ ! యీ దేవ విద్వేషి కర్మారు వేశ్మంబునన్ సూదు లమ్మంగ నేతెంచు వానిం బలెం బూని నీమీఁద మాయాస్త్ర మిట్లేసి క్షోభింపఁగాఁ జేయ భావించియున్నాఁడు నీపేరు విన్నంత నీనామ మన్నంత భావించి నంతం బటాపంచలై పోవుఁ బాపంబు లెల్లన్ జగన్నాయకా ! నిన్ను నీమాయ యేమేని కావింపఁగాఁ జాలునే ? నీదుమాయందరింపంగ మౌనీంద్రులున్ నేరరన్నన్ విదేహాత్మజానాథుఁ డౌఁగాక యీమాయ యేదేని యౌఁగాక యంచున్ విచారించి జ్ఞానాస్త్రమున్ వింట సంధించి యేయంగ ధర్మంబు త్రోవన్ జనన్ జ్ఞాన సంపత్తి నజ్ఞాన బంధంబుల న్నీఁగులాగై జగంబెల్ల విభ్రాంతిఁ బోనాడి స్వాస్థ్యంబు నొందెన్.

మ॥ గర కంఠుండు చతుర్ముఖుండును మదిం • గాలుష్యముల్ తీఱ సం
గర మందియ్యెడ లోక కంటకులకుం • గార్శ్యంబు నాశంబు చే
కుఱఁ గాక్షించుచు నుండ దైత్యుఁడు మహా • క్రూర ప్రభావ స్ఫుర
ద్వర శూలంబును సూటిగా విసరె సీ • తానాథుపై గ్రక్కునన్.

తే॥ విబుధులకు నాకులత గూర్చి • వేయిగంట, లొరసి మొరయ వీరుల బల • యోగ్యతలను
విత యొనర్చు శూలము లోక • భీకరముగఁ, దొడరి వచ్చుట రామభ • ద్రుండుకాంచె.

తే॥ నెఱసి త్రేతాగ్నులనుమించి • మెఱసిగాడ్పు, దెసలకొదుఁగంగజగములు • దిగ్గ్రసింపఁ
గనులు మిఱుమిట్లు గొనవచ్చు • కఠిన శూల, సాధనము గని సురలును • సంచలించ.

తే॥ నీ వినాశంబు మదిగోరి • రావణుండు, వైచె శూలంబు దీనిని • సైఁచి త్రోచు
శక్తి నీకుఁగా కొరులకు • జగతిలేదు, గెలుము గెలుమని తడఁబడఁ • బలికెనారు.

తే॥ పిడుగులును వచ్చుపడిఁగాంచి • బిడియ పడఁగ, దన్ను మఱవక ధ్యానించు • తత్పరులకు
నాస్తికులు నేయచుండు వి • ఘ్నంబులట్లు, రామశరములు వితయయి • రాలుచుండ.

తే॥ అరసి రాముఁడు ఉప్ప సా • యకములేయ, నవియుదానిదాయక మున్నె • యడఁగుచుండఁ
బుణ్యశాపముం బోలె న • మోఘగరిమ. శూల మరుదేర నాతఁడు • చూచె నురక.

తే॥ వేలుపులు దిక్కుతోఁవక • వెసనవడిరి, ధర్మదేవత కాళులు • తడఁబడంగఁ
దున్ను మఱచె రాముఁడు భయ • దంబుగాఁగ, వదరె శూలమనుచు లోన • నాకులించె.

శా॥ సంహారోద్యమ మొప్ప శూలము జగ • చ్చాంచల్యముం జేయుచున్
రంహోదగ్రత రామచంద్రు పయికిఁ • రాఁజూచి రౌద్రస్థితిన్
సింహప్రక్రియ హుంకరింప నది వి • చ్ఛిన్నంబుగాఁ దూలె దు
ర్వ్యాంహోదూషిత యత్నముం బలె సురల్ • బ్రహ్మాదులున్ మోదిలన్.

తే॥ పోయినట్టి ప్రాణంబులఁ • బొందినక్రియ, నొంది రగచరుల్ ఖేచరు • లుమ్మలంబు
విడిచి యాడిరి పాడిరి • విరులవాన, గురిసి వేఁడిరి రావణుఁ • గూల్పు మనుచు.

మ॥ అని వార్యంబగు శూలమున్ దన మహా • హంకార హుంకార భీ
షణ నాదంబున బీటువో నడఁచె నీ • సంగ్రామ భీమున్ దురం
బున సాధించుట దెప్పరంబను తలం • పుం బొంది దేవారి త
మ్ముని వాక్యంబుఁ దలంచె; దుర్మదమెకా • పోకార్చు విజ్ఞానమున్ ?

మ॥ వరశక్తిన్ శరశక్తి నెల్ల నిచటన్ • వ్యర్థంబు గావించె వీఁ
డరయన్ భర్గుఁడుకాఁడు విష్ణువును కాఁ • డంభోజ సంభూతికిఁ
దిరవారంగఁ దపస్వి కాఁడు జనలో • కే శానుఁడుం గాఁడు దు
స్తర సంసార భవాబ్ధి తారక మహ • త్తత్త్వంబుగా నెంచెదన్.

మ॥ పరమాత్ముండగుఁగాక వేఱు మఱి యె • వ్వాఁడైన నౌఁగాక ని
ర్భర శౌర్యంబున గెల్చితిన్ జగములన్ • బ్రాంచ ద్యశం బందితిన్
బిఱుదీయం బనియేమి ? గెల్చిన జగ • ద్విఖ్యాతి సిద్ధించు సం
గర రంగంబున నీల్గినం దుదకు మో • క్షంబబ్బు నేలా వెతల్ ?

మ॥ అని చింతించి కడంకతో నిరృతి ది • వ్యాస్త్రంబు ధ్యానించి దా
నిని వింటం దెగఁదీసి రామునిపయిన్ • పీడంగ దుర్వార ని
స్వన హాలాహల భీకర జ్వలిత జి • హ్వా దంష్ట్రికోగ్ర స్ఫుటల్
పౌనరన్ వెల్వడె సర్పజాలము నభో • భూభాగముల్ గప్పుచున్,

ఉ॥ శేషునికంటె దొడ్డవియుఁ • జేఁదఱ గొన్నవి లోకజాలమున్
శేషములేక మ్రింగునవి • చిల్కు ముఖంబులఁ గ్రక్కుచున్ మహా
భీషణ లీలఁ బర్వ నరి • వీర భయంకరమూర్తి దానవ
ద్వేషి ఖగేంద్ర సాయకము • దీఁడుచు నేసె ఫణుల్ నశింపఁగన్.

ఉ॥ రావణు నస్త్రమాయ బవ • రంబునఁ బర్వెన యంతమాత్రకుం
జేవఁ దనర్చు పక్షములు • చిన్నిదవుం బలువన్నె మేనులుఁ

లావగు చంచువుల్ నఖ బ • లంబును శోభిలుచుండు వైనతే
యావలి నిండిపోయె నెట • నారయఁ దార్క్ష్యమయంబుగా నటన్

ఆ॥ లెక్కలేని గరుడి • పక్కులు నోట ని, ప్పులు వెలుంగఁ బరవ • మొనసి సురలు
పక్షులగుచు నోట • వహ్నులఁ గొని లంకఁ, గాల్ప వచ్చినట్టి కరణి దోఁచె.

తే॥ ఫణి ఫణావళుల్ నిప్పుల • పగిది వెలుఁగఁ, గమల నాళంబులను నోటఁ • గవ్వికొన్న
కరణి నాగకులంబులఁ • గాళ్ళఁ బట్టి, చంచు ఖర నఖరముల దా • రించి వైచె

ఆ॥ అట్టి తఱిని వినత • తట్టి ఱెక్కలగాలి, వలన భవుని మేన • నలరుచున్న
మండనంబులెల్ల • మఱి మఱి చలియించెఁ, దక్క వానిఁ గూర్చి • తడవనేల ?

ఆ॥ గండఁడైన రావ • ణుండు మనంబున, ఁ ంది యూర్పువుచ్చి • ఖండనమునఁ
జండ విశిఖ తతుల • దండిగాఁ గురిసి కో, దండి కూవిరాద • కుండఁ జేసె.

ఆ॥ రామ మార్గణములు • రావణు శరముల, రాల్చి మీఱి యేగి. రాక్షసేంద్రు
పుష్ట వక్షమందు • పుంఖముల్ గనఁబడఁ, జొచ్చి పొడిచి యానె • శోణితంబు.

చ॥ ఇరువురు హెచ్చుతక్కువ లొ • కింతయుఁ గన్పడనీక ఘోర సం
గర మొనరించుచుండ శితి • కంఠ శిలోచ్చయ మెత్తినట్టి క
ర్బురపతి నేర్చియున్న రణ • పుష్కల విద్యలు తోఁపవయ్యె భూ
వరునకు నంతకంతకును • వర్ధిలె లాఘవ సత్త్వ సంపదల్.

## రాముఁడు రావణుని తలఁ దెగనేయుట

తే॥ నిర్జరవిరోధి బలము క్షీ • ణించు నదను, గాంచియొక యర్ధచంద్రాశు • గంబుచేత
రావణునియొక్క తలద్రెంచె • రామవిభుఁడు, బాపపంక్తి నొక్కటిఁగూల్చు • పగిదిదోఁప.

తే॥ వాయు శేషుల పందెంపు • బవరమందు, శ్వసనుచే మేరు శిఖరంబు • జలధిఁగూలు
చందమున రావణుశిరంబు • శరధిఁగూలె, రామచంద్రుని నమోఘ శ , రంబుచేత.

తే॥ అమరసంఘంబులు త్రికూట • మడఁగునట్లు, దుమికిగంతులు వైచుచుఁ • దొ్రక్కులాడి
పాడి వినుతించి తలపాగ • లూడఁదీసి, విసరి యొకరిపై నొక్కరు • వేసికొనిరి.

తే॥ ప్రాణి చచ్చియుఁ దనకర్మ • బలముచేత, మరలఁ బుట్టిన చందాన , మడుపునోటి
తోడఁ దల యుదయించె న • ద్భుతము గాఁగఁ దపముచేఁ గాక యట్టిది • తనరు టరిది.

క॥ తెగినవి తెగలేదని వగ, వఁగఁ దగి తు్రటిలోన మొలచి • పార్థివ తిలకున్
దెగనాడుచు బగ మాఁడుచు, వగఁ జూచుచుఁ బదరె వదరెఁ • బండ్లం గొఱికెన్.

క॥ విషముం గ్రక్కుచుఁ జెచ్చెర, విషధిం బడి శిర్షమపుడు • విషధర శయనుం
దిషణమున నెత్తు మేదిని, మిషలేచి తదీయ విషము • మేకొని త్రావెన్.

క॥ అశని వశమగు పసం గొని, దశముఖముల హుంకరించి • దశముఖుఁడు వెసన్
దశరథ సూనునిపై దశ, విశిఖమ్ములు చొరఁగఁ గ్రోధ • వివశత నేసెన్.

ఆ॥ అక్షరముల కాద్య • మైన యకారంబ. యైన రామవిభుఁడు • వీని శిరము
తెగిన మొలచు ననుచు • వగచి కరంబును, త్రుంచివైచె నధిక • దోర్బలమున.

తే॥ బాణమునఁదునిఁగినచేయి • పట్టియున్న, యాయుధముల వేఱొకచేయి • యందుకొన్న
వగిది మొలచిన హస్తంబు • పట్టుకొనియెఁ, దెగుట మొలచుట కాంచిన • ధీరులెవరు ?

క॥ మాతలి బలమును కుఱించం, జేతమునఁ దలంచి యమర • జేత తెగిన యా
చేతిని మొలచిన చేఁగొని, భీతిని ఖేచరులు పఱవ • బిట్టుగ విసరెన్

ఆ॥ పంక్తివదను తెగిన • బలితంపు బాహువు, బాధముగ నురంబు • వగులఁ దాఁక
నొచ్చి శోణితంబు • నోరఁ గ్రక్కుచు రాము, తేరి చోదకుండు • తెరలి సోలె

క॥ సొలసిన మాతలి యసువులఁ, దొలఁగింపఁ దలంచి యసుర • తోమరమును దా
పలికేలఁ ద్రిప్పి వైవఁగ, జలజాక్షుఁడు నడుమ దానిఁ • జదియఁగ నఱకెన్.

క॥ వెండియుఁ గరలాఘవ శర, చండతఁ జూపంగఁ దలఁచి • చండాంశు కులీ
నుం డొక్కొక్క శిరంబును, ఖండించెను నూఱుమార్లు • ఖండిత లీలన్.

క॥ శిరములు దిశాంతరంబుల, శరధుల ధరయందు గిరుల • సానువులందున్
దొరలి దొరలి పిడుగుల క్రియ, గురు రవమునఁ బడియె లక్ష, కోట్లుగఁదోఁత్రో.

క॥ గోత్రంబుల వ్రీల్చెను న, క్షత్రంబుల మోఁదెఁ గదలి • జలచరములకున్
జిత్రమగు చావు గలుగ, శ, రత్రుటిత శిరంబు లా శ, రంబులఁద్రావెన్

తే॥ ధరణిఁ బుణ్య ఫలానుభూ • తంబులైన, పిదప నౌత్కృష్ట్య మెల్లను • విరిదులుగాదె ?
శవములం దినఁ దిరుగు పి • శాచసమితి, తనయెదురఁ దనకన్నులఁ • ద్రవ్వి తినియె.

క॥ ఇరువది కరములఁ బట్టిన, పరశు ముసల ఖడ్గ కుంత • పట్టిన ఘన తో
మర దండాదుల రావణుఁ, డురవడిమై నేసె రాఘ • వోర్వీశు పయిన్.

క॥ పురుషోత్తముఁడగు రాముఁ డ, సురవర్యు దురాన గెలువ • జొప్పడు వెరవే
కరణి యని యరసి వానిన్, శరరాజి నలంకరింపఁ • జను నను బుద్ధిన్.

క॥ ఱొమ్మున భుజములపై నే, త్రమ్ముల జిహ్వలను తగ నె • అంకులలో ద
ట్టమ్ముగ నమ్ముల గ్రుచ్చి శ, రమ్ముల నిలయ మనఁజేసె • రావణు మేనిన్.

క॥ వదనములఁ గనుల భుజముల, నెదనాఁటిన శరము లచట • నిష్టంబుగఁ బె
ల్లిదమగు రక్తము ద్రావక, పదరి యవల దూసి నెఱసె, బ్రహ్మాండమునన్.

తే॥ రోమ తుపంబులందు • • రోధులందు, జీవములఁ గ్రుంగదీసి దూ • సిన శరాశి
వలనఁ జలమును పగయును • వట్రపడఁగ, విహ్వలించెను మిక్కిలి • విబుధవైరి.

## రావణుఁడు మూర్ఛిల్లుట

తే॥ అమరనగరి నూరేగిన • యసురవిభుఁడు, వనధిలోనుండి యెదురీఁది • వచ్చినట్టి
మత్స్యములు రక్తమును గ్రోల • మ్రానుపడుచుఁ, దేరిపై సోలిపడియెను • తెలివిదప్పి.

తే॥ దుష్టకర్మము భువినుండి • దోరెననుచుఁ, బొంగి గంతిరి కపులు వే • ల్పులును మిగులఁ
బ్రభుఁడు మూర్ఛిల్లె ననుచు సా • రథి రథంబు, నవ్వలికిఁ గొనిపోయె ర • థ్యములఁద్రిప్పి

తే॥ స్వర్గవాసుల నొప్పించు • పద్ధతులను. నిశ్చయించి చేసెడు రజ • నీచరాలిఁ
గూల్ప దీక్ష వహించు కా • కుత్థ్స విభుఁడు, తెలివి దప్పిన రావణుఁ • ద్రెంపఁడయ్యె.

తే॥ అరిదియగు తపోబలమున్న • యసురవిభుని, తెలివివచ్చిన పిమ్మటఁ • ద్రెంప వలను
గాదు గావున నిప్పుడే • కనిమసంగు, మనుచు మాతలి వేఁడెఁ బ్ర • ననఘుఁడనియె.

తే॥ ఆయుధంబులు చేజాఱ • నలసి సొలసి, యున్న శత్రుని రణధర్మ • ముజ్జగించి
చిక్కెనని చంపరా దది • శిష్టపథము, గాదు నాయెడఁదకు నిచ్చ • కంబుఁ గాదు.

తే॥ అనిన యతని సత్పద్ధతి • కాత్మ నలరి, మెచ్చి పొగడెను మాతలి • మెచ్చకుండు
విబుధు లెవ్వరు? పదపడి • వేల్పు లడల, సొమ్మ దేఱి లేచెను దశా • స్యుండు కడిమి.

క॥ అలుక తొలఁకు చూపులతో, సొలపు దెలిసి లేచి రాక్ష • సుండు సకల ది
క్కులఁజూచి రాముఁ డెచటం, దెలియమి సారథిని చండ • దృష్టిం జూచెన్.

శా॥ ఓరీ! వంచక? నీకు రక్షకుఁడనై • యుత్కృష్టుఁగాఁ జేసి నీ
గారామారఁగఁ జూచుచుండ నను లో • కంబెల్ల భీతాత్ముగా
దూఱంజేసితి వాలి గొంచు మన శ • త్రుల్ నవ్వ దుష్క్రియం
గూరంజేసితి నిన్ను ద్రుంతునని య • ల్గుం దూయ నుంకింపఁగన్.

ఉ॥ సారథి దైత్యనాథు పద • సన్నిధి వ్రాలి నమస్కరించి లం
కా రమణా! మదీయ పథ • కంబిది చెడ్డది గాదు దొడ్డగా
నారసి నీ యమర్ష హృద • యంబున శాంతి వహింతు గాక నా
సారథి ధర్మముం దెలిసి • నల్ప్రీతి దీన దొసంగు గల్గ ,?

ఉ॥ విక్రమ కార్యముల్ నెఱపి • వీఁగితి సోలితి వందె నిల్పుచో
నక్రమ మొందు నా తగవు • ప్రాణములుండవు నీకు నిక్కమీ
నక్రమపద్ధతుల్ జగతి • సారథిజాతికి నిత్య ధర్మముల్
ప్రక్రమ భంగమేల యొక • పాటి జయింపుము శత్రు నాజిలో.

ఉ॥ స్వామి నసత్త్వుఁడో విగత • సత్త్వుఁడొ యారయుచుండి దొడ్డ కా
రామి ఘటించుచోఁ బ్రభుని • ప్రాణ చయంబున కొక్కసేగి రా
రామి దలంచి కంచరముఁ • గ్రించరఁ గొంచుఁ దొలంగిపోక పో
రామియె? నాదు దోసమన రాదు మదిం బరికించి చూడుమా?

ఆ॥ అనుచుఁ బలుక దాన • వాధ్యుండు కరుణించి, తేరుద్రిప్పు మనఁగ • సారథియును
రామునెదుట నిల్పె • రావణుఁ డంతట, రణముసేయసాగి • రాముమీఁద.

ఉ॥ వందలు వేలుగా విశిఖ • వర్షము గూర్పఁగఁ జూచి జిచ్చమై
నందఱు వీఁడు క్రొత్త దను • జాధిపుఁడే యని విచ్చలింప మే

ల్చండము లాఘవంబు గురు • సత్త్వము సాహసమున్ వెలార్చి సం
క్రందన సన్నుతుండు రఘు • రాముఁడు నొవ్వ దురంబు సేయుడున్.

చ॥ అనలము రాఁజుచుండఁ బొగ నార్చుట శక్యము గానికైవడిన్
ధనువు కరంబునం దనర • దానవనాథుని గెల్వ దుష్టిటం
బని తలపోసి భాస్కర కు • లాఢ్యుడు రాముఁడు ఘోరసాయకం
బున దనుజేంద్రు విల్లు వరి • భుగ్నముగా నొనరించె గ్రక్కునన్.

చ॥ సలుపయొనంగు కార్ముకము • నాశముగా దశకంఠుఁ డుగ్రుఁడై
బలువిడి విండు లొక్కొకటి • పట్టుచునుండఁ గ ద్రుంగుచుండఁగా
నలిగి జయేందిరా రమణి • యవ్వలికేగ ముసుండి ముద్గరం
బులు గద తోమరాదులను • భూరి బలంబున వైచె నొక్కటన్.

శా॥ వానిం ద్రుంచి నభోంతరంబుననె దు • ర్వార స్ఫురద్వాహు న
త్ర్యానూనుండగు వీ దలంతుల జనం • దగ్గంబు గా దంచు వి
జ్ఞానశ్రోత్రుల కంటిపాపలను • న్నాణంబుగాం దూటి తా
నానారీతులఁ జిత్తమందు సురజి • న్నాశంబు చర్చించుచున్.

## రాముఁడు బ్రహ్మాస్త్రముచే రావణుం గూల్చుట

మ॥ తుది బ్రహ్మాస్త్రముచేత వీని యసువుల్ • ద్రుంగింతుఁ గాకంచు దా
మదిఁ దీర్మానము చేసి రాఘవుఁడు స • మ్మానించి తన్మంత్రమున్
బ్రదరంబుం దరు భంజకంబు కవిరా • డ్వక్షో మహీధ్ర చ్ఛిదా
భిదురంబుం గొని బిట్టుగాఁ దిగిచి యు • ద్భీమంబుగా నేసినన్.

క॥ ఎరవలియును కరువలియును, దరి యరయఁగరాని శరము • ధాత్రు సబీజా
క్షరమై నలు మొగములతోఁ, బఱచె దరుల బెరయు నిరులు • పఱవవెలుఁగుచున్.

సీ॥ విలయ కాలంబున • విలసిల్లు భానుండు, మిడుగుఱుఁ బురుపను • వడువు దోఁప
ధరణియు దిశలు నం • బరమును జగములు • దిట దప్పి దిర్దిరఁ • దిరుగుచుండ
సర్వ లోకేశ్వరు • చక్రంబుతోఁ జేరిఁ నలువ • యస్త్రమధిక • బలమునొంది
మూఁడు కోట్లాయువు • మొనసి చేయు తపంబు. పనజాసనుం డిచ్చు • వరచయంబు

తే॥ దిశల గెలిచిన తద్భుజో • దీర్ణ బలము, శిథిల మొందంగ వక్షంబుఁ • జించి చొచ్చి
ప్రాణవాయువులం గ్రోలి • పరఁగ నవల, డుండుకుని పెను వీ • పున • డుస్సి పోయె.

ఉ॥ ఆహవమందు దానవుఁ ద • హంకృతి దూలఁగఁ గూలఁ గాంచి కో
లాహలముం బొనర్చి చద • లం గల వేల్పులు చల్లు పూలతో
భూహితమున్ వచించి యటఁ • బోయి పయో జలరాశిఁ దేలి వై
దేహి హృదీశు దూణమునఁ • దేఁకువఁ జొచ్చెఁ దదంబకం బొగిన్.

శా॥ శ్రీరామాస్త్ర విభిన్న వక్షుఁడయి య • క్షీణ ప్రతాపుండు ర
క్షోరాజన్యుఁడు శీర్ణ భూషణ తతుల్ • క్షోణిం బ్రకీర్ణంబుగాఁ
గ్రూరోగ్రాక్షుల మిడ్గుఱుల్ చెదరఁ బి • డ్గుం బోలు ఘోషంబుతోఁ
దేరం జాఱి యధోముఖుండగుచు ధా • త్రిం గూలె దుష్కర్మచే

ఉ॥ కోప మడంగ మానసము • క్రుంగఁగ మాయ తొలంగ కామభృ
త్తాపము మ్రింగ సత్త్వ సము • దగ్రత చెంగ యశం బొదుంగ నా
లాపిత దుర్వచస్సులు క • లంగ దశాస్య ముఖంబు లత్తఱిఁ
దావసులం గలంచు బెడి • దంబునకంటె వెలింగె ముమ్మడిన్.

చ॥ అరదము ధాత్రికిం దిగుడు • నంబుద దేహుఁడు డిగ్గి క్రిన్నభు
గ్వరుని శరీరమున్ దనివి • పాఱఁగఁ గాంచఁ దలంచి డాసి కా
వరుని సుహృద్వరుం బలెనె • భావనసేయుచుఁ జూచె; లోక భీ
కరుఁడగు శత్రువైన మృతి గాంచిన పిమ్మట మిత్రుఁడే కదా!

రాముఁడు రావణుని వీఁపునందలి గాయములఁగాంచి శంకించుట

చ॥ మరలి దివంబు చేరుమని • మాతలి నంపి సుమిత్రినూతియున్
దరణిసుతుండు మారుతియుఁ • దక్కటి వీరులు చుట్టిరా వెసన్
బరులకు వీఁపు చూపని సు • పర్వవిరోధి గురు స్వరూపమున్
బొరిపొరిఁ జూడసాగె సుర • పుణ్య ఫలోదిత మూర్తి యింబుగన్.

ఆ॥ రామ సాయకమున • రణధాత్రిఁ గూలిన, రావణుని పది శి • రంబులపయిఁ
బృష్ఠభుజములందు • వీకున నాడిరి, కపులు గిరులమీఁద • గంతినట్లు

తే॥ వాని మొగులుఁ బోలిన పృష్ఠ • భాగమందు, ద్విరద రదన ఖండంబులు • విధుని లేఖ
లట్లు తొడవులై యొప్ప వ్రి • ణాంకములు క, లంకముం బోలి గాన్పించు • అలినిగాంచి

ఉ॥ జానకికై జనించిన రు • షా భరణంబు దురాత్ముఁడైన యా
దానవరూపుతోఁ దటిగి • తాఱఁగ రాముడు శత్రు పృష్ఠ భా
గాన స్ఫుటంబుగాఁ దెలియు • గాయము కాయను గాంచి నా మహా
నూన పరాక్రమంబు వెలుఁ • గొందదుగా! యనెఁ బిన్న నవ్వుతో.

చ॥ జగముల గెల్చి యేసరినఁ • జచ్చు కతంబున రావణుండు తాఁ
బగతుర మున్నెదిర్చి పొల • వంబుగఁ జేసిన పోర వీఁపునఁ
నగిలిన పుంటికాయలు వి • తావిత చేసెను మద్బలిష్ఠ దో
ర్యుగళ పరాక్రమంబు నని • రోధ కలంకముఁ గూర్చి చెల్లరే!

తే॥ కార్తవీర్యునిచే వీఁడు • కట్టువడిన, చరిత విని వీడితోడి మ • చ్చరము నాకు
నాదవేఁగా యని లజ్జించు • చుండ నిపుడు, వీని వీఁపు గాయంబులు • కానఁబడియె.

తే॥ మచ్చరుల గేలి యశమును మలిన పఱుప, వెన్ను పగఱకుఁ జూసిన • వీనివలన
గలుగు గెలుపు మెచ్చందగు • గెలుపుగాదు, దీనివలనఁగీర్తియురాదు • తెగడు దక్క.

తే॥ అనినవినివిభీషణుఁడుదుఃఖాశ్రుకణము, లొలుకఁబరిత ప్తహృదయుఁడై • పలికెనిట్లు
ప్రభువరా! యనమంజన • వాక్యములను, నీవ పలుకంగ నేమన • నేర్తునయ్య!

చ॥ భుజములు వేయిగల్గిన నృ • పుండును వాలియు నొందినట్టి యా
విజయము నిక్కమైనదియొ? వేల్పుల శాపముచేతఁ గల్గె నం
బుజదళనేత్ర! లోక పరి • పూత పయింగల కామబాధచే
గజిబిజి చెంది దీల్పడియెఁ • గాక యలంతులఁ బోవువాఁడొకో?

చ॥ కడిమి నిరస్త శాత్రవము • గా భువనంబు లొనర్చి పేర్చి యె
య్యెడ నెదురేది లేక చరి • యించుచు దిగ్గజ దంత సంఘముల్
తొడిఁబడి యూర్వఁ గ్రుచ్చికొని • తోఁచు కిణంబులుగాక శత్రు లె
క్కడ? యితనిం జయించి వెను • గాయముసేయుట యెద? భూవరా!

క॥ ఆయవ విక్షంబునకుం, జేయని తొడవులుగ యముని • చేతి మహా దం
డాయుధము హనుమ ముష్టియు, నియనువున వెలికిఁదోఁవ • నిటు గన్పడియెన్.

చ॥ చెలసిన కాలకూట మొగిఁ • జిచ్చుఱకంటిని మ్రింగినన్ మహా
బలయుత సర్పజాలములు • పక్షులరాయని గెల్చినన్ జగం
బులఁ గల వీరపర్యుల ప్రి • పుష్ట భుజాంతర సీమఁబేర్చి య
గ్గలికను నాటు కైదువులు • గాఁడఁగజాలవు వీని ఱొమ్మునన్.

మ॥ చతురంభోధి పరీత భూతలము దం • ష్ట్రిం గ్రుచ్చి క్రోడంబు స
మ్మతితో నిల్చిన మీఁద లోకములు హా • మందారిష్టులున్ దిగ్గిమ్మటల్
వెత లేనాఁటికిఁ దీఱునంచు మది నా • శ్వాసం బొందెఁ దేచేత నీ
గతి లంకేశుఁడు పొంద వీని మృతి నిం • కన్నమ్మకుండెం గదా!

మ॥ అన సౌఁగాకని రాఘవుండు మది న • త్యంతంబు విశ్వాసమున్
గొని నీయన్నకు సాంపరాయిక విధుల్ , గూడంగఁ జేయుంచి ర
మ్మనుమానంబును వీడుమా ధరణి వై • రాదుల్ మనుష్యుండు చే
తనుఁడై యుండెడు నంతదాఁకనె చుమీ • ధర్మజ్ఞ! చింతింపుమీ!

ఆ॥ అనుచు నతని నంపి • యడలు తీఱఁగ వచ్చి, మోదమంది తనకు • మ్రొక్కుచున్న
నిఖిల నిర్జరాది • నిచయంబుఁ గనువేడ్క, నెదురుగాఁగ నడచె • నినకులుండు.

## విభీషణుని చింత

ఆ॥ అన్న దొసఁగులెల్ల • మన్నింపఁదగినవి, పొమ్మనంగ నతఁడు • పోయి యగ్ర
జన్మఁగాంచి పట్టఁ • జాలని వెనుచింత, లోన మునిఁగిపడియె , వానిమీద.

ఆ॥ జగతి జీవులెల్ల • జాలినొందఁగ ఖేచ, రులును మౌనులును క • రుణ వహింప
రాలుఁ గరఁగ నేడ్చి • రావణు పైఁబడి, పలువరించె నిట్లు • బహు విధముల.

సీ॥ హా లోకభీకర ! హా మేరునిభ ధీర ! అద్వంద్వ శూర ! మా • యా ప్రకార !
ఉండుచోఁ ద్రిదశ కు • లోన్మూలి వైతివి, చచ్చుచో నసుర వం • శముఁ జెఱిచితి
మ్రింగిన గరళంబు • మేకొని చెఱచు జా, నకి యను విసము కా • నఁగనె చంపు
వలదని యానాఁడె • పలుకంగ వినవైతి, వీఁక నేఁటికి వినంగ • నిచ్చగింతె •

తే॥ పర కళత్రంబుఁగొంట య • భావ్యమంటిఁ, దొలఁగరాని యపఖ్యాతి • దొరయునంటిఁ
గొరవలదంటి వైరంబు • కూడదంటి, వంశము నశించునంటి నా • పలుకువింటె ?

శా॥ నాఁడగ్నిం బడినట్టి వేదవతి యా • నాఁ డుర్వరా జాతయై
యీడంబోవక దైత్యనాశమునకై • యిచ్చోటికిం జేరె నీ
జాడ ల్వలదని యెంతచెప్పినను రో • షస్ఫూర్తి మన్నింప కి
ల్లేడాగోడము చేసికొంటి కుల శౌ • ర్యేచ్ఛా విభూత్యున్నతుల్

ఉ॥ కారుణికుండు రాముఁడని • కామిని నిమ్మని సంధిమేలనం
గా రహి వీడకుంటి వర • గౌరవముల్ పది శీర్షముల్ వృథా
ధారుణిఁ బొర్లుచున్నయవి • తప్పక నాపలుకిప్పుడైన సీ
తా రమణుం డనాది పర • తత్త్వము చుమ్మని నమ్మికే దివిన్.

శా॥ వీరస్వర్గము చేరితో ? నలువ మే • ల్పీటం బ్రవేశించితో ?
తారాద్రిం దగఁ జొచ్చితో ? యెవఁడు నిన్ • దాకొంచు నీజీవ సం
చారంబుం గొనిపోయె ? కాలుఁడొ ? లస • చ్చంద్రాంశువుల్ నేఁడు చ
ల్లారం గలెనె ? మారనాటకము నేఁ డైనం దుదిం బొందెనే ?

చ॥ మగనిని చంపుచేఁత తన • మానసమందిడి చుప్పనాక యా
పగ గొనితెచ్చి యిచ్చి తన • పంతము నెగ్గఁగఁ జేసికొన్న దీ
పగిదిగ నారకానఁ గలఁ • పాపులు స్వస్సుఖమొందు పుణ్యులున్
బగఱుగ నైరి యెల్లిదపుఁ • బాటున నేచి మొగంబు గాంతువో ?

మహాస్రగ్ధర.
విజయశ్రీ పంకజాక్షిన్ • విమలగుణయుతన్ • విశ్వ సాహిత్య లక్ష్మిన్
భుజమేధా శక్తి యుక్తిన్ • భువన విజయ వి • స్ఫూర్తి నాసించు చేతుల్
త్రిజగన్మాతన్ బ్రహూతన్ • త్రిదశగణనుతన్ • బృథ్వి సంజాత సీతన్
బొజుఁగై స్పర్శించు నిచ్చన్ • ధువినె తడవఁగాఁ • బూర్ణ సంసిద్ధి గంటే!

తే॥ అనుచుఁ బనవు విభీషణు • నవలికీడ్చి, విధి నెఱింగియు మతినెడ • వెగపనేల ?
లెమ్ము కాఁగల పనుల నా • లింపు మనుచు, భల్లుకేశుండు లేపి సాం • త్వనముపలికె.

## మండోదరి విలాపము

మ॥ విరియం బాఱిన కేశపాశములతో • వ్రేలాడు హారాలితో
సురుఁగం బాఱిన మూర్ఛ చిత్తములతో • బొబ్బిల్లు కన్నీటితోఁ
గరముల్ మొత్తున మోఁదికొంచు వడి లం • కానాథు కాంతల్ పరా
మరిసల్ లేని విధంబునన్ జరగిరా • మందోదరీ యుక్తలై.

తే॥ పొలుచు సత్యంబు ధర్మంబు • భూతదయయుఁ, గలుగుకులమునఁ బుట్టిన • ఘనుఁడుసిగ్గు
వదలి చేయు కార్యమువలె • వాయి విడిచి, యేడ్చు కాంతల రవ మెల్ల • యెదలఁ బరవె.

తే॥ కాలియందెలు మొఱపెట్ట • గజ్జెలేద్వఁ, గొంద తేగుదెంచిరి రణ • క్షోణి కపుడు
కొందఱు పురందరుని పగఁ • గూలె ననుచు, నచటనే జీవముల వీడి • రవని దొరలి

తే॥ ఘోర శోకంబు గందర • గోళపఱుప, నందముం జెడఁ దొడవులు • చిందుచుండఁ
గనుల నశ్రుజాలము మబ్బు • కరణిఁ గురియ, వనరి విను త్రోవఁ గొందఱు • వచ్చినారు.

తే॥ తలలు మోఁదుకొనెడువారు • తడవువారు, కనుల నీరూర నా దశ • కంఠు బాహు
పీఠముల మీఁదఁబడి నూత్న • విగత భర్తృ. శోకమున నేమి యెఱుఁగక • స్రుక్కినారు.

తే॥ పదములను మొత్తు భుజములు • వదనములును, తొడిఁబడఁగఁ బలుమాఱులు • తడవి తడవి
యేడ్చి యేడిచి నాలుక • లెండఁబాఱ, తెలివి దప్పి ధారణిపయిఁ • దెరలినారు

ఉ॥ పొందరు మున్ను దుఃఖములఁ • బొందిన నెప్పుడొ పొల్లయల్కయే
పొందుదు రద్దియుం దుపిని • పూర్ణ సుఖప్రద మంచు నెమ్మదిం
గొందురు దైత్యకాంత లిటు • గూరిన యార్తి భరింపలేక యా
దెందమ్ముపైని వ్రాలి తట • డిందిన ప్రాణము రోయుకై పడిన్.

తే॥ జక్కినులు రక్కసులు నాగ • చంద్రముఖులు, సిద్ధసఖులు విద్యాధర • స్త్రీలు బేధ
మోహముంచుటచే శోక • మున మునింగి, తడవి తనివి సనక చాలఁ • దల్లడిలిరి.

తే॥ ధర్మము సశింప నెదఁజేర్చు • ధరణిజాత, మీఁది మరులున మమ్ముఁ బ్రే • మింపవైతి
దానిచేఁగాదె యాగతి • తనకెనీకు ; దాని వదలి మమ్మెప్పుడైనఁ • దనుపరాదె ;

తే॥ అనుచు తోల మందోదరి • యలమటించి, కడలిపై మించు వ్రాలిన • కరణి విభుని
వక్షమున వ్రాలి శిలలును • వృక్షములను, కరఁగి తోడన పలవింపఁ • గనికరించె.

చ॥ అసుర మృగేంద్ర ! నీవుస్మృతి • నందిన పిమ్మట నేను నందుటల్
దొసఁ గతి దుర్భరం బగుత • దుర్భర మక్కట ! నాదు సన్నిధిన్
బొసఁగిన యివ్వి నీమకుట • భూషిత శీర్షములే ? కదించి నా
వ్యసనము మాన్పవో ? వదన • పద్మ వికాసము చూపవో యిఁకన్ ;

చ॥ ఎలరిచి వెండికొండ భరి • యించిన నీ పెనుమేని శోభలన్
వెలుపల నూపుగింజ యెడ • వీడక తొల్చి యసుప్రజంబు ని
ట్టలముగ రోయుతీరొ ? సద • టంబున జానకిమీఁది ప్రేమ లో
పలఁ గలదంచు నారసిన • పద్ధతియో ? యిది రామబాణముల్ ?

చ॥ అలయక రాము తూపులు గు • హాముఖముంబలె తొమ్మఁదొల్చి య
వ్వలఁ జనియున్న వక్కట ! త • పంబును దార్ఢ్యము వీర్యముం జెడన్
బొలిసితివే ? యిఁకేది గతి ? ఘో • రితరోగ్ర శరంబొకండు ని
మ్మళముగఁ గ్రోలె జీవముల • మానుషశక్తియు నింత యొప్పునే ?

మ॥ వనితాజాతికి భూషణంబయిన యా • వైదేహి యందంబు త
ద్ఘన పత్నీత్వము దైత్య నాసికయు లం • కారాజు కామంబు రా
ముని కాంతార నివాస నిర్ణయ విధం • బుం గూడి జంభారి చే
సిన పుణ్యంబుగఁ బూర్తియై పరిణమిం • చె న్నాకు నే డీగతిన్.

చ॥ అమరుల దిగ్గజంబుల ను • మాపతి ధాత్ర ముకుంద జిష్ణులన్
సమరమునందు మించిన య • సాధ్య బలాఢ్యున కెచ్చటన్ వినా
శము కలదే యటంచు నెల • సంబున నుండితి నీ మహాతపః
క్రమ ఫల జీవితంబునకు • రాముఁడు పుట్టెఁ గృతాంతుఁడై భువిన్.

చ॥ కొమరుగ నొంచు మూఁడు నలు • కోటికి మేర వచింపరాని స
త్త్వమునకు జీవితానకుఁ ద్ర • పఃఫలరాశికి నింక నాశ మే
క్రమమున వచ్చునంచు మది • గాఢ తరంబుగ నమ్మియుంటి సీ
తమ యను ఘోర హాలహల • మక్కట యన్నిటి మ్రింగె వ్రేల్మిడిన్ !

చ॥ జగము స్వభావ మిట్టిదని • సత్య మెఱుంగు సమరు లెవ్వ రీ
జగముల నెల్ల గెల్చిన ప్ర • శస్త బలిష్ఠుల నిల్చిరేమి ? యిం
చగు విలు గేటి నారి పువు • టమ్ములఁ గల్గిన శంబరారికే
యగడుపడంగఁ జిక్కిన బ • లాఢ్యుని నాశము చేయరే నరుల్ ?

తే॥ రాము నెంచితి నాడి నా • రాయణునిగఁ, దెలియ కిట్టు లుత్తముని ప • త్నినిచెఱఁగొని
వచ్చితివి తత్ఫలం బను • భావ్యమయ్యెఁ, నిప్పుడైన నియ్యది నీకు • నెఱుఁగరాదొ ?

మ॥ అని చింతాకులితాత్మయై పనవి య • త్యంతంబు దుఃఖాప్తి వే
దన నిండారఁగ శీర్ణ హారమగు త • ద్వక్షంబు హస్తంబుతోఁ
దనియం జేరిచి తృప్తిమై నతని నా • ఢా ! యంచుఁ బేర్వాడి యం
తన నిశ్వాసము నిల్పి జీవములు నం • తర్లీనమై పోవఁగన్.

తే॥ అమరకాంతలు విద్యాధ • రాంగనలును, మునిసతులు నాగ తరుణులు • మనుజ సఖులు
పెక్కుగతుల మందోదరి • పెద్దతనము, వేయి నోళ్ల శ్లాఘించిరి • వ్వేళయందు.

సీ॥ అంత విభీషణుఁ • డంతరంగంబునఁ, జింతించి క్రమరీతిఁ • జిచ్చుకొలిపి
సంస్కారముల నెల్ల • శాస్త్రోక్తముగఁ జల్పి, శవముల నుంచెఁ గా • ష్ఠములమీఁద
వాద్య స్వనము లెల్ల • వారి రవంబుల, వినవీక మిక్కిలి • విస్తరించె
నిడమును లెల్లని • గొడుగును తోడరా, నతని పత్నులును వె • న్నంటి నడవఁ
తే॥ జుట్టిపచ్చి యిర్వురకుఁ జి • చ్చును రగిల్చి, చేయఁదగు క్రియలెల్లను • చేసి యవలఁ
దక్కువారికిఁ గూడ నా • తండె యుక్త, కర్మము లొనర్చె బడి నుద • కంబుతోడ.
ఆ॥ అవల వచ్చి రాము • నంఘ్రి పద్మములకు, మ్రొక్క నతఁడు నతని • మోముఁగు గాంచి
లోక సహజ మిద్ది • నీకు సుమ్మలిక మి. ట్లొందు టుబవె యనుచు • నూఱడించె.

## 37 శ్రీరామ నివర్తన పటలము 358

తే॥ బహువిధ శాస్త్ర మర్మంబులఁ • బ్రకృతినైజ, ధర్మముల నెఱిఁగించి యా • దైత్యరాజు
నూఱడించి లక్ష్మణుఁ గని • యొప్పమీఱ, నిట్టులనియె రాముఁడు ప్రేమ • మెసకమెసఁగ.
ఆ॥ అర్కసుతుఁడు మారు • తాత్మజుఁడును తక్క, కపివరులును వెంటఁ • గదల నేగి
నీతియుతుఁడు యామి • నీచర విభునకుఁ, బట్టమొనర నీవు • కట్టుమయ్య.
క॥ అని యాజ్ఞచేసి పంపఁగ, ననిమిషులు దిగీశు లప్పు • డగునంతకుఁ బ్రే
మను శక్తి కొలఁదిఁ దోడ్పడి, పనులొనరించిరి విశేష • పరతంత్రులుగన్.
ఆ॥ పుణ్య తీర్థములను • మొగులు జలంబుల, జలధి జలము హార • సమితి సింహ
పీఠి బౌఁడిసమ్ము • ప్రీతితో వేల్పులు, తెచ్చి కొఱఁతలేక • యిచ్చినారు.
ఆ॥ అటుని యాజ్ఞవలన • హరిణముఖుఁడు మ, యుండు వచ్చి హరిహ • యుఁడు భవుండు
పొగడఁదగిన పగిదిఁ • బూజ్య విధంబుల, మంటపంబు గూర్చె • మండనముల.
తే॥ విధియుతంబుగా బ్రహ్మాది • విబుధవరులు, పుణ్యతీర్థాభిషేకంబు • పొసఁగఁ జేయ
నన్న యాజ్ఞానుసారి రా • మానుజుండు, ప్రీతిమకుటంబు పెట్టె వి • భీషణునకు.

ఉ॥ నీలగిరీంద్ర శృంగమున • నీరజ మిత్రుఁడు తోఁచు చందమై
నీలమణీ విభాసిత సి • నిర్మల పీఠి విభీషణుండు మో
దాలసుఁడై కిరీటయుతుఁ • డై తగు బంధువులైన పూర్వ దే
వాలి భజింప వాసవుని • యందమునన్ వెలుఁగొందె నత్తఱిన్.

తే॥ సురలు కల్పక సుమములఁ • గురిసినారు, తావి పూవుల సిద్ధ సా • ధ్యావలులును
చిందఁజేయఁ ద్రిమూర్తులు • శిష్టమౌని, జనము లాశీస్సుమంబులఁ • జల్లినారు.
తే॥ నవ్యమకుట భూషణుఁడు దా • నవవిభుండు, భక్తితోడను సౌమిత్రి • పాదసరసి
జాతయుగకుఁ బ్రణామంబు • సరవిఁజేసి, పలికె విశదఫణితి నెల్ల • వారు వినఁగ.
తే॥ ఏను శ్రీరాము సన్నిధి • కేగి మరలి, వచ్చునంతాఁక నీలంకఁ • బ్రాభవమునఁ
గొఱఁతలేక పాలింపంగఁ • గోరినాఁడ, ననుచుఁ బ్రార్థించి యొప్పించి • యచటి కరిగె.

తే॥ కపికులేంద్రుని తోడ సం • గదుని తోడ, వచ్చి పదముల కెఱఁగిన • వాలి దైత్య
విభుని రామచంద్రుండు సం • ప్రీతి తోడ, నలమి మృదు భాషణంబుల • నల్లనవియె.

చ॥ పవిగొని మూఁడు లోకముల • వారు నుతింపఁగ దేవతాలికిన్
జనులకు నీతిపద్ధతికిఁ • జక్కటికిం దగురీతి నిల్చి శ్రీ
యును సుకృతంబు కీర్తియు స • మున్నతి నొందఁగ రాజ్యభారమున్
గొని సుఖమందుమా యనుచుఁ • గొన్ని హితోక్తులు పల్కి పిమ్మటన్.

## హనుమంతుఁడు సీతకు రామ విజయము తెల్పుట

చ॥ హనుమనిఁ గాంచి నీవు జన • కాత్మజ యున్న వనంబు చేరి యిం
దొనరిన యెల్ల సంగతుల • నొప్పుగఁ దెల్పుమ యన్న నాతఁడున్
చనిచని వాయువేగమునఁ బావని జానకి యున్న చోటికిన్
జని వసి వాడియున్న విర • జాజికి వర్షమువోలెఁ గన్పడెన్.

చ॥ కనఁబడి మ్రొక్కి భానుకుల • కాంతుని నామము నుచ్చరించుచున్
దనియక గంతులేయుచును • తాళము వైచుచుఁ బాటపాడుచున్
జనకజ తన్ను గాంచియె ని • జంబు గనుంగొనఁ బెక్కురీతులన్
గునియుచు నెట్టకేని సుమ • కోమలి పాదము డాసి యిట్లనున్.

చ॥ శుభము శుభమ్ము మంగళము • శోభన దేవతకున్ జయమ్ము మే
ల్శుభములు తల్లికిన్ దనుజ • సూదనజాయకు భద్రముల్ సుర
ప్రభృతులు సంతసింప రఘు • రామ మదేభము యామినీచర
వ్యభిజన సారసాకరము • నంకిలి వీడి కలంచెఁ దల్లిరో!

ఉ॥ రావణ మత్త నాగమును • రామ మృగేంద్రము చించిచెండె ర
క్షోవిభు మస్తకంబులు • వ • సుంధర దొర్లెను వాని బాహువుల్
ప్రేవులు నక్కలీడ్చెను శ • రీరముమీఁద నెఱంగె గ్రద్దలున్
గావరు కన్నులం బొడిచి • కాకులు దిన్నవి సంగరస్థలిన్.

క॥ తోషమతి రామునాజ్ఞ వి, భీషణు నియమమున లంక • వీథుల నుర వి
ద్వేషుల కాంతలు దక్కఁగఁ, భాషింపఁగ నొక్క యసుర • బ్రతుకం దయ్యెన్.

క॥ అమృతము ముంచిన యావా, క్యములన్ విని యొక్క కళను • గల దేక క్రమ
క్రమమున వర్ధిలి యంకము, సమసిన విధుఁబోలి జనక • జాత వెలింగెన్

ఆ॥ రాహు గళితమైన • రాజ బింబమువలె, ధరణిజాత ముఖము తనరఁ గాలఁ
గేలు తొమ్మ మనము • లీలఁ బూరించెను, మేరలేక ముదము • మీఱుకతన.

ఆ॥ కార్శ్య మొందియున్న • కాంతయంగములెల్లఁ, బెద్దవగుచు మిగులఁ • బెరుఁగఁ దొచ్చె
వాడియున్న వల్లి • వర్షంబుచేత నా, నా ముఖముల వెలసి ననుచు భంగి.

చ॥ భ్రుకుటియు వంగెఁ జెల్వముగ • బొమ్మ చెమర్చెఁ దలం పొకండుగా
నొకటి వచించునట్టిదిగ • నొప్పె సముత్కముచేతఁ బక్వమై
రసమగు ప్రేమ కల్గువలె • భ్రాంతిని గొల్చిన ? యేమివింత ? జా
నకి కెది పల్కఁ దోఁచక మ • నంబున నూరక యుండె నివ్వెఱన్.

ఉ॥ ప్రీతియుతుండు సద్గుణి మ • నీషి మరుత్సుతుఁ డద్దిఁ గాంచి త
ల్లీ! తరమెంచరాని యెన • లేని కుతూహల మొంది యుత్తరం
బీతని కేమి యిత్తునని • యెంచఁగ లేకిటు లూరకుంటివో ?
కోఁతి యసత్యమాడె నను • కొంటివొ ? యన్న వచించు నామెయుఁగా.

ఉ॥ అనదృశమైన యుత్కలిక • యావట యన్నియు రేఁగి నన్ను నా
వనమున మండనీకిటులఁ • పల్లటసేసెను వక్కణింప నే
దెనయును తోఁపనీయమిని • తెప్పలకుంటివి నిబ్బరంపు సం
తస మది చిత్త విభ్రమము • దార్కొనఁ జేయదె ? మారుతాత్మజా !

ఉ॥ నీ వలనాఁడు నాచెలను • నీఁగెద నంచభయం బొసంగి యా
కై వడి మన్మనో విలయుఁ • గ్రచ్చులఁదెచ్చి దురాన దైత్యులన్
వావిరిఁ గూల్చి తద్విజయ • వార్తను తెల్పిన పుణ్యమూర్తిని
న్నేవిధి సత్కరింతునని • యేమియుఁ దోఁచకయుంటిఁ బావనీ !

మ॥ ఇన వంశోత్తముఁ దోడి తెచ్చితివి నా • హీనస్థితిం దెల్పి మ
ద్ఘన దుఃఖంబులఁ బాపినాఁడవు త్రిలో • కంబుల్ ప్రసాదించినన్
తనయా ! యస్థిర లక్ష్మి లవ్వి నత మ • స్త ప్రాంజలుల్ దక్క నే
యనువుం దోఁచదు వాంఛయున్నను ప్రియం • బారంగఁ దెల్పంగదే !

చ॥ అనవుడు వాయుజుండు హృద • యంబున నుబ్బి నమస్కరించి మ
జ్జననివి నీముదంబె యగు • జానగు నా యభివాంఛలెల్ల ని
న్మనుకులచంద్రు సన్నిధి స • మర్పణసేయ మనంబుగోరు సే
వనమువకంబె మేలయిన • భాగ్యము నాకొకచేని లేదిఁకన్.

మ॥ త్రిజగత్సన్నుత జాతిరత్నము క్రియన్ • దీపించు స్త్రీరత్నమున్
ద్రిజటం దక్కఁగ నిన్నలంచి బహుళా • త్రిం గూర్చు నీ రాక్షస
వ్రజము న్నాకసిదీట దంచుటకు సం • రంభించె దెందంబు బే
రజము ల్పల్కిన వీరి నాలుకల పై • రంబాడఁగా నూడ్చెదన్.

చ॥ పలుకఁగరాని ప్రల్లదము • పల్కుచుఁ బైఁబడి మ్రింగువార మం
చులుకఁగఁజేసి చీల్తుమని • యుత్తలపెట్టుచు నొంచుచుందు వీ
వలవల జాతి చెల్వలను • పాద నఖంబుల చిన్న భిన్నముల్
సలిపెద నీవరం బొసఁగు • చాలు రహించెద నంచు వేఁడఁగన్.

చ॥ చెలువలు భీతిమైఁ జెదరి • సీతపదంబుల వ్రాలి తల్లి! నీ
యలఘుపదంబులే శరణ • మంచు విధేయత వేఁడ నంజికల్
వలవని మాటయిచ్చి కపి • వర్యుని గాంచి విశుద్ధ మానసా!
తలఁపకు వీరిఁ జంపుటకుఁ • దప్పులు వీరలయందు గల్గునే?

ఉ॥ రావణు బోధచే నటులు • రాయిడి చేసిరి కాని వీరికిన్
భావములందు నాయెడల • వైరము గల్గద యస్వతంత్రలున్
నావిధి యిట్లు న న్నకరు • ణంబుగ నేఁచుచు నుండెఁగాక యో
పావని! వీరు కుబ్జవలెఁ • బాపులు గారు సహింపఁగాఁ దగున్.

ఉ॥ పాప కులంబునం బొడమి • పాపములం దలవాటుపడ్డ దు
ర్లేపులె యైన నావలని • ప్రేమను వీరి మనంబులందు సం
తాపము గూర్పఁ జూడకుము • ధర్మగుణాలయ! పుణ్యమూర్తి! నా
ప్రాపును గోరి రియ్యది వ • రంబుగ నాకొఱ కీయ వేఁడెదన్.

ఉ॥ అనవుడు వేఁడుకేల? యిది • యాజ్ఞయ కాదె? కృపాసముద్రవౌ
జననివి! తల్లి పల్కు లెద • జార్చు సుతుండు సుతుండె? మేలు! నీ
ఘనమతి నెంచి నట్లు యగుఁ • గాకని పావని కేలుమోడ్పు గై
కొని యటనిల్చి జానకి క • కుంఠిత మోదముఁ గూర్చుచుండఁగన్.

చ॥ అపట విభీషణుం బిలిచి • యార్యుఁడు సీత నలంకరించి నీ
విచటికిఁ దోడి తెమ్మన న • భీష్టము నందినభంగిఁ బొంగి యు
బ్బుచు దనుజప్రభుం డరిగి • భూసుత సన్నిధి శీర్షక ప్రభల్
రుచిరముగా ధరం బరవ • మ్రొక్కి నయంబు భయంబు పెంపునన్.

శా॥ తల్లీ! కోరిన శత్రు వీర జయ మా • త్రం బయ్యె రాముండు విన్
వాల్లభ్యంబునఁ జూడఁగోరె దరిసిం • పన్ వచ్చి రంగస్థలం
బెల్ల న్నిండిరి వేల్పు లచ్చటికి వే • యింపారఁ దోడ్తేర న
న్నుల్లాసంబునఁ బంపె లెమ్మ లలి ను • ద్యోగింపు కై సేఁతకున్.

ఉ॥ నావుడు సీత యిట్టులను • నాయిట నున్న విధంబు లెస్సగా
దేవతలున్ దినేంద్ర కుల • దీపుఁడు మౌనులు నాకలోక రా
జీవ దళాక్షులుం గనుట • సెబ్బులు గాదది యింతలింత లే
సీవిధి నొందియుం దుదకు • నెట్లు రహింతు నలంకృతుల్ గొనన్.

తే॥ అనుచు జానకి వచియింప • నసురవిభుఁడు, తల్లిరో! రామునాజ్ఞ చం • దంబు విట్లు
విన్నవించితి నస నాకె • విభునియాజ్ఞ, యిట్టులేయైన సరియని • యియ్యకొనియె.

## అప్సరసలు సీత నలంకరించుట

తే॥ జనకజ నలంకరింప న • ప్సరస లేగు, దెంచి తిరుమంజనము సేయఁ • దివిరి తగిన
పునుఁగు కస్తూరి గంధ చం • దనము తావి, తైల జలములఁ జేకూర్చి • దాసినారు.

ఉ॥ స్త్రీల సులక్షణంబులకు • క్షేత్రము క్రొత్తది జాతి సొమ్ము మే
ల్లీలల కెల్ల మచ్చు కర • లిన్ వెలిదేఱిన వెన్నతోడు ధ
ర్మాలికిఁ దల్లియైన జన • కాత్మజ యొంటి జడన్ వదల్చె రం
భా లలితాంగి వేదముల • వ్యాసుఁడు నేర్పున విచ్చుకైవడిన్.

చ॥ తరమగు దొండఁబోలుచు సు • ధామధురోక్తుల నొయ్యనొయ్య వె
ల్వఱచెడు నోట ము త్తెముల • వంటి రదంబులఁ దోమి నెత్తికిన్
బరిమళ తైలమంటి మను • వట్టిన రత్నము సానపట్టు న
ప్సరసున గీత మంగళ ర • వంబులతో జలమార్చి రచ్చెలుల్.

చ॥ పవడపుఁ దీవ నారజపుఁ • బాల నురుంగున మూసియుంచు న
ప్పవిదివి చందనం బలఁది • వక్షముపైఁ దగఁ జెందిరంబు సాం
కవమును మెత్తి మేల్కుసుమ • కన్నియ వన్నియ పట్టుచీరయున్
నవరణవేసి మేఖలను • సౌరుగఁ దాల్చిరి సన్నకౌనుపై.

సీ॥ ఇంద్రాణి తాల్పింగ • నిమ్మగు రిక్కల, రహినొప్పు తారహా • రంబుగూర్చి
విద్రుమోష్ఠమునకు • విమలమౌ కుంకుమ, రసముఁబో ల్తాంబూల • రసము దడవి
సంతసగాఁగ వ • సంతంబు చుట్టి హా, రతి యెత్తి దేవతా • రక్షచేసి
యద్దమండలము నం • దంక మృగంబన, హైమ విమానంబు • నందు చేర్చి

తే॥ విబుధకాంతలు తనుమట్టి • వెలసియుండఁ, గపురదైత్యులు గుంపులై • క్రందుకొనఁగ
వెడలఁ బాటనల్లల్ల వి • భీషణుండు, నీరద శ్యామ గాత్రు స • న్నిధికి వచ్చె.

తే॥ ఇవల మునులు సురలు వారి • యింతులును బ్ర, మోదమున గుంపులై చేరి • మురియుచుండఁ
దక్కువార లానంద వా • ర్తలు పచింపు, చింపుగాఁ జూచు వేడ్క వ • హించి క్రమ్మ.

ఉ॥ ఉత్తమవంశ దీపిక య • యోనిజ సాధ్వి పవిత్ర సద్గుణో
దాత్త చరిత్ర సీతను ము • దంబునఁ జూడఁగఁ గోరి గుంపులై
యొత్తుగఁ గూడి త్రోవ యిడ • కుండఁగ దైత్యులు దండపాణులై
మొత్తి యదల్చి త్రోచరి ప్ర • మోదుల మోములు నల్లఁ బాఱఁగన్.

తే॥ అత్తఱి రాముఁడు సందియ, మొత్తిన చిత్తంబుతోడ • నుద్భ్రాంతంబున్
దత్తఱయగు చేలన ముని, సత్తము లట జరుగు తెరు • వయ్యనఁ దెలుపన్.

తే॥ అది వినియు వినక మున్నే, పెదవులు చలియింప దైత్య • విభుఁగని యూచె
ట్టిదముల పీవుండఁగఁ జే, యుదురే ? తగునయ్య ప్రేమ • యుతులు నలంపన్ ?

క॥ కదనంబుఁ జూచు వేడుకఁ, బదువులుగా వచ్చియున్న • వారి సురక యి
ట్లదలించుచు దండింపం, బదరి యనుమతించు నతఁడు • ప్రాజ్ఞుండగునే ?

ఉ॥ కూలియుఁ జక్రియు న్నలువ • సుందరులన్ విడనాడి వచ్చుటల్
వోలునె; తక్కు వేలుపుల • పొల్పులఁ దెల్పఁగనేల ? తాపస
స్త్రీలను పూరుషుల్ ముదము • చే విటురా నదలించి మోఁదుచుం
దోలుట క్రూరకృత్యమగు • దోసము సుమ్మిటు సేయఁగూడునే ?

ఆ॥ పోదు జనులవిట్లు • సద్దసేయక యనఁ, గించి తలుమఁగొట్టు • టించుగాదు
వలదటంచుఁ గివిపి వలుక • విభీషణుఁ డడలుతోడ నొదలు • వదఁక విలిచె.

శా॥ సీతాదేవి రణాంగణంబును సమీ • చీనంబుగాఁ జూచి త
ద్భూతక్షోణివి కంకగృధ్ర బలి భు • గ్భూతాలికిం బందువుల్
ప్రీతింజేసిన రామభద్రు విరస • ద్వీరాంక వేషంబు నెం
తో తృప్తింగనఁ దత్తఱించు హృదయాం • దోళంబుతో వచ్చుచున్.

శా॥ నా పూతత్వము కేటగాఁ దెలిపి పై • నా నాథు వీర్యంబు ను
ద్దీపింపం బొనరించి నాకులము కీ • ర్తిన్నిల్పి యాలోకమున్
జూపం బూనిన మారుతాత్మజున కి • చ్చో నా సతీత్వంబు ను
శ్రీ పెంపొందఁగ నిశ్చలంబగు చిరం • జీవిత్వ మీఁ జాలున్ ?

శా॥ నా మేనిప్పు దశుద్ధమయ్యె ననువుల్ • నాకిల్లి నల్లేయగుణా
ప్రేమం బొక్కటి చూడ నానగొని యు • ర్విన్నిల్చె; వేతాండు చే
తో మోదంబును కూర్ప లేదనుచు సం • తోషించి సౌదామినీ
జీమూతం బననొప్పు చాపయుత రా • జీవాక్షు వీక్షించె దాన్.

చ॥ తొడరి సురాంగనామణులు • తోడనురాఁగ విమానమందు వ
చ్చెడి జనకాత్మజాత తన • జీవములన్ మరలన్ వహించు న
వ్వడువున డిగ్గెఁ దన్ముఖము • భాస్కర వంశ పయోధి సోముఁ డ
య్యెడ హృదయాంబుజం బలర • నిమ్మగు సొమ్ముగఁ గాంచునట్లుగన్.

మ॥ ప్రతిజన్మంబున జీవితేశుఁడయి తో • డ్పాటొంది దుర్జన్మ దుః
ఖితతల్ ద్రోచి ముదంబుగూర్చు నిజ హృ • త్కాంతుణా మనోమోదన
స్థితి వీక్షించి భజింపఁగంటి నిఁక నే • జీవించియున్నన్ సరే
గతియింపన్ సరె యంచు వీడినది యా • కంజాక్షి హృత్తాపమున్.

క॥ ప్రేమస్వరూపుఁడగు శ్రీ, రాముఁడు వీక్షించె జనక • రాజ కుమారిన్
రామాజన తిలకము సా, ధ్వీమణి సద్ధర్మకీర్తి • దేవతను రహిణా.

క॥ గ్రీష్మలత పోల్కనున్న ప, ష్మతి తనపాదములకు • మ్రొక్కినఁ గని యా
యుష్మంతుఁడు గనెఁ గన్నుల, నుష్మ ముడంగఁ జూచు దంద • శూకము వోలెన్.

## శ్రీరాముఁడు సీతను కఠినోక్తు లాడుట

మ॥ నియతిం దప్పిన దైత్యునింటఁ గులహీ • నిం గూర్చి పీవాన్నమున్
బ్రియమారన్ భుజియించి శీలమును బా • వింద్రోచి యిన్నాళ్ల మ
ష్కి్రియఁటన్ లజ్జను వీడి చావక యిటుల్ జీవంబుతో నుండి యే
భయమున్ లేకిట కేల వచ్చితివి ? సం • భావింతు నంచెంచియో

ఉ॥ నిను చెఱ వీడ్చ చేకొనఁగ • నీరధి గట్టి నిశాచరాన్వయం
బును మొదలంటఁ గూల్చి రణ • భూమిని రావణు సంహరింపలే
దినకుల గౌరవంబు మఱి • యేను సహించిన ఱట్టుచేఁ గలం
కను వహియించు నంచుఁ గడఁ • కంజనుదెంచితి వైరిఁ గూల్చితిన్.

చ॥ అమృతముమీఁదికంచె నధి • కానను బ్రాణుల మేని మాంసమున్
నమలుచు నాసవంబు వ్యస • నంబుగ నానుచునుండి మాయెడన్
సుముఖత చూపుచుండు టిఁకఁ జొప్పడునే మరణించుదాఁక ? ప్రే
మమున నొనర్చు విందులవి • మామది కెంత రుచించునో కదా

తే॥ పావన కులంబునం జనిం • పక ధరిత్రిఁ, గీటకము వలె జన్మించి ..కీడుపడఁగ
శత్రువర్తన పడుగఁట • జార్చి జన్మ, సంపదకుఁ దగుపని పూర్తి • సల్పినావు.

చ॥ ఇలువడి సత్యవర్తనము • నీర్ష్య యనీచత శ్రీకరత్వమున్
లలిత విచక్షణత్వము క • లంకములేని మనంబు కీర్తియున్
గులసతి లక్షణంబు లవి • కూల్చితి పట్టుగ నీదు పుట్టునే
విఁస మదారతం గనని • పృథ్విపు కీర్తిని పోలె దుర్మతీ :

ఉ॥ ఉత్తమ వంశజాతలు వి • యోగము గల్గినవేళ నింద్రియ
స్వైత్త నడంచి శీలమున • భంగము కాని దిటంబు గల్గి సం
పత్తను భోగహీనతఁ ద • పం బొనరింతురు మాన రక్షకై
చత్తురు గావి నీకరణి • సౌఖ్యము లందరు శీల నాశినీ :

చ॥ నిలువక పొమ్ము నామదిని • నీదగు చేష్టలు అంపమట్లు గం
డ్రలుగను కోయుచుండె నెద • ప్రయ్యఁగఁ జావుము కాదయేని నీ
వలచిన చోటికేగి సుఖ • వర్తన నుండుము విన్ను గైకొనం
గొలుపదు బుద్ధి యంచుఁ గొఱఁ • గ్రుచ్చిన భంగి నదల్చి పల్కఁగన్.

చ॥ ఇనకులు పల్కులన్ విని య • హీన గుణాత్మకులైన వేల్పుల్
మునులును వానరుల్ దనుజ • ముఖ్యులుఁ దక్కు సఖీ జనంబులున్
మనము కలంగఁబాఱ మఱు • మాట వచింపఁగలేక బోడనన్
దనవిరి విహ్వలించిరి ప్ర • పాతము నెందిరి సోలి ధాత్రిపై.

శా॥ నేలం జూచుచు నిల్చినట్టి కరుణా • విష్పంద వారాశి సం
శీలవ్రాతము కాణయాచి త్రిజగ • చ్ఛీభూధాత్రి పై దేహి వి
శ్వేలా దుఃఖ పయోధి ముగ్గి ప్రణమున్ • వేధింప బెగ్గిల్లి న
లీలం గంపిలెఁ గుండె హా యనియె ప్రా • లెన్ ధాత్రిపై దబ్బునన్.

శా॥ రామ క్ష్మాభు వాక్కు నెత్తి పయి ని • ర్ఘాతంబునాఁ గ్రుమ్మఁగా
భూమిం గూలిన సీత కర్మ మట సం • బోధింపఁగా లేచి వాః
ష్ప శోకీఁ దపించు నేణి జని భృ • త్యాసారముం గాంచి పో
నేమార్గంబును లేమిఁ దల్లడిలు న • ట్లీగెం దలకించుచున్

ఉ॥ నీరును నెత్తురుం గలిసి • నేత్రములం దిగజాఱ నేడ్చుచున్
దోరక నే ప్రాణముల • తో మనినట్టి ఫలంబు తాళఁగా
నేరని యిట్టి వాక్యముల • నే వినఁ గావలయున్ మదీయ దు
ర్వార దురంత దుష్క్రియలు • ప్రామఁగ నేరి మతేమనందగున్ ?

మ॥ కరుణా సాగర ! మారుతాత్మజుఁడు లం • కం జేరి వీక్షించి నీ
పర కారుణ్యముఁ గూర్చి పల్కుచు సమా • శ్వాసించెఁ గాకున్న భూ
భరమై యే మనుదాననే ? యతఁడు నా • బన్నంబుల న్నీకు వి
స్తర పక్కిన్ వచియింపఁడో ? వినుత దూ • తత్వంబు తాఁ జేయఁడో ?

మ॥ పురుషో త్తంసమ ! యింతకాలము శ్రమం • బుం గొంచుఁ గాపాడు సు
స్థిర చారిత్రము సత్తపస్స్థితియుఁ బా • తివ్రత్యమున్ సర్వమున్
బర మర్మజ్ఞ విచక్షణం బయిన నీ • భావంబు వీక్షింపమిన్
బరిసెన్ వీసరవోయె పీఁకిఁడి ప్రలా • పం బట్లు వ్యర్థంబుగన్.

మ॥ స్థిర పత్నీత్వము గల్గు దాన నన నా • చిత్తంబె సాక్ష్యంబగున్
సరసీజాసనుఁడేని నాదు హృదయ • స్థైర్యంబు మార్పంగ లేఁ
డిరవారంగ రఘూద్వహాండె సభ స • న్నిట్లాడుచో నింక మ
ద్వరు భావంబును మార్ప నేర్పుగల దై • వ మ్మొక్కఁడున్నే యెటన్ ?

చ॥ అజ హర చక్రులుం గరత • లామలకంబుగ సర్వ కార్యముల్
త్రిజగములం దెలుంగుదురు • తేఁకువఁ గాంతల చిత్త సంస్థితుల్
నిజముగఁ గాంచలేరు మఱి • నిర్మల నిష్ఠఁ బతివ్రతాత్వ మ
క్కజముగ నెవ్వరింకఁ గనఁ • గా నొసఁగింతు ? ఫలంబు నేమగున్ ?

ఉ॥ కావునఁ గాయమున్ విడుటె • కార్యమగున్ భవదాజ్ఞ యటి స
ద్భావయుతంబ కాన నెడఁ • దం గొదుకం బనియేమి యుండు ? నా
చావును గోరుచుండె విధి • చక్కటి యంచు మఱందిఁ గాంచి య
న్నా ! వనమందు వోలెనె యొ • నర్పుము ప్రస్తర మొందు వహ్నితో.

ఉ॥ నాయన! పుణ్యరూప! రఘు • నాథుఁడు పల్కిన పల్కు వింటె? నా
కీ యవశిష్టకార్యము ర • హింపఁ బయిలోటము మాని క్రచ్చఱం
జేయుమ యన్న నాతఁడును • చేడ్పడి దుస్సహ వేపమాన చిం
తాయత నాంతరంగుఁడయి • యన్న మొగంబును గాంచె నత్తఱిన్.

మ॥ జలజాక్షుఁడు సమ్మతిం దెలుప సంజ్ఞఁ గాంచి స్వప్రాణముల్
వలవం జాలని లక్ష్మణుండు వగతో • వాపోవుచున్ వెక్కుచున్
వెలయం గట్టెలు దెచ్చి పేర్చి యనలన్ • బ్రేరేఁచె వైదేహి వి
శ్వల చిత్తంబునఁ జేరవచ్చె జనముల్ • సంతాపముం బొందఁగన్.

## సీత యగ్నిం జొచ్చుట

సీ॥ లోకజనని వహ్ని • లోఁ దిగ డాయంగ, వేదంబులెల్ల వా • పిడిచి యేడ్చె
ధర్మదేవత యెదఁ • దల్లడిల్లెను ప్రద, క్షిణము సేయఁగఁ బ్రాణి • గణములేడ్చె
నమరకాంతలు ఘోర • మని విలపించిరి, బ్రహ్మయుఁ గూడదవి • పగిది యనియె
హరుఁ డక్రమంబనె • హరిరాజు బెగ్గిలె, భల్లుకేంద్రుఁడు పాక • వశ్యమొందె
తే॥ విన్నఁదన మొందె వెగచి వి • భీషణుఁడు, సుక్కి సుక్కి సౌమిత్రి నా • సొమ్మవోయె
చెడితిరా యంచు హనుమ ప్రాన్పడియె రామ, విభుఁడు నిర్విణ్ణుఁడై చాల • వెగడుగుడిచె

సీ॥ అనుచింతదని సుర • లన్యాయమని సాధ్యు, లాగడంబని యక్షు • లనుచునుండ
ఎడకడయని సిద్ధు • లెగ్గని యురగులు, తగని పాడియని గం • ధర్వు లనఁగ
గరుఁడు లాక్రందింప • ఖగములు విలపింపఁ, బంచభూతంబులు • పరితపింప
దనుజులు మిడుకంగ • మనుజులు వడుకంగ, స్థావర జంగమ • తతి గలంగ
తే॥ శేషుఁ డొదుఁగఁగ లోకముల్ • శోషిలంగ, గ్రహచయంబులు తమతమ • గతులు దప్ప
సాగరంబులు రోదన • స్వనము నింప, ధరణిజాత యగ్నిం బ్ర • దక్షిణించె.

చ॥ వలగొని నిల్చి రామ పద • వారిజముల్ మదినుంచి యో మహా
నల! సకల క్రియాధికర • ణా! వినివారిత లోక కల్మషా!
చలమతినై మనంబున వ • చస్సునఁ గర్మల నెన్నఁడేనియున్
గలఁక వహింతునేని నను • కాల్పుము బూది యొనర్పు పావకా!

తే॥ వియతి నిట్లు ప్రార్థించి యా • నీరజాక్షి, తనదు కాణాచియైన చెం • దమ్మియందు
చొచ్చునది వోలెఁ జిచ్చున • జొచ్చి నిలిచె, సర్వ జీవులు మనముల • సంతసింప.

చ॥ అవనిని సర్వభక్షకుఁడ • నై యపవిత్రుఁడనైన యేను నీ
యవనిజ సోఁకుచేత విమ • లాత్ముఁడ నయ్యెదనంచు నుబ్బు నా
పవన సఖుండు వగ్గరిత • పావన పావక కీలమాఁడి రా
ఘవు కడ కేఁగుదెంచెఁ గర • కంజములన్ వహియించి జానకిన్.

మ॥ పతి వీక్షించిన కిన్కఁచే నయన తా • పస్వేద బిందు వ్రజ
స్థితి యొక్కింతయు మాఱలేదు జడలోఁ • జెల్వారు నవ్వార్ధి సం
తతి సుంతేనియు వాడలేదు కనుమీ • తాత్పర్య యుక్తుండవై
దితి వంశాంతక ! నిప్పుకం జెదలు ఛా • త్రిం దాఁకునే యెన్నఁడేన్ ?

శా॥ నా దౌర్బల్యము సుంతయేని మది నె • న్నంబోక కోపంబుతో
వైదేహిం గన నామె స్వీయ మహిమా • వహ్నిం దగుల్బడ్డ నా
దౌ దౌర్భాగ్యము నేమియందు? మఱి నా • యత్యాహితం బేదియున్
లేదే ? నావయిఁ గిన్కయేలొకో ? జగ • ల్లీలా మహానాటకా !

మ॥ అని ప్రార్థింపఁగఁ గాంచి లోకములు సా • స్థ్యం బొందె బెగ్గిల్లి నో
లిన ప్రాణంబులు నెమ్మదిం గొవియె వి • క్లేశంబు సంధిల్లఁగా
ముని పత్నుల్ సురదైత్య కాంతలును న • మ్మోదాత్మలై యేచి ల
జ్జను పాటింపక గంతులేసి రెవరా • సంతోషముం బొందరో ?

మ॥ గురు మోదంబున వానరావళు లొగిన్ • కోలాహల ధ్వానముల్
పరఁగం జేసెను రాముఁ డయ్యెదనునన్ • వైశ్వానరుం గాంచి దు
ర్భరితం దీని దహింపకిట్లు కరుణన్ • శాంతుడవై కాచు చె
వ్వరి యాదేశము ? నీవెవండ ? పన ఛా • స్వదహ్ని తా విట్లనున్.

సీ॥ నే నగ్నిదేవుండ • నీదేవి వైదేహి. తనదు పాతివ్రత్య • దహనుచేత
దహియింప సహియింప • దలము గాకిటు నిను. శరణంబు వేఁడితి • సంశయింతు
వేలొకో యెఱిఁగియు • నెఱుఁగనికైవడి జగములయందున • సతులు పతుల
నెడసియుండిన సంశ • యించుట సందేహ. ములఁ బలువిధములఁ • గలఁకలేని

తే॥ కరణిఁ దొలఁగించుకొనుట నా • కదన జరుగు. చుండుటయు లోక సహజమై • యుండుఁగావి
యామెచే నేను శుద్ధుండ నగుచునుండ. నామె పరిశుద్ధురాలని • యనఁగనేల ?

సీ॥ సత్యశీలుండగు • సామీరి పలుకుల. మన్నించి చేపట్ట • కున్న నీవు
శంకానివృత్తి ని • శ్చయరీతిఁ జూపు నా. నయ వాక్యముల నెంత • నమ్మఁగలవో ?
అమరులు మునులు లో • కములు హాహాకార. మొనరించుచుండుట • వినఁగరావొ ?
ధర్మంబు వీడి య • ధర్మంబుపై బుద్ధిఁ. గూర్చు విధంబెందు • నేర్చికొంటి ?

తే॥ పూతచారిత్ర కోపంబె • పూనునేని • మొగులు కురియునే ? మేదిని • పగులకున్నె ?
తగవు నిలుచునె ? జగములు • తలరకున్నె ?. అంబుజభవుండు గడగడ • లాడకున్నె ?.

తే॥ అనుచు వచియించి తపియించు • నగ్ని విబుధ. వరులు గొనియాడ జీవులు • వసటవీఁగ
సీతఁ గొని తెచ్చి రాముని • చెంత నిలుప. నతఁడు కారుణ్య సహితుఁడై • యవియెవిట్లు.

ఉ॥ నీవు సమస్త జీవులకు • నీతి తొలంగని సాక్షివౌటచేఁ
బావని లోక నిందలకుఁ • బాత్రముగాఁ బది సేత యంచు సం
భావనసేసి వహ్నిఁ దివి • బంధురరీతిఁ బరిగ్రహించెదన్
దేవిని వానరావళియు • దేవతలుం బరితోషమందఁగన్.

మ॥ అని వాక్రువ్వ సమస్తలోకములు సా • రానందముం బొందె బ్ర
హ్మను గీర్వాణులు గాంచి తానె తన మా • యన్నిల్పి సామాన్యుఁడౌ
జనువిం బోలెను తన్నుఁ దా నెఱుఁగ కీ • చందాన నున్నట్టి రా
ముని పూర్వస్థితిఁ దెల్పవే యనుచు వే • ల్పుం బెద్ద తానిట్లనున్.

## రాముని పురుషోత్తమత్వమును నలువ వెల్లడించుట.

శా॥ శ్రీరామా! పురుషోత్తమా! రవికుల • శ్రేష్ఠుండవే నీవు? నా
మేర న్నిల్చిన యల్పబుద్ధి నగు స • మ్మిష్టోక్తి సైరింపు నీ
తీరుం దెల్పఁగ శక్తిలే దుపనిష • త్సిద్ధాంత తత్త్వంబ వా
ధారాధేయము నీవ సర్వమును నీ • తత్త్వంబ లోకేశ్వరా!

మ॥ తొలి తత్త్వంబగు మాయయున్ మరల నం • దుంబుట్టు తత్త్వంబు ల
వ్వలఁ బైనుండెడు జీవుఁడున్ దనకుఁ బై • భాస్వత్ప్రభాగాశియై
తలఁపం దెల్ప వచింపరాని పరమా • ర్థం బీవ నీమాయచేఁ
గలుగు న్నిల్చు నశించు లోకములు సం • కల్ప ప్రభావంబునన్.

చ॥ తొలిస్థితియైన సృష్టియును • దుట్టతుదిం గల నాశమున్ సదా
తెలఁగవి నీస్థితి న్నిగమ • శీర్షములే పరమార్థమంచు ని
న్నొలసి వచించుఁగాని మఱి • యొక్కరి నిక్కడ కేగుదెంచు వా
రలఁ గలవానిఁ దెల్పవు ప • రాత్పర! సర్వ జగన్నియామకా!

చ॥ శివునకు నాకు నింద్రునకు • శిష్ట జనాళికి జీవరాశికిన్
దవిలియుఁ దౌలకుండు పర • తత్త్వము నీవని కాంక్షచేసి ని
క్కువము నెఱుంగు పుణ్యజన • కోటి భవాంబుధి దాఁటి దేవతా
స్తవన విశేష పాత్రమగు • సత్యపదంబును గొంద్రు రాఘవా!

మ॥ తలిదండ్రుల్ తమ జన్మకారకులుగాఁ • దర్కించు సజ్ఞుల్ ధరా
స్థలిలో సంసృతి పాశబద్ధులయి సం • తాపించి తత్త్వార్థమున్
దెలియంజాలక చావుపుట్టువుల యా • ర్తిం గుందుచున్నారు వి
జ్ఞులు నీతత్త్వ మెఱింగి ముక్తులయి సం • శోభింతు రెల్లప్పుడున్.

చ॥ ఇరువది యైదు తత్త్వముల • కీవలి తత్త్వము నీవుగాక వే
రొరుఁడు లేఁడటంచు శ్రుతు • లొక్కటఁ జాటుచునుండె నుత్తముల్

కరులగు వారు దీని కిఁక • గావలెనే వ్యవహార ధర్మమం
దౌరిమిక సాక్షి నమ్మటకు • నుత్తర సాక్షిని వోలె నిర్ధరన్

మ॥ అనుమానాదిక సత్ప్రమాణగతి నూ • హాపోహముల్ సేఁత నిన్
గన సాహాయ్యపడంగలేవు వనజా • క్షా! వేద శీర్షంబులున్
నిను నీడాపణికంబు పూర్తిగఁ గనన్ • లేకున్న విజ్ఞాన వీ
క్షణచే జాడగ నిర్ణయించి తెలుపున్ • సర్వేశ! సర్వాత్మకా!

ఉ॥ నీ కరుణా విశేషమును • నెమ్మి వహింపని వారి కింద్రియో
ద్రేకము విఘ్న కారకము • దివ్య భవద్గుణ రూపలక్ష్మి న
స్తోకముగా నెఱుంగుటకుఁ • దూకొని యింద్రియ శక్తిఁ గ్రుంచ నీ
శ్రీ కమనీయ పాద సర • సీరుహ చింతన చక్కనున్నదే?

శా॥ నీకుం బుట్టువు లేదు మాయయుఁ దొలి • నీనుండియే పుట్టె నీ
యాకాశాదిక పంచభూతములు త • త్త్వాదుల్ ప్రపంచంబు మా
యాకార్యంబులు కల్పకాలమున మా • యన్ డిందు నమ్మాయ నీ
యాకారంబున డిందు నీకు విలయం • బా లేదు నిత్యాత్మకా!

మ॥ మించుం బోలె క్షణంబులో నడఁగు ని • య్యమ్మాయా ప్రపంచంబు సృ
ష్టించం బెంచఁగ ధర్మము న్నిలుప న • శ్రీనింప నేకాకివై
ప్రాంచద్రీతిని నన్ను వెల్వఱుతు వం • త్యంబందు నాశంబు గ
ల్పించం బూనెదు దాఁగియుండఁపును తృ • ప్తిం గానగా నెన్నఁడున్.

శా॥ నారూపంబున సృష్టిచేసి జగముల్ • నారాయణాఖ్యుండవై
యారం బోషణ చేసి శూలివయి సం • హారంబు గావింతు వీ
వౌరా! రేయివగల్ దినేశ్వరుఁడు ప్ర • త్యక్షంబుగాఁ జేసి లో
కారాధ్యుండును లోకబంధుఁడగు చా • యం బొంది సర్వేశ్వరా!

శా॥ సంపన్నాఁధత నొందు మా మనము నా • శంబంద నక్తంచరుల్
చంపన్ యత్నముచేసి పాఱఁదఱుమన్ • సంరక్షకై నిన్నె ప్రా
ర్థింపన్ మాకయి పెక్కుజన్మములు ప్రీ • తిం బొందుచున్నావు నీ
కింపుం గూర్చెడి యాటలో విభులోకో • యీ కార్యముల్? రాఘవా!

మ॥ ప్రణవార్థంబు నెఱుంగువారె పరమా • ర్థంబైన నీలత్త్వమున్
గణనీయంబుగఁ గాంచువారలునుము • క్తద్వేషులున్ ముక్త బం
ధనులున్; దక్కినవారు సంచలిత త • త్త్వజ్ఞానులై జన్మ కా
రణ మాయంబడి ముక్తి మార్గమును చే • రం బోవ నెన్నాళ్లకున్.

క॥ నీరూప మిట్టిదయ్యెను, గారాపున జగములెల్లఁ • గాంచి పెనిచి ధ
ర్మారూఢిఁ జూపు జననిని, కారాని వచస్సులాడి? కలఁపకు తండ్రీ.

## శంకరుఁడు దశరథు నటకుఁ బిలిపించుట

క॥ అని నలువ పలుకఁ బశుపతి, యను నీవు జగంబులకు న • నాదివి త్రిజగ
జ్జననియగు సీత లక్ష్మియె, యనఘా! సీచరిత నీవ • యరయఁగలేవో!

మ॥ జనలోకేశ్వర! సీత పీడఁదగు దు • శ్చారిత్రయే? లోక పా
వన చారిత్రను శంకచేసి విడువన్ • భావింతువే నీన్ జగ
జ్జని సందోహము తల్లడిల్లి తుది నా • శంబందు నట్లౌట దే
విని నిందించుట మాని చేకొనుము మా • వేఁడ్కోలునన్ రాఘవా!

చ॥ పశుపతి యిట్లు పల్క సుత • బాధ వియోగ మహోగ్ర వేదనా
వశమున జీవము ల్విడిచి • వైష్ణవలోకము నొందియున్న యా
దశరథుఁ జేరి నీతనయుఁ • దండకు వచ్చి తదీయ చిత్తక
ర్కశతను మాన్పి మోదము జ • గంబులకుం గలిగింపవే యనన్.

మ॥ శివు నాజ్ఞం గొని ప్రేమపాత్రమగు క్ర • వ్యాదాన్వయధ్వంసి రా
ఘవు వీక్షించు కుతూహలంబు మది నూఁ • గంజేయ నుత్కంఠయుం
దవులం బంక్తిరథుండు భూమికి దిగెన్ • దండ్రిన్ సమీక్షించి దా
నవభీముండగు రామభద్రుఁ డెరఁగెన్ దత్పాద పద్మద్వయిన్.

చ॥ తెలచిన సూను బాహువులఁ • దియ్యముతోఁ దగ గ్రుచ్చి యెత్తి కౌఁ
గిలిగొని బాష్పవారిఁ జిలి • కించుచుఁ జిక్కఁగఁ జేర్చి నా భవం
బిలఁ గడు ధన్యమయ్యెనని • యింద్రియవారము తృప్తి పెందఁగాఁ
దొలఁగ వియోగవేదనయు • దుర్భర మోదముతోడ నిట్లనున్.

ఉ॥ కేకయరాజపుత్త్రి మది • గీడ్పడఁ గోరు వరంబు శూలమై
యూఁకున నామదిం దొలుచు • చుండెఁ గుమారక! నేఁటిదాఁక నీ
లోకహితంబు పేర్మి నత • లోక జయేందిర చేరి మించు సు
శ్రీకమనీయ వక్షమిటు • చేరఁ దొలంగెను నేఁడు నాయనా!

ఉ॥ ఉత్తమ పుత్త్రులం గని మ • హోన్నతి నొందిన వారు మత్పదా
యత్త రజంబునేని సమ • మందని యుద్ధుర గౌరవంబు నా
కిత్తఱిఁ గూర్చినాఁడవు మ • హెచ్చను నీవలనన్ గడించితిన్
సత్తమలోక సౌఖ్యమును • శాశ్వతకీర్తి జగత్త్రయంబునన్.

మ॥ మును నాచేత నమస్కృతుల్ గొనిన వే • ల్పుల్ తాపసశ్రేష్ఠులున్
నను సంస్తోత్రము సేయ నిప్పటి జగ • న్మాన్యాంగముం జూడుమా
వనజాతాసను నుద్దిగా వినుత భా • వస్ఫూర్తిఁ గల్పించి తీ
వని సంతోషము మీఱఁ బల్కి మిథిలా • ధ్యక్షాత్మజం జూడఁగన్.

చ॥ జనకజయున్ మహా వినయ • సంగతయై పద పంకజాత వం
దన మొనరింప నామెను ము • దంబున లేవఁగ నెత్తి ప్రేమమున్
దనుక శిరంబు మూరుకొని • తల్లిరో ! నీవలనన్ నిజంబుగా
వినకుల ముజ్జ్వలించె లభి • యించెను నాకును నిత్య సౌఖ్యముల్.

శా॥ పాతివ్రత్యబలంబు లోకులకుఁ దె • ల్పంబూని నీభర్త యీ
రీతిన్ వీతియుతోగ్రవహ్ని దుముకం • బ్రేరేఁచె నవ్వార్త నీ
చేతంబందున నిల్పకమ్మ ! జనముల్ • చిత్తంబు శంకించుచో
హేతిన్నిల్పి పరీక్ష సేయుటలు బ్రాఁ • తే ? కోపము న్మానుమా !

ఉ॥ బంగరు నిప్పునం బిడుట • పన్నియు హెచ్చొనరింపఁ జామ్మ ! సా
రంగ విలోచనా ! సుగుణ • రాజిత చిత్తుఁడు నీమగండు మీఁ
దం దొనరాదు జట్టు వసు • ధాస్థలి నంచుఁ దలంచి యిప్పు డీ
యంగమునన్ నిధించి వెల • యంగ నొనర్చె భవన్మహత్త్వమున్.

చ॥ పరమ పతివ్రతా మణుల • పాలి విభూషణమా ! ధరిత్రియే
వరతర జన్మభూమి యగు • వైష్ణవ లోకమునుండి ధారణీ
భరమును మాన్పఁబొంచె జగ • వాహనుతోడ జనించి తీవు నీ
యురు గుణరాశికిం గలఁక • యొంటునె యొక్కటి ? లోకపావనీ ?

॥ అని వచియించి యించుకయు • నల్క వహింపని శాంతచిత్త యీ
జనకజ యంచు డెందమున • సంతసమంది యనంతరంబు నె
మ్మనమును ప్రేమ కట్టుటయు • మచ్చికతోడ విషండు తన్నుదా
ఘనముగఁ గౌఁగిలించుకొను • కైవడి నక్కునఁ జేర్చె లక్ష్మణున్.

మ॥ కనుల న్నీరు జటాభరంబుఁ దడుపన్ • గాటంబుగాఁ జేర్చి యో
తనయా ! యన్నను వెంటనంటి సుఖని • ద్రాభుక్తులం ద్రోచి యా
తనిఁ గాపాడుచు లెక్కలేని ఘవా బం • ధంబుల్ వెసంద్రోచి నా
ఘన చిత్తాదుల నీఁగినాఁడవు కదా • కారుణ్య వారాన్నిధీ !

మ॥ బలు మాయావిని మేఘనాదు ననిలో • భంజించి గెల్పొందు నీ
బల చాతుర్యము లెల్లవేళలను గీ • ర్వాణుల్ ప్రశంసించు వా
రలు లోకంబుల గాసిపెట్టు దనుజ • వ్రాతంబుఁ జెండాడి ని
ర్మల ధర్మంబును నిల్పినాఁడవు జగ • న్మాన్యుండవై పుత్త్రకా !

చ॥ అని వచియించి రామ జఘ • నర్మిలిఁ గాంచి గుణప్రపూర్ణ ! నీ
కొనరఁగ నీయ సాధ్యమగు • నొండు వరంబును వేఁడుమన్న న
య్యనఘుఁడు పల్కె నిమ్మ మొగి • నవ్వలి లోకమునందు గాంచి మ
న్నన వగ వేఁదనుండి నడి • నాకు లభింపవె నీ కటా క్షమున్ ?

చ॥ అయినను కోర్కి యొండు గల • దయ్య ! మనంబున దుష్టశీలఁగాఁ
గయికొని చూడ రోఁతవదు • కైకయుఁ దత్తనుజుండు నాకుఁ ద
ల్లియు ననుజుండుగా నవఘ • శింప వరంబు ననుగ్రహింపుమీ
మెయికొని యన్న నెల్లరును • మేలని మెచ్చిరి రాము చిత్తమున్.

మ॥ అకలంకుండగు తమ్ముఁ డట్టి యతఁడే • యాఁబట్టభంగబు త
క్కక కావించి తపస్విరూపమున పైఁ • గాంతారవాసంబు గొం
కక నీకిచ్చిన క్రూరదైత్యయగు నా • కైకేయిపైఁ గోప మిం
చుకయుం దగ్గద యంచుఁ దండ్రి యన ర • క్షోమర్దనుం డిట్లనున్.

మ॥ పొరపొచ్చెంబులు లేక యుండఁగఁ బ్రజన్ • బోషింపఁగాఁ బూను నా
ధరణీభారము సర్వపాపములకున్ • స్థానంబయా నంచు వి
ద్వరులెల్లన్ వివరింపఁగా నెఱిఁగి త త్కార్యంబు నీకొంట నా
నెరపై యున్నది గాగ తల్లియెడ మ • న్నింపన్ దొసంగున్నదే ?

చ॥ వర బల మానముం గడచి • వర్తిలు రాఘవుఁ డిట్లు వల్కఁ బం
క్తిరథుఁడు కిన్కమానెఁ బరి • కించిన విన్న మునీంద్ర నిర్జరుల్
వరములు రెండు కోరె మును • వారక కైకయు రాముఁ డిప్పుడున్
వరములు రెండె కోరెనని • వందుల పోల్కి నుతించి రయ్యెడన్.

మ॥ సకలామోదక సత్య రక్షణముకై • శస్తంబుగాఁ గీర్తి వ
ర్ధక దేహంబును గొన్న భూవిభుఁడు సీ • తారామ సౌమిత్రులన్
బ్రకటప్రేమను భూమిపై నిలువ నా • జ్ఞాపించి యారెండు కో
రికలన్ వారల కిచ్చి తా మరలెఁ గీ • ర్తింపంగ బృందారకుల్.

## వేలుపులు రాముని కోరిక లొసంగుట

ఉ॥ కూటువలైన ఖేచరులు • కూర్మిని రాముని గాంచుచున్ నిరా
ఘాటముగాఁగ నీవలచు • కార్యము కూర్తుము కోరుమన్న నీ
వోటునఁ గూలినట్టి కపి • ముఖ్యులు ప్రాణములొంద వార లే
చోటునఁ జేరినన్ • వలయు చొక్కపు టోగిర మొందఁ గోరుడున్.

చ॥ వరదులు బ్రహ్మరుద్రులు త • పస్వులు నిర్జరులన్ గకుప్పతుల్
పరము ననంతు నవ్యయు భ • వప్రకరంబులఁ ద్రుంచు నచ్యుతున్
పరిపరి రీతులం దవియఁ • బ్రార్థనముల్ పొనరించి నీ కృపా
పరతని పొందుఁగావుత వ • నేచరవర్గము కోరినట్లనన్.

చ॥ కదనమునను నాటఁగొలె • గండజి నీల్గిన వానరావళుల్
ముదముసజీవముల్ గొని ప్ర • పూర్ణబలంబున లేచి పోరికై

పొదలచు హుంకృతుల్ సలిపి • మోములు కన్నులు తృప్తినొంద శ్రీ
సదనుని గాంచి జే యనుచు • సందడి సేయుచు • డాయు నంతటన్.

సీ॥ వేల్పులు రాముని • వేడ్కతోఁ గాంచి యి, ట్లనరి వివేచించి • యాదిదేవ !
వనచరసేనతో • వచ్చి కృష్ణాష్టమి.. వేళ సువేలపై • విడిసి నాఁడె
పోరు ప్రారంభించి • పొలసుదిండులఁ గూల్చి, పౌలస్త్యు నని నమా • వాస్యఁ ద్రుంచి
శోకంబులకు మేలు • జోకతోఁ జేసితి, విట్టులే పదునాలు • గేండ్లు కడచె

తే॥ నేఁడు పంచమి నీవేగి • వియత్తు భరతుఁ, జేరవేని యాతఁడు గూలు • జిచ్చునందు
సరగ నడువుమ యని పల్కి • సన్నుతించి, తమ నివాసంబులకు నాజ్ఞఁ • దరలినారు.

## సీతా రామ లక్ష్మణులు పుష్పకము నధిరోహించుట

తే॥ గడువు నే టితో • దీటి త • మ్ముఁడు గతింప, మా కులంబును నశియించు • మాఱులేదు
కాన నేఁడె చేరఁగఁదగు • కర్జమునకు, వలయు సాధన మున్నదే • తెలుపవయ్య !

సీ॥ రాముఁ డిట్లని తత్త • అంపదఁగని విభీ, షణుఁడను దేవ పుష్పకము కలదు
పౌలస్త్యుఁడు కుబేరు • భంగించి కొన్నది, వానికిఁ బరమేష్ఠి • దీని నొసఁగె
నుత్తమ జనముల • చిత్తంబులంబలెఁ, బరిశుద్ధమైనది • వనచరాళు
లెల్ల రెక్కిన జలి • యింప దందేగినఁ, గోరి నేఁడె యయోధ్య • జేరవచ్చు

తే॥ ననుడు వడిగఁ దెప్పింపుమా • యనుచు రామ
చంద్రుఁ డానతి యిడలోక • చయముఁ బోలు
వలపు వేయి సూర్యుల బోలు • మెఱుపు గలుగు
పుష్పకంబు దైత్యేంద్రుఁడు • పొసఁగఁ దెచ్చె.

తే॥ పుష్పకము ధారణికి దిగ్గ • భూవరుండు, నేఁడు నిజముగ నాకోర్కి • నెగ్గుననుచుఁ
దలఁచి దాని నధిష్ఠించెఁ • దత్తఱమున, విరులు విచ్చల విడిగ ఖే • చరులు చల్ల.

తే॥ త్రిజట కేల్మోడ్పఁ గాంచి వై • దేహి నీవు, లంక కధిదేవతంబోలి • లలితరీతి
శుభము లొందుదు గాకని • సుభగు పజ్జఁ, జేరె నూర్మిళేశుఁడు నధి • ష్ఠించెనంత.

ఆ॥ విలయ వేళ నాఁటి • వెన్నుని యుదరంబుఁ, బోలి గగనమందు • పొలుపు గొలుపు
పుష్పకమున మన్న • భూపాలచంద్రుండు, హితులఁగాంచి ప్రేమ • నిట్టులనియె.

తే॥ నలువ వంశంబు నీదౌట • తల పుమయ్య, నిన్ను చేరువారికి మేలె • వింపుమయ్య
పెంపు సొంపార లంకఁ బా • లింపుమయ్య. యనుచు నవ్విభీషణునకు • నాజ్ఞయొసఁగె.

తే॥ పంక్తికంధరు నీ భుజ • బలముపలనఁ, గూలిచితి దురమునఁ గ్లాంతి • గూరియున్న
వానరులఁగొని నీవుక • వరముఁజేరి, సుఖివి గమ్మని సుగ్రీవుఁ • జూచి యనియె.

కం॥ మీమనోబలోత్సాహ స • మ్మేళనమునఁ, గాక యేనింత పని సేయఁ • గలనె ? వాలి
తనయ ! భల్లూకేశ్వర ! నీల ! పనస! యనుచు, ముదితుఁడై పల్కి సామీరి • మునలయాదిగె.

ఆ॥ వారు దిగులుతోడఁ • బ్రాణంబులు నొదల్ల, వదరఁక గనుల నీరు • పుడమిఁ దడుప
విన్ను పిడి జీవ • నిచయంబు భరియింపఁ, జాలమనుచు మఱియు • జాలినొంది.

ఆ॥ కోసలంబు చేరి • గురుతర పట్టాధి, షేక వేషమందు • స్మితముఁ గాంచి
పరమ మోదమంది • మరలునట్లుగఁ గృప, సేయవయ్య వేడ్క • చెలఁగ ననుచు.

మ॥ విమలప్రేమ విభీషణాదులు కపుల్ • వేఁడంగ శ్రీరాముఁ డ
ర్యమవంశాంబుధిసోముఁ డా హితుల చి • త్తావేగముం గాంచి సం
భ్రమ మేపారఁ గలంగకుం డిదియె నా • భావంబు మిమ్మిట్లు దుః
ఖమునం ద్రోచి గడించు భాగ్యమది యొ • క్కండేని నాకుండునే •

మ॥ భరతత్రాణము వేగిరింప నిటులే • భాషించితిన్ మిమ్ములం
బరితోషింపఁగఁ గాదనం గపులు భా • స్వత్పుత్త్రిఁడున్ దైత్య భూ
వరుఁడున్ మారుతి బొందితో సురపురిం • బ్రాపించు చందాన సం
బరమున్ మోదము నొంది మ్రొక్కి రెలమిం • బాటించి భూజానికిన్.

తే॥ కపులతోడ సుగ్రీవుని • గాడ్పుకొడుకు, నల విభీషణుఁ దక్కువా • రలను వడిగ
నెక్కుఁడీ విమానం బని యెలమి రామ, చంద్రముఁడు సెలవిచ్చెను • సంభ్రమమున.

తే॥ పలుకువార్తయే వెనుబడు • పగిది నేడు, పదుల వెల్వలు వానర • పతి విభీష
ణుండు నంగదుఁ డాంజనే • యుండు నెక్కి, యొక్క ప్రక్కఁ జేరిరిచాల • నుత్సహించి.

తే॥ పదియునాలుగుజగముల • పాణులొక్క, మొగినికూర్చున్నను స్థలంబు • మిగిలియుండు
దద్విమానముహిమ కర్మ • తతి దహించు, జ్ఞానులకెగాక తెలుప భూ • జనుల కరిది.

క॥ వనచరులు వనచ రేంద్రుఁడు, దనుజులు దనుజేంద్రుఁడును ము • దంబునఁ గొలువన్
జనకజలోఁ దమ్మునితో, మనుజేంద్రుఁడు వెలసె వేల్పు • మన్నినిక్రియన్.

తే॥ పుష్పకమ్ము గొప్పజగమ్ము • బోలి వెలయ, రాముఁడ య్యేడ లోకకా • రకుఁడు నిర్వి
కారుఁడు నిరంజనుండు స్వప్ర • కాశ పుంజ, మగు పరంజ్యోతి పరమాత్ముఁ • డనఁగనొప్పె.

క॥ వానరనాథుండును లం, కానాథుఁడు దైత్యచయము • కపి బృందంబుల్
మానవనాథుని యాజ్ఞను, మానవ రూపములఁ గొనిరి • మక్కువతోడన్.

తే॥ తూర్పు పడమరలకు నేగు • తో యజహితుఁ, డప్పు డుత్తరమున కేగు • ననువు వెంబడి
వెడల నవ్విమానము రామ • విభుఁడు జనక, జాతఁ గని యిట్లు పల్కె సం • ప్రీతుఁడగుచు.

## రాముఁడు సీతకు త్రోవలోని చిత్రములఁ జూపుట

చ॥ మనము కిలంకమాని కను • మా యిది నే మది నెంచినట్టు లం
కను వలగొంచుఁ బో యెడిది • కాంచుము తూరుపు వాకిలిన్ బ్రహ
స్తుని మన నీలుఁ డిచ్చటనె • దోర్బల యుక్తి నడంచి కూల్చె ద
క్కినమున ద్వారమిద్ది పరి • కింపు సుపార్శ్వుఁడు చచ్చె నిచ్చటన్.

చ॥ ఇది పయిదిక్కు వాకిలిట • నింద్రజిత్తున్ మన లక్ష్మణుండు పెం
పొదవ వధించె నియ్యదియె • యుత్తర మార్గము రావణుండు బె
ట్టిదముగ పోరు సల్పె యిట • డిందె శిరంబులు కేలు లెక్క లే
కెదుఁగఁగఁ దున్మి తున్మి పడి • యించితిఁ దుట్టతుదిన్ వరాంగిరీ ॥

సీ॥ కపులు వారిధిఁ దాఁటఁ • గడఁగి చిత్రంబుగాఁ, గట్టిన సేతువు • గాంచు మబల ।
తలిదండ్రులకు గురు • వులకు బంధులకుఁ జే, సిన కీడు దీని ద • ర్శింపఁ దొలఁగుఁ
దొల్లి యింద్రున కంజి • తోయధిం జొచ్చిన గంధమాదన మదే • కంచె సుదతి ।
తత్పర్వతంబుతోఁ • దవిలి యీవారధి, పొలుపుటచేఁ బరి • పూతమయ్యె.

తే॥ జాహ్నవీ గౌతమీ సర • స్వతుల సింధు, యమున నర్మద కావేరు • లందు మునుఁగు
వారి పాపముల్ తొలఁగు న • ప్పగిది నిందు, మునిఁగి దీనిఁ జూచినఁ బాప • ములు తొలంగు.

సీ॥ వసుహంతకులు పితృ • పంచక హంతలు, పసిబిడ్డలం జంపు • పాప గుణులు
పడఁతుల నలికిన • పొడువలు • తపసులఁ, దొడఁగి హింసించిన • దుండగీండ్రు
శరణార్థులం ద్రుంచు • నలజాతి పలువలు, వచ్చి భక్తిని సేతు • వారి మునుఁగఁ
బాపంబులను వీడి • పరిశుద్ధులై వేల్పు, లగుదురు పడవ లిం • దరుగుకొలకు

తే॥ వింటికొనచేత వంతెన • విఱుచు చోటఁ, దానమాడిన పంచ పా • తకము లీఁగి
యిరువదొక్క జన్మంబుల • నింద్రభోగ, ములను పొంది సుఖింతురు • జలజనేత్ర ;

తే॥ నిటలనేత్రుని జటయందు • నిలుచు గంగ, సేతువగు భాగ్యమును నేను • చెందనైతి
నంచు గొప్ప తపంబు గా • వించుచున్న, దనిన దీని గౌరవమున • కలవియున్నె ;

క॥ వరుణుం డిట నా పావక, శర వహ్నికి నోర్వలేక • శరణము చొచ్చెన్
వరవర్ణిని । కాంచితె క్ర, మ్మఱ దీని నగస్త్యుఁ డుండు • మలయాచలమున్.

చ॥ సురచిరగాత్రి । చూడుమిది • సుందరశైలము విష్ణువాసమున్
వరమతి వేంకటాచలము • భక్తిని కాంచుము నీ మనంబు నే
నరసితి వాయుపుత్త్రుఁడు ప్రి • యంబున నన్ దొలుదొల్తఁ జూచు చో
టరయుము ఋశ్యమూక మిది • యన్నులమిన్న । మనోహరంబుగన్.

తే॥ అమిత బలశాలి శత్రు భ • యంకరుఁడు, శూలిభక్తుండు నగు వాలి • కూలినట్టి
సీమ యిది యది చూడు కి • ష్కింధ సూర్య, సుతుడు పాలించు నగరంబు • శోభనాంగి

చ॥ అనుటయు నల నంతసిలి • యార్య । కపీంద్రులు పెక్కు పెల్లువల్
మన మలరంగ గొప్ప బహు • మానముతోఁ గొలువంగ నుండు వి
ష్ణునుస్మృతి సేయు నే నొకతె • నై యరుదెంచుట లెస్సగాదు నీ
యనుఁగులు వారివారి లలి • తాంగులతో నరుదేరఁ గోరెదన్.

చ॥ పిలువుఁడి యన్న జానకి య • భీష్టము రాముఁడు సూర్యసూతితోఁ
దెలుపఁగ నాతఁడుం బిలిచి • తెప్పున మారుతిఁ గాంచి పల్కె నా

బలియుఁడు పూతమానసుఁడు • భావ్యమ యంచరుదెంచి వానరీ
కులములఁ దోడితెచ్చె రఘు • కుంజరు పత్ని మనంబు పొంగఁగన్.

ఉ॥ పావని వెంట వచ్చిన ప్ల • వంగసతుల్ తమతేనికిన్ ధరి
త్రీ పరపుత్త్రికిన్ రఘువ • రేణ్యులకుం దగ మ్రొక్కి తాము సం
భావన సేయఁ దెచ్చు శుభ • వస్తువులెల్లను మ్రోలనుంచి సీ
తా వనితా లలామను ము • దంబునఁ గొల్చుచు నిల్చి రయ్యెడన్.

చ॥ నడచె విమాన మర్కకుల • నాథుఁడు పిమ్మట సీత కిట్లనెన్
మడఁతిరో! కాంచితే భువన • మాన్య జలాన్విత గౌతమీ నదిన్
జడిముడినొంద వంచకపు • జింక కనంబడె నిందె యందు సీ
యెడయిక దాపురింపఁ గృశ • యించితి మత్తగజేంద్ర గామినీ;

చ॥ ఇది తపసుల్ వసించి తపి • యించెడు దండక చిత్రకూట మి
య్యది భరతుఁడు వచ్చి నను • ప్రార్థనసేసిన దింద ప్రేముడిం
బొదలఁగ నీవు పెంచినవి • పూలత కూఁతలు మందహాస సం
పద చెలువొంద శాఖ లను • బాహులతో నిను పిల్చెఁ జూడుమా.

ఉ॥ ఓ జనకేంద్ర పుత్త్రి! కను • ముగ్ర తపోబల శాలియౌ భర
ద్వాజుఁడు శిష్యవర్గము ము • దంబునఁ గొల్వఁ దపంబె రూప ము
ద్భేదిత రీతి నొందె ననఁ • దేఁకువఁ గేలను దండ కుండికల్
భ్రాజిల వచ్చుచుండె మన • రాక యెఱింగి యెదుర్కొనగా వడిన్.

## భరద్వాజుఁడు శ్రీరామాదులకు విందువెట్టుట

తే॥ అనుచుఁ దమ విమానము దిగ • నాజ్ఞయిడఁగ, దేవలోక మే భూమికి • దిగినపగిది
విలువ రామచంద్రుఁడు ముని • నేత కెదురు, చని తదియాంఘ్రియుగము మ • స్తమునఁ దద

తే॥ వత్సలత తొలఁకఁగ భర • ద్వాజమౌని. దీవన లొసంగి రాముని • తివిరి యెత్తి
యలమిశిరము మూర్కొనియశ్రు • జలముచేతఁ. దోయజాక్షుని జటలలో • దూలిఁగడిగె.

తే॥ సీతయును లక్ష్మణుండును • చేరికేలు, మోడ్చ నాతండు దీవించి • ముదము వలన
మనసు కరఁగంగ నమ్మృతంబు • తనకుదొరకు, చందమున నుబ్బి తా విశ • శత్వమందె.

తే॥ దనుజపతి వనచరపతి • తక్కువారు, చేరి చేమోడ్ప వారి నాశీర్వదించి
వేద ఘోషంబుతో శిష్య • వితతితోడఁ, బర్ణశాలకుఁ గొనిపోయె • వారి నతఁడు.

తే॥ శాస్త్రయుతముగ నతిథి పూ • జలను సలిపి, శ్రమము పోకార్చి పదపడి • ప్రవిమలార్క
వంశదీపకు శ్రీరామ • భద్రుఁ దనివి, సనక మతిమతి కని యిట్టు • లనియెఁ దుదను.

మునులు నరులు సుమనసులును, ఘనముగ భీతిల్లఁ గ్రూర • కర్మంబుల నె
త్తిన పేయు దనుజ కులములఁ, దునిమితి లోకముల మేలు • తొట్టగ రామా ।

మ॥ ఖర మారీచ విరాధులన్ వనమునన్ • ఖండించి సాలంబులన్
శరమొక్కంటను తొల్చి యింద్రతనుజుం • జక్కాడి వారాశి దు
ర్భర కోపంబున మాడ్చి రావణుని త • ద్వంశంబు నిర్వంశమై
పరఁగం గూర్చితి వెల్ల లోకములకున్ • బ్రాపింపఁగా శ్రేయముల్.

చిత్రకూటంబు వీడి దక్షిణమునందు, గలుగు చెడుగుల నన్నిటిఁ • దొలఁగఁజేసి
మరలి వచ్చెదు దనుక ని • న్మఱవలేదు. వచ్చితివి నేఁడు విందవై • వఱలుమయ్య ।

చ॥ కరమున విల్లు దాలిచి జ • గంబుల గాసిలఁజేయు దుష్టులన్
జెఱచితి వెల్ల జీవులకు • సేమము సేకుఱె సర్వదా తపో
విరతియు నిల్చె మాకుఁ గరు • ణించితి పీశపథంబు చిత్త మా
భరతుని మీఁది వత్సలతఁ • బర్విడుచున్నది నీకు రాఘవా ।

చ॥ అతఁడును మైచెమర్పఁ గను • లందున నశ్రులు రాల వంది ని
శ్చితమతి లేక వేగుటయుఁ • జింతను దక్షిణ దిక్కు చూచుచున్
వితమతి దుఃఖమే తనువు వీఁక భజించిన చందమొంది నీ
కతయే తలంచుచున్ గడె ము • గంబుగఁ ద్రోచెదు నేఁడు రాఘవా ।

చ॥ విసుగుచు నింద్రియావళుల వీక నడంచి దినంబుఁ గాయలన్
గసరులఁ దిన్చు సౌఖ్యములఁ • గాంచక కత్తృణ తల్పమందు దా
నిసులఁ దొలంచుచున్ సతము • నిన్నె జపించుచు రాజధానికిన్
వసిగొని పోక పల్లియను • వాసము చేయుచునుండు రాఘవా ।

పదితల లిరువది కరములు, విదితంబుగ నేలఁగూల • వింశతి బాహుం
గదనమునఁ గసిమసంగుచుఁ, జదిపిన రఘువీర ! నిన్నె • జపియింతు సదా.
అలీల మౌని పలుకఁగ, శూలియు వనమాలి తమ్మి • చూలి నుతింపం
జాలిన మీదయచే నేఁ, బోలఁగ ధన్యుండనైతిఁ • బుణ్యచరిత్రా ।

మ॥ అని సీతాపతి తెల్ప మౌనియును రా • మా ! నీయభీష్టంబు దీ
ర్పను నాచిత్తము తత్తఱించె నన శ్రీ రాముండు కీశవ్రజం
బునకున్ మీవనమందు కాయ గసరుల్ • పుష్పాసవంబుల్ జలం
బును నిండారఁగ నుండుఁగాక యన నా • పుణ్యుండు సంతుష్టుఁడై.

శా॥ కాకుత్స్థాన్వయ ! నీకు నీహితులకుం • గావింతు నేవిందు నేఁ
డీ కాంతారము దేవలోకమగు నా • యిష్టంబు సందిల్ల న
స్తోకప్రేమను పొందుఁ డంచొక హవి • స్సున్ వేల్వఁగాఁ గ్రన్ననన్
నాకం బచ్చటి కేగుదెంచెఁ గపులా • నందంబునం బొందఁగన్.

శా॥ సుగ్రీవాదులకున్ మహేంద్ర విభవ • స్తోమంబు నిండార మా
ర్యాగ్రేయాన్వయ మండనాకృతికి రా • జ్యాన్నంబు చేకూర్ప న
వ్యగ్రుండై రఘురామ భూపుఁడు జగ • త్ప్రాణాత్మజుం గాంచి నం
దిగ్రామంబున కీపు మున్నుచని మ • ద్వృత్తాంతముం దెల్పుమన్,

చ॥ భరతుని శీలమున్ దలఁచు • భావములెల్లను బోలఁగాంచి చె
చ్చెరఁ జనుదెంచు వెన్నఁగ వి • శేష పథంబగుఁ బోయి రమ్మనన్
సరియని మారుతాత్మజుఁడు • చయ్యన వాయుపథంబునందు తం
దిరి వడి చిత్తవేగమును • డిందుపడం జని పోవు త్రోవలో.

తే॥ గుహుని గని రాము సేమమ్ము • కోర్కెఁ దెల్పి, యవలి కేగెను రాఘవుఁ • డసురవధము
సేయుః ద్ధతిఁగంటిమి • చిత్తమలర, భరతు వర్తనఁ గందమీ • [illegible]ము.

## భరతుడు రాముని రామికిఁ బరితపించుట

సీ॥ ప్రతిదినంబును రామ • పాదుక లర్చించి, యింద్రియంబు లడంచి • మెరఁగువాఁడు
అన్నిచోటులఁ గల • యనుకంపయొకచోటఁ, బూర్ణరూపము గొన్న • పోల్కివాఁడు
కలిగియు కొల్లక • కాంతార వాసుల, యోరెమే భుజియించు • చుండువాఁడు
చూచిన వెతతోడఁ • జూచు దక్షిణదిక్కు, గాక వేఱొక దెస • గననివాఁడు

తే॥ అన్న వాక్కు లెన్నటికప • త్యములుగావు వచ్చునని జీవముల నిల్పి • వలచువాఁడు
కుడుచు నీటికి జీవాత్మ • కును నిజంబు, జీవ మా రాముఁడని చింత • సేయువాఁడు.

తే॥ రాము పట్టాభిషేక నీ • రంబు గాంచి, కాక బాష్పవాహిని దరి • గాంచలేని
భరతుఁడావాఁడు జానకీ • పతుఁడు వచ్చు, దినముఁగూర్చి యాలోచింపఁ • దివిరినాఁడు.

తే॥ తాను లెక్కించు లెక్కలోఁ • దప్పుగలదొ, యనుచు గణకులఁ బిలిపించి • యడుగ వారు
తీఱు నేఁటితోఁ వనవాస • దీక్ష యనుచుఁ, బలుక భరతుఁడు మనమున • భయము చెందె.

క॥ సంపర్కోగంబుల మది, నుంపని పుణ్యుండు నొచ్చి • యుష్మలిక ముతోఁ
గంపముతో ననుకంప జ, నింపఁగ నిట్టూర్చి తుదకు • నేలన్ వ్రాలెన్.

శా॥ నామీఁదం గృపగల్గునో కలుగదో • నాయార్తి లెక్కింపవో
నామాటల్ మదినుంతువో యనువవో • నాకీడు మన్నింపవో
నా మోముం దిలకింపఁగాఁ దలపవో • నాచిత్తముం గానవో
ప్రేమం దల్లులనైనఁ గాంచుటకు రా • వే సత్కృపం జూపవే?

శా॥ నాదౌర్భాగ్యము చేత నీకు నటవిన్ • దాపించిరే శత్రువుల్?
నీదాయల్ హరి శంభులైన నవిలో • విల్వంగనేర్తురే?
కాదే యింకను కొన్ని యేండ్లు భరత • క్ష్మాపాలుఁడే రాజ్యము
మోదంబారఁగ నేలనిమనుచు నా • మోదించితే? యగ్రజా:

చ॥ అడవినె యుండుగాక మరి • యాద నయోధ్యకె వత్తుగాక నీ
యెడఁద యదెట్టులుండెనటు • లే జరపింతువుగాక యేదియున్
దడవక నా ప్రతిజ్ఞ ఫల • దంబు నొనర్చుచె నాకుఁ గర్జమా
విడిచెద నగ్నిలోనఁ బరి • వేదన దీఱ మదీయ జీవముల్.

మ॥ అనుజన్మా : యిటురమ్ము చేరువకు ని • న్నర్థింతు నొక్కండు నీ
వనుకంపంగొని యా వరంబు దయచే • యన్ వేఁడెదన్ రామచం
ద్రుని యేవార్తయు వీనులం బడదు నా • దుష్కర్మ సంప్రాప్తి న
గ్నిని నేఁజొచ్చెద నన్ను వచ్చుదనుకన్ • వీక్షింపు మీరాజ్యమున్.

మ॥ అన శత్రుఘ్నుఁడు విహ్వలించుచు హలా • హాలంబు భక్షించు వి
న్ననుషం దోఁప వడంకి నేలఁబడి య • న్నా! యేమి దోసంబు నీ
కొనరింపం దలపెట్టినాఁడ ? మది ని • ట్లూహింపఁగాఁ బోలునే ?
నను శిక్షింపఁ దలంచితేల ? యిదియున్ • నాచేయు దుష్కర్మమో ?

చ॥ జనకుని సత్యవాక్యనిగఁ • జల్పఁగ నన్న వనిం జొరంగ సే
వన మొనరింపఁ గానలకు • భ్రాఁతిగఁ దమ్ముఁడొకండు పోవ రా
ముని పునరాగమావధియుఁ • బోవఁగఁ దమ్ముఁ డొకండు జీవముల్
తనుకఁగ వీడుచుండఁ గడ • తమ్ముఁడు రాజ్యము సేయుఁ జెల్లరే ?

చ॥ అడవుల నన్నయుండఁ బుర • మందలి భోగములందెఁ దమ్ముఁడన్
నుడి జగమాడునంచు మది • నొచ్చి తపించుచునుండి యగ్నిలోఁ
బడుచును పిన్నతమ్ముఁ డొద • వంగలఁడంచుఁ దలంతుకాక యీ
యెడరు సహించి యే బదికి • యేలఁగఁబోలునె యీ ధరాస్థలిన్ ?

శా॥ శత్రుఘ్నుం డిటు పల్కఁగా భరతుఁడి • చ్ఛన్నొచ్చి యచ్చైన నే
ధాత్రిం బాలన సేయుచుంటి నని కా • దా రామభద్రుండు తా
నీ త్రొక్కాటము గూర్చుచుం దడసె వ • హ్నిం జొచ్చి యె సీల్లుచోఁ
బుత్రప్రేమను కావవచ్చు జనమున్ • బుణ్యాత్మ! నిప్పుంపవే.

## కౌసల్య భరతు సమాధానపఱచుట

మ॥ భరతుండిట్లు వచించు వార్త వడిగాఁ • బ్రాఁకన్ జనంబెల్లఁ ద
త్తఱపాటొందె బతివ్రతామణి కృపా • ధౌరేయ కౌసల్య దు
స్తర తాపంబున సాహసంబు వలదో • తండ్రీ! జగంబెల్ల ని
ర్భర దుఃఖంబునఁ గ్రుంగి కూలు ననుచుఁ • వచ్చెన్ విచారంబునన్.

చ॥ తలముడి వీడ మేన్వడఁకఁ • దత్తఱపాటున వచ్చు తల్లి న
య్యలఘుఁడు కాంచి యామె చర • ణాంబుజముల్ తలసోఁక మ్రొక్కఁగాఁ

దరియుఁ గుమారు శీర్షమును • తక్కక యక్కునఁ జేర్చి నాయనా!
పలికిటు సాహసంబు మము • వారక కాచు సుతుండ వీవెకా!

ఉ॥ నీ జనకుం డొనర్చినది • నీ పెదయన్న వనంబు చేరుటల్
నాటగణంపు దుష్కృత గ • ణంబు ఫలంబగుఁ గ్రమ్మఱిల్లమిన్
నాజనన ప్రభావమగు • నాయన! నీదొసఁగేమి యిందు? నీ
వీ జగమీ విధాన నశి • యింపఁగఁ జేయుట యుక్తకార్యమే?

ఉ॥ నీపగినిం బొరం నలరి • నీప్రజయుం బడు సేనయుం బడున్
బావర మేము నిల్తుమొకొ? చానలు మమ్ముల వెంబడింపరే?
చావదె ధర్మమున్? జగము • సర్వము కూలదె వీటలాటమై?
యీవిధి పాపకర్మమని • యెంచవొ? యేమి తలంచి తియ్యెడన్?

చ॥ ధర్మయుతంబులై తనరు • దద్దయు నీపను లెల్ల కాలమున్
ధర్మ విహీనపద్ధతిని • దారుట గానమ యెప్డు దేని నీ
ధర్మ గురుత్వ సంపదలఁ • దక్కక నీవెఱుఁగంగలేదు నీ
కర్మద సత్త్వధర్మములు • శాశ్వతముల్ యుగపాళి మాటినన్

ఉ॥ ఉత్తమ పుత్త్రి! రామవిభు • లోకకుటఁ బెక్కగు కోట్లు కూడినన్
బొత్తిగ నిన్ను ప్రేమమయుఁ • బోలఁగఁ జాలుదురే? పుణ్యమే
యిత్తెగ రూప మొందిన ర • హిన్ వహియించిన నీవు వోవఁగా
రుత్తయె కాదె ప్రాణి నికు • రుంబము తోడ నజాండ మియ్యెడన్.

ఆ॥ మాపు రాకయున్న • రేపె రాఁగలఁడు నా, తలఁపు పొల్లుగాదు • తప్పెనేని
రామవిభున కేదొ • రాదాని యెదరు ప్రా, ప్తించె నంచు నెదఁద • నెం చవచ్చు.

తే॥ నీవె శాస్త్రధర్మంబులు • నీవు తక్క. శాస్త్రధర్మంబు లోకఁ దైన • జగతి లేదు
ఒకఁడు మరణించె ననియెంచి • యుర్వి నున్న. ప్రాణికోటులఁ జంపఁ బా • ల్పడఁగఁ దగునె

ఉ॥ ఉర్విని చావు పుట్టుకలు • యోగ వియోగములున్ సుఖాదులున్
సర్వము కర్మజాల ఫల • సంభవమౌటఁ దలంచి సాత్త్వికుల్
గర్వము మోహమున్ వదలి • కాంతురు నిచ్చలు సౌఖ్యమందుఁ దా
నిర్వృతి గూర్చు రామ జన • నిం గని కైక కుమారుడుఁ డిల్లనున్.

తే॥ రాము సత్య వాక్యము దిన • రాజవంశ, శీలమును చెడ జీవింపఁ • జాల నాదు
ప్రతినవెఱవేర్చుకొందు నీ • పలుకు వినని, దొసఁగుఁ ఘటియింపు మమ్మరో! విసుగుగొనక.

ఉ॥ ఏనును సత్యపాలనకు • నిమ్మగ జీవము వీడు జేసికిన్
సూనుఁడనే కదా! జనకు • సూక్తుల నౌదలఁ దాల్చి పెన్నఁగా
జానకిజానికే విధియొ? • జానుగఁ దక్కినవారి కుర్వరన్
బూనిక నెగ్గఁ జేసికొనఁ • బోలదొ? యెక్కడి పాడి? తల్లిరో!

ఉ॥ తల్లి వచస్సు మీఱమియుఁ • దండ్రి నుడుల్ జవదాటకుండుటల్
పెల్లుగ నింపఁ బాత్రమగు • ప్రేమ సమూలముగాఁగఁ ద్రుంచుటల్
చెల్లిన దొక్క రాముననె • చెల్లదు నాకది చచ్చి నామదిన్
వెల్లడి చేసెదన్ గలుష • బృందముఁ బాసెదఁ జూడుఁ డిందఱున్.

## హనుమంతుఁడు భరతుని చేరుట

చ॥ అని భరతుండు చేరఁజని • యగ్నిఁ బ్రదక్షిణ మాచరింపఁగా
జనముల గోడు క్రందుకొని • చయ్యన వ్యోమము ముట్ట నా ఘన
స్వనముల నాలకించి రభ • సంబునఁ గార్యము మించెనంచు న
య్యనిల సుతుండు తత్తఱము • నందుచు డాసె మహోగ్రవేగు డై.

ఉ॥ డాయుచు రామచంద్రుఁడు క • డంకను వచ్చుచు నున్నవాఁడు స
త్యాయతసంధ యైన భవ • దాయువు వోయెనయేని రాఘవుం
డీయిల నవ్వలం బ్రదుక • నీకొనునే? యని పల్కి తూఱి యం
దాయితమైన యగ్గి నతఁ • డాఱిచి బొగ్గులు చేసె ప్రేల్మిడిన్.

చ॥ పదపడి వచ్చి యాభరతు • పాద సరోజయుగంబు భక్తి నె
న్నుదురు స్పృశింప మ్రొక్కుచు న • నుం బరిపూత చరిత్ర దాసుఁగా
మదిఁ దలఁపందగున్ సుజన • మాన్యుని రాముని రాక కెన్న
ల్వది గడె లింక నున్న యవి • వారక మీరు గణించి చూడుఁడీ.

శా॥ నా వాక్యంబుల యం దసత్య మదియు • న్నన్ మీకు నే ముఁదుగా
నీ వహ్నింబడి కూలవా ద ధరజా • క్షేమంబు దిదో వచ్చెఁ బొ
ద్దావర్తించి జనించుదాఁక నిలుమా • యామీఁద రాఁడేని నీ
వీ వైశ్వానరులోనఁ జేరుము మనో • భీష్ట ప్రకారంబునన్.

తే॥ వచ్చుచోఁ బ్రేమమున భర • ద్వాజమౌని. నిలిపి విందువెట్టఁగ వేఁడ • నిలిచినాఁడు
తామసింపఁడు నీఁమీఁది • తత్పరతను. నీరజాక్షుండు సంశీల • నిరత! భరత!

## భరతుఁడు రాముని రాక విని యానందించుట

తే॥ అతఁడు ప్రేమతోఁ బంపిన • యాసవాలు, కలదు చూడుమా యనుచు నుం • గరముఁ
గాంచినంత నయ్యది వారి • కనులఁ జొచ్చి, ప్రాణముల నిల్పె నమృతంబు • పగిదినొప్పి.

తే॥ రోదనము వోయి యానంద • రుతము చెలఁగె, వేఁడి కన్నీరు చల్లనై • వెడలసాఁగె
వ్రాలియుండిన తలలెల్లఁ బైకిలేచెఁ, జేతులెల్లను హనుమ నా • శీర్వదించె.

క॥ పలుమఱు హనుమకు మ్రొక్కుచుఁ, జెలఁగి నటనసేయు సుగుణ • శీలుఁడు భరతుం
డలఘుని ముద్రిక నక్కున, నలమెఁ గనుల నద్దికొనియె • నానందించెన్.

తే॥ వేయిముఖంబులేనట్టి • విమలగుణుఁడు, భరతుఁడపుడు నిక్కముగ్రొత్త • భరతుఁడయ్యె
ముఖము లుబ్బొంగె మేనును • బూరటిల్లె, నతని యానంద మదిచెప్ప • నలవియగునె?

తే॥ నలుపుగాఁ బ్రేమ మధికమై • నవ్వు నేడ్పు, నిక్క గంతులు వైచును • నేలఁబడును
చేష్టదక్కఁ బూరించును • చెప్పరించు, మలసి తిరుగు మారుతికి న • మస్కరించు.

క॥ అడుగ వాడుఁడు రాముని, గూడుఁడు కూడుండి యతని • కొమరగు కీర్తిం
బాడుఁడు పాడుఁడు వెతలను, పీడుఁడు పీడుండి యితని • వినుతింపుఁడనున్.

తే॥ కలిసమానస యగుకైక • కడుపునొచ్చ, ననుచుఁ బెద్దలకున్ మ్రొక్కు • నవనిపులకు
మ్రొక్కుఁ బెలుపలకును మ్రొక్కు • మ్రొక్కికొనును, పృథివిఁ గల్గువంటిదె సుమా • ప్రేమగుణము

తే॥ పిదప భరతుండు హనుమంతుఁ • బ్రీతిఁగాంచి, యెవ్వఁడవు తెల్పుమా విన • నిచ్చగింతు
విప్రవేషంబుతో వచ్చు • విబుధపతివొ, ముగురు మూర్తుల నొకఁడవై • తగుదువనిన.

చ॥ అతనికి నాంజనేయుఁ డను • నంజనిపుత్త్రుఁడ వానరుండ మా
రుతిని దినేంద్రనందనుని • రూఢిగఁ గొల్చుచునుండు జానకీ
పతికి హితంబు జీతమును • బత్తెము గోరక కూర్చు దాసుఁడన్
నుతగుణపూర్ణ! నీకడ కి • నుంగున వచ్చితిఁ గామరూపినై

క॥ నాయల్పరూపమును నీ, వీయెడఁ గన నిచ్చగింతు • వే యని మార్చెన్
కోయని నిర్జరు లార్వన్, ఖీయును మోదంబు నెడఁద వికవికసేయన్.

తే॥ పవనసూనుని దొడ్డరూ • పంబు గాంచి, భరత శత్రుఘ్ను లతి మాత్ర • బద్ధమనిరి
సకల జనములు నుడిపడి • చావకున్న, దిగ్భ్రమం బెంది పెల్లు భీ • తిల్లినారు.

తే॥ వాయుపుత్త్రక! మేమాదు • వాక్కులెల్ల, నీచెవుల కందునంతటి • నిస్వనంబు
కలవి కావు కావున దొల్లి • కరణి నిలిచి, నీ మహా రూప మడఁపుము • నియతచరిత!

తే॥ అనుచుఁ బ్రార్థింపఁ దనవేడ్క • ననుసరించి, చిన్నరూపంబు గైకొన్న • విబుధనుతున
కమిత సంపదలను భూష • ణాంబరముల, సుదగాఁ గైకపుత్త్రకుఁ • డొసఁగెఁ బ్రీతి,

తే॥ మత్త గజము లుత్తమజాతి • మణులు తురగ, చయములును పాఁడి గోవులు • స్యందనప
మంచి కేదా ములను స • మ్మాన పూర్వ కముగ నొసఁగెను హనుమకుఁ • గైకసుతుఁడు

తే॥ తమ్ము వీక్షించి మన పౌర • తతికి నెల్ల, రామవిభు నెమర్కొన బంధు • రాజితోడ
బయలుదేఱుఁడియని యున్ని • వార్తలంపు, తెలియజాటింపఁ జేయుము • తెలుఁగుఁగాఁగ.

తే॥ తోరణములు గట్టించి వీ థుల నలంక, రింప రథగజాశ్వంబుల • రీతిగాఁగఁ
బొలుపు సేయింప మంగళ • పూర్ణకుంభ, ములను పెట్టింప వలయు వా • రలను పసుప,

తే॥ క్రమముగా భరద్వాజునా • శ్రమమువఱకు, ముత్తెములపందిరులమర్చి • పురమునెల్లఁ
గ్రొత్తదగునట్లు సేయించి • కొమరు మీఱ, మంగళారావములను చె • లంగఁజేయు

తే॥ అనుదుశత్రుఘ్నుఁ డప్పుడ • యరుగుదెంచి, శుద్ధగుణయుతుఁడును బ్రహ్మ • శుతు డుహితుఁడు
మంత్రియును ప్రాజ్ఞుడైనను • మంత్రుఁ గని చి. భరతునాజ్ఞను వివరించె • బంధురముగ.

సీ॥ ఆవార్త చెవిఁజొచ్చి • నంత సుమంత్రుఁ డ, త్యానందమునఁ దన్ను • తాన మఱచి
భేరులు మ్రోగించి • వీథివీథికిఁ జని, కకుబంత విశ్రాంత • కలిత కీర్తి
రావణ సమవర్తి • రామమూర్తికి నెదు, ర్కోలు సేయఁగ రాచ • కొమరులు బల
వితతులు పురజనుల్ • వేడ్కతోఁ గై సేసి, కొని రండనుచు మీరు • ఘోషణంబు

తే॥ సేసి రండని కింకర • శ్రేణి నంప, వారు చాటించి రంత న • ప్పలుకు విన్న
ప్రజలు కోలాహలము సేయఁ • బత్తనంబు, పూర్ణ చంద్రోదయాంబుధి • పోలుపునొందె.

సీ॥ రాము నెదుర్కొన • రండను చాటింపు, పేరకుఁ బెన్నిధి • విధము యయ్యె
రాము పెండ్లికి మున్ను • రండని చాటించు, కరణి నొప్పారెను • మురజ రవము
అఱువదివేల య • క్షౌహిణుల బలంబుఁ, బౌరకాంతామణుల్ • పౌరవరులు
రాజకుమారులు • ప్రార్థించు సంపద, యెదురైన చందాన • ముదమునొంది

తే॥ పౌవలి నడచిరి తల్లులు • ముగురు పసిఁడి, శిబికలందెక్కి వెడలిరి • శిష్టజనులు
బంధువులు పరివేష్టింప • భరతరాజు, లీలగా హనుమంతుని • కేలువట్టి.

తే॥ రామభద్రు పాదుకలు శి • రక్షముగాఁగ, నిరుగెలంకులఁ బైఁడిచా • మరలు వీవ
గజఘటలు మున్నుగా నేగఁ • గలితపాండు, రాతపత్త్రంబు నీడలో • నరుగుదెంచె.

మ॥ కృప మమ్మేలిన రామచంద్రు నెదురం • గేగుట్టి సామీరితో
నృప సంపూజ్యుఁడు పాదచారియయి తా • నే తెంచుచున్నాఁడు వ
చ్చు పథంబందున రాలు నేఁడిగొని కా • ల్పుం గోమలాంఘ్రి ద్వయం
బపచారంబని దాఁటెనో యన నిమం • దస్త్రాద్రిఁ జేరెన్ వెసన్.

భరతున కాంజనేయుఁడు రాము వృత్తాంతంబు దెల్పుట

తే॥ భరతుఁ డయ్యెడ మారుతి • వదనము గని, రామచంద్రుఁడిన్నాళ్లు గా • రవముతోడ
నెచ్చటెచ్చట నుండె? నే • మేమిచేసె?, వివరముగ దెల్పవేయన • వినిచె నతఁడు.

తే॥ పురమునందుండుటయుఁ దల్లి • వరమువలన, వనము కేగుటయును నీవు • వచ్చి యతని
వేఁడ పాదుకలం గొని • వెడలుటయును, తెలుపనేటి కథ్వలి కథ • దెలుపువాఁడ.

ఉ॥ దండకయందు చేర ముని • తండము రాక్షస హింపఁ దెల్పి నీ
యండను చేరినార మిఁక • నాపద దీరించి కావుమన్నఁ గో

దండధరుండు రాఘవ వ • ధం బొనరించె దశాస్యుఁ గూల్చె వు
ద్దండ పరాక్రమంబున య • థావిధిఁ దెల్పెద నాలకింపుమా.

చ॥ తన యువిదిన్ గ్రహించి రిఁకఁ • దప్పక వీరలు మాటిమాటికిం
బనుపడ వచ్చివచ్చి తన • ఖావము మార్చెదరంచు దండకా
వనమును చేరుచోఁ దెనక • వచ్చు విరాధుని గూల్చి యవ్వలన్
దనుజులఁ గూల్చ మౌనులకుఁ • దా వభయం బొసఁగెన్ మహాత్మకా!

మ॥ పదియేం డ్లచ్చటనుండి రాఘవుఁడు త • ద్వాక్యప్రకారంబుగా
నుదధిం ద్రావు నగస్త్యుఁ జూడఁ జని యా • యుత్కృష్ట దేవర్షి కాం
క్ష దలిర్పంగ మునుందు కార్ముకము న • క్షయ్యంపుఁ దూణీరముం
బ్రదరంబుల్ తరవారి బొందదము గా • రంబార సీయం గొనెన్.

మ॥ అవలన్ వారు జటాయువుం గలిసి నె • య్యంబార సేవించి పం
చవటిం జేరి కుటీరమందు దినము • ల్సాగించుచుండంగ దా
నవి యొక్కర్తుక చుప్పనాక యెదురై • నారీమణిన్ జానకిన్
దవదాహంబును బోలె ముట్టి కొని పోఁ • దర్కింప సౌమిత్రియున్.

మ॥ కని యా రక్కసి కర్ణనాసిక లొగిన్ • ఖండింప నాదైత్యయుం
గినుకం బోయి ఖరాదులం గలిసి యా • కీడ్పాటు దెల్పంగఁ ద
ద్దనుజుల్ కోప సమేతులై బలిమితో • దర్పించి శ్రీరామచం
ద్రునితోఁ గయ్యముసేసి మాఁడి రగినిం • దూదింబలెం గ్రచ్చుఱన్.

శా॥ లంకాద్వీపము చేరి శూర్పణఖ పౌల • స్త్యున్ సమీపించి తా
నంకెం బొందిన పద్ధతిం దెలిపి మీ • నాంకధ్వజంబో యనం
బొంకం బారు విదేహకన్య చెలువం • బుం దెల్పి ప్రేరేఁపఁగా
లంకేశుండును వచ్చె సీతఁ గొని పో • లంకించి మారీచుతో.

శా॥ మారీచున్ హరిణంబుగాఁ బనిపి తా • మౌనీంద్రవేషంబుతో
శ్రీరామాంగన యున్నభూమిని పెక • ల్చెం దేరిపైఁ బెట్టి నా
దారిం బోవఁగనీక యడ్డు విహగేం • ద్రస్వామిఁ జక్కాడె లం
కారాజ్యంబునఁ గార నుంచె జనక • క్ష్మాపాల కన్యామణిన్.

మ॥ ఎలయింపం గమకించి దవ్వులకుఁ ద • న్నీడ్పించు మారీచు రా
ట్కులసింహుండగు విశిఖ • క్రూరాహతిం గూల్చి య
వ్వల వైదేహిని రోయుచున్ జనకుఁడౌ • పక్షీంద్రు వీక్షించి కొం
దలపాటొంది సమాచరించె వడి నౌ • ర్ధ్వ ప్రక్రియల్ భక్తిమై.

సీ॥ వదపడి సీతను • వెదకుచు దక్షిణ. దిశ కేగుదెంచుచుఁ • దివిరి పట్టు
వికృత రూపుఁ గబంధు • వికటశాపము మాన్పి. శబరి చేసిన యుప • చారములను

ప్రేమను గైకొని • యామె తెల్పిన త్రోవ, నిన సుతుఁ జేరి స్నే • హించి వాలి
వలనఁ గల్గిన దుఃఖ • ములఁ దీర్తునని యభ, యము దయచేసి సా • లములఁ గూల్చి

తే॥ వాలి వక్షంబు భేదించి • ప్లవగ రాజ్య, మును దినేంద్రసూతికిఁ బ్రేమ • మున నొసంగి
వానకాలంబు కడచు న • వ్వలను తోడు, వడఁగ రమ్మనిపంపె న • బ్జానుసుతుని.

సీ॥ గజుఁడును గవయుండు • గంధమాదనుఁడును, పనసుండు నీలుండు • వాలిసుతుఁడు
శరభుండు ఋషభుండు • శతబలి మైందుండు, ద్వివిద జాంబవదాది • వీరవరులు-
దెబ్బది వెల్లువల్ • ప్రబ్బిన సేనతో, వానకాలము దాఁటఁ • బ్లవగ విభుఁడు
వచ్చి యచ్చట నన్ని • వలఁకుల సీతను, వెదకు పద్ధతులను • విశదపఱచి

తే॥ నాల్గుభాగములుగాఁగ సై • న్యఁబుచేసి, యొక్కొక విభాగ మొక్కొక • దిక్కువెదకి
వడిగ నెలలోనఁ గ్రమ్మఱి • వచ్చునట్లు, కఠిన శాసన మొనరించి • కడఁక నంపె.

ఉ॥ అంగద జాంబవంతులు ర • యంబున దక్షిణదిక్కుచేరి న
న్నంగనఁ గాంచి రమ్మనఁగ • వంబుధి దాఁటితి లంకఁ జేరితిన్
రంగుగ సీతఁగాంచి రఘు • రాముని వార్తల విన్నవించి యా
సంగతి రామచంద్రునకుఁ • జక్కఁగఁ దెల్పితి నంత నందఱున్.

ఉ॥ దక్షిణవార్ధిఁ జేరుతఱిఁ, దక్కక రాముని శౌర్యసంపదల్
రాక్షసరాజుతోఁ దెలిపి • రామునికాంతను వీడకున్న వి
యక్షయ లక్ష్మి నాశమగు • నన్న విభీషణుఁ దిట్టి దానవా
ధ్యక్షుఁడు వెళ్ళఁగొట్ట నతఁ • డార్యుని జేరఁగవచ్చెఁ బ్రీతిమై.

శా॥ కాకుత్స్థుం డభయం బొసంగి వెస లం • కారాజ్య మవ్వేళనే
వీఁకం బట్టము గట్టి శాంతియుతుఁడై • వీరుండు ప్రార్థింపఁగా
నాకర్ణింపమి రోషభీషణ ముఖుం • డై చూడ సప్తాంబుధుల్
చీకాకై జలమింక మాఁడెను సుర • శ్రేష్ఠుల్ వితాకొందఁగన్.

ఆ॥ శరణు శరణమంచు • వరుణుండు ప్రార్థించెఁ, దరులు గిరులు ప్లవగ • వరులుదెచ్చి
వనధిఁబూడ్చి దనుజ • వరుని లంకనుచుట్టి, చేసినారు వీర • సింహరవము.

శా॥ కైలాసంబుఁ బెకల్చు బాహువులు ది • క్సారంగ శృంగంబు లా
భీల ప్రక్రియ నాటినట్టి యురమున్ • వీక్షైన శీర్షంబులున్
లీల న్నేలకు వ్రాల్చి వాని యనుజున్ • వేఁటాడి రాముండు ని
ర్మూలించెన్ దనుజాన్వయంబు ప్రమదం • బుం బొంద బృందారకుల్.

ఆ॥ దనుజ యువక వరులు • దనుజేంద్ర సుతులును, లక్ష్మణాస్త్రములకు • లక్ష్యమైరి
సంగరాంగణంబు • శవమయమయ్యెను, సురలు మునులు ముదము • చోద్యమంద.

ఆ॥ అమర సిద్ధ సాధ్య • యక్ష గంధర్వాదు, లెలమి సతులతోడ • నిలకు వచ్చి
వినతి నిలిచి బహుళ • వినుతులు చేసిరి, తొలఁగె లోకములకు • దొసఁగు లనుచు.

చ॥ అమరఁగ రావణాదులకు • నంతిమకార్యములెల్ల సద్విధి
క్రమమునఁ జల్పమం చసుర • కాంతు విభీషణు నంపి జానకీ
రమణిని కోపగించి యెదు • రన్ శుచినిల్పి పరీక్షచేసి కాం
తము వహియించె రాఘవుఁడు • ధాతృహహరేంద్రులు సంస్తుతింపఁగన్.

చ॥ అనదృశ సత్యవాక్యుఁడగు • నాటి విమానమునందు వచ్చి నం
తసమున మ్రొక్కు సూనులను • తత్పరతన్ బిగి కౌఁగిలించి మె
చ్చి సదలు మోదవారి నభి • షేకముచేసి విదేహకన్యకన్
గొపరని ప్రేమతోడఁ గయి • కొమ్మన రాముఁడు సమ్మతించుచున్.

ఉ॥ పెంచిన తల్లి కైకపయిఁ • బేరిమి నామె కుమారుపైని ము
న్నుంచిన నిష్కలంక లస • దుత్కట భావము నుంచ వేఁడెదన్
గొంచక యీవరమ్ము నొసఁ • గూర్పుమ యన్న నొసంగి సత్యస
త్త్వాంచితమూర్తి మీ జనకుఁ • డాదటఁ జేరె ముకుందలోకమున్.

చ॥ పదపడి వేల్పులున్ మనసు • పాటిన పెక్కువరంబులీయ దె
బ్బదియగు వెల్లువల్ దనుజ • బంధులు రాక్షస వీరనాథు ల
ర్వది యగు నేడుకోటు లల • రంగ విభీషణుఁ డిచ్చెఁ బుష్పకం
బదియచుమీ వియత్పథము • నందు జవంబున వచ్చుచుండెడిన్.

ఆ॥ నెమ్మి రాఘవుండు • నిన్ను దలంచుచుఁ, దమ్ముతోడ జనక • తనయతోడ
సకల హితులతోడఁ • జవి భరద్వాజుని, యాశ్రమ స్థలంబు • నందు చేర.

తే॥ ఆతఁ డాతిథ్య మీయంగ • ననువుపఱుప, నిన్నుగాంచి యీముద్రిక • నీకుఁ జూపి
యూఱడింపంగ నన్నంపె • నురవడి మెయి. రామచరిత మియ్యది మహా • రాజ తిలక!

మ॥ భరతుం డంతయు సావధానమతియై • పాటించి యాలించి ని
ర్భర మోదాద్భుత సంభ్రమంబు లెద నా • రం గూరి మల్లాడ నా
ఉర పాత్రుండయి యొక్క తమ్ముఁడు సమి • ద్ధాత్రిన్ సహాయుండుగా
వరసాహ్యంబు విసంగనోపితిని దా • ర్భాగ్యుండ నేవియ్యెడన్.

ఆ॥ అనుచుఁ బలికి భరతుఁ • డధిక నిర్వేదంబు, తోడఁ గాలినడక • తోడ హనుమ
తోడ నడచిచేరెఁ • దోయజాప్తుఁడు తొలి, గట్టు నెక్కుమున్నె • గంగ కడకు.

శా॥ ఘోరాకారుల రావణాదులను త్రె • క్కొల్చేసి యుద్యజ్జయ
శ్రీ రాజిల్లఁగ రాఘవుండు నగరిన్ • శ్రీదేవి భూదేవి త
న్నారాధింప మహోషికుఁడగు నం • చాసఁ దుఁదై పూర్వ ది
గ్వీథిం దంపిస కాన్కయో యనుఁ లిన్ • విభ్రాజిలెన్ భానుఁడున్.

మ॥ అకలంకుఁ డటఁ గాలకృత్యములు నొ • ప్పారంగఁ గావించి పా
దుకలన్ భక్తిని పూజచేసి షటి వా • తూలాత్మజుం గాంచి దై

త్యకులాహివ్రజ పక్షిరాజ! రవికీ జా! నీదు వాక్యావళుల్
వికటార్థంబును బొందగావగునె యీ విశ్వంభరన్ మారుతీ!

మ॥ కపిసైన్యంబులు దైత్యవాహినులసం ఖ్యాకంబులై వచ్చుచో
విపులక్షోణి భరింపలేక వెగడున్ వేపొంద ధూళివ్రజం
బుపరివ్యోమముఁ గప్పదే యలబలం బుద్వేలమై లేచి స
ప్త పయోరాసుల ఘోషణంబు పగిదిన్ వర్తిల్లదే పావనీ!

మ॥ పరివారంబులు విండియుండెను భర ద్వాజాశ్రమం బింక ద
వ్వరయన్ లేదు ప్రశాంతమై యమరునే యావీడుపట్టంతగా
బరువై నామది సంశయించెను జగ త్ప్రాత్మజా! జానకీ
శ్వరుఁ డెందుండెనొ తెల్పరాదె యనుడున్ సామీరి తానిట్లనున్.

మ॥ వ్రతసంపన్న! మునీశ్వరుండు సురలన్ బ్రార్థించి కల్పింప న
వ్వతిఁ బుష్పానవ కందమూల ఫల సం పత్తిం బ్రసేవించి నో
ర్లతిమాత్రంబుగ నార్పలేవి గశచే వట్లుండెఁ గాదేవి వి
ద్రితమై యుండఁగఁబోలు నిక్కమిది చిం తింపంగ నీకేటికిన్.

## గుహుఁడు రాముం గానవచ్చుట

ఉ॥ కన్నులపండువై తనరఁ గాంచెదు రామునిరాక నిప్పుడే
వన్నిగ నంచు సాంత్వనము పల్కఁగ వచ్చుట మౌళివిందు వా
ప్రన్నజవ ప్రసన్నమతి బాఁతిగ మిత్రులతోడఁ దృప్తిమైఁ
గొన్నతలిన్ గుహుండు కను గోఁ జనుదెంచెను గొప్ప సేవతో.

ఉ॥ వచ్చి మనంబు కన్నులును వాఁచిన పోల్కిని గాంచి కాంచి పై
విచ్చఁ బ్రదక్షిణించి రహి యించి పదంబుల వ్రాలి రాముఁడున్
గ్రుచ్చి కవుంగలించుకొని కూరిమి మీఱఁగ క్షేమవార్తలన్
మెచ్చుగఁ బల్కసేయ రము పీరుని చూచి గ్రుహుండు ప్రీతిమై.

ఉ॥ నాకక దాసుపై భవ దపార కృపారస దృష్టి గల్గుచో
దార సుతాదు లౌదురె యు దార హితుల్ వెనువెంటనంటి సే
వారతి నున్న లక్ష్మణుని భాగ్యము నోచని దుర్భగుండ నా
కారయ క్షేమసంపదల కంతముగల్గునె రాక్షసాంతకా!

మ॥ అని చింతించు గుహుం గనుంగొని ఘన శ్యాముండు రాముండు తొ
ల్లివ ప్రేమంబున నీవు నాభరతుకఁ బెన్ జూడ వేఱ య్యేదే
ఘన సౌఖ్యంబుల్ గల్గగాత మన నా కైవర్తకస్వామి భ
క్తిపి భూజానకు లక్ష్మణాఖ్యునకుఁ బ్రమొక్కెన్ వారు దీవింపఁగన్.

తే॥ గుహుని రవిసుతాదులకుఁ బె • స్గూర్చి(జూపి, యితఁడు మన స్నేహితుఁడు జీవ • హితుఁడ గాం
ధూములకువేఁడు గుహుఁడను • పుణ్యచరితుఁ, డనుచుఁ దెలుప నెల్లరు గొని • యాడిరతని.

క॥ ఎల్లరు నిష్టాగోష్ఠిగ, నుల్లాసంబునను గలిసి • యుండఁగ రవి రం
జిల్లెను పడమటికొండన్, పుల్లాబ్జాక్షుఁడు స్వకృత్య • ములఁ దీర్చికొనెన్.

తే॥ సీతతో రామచంద్రుండు • సెజ్జఁ జేరె, గుహుఁడు సౌమిత్రియును కపి • కోటి దనుజ
నికరమును పరివేష్టించి • నియతిసుండఁ, బెల్లు మాటల భల్లనఁ • దెల్లవారె.

శా॥ పంకేజాక్షుఁడు కాల్యకృత్యముల ని • ర్వర్తించి మౌనీంద్రు మో
దాంకంబైన యనుజ్ఞగైకొని విమా • నారూఢుఁడై యోగి వి
శ్శంక ప్రేమమయాంతరంగుఁడగుచున్ • సాగింప నెన్నంట నా
తంకంబేమియు లేక వెల్వడియె మి • త్రవ్రాతముల్ గొల్వఁగన్.

తే॥ పుష్పకంబు శీఘ్రంబుగఁ • బోవుచుండఁ, జందమైన శిల్పంబుల • నందమొంది
యింద్రపురి ధిక్కరించుచు • నెనఁగు స్వపుర, దుర్గ కుడ్యముల్ కనులకుఁ • దోఁచెదవియె.

తే॥ అనుఁగులంగని వర్ణింప • నలవికాని, యశమునొందిన సూర్యాన్వ • యాధిపతుల
రాజధాని కానఁగవచ్చె • రాజిలంగఁ, గాంచుఁడన లేచి కేల్మోడ్చి • కాంచినారు.

## భరతుఁడు శ్రీరామాదులం గాంచుట

తే॥ గగనమందు పెక్కురు దివా • కరులకాంతి, గలిగి వెలుఁగు విమానంబు • కానఁబడఁగ
నదిగొ వచ్చె రాఘవుఁడని • యాంజనేయుఁ, డలరి కేకలువైచి ప్ర • క్కలకుఁ జూచి.

క॥ కమలాక్షుఁడు కపిసేనయుఁ, గమలవదన లక్ష్మణుండు • కన్నులు తనియన్
బ్రమదమున నేగుదెంచిరి, తమిఁగనుమని చూపె భరత • ధాత్రీశునకున్.

ఆ॥ ఎల్లలోక వాసు • లెక్కనఁ జోటింత, యొనరునదియు సాటి • యొనరనిదియు
జిగి దిశాంతములకుఁ • జిమ్మునదియునైన, పుష్పకంబు గాంచె • భూరియశుఁడు.

తే॥ మేరు గుహను మెఱుముతోడి • మేఘభాతి, పుష్పకమున జానకితోడ • భూవరుండు
కావరాఁ గాంచె భరతుండు • కన్నవారి, కలకలము లేచి లంకను • కడచివచ్చె.

ఉ॥ స్నాయు వసా వికార మలి • నమ్మగు దేహము వీడి సత్యమున్
బాయక కోరి విష్ణు భువ • నంబు భజించిన తండ్రిఁ గాంచు నా
తోయమునొంది కానలకుఁ • దూలిన ప్రాణమువంటి యుల్లస
త్తోయజనేత్రుఁ గాంచె భర • తుండు కుతూహలియై రహించుచున్.

తే॥ దోవుపోయిన వస్తువు • దొరకినట్లు, వెతలు దొలఁగంగ సమ్మోద • వివశుఁడగుచు
భువనవంద్యునకుం గేలు • మోడ్పుఁ దలఁచి, భరతుఁడప్పుడు పావని • కరము వీడె.

క॥ హనుమంతుఁ డపుడు గగన, మ్మున వచ్చు విమానమునకు • మున్నుగఁ జని రా
మునకుఁ బ్రియమ్ముగ వందన, మొనరిచి యిట్లనియెఁ గ్రేవ • కొదిఁగి వినయముచున్.

ఆ॥ వహ్నిఁ బడఁగనున్న • భరతుని చేరి మీ, జాడ దెలిపి సాహ • సంబు మాన్పి
యెల్లరకును మోద • మొసఁగించితిని వారు, వచ్చి రనుడు ధాత్రి • వరుఁడు నలరి.

ఉ॥ మారుతి! దుర్భరంబులగు • మాయెదరుల్ బహుళంబులయ్యు నీ
వారని సత్కృపామతి ని • వారణచేసెను మాతపఃఫలం
బీ రహి నీస్వరూపమున • నేత్తెఱవచ్చి తొలంగఁదోలె నీ
పారము లేని మేలునకుఁ • బ్రత్యుపకార మొకండు కల్గునే?

చ॥ విరతము తోడునీడయగు • విన్నను నాతలిదండ్రులం గృపా
శరధిని లక్ష్మణున్ భరతుఁ • జయ్యన నొక్కొకమాటలోనఁ ద
ద్గురుగుణ సంపదల్ దెలుపఁ • గూడునె? సన్నుతశీల! దానవ
ద్విరద మృగేంద్ర! మేరు సమ • ధీర! మదీయ తపఃఫలాకృతీ!

తే॥ ప్రథితగుణుఁడు రాఘవుఁ డిట్లు • పలుకుచుండఁ, బాదుకలఁ దలఁదాల్చిన • పావనుండు
వ్రతములం గృశియించిన • వాఁడు కేలు, మోడ్పుగలవాఁడు భరతుఁడు • మొనసి దాపె.

తే॥ తల్లి గుణములకుం బగ • దాయ కోస, లమ్మనేలిన యేలిక • తమ్ముగుట్ట
వచ్చెఁ గనుమని చూపె శ్రీ • వల్లభునకు, ధర్మములకెల్ల సాక్షిగాఁ • దనరు హనుమ

క॥ కాంచి న రాముఁడు దశరథుఁ, గాంచిన తఱినొందు కౌతు • కంబును బొందెన్
మించి తన మేను పులకల, నించెన్ గనుదోయి జలము • నించెను తోడ్తోన్.

క॥ కాంచెద జనులఁ బౌరుల, సంచితులన్ గురుల బాంధ • వావలినెల్లన్
గాంచెదఁగాకని మనమున, నెంచిన యంతన విమాన • మిలకుం దిగియెన్.

క॥ క్రిందికి దిగిన విమానం, బందఱుకును పుణ్యఫలము • లందింపంగా
బృందారక లోకమునకు, నొందం గొని చను విమాన • మోయన నొప్పెన్.

సీ॥ ఎడపడియున్న క్రే • పెనయ గోవును డాయు, వలనుగాఁ గన్నత • ల్లులకు నొప్పె
మాయనీఁగిన వారి • మనము లయించు జ్యో, తీరూపమునఁ దప • స్వితుల కొప్పె
వ్యాధిచే నీఁగిన • ప్రాణముల్ మరల వ, చ్చినపోల్కి కోసల • జనుల కొప్పెఁ
గన్నవారలకెల్లఁ • గన్నతల్లిగ నొప్పె, మగువలకు మధువు • పగిది నొప్పె

తే॥ భరత శత్రుఘ్నులకుఁ గను • పాపలట్లు, ప్రేమగలవారలకు సురా • మృతము కరణి
నొప్పె నప్పుడు తమపిడి • యున్న రామ, భద్రు నాగమనము కను • పండు వగుచు.

ఉ॥ రాముఁడె జీవమై తనరు • రాజ్యమునందు నయోధ్యయందు రా
మామణులున్ జనంబులును • మానిత శుద్ధ మనోజ్ఞ భావ సు
స్థేమము నొందినారు సుర • సేవ్యుని రాకను హేమపుత్త్రికా
స్తోమము జీవ మొందుక్రియ • నోభిలినారు ముదంబు పెంపునన్.

తే॥ చందనము గంధ మౌదియుఁ బుష్పములు వెన్న, తురగ ఫేనంబు గజమద తోయములును
మోద బాష్పముల్ గలిసి న • మ్ముద్రజలము, పగిది నుప్పొంగెఁ బ్రవహించె • వనధిఁ జేర.

చ॥ ధరణికి దిగ్గఁ బుష్పకము • తల్లులు తమ్ము లరుంధతీవిభుం
డరవుగ నెక్కినంతఁ బురు • షోత్తముఁ డప్డు వసిష్ఠు పాద పం
కరుహములంటి మ్రొక్కఁ దమ • కంబున నాతఁడు లేవనెత్తి యా
దరమునఁ బెక్కుమార్లు తన • వందనముం బొనరింప దీవనల్

చ॥ పదపడి లక్ష్మణుండు పద • వందనముం బొనరింప దీవనల్
ముదమునఁ జేయుచున్ శిరము • మూర్కొనె జానకి వచ్చి మ్రొక్కఁగా
సదయుఁడు సర్వసౌఖ్యము లె • సంగుతమంచు వచించెఁ బ్రీతి గ
ద్గదిక రవంబుతోడఁ బు ల • కమ్ములకుం గులకమ్ముగా నొడల్.

మ॥ తొలుతన్ రాముఁడు కైకయంప్రముఖులకు సం • తోషంబుతో మ్రొక్కి య
వ్వేలఁ దక్కంగల తల్లులం దెలవ న • వ్వారల్ మహోత్కంఠతోఁ
బలుమాఱుల్ తల మూరుకొంచుఁ దనువున్ • బాఢంబుగా దువ్వుచున్
జెలఁగన్ మోద జలాభిషేచనము తు • ష్టింజేసి రప్పట్టునన్.

మ॥ పొలుపొం[illegible]న్ ధరణీ తనూజయు యథా • పూర్వంబుగా వారికిం
దెలవన్ మా కులదీపమంచుఁ బొదువన్ • దీవించి రావెన్కఁ ద
ల్లులకున్ లక్ష్మణుఁ డర్థి మ్రొక్కఁ దనువుల్ • పూరిలవ నొక్కండవే
జలజాక్షేక్షణు తమ్ముఁడైతివని రా • [illegible]ంసించి దీవించుచున్.

సీ॥ పాదుకలను తన • భక్తివి గానుక, గా [illegible]ర్పించి త • ద్ఘన పదముల
వ్రాలిన భరతుని • పోలంగఁ గవి రామ, విభుఁడు మిక్కుటమగు • వెత గడించి
నాల్కయెండఁగ నొక్క • పల్కైన పలియింప, నేరక పిచ్చొలు • నిలిచి తనువు
ప్రాణంబు లొకటగు • పగిది బిగ్గఁ గవుంగి, లించి మిక్కిలి పల • వించి సోలి

తే॥ యశ్రుధారల షేంత సౌ • ఁదఁగఁ దిడుచు, గట్టి దూ[illegible] ద్రిమ్మప బదల్ • వట్టితడవి
శిరము మూర్కొని క్రేపును • చేరు మొదవు, చందమునమండెఁ బనియత • చాలతడవు.

చ॥ వినుత మహేంద్ర భోగ పద • విం దృణకల్పముగాఁ ద్యజించి ప
మ్మునివరవేష చర్యలను • పూని యశంబు గడించు తత్పవి
త్రుని చరణాంబుజంబులకు • మ్రొక్కెను భక్తిని లక్ష్మణుఁడు త
ద్ఘన పదరేణువుల్ శిరముఁ • దాఁకి పవిత్రత గూర్ప నాయ్యనన్.

చ॥ వనముల నగ్రజన్ము పద • వారిజముల్ బిజీయింపఁ దోడుగాఁ
జని శ్రమకోర్చి నిద్రయును • చక్కియఁ జేరఁగ నీక త్రోచి జీ
వనముల నప్పగించి పని • వాడిన మేనిని దీర్ఘ బాహులం
దనువుగఁ గౌఁగిలించె భర • తాఖ్యుఁడు దేహము పావనంబుగాన్.

మ॥ దురితధ్వంసియుఁ బిన్నతమ్ముఁడగు శ • త్రుఘ్నుండు సీతాహృది
శ్వర సౌమిత్రుల పాదపద్మములు శీ • ర్షంబంటఁగా మ్రొక్కి వా
రరుదౌ ప్రేమను కౌఁగిలించికొని • మి శ్రాసంబులం జార్చి, ని
ర్భర మోదంబున నల్వురుం బొదలి రా • ర్ద్రింబైన చిత్తంబులన్.

మ॥ జనకక్ష్మావిభు పుత్రికిన్ • భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్ మ్రొక్కఁగాఁ
దను దావచ్చిన శీర్షకంబు తొలఁగం •దాటించు శీర్షంబు నె
ట్టన ముల్లోకములం జయించు దనుజా • ధ్య ప్రార్థనం దోచు కా
ళ్లు నాకొండొండు స్పృశించి పావనత పొ • ల్పుంబొందె ధన్యంబులై,

చ॥ విమలుల సూర్యపుత్రక వి • భీషణ జాంబవ దంగదాదులన్
క్రమముగఁ జూప వారలు భ • రంబగుభక్తి నమస్కరించి రా
సుమహితచిత్తులన్ దనుజ • సూదను తమ్ములు ప్రేమ మీఱఁగా
సముచిత రీతులం దనియ • సత్కృతులం బొనరించి రత్తఱిన్,

చ॥ సచివులు దండనాథులును • సంగడిరాజులు రాసుమంత్రకుం
డచటికివచ్చి సమ్మదము • నంగద పోరొనరింప మ్రొక్కి యీ
యచలకు భారమై తొదరు • నాపద లేదిఁక నంచుఁ బల్కఁగా
నుచిత విధమ్మున న్నరవ • రోత్తముఁ డాదృతిఁ గాంచె వారలన్

క॥ సేనలెల్ల వచ్చి • సేవింపనందఱుఁ, బుష్పకంబులోనఁ •బొలుపుమీఱ
నిలువుఁడనఁగ వచ్చి • నిలిచి లక్ష్మణునకు, భూదేవి సుతకు • మ్రొక్కినారు.

చ॥ విరుల సరంబు లెల్లెడల • వ్రేలు విమానము చూడఁ బంకజో
దరు నుదరంబొ వార్ధి యమృ • తంబులఁగ్రోలు నగస్త్యు దొడ్డయా
కరతలమో సమానమగుఁ • గాదని ఖేచరు లబ్బమందుచున్
విరులను చల్లినారు రఘు • వీరుని కీరితి నుగ్గడించుచున్.

సీ॥ భేరి రావములు శం• ఖారావములు బ్రాహ్మ, ణాశీరవంబు గ• ణాశ్వరవము
కాహళధ్వనులు మం•గళ నినాదంబులు, భూనభోంతరములు•బోరు కలఁగ
నంబుధి ఘోషంబు•దంబు విడంబించి, లేఖుల రవముతో • లీనమయ్యె
మహిత విమానంబు • రహిలేచి యటనుండి, సాకేతపథమున• సాగుచుండి

తే॥ యవనిలోదను భూజను•లమరపురికిఁ, గదలు పగిది శత్రుండు స్వ•ర్గంబుతోడ
నిలకు వచ్చుచందంబున• నెనసి వెలసి, పొలుపుతోడ నంది్రగామ•మునకువచ్చె.

## —। 38. శ్రీరామ పట్టాభిషేక పటలము ।—

మ॥ స్థిరసీలుండగు రామచంద్రముఁడు నం • దిగ్రామమునంజేరి ము
స్నురవై యున్న జటాభరంబు లట నా • యుష్కర్మచె నూడ్చి భూ

వర పేషోచిత మందసంబు లిరవొ • ప్పందాల్చి రత్నద్యుతిన్
బురుహూతుంబలెఁ బొల్చెఁ దమ్ము లసదృభూషాలిచే శోభిలన్.
శా॥ ఆకాశస్థలి సంటి నిక్కు ధ్వజ ప • స్త్రాంచ త్కురాబ్జంబులన్
సాకేతంబున కేగుచేందనుచు నా • నంబిల్చు చందాన న
స్తోక ప్రాభవ మండిత ప్రభలతో • శోభిల్లు స్వాయోధ్యకుఁ
శ్రీకంఠాఖుఁడు చేరనెక్కె రథమున్ • శ్వేతాశ్వ సంయుక్తమున్.
తే॥ కొమరుగాలక్ష్మణుఁడు తెల్ల • గొడుగుసూనఁ, జామరంబు శత్రుఘ్నుండు•చాఁచివీవ
దివిరి భరతుడు బంగారు • తేరు దోల, సుత్సుకుండయి రాముఁ డ•యోధ్యకేగె.
ఉ॥ వానరనాథుఁడున్ దనుజ • వర్యుడు భద్ర గజాలమీఁద న
మ్మానిత రీతి నెక్కి యిరు • మైఁ జనుదేరఁగ నంగదుం డనం
త్యాన జనంబు సందడుల • నారఁగబాపుచు ముందుపో హనూ
మానుఁడు వెంబడించెను స•ముంచితభక్తి భజించి కాల్నడన్.
చ॥ సమధిక గౌరవంబులరు • స్థానములైన మనుష్యరూపముల్
ప్రమదముతోడఁ గైకొని • సు వాసిత చందన గంధ ఘుంఘుమల్
రమియఁగ వానరుల్ హరుల • గంధగజంబుల మీఁదనెక్కి న
క్రమముగ ముందు వెన్కలను • ప్రక్కల నేగుచునుండి రాయ్యనన్
చ॥ ద్విరదములన్ బసింది మణి • తేరులఁ దేజుల నెక్కి ఛత్ర చా
మర విభవంబుతోడ నృప • మాన్య కిరీటముతోడ నొప్ప భూ
వరు లసముండ్రు వంద్రుగురు • భక్తిని నూరెలనిల్చి కొల్చుచున్
సరస మృదూక్తులన్ హిత య • శస్కర వార్తలఁ బల్కు చుండఁగన్.
చ॥ కపిసుల కామినుల్ విబుధ • కాంతల రూపము లొంది నిశ్చల
చ్చపలలభంగి హస్తినులఁ • జక్కని గోషిగ లెక్కి చుట్టి రా
విపులకుమారి రిక్కగమి • వెల్గునిశాకర బింబమో యనన్
దిపురులు గట్టు కాంతులను • తేజిలి యేగె విమానమందునన్.
చ॥ ఖచరులు మౌనులుం బరమ • కౌతుకమంచఁ బ్రసూన వర్షమున్
బ్రమరము గాఁగఁ జింద ధర • స్వర్ణ లతాంత మయంబ యౌట నా
యచల వసుందరాఖ్య యట • సార్థకమై తనరారె రాట్కృపా
విచలిత దృష్టి హేమమయ • వృష్టిఁ బ్రపాతమొనర్చె నిట్లనన్.
ఉ॥ వెన్నెల కాలమందొనరు • వీత జలంబగు వారిదంబు నా
నెన్నఁగ నిన్నినాళ్ళు మద • మింతయుఁ గార్చని వారణావళుల్
మన్నని రాకఁగాంచి తమ • ముక్కువ లోపల నిల్వజాలమిన్
బ్రన్ననఁ ద్రోచికొంచు వెలి • వచ్చెనొకో యనఁ గార్చె సత్తటిన్.

ఉ॥ మూఁగలు మాటలాడుక్రియఁ • బోఁడిమి హేషలొనర్చె వార్వముల్
బాగుగఁ బుష్పవాటికలు • పల్లవితంబులు పుష్పితంబులై
మేఁగెను పువ్వుఁబోండ్ల యెల • మేనులు బంగరు రంగుమీఱె రా
మాగమ మొప్పె ధాత్రిని చ • రాచర కోటికి మోద దాయియై.

ఉ॥ రాజ్యము నేలఁగా దగిన • రాముఁడయోధ్యను చేరి తల్లులన్
బూజ్యుల మ్రొక్కి వేల్పులకుఁ • బూజలొనర్చి వసిష్ఠు నాజ్ఞమైఁ
బ్రాజ్య ధరాధిదేవియును • పద్మ నివాసిని యుల్లసిల్లఁగా
భోజ్యపదాస్పదంబైన • భూపతి హర్మ్యముఁ గాంచె నయ్యెడన్.

చ॥ వలువలు వీడఁ జూడకయు • భామలు ధీరులు జాఱుచున్న దు
వ్వలువల మాటిమాటికిని • వారక వీడక చెక్కికొంచు మే
నులు గమనింపనైరి తమి • నూల్కొన నాసవమాని చొక్కుచున్
వలువలు జాఱగా జరగు • బాగున నొచ్చిరి చూచువేడుకన్.

ఉ॥ తొందరచే భుజిష్యకల • దువ్వలువల్ నృపతుల్ ధరించుచున్
జందన గంధు లుద్భుతెలి • చల్వలు పూరిషరాజి తాల్చుచున్
గ్రందుగనున్న గుంపునఁ జొ • రం గలపంబు లలంచకున్న నం
దందొరయంగ నిమ్మడిగ • నందెశరీరము లా జనావలిన్.

ఉ॥ రామవియోగమైన తటి • రాపులు మోచ పిహీనలై సదా
నోములు నోచుచుం బతి వి • నోదము లొందకయుండు వారలున్
రాముని రాకతో శుభ క • రంబగు భూషఁచేత మేనులన్
భామలు దాఁచినారు తమ • ఫర్తం చిత్తము పల్లవింపగన్

తే॥ సురకలాపంబుతో మను • జుల కలాప, మొనసి రాముచే నరవే • తరుణులకును
పతులు దాసిన తఱినొక • కతము కనని యలుక, హొవమె ఫర్తంద్రుఁడు • యుకమరెకను.

చ॥ భరతుని గాంచి రాఘవుఁడు • హెవనిలుపె నూర్యపుత్త్రుఁ గ
ర్భురపతిఁ దక్కువారలను • మోదముతోఁ గొనిపోయి యుండు చి
త్రరువులఁ జిత్రదృశ్యములఁ • దన్పుగఁ జూపుమనంగ నాతఁ డ
త్యురుతర గౌరవంబున ను • హోత్సుకరన్ గొనిపోయె లోనికిన్.

: సుగ్రీవాదులు నగరునందలి చిత్రదృశ్యము లంగాంచుట :—

తే॥ మిత్రవర్గంబుఁ వెంటరా • మిహిరకులుఁడు, పెక్కు కక్ష్యలు దాఁటి గం • భీరమగుచు
మేరువుంబోలె విలసిల్లి • శ్రీరహించు, సద్మమైన ప్రద్యోతంబు/ సరగఁ జొచ్చె.

చ॥ రవిజ విభీషణాదులు న్ను • రత్న మయూఖచయంబు లెల్లెడన్
బవిమలకాంతులన్ వివిధ • భంగులఁ జిమ్ముటచే భయంబునం

దవిలి మనంబు భావములు । తత్తఱిలం దడఁబాటు నివ్వెరన్
మిపుల భజించి మేడుపడి । మేగలి తెప్పల నార్పరై రటన్.

చ॥ హరియురమందు రాజిలు మ । హామణియట్లు వెలుంగు సౌధమున్
వెరగొని కాంచి యెవ్వరిది । వేడ్క సృజించిరొ తెల్పవే యనన్
భరతుడు దుష్టితంత్రికిఁ ద । పఃఫలమైచన మున్ను మెప్పునన్
సరసిజ సంభవుం డొసఁగు । సౌధ వరం బిది నాఁగ వారలున్.

తే॥ కమలవాసిని కిది మేటి । కాణయాచి, వర్ణనము సేయ మాబోఁటి । వారు వలఁతు
లగుదురే? యని కేల్మోడ్చి। యవలనున్న, మండపము చూడఁ బోయిరి। మందగతుల.

తే॥ రావణానుజాదులు సౌధ । రాజ మహిమ, వినుతిసేయుచు నుండఁగ । నినసుతుండు
శ్రీరఘూత్తము పట్టాభి । షేక దినము, సరయకుండు దెలొకొయని । భరతునడిగె.

తే॥ వార్ధుల జలంబు బహుపుణ్య । తీర్థజలము, వచ్చి చేరుట యొకనాఁటి । పనియె యనుచు
భరతుఁడాడఁ గపీంద్రుండు । వాయుపుత్త్రు, మోము గాంచునంత నతండు । భూమిదాఁటె.

తే॥ కులగురుని తక్క ఋషులను। పిలువుమనుచు, భరతుఁడనఁగ సుమంత్రుండు। నరగనేగి.
శిష్య మిత్రబృందములతో వ। సిష్టుదోఁడ, బిలుచుకొనివచ్చెఁ దత్సభా । నిలయమునకు.

శా॥ భక్తిం గైకసుతుండు మౌనికి నమో । వాకంబు లర్పింప న
స్మత్తుం డమ్ముని ప్రేమమైఁ దిరముగా । భూదేవి శ్రీదేవియున్
రక్షింజెంద మహేంద్రుచందమున శ్రీ । రాముండు పట్టంబు నం
సక్తిం బొందఁగ రేపె గల్గు శుభ మా । సాధించు లగ్నంబనన్.

క॥ సురగురుదినములొ తాపస, వరులును రామాభిషేక । భాస్వల్లగ్నం
బిరవుగ స్వర్ణాక్షరముల, విరచించిరి లేఖ లపుని । విభులకు నంపన్.

క। మూరలు త్రిలోకవాసుల, కాతతమతిఁ దెల్ప వినిన । యంపఁబు నిలువం
జేతము లొల్లమి వచ్చిరి, ప్రీతిన్ వారలను దెక్క । పెట్టగ వశమే?

తే॥ అల వసిష్ఠుతో భరతుఁడు । నర్కసుతుఁడు, రావణానుజుఁ డంగదప్రముఖ నిఖిల
దనుజ భల్లూక వానర । మనుజవరులు, కలిసి శ్రీరాము నొద్దకుఁ । గడఁకఁ జనిరి.

క॥ పట్టాభిషేకమునకున్, నెట్టన శుభదినము రేపె। నియమిత విధులన్
బట్టుగఁ జేయుము దశరథు, పట్టీ! యని గురుఁడు తనదు । సదనము చేరెన్.

క॥ నలువ పనుప మయుఁడు శుభా, కలనమునకు రాఘవేంద్రు । గౌరవమునకున్
వలసినలలి లోకోత్తర, లలిత చతుర మండపం బ । లంకృతిసేసెన్.

ఆ॥ సప్తసాగరముల । జలములు పుణ్యతీ, ర్థముల జలముఁ దెచ్చి । తగినచోట్లఁ
బవన తనయుఁడుంచె । బంధుర పద్ధతి, నంచ ఋరని వెఱఁగె। నందుకొనఁగ.

తే॥ కువలయేశులు తెల్లని। గొడుగుతోడ, భద్రకరులపై రత్నపుం । ముంలనునిచి
వివిధ వాద్యధ్వనులు రేఁగి। విస్తరింప, సరయు జలములఁ దెచ్చిరి। సరభసమున.

తే॥ వజ్రపాదముల్ మాణిక్య । ఫలక మమరు, పసిఁడి గద్దె స్ఫటికమండ। పమున నొనర
నుంచి రందుపై భుజకీర్తు । లుల్లసిల్ల, బాహులు వెలుంగ సీతతోఁ । ప్రభుఁడుచేరె.

। రాముఁడు పట్టాభిషిక్తుఁడగుట ।

సీ॥ మంగళగీతంబు । లంగు చెలంగ వేద ధ్వనులలర చిం । దంబు లదర
బహువిధ వాద్యముల్ । ప్రబలంగఁ దాళ మృ, దంగ రావములుదా । త్తతఁ జెలంగ
సురలు క్రొవ్విరుల నా । త్తరముగఁ గురియంగ, మొదటి వేలుపు మొట్ట మొదట వచ్చి
యభిషేక మొనరించె । నవ్వలఁ బశుపతి, మౌనులు విప్రులు। మంత్రి వరులు
తే॥ పౌరవృద్ధులు కపిరాజు । వాయుజుఁడు వి, భీషణుండు మున్నగువారు । పెరిమతోడ
వచ్చి యభిషేక కార్యంబు । వాంఛితార్థ, సిద్ధిగాఁగ రాఘవునకుఁ । జేసినారు.

శా॥ ఆనాఁ డొక్క పదంబునే కడుగ ది । వ్యాంభఃప్రసారం బుమా
ధీసుం డెక్కువ మక్కువం గొనుచు నె । త్తిం దాల్చె నా బ్రహ్మయే
యీనాఁ డంగము పూర్తిగాఁ గడుగఁగా । నీసార మేచోట నే
శానుం డాదటఁ దాల్చునో యనుచుఁ గాం । క్షం జూచి రింద్రామరుల్.

చ॥ మరకత పర్వతం బొకటి । మానుగఁ దోయజరాజిఁ బూచి పెం
పరఁగలనాని రెండుకను । దమ్ములు వీనుల నంటుచుండ నా
స్ఫురదసి నెమ్మితోఁ జెలఁగు నోజ భజించిన రాము సుస్మిత
స్ఫురదురు రూపముం గనిన పుణ్యులు త్రెంచిరి బంధ పాశముల్.

మ॥ అభిషేక క్రియలెల్ల సక్రమముగా । నారన్ మహాప్రేమ తో
లభులై మౌనులు తోడ్పడన్ బసులు చా । లుణ్ణ మూలగా బ్రహ్మ స
న్నిభుఁడౌ శిష్ఠ వసిష్ఠ మౌని జరుపన్ । నించెన్ సుమంత్రుండు గో
త్రభిదుం గొల్చి యొసంగు కల్పకమునా । ద్రవ్యంబు లవ్వేళకున్.

సీ॥ శ్రీరామ పాదుకా । సేవాభి నిరతుండు, భరతుండు ఛత్రంబుఁ । బట్టినిలువ
సౌభ్రాత్ర నిధులు ల । క్ష్మణుఁడు శత్రుఘ్నుండు, వినతులై చామరల్ । వీచుచుండ
నిత్యానపాయిని । నిఖిల జగన్మాత, సీత వామాంక సం । స్థితిరహింప
శ్రీరామ ముద్రికా । చిత్త సంధాయని, పావని పదపీఠ । మై రహింప
తే॥ హరి నిశాచర సామంత । వరులు బలసి, రామకృత విక్రమములు కీ । ర్తనము సలుప
కొలువ రాముఁడు సకల స । ద్గుణ గణాఢి, రాముఁ డవ్వేళఁ బట్టాభి । రాముడయ్యె.

ఉ॥ శ్రీలను భూమియుం జెలఁగు । శ్రేష్ఠభుజుండగు రాఘవుండు సం
శ్రేయము లుల్లసిల్లఁ గ *వ । సిష్ఠుఁడు దీవనతోడ నుంచు నొ

* తిరువెణ్ణెయి నెల్లూరు జటవ్ప వంశీయులగు పూర్వు లందియఁ గైకొని పట్టాభిషేకరత్న
కిరీటము శ్రీరాముని శిరసున నుంచెనని మూలము.

ధ్యాయుల గణ్య శీఘ్రమున । భవ్య ముహూర్తమునందు భద్ర సం
ధాయి ధరించె లోకము లు । దార ముదంబునఁ బేలియాడఁగన్,

ఉ॥ శ్రీసుసుట మ్మలయోధ్యను వ । సిష్ఠుఁడు మిక్కిలిచుండు మకుటవన్
రాము శిరమ్మునందు ముసుప । రంజిలి మూఁడు జగంబులందు ని
ద్రా మది నల్ల దీపులదుఁ । దత్పరతం దమ నెత్తిమీఁద ను
ద్దామముగాఁగ నుంచిన ని । ధమ్మునఁ బమ్మె ముదమ్ము సొమ్ముగన్.

ఉ॥ నోములు చాలకాలముగ । నోచి పదంబడి కోరి యొందు ను
ద్దాము నెదఁ వియోగపడి । తాపము చెంది కృశించి విమ్మటన్
నేమము నొందు భారణి వి । శిష్టుని రాముని డాసినంతనే
ప్రేమను దీర్ఘబాహువుల బిగ్గఁ గవుంగిలిఁ జేర్చె వేడ్కమై,

తే॥ శాస్త్రవిధిని వసిష్ఠుఁడు తెల్పు । సరణి రామవిభుఁడు భరతుని శిరమున । విమల మకుట
మారనిడి పాలనవిధంబు । లప్పుఁజెప్పి, లీల నిత్యసుఖములఁ దాఁ । దేలుచుండె,

## 39. వీడుకోలు పటలము

తే॥ భూమిజేవితోఁ దొనవగు భూరిరత్న, ఖచిత హేమ మంటపమున । నుచిత పీ
ఠంబు మెఱుపుప మేఘంబు । చెందినట్లు, జానకీ రామచంద్రు । లాసీనులైరి.

తే॥ పూర్వగిరి మీఁది రవివలె । ముకుటమలర, మెఱుపు కరణిముక్తాహార । ముఱిది వెలుఁగ
భువన తాపనదాయి జీ । మూత భాతి, సింహపీఠపై వెలసెను । శ్రీకరుండు.

తే॥ మరకతాద్రిపై వెన్నెల । మాడ్కి చెలుల, కరములందలి వెల్ల చా । మరలు కదల
నమర [illegible]గ విద్యాధర । యక్ష సిద్ధ, సాధ్య గంధర్వగణములు । సన్నుతింప.

చ॥ వింతను గల్గు నెమ్మనరు । తియ్యని జాబిలి లేత వెన్నెలల్
నిలుకడగ మించుచున్న చలి । చీకటి గొంగ దినక్రమంబునన్
బోలుపర రావణాద్యసుర । ముఖ్యవినాశక కీర్తి రూపమున్
చెలువగు వెల్లిమల్లి విల । సిల్లి శిరంబుపయిన్ రహింపఁగన్.

ఉ॥ మంగళ గీతముల్ చెలఁగ । మాన్యుల దీవన లెచ్చిరిల్లఁ ద
న్వంగులు పాట పాడుచు ర । సానుగుణంబుగ నర్తిలంగ ని
స్సంగులు నుల్లసిల్ల గుణ । సంగులు మోదమునొంద వాద్యముల్
రంగుగ మ్రోఁగఁ గాహళ వి । రావము పై పయి మిన్ను ముట్టఁగన్.

చ॥ రవిసుతుఁడు నిగ్గిలన్ వెలుఁగు । రత్న కిరీట విభాసులైన మా
నవపతులెల్ల వచ్చి తమ । నవ్య కిరీట చిరత్న రత్న ప
ల్లవ రుచు లంఘ్రి పంకజ వి లాస వికాసము వన్నె చిన్నెలం
దవిలి విలక్షణంబగు వి । ధంబున మా[illegible] మ్రొక్కుచుండగన్.

చ॥ సచివులు చేరికంగొలువ । సైన్యపతుల్ జయ శబ్దముల్ వచిం
చుచు వినుతింపఁ దమ్ములును । నూరెల నుండఁగ వందిమాగధుల్
రుచిరముగా యశోర్థి లహ । రుల్ విజయాంక వినూత్న గీతికా
ప్రచయముతో నుతింపఁ జెలు । వల్ పఠియింపఁగ మంగళ స్తుతుల్.

క॥ నృపవరులు దనుజవరులుం, గపివరులును పౌరవరులు । కై వారంబుల్
నిపుణత నొనరింపఁగ రహి, విపంచికల వైణికులు ప్ర । వీణతచూపన్.

తే॥ దినకరసుతుండు దానవా । ధీశ్వరుండు, డాసి సేవించి వహి నుచి । తాసనములఁ
గూరుచుండ రాముఁడు నిండు । కొలువుసేయు, చుండు తఱివచ్చె గుహుఁడు సే ।
వోత్కమతిని.

తే॥ పులి కళాసంబు దట్టిగాఁ । బూని కత్తి, నడుమునంజెక్కి నావిక । నాయకుండు
పరిజనంబుతో వచ్చి శ్రీ । వరుఁ బ్రదక్షి, ణించి సేవించి యొకవంక । నిలిచె నొదిఁగి.

క॥ కరుణామయుడగు శ్రీరఘు, వరుఁడు తనదిటంపుఁ బ్రేమ । వారలపై సుం
దర సుస్మితవిధిఁ జూపుచు, నురుపుగఁ బలుకాడి యొసఁగె । నుచితాసనముల్.

తే॥ సత్ప్రవర్తనమున గురు । జ్ఞానులైన, వార లుచిత వాక్యజ్ఞులు । ధీరవరులు
నిఖిల కళలఁ బ్రవీణులు । నీరజాక్షుఁ, గొలిచి తమ తమ నేర్పుల । వెలువరింప.

క॥ నరపతులును తక్కిన వన, చరపతులును దనుజపతులు । నరసిజనేత్రున్
స్థిరభక్తిఁ గొలిచి యెఱుఁగక, జరపిరి తెలికగ వేడ్క । జనరెండు నెలల్.

ఉ॥ కారణజన్ముఁడైన రఘు । రాంతుఁడు లోకము సంతసింప నీ
తీరున గద్దెపైఁ గొలువు । చేసి ప్రియంబున వచ్చియున్న య
వ్వారల గారవించి వను । వం దలపోసి పశువ్రజంబు బం
గారము క్షేత్రముల్ మణి । నికాయ మొసంగెను విప్రకోటికిన్.

క॥ వలసినవి వలసిసంతగ, వలచిన యాచకజనంబు । పరిమోదమునం
జెలఁగ నొసఁగె పదవడి భూ, పులపమ్మని కోరె రాఘ । వుఁడు ప్రియమారన్.

క॥ హరులును శిబికలు తేరులు. కరులును మాన్యములు రత్న । కాంచన భూషాం
బరము లవారిగఁ గాన్కగఁ, బెరిమను మన్నించి విదప । వీడ్కొలొసఁగెన్.

క॥ శంబర మర్దనునకుఁ దా, నింబుగ జనియించు వేళ । నింద్రుఁ డొసఁగు ర
త్నంబుల కడెములతోఁ జీ, నాంబర తురగాదు లొసఁగె । నర్క సుతునకున్.

క॥ మును కపులానునుఁ డిష్వా, కున కొసఁగిన యంగదములఁ । గొమరుగఁ దన పే
రును సార్థపఱుప నెంచెనొ, యునగ నొసఁగె నంగదునకు । నధికప్రేమన్.

క॥ మఱియును ముక్తాహారము, కరి తురగ స్యందనములు । కనకాంబరముల్
కరుణించి విన్నతంద్రికి, నిరవుగఁ దోడగుమ యెల్ల । యిమ్ముల ననియెన్.

మ॥ ప్రియమారంగఁ గటాక్ష వీక్షణములన్ । వీక్షించి సామీరి న

వ్యయసాహాయ్యమొనర్చినట్టి ఘను లెవ్వారయ్యా నీకేవఁ నే
డియుఁగన్పింపదు నీకుఁ బ్రత్యుపకృతిం। దిట్టంబుగాఁ జేయ న
క్షయకీర్తీ! నను గౌఁగిలించికొనుమా। గాటంబుగా మారుతీ!

శా॥ మాదేహంబులు నీయవే యనుడు। కైమాటించి వామాని నీ
యాదేశంబె యుపాయనంబు మఱి యా। లాఁ బిడ్డలాఁ నాకు నీ
పాద ద్వంద్వమె చాలునన్న రఘు। భూపాలుండు కేయూర హా
రాదుల్ దువ్వలువల్ మతంగజ తురం। గాఢ్యంబు లర్పించుచున్.

మ॥ తలిరుంబోఁడి కనర్ఘమైన యొక ము। క్తాదామ మిప్పించి యిం
దుల నెవ్వాని కొసంగ నీమనము సం। తోషించు నవ్వానికే
లలి నీయందగు దీవనను దన మనఃక్లాంతిం బ్రమార్జించు క
ర్వలి పట్టింగని యిచ్చె జానకి దయా। ర్ద్రి స్వాంతయై గ్రక్కునన్.

క॥ రిక్కల కాంతులఁ బైకొని, రిక్కల రాయనికి నుపమ। రీతిజెలఁగుచున్
వాక్కాంత యొసఁగు నానర, మొక్కఁడు గాకెక్కుఁ డొసఁగె। నురు భూషణము

క॥ కటకములు హారములు దు, వ్వటములు కేయూరములును। పటుతురగ మదో
త్కటకరుల సరపముల ను, ద్భటవీరుని నలుని పిలిచి। పార్థివుఁ డొసఁగెన్.

క॥ అతులిత భూషల నొసగెను, శతబలికి నమూల్యరత్న। జవనాశ్వములన్
దతపతి కేసరి కొసఁగెను, బ్రతిలేని సువస్తువులను। వారని కరుణన్.

ఆ॥ ద్వివిద తార నీల। గవయ జాంబవదాది, వీరవరులఁ బిలిచి। ప్రియములాడి
వలసినంత కనక। వస్తు వాహనముల, నిచ్చనిడి కటాక్ష। దృష్టిఁ జూచె.

తే॥ గుణ గణాంచిత ఖని వి। భీషణునిగాంచి, కలుషదూర! నీ సములు నీకంటె లేఁ
వనధి కిసుము సమంబగు। పట్టునందు, నేని నీకు సమానులు। గానరారు.

తే॥ అనుచు నిసురించి ప్రియమున। సమరులిచ్చు, కటకములు ఘ ద్రజాత్యనే। కవచయంబు
కనకచేలంబుల్ కాంభోజ। ఘనతురంగ, ములను కడు సుగంధ ద్రవ్య। ముల నొః

తే॥ శృంగిబేర పురీశు నా। రంగఁగాంచి, నీకుదెలుపంగ వలసిన। నియతు తెవ్వి
యనుచు శ్వేతాశ్వనికరముల్। కనక రథ చ, యంబు పీతాంబరము లిచ్చె। నిం

మ॥ హనుమ జ్జాంబవ దంగద ద్వివిద తా। రాది ప్లవంగేషులను
దినరాజాత్మజుఁ గాంచి వీడుఁడనుచుం। దెల్పం దలంపంగనై
సను కారానిదె యైన మీపురములను। నాణెంబుతో మేలు సం
తనగాఁ గాచుట నాకు ధర్మమగుఁ గా। నను వేడెదను గావుఁడీ.

మ॥ దనుజాధ్యక్షున కాదటన్ పెడలుచే । ధర్మంబుగాఁ దెల్పి మీ
మనముల్ దూరము కావ యంచుఁ బలుకన్ । మన్నించి దైతేయ కీ
శ నిషాదాధిపు లెంతయున్ విడువ ని । చ్చన్ లేనివారయ్యు రా
ముని వాక్యంబులు మస్తమందిడుటయే । ముఖ్యంబుగా నెంచుచున్.

తే॥ భరత లక్ష్మణ శత్రుఘ్న । ధరణిజాత, లను వసిష్ఠ ముగ్గురు తల్లు । లను గుణాఢి
రాము రాముని వలగొని । ప్రణుతిచేసి, సెలవుగొని మరలిరి తమ నెలవుసేర.

తే॥ గుహుని సృంగిబేరమ్మునఁ । గూర్మివిడచి, యగచరేంద్రుని కిష్కింధ యందువదలి
కర్బురులు పరివేష్టింప । గగనవీధి, దైత్యపాలుండు తనరాజ । ధానిఁచేరె.

సీ॥ మిత్రులఁ బంపి య । మ్మిహిర కులేశుండు, తక్క సుహృజ్జన । తతులతోడ
నీతిమంతుండై య । నీతిని సద్ధర్మ , హితుండయ్యు ధర్మంబు । నెత్తకుండ
వర్ణాశ్రమాచార । పరిపాలకుండయ్యుఁ, దల్లికూఁతుల నొక్క । తమిని చూచి
తమ్ములు తనకసు । దప్పులై వర్ధిల్ల, జనులు తండ్రి యటంచు । జనపుచూప

తే॥ క్షీర సాగరమందున । శేషతల్ప, మందు యోగనిద్రను వీడి । యవతరించి
చెడుగులంద్రోచి మేలు ర । క్షించు రామ, చంద్రుఁడేలె జగంబులు । చలుపనొంద.

మ॥ జగదారాధ్యుఁడు రాముఁడై పుడమిలో । జన్మించి దుష్టాత్ములన్
దగ ఖండించిన ధరాతలంబున లస । ద్ధర్మంబు నెక్కొల్పి పూ
జ్యగతిం బొల్చిన జానకీ విభుని స । చ్చారిత్రమున్ భక్తి యొం
దఁగఁ బల్కన్ వినినన్ సుఖించి యట మీఁ । దం గాంత్రు క్షైవల్యమున్.

మంగళ మహాశ్రీ

మంగళము రామునకు । మంగళము తమ్ములకు
మంగళము సంతతము । మైథిలికి వేడ్కన్
మంగళము మారుతికి । మంగళము భారతికి
మంగళము నీతికిని । మానమున కెప్డున్
మంగళము భక్తికిని । మంగళము ధాత్రికిని
మంగళము వీని విను । మాన్యులకుఁ బేర్మిన్
మంగళము పాడికిని । మంగళము ప్రేమకును
మంగళము మంగళము మంగళమహాశ్రీ.